# పీఠిక

శ్రీ పరమేశ్వరు కరుణామృతంబు । నా పాపసమితి యను ననలంబును
రూపుమాప నామోదంబు నన్ను । శ్రీపదం బబ్బునదిగఁ జెలఁగియు
ధ్యానంబు గొంటి పరతత్త్వమూర్తి । మానీంద్రపరం బైనట్టి మహా
జ్ఞానసంప్రదాయకుల సారంబ । దే నిమిత్తమున పెంపొనరునో యని
యా నిర్మలంబు నాకబ్బునో యని । పూనికను బెంచి శ్రీ సదాశివుని
మానసమున గీలించి నతి నొసఁగి । శ్రీనికేతనుని నతని కైక్యముగ
వే నుతించి భద్రమున వరమంది । యీ నవీన పద్ధతికి ననువుగా
గాన భాగవతమును వ్రాసినాడ । వే నతుల పండితులకుఁ జైచాపి
తాన శ్రీధరుడు మంగళము గూర్చ । నేను వినిపింతు నీ గ్రంథక్రమము
నానందము సజ్జన సమ్మతముగ । నే నందెద విజ్ఞులు దీవన లిడ
శ్రీమ దాంధ్రభాగవతము దాసుల । కామధేను వని యెంచి కీర్తింప
నేమమును గొనియు శ్రీ త్యాగరాజు । శ్రీ మహిళావిభు రామచంద్రుసద్
భావమందు నిల్పియును గీర్తనల । పావనత గాంచి తాను రచించియు
ఆవలను బాడి పాడించె పెరల । నా విమలచరితు మనమున నిలుపుచు
నే నట్లు భాగవతమును రచింతు । నా ననుచు శ్రీశుడుఁ మెచ్చునట్టి
దై నవీనపథకమున నందరికి । గాన భూషణముగా నంద మింపు
శ్రీ మహితగుణుడు పోతనామాత్యు । ధామనిధానం బైనట్టిదైన
శ్రీ మదాంధ్ర భాగవత పాత్రంబె । నా మనోవీధి వినినాటనుండి
ప్రేమ నంద బీజముగ నాటుకొని । యీ మహిత సమయమున భూజమయ్యె
మొలకఫల మిచ్చె నని యది యమృతపు । ఫలమనుచు భోజ్యమని దాని నటుల
విలసిలు ముదమున నది యారగించి । తెలివి కొంత నను జెంద శ్రీశివుని
ప్రసాద మనుచును మ్రొక్కి యీపనికి । సుసాధనమునకు యత్నమును గొనుచు
హాసాదు శివునకె యర్పించి కృష్ణుఁ । బ్రసన్నునిం గా వ్రాసితి నిట్టుల
వేడుదును నిత్యమును వ్రాయు సిరిని । జోడుగూర్చ శ్రీ పరతత్త్వమయుని
మూడైన మూర్తిభేదముల నొకడె । యీ డంది జ్ఞానులకుఁ దోచునట్టి
హరుని శంకరుని హరిని కరివిభుని । పరమేష్ఠిని వాణీశ్వరు నొకటిగ
సరసమందు కళనైన వరుసచే । తిరమతి సన్నుతిఁ జేసి వచించెద
శరధిజాధవా ! మాయావిదారి ! । కరుణింపుము నను నిను బొగడుచుందు
గిరిజాధిపతీ ! కిన్నరేశసఖ ! । పరిపూర్ణకృపాపరత నను గనుము
అనుచు నభేదము శివకేశవులకు । ఘనత దలంపున నతులు సల్లించి

వారి వారి చిత్తముల భక్తిచేఁ । గూరిచిరి శైలి కీర్తన లిచ్చల
జేరు పథంబుల గాన మొనర్చిరి । మేరగాఁ గొంటి నవి యెల్లఁ గాంచి
సంగీతశాస్త్రమునకు నుక్తముగ । నంగీకరించినట్టివిధంబున
భంగమును దోలి భాగవతమ్మను । శృంగారమంద కీర్తించితి నది
గానమున రాగ తాళ నృత్యముల । కే యిది రుచింప మన ముంచినాడ
నేను మొదల నది యందరికి హితము । గా నుండదేమొ పఠనమున కను ని
దానమంది యోచించ నొక్కవిధి । గా నందమింపుగా కీర్తనకును
దానినే పాఠకులకు సుఖముగా । వీనులకు నొక్క కాలావధిగా
ద్విపద రగడ భేదముల నొప్పు గన । నుపమగు పురాణఫక్కినిఁ జదువఁగ
నపుడు రెంటికిని జెక్కుగతులుగా । నెపు డేయనువునఁ బఠింపఁ గన్నను
సుపక్వఫలభేదముల పోల్కిగా । విపులంపు రుచికి సాధ్య మిది యనుచు
విపరీతమదిని గానక వ్రాసితి । చపలంబు గనక శోధింప దగును
చరణము ప్రతిదియు ప్రాసల నాల్గిట । వరుస లుంచితిని కీర్తనకు సొంపు
చరణంబు నాల్గుపాదముల నొప్పు । చరణపాదమున యతిని బాటింప
కరము యతిని బాటింపను ధాటిని । చిరముగా గూర్తు ప్రాసలె ముఖముగ
నాలుగుపాదము లొక్క చరణంబు । మే లొప్ప చరణమునకు నఱువదియు
నాలుగుమాత్రలు అం దర్ధచరణ । మోలి ముప్పదియు రెండుమాత్రలగు
రాగతాళముల భేదంబు లొందు । నీ గణింపు మాత్రలును నటులనే
భాగముల నందు పాదముల మాత్ర । గమనిక నే గణింపఁజెల్లును
గురు లఘువు లనెడు రెంటినే గణన । నరసి నిల్పుదును ప్రాస నియమమున
వరుస చెడనీను సాధ్యంబుకొలది । కరము ప్రథమకాలమున కీర్తనగు
తర మతిద్వితీయమైన భజన కగు । సరణి మూడవది తందానపదము
తరము గొనునెడల వేల ద్విమాత్రల । సరణి చొప్పడర నొక్క యావర్త
మరయు పదారగు మాత్రల పాదము । వరుస నాల్గుపాదమ్ములు నట్లనె
వినుడు చతురశ్ర త్రిపుటతాళంబు । ననుకూలవృత్తి చాల వెలయుటకు
ఘనులు తమ యిచ్ఛకాలమున తాళ । మును నావర్తము లెన్నొ గూర్చుకొన
విన సొంపు గులుకు గతికి లక్ష్యమిది । కని చెప్పినాడ కీర్తన తెలి గిడె
అరయ త్రిక గతులఁ గీర్తింపఁ దగియు । పరమ మోదంబె రాగము నందును
వర మతుల చిత్త మేరాగంబున । సరస మాధుర్య సంగతిని గనునొ
పరమావధి యా రాగంబున కగు । చరణంబు లటుల భావమునకు నను
సరణమై రాగయుక్తమై తాళ । భరితమై నృత్యమునకు హితంబై

నరుల కానందభజనమై యొప్పఁ ఽ బరమాహ్లాదము బరగించు నిజము
అరయుడు రసజ్ఞులైన మహనీయు ఽ లరసి భగవంతు కరుణ లోఁ గొనుడు
తరముగనుండు నే నిందుకొఱకు ఽ చరణమును లక్ష్యముగఁ బఠింతు నిదె
"శ్రీశ ! సద్భక్తపోష ! జగదీశ ! ఽ కేశవ ! దుర్మదనాశ ! పరమేశ !
రాశి నెగడు మా పాపసంతతిని ఽ నీచరణముచే మాపగంటి మిక "
యతిని బాటింప ననుటలోఁగూడ ఽ యతిని భూషగా భరమున గొంటిని
గతి దైవవశమునని బాగు దోప ఽ మతి కలవడినను వ్రాసితి నట్టుల
కొన్నిచరణములు నొకానొకయెడ ఽ చె న్నొందునట్టి దరియు నీసుమతి
గన్నట్టిదె యని కడకబో విడువ ఽ తె న్నటు దోచిన నదియు కాదనను
అట్టిచరణములు పట్టుగ నుండవు ఽ కట్టున నట్టివి మితముగా నుండు
మెట్టు పొరబాటు గాదని వచింతు ఽ గట్టి గన్నమతి దైవవశమె యుని
తెలివిఁ బదంబుల విరిచి పలికినను ఽ పలుకు లవియు వచనమును బోలియుండు
విలసన మిటుగా వ్రాసితి మొత్తము ఽ అలరునే నింపు రాగ మెటుగొన్న
తాళంపు గతుల కాలముల వళ్ళ ఽ మేలు బొందించుకొనుటకై యుండు
పొలింపు డివియు ప్రార్థనల పెద్ద ఽ లాలకించి మన్నింతురు హరిదయ
అష్టమస్కంధమున కూర్మరూపు ఽ హరి దాల్చుటయును నగు భాగంబున
ఇష్టమును గాంచి మిశ్రగతినిగా ఽ నేర్పడ బల్కినాడను భక్తిని
ఈచరణంబున అ హ లకుఁ బొందుగ ఽ రోచిని గూర్చితి యతిస్థానముగ
వాచంయమి వినుతు డిచ్చ గూర్చినది ఽ నోచితి వ్రాసితిఁ దానిం ద్రోయుకు
డిం దష్టయిష్టములు ప్రాసలగును ఽ పొం దమర వినికి ద్విపదగా బోలు
అందు నేబదియు నామమాత్రలను ఽ పొందు చరణమున నాల్గుపాదముల
ఆ విధిని మిశ్రి యేకతాళ మతి ఽ పావనంబైన నృసింహుచరితము
భావమున నింపుఁ గొనియు వ్రాసితిని ఽ దేవుడైన హరి వరాహరూపవు
చరిత నైదుమాత్రల యేకతాళ ఽ మరయు నానందకరముగా దోచి
సరళమతి నటులె వ్రాసితి నందుల ఽ వరుసల యతినిక నర్ధచరణమున
నిర వొందునట్లు గొన్నియుం గలవు ఽ పెరవైన స్కంధముల చరితలందు
అసమానశక్తి మతికి నచ్చినటు ఽ లసమంజసముగఁ బ్రాస విడనాడ
పసదనము నించుకేనియు వదలక ఽ పొసగ వాని నిచ్చలు వ్రాసినాడ
తిరమతిని గనుడు విద్వద్బృందము ఽ కరము సరిజూచి శ్రీవిష్ణుకరుణ
వరపతు మందుడయ్యు వందనాల్ ఽ వరమిచ్చు గ్రంథమునకు జయ మంద
నే మాడిరాజు లక్ష్మీనృసింహ ఽ నామమున బరగుచున్నాడ భువిని

ఈ మాననీయు గ్రంథము పెద్దల ఽ చే మానమంది పూజ్యం బయ్యెడు
శ్రీమదు పెద్దలచిత్తమున జేరి ఽ యాశాఫలమును నే భుజించుటకు
కేళవుండె తాఁ గూర్చి మోదించు ఽ రాశిగా నతని కర్పణము సేతు
రణు జొత్తు శ్రీవారిని పెద్దలను ఽ కరుణ బరగించి యాశీస్సు గూర్చి
రవు ధైర్యమున వారి నుతిని గాంచు ఽ చిరతరభాగ్యము నా కందింతురు
అందరికి నందు వారిని భజించిన ఽ తొందర లడంగుఁ దోవు సముద్రము
ందు శేఖరుడుతో డిచ్చు వారి ఽ మందమతిని బోఁదోలి భాగ్యముల
ాషాభిమాన ముజ్వలింపగా ఽ భాషామతల్లి కిని సేవఁ జేయ
ాషాపోషకుఁ దగు కాన్క నిడఁగ ఽ భాషాపోషణ గావింప నెంచి
ంధ్రదేశపదములఁ గూర్పఁదలఁచి ఽ యాంధ్రాముద్రిత పదసంగ్రహణము
ంధ్రజనావళి కమూల్యకరమని ఽ యాంధ్రకవిత్వం బుద్ధరింపంగ
ంధ్రభాషయం దుద్గ్రంథంబగు ఽ ఆంధ్రపోతన్న భాగవతమ్మును
ర్ణనీయమగు వేదాంతార్థము ఽ పూర్ణహృద్గోచరము సేయనెంచి
గార్ణ భావముల తేటతెల్లముగ ఽ వర్ణనాదులను సులభముగ జూప
ువజనవిద్యావ్యాప్తి కొఱకుగా ఽ నవని నక్షరాస్యతమ్మునకునై
విహారులగు బాలబాలికల ఽ భావసౌశీల్య భద్రమ్మునకై
వనవోన్నేమమును జొన్ప నెంచి ఽ నవీనవిద్యకు నుపకరింపగా
ంధ్రగ్రంథభండారమునకు ఽ నాంధ్రసోదరీ జ్ఞానమ్మునకై
ంధ్రగేయరూపమున వ్రాసితిని ఽ ఆంధ్రగేయభాగవతము నాగను
ంధ్రులెల్లరను గుణముల గ్రహించి ఽ యాంధ్రభాషాభిరతి గన వేడితి

శ్రీమం డాగమరత్నగర్భశీయుఁ ఽ జన్మార్తి యాద్యుండై యా
కంబు న్మదిఁజేరు హర్ష మున నే ఽ వేళంబుగా నంది సం
శం చింతకు వేరుగాఁ గనని ఽ యీ కల్యాణమా గ్రంథముఁ
సండే ఫలదాత యౌ ననుచునే ఽ నిష్టంబుతో నిచ్చెదన్.

డు తూ రు,
16—10—52.

మాదిరాజు లక్ష్మీనరసయ్య,
గ్రంథకర్త.



# పండితాభిప్రాయములు

మహోపాధ్యాయ కళాప్రపూర్ణ
డాక్టరు చిలుకూరి నారాయణరావుగారు
ఎమ్. ఎ. పి. హెచ్. డి. ఎల్. టి.

అనంతపురము
13—9—1949

మహారాజశ్రీ మాదిరాజు లక్ష్మీనరసయ్యగారు రచించిన "గేయభాగవతము" అను గ్రంథమును భాగవతకవులయిన వారి నోటినుండి కర్ణపేయముగా విని ఆనందించినాను. కృష్ణకథ నెవ్వ రెన్ని గతుల రచించినను దాని మాహాత్మ్యమును, వన్నెయు ఎక్కువ శోభనే పొందుచుండును. అందు దానిని గేయరూపమున సంతరించిన యెడల పండిత పామర స్త్రీపురుష హృదయంగమమై లోకమున సానందమును వెల్లివిరియింపఁ గలదు. కవిగారు చక్కని ఆంధ్రభాషా పాండిత్యము గలవారు. వారు తమ గేయముల మూలముగా భగవద్భక్తాగ్రేసరుడగు బమ్మెరపోతనామాత్యుని అమరకావ్యమైన భాగవతమును పేటబంతిగా నుంచుకొని భాషాసాంప్రదాయ విషయమున దానినే అనుసరించుచు భాగవత మహాపురాణమునకు గేయరూపములో ననేక గతులను కల్పించి అతిమనోహరముగా సంతరించి కృతకృత్యులైనారని చెప్పుటకు నాకెట్టి సందేహము లేదు.

ఈ మహాసద్గ్రంథ మచిరకాలములో లోక కల్యాణ తత్పరులైన అపారదాతల సాహాయ్యముచే నచిరకాలమున ముద్రితమై ఆంధ్రసరస్వతి కొక నూతనాలంకారముగా ప్రకాశించునుగాక అని కోరుచున్నాను. కవిగారీ గేయములను ప్రచారములో పెట్టి శిష్యప్రశిష్యుల మూలమున లోకములో వ్యాపింపజేసిన యెడల నీ మహాగ్రంథమునకు అధ్యాత్మరామాయణ కీర్తన గ్రంథమునకువలె తమ గ్రంథమునకును చిరకాల కీర్తిని గడింప గలరని విశ్వసించుచున్నాను.

(Sd.) చిలుకూరి నారాయణరావు వ్రాలు.

శ్రీ మాదిరాజు లక్ష్మీనృసింహయ్యగారు శ్రీ బమ్మెర పోతనామాత్యునిచే విరచితమగు ఆంధ్ర భాగవతమును మూలము ననుసరించి కొన్ని స్కంధములను సంగీతపాఠకులకు ఉపయోగించెడి రీతిగను, పద్యరూపముగను రచించి యున్నారు. వీరి కవితాధోరణి కేవలము ప్రశంసనీయము. వీరు తమ గ్రంథమును పండితపరిష్కృతికై యొసగియున్నారు. యథాశాస్త్రముగ పండిత పరిష్కారము నంది ముద్రించుటకు అర్హమై యున్నది. ఇక్కాలమున ఏతత్కార్యనిర్వహణమునకు ధన మవసరము గాన భాషాభిమానులు యథాశక్తి వీరికి తోడుపడుట అవసరమని సవినయముగ విన్నవించెద.

ఇట్లు,
(Sd.) కృష్ణశాస్త్రి.
కర్నూలుజిల్లా ఆత్మకూరు బోర్డుహైస్కూలు ప్రధానాంధ్ర పండితులు.

శ్రీ కొల్లాపురము సంస్థానపండితులు వనం సీతారామశాస్త్రిగారు, మ. రా. రా. శ్రీ కర్నూలుజిల్లా నందికొట్కూరు తాలూకా మిడుతూరు గ్రామవాసియగు మాదిరాజు లక్ష్మీనరసయ్య యను వారు పోతనామాత్య విరచిత పద్యరూపాంధ్ర భాగవతమును ద్విపద, రగడ, లక్షణయుతముగ హరికథ భజనాదులకును గేయోపయోగముగ గూడా తాము రచించిన యీ గ్రంథమును స్థాలీపులాక న్యాయముగ కొన్ని భాగములు వినిపించిరి. ఇట్టి గ్రంథరచనాశైలి వీరి జన్మాంతర పుణ్యకర్మ

యత్తమగుటచే ఆంధ్రవాఙ్మయ మాధురీధురీణులకు మిక్కిలి శ్లాఘాపాత్రమగుట పునరుక్తము. ఇట్టి గ్రంథకర్త శ్రమను గమనించి దయామహనీయులగు నాంధ్రభాషాభిమానులు ఇవ్విధమగు గ్రంథ ప్రకాశమునకు సర్వవిధంబుల సహకారమొసగుదురని యాశించుచున్నాను.

ఇట్లు
(Sd) వనం: సీతారామశాస్త్రి.

వ్యయ పుష్య బహుళ పంచమీలు. ఆయ్యవారిపల్లె.

ఆంధ్రమహాశయులారా!

కర్నూలుజిల్లా నందికొట్కూరు తాలూకా మిడుతూరు గ్రామము కాపురస్థులైన శ్రీ మాదిరాజు లక్ష్మీనరసయ్యగారు శ్రీ పోతనామాత్యుని భాగవతపద్యముల ననుసరించి కీర్తనల మాలముగా రచియించిన గ్రంథములో కొంత వారు స్వయముగా చదివి వినిపించిరి. అవి అతిమనోహరముగా నున్నవి. మూలము ననుసరించి మృదుపదములతో రసమును కొపాడుచు అర్థపుష్టి గలిగి విరాజిల్లు చున్నవి. వారి కీర్తనలను నేను విని పరమసంతోషభరితుండనైతిని. వీరు సంపూర్ణ భాగవతమును కీర్తనల మూలముగా వ్రాయఁ బ్రయత్నించుచున్నారు. ఈ కార్యము మిక్కిలి ప్రయోజనకరమనియు, సంగీతజ్ఞానము గలవారికిఁ బరమానందకరమనియు, ఆంధ్రులందఱకును మిగుల నుపయోగకరమనియు వేఱుగ వక్కాణించుటనవసరము. ఇంతటి ఘనకార్యమును వీరు పూనుకొనుట యెంతయును శ్లాఘాపాత్రమైనది. ఆంధ్రులెల్లరును వీరు పడు ప్రయాసను గమనించి వీరి గ్రంథము నుచితరీతిని ఆదరింతురని నమ్ముచున్నాను.

ఇట్లు, విన్నవించు బుధ జన విధేయుఁడు,
విద్వాన్ నిమ్మరాజు కృష్ణరావు,
తాలూకా హెడ్ యక్కౌంటెంటు.
నందికొట్కూరు. ది 22—4—

శ్రీ మాదిరాజు లక్ష్మీనృసింహయ్యగారు రచించిన "గాన భాగవతము" నేఁడు స్థాలీపులాక న్యాయమున మే మెల్లరము కర్ణానందముగ వింటిమి. ఇట్టి భాగ్యము మా కబ్బఁజేసినందులకు కవిగారికి మే మెంతయుఁ గృతజ్ఞులము. ఛందోగతుల ననుసరించి వీరి కవిత్వము పీ రేర్పఱచుకొన్న నియమముల మేరకు కుంటుపడక, సరసమును, సరళమునై, హృదయ గ్రాహిణి యగు ననుటలో సందేహము లేదు.

ఇట్టి వీరి గ్రంథ మచిరకాలమున పండిత పరిష్కృతమై యచ్చుపడ నున్నది.

భగవానుఁడే తద్గ్రంథరాజము నాంధ్రావనిఁ గల భక్తావతంసుల కెల్లరకు గానయోగ్యం బగు నటుల ముద్రణాది సౌకర్యములనంద ననుగ్రహించుగావుత మని యస్మదాదుల యాశయము.

ఇట్లు, విద్వద్విధేయులు:
నందికొట్కూరు గాంధీ స్మారకోన్నత పాఠశాలోపాధ్యాయులు.

(Sd) పల్లె రఘునాథాచార్యులు యం. ఎ. ఎల్. టి.

(Sd) నిధనపాటి కరణం వెంకటరావు బి. ఎ. ఎల్. టి.

(Sd) మేడూరు దీక్షితుల వేంకటసుబ్బయ్య బి. ఎ. ఎల్. టి. విద్వాన్

(Sd) ప్రతాపగిరి కృష్ణమూర్తిశాస్త్రి, విద్వాను
(Sd) మద్దిగట్ల సుబ్బారెడ్డి, విద్వాను
(Sd) గొట్టుముక్కుల నీలకంఠశర్మ, విద్వాను
(Sd) పోలూరు రామకోటీశ్వరరావు బి. ఎ. (ప్రభృతులు)

మహారాజశ్రీ శ్రీయుతులు కర్నూలుజిల్లా నందికొట్కూరు తాలూకా మిడుతూరు మాదిరాజు లక్ష్మీనర్సయ్య అను కవివరులు తమచే రచింపబడిన పోతనామాత్యకృత ఆంధ్రభాగవతమునకు ప్రకృత కాల మనుసరించి రమ్యముగా వినువారల వీనులకు విందుగా కనుపట్టు కొన్ని గేయములను వినిపించిరి. వీరి కవిత్వము కొన్ని స్థలముల యందు నారికేళపాకమున వసుచరిత్రాది గ్రంథము లనుసరించుచు మఱి కొన్ని స్థలంబుల ద్రాక్షాపాకమున బడి విజయ విలాసాది గ్రంథముల ననుసరించుచు ఆంధ్రసంస్కృత భాషాయోషలు ఒక స్థలమున నాట్యముచేయుచున్న కవికర్ణ రసాయన గ్రంథముపగిది ప్రకాశించుచు మిగుల రమణీయముగ నున్నది. కవికి ధనపస లేకున్నను కవిత్వధనపస బాగుగా నున్నది. ఈ కాలమున బృహద్గ్రంథములను చూచువారలే అరుదు. అట్టి గ్రంథములను గేయరూపములుగా రచించుట మిగుల శ్రమ యనియే తెలుపవలయును. కథ భగవత్సంబంధమైనది. కనుక యేది యెటులున్నను సర్వ జనులకు శ్రవణార్హముగా నున్నదని నే చెప్ప నవసర ముండదు. కవికూడ “తే ప్రతిప్రసవ హేయాః సూక్ష్మాః” (సత్సంస్కారములచే దుష్టసంస్కారముల తొలగించుట) అను ఉపనిషద్వాక్యముల ననుసరించుచు ఈ మహాప్రయత్నమున కుద్యుక్తుడై యుండునని తలతును.

ఇట్లు,

మంచాలకట్ట,
12—1—49.

(Sd.) దోనిప్పూరి పాపయ్యశాస్త్రి,
జటప్రోలు సంస్థానము.

కర్నూలు జిల్లా నందికొట్కూరు తాలూకా మిడుతూరు పురనివాసి యగు మహారాజశ్రీ మాదిరాజు గారి లక్ష్మీనరసయ్య యను వారు పూర్వము సంస్కృతభాగవతమును కవితాపితామహు డగు పోతనామాత్యుడు తెనుగున రచించిన వాడయ్యె. అది మొదలు లోకమున సుప్రసిద్ధముగా నది యుండె. ఇప్పు డాతెనుగు పద్యరూపమున నున్న దానిని ద్విపద రగడ, హరికథ, భజన, మొదలుగాగల తాళలక్షణయుతముగ రచించి వినిపించగా కొన్నిభాగములను వినగా మృదుమధురపదఘటిత సంస్కృతాంధ్రమిళిత నారికేళ ద్రాక్షాపాక మిశ్రమంబై రసగుంభితంబై అర్థభావగూఢంబై యతిశ్రావ్యంబుగ నున్న యీ గ్రంథము విస్తారంబుగ లక్ష్య లక్షణోపేతంబుగ నున్నది. కాన విజ్ఞులైనవారు దీనిని నాదరింతురని విన్నపము.

ఇట్లు,

(Sd.) విరివింటి అనంతరామయ్య,
ఎఱ్ఱమఠము.

వ్యయనామ సం॥ర మాఘ శు 3 లు.]



శ్రీమ దాంధ్రి గేయ మహాభాగవత దశమస్కంధ ముద్రిణద్రవ్యదాతయగు
శ్రీ పాములపాడు ఆళ్లగడ్డ నాగేశ్వరరావుగారి

# వంశాభివర్ణనము

శ్రీనివాసుఁడును సిరులన్ని గూర్చ § వనమాలాధరుఁడైన విష్ణుండు
మానితంబైన దశమస్కంధము § గానభాగవత మందలిది దీని
వే నవీనవిధి వెలయింపఁగన్న § దానప్రవరుని బోంచు నెల్లపుడు
విన నాళ్ళగడ్డ వంశపువారన § జనవినుతుండు కౌండిన్యగోత్రజుఁడు
ఘనుఁడు వినయగుణ ధనుఁడు రామయ్య § యనువాఁడు రామభక్తుఁ డితఁ డనఁగ
నొప్పెడు నతనికి యువతి యక్కమ్మ § ఒప్పు లలితగుణ సుందరగాత్రియు
నొప్పుల కుప్పయు నాఁబరగు వనిత § మెప్పుగ పతినిఁ సేవించునదియు
ఆదంపతులకు సుతుఁడు లింగయ్య § మేదినిలో శివుఁ డిటఁ బుట్టె ననఁగ
మోద మిచ్చు నర్థులకు శివముగా § సాదరంబునను సకియ లింగమును
తోడుగాఁ గొనుచుఁ వారల పుత్రుఁడు § నింపుకొన్న గుణ శేఖరుఁడు తండ్రి
నిఁ డాయు యశమె తా నందుకొనియు § వేడుక లొసఁగెడు వెలఁది నాగమ్మ
యను పూబోణిని పత్నిగాఁ బడసి § యెనయ శాంతమతి శేషునిఁ బోలుఁ
ననఘుఁడు శేషయ యతని కొమరుఁ డా § ఘనుఁడు హరిదయను బొడమి పెద్దలను
గని జ్ఞానకలిమి నంది నమ్రతను § పెను మర్యాదల నర్థులను గూర్చ
నలరు గలవాఁడు ఎల్లమరాజన § చలువజేని కాంతిని బోలుకీర్తి
వలచి తనునేల నొప్పెడు నాతఁడు § వెలయు కొమరుఁడై వర్ధనము నందె
అల శేషయ్యకు వారిపితృలకును § వెలలేని సుగతు లందించు నతఁడు
వెలదిఁగఁ గైకొనె మలరాజసుతను § దలఁపుచుండు వేంకటసుబ్బమ్మను
ధరణిని శ్రీమిడుతూరు నా వెలయు § పురమున ఖ్యాతినిఁ గొనినవాఁడు నగు
వతమతియు దాసుగారి శేషయ్య § వరపుత్రి యామె సంతున నగ్రజ
కనిష్ఠ యగు వేంకటలక్ష్మమ్మను § వినయశీలనుఁ బ్రేమఁ జూచునది
కని రా దంపతు లీదాతమైన § ఘను నాగేశ్వరరావును సద్గుణుఁ
దనయునిఁగా మఱి మీనాక్షమ్మను § దనయ సుశీలను హరుసుతిపాలను
పవనిత తనకు నిల్లాలు గాఁ § భావశుద్ధి తొలిపూజలు సల్పెనా

యీ వనితమైన వేంకటలక్ష్మమ § సేవరింపఁ గొనె తనప్రియము వెలయ
తొలి సుకృతకల్మి విభవయుక్తులయి § కలిమియు సంతును గల్గి యెప్పుడును
తులఁదూగు చుంద్రుహర్షముల వారు § విలసిలఁ గాంచిరి సత్సంతానము
నాగభూషణారా వనువానిని § భోగిభూషణుని కళ గలవానిని
త్యాగమందు నికముందు తాతవలె § రాగము నొందఁగ ఎల్లమరాజును
భోగిశయను నామమును దలంపునఁ § దూగ వేణుగోపాలరావునుఁ
యోగమట్లు శివశంకరరావును § నాగ సుపుత్రులు మరియుఁ బుత్రికలు
ఆ నయగుణమతులకుఁ దగినట్లుగ § మానసీయ మోదమ్ము బెంపొంద
నైన లీల చెలువారఁగ నొప్పెడు § నా నగేంద్రసుతకరుణను బొడమిన
సరస్వతమ్మయు సుబ్బరత్నమ్మ § ఆరయ వీ ర్గురు సుగుణమతులు
సరసుఁడైన యీ దాత పిన్నమ్మ § యురు వివేకి వేంకటలక్ష్మమ్మకు
హారుకరుణను ఫణిభూషణరావను § వరసుతుఁడు వంశదీపకుఁడు బుట్టె
వితతఖ్యాతిఁ గన నాగేశ్వరరా § వతఁడు నాకోర్కె వితథ మొనర్పక
వితథ మఘుజాల మందే గూర్పుగ § మతి వికసింపున నావలనుఁ గాంచి
సతతప్రీతిఁ జెన్నార గానంపు § గతిమెప్పఁ గనెడు శ్రీభాగవతము
దశమస్కంధము ముద్రింప ధనము § వశ పడుతు ననియె వాగ్ధారమాత్ర
వశమున ముదంబు సని వృద్ధి నంద § దశదిశల యశము వెస వెలయ సుజన
వశపరంపరలు మెచ్చఁ జెల్లించు § వశమం దిత్తరి యాశీస్సులందు
యతిజన సన్నుతుఁ డాదిపురుషుండు § నతజనావనుఁడు నారాయణుండు
పతితపావనుఁడు భద్రగుణాఢ్యుఁడు § సతత మీవంశజులఁ బ్రోచు దయను
బంగారుచేల మంగమున దాల్చి § శృంగారమొల్ల శ్రీసంగతిఁ గన
రంగైనమూర్తి రజితగిరీశుని § సంగడినిఁ బొంది సకలశుభమ్ముల
నొసఁగెడు నతనికిఁ బ్రమోద యుతుఁడుగ § నసమాన యశము నాచంద్రార్కము
పసిడితామరను బొడ్డుగ నలరెడు § వసుదేవసుతుని కృపయె నిలుపుమతి
గోవిందా జై - గోపాలా జై - గోపాలా జై - గోవిందా జై ... ... ...

# శ్రీమ దాంధ్రి గేయ మహాభాగవత ఏకాదశస్కంధ ముద్రిణ ద్రవ్యదాతలగు
## శ్రీ గడివేముల నాగరత్నమయ్యగారి
## వంశావళి

శ్రీ కంఠుని స్మరణమున పవిత్రిత । నాకర్షము నందిన చిత్తవృత్తి
మోకరిలుట తా నీశ్వరార్చనయు । నా కడిమిన శ్రీకమలానాధుని
విభూతిముక్తియుఁ దనవంశదీప్తి । స్వభావమునఁ దా రుచింపుఁ గూర్చిన
విభాసితోజ్వల సిద్ధపూరుషుల । సభక్తి నిష్ఠను వాటించు సుమతి
గడివేముల వంశాబ్ధిని రంజిలు । వడి గూర్చునట్టి సుగుణసోముండును
కడలి తొల్లింటి నిలయముఁ గల్గిన । జడదారి వినుతుఁడగు హరికిఁ బ్రీతి
దనరు చర్యలను దాను వలపందు । ఘనుఁడు నాగరత్నమయ్య నాతఁడు
వనజనాభు చరితముల విశేషము । మునివైన వ్యాసువాగ్విభూతిఁ గని
ఘనుఁడైన శుకుని వలన నభిమన్యు । తనయుఁడు మోదముననుఁ దాను వినఁగ
సకలవిధములై నెగడు తాపముల । ప్రకరములు దొరలి దా ముక్తి గన్న
సుకవీంద్రవందితములైన యట్టి । యకలంకపూజ్యమైన భాగవత
మున నేకాదశస్కంధముద్రణకు । ధనము నేఁ గోరఁగా నిత్తు ననుచు
జనవినుతమతిని వచించి మెప్పునఁ । దన వంశావళి నా కప్పగించె
మునిజనావనుఁడు ముకుందుఁ డలరఁగ । వినఁగ వివరింతు నాతనివంశపు
మును మున నాతని పితృపితామహుల । విన నిట్టి సుగుణ మూలకదంబము
తొలుత విఖ్యాతచరితుఁడు వివేక । మలవడిన నీతిపరుఁడగు శేషా
చలమయ్య నాముఁ డతనియింతి గుణ । ముల నిక్కఁ గన్న యిల్లాలు పేరు
విలసితము నందె లక్ష్మమ్మ యనఁగ । నల దంపతు లత్యుత్తమశీలుఁడు
తనయుఁడయ్యె రంగయ్యయు నా ఘను । డనఘఁబరహితముఁగూర్చు నడవడిక
ననుపొందు నతనిభార్య సూరమ్మ । తన సేతవెల్లఁ బతికి హితమగుచు
జనభూషితములు గా నర్ధిజనుల । కనురాగపరము లయి విన విందులు
వనజాక్షు కీర్తనమున వరమంది । యును గనిరి సుతులఁ గీర్తివిశేషుల
ఘనుల సంపన్నమతుల ధీరులను । మనుజుల పొగడికలను సుజనవరుల
నాగను ఖ్యాతిని గను నార్వు రందు । రాగము గజవరదునియం దొప్పిన
త్యాగవరిష్ఠుఁడు నగు సుబ్బరావు । భోగిశయను దయ తనుఁ జేరునతఁడు
క్రమమున శ్రీరాముని దనమదిలోఁ । నమస్కృతిని నిడు శ్రీరాములయ్య
విమలచిత్తుండు నాగరత్నమయు । కుమతులఁ దెగడెడి నారాయణరా

వును నసమానుండన ధీరచరిత్రుఁ § డనఁ దనగునట్టి యీశ్వరయ్యయును
గనఁగ శాంతమున నటు ప్రభాసితుఁడు § హనుమంతరావు నా నభిధలందు
వారల తృతీయుఁ డగు నీ సజ్జన § వార మొగి సన్నుతింప నర్హంపు
మేరఁ జెలువారు గానభాగవత § చారుతరప్రకాశమునకుఁ దోడ్పడె
నతని నివాసమునగు మార్వకొండ § సతత మట కీర్తి నెగడుచు ముదితుఁడు
అతఁడు తొలుత వేంకటసుబ్బమ్మను § సతిగా వరించె నామె దైవగతి
యతివినుతలోకమును గూర్చి చేరె § పతిహితవున విజ్ఞానవిచారత
గనిన దామె తన పితృపరమాస్తినిఁ § బతికి నర్పించె సంతతి వర్ధిల
ఘనుఁ డాతఁడు తలపుంచి నీప్రస § క్తిని మాట యిచ్చె నాతలఁపు నూటి
వనమాలికరుణ వంశాభివృద్ధిఁ § గనుచున్నవాఁడు రెండవపత్నిని
సుచరిత్రయైన సరస్వతమ్మను § విచక్షణపుమతి పతిసేవ నంది
రుచినందు విమలతను శీలమ్మన § నచలితపుభక్తి గౌరినిఁ గొల్చును
ఆ మిథున మిటుల గారవం బందు § సామచర్య గల ప్రఖ్యాతురులుఁగ
సోమకళాధరు ననుగ్రహంబున § నామహితగుణులు సంతును గాంచిరి
తనయులు నల్వురు తనయ లిర్వురును § జననము నందిరి యిప్పటిమేరను
వినదగు వారల నామము లిందున § నొనరందు వరుస వేంకటసుబ్బమ
యును రామసుబ్బమయు సూరమ్మయు § నన నాగసరోజమ్మయు నాగను
దనయులు వేంకటసుబ్బారావును § కనఁగ రామచంద్రరావు నాగను
అనయ మాచంద్రతారార్కముగను § అనఘుల కల్పకమైన విష్ణుండు
తన దయారసము పూర్ణంబు నంద § గను బ్రోచుగాత పారంపర్యము

## శ్రీ మండ్లెము కేశవయ్యగారి
## వంశావళి

శ్రీ శంకరుండు చిద్విలాసుండు § కేశవసఖుండు విభూతు లొసఁగెడు
రాశి గొన్న పుణ్యుండు కేశవయ్య § పేశలం బయిన మానసస్థితుఁడు
పడకండ్లవంశజలధిసోముండు § ఎడతెగని భజన శ్రీశుండు మెచ్చ
నుడువుల జపంబు ననువుఁ గని యుండు § చెడుపును దరిమిన గుణమండనుండు
తలపు నుతికెక్క చరిత గల యతఁడు § ఇలను భవము ధన్యముగాగ నొప్పె
వల రందు గానభాగవతమందు § తిలకింప రుద్రసంఖ్య స్కంధమున

దను సేవ మెప్పగను గూడి నాకు § మనమునకు దృఢ గన వాక్శుద్ధత
విదిత మొనర్తును వీరివంశంబు § సదయాపరతను హారి నన్ను జేర
మొదటిపురుషుండు చెంచయ నాముండు § బ్రదుకునకుఁ బెరల వేడు దశలేని
సుదయాన్వితుండు సాధువినుతుండు § మోదపూర్ణుఁడును నిల ప్రసిద్ధుండు
ఆయనకు భార్య వెంకమ్మ యనఁగ § న్యాయ మెఱింగిన సుగుణవధూటియె
ఆయనకు బుట్టె కేశవయ్య నా § నాయుమేశభక్తునకు కోనమ్మ
నా యువతి భార్య పుత్రుఁడు చెంచయ § ఆ యుదారరతునకు సతి శేషమ
ఆ యుద్దిగొన్న దంపతుల సుతుఁడె § ఈ యనఘచరితుఁ డైన కేశవయ
వితతసుగుణవతి నాగమాంబయును § యతివ సతి యతని కగును చెంచయ్య
సుతుఁడు మేటిగుణచరితుం డాతని § సతియగు నరసమ్మను నా యువిదయు
పతిభక్తి గలది యతిథిసమార్చన § నతులితశ్రద్ధను విభునిఁగూర్చునది
ఈదంపతులకుఁ బొడమె తనయుండు § మేదిని వర్ధిలు ముందుపెద్దలను
గాదిలిఁ గూర్చిన చిత్తవృత్తులను § పాదంది భద్రమును నావరింపు
గను నా సుబ్రహ్మణ్యేశ్వరయ్య § పినవాఁడు వయసునను బుద్ధి పెద్ద
అనయ మీవంశజనితులఁ బ్రోచును § వనమాలి తన్ను పూజించుటలను

## శ్రీమ దాంధ్ర గేయ మహాభాగవత ముద్రణ ద్రవ్య దాతలగు

## శ్రీ సూరపు రాజుగారి వీరయ్యగారి

# వంశాభివర్ణనము.

శ్రీరామాపతి యైన శ్రీహరియు § నీరేజనయను డిద్ధరాభార
పారమ్మును దన కొమ్మునం దాల్చి § వైరానుగతుల కొమ్మ రూపణఁగ
నమ్మిన దిక్పాలాది యమరులకు § నెమ్మదిఁ గూర్చిన దేవుండు శ్రీల
నిమ్ముల గ్రమ్మగ సాక్షాత్కరించి § సమ్మతిని గూర్చు సద్గుణగరిష్ఠుఁ
డైనట్టి పుణ్యసంగాతిశయుఁడు § మానధనుఁడు సూరపురాజుగారు
నానుతినిఁ గన్న వంశభూషణుఁడు § జ్ఞానంపుబాట నందెడు విధమ్ము
గా నందము గొను ధన్యుఁడు వీరయ § తా నిజంపు తేజమున కుమతులగు
వారి యాటోప మణఁపు వరమతియు § దానపరత్వము దయ శాంతి సత్య
మారయు చింతను విడని వివేకియు § ధీరుఁడు హితబాంధవుఁడు ప్రియతముఁడు
నారదముని జనకుఁ డగు నతనిజనకుఁ § డారాధనీయుఁ డగు వారి నిజ మని
తన మది నమ్మినవాఁడు పవిత్రుఁడు § మును పుణ్యకల్మి నాధారంబుగఁ

దనకు ధవునిఁగా గౌరిఁ బూజించి § వినుతిఫలమ్మున నామెదయు పేర్మిఁ
గనిన శీలవతి నాగలక్ష్మమ్మ § యను నాఖ్య వడసి పతియుఁ దనుమెచ్చ
ఘన దయామతియు వినయంపు భక్తి § నెనయఁ జరమేశ్వరుని యతని సతిని
మనమున స్మరించి యర్థిజనార్తిఘ్న § లను రాగ మొప్పఁ గరుణ వికసింపఁ
గను నా వెలఁదినిఁ బత్నిగాఁ బడసి § ఘనమైనముదము గడియు వీరయ్య
వనజనేత్రుఁ డానందింపును గౌనఁ § గనె నీస్కంధము నచ్చొత్తింపఁగ
దనకుఁ గుతుక మందించు భాగవత § మునను యష్టమము నాఁ నొప్పనదియు
వినిన మాత్రమున మానపరిమితిని § దనుజారి రమ్యధామము మనముగ
ననువుఁ జెప్పినను మోదమున గూర్చి § ఘనతఁగాను యత్నము నేటువరచె
నతఁడును శుక్లయజుర్వేదశాఖ § నతికిన విప్రుల వంశ శేఖరుఁడె
వితత మొనరింతు నతని పూర్వులను § వెతలేని గతిని వారంద రుండ
ధీరుఁడు వీరమరాజను పుణ్యుఁడు § శ్రీరమేశు భక్తుండు సునయుండు
సారాచారుఁడు శాంతచిత్తుండు § మేరలఁ దప్పఁడు సత్కార్యసరణి
నారసి వరించె నాసుగుణఖనిని § సారసాక్షి సచ్చారిత్రి తరుణి
తిలకమామె యంబమ్మ భార్యగాఁ § దలఁపున మెలఁగెడు చందమును గాంచ
నల రమాకాంతవలె దీప్తిఁగాంచు § నలరుగను తోడు పతి ననుసరించు
వారల సుతుండు పురుషోత్తమయ్య § కూర్మిమతిఁ దెగడు నిష్కపటాత్ముఁడు
నారీమతల్లి శేషమ్మయునా § ధీర యాతనికిఁ బత్నియై సిద్ధ
ఫలము తమవంశమును వెలయింపఁగ § నిలను శాశ్వతపు యశము నార్జింప
లలిత హృదయ నీ లావణ్యచరిత § నలరున దనయునిగా నోచి కనియె
నీ యుత్కృష్టుని సుతలు మువ్వురా § నేయము న్యాయము సంగతులఁ బోల్ప
ఛాయల మువ్వుర మూర్తుల కాంతల § నాయమ్మలు కళలనుఁ జెన్ను గండ్రు
వారలు వేంకటశేషమ్మ మరియుఁ § గూరిమి పెంపును గనెడు శేషమ్మ
వీరికి సోదరి కృష్ణవేణమ్మ § వీరు సౌభాగ్యరేఖలను గుదురు
గాంచి పెంపుఁ గనుచుండఁ దౌలిపుత్రి § మించు వైభవశ్రీ తన్నుఁ బొంద
నంచిత సుగుణ విభూష శేషయ్య § నంచితప్రాప్తి వరించె విభునిగ
ఆ వరమిథునము సంతానమిట్లు § పావనముగూర్చు పితృలుమోదింప
ఆ వీరయ్యకుఁ గుతుకాభివృద్ధి § తావలం బంద బుధులు హర్షింప
వేంకటేశ్వరులు పురుషోత్తమరా § వింకనుఁ నాగభూషణరావను
పొంక మిట్లందు తనయులు ముప్వురు § పంకజమృదుల కళాంశలు తనయులు
వినఁగ హైమవతి భారతమ్మ నా § దనరు వారుగా రెండవపుత్రిక

కొండ రాచూరి నేమము నోముట ఽ నండఁ గాంచె నన దండిబుద్ధిచే
మెండు దోపించు వేంకటనరసయ ఽ నండఁగొనెను నింతియును దానయ్యేఁ
దనయుని మోహనరావను వానిని ఽ గనియెను దృతీయపుత్త్రికను భర్త
వినయగుణుఁడైన గేమరాజకుల ఽ జనితుఁడు వేంకటసుబ్బారావా
కనె నామెసుతను సువర్చలమ్మను ఽ ఘనుఁడా వీరయ నాము సంత తిది
వీరి నందరినిఁ దనకృపఁ బ్రోచును ఽ మేర మోహనము గూర్ప రమేశుఁడు
చారు మనోహర శౌర్యచరితుండు ఽ నారదవంద్యుఁడు నారాయణుండు.

## శ్రీ మానవపాటి సుబ్బారావుగారి

# వంశావళి

శ్రీనాథుఁడు కరుణాసముద్రుఁడును ఽ మానవపాటిని వసించుచుండిన
మానవోత్తముఁడునై నందవరము ఽ నానందమించు పురచౌడేశ్వరి
మానిత నర్చనలను నేమారక ఽ జ్ఞానంపు వృద్ధిఁ దనరారు నంద
వరీకులును నా ద్విజుల నుత్తముఁడు ఽ విరాగచిత్తుఁడు విష్ణుభక్తుండు
నిరాదరణఁదరి మతినిఁ బోసీని ఽ పరామర్శిక పెద్దలను గనువాఁడు
ధీరోదాత్తుఁడు పెదసుబ్బరావు ఽ సారగుణభూషణుఁడు నయ్యూ ధరణి
పే రందినట్టి యోబుళంపల్లె ఽ నా రహింగ నెడి వంశజనితుండు
పట్టువిడఁడు హరిభజింపుటలు విన ఽ నెట్టునగు సుకృతముల ఫలము లంది
పెట్టు నర్థులకుఁ గోర్కెలం దనియ ఽ గట్టునా దనరు పసిడి దది కవుల
కట్టివాఁడునగు ధర్మరతుండును ఽ కట్టలుకఁ గనఁడు శత్రులనైనను
దిట్టఁ బోఁడెవరి శిష్టపు నడవడి ఽ మట్టవునడకనుఁ గట్టుగా నిలుపు
గుట్టిడండు తనవైన తప్పులను ఽ రట్టుబెట్టండు పరులలోపముల
పట్టంపురాణి నాగలక్ష్మమ్మ ఽ చెట్టఁ బట్టంగ నలరు జూపట్ట
వెలుగొందు నతఁడు తిలకించె నన్ను ఽ లలిక్షేమ మడిగి యత్నమును దెలిసి
చెలువు పెంపెక్క గానభాగవత ఽ మల శృతిమెట్టుల మోదపూర్ణతను
వినెను సప్తమస్కంధభాగమును ఽ ధన మిమ్మంటిని దానిముద్రణకు
వినిపించె నాదు కోర్కెసుజ్ఞాన ఽ మున పాండిత్యపు కవితాధురీణుఁ
డును శతావధానమున విఖ్యాతి ఽ గను రామకృష్ణ శతావధానుల
ఘనంపు సన్నిధికిని నను దోడ్కొను ఽ చును నతిఁజేసియు నన్నెదుకపరుప
నేను వినయమున సన్నుతి నొనర్చి ఽ వినిపించితి నా గేయంపునడక

గనెడి భాగవత మందలివి కథల § వను దీవించెను ఫలసిద్ధిఁ బొంద
కనె వాకుచ్చెను స్కంధముద్రణకు § ధనము నిత్తునని గురుసమక్షమున
వినఁ జేతు నింక యతని వంశమును § ఘనతను బొందిన యతని పెద్దలను
నారాయణప్ప నా వెలయు ద్విజుఁడు § నారీమణియగు యంబమ్మయను
ధీరాత్మురాలి సతిగఁ దా వలచె § సారాచారుఁడు దారుఁడు విజ్ఞుఁడు
ఆతఁడు గాంచెను సుబ్బరాయునిం § ఆతతకీర్తి విశాలుని సుజను
సతతాన్నదానతత్పరుని బుధుని § ఆతని సతియగు సుబ్బమ్మసుమతి
యాతన్వియు పతియాజ్ఞ మెలఁగెడిది § పతివ్రతయునై పరహితత్వమున
పాతు నెఱుఁగునది యాదంపతులకు § ఖ్యాతి వెలయ జన్మించెను శేషయ
శాతరుఁడు గాఁడు కార్యములందున § ఖ్యాతర మెరుఁగడు బుధుల పరిచర్య
నలరందువాఁడు సతి శంకరమ్మ § లలి నించు భర్త కనుకూలసాధ్వి
కలభాషిణియై విభునితోఁబాటు § కలిసిమెలసి గాయకులఁ బండితుల
కలకొలఁది యన్న దానాదికముల § నలత నెఱుంగక సత్కరించునది
వీరికిఁ బుత్రులు మువ్వు రందులోఁ § గూర్రగుణదూరుఁ డురుతరవివేకి
గారాము బెంచు కరము విజ్ఞాన § సారము నెఱుంగు మహనీయమతుల
నారీమతల్లి నాగలక్ష్మమ్మ § వీరి కనుకూలవతి యన్నివిధుల
సారసాక్షు నెల్లపుడు నుతింతురు § మీర నీదంపతులకు సూనుండు
దారగుణములను మున్నందునట్టి § సారతర లక్షణముల నొప్పగను
కూరిమిం గను కనుదృష్టి వెలయించు § కారణభూతుఁడు శేషగిరిరావు
వీరివంశమును నాచంద్రార్కము § నారసియు బ్రోచు రాజీవాక్షుఁడు

## శ్రీ ఎఱ్ఱమరము అప్పలరాజుగారి వేంకటరమణయ్యగారి

# వంశవృక్షాభివర్ణనము

శ్రీనివాసుఁడును సిరు లన్ని గూర్చు § వనమాలాధరుఁ డైన విష్ణుండు
మానితంబైన పద్మస్కంధము § గాన భాగవత మందలిది దీని
వేసవీన విధి వెలయింపఁ గన్న § దానపరవరుని బ్రోచు నెల్లపుడు
కాశ్యపగోత్రజు డగు ఎఱ్ఱమరము § వశ్యముగా తన నెలవుగా నంద
వశ్యమును గన్నయతఁడు విజ్ఞాన § వశ్యుఁడు నా యప్పలరాజుగారి
వేంకటరమణయ నామధేయుండు § లంకెఁ గొన్న సచ్చరితుఁడు శిష్టుఁడు
పొంకమైన గుణసంపద తోడుగ § వంక లేని సౌందర్యాంచితుఁడు క

శంక రహితమతియై జగదీశుని § కింకరునివలెను సేవించు నతఁడు
సంకట మెరుఁగఁడు సఖులఁ దయఁజూడఁ § గింకిరిఁగొన డరులకుఁ జేఁజాప
పొంకమందు సంపదలకు నెలవుగ § బింకమునఁ దోలు సుజనులు తను గన
నిట్టివాఁడు తన పూర్వపుణ్యా మను § గట్టు మెట్టినా నీభాగవతము
పట్టున మమస్కంధము పూర్తిగ § మెట్టుల గానపురుచి మట్టమంద
జుట్ట వింక దుర్గతులు నాకంచు § దిట్టతనమునను వినె నీ శరణని
పట్టువెటఁగి యీ గ్రంథముద్రణకుఁ § బట్టిన ధనమును నిత్తునని యొప్పె
నతని పితామహుఁ డతి వదాన్యుఁడన § యతిపోషకుఁడగు శ్రీకళత్తుర్నిశా
స్తుతుల మెప్పించు చర్యలఁ దిరిగెడు § నతని యాఖ్యయును వేంకటరమణయ
యే యన వెలుఁగొందుచుండు నట్టిడు § ఆయనకుఁ బత్నియగు శంకరమ్మ
ఆ యమ శాంకరివలె నర్ధిజనుల § ఛాయల నిలువుచు నాదరంబునను
మీరి సహితమునఁ బతికిఁ దోడగును § కూరిమి నెగపును హరినిఁ జిత్తమున
వారిపుత్రుఁడగు వేంకటసుబ్బయ § సారవివేకాశ్రియు నుపకారియు
మీరగుఁడు దుష్టవర్తనకులకు నయి § దారసించు హరిదాసులను గనిన
నారీరత్నము రంగమ్మనాగ § నోరిమినిఁ బెద్ద తరుణి యతనిసతి
వారలకు సుతుఁడె యీ దానపరుఁడు § ఈ రమ్యచరితు రమణి చిన్నమ్మ
వీరికి నౌరససంతులేకున్న § కోరి దెచ్చుకొనె నా బాలు నొకని
వీరేశమయ్య యను సౌఖ్య సుగుణు § మీరు ప్రీతిచే దత్తతఁ గొనియెను
వీరియిలు సంతు వెలయవలెనంచు § చారుమతిని హరిదయను మునుముగొని
తోడుఁ గనిరి యీ వరసంతానము § నేడాదిగ దమ యశము భువి నెగడు
పాడిదప్పండు ఆడఁడనృతముల § జాడలెన్నైన వీడఁడౌధృతిని
ఈ నయవినోది యింతకుమున్నె § తాను శాశ్వతపు సంతానమ్ముల
బూనికను బెంచి సాఫల్యముఁ గనె § ధ్యానపరత శివుఁ జేర్పు ననువుగా
నీసుపరమేశునిశా గిరిజేశుని § పాశి భయాపహుఁడైన శంకరుని
వేశ మొనరుగను బ్రతిష్ఠ నొనరిచె § నీసునకుఁ బ్రీతిగా వనప్రతిష్ఠ
నటులనె బావినిఁ దత్కృనిఁగూర్చె § తటమగు నతిథుల సత్కరింపఁగ
పటిమవాటించు పెరతోఁట్రీవ గనఁడు § దిటవుచాలంది యాజ్ఞవల్క్యముని
పవిత్రతను దెలియంగనగుచరిత § మవని వెలయంగ ముద్రింపించెను.
యతిజనసన్నుతుఁ డాదిపురుషుండు § నతజనావనుఁడు నారాయణుండు
పతితపావనుఁడు భద్రగుణాఢ్యుఁడు § సతత మీవంశజులఁ బ్రోచుదయను
బంగారుచేల షంగమునఁ దాల్చి § శృంగారమొల్ల శ్రీసంగతిఁగన

రంగైనమూర్తి రజతగిరీశుని । సంగడీనిఁ బొంది సకల శుభమ్ముల
నొసఁగెడు నతనికిఁ బ్రమోదయుతుఁడుగ । నసమాన యశము నాచంద్రార్కమ
పసిడితామరను బొడ్డున నలరెడు । వసుదేవసుతుని కృపయె నిలుపుమతి
గోవిందాజై గోపాలాజై । గోపాలాజై గోవిందాజై

## శ్రీ డా మ గ ట్ల శి వ రా మ య్య గా రి

## వం శా వ ళి

శ్రీనివాసుఁడును సిరులన్నిఁ గూర్చు । వనమాలాధరుఁడైన విష్ణుండు
మానితంబైన పంచమస్కంధము । గానభాగవత మందలిది దీని
వే నవీనవిధి వెలయింపఁ గన్న । దానవప్రవరుని గన బంధుహితుని
ఘను డామగట్ల పురనివాసునిం । వినికెని యశమునఁ బరగు శివరామ
నామారూఢత హరిహరులకళల । ధామం బందిన తేజోవంతుని
శామజనకునిం హృదిని నేమరక । నేమమున దలఁపుఁగల యతని వంశ
మును శేర్కొనఁబడు నతని లిఖితంబు । ననుసరించియే వ్రాసినదియు నిదియు
అతఁడు శ్రీవత్స గోత్రజుఁడు । రతియు నియతియును హరిపరంబుగా
గతి నందించును సమత నెద నిలుపు । సతనిసతియు నా పతిహితవతి యగు
నామము లక్ష్మమ నాఁ జెల్లు ధరణి । తామసగుణమును దరిమి పతిసేవ
నీమము దప్పఁగ నీ కాదరించు । నా మంజుగుణుల వంశావళి యిది
ప్రపితామహుండు అంబదాసు నా । విపులఖ్యాతి నలరారు సుగుణుండు
కపట మెరుంగడు కరుణను దాపడు । ఎపుడును శంకరు హృదయమున నిలుపు
వసతి గలవాఁడు భార్యయు లక్ష్మమ । సుసతి దయామతి యగు నతిథిజనుల
కసరింపకఁ దా గౌరవము నించు । బిసరుహాక్షు సతివలెనె శ్రీ లమర
పితామహుండగు రామచంద్రయ్య । సతీతిలక మగు అంబమ్మభర్త
సతంబు సంస్తుతి హరి హర పరముగఁ । వెతలు గీటు గన వెలయు చరితుండు
ఆ మిథునమునకు సుతుఁడు రామయ్య । ప్రేమకు నిలయుం డాతఁడే యనఁగ
రాము శ్యామాంగు నచలితనుతులను । నోముగాఁ గొనుచు దినము బఠించును
నా మనఃజవరునినాతి లక్ష్మమ్మ । శ్రీ మహిళాసతి వలెను రాజి గొను
ఆ మాన్యుల సూనుండె యీతఁడగు । నామనంబునుం రంజింపఁజేసె
భూమియందు విఖ్యాతిఁదాఁగొనఁగ । శాము ధన్యముగఁ బరితోష మందె
అతనిపుత్రు లార్వురు నీతియుతులు । సతతము పరాత్పరుని దయ మనెదరు

మతిమంతులగుదు రందరిని వరుస § గతివెలయ వచించెదను శివుఁదలఁచి
రామయ్యయు వేంకటనరసయ్యయు § ఆమాడ్కి వెలయు వేంకటశేషయ
నాముఁ డలని తమ్ములు కృష్ణమూర్తి § సోమసుందరుఁడు రాజేశ్వరయ్య
రామయకు మల్లిఖార్జున నాముఁడు § నా మహాదేవుకరుణం బొడమెను
శ్యామవర్ణుదయ మోహనగావను § నాముఁడు వేంకటనరసయకుఁ గలిగె
మరియు విజయలక్ష్మమ నా కొమరిత § వరుసగ జనించె హరికృపాలబ్ధి
వరమతి వీరయ గారికి పౌత్రిక § తరమిట్లు వీరి నెల్లర నీశుఁడు
యరసి రక్షించు సౌఖ్యమ్ము లిచ్చి § చిరము యశము భువి చెలువు నిండంగ

## శ్రీ బిజనవేముల కరణము శేషయ్యగారియు, సుభద్రమ్మగారియు

# వంశావళి

శ్రీధాముని దయ నింపుఁ జూపులను § నాధారముగా నాపదలు దాట
సాధనమగుననిఁ దలఁచి జపించుచు § గాథలను ద్రోయు కాంక్ష మది నుంచు
పవిత్రమతి యా వశిష్ఠయ్య యను § సువిచారగుణుఁడు ద్విజుఁడు దాతయును
బ్రవిమలకీర్తిని బిజినవేములను § భవుని యోగమున నివసనము గుదిరి
సవిధి నభాగ్యతాతిథిసేవలఁ § దవిలి చిత్తమునఁ బదిలంబుగఁ దా
భవరహితునిఁ బరమేశు నర్చించు § సువిశాలహృదయ వేంకమ్మపత్ని
తివిరి పతిమానసపు లక్ష్యమెఱిఁగి § సవివేకతఁ దా గౌరిని స్మరించు
నట్టివాఁడు తన జననీజనకుల § నట్టె పితరు విఖ్యాతి తన కునికి
నెట్టి లోపముల లేని మతికలన § పట్టియై పుట్టి కపటరహితమతి
యైన సిరినొప్పు గుణలక్షణనుత § దాను జేపట్టె పుట్టమ్మ నాగఁ
బూనిక నా వనితామతల్లి పతి § నానతి మీరని వర్తనను నిక్క
సతత నిధానము దానపరత్వత § వితతకీర్తి నిల తేజము నందియు
సుతు నొకని గుణవరేణ్యుని గాంచెను § సతతమోదరతి నాగరాజతఁడు
సుతునికిఁ బేరగు నరసయ్యయు నా § నతనికి శుభాంగి సుబ్బమ్మ నాగ
సతి పతికి విహిత కార్యములతోడు § నతిశ్రద్ధ మెలఁగు తెలివి పెద్దగను
సుతునిగాంచి రా మిథునము గరిష్ఠు § నతివిశాలగుణమందను శేషయ
నాముని నాతఁడు సతిగా వరించె § కోమలగాత్రగు నారాయణమ్మ
ఆ మహితగుణులు గాంచిరి సుతులను § శ్రీ మంజులగుణ రతల నిర్మలత
తొలిపుత్రికయగు నారాయణమ్మ § తొలిఫలముచాలు సురలోకమునకు

నెలవుగా నరిగె ద్వితీయపుత్రిక § తలఁపు నిర్మలము మతి భద్రపరము
నలరు తన మనముగా నొప్పు లలిత § విలసితహృదయయునగు సుభద్రమ్మ
తనకు సంతాన మీ కృతిపోషణ § మనియె తలపుంచె తన జ్ఞానకలిమి
యనఘుఁడైన తన బావ శేషయ్య § అను సమ్మతిఁగొని చతుర్థస్కంధము
మునిపూజ్యంబును నగు భాగవతము § నను గానమింపుఁ గనిన భాగంబు
మనకు ముక్తినిడు సొంపునుఁ గూర్పు § ధనమిత్తు ననుచు హర్షతను నొప్పె
వనమాలి కర్పణంబంచు బలికెఁ § గను నానందము నిహపరంబులను
వినయగుణ విశ్రుతుఁడగు శేషయ్య § వనిత గతించఁగ
ఘనులయానతిని లలన తులిశమ్మ § లలినింపు వనితగా చేపట్టెను
పేరల నీశుఁడు పరమానందము § గూరుచుఁ బాముల మరల్చి తన పద
మారయఁ జేర్చును జెడని యశము ధర § మేర మీరగను నాచంద్రార్కము.

## శ్రీ బొమ్మరాజు సుబ్బారావుగారి

# వంశావళి

శ్రీ యుమాదేవి భర్త శంకరుఁడు § సాయమిచ్చి రక్షించు భాగవత
గేయరూప మందంబుగఁ జెలఁగెడు § నా యగజాధిపు సఖుని పరమైన
యవతారంబుల కపిల యజ్ఞపో § త్రివిచిత్రకథల సొంపారనైన
ప్రవిమల తృతీయ స్కంధంబునకును § నవసరంబయిన ధన మిత్తు ననుచు
పూని వచించిన పారుమంచాల § ననయము కాపురమంది యాగ్రామ
మున ప్రభుత పరపు టుద్యోగకల్మిఁ § గనుటయే గాక భూ శ్రీ సంతతి
దనరార దాతలన ఖ్యాతిగన్న § మును బూర్వికుల చాలు పేరంది
ఘనత వెలయ నగు బొమ్మరా జనెడి § జనవినుతి గన్న వంశజనితుండు
వినయసంపన్నుఁ డగు సుబ్బరావు § కనకచేలు నర్చించు సన్మతియు
కర మర్థి జనుల దీనుల భృత్యుల § నాశహీని పండితుల కవుల బుధులఁ
జేరిన మాత్రన యీప్సితం బెరిఁగి § చాతుతరంబుగఁ గోరికలఁ జేర
ననువొంద నిచ్చు దనయిష్టదైవ § మును వేంకటేశు మదిని నిల్పుకొని
శనివారమునను నన్ను రమ్మనుచు § ననుకూలమిచ్చి తప్పకానాడె
నేఁ గోరినట్టి యీ స్కంధమునకు § త్యాగాంచితంబుఁ దా నర్పించెను
వాగానుభూతిఁ దప్పని సరణిని § యోగమును గన్న వారివంశంపు
ఘనుల పూర్వజుల పరము వెలివార § గను వ్రాయ నిచ్చె వంశవర్ణనము

తనచే వ్రాలిన నా కీర్తిరతుని § వనజాక్షుఁడు కృపమనుపు చిరతరము
ఆదిపురుషుండు సీతారామయ § ఆ దొడ్డగుణుని భార్య పుల్లమ్మ
ఆ దంపతులకు సుతులు ధీరతము § లాదరణంబున మతిఁ గన్నవారు
పుల్లమరాజనఁ బ్రఖ్యాతి నిగుడు § వల్లన రిపులను దొలగించువాడు
వెల్లువితరణను దన బంధుజనుల § నెల్లరకుఁ బ్రాపు నందించునట్లు
ఎల్ల పండితుల భూసురులఁబ్రీతిఁ § గొల్లలుగఁ జూచు సాయమును వేడ
అల్ల శ్రీహరిని హరుని నర్చనల § నెల్లకాలమును దనయింట నిలుపు
నాతం డగ్రజుఁడు తరువాతి యతఁడు § వీత చింతనుఁడు నతిశౌర్యధనుఁడు
పాతకదూరుఁడు వేంకటశేషయ్య § యాతనికి భార్య సుబ్బమ్మ నాగ
ఆతతగుణసుందరియు సిరికళయు § నా తరుణినిఁ జేరెను వితరణచే
తనయునిగఁ గనిరి యీసచ్చర్యుని § కన విపరీతపు మతిఁ ద్రొబ్బువాని
ఘనుని దానపరుని కీతనికి § వనితలు మువ్వురు వినయ రూపగులు
అతి యుదారగుణ సంపన్నులునై § స్తుతిని బరాత్పరు నెడ నిల్పువారు
అతివలు కేశమ వేంకటరమణమ § సతి హనుమాయమ్మను నా వెలసిరి
అందున వేంకటరమణమ్మకు సుత § యందం బొప్పెడు పుల్లమ్మ నాగ
నిందుధరుఁడు హరి వీరినందింతు్రి § మందమైన సంపదల సౌఖ్యముల
ఈ దాతకుఁబెరమైన గర్భమున § నాదరంబుగొన పుత్రియుగ్మంబు
దాదిలి శొంపుఁ గొనఁగాఁ బుట్టిరి § మోదంబు నించు పుల్లయ నాముఁడు
తొలిపుత్రుఁ డతఁడు ద్వితీయుఁడిట్టు § వెలయును మార్కండేశ్వరరావన
సలలితంబుగను వీరిని శ్రీహరి § తిలకించు దండ్రి హర్షింప

## శ్రీ చల్లా పుల్లారెడ్డిగారి

## వంశావళి

శ్రీ లందించును శాశ్వతుండు వన § మాలాలంకృతుఁ డైన బ్రహ్మాండ
జాల రక్షకుఁడు శ్రీవత్సవక్షుఁ § డాలక్ష్యదృష్టిఁ బ్రిధమస్కంధము
శ్రీమన్మహనీయంపు భాగవత § మీ మహి గేయపుఁ గలన విలసిల్ల
నా మహాదేవు కరుణయె తోడుగ § నేమమున వ్రాసి ముద్రణఁ బూర్ణఁగఁ
దలంచి చేరితి నిచ్ఛను దెలిపితి § దలంపుఁగొనె నా తలంపుసిద్ధిగ
కలంక రహితుఁడు నైన యీదాత § చరింపు నందని భక్తి హృది నిల్పి
చల్లావారను వంశదీపకుఁడు § కొల్లగ ధనతతి గలవాఁడునునై

ఇల్లాలు గుణములను మణినాయన । వల్లఁగనెడు శేషమ్మ యామెకును
వల్లభుండైన రంగారెడ్డియు । సల్లలిత గుణుఁడు శౌరికి భక్తుఁడు
చల్లఁగూర్చుఫలతరువు నర్థులకు । పల్లవిడెఁడు వాఁడాతనికి సుతుఁడు
కల్ల లెఱుంగని పక్కీరురెడ్డి । సల్లలిత పత్ని నాగమ్మ యనఁగ
మల్లెపువ్వుముల వాఙ్మృదుత్వమును । నల్లుకొన్న యాదరణ గలవనిత
మెల్లనఁ దోడ్పడు పతిహితపుఁ బనుల । నెల్ల యత్నముల మల్లడి నెరుఁగదు
సుకాంత నాఁ జను నామె కొమరుండు । సుకాంతిదోడుగఁ దెలివి బోడుగను
వికార గుణదూరగుఁడు నిర్మలుఁడు । సకామియగు నన్నిట ధర్మంబుల
సకారణంబుల గాంచు నర్థులను । అకారణంబున నెందునను జొరఁడు
ప్రచారములు సజ్జనాదరణలని । విచారములు విజ్ఞాన గ్రంథముల
సచారముల సుప్రసంగముల ని । ర్విచారుఁడగుగా దైవికములైన
సుఖదుఃఖములను బాటింపఁడు దా । నఖిలమున నాత్ముఁడొక్కఁడే యనియు
నిఖిలకూటములు నిశ్చలము గనవు । అఖిలభూతమయుఁ డతఁడు హరియనియు
అతని దలంచుటయే భవధన్యము । స్తుతికి నర్హాతముఁ డాపరమాత్ముఁడు
వెతలేల యనియు సతతమోదరతి । మతిఁగల్గునతఁడు పుల్లారెడ్డియు
అనువాఁడాతసి యింతి గుణరతియు । ననఁగ వెలయు రామకృష్ణమ్మనా
వనిత కళానిధి సోదరునిఁబోలు । మని యున్నకాలమునను ద్రిమూర్తుల
నెనయు కళలుగల మువ్వురసుతులను । గనియెఁ గ్రమముగను రామిరెడ్డి యన
రామలింగేశ్వరాఖ్య రెడ్డియును । సామగుణుండగు రాఘవరెడ్డియు
శ్రీమహితులు గుణశీలురు వీరల । రామిరెడ్డికి ప్రభాకరరెడ్డియు
ననెడు సుతుఁడు తా బ్రభాకరునివలె । వినఁగ రామలింగేశ్వరరెడ్డికి
వినయభూషణులు నల్వురుపుత్రులు । యనఘులు మోదతలంపుల వెలయుచు
వరుస చంద్రశేఖరరెడ్డి నాగ । సరసుఁడు జ్యేష్ఠుఁడు తరువాతి యతఁడు
వరగుణుఁడు జనార్దన రెడ్డియునుఁ । వరుసగ పుల్లారెడ్డియు మరియును
రామకృష్ణనామంపు రెడ్డియును । ధామంబందును వీరలకు శ్రీలు

## శ్రీమ దాంధ్ర గేయ మహాభాగవత పోషణ ద్రవ్యదాతల వంశావళి

## శ్రీ కొత్త వేంకట నర్సయ్య శెట్టిగారి

## వంశావళి

( రేగడ గూడూరు )

శ్రీయుతంబుగను నాభిళ్ల గోత్ర ॥ ధీయుతుండునయి పుట్టెను సుబ్బయ
ఆ యనఘునికిని భార్య నర్సమ్మ ॥ ఆయుష్మంతుడు వేంకట శేషయ
జనించె వారికి బుత్రకుండునయి ॥ ఆయనకు భార్య వేంకటసుబ్బమ
ఆ నీతిపరులకును జనియించిరి ॥ మాననీయులగు పుత్రు లిర్వురై
వేంకటనర్సయ శెట్టి యనంగను ॥ వేంకటకృష్ణయ శెట్టినా బరగి
వేంకటేశుదయకును బాత్రులైరి ॥ శంకరునిభక్తి సేవించుచుండ్రి
అందు జ్యేష్ఠునకు సతి శివలక్ష్మమ ॥ ఆ దంపతులకు బుట్టిరి పుత్రులు
ఇద్దరు దుహితలు ముచ్చ రొప్పగ ॥ అందు పుత్రకులు వేంకటశేషయ
సుందరుండునగు వేంకటపుల్లయ ॥ సుందరాంగియగా వేంకటరమణమ
అందముల నెలవు వేంకటశేషమ ॥ మందగమన యగా వేంకటనాగమ
ఈ వంశజనితులైన వారిని ॥ యే వంక లేక బ్రోచుత విష్ణువు
పావననాముం డాచంద్రార్కము ॥ భువనవందితుడు పురుషవరేణ్యుడు.

## శ్రీ పైడిబంతుల వంగాల రామిరెడ్డిగారి

## వంశావళి

( రేగడ గూడూరు )

శ్రీకరము పైడి బంతుల గోత్రము ॥ ప్రకటిత వంగాల వెంకటరెడ్డి
అకలంకగుణుడు నావెలసె భువిని ॥ ఆ కరుణాలయునకు వేంకటమ్మ
భార్యగా నయ్యె వారికి బుట్టెను ॥ ధైర్యోదాత్తుడు ధీవిశారదుడు
శౌర్యసమేతుడు భువి పక్కిరెడ్డి ॥ భార్య లక్ష్మమ్మ యాతనికి నయ్యె
వారికి జనించె రామిరెడ్డి యన ॥ వరదానపరుడు నాకీర్తి గాంచె
దారగా నయ్యె నతనికి అచ్చమ ॥ భూరిదయామతి సద్వర్తనయై
వారిద్దరకును బుట్టి రైదుగురు ॥ గురుభుజబలులై పుణ్యమూర్తులై
మరియు నొక్క కూతురు లక్ష్మమ్మయె ॥ ఆ రమణీ మణికిని నుదయించిరి
సరసగుణుండగు పెదరామిరెడ్డి ॥ గురుభక్తిపరుడు చినరామిరెడ్డి

రామిరెడ్డికిని వేంకటరెడ్డియు ఽ అమరగ పెదపక్కీరెడ్డి మరియు
నమలుడు చినపక్కీరెడ్డియునున్ ఽ దమన మానసుడు పెదమద్దులేటి
అమిత శాంతుండు చినమద్దులేటి ఽ విమలంపు రెడ్డి యనగను బుట్టిరి
వేంకటరెడ్డికి వేంకటలక్ష్మమ ఽ పంకరహితయా భార్యగా నయ్యె
జంకులేని యా దంపతులకు భువి ఽ పొంకముగ బుట్టె వేంకటమ్మనా
వేంకటేశుదయ చినపకీరెడ్డి ఽ బింకరహితయా భార్యగా నయ్యె
జంకులేని మతి భార్యగా బడసె ఽ అంకితమ్మగను వారికి వెంగను
అంకిలి తొలగగ పుత్రిక జనించె ఽ అకలంకరహితుడా శ్రీ విష్ణువు
పొంకముగా ఈ వంశము బ్రోచుత ఽ సంకటముల సడలించి సతమ్ముగన్.

---

## శ్రీ జూపాడు బన్నూరు కట్టా వేంకటరెడ్డిగారి

## వంశావళి

శ్రీ వేంకటేశు భక్తవరుండయి ఽ యే వంకలేని గోవిందరెడ్డి
భావింప తూము నల్ల గోత్రమును ఽ లాలింప బుట్టె నాతని తనయుడు
వేంకటరెడ్డియు నాబరగు నతని ఽ వంకను మెలగును భార్య యంబమ్మ
పొంకముగ బుట్టె మల్లారెడ్డియు ఽ సంకటములు వెస బాపు పుత్రుడయి
అంబమ యాతని భార్యనా బరగె ఽ నంబికాభక్తి యతిశయింపగన్
అంబమకు గల్గె వెంకటరెడ్డి ని ఽ జంబుగ వరసుగుణుడు శివారెడ్డి
ఆతని భార్యయు నాగలక్ష్మమ్మ ఽ నీతియుక్త పతిభక్తి సతీమణి
కుతుకమున వారికిని బుత్రుడయ్యె ఽ నీతిమంతుడౌ సుధాకరుడు నా
భూతదయుండగు వేంకటరెడ్డికి ఽ సీతబోలు వేంకమ్మ మరియునున్
ఖ్యాతి యుతయునగు శకుంతలమ్మయు ఽ ప్రీతిభార్యలై వెలయుగ ధరలో
వారికి సంతతి నల్వురు గల్గిరి ఽ ధరణి రామలింగారెడ్డి యింకనున్
వరగుణుండునగు వేంకటరమణుం ఽ డారయ శివలింగారెడ్డి యనగ
వర కుమార్తె యీశ్వరమ్మ వెలసెను ఽ పరమపావనుడు పరమేశ్వరుండు
ధరను నీవంశజులను దయతోడ ఽ నరసి గావుతను నాచంద్రార్కము

## శ్రీమతి పోలా లక్ష్మిదేవమ్మగారి వంశావళి

( పీరుసాహేబు పేట )

శ్రీ వేంకటేశు కరుణను ధారుణి § బావనంబునగు పోలావంశము
ఆ వంశమునం దమల హృదయుండు § భావంబు దైవభక్తి పరత్వము
వేంకటరామారెడ్డి నాముండు § వేంకటేశు మది నుంచిన సుజనుడు
పొంకముగా జననంబును గాంచెను § జంకులేక ధర్మంబు సేయునది
పరమపుణ్యవతి సంజమ్మనాగ § వరపత్ని యాతనికియై వెలసెను
వారికి బుత్రుడు కృష్ణారెడ్డియె § వరగుణమణియై వర్ధనం బందె
యా పుణ్యపురుషు భార్యయై నెగడె § కాపుకులదీప లక్ష్మిదేవమ్మ
యీ పూజ్యగ్రంథమును బోషించెను § సంపూర్ణ మోదహృదయం బందుచు
నీపుణ్యురాలి కా దేవు డెలమి § కాపురం బిడుత బరమానందము.

## శ్రీ గార్గేయపురము రంగారెడ్డిగారి వంశావళి

శ్రీనిధానుండు నా చెన్నుండెడు § నా నలినాక్షుడు నలిననయనుండు
దాన దాన రక్షింపగ నొకటిగ § ధ్యానసంస్ఫూర్తి తనొల్లయు గుణ వి
రాజితుండైన శీలవర్తనుడు § నా జగన్నాథు నర్మిలిని గొల్చు
చుఁ జితశోకుడు నై వెలయునట్టి § రోజ నంది తా దానపరంబున
హరసఖుండునై యచ్యుతుండనగ § బరగిన దేవుని భక్తపాలునిఁ
హరిని జేరంగ నదను నెఱింగిన § ధీరవరుడునగు గార్గేయపురపు
వెల్లివిరియంగ ప్రమోదమందియు § మెల్లని హృదయం బా హరి పరమున
యుల్లము పవిత్రతను నెలకొన్నది § యల్ల యువతి తా దత్తపుత్రునిగ
మెల్ల సుగుణముల పట్టు గన్నట్టి § వల్లకును గుదురు తానె యనగ దగు
అంకిరెడ్డినా యతనిఁ గనియెను § పొంక మలరుగా సుకృతరూపములె
యంకము గొని రమ యుజ్వలగాత్రిల § పంకజోదరుని భజించువారల
పంకజముఖులను పతిహితపరులను § వంకల నెరుగని శాంతి నిలయులను
మువ్వురనాండ్రగా గూర్చె నాతనికి § దవులు గొనుప్రేమ వారి పోషించె
నపురందువారి వౌ నామము లివి § భవుని యర్థాంగి భాతి నాగమ్మ
యావలి నారియగు లక్ష్మినరసమ్మ § సవిశాల దయను కలిమిపడతినా

దవిలిన శుభాంగి యామె తర్వాత § సవిధిగా బొందనైన యర్ధాంగి
సరస్వతమ్మయు నానాఖ్య లిటుల § తరంబు వెలయగ నాయంకిరెడ్డి
కరయ నా వంశవార్ధికి శశినా § వరగుణయుతుండు నగు వేంకటరం
గారెడ్డినాగ ఖ్యాతిని విలసిలు § సారసనయనుని సద్భక్తు డతడు
సుతుడగుచు నిలను సుగుణధురీణుః § నతులితపుశ్రద్ధ గొని చేరి న్యాయ
గతుల నెఱిగి తన చిత్తము విశుద్ధ § రతుల విహారింప నెలమిని జేరెడు
నత డీగేయపు టాంధ్రభాగవత § సతతముక్తి చేకూర్చు చరిత్రల
విని దానిపోషణపు కార్యములకు § ధనము నొసంగెద నని తోడు నిచ్చె
ఘనుడతడు దానవాంతకుఁ కరుణ § దనభార్యలయిన విమలమానసల
సులోచనమ్మను రామకృష్ణమ్మను § విలోకనమ్ముల సేవలను నంది
విలాసచర్యల విభవం బందుచు § సులీలగా భువనాళి రక్షించు
జగన్నివాసుని వైకుంఠవాసు § నగేంద్రజాత్మజ వల్లభుపుపీత
మగుఁ జన్మయన ధ్యానించు నియతి § తగఁ సంతుగని యుర్విని పేర్మిని
గనును గాకనుచు సర్వేశుమతము § ననుసరంబుగా నందు నిశ్చలత
దనరు నాతండు బుద్ధివికాసత § వనమాలికృపయె తోడు సతతంబు
పల్లెశేమమ్మ నాఖ్యాతి నిగుడు § చల్లన వంశావళి నిక్క తలపు

## శ్రీ పెద్ద శివా రెడ్డిగారి

# వంశావళి

## ( గార్గేయపురము )

శ్రీకళత్ర నిగమాంత సద్వేష్టు § లోకగరిష్ఠుని సిద్ధసత్వగుణు
పాకభేది సంపూజితచరణుని § నాకమలపీఠి కారాధవినుతు
నిఁ కంజాక్షుని ముని సుశ్లోకుని § నాకవశాంబరునిఁ కరుణామయు
భగవంతు పరము సుతత్వమూలగు § జగదంతరాత్మ నమలు నిశ్చలుని
నగచాపుసఖుని నాగేంద్రశయను § ఖగవరారోహకుని కరిరక్షకు
దలపున వలపున నిలువరముగూర § తెలివిచాలు విజ్ఞానపరమ్ముగ
వలరుపెంపుగను గార్గేయపురవు § నిలయుడు విశిష్టచరుడు గురుభక్తి
రతుండు రెడ్డికులజాతుండు సుగుణుడు § సతతసద్గోష్ఠినిఁ దీప్తివెలయు
నతడు చంద్రధరు నామమెల్లపుడు § స్తుతికి దోపంగ తనమూర్తి రొంపు

మనమున రోయుచు సోదరుండునగు ξ చినశివా రెడ్డిని జేర్చుకొనుచు
వనజాలయాధిపుని వర్ణించగ ξ ఘనమైన ఘట్టముల నలరాడెడు
శ్రీమదాంధ్రగేయపు భాగవతము ξ తామసదూరము కామవర్జితము
నా మహనీయులు పరమభాగ్యమ్ము ξ నామోదముక్తి నందించు నర్థా
తను గూర్చుతత్వమును దాను వినుచు ξ కను చూడ్కి సంతసము వెలి దోపగ
పెద్దశివా రెడ్డియను నామంబు ξ తద్దయు సార్థక మంద తత్ప్రవృత్త
ముద్ధిక గురుత్వపోషణంబంద ξ బద్ధికకై ధనమొసగ వాక్షురము
బారించె నతని వంశం బిదియగు ξ బోరెడ్డి మూలపురుషు డీగణన
బైరెడ్డి వంశజనితుడాతడగు ξ సారమైన నడతయు నతని కొప్పు
తనయుడు సిద్దారెడ్డి తజ్జోలు ξ గనియె నాతండు యల్లారెడ్డిని
వినయ వివేకుని విశ్వాసపరము ξ ననఘుడు సువ్రతు డాతనికి నింతి
యయె యయ్యమ నాయార్యసన్నుతిని ξ భయరహితమతిని పతిని గొల్చునది
దయకలిమి నిండు హస్తయుగ్మముది ξ నయ భావుల తనయుల గన్నట్టిది
వారలే వీరు సోదరు లిరువురు ξ దారులందునను పెద్దశివాఖ్యను
బరగు నతని యిల్లాలు గుణభూష ξ సరస సచ్చరిత సంచారమందు
నారీమతల్లి రుక్మిణమ్మనా ξ పేరుగాంచి పదివారలు పుత్రుల
గని ముప్వురయం దగ్రజుండగును ξ ఉనికి సాధుత్వ మాను మనస్వియు
జనహితచర్యల వీరత్వమందు ξ ననువునను వీర శేఖరరెడ్డియు
ననగ ద్వితీయుడు నట్టుపట్టింపు ξ గను నతండు పార్వతిరెడ్డియు
చినశివారెడ్డి చిన్నచెంచమ్మ ξ యను యువతిని శుభచర్య గలదాని
యను నావిధమ్మునను తృతీయుండు ξ విన సొంపంగు సీతారామిరెడ్డి
తన యింతిగ చేపట్టుముదమునను ξ తనయు శేషశయనా రెడ్డినాగ
వరగుణుని గాంచె వీరి నందరిని ξ పరమదయారతి బోచును శ్రీశుడు
ధర వీరిగోత్రమగు నాకుమళ్ళ ξ నిరవొందువంశ గరిమవిశ్వాస
నురుతరపుభక్తి సేవింతురెలమి ξ చిరతరయశంబు సుఖవర్ధనంబు
హరిగూర్చుచుండు. వీరికి నయంబు ξ అరమరిక తోచి హరుడు రక్షించు

# శ్రీ కేతవరము మద్దులేటి రెడ్డిగారి

# వంశావళి

శ్రీకరుండు శ్రీకాంతాదయితుడు । శ్రేయమును విముక్తిని గూర్చుగాత
ఈ కమనీయపు భాగవతమందు । కీసుగాంచి వెలుగొందెడు కృష్ణుడు
వీక ఫలింపగ నాతనిదౌ కృప । జోక గనట్టి పుణ్యంపుభాగి
గా కంజాక్షుని కరము వినుతించు । నాకుటిలరహితుడగు కేతవరపు
సల్లలితంబుగ కాపురంబందు । పుల్లావారను వంశోదితుండు
అల్లిబిల్లికను బొందించునట్టి । చిల్లువేదాంతముల దొర్లించగ
నల్లగూర్చు యమృతంపువాహినిగ । చల్లనిచూడ్కిని నల్లనివేలుపు
యల్ల నా డర్జునునకు ముక్తికగు । ఎల్లపదంబును బోధించినట్టి
యుపనిషత్సార మనదగుగీతల । సుపర్వు లలరగ బఠింప దగియెడు
తపఃఫలము తను నావేశింపగ । అపభ్రంశముల నడుగం దింపుచు
యనువుగా వెలయు నట్టివిచారము । యనవరత మందు నట్టి సుమతినా
దనరుచాడైన సజ్జనప్రియుండు । నన నుత్తముడును కవిజన వినుతుడు
నా యశముగనెడు మద్దులేటిరె । డ్డి యను భాగ్యము నందుటకై తా
న్యాయమంది శ్రీగేయభాగవత । సాయుజ్యదీప్తి తాను వెలిగింప
బాయని చిత్తముతోడ భక్తినిక । డాయ మోదతను దానపరత్వత
దానిపోషింప వాక్కు వెలిపుచ్చె । దీనపోషకుడు శ్రీహరి యలరగ
తాను తన పితృలోకములు ముక్తి । తో నవీన భవనముల విహరింప
గల డాతని జనకుడు సుంకిరెడ్డి । విలసితవర్తన సద్ధర్మమందె
వెలయగ నిల్లాలగు మద్దమ్మయు । తెలివిన రాజిల తను సేవింపుచు
తలపు నతనిపై దైవవిధి నిష్ఠ । కలిగి హరి హరుల బోలె మఱవనిది
యై యొప్పుగాంచు శంకరుని దలప । నై యొప్పుగాంచు నిర్మల మతిగల
డతడు మద్దులేటయ్య వరకలిమి । వితత యశంబును వడయ జనించిన
స్థితిని బొలుపొందె రాజీవనయను । సతిని పేర్కొనగ జామంది యుండు
లలితకళ గూరు గోవిందమ్మను । వలచి యతివగా ప్రకృతి సుఖస్థితి
వలనెఱిగి మద్దులేటిరెడ్డినా । కలిమిబలిమి వినుతికి మించ సుతుని
దలపున ఘటిల్లుటను భాగ్యమంది । చెలియ హర్షింప దత్తపుత్రునిగ
అల సుంకిరెడ్డిని పోషించుట । యల నితనివంశ వివరం బిటుగా
చెలువందె మద్దులేటిరెడ్డి యీ । యిలను సత్సంగ పరివేష్టియు తను

వలచి యున్నట్టి యిల్లాలు క్షమయె § నిలయుం బందెను ఈసజ్జనులగు
వీరికి పుత్రులు నేటికి నిరువురు § సారసాక్షుదయ నుద్భవ మందిరి
పేరులిట్లు శివరామిరెడ్డినా § సారమగువిద్య నేర్వతరుణుండు
తొలిసుతుండుగా పరిణతిఘటిల్ల § నల ద్వితీయుడయె సుంకిరెడ్డినా
శ్రీలల నాభీష్టవిహారుండును § వాలకుడె వీరి నందరిని బ్రోచు
లీలల విచారములు సుజనప్రీతి § గా లక్ష్యమందనై గుణవ్రజత

## శ్రీ రెడ్డివారి శివరామిరెడ్డిగారి

## వంశావళి

### (పీరుసాహెబు పేట)

శ్రీరంజిల్లగ రెడ్డివారరన్ § పారంపరమున బరగెను వంశము
ఆరయు నా వంశంబునందునన్ § శరసుడు పుట్టెను రోసిరెడ్డినా
పరమపుణ్యుండు పెండిలియాడెను § వరగుణమతినిన్ అచ్చమాంబనున్
ఆయుగ్మంబున కును నుద్భవించె § నాయుష్మంతుడు స్వామిరెడ్డినా
సాయని బ్రాహ్మణభక్తియుతుండయి § నేయమున దైవచింతన సేయుచు
విడువని బ్రహ్మజ్ఞానయుక్తుడై § జడమతిగాకను సత్యశీలుడై
పుడమిని బీదల సాధుజనంబుల § తడయక కరుణామయుడై ప్రోచెను
త్యాగశీలుడై దేవాలయముల § భోగిశాయి నెద నిలిపి గట్టించె
అగణితంబుగను తటాకాదులను § తగవుమీర దా ద్రవ్వించెను భువి
ఆతడు తన పెదతండ్రియైన వి § ఖ్యాతుడు పెదగోకారమురెడ్డికి
భూతిపెంపుగా దత్తపుత్రుడై § ప్రీతినడవడుల నాతనిని దివ్య
లాతులం బెంచి తమపార్శ్వమీయ § నూతనోల దా నయ్యె సిద్ధమతి
ఆతడు బాలమ్మను బెండ్లియాడె § పాతివ్రత్యము వరగిన సతినిన్
ఆతతబలులై వెలసిరి పుడమిని § యాతలిదండ్రుల ప్రీతిని బెంపగ
భూతదయుడు పీరారెడ్డియునున్ § నీతిపరుడు శివరామిరెడ్డి యన
పుత్రులుపుట్టిరి పుణ్యావశంబున § పతిభక్తియుక్త నాగమ్మ వెలసె
పీరారెడ్డిని భార్యగా బడసి § సారవర్తనులు సదమలులు నైన
ధీరుల మువ్వుర పుత్రుల బడసెను § వరుసను బేరొందిన స్వామిరెడ్డిన
సరసుండు రామకృష్ణారెడ్డియు § నారాయణరెడ్డియునా బుట్టిరి
దానశీలుడై దయాపరుండై § ఎనలేని దైవభక్తియుతుండయి

మునుకొన విద్యావంతుడగుచును ॥ పెనగొన ధీరోదాత్తుడు సుగుణుం
డనగను వెలసెను శివరామిరెడ్డి ॥ వినీతమతియగు బాలమ్మను దా
నెనయగ బాణిగ్రహణంబయ్యెను ॥ పొనరగ వారికి నారాయణమ్మ
వినయంపు సత్యనారాయణమ్మ ॥ తనుకాంతిమెరయు శంకరమ్మనా
మనములరగ శివలక్ష్మంబనగను ॥ తనయలు నల్వురు పుత్రు లిర్వురుగా
సోమసుందరుడు సుకుమారుండయి ॥ సోమశేఖరునికరుణ జనించెను
ఈ మహావంశ మింపుదలిర్పగ ॥ నేమరకుండను శుభముల నొసంగి
ఆ మహేశ్వరుం డాచంద్రార్కము ॥ ఇమ్మహి బ్రోచుత నెమ్మిమీరగా

## శ్రీ మి డు తూ రు భూ మా సు బ్బ య్య గా రి

## వం శా వ ళి

శ్రీ యలరారగ భూమావంశం ॥ బాయతకీర్తిప్రదమై వెలసెను
ఆ యనంతుదయ చేతను బొడమెను ॥ న్యాయశీలుండు వేంకటాచలము
ఆయన అర్ధాంగీమణి శేషమ ॥ పాయని పాతివ్రత్యమున వెలసె
ఆ పుణ్యదంపతులకు జన్మించె ॥ నేపారు చిన్న అశ్వత్థమయ్య
ఆ పుణ్యపూరుషుని పత్నియామె ॥ సొంపుమీరగా సుబ్బమ్మ ధరణి
ఆ పూజ్యదంపతులకు సుబ్బయ్య ॥ ఇంపెస లారగ బుత్రుడై బరగె
శిరులకు నెలవయి శాంతికి దావయి ॥ పరికింపగ గురు భక్తికి నిరవయి
పరోపకారంబునకును దావయి ॥ అరయగ బ్రాహ్మణ భక్తియుతుండై
వరగుణమణియై దాతయు దానై ॥ వరసంతానపు నెలవుకు జోటయి
వినయవిధేయుడు న్యాయవంతుండు ॥ అనయము పేదల పెన్నిధియనగను
కినుకలేని పరిపూర్ణహృదయుండు ॥ మనమున గర్వము గాంచని మానిసి
పెనగొన కవివర కల్పకం బనగ ॥ కనగను యాచక చింతామణియన
ఆతనికి భార్య నాగలక్ష్మమ్మ ॥ భూతదయామతి పుణ్యంపురాశి
భూతదయుడు వీపూరి వంశాన ॥ భూతుండు మిద్దూరి మద్దయ్యపుత్రి
యనగను వెలసెను పతిహితమతియై ॥ వినయగ సజ్జనమతగుణవతియై
ఒనరగ నాదంపతులకు బుట్టిరి ॥ మనములరగ పుత్రద్వయంబునుగా
తనరంగను నిర్వురు కుమార్తెలుగా ॥ వినగ వారిలో రామస్వామియు
నాత్మబుద్ధియు పొలుపును గాంచెను ॥ లక్ష్మీనారాయణుండు మరియును
అక్షీణభక్తియుతయగు రత్నమ ॥ లక్షణాన్వితయు నాగమ్మ యనగ

ఆ రామస్వామికి భార్యనయ్యె § నారీలలామ శ్యామలాంబనా
వారిరువురికిని బుట్టెను బుత్రిక § భూరిసుగుణఖని నాగలక్ష్మమ్మ
లక్ష్మీనారాయణకుభార్య స § ల్లక్షణవతియగు సుభద్రమ్మగా
లక్ష్యసిద్ధితో బతిని సేవించు § శిక్షణానుగుణపునీతమతియై
ఈ వంశ మవని యా చంద్రార్కము § ఏ వంక లేని ప్రాభవంబుగా
ఆవంశనాశగానవిలోలుడు § గావంగ భువిని వర్ధిల్లు గాత !

## శ్రీమతి ప్రాతకోట సుబ్బమ్మగారి

## వంశావళి

శ్రీశు పరాత్పరు చిన్మయు నమేయు § కేశవాది సంస్తుత్యనామగుది
గీశు లాది సర్చించు పరము నిది § నేశ చంద్రాక్షు శంకరుని హితుని
నారాయణ భువనావను నిత్యుని § సారంపుభక్తి సన్నుతించుటల
మేర భవాబ్ధిని కన నిశ్చయంబె § దారగా తనదు మనమున జొనిపిన
ప్రాతకోటపురవాసి యగుచుండు § నాతి సద్గుణోపేత శ్రీధాము
చేత మందునను నిలిపి యతనికృప § నూతగా దన్ను సర్వశుభంబుల
నందింప తాను నందింపునంది § ముందు పరమందు తనకు తనపతికి
ఇందుధరుని తోబుట్టు వల్లభుని § యందే తమదగు యాత్మలు జేరగ
సందు గంటి వని తన విభుండునగు § మందమతి దూరగుడు నైన యట్టి
బందుగుల వలెనె యర్థిజనంబుల § వందనాది సత్కారసన్మాన
మున జరుపనుండి మూర్తివంశమున § చెలువుగనున్నట్టి నాగిరెడ్డియను
సలలిత కరుణానిలయు నుత్తముని § యెల వన్వన బోధించి భాగవత
పరమైన యట్టి కథల సంగీత § పరముగా గూర్చి నట్టి సత్కృతిని
చిరకాలము ధర వెలయంగ సుజన § పరపఠనీయమునైన యా గ్రంథ
పరిపోషణంబునకు ధనమొసంగ § సరసత నట్టుల గూర్చె సుబ్బమ్మ
పరమసాధ్వినా పరిగణన గాంచు § వరమతియుతయై వర్ధిల్లు గాత
వారివంశంబు వెలది యటు సెల్లె § సారమైన గుణచయము తనొప్పలయు
సూరిజనవందితుండు పాపిరెడ్డి § దార యగు నతని కట్టెద లింగమ
యతనికి పుత్రుడునగు శాంతచిత్తు § డతులంపు ధర్మనిష్ఠ గలండగు
సతతమును మొక్కచెల్లించు హారిని § మతిమంతు డతడు పుల్లారెడ్డియను
నతనికి నిద్దరు పుత్రు లందునను § సతిగ లక్ష్మమ్మ నాబరగుచు గుణ
వతినా నలరెడు నారెంకను భర్త § యతి వివేకమున నడచు గురెడ్డి

యతనికి భ్రాతయగు నాగిరెడ్డి § యతని భార్యయే యగు నాసుబ్బమ
గతియ నట్టులుగ లక్ష్మమ పుత్రుడు § సతతుని దయగను వేంగళరెడ్డియు
వీరిని పరమేశ్వరుడు పోషింపు § భారమును గాంచు సర్వకాలముల
కూరిమిని పరము నందు తనసెలవు § జేరుచు విష్ణుడు సర్వజ్ఞ గతడు.

## శ్రీ పాత్రకోట యజ్జం నాగిరెడ్డిగారి

## వంశావళి

(పాత్రకోట)

శ్రీనివాసుండు సిద్ధవినుతుండు § తాను సర్వభువనముల పోషింప
గా నిత్యమ్మును నందియున్నట్టి § దానసె భక్తుల నమ్మి శరణన్న
వారల బాయక వెనువెంట నంటి § పారగదోలును వారి భవబంధ
ముల్ రాపిడిగని విశ్వేషతగన § నా రంజనీయ యుద్యమంబునకు
తా శరణు జొనిపి యీ సత్కృతినిం § పేశలపు నుక్తులకు నిలయంబయి
శ్రీశునిమహాత్వ లీల వెలి బుచ్చ § కోశము నా యొప్పందెడు శ్రీమ
ద్భాగవత గేయకావ్యము జేజో § రాగమందుటకు తా దోడీయగ
తా గండుకొనియె నా పాత్రకోట § లో గరిష్ఠదశ కలిమినె నలరుచు
త్యాగభోగముల సందడంపుగను § నా గుణపరిమోదరతుడు నిర్మలుడు
గవ నా యజ్జం నాగిరెడ్డినా § వనజాక్షుపైన మరులుగొనుభక్తి
దవరారుచుండి యొప్పి ధనమొసగ § వినదగు నాతని వంశపవిత్రుల
మూలపురుషుండు నగునాగిరెడ్డి § చాలు సజ్జనుల నమస్కరించుటె
వాలకంబుగా నొప్పు నిల్లాలు § చాలునట్టిదగు నామము చెంచమ
వారలపుత్రులు సుబ్బారెడ్డియు § దారుడునగు నాతడు తొలిపుట్టుక
గూడినట్టిదగు బాలిరెడ్డియును § పేరు విఖ్యాతి గనిన ద్వితీయుడు
ఘనుడగు సుబ్బారెడ్డి కిల్లాలు § వినయధురీణయు నాగమ్మనాగ
దనరు నాబాలిరెడ్డి కిల్లాలు § గను లక్ష్మమనా దనరె నాయమయు
గుణగరిష్ఠయే యయ్యు సుపుత్రుని § గణనముందు గను ఈశ్వరరెడ్డిని
ఫణిశయనుని జింతించునట్టిడుని § గణింప నొక్కని గనియె నిర్మలత
యనఘాత్మమైన యీ నాగమ్మకు § దన విభునిసాటి బోలుసత్పుతుని
గనె నాతడె యీ యుద్యమ మిత్రుడు § వనిత బిడ్డ రాతని వరింపగా
ఘనత సుఖస్థితి నందుచుండునా § యను మోది కాంత లవిపేరులట్లు

దనరెడు ఫక్కీరమ్మ తొలిభార్య । కనకవనజదళ గని కాంచె తనయ
నొకతిని చెంచమ్మను నాబాలను । శుక వినగ నొప్పు వేంకట సుబ్బమ
సకల సుగుణవయ మంచు ప్రశంసను । సుకరమందునది రెండవపత్నియు
నగు వీరిబ్రోచు భువనభరణుండు । నగు జనార్దనుడు యిహపరంబులను
దగ సుఖముల దొంగంగ కృప నిండు । నగటుల నా హరి గ్రహించు ఫలమది.

## శ్రీ ప్రాతకోట పలుచాని నాగిరెడ్డిగారి
## వంశావళి

శ్రీపతి విశిష్టమగు కరుణ బ్రోచు । నీ పట్టున శ్రీమదాంధ్రపరిచయ
మేపుగా తెన్ను గూడ భాగవత । మహా పురాణ రాజమును గేయంపు
గతిని కావ్యముగ వ్రాసిన దాని । మతిలోన మెప్పుగా వినినంతట
నతుల వివేకత దాని పోషణకు । నతిశయ శ్రద్ధను దాను పొడగుట
కొప్పిన చిత్తము ననునట్లుగాగ । గుప్పునను ధనము నా కొసగనగుచు
నప్పురుషోత్తమునకు భక్తుడైన । నొప్పని శత్రులకైన నిడదుగా
ప్రాతకోట పురవాసియగునట్టి । ప్రాతికచయుంబు వారించునట్టి
చేతమున శ్రీశు నుతింపు మనవి । యా తరుణమందు పలుచాని వంశ
మునను జనించిన నాగిరెడ్డియను । ననఘుని న్యాయచక్షణ సజ్జనుని
గన నాతని వంశంబు వివరముగ । ననయ మాహాత్తమున వికాస
మును గాంచ వ్రాయనయె నిట్టులను । గన భువిని దెలుపు టిది కవిమతంబ
ఘనుడు పలుచాని సుబ్బారెడ్డియను । వినయఘనశీలుడు అతని కిల్లాలు
వనితామతల్లి యా వెంగనెమ్మయను । గ నియ్యారైన సుతుల కులదీప
కుల వారిలోన మల్లమ్మ యనెడు । లలనను సుశీలవర్తన నొప్పగ
వలచి భార్యగా గొన్న విఖ్యాతి । నలరిన చిన యల్లారెడ్డి యితని
జనకుడునగునా మల్లమ్మ జనని । యనను గుణసుందరుండు తా నగుచు
దనకునను సాధ్వి నియతవర్తనము । గను పుల్లమ నాయువతిని భార్యగ
గొని గాంచె సుతుని వినయమండనుగ । గనగ నాగలింగాఖ్యపు రెడ్డిని
మనము నలరుగను నాతనికి సతిగ । నొనరెంచ మిగుల సన్నిధికి నెగడు
గనునట్టిదైన ఫక్కీరమ్మను । తనచర్యల సంతృప్తుల సందర
నొనరించునట్టి దాయమ వారల । కును తనయుడయ్యె వేణుగోపాల
రెడ్డి నాబరగు నతడు హరికృపను । నడ్డుల నెయ్యావి గకవరిల్లు
దొడ్డబుద్ధిగల వారల శ్రీహరి । బిడ్డలైన విధి పోల్చి రక్షించు

# శ్రీ గజ్జెల నాగిరెడ్డిగారి

# వంశావళి

## ( ప్రాతకోట )

శ్రీయనుంగు బంధుండు విష్ణుండు ఽ డాయడెట్లు తను స్మరించువారల
ఛాయ నిల్చి రక్షింపు దైవమన ఽ న్యాయమొందు వరమూర్తి యాతడని
నమ్మి వారి సర్వాఘచయమ్ముల ఽ వమ్మున గూర్చుర కమ్మన వెలిగాడు
సుమ్మను మహర్షి వాక్సంతతులను ఽ కొమ్మగా నంది తద్ధ్యానపరత వ
శమ్ము దా నంది సజ్జనబృంద ము ఽ రమ్ములో స్థానమందు తను మెచ్చు
నుమ్మలికను దనచెంత రానీక ఽ నెమ్మదిని మోద పరిభూతినంది
గానభాగవత సంబంధోక్తుల ఽ తాను బూన్కి విని తద్విధులమెచ్చి
వినగదాని సద్దీప్తికిని తోడు ఽ నేను కొంత చేకూర్తుగా కనుచు
ప్రాతకోటపుర వాసుడై నట్టి ఽ చేతము విశుద్ధినిక్క పరహితంబు
కై తొట్రుగనక శక్తి తా బెంచి ఽ పాతకము దీన నడగు నిజమనుచు
ధనసహాయమునకై మాటయిచ్చె ఽ మునుమున కుతుకము ముందు తన్నంద
గనునాతడె గజ్జెల నాగిరెడ్డి ఽ తనను వరించెను నాగమ్మ యనెడు
వనితాతిలకము గుణము సుందరము ఽ గను తత్త్వమందియున్న దాయమయు
వారలకు బుత్రుడై జన్మించెను ఽ సారసనయనుని దయాపరంబున
చారుతరనడత రామలింగాఖ్య ఽ చే రమణీయుతనందు రెడ్డిగా
గజ్జెలవంశము పావనంబంద ఽ సజ్జలజాక్షుడు వీక్షణ నందుచు
కజ్జల మడంచు భానుప్రభవలె ఽ సజ్జనవంద్యుల పాపతమ మణచు
వీరి వంశవిస్తార మిటులొప్ప ఽ మేరగనెను నాగేశ్వరరెడ్డియు
సారసాక్షి యంబమ్మ తనయింతి ఽ గా రంజితుండు విభవయుతుడునగు
నతులపుణ్యా మా దంపతుల దార ఽ సుతునిగా గనిరి లింగారెడ్డిని
యతివినుతిని హరిమతిని దలంపుచు ఽ సతతము సుజనస్తుతినందు వాని
యతనికిని సాధ్వి యమ్మ్యె యచ్చమ్మ ఽ సతుల గరిష్ఠత లన్ని తనయందు
పతిని సేవించు భాగ్యకళ నలరు ఽ నతివయా నామె యవ్వారికె యీ
యనఘుడు జనించి యీ విధిని యశము ఽ గన నొప్పినాడు మనెడు హరిదయను
మునిజనవందితు డురుతరకృపుండు ఽ వినుతజనావను విశ్వేశుని దయ

---

## శ్రీ కట్టా రామిరెడ్డిగారి
## వంశావళి
( వడ్డమాను )

శ్రీ పగిడిపాల గోత్రంబందున § నేపున కట్టావంశమందునన్
భూపాలమాననీయుండు నయిన § చపలకహితుడు శివారెడ్డి యనగ
కృపాసాగరుడు పుట్టె నాతనికి § విపాకమతియగు రంగమ్మ భార్య
వారికి బుట్టెను రామిరెడ్డియును § వరగుణనిధియగు కుమారకుండై
ఆ రాజితునకు భార్యసుంకమ్మ § వారికి బుట్టెను పుత్రుడేకరుండు
పరమసద్గుణుడు రామిరెడ్డినా § ఆరయనతనికి అంబమ నాగమ
వరసుతలై భువి వెలయగ బుట్టిరి § పరికించిచూడ నాగమ్మయందు
సరసుడు వేంకట సుబ్బారెడ్డియు § తిరుపతిరెడ్డియు దారగుణుండును
ధీరుడు వేంకటరామిరెడ్డినా § బరగిరి వేంకట సుబ్బారెడ్డికి
వరగుణయుతయగా వేంకటరామమ § దారయై వెలసె వారికి బుత్రుడు
వీరుడు వేంకటరంగారెడ్డియు § కరుణామయుండు నుద్భవమయ్యెను
తిరుపతిరెడ్డికి లక్ష్మీదేవమ్మ § ధరణి భార్యగా నయ్యె వారికిని
వరపుత్రికయయె జయప్రదమ్మన § తరుగని సౌశీల్యంబు కలిమితో
నాగమాంబకున్ వేంకటరమణమ § వగపులేని యంజమ్మ పుత్రికలు
నిగమవేద్యు డీవంశము బ్రోచుత § నిగ్గుమీర నా చంద్రార్కంబుగ

## శ్రీ అల్లూరు గ్రామము మాండ్రి పెద్దలింగారెడ్డిగారి
## వంశావళి

శ్రీ లక్షణంపు శిష్టావళికిని § చాలగ దాతల ధర్మంబులకును
మేలును గూర్చెడు అల్లూరునందు § తాలిమి కిరవగు మాండ్రివంశంబు
నాబరగె భువిని నచ్చువడంగను § ఆ బలీయమగు వంశంబందున
బ్రిబలుడు వేంగళరెడ్డి నా వెలయు § ఆ బలాఢ్యునకు భార్య అక్కమ్మ
ఆ దంపతులకు బుట్టె కత్తిరెడ్డి § మోదంబు మీర తల్లిదండ్రులకు
సాధుజనావన కార్యదక్షుండు § మేదుర తత్వజ్ఞాన నిలయుండు
ఆధీరునకున్ భార్య తిరుపతమ § సాధితసద్గుణ సంపద్విలసిత
బోధిత సత్యానందసుధానిధి § బంధిత యింద్రియ దుర్గుణయుతయున్

ఆయుగ్రమునకు బ్రాభవ మందెను § ధీయుతుండౌ పెదలింగారెడ్డి
ఆయెను శిష్యాను పరిత్రాణ వంశజు § డాయుతభుజు నాగలక్ష్మయ్యకును
ఆయురారోగ్య సంపద్యుక్తుడు § ప్రాయికవిద్యాగోష్ఠి ప్రియుండును
న్యాయమార్గావలంబనపుండై § దాయ జనముల గెలుచుండునై
పాయని బ్రాహ్మణభక్తిరతుండై § గాయక జనకులుపలుకు రాయడై
కవుల పాలింటి కల్పవృక్షముగ § భువిని యనాథుల పెన్నిధియనగా
అవిరళంబుగను భూతిదయుండై § ప్రియమున కీర్తిప్రకాశకుండన
ఆతనికి భార్య పుల్లమాంబ యాయె § అతులితప్రజ్ఞావిశేషమతియై
ఆతతభక్తి జ్ఞానయుక్తయన § నీతిపత్రపు నిర్మలబుద్ధి యుప
ఆపుణ్యదంపతుల కుద్భవించె § నేపుమీరంగ శివారెడ్డినా
కాపురంబు సత్ప్రవర్తనమునకు § గోపురంబునగు వినయావళికిని
ఆపుణ్యపురుషునకు భార్యయయ్యె § రూపొందు రామకృష్ణమ్మ యనగ
ఈ సద్వంశము ఆచంద్రార్కము § వాసిగాంచి భువి శుభప్రదంబై
ఆ సర్వేశ్వరు ననుగ్రహంబున § భాసిలు గావుత విఖ్యాతంబై

## శ్రీ ప్రాతకోట వేంకటరెడ్డిగారి వంశావళి

శ్రీ దేవుడు విశ్వేశ్వరమిత్రుడు § నానోపాసత నర్చించువారి
నే దారిని తా మలగకను చిరము § చేదోడిచ్చును మూర్తిశనంది
యా దేవుడె తనుభక్తి భజించిన § నాదేశత హృదయమ్ము నివసించు
గాదా యని యవ్వారు విశదముగ § నాదేశపురుషు జ్ఞానచక్షువున
తాము గన్నట్టి యఖిలస్వరూప § భూముల తత్వము బుధమండలి విన
నామబుద్ధి నద్యుక్తత గాంచక § నేమమంద వచియింతురు సత్యము
నావినికి గన్నవారలకెదూగ § పావనత మనమునను ప్రాతకోట
నావిదితపురమునకు నధికారత § తావలంబనము పారంపరేణ
ప్రాపంది యున్న పుణ్యభావహి § తోపకరణపరిభూతాంగుండును
చూపున క్రౌర్యము నిరసించి శమమె § దపు జేర్చుకొను యట్టిం వంశపు
చలివేంద్రి నుద్ధరింప తా నర్థి § పొలుపునను దోచు వేంకటరెడ్డియు
లలన అంబమ్మ కలభాషిణియయి § వలనెఱిగి విభుని నడ్డని శీలత
గల దా దంపతులకు సుతులు ముప్పురు § యలరుల చెలంగులను జననీజనకు
లను గూర్చువారు నామముల వరుస § గన మొదలు రాఘవేంద్రారెడ్డియు

వినయభూషణుడు విద్యాప్రసక్తి § దనర వెలయుచును పెద్దలను గన్న
తన మానసరంజనము వెలి బుచ్చు § ననఘు దాతంపు నాగలక్ష్మమ్మ
యనెడు గుణవంతురాలి నిల్లాలు § గను వడసి శ్రీనివాసరెడ్డిగా
తనయుని గాంచెను ద్వితీయుడగా § వనజాక్షు బొగడు కృష్ణారెడ్డియు
నవల జనితుండు రాం రెడ్డియును § పిం జెల్లె నిట్లు ప్రో సర్వత్ర
వెలయుదురు వీరు హానిదయుకలిమిని § యల వేంకటాఖ్య రెడ్డికి జనకుడు
తెలివిని సుజనులదీప్తి నట్టి § జలజాక్షు భక్తి నించునట్టి
యతడును వేంకటరెడ్డిగా మెప్పి § సతతవిఖ్యాతి గనినట్టివాడు
సతియు గుజ్జమ్మ సాధ్వీరాత్మ § సతి విభూతి గను దాన వరించెను
యతనికి నగుదురు జనపిజనులు § లలితసద్ధర్మ విభూషితాంగులు
ఘను లచ్చమ్మయు కొండారెడ్డియు § వనమాలి నెలవు వీరికి తీరంబు
గన జేయునంచి యాంధ్రింపు వాక్కుల § లను నింపు నూర్పు భాగవతమ్మును
విన నాశ్చర్యము గాంచు గేయుని § ననే వొందునట్టి దాని రూఢతను
ననుకూలమంద కొంతద్రవ్య మది § తను యశంబంద ధర వెలసె నతడు

## శ్రీ తద్దూరు పెద్దముంతల వేంకటరెడ్డిగారి

## వంశావళి

శ్రీ లక్ష్మీశుడు చిద్విలాసుండు § ఎలమి నిద్ధరణిని పెద్దముంతల
కులమునందు సద్భక్తమూర్తిగా § వెలసిన ఘనుడగు తిమ్మారెడ్డిని
నిలిపె నాతనికి ధర్మపత్నియై § మెలగె లింగమ్మ పతిభక్తియుక్త
వారికి జనించె వేంకటరెడ్డియు § గురుతర పుత్రోత్సాహము వెలయగ
గారవమ్ములకు విద్యాసమితికి § మేర మీరు వినయంపు భక్తికిని
కూరిమి తోడుత పట్టుగొమ్మ యయి § నారయ నుద్యోగమ్మున వెలసెను
ఆయన భార్యలు నాగమ రత్నమ § న్యాయశీలు రన ఖ్యాతివహించిరి
ఆ యనంతుదయ వారికి గల్గిరి § భయవిదూరుడగు ప్రభాకరుండన
ననఘుడు తిమ్మారెడ్డియు పుత్రులు § మనసిజాకారు లైన పుత్రికలు
వినయధురీణయు రాజమ్మ యనగ § వినతమాణిక్యమ్మ యనంగను
ఘనత దోపగను ప్రభావతమ్మయు § వినయవతియు నన సూర్యకాంతమ్మ
ఎనయగ నల్వురు తనయులు గల్గిరి § జనకుని యానందంబున నింపుచు
ఈ గేయగ్రంథమును బోషించిన § బాగైన వీరి వంశము పుడమిని
భోగముల మించు పొలుపొందు గాత § యా గౌరీశుని పరిపూర్ణకృపను

## శ్రీ మంద్లెము పొలిమేర రామయ్యగారి

## వంశావళి

శ్రీరమాధిపతి భక్తుం డనగను ॥ ధరణి పొలిమేర వంశజుండు నయి
పరగెను పుల్లయ పుణ్యాత్ముం డన ॥ వరించె నాతని వెంకమ్మ భక్తి
ఆదంపతులకు పుణ్యవశమ్మున ॥ మోదమలరు రంగస్వామి పుట్టె
నా ధన్యమతికి భార్య యల్లమ్మ ॥ ఆదరించునది యర్థిజనమ్ముల
వారికి నుదయం బందెను రామ యశసూరిజనవిధేయు డనగా వెలిసెను
పరగ నాతనికి నారాయణమ్మ ॥ వరుసతోడుతను భార్యగానయ్యె
సరసుడైన యా వరదంపతులకు ॥ నరుదుగ బుట్టును రంగస్వామియు
నరయ నాతనికి సుబ్బలక్ష్మమ్మ ॥ దారయై పరగె ధన్యురాలనగ
వారును గాంచిరి ఎల్లరత్నమ్మ ॥ వరగుణమణిని పుత్రిక యనగను
ఈ గేయభాగవతపు పోషణము ॥ సాగించినట్టి యా దానపరుని
నాగేంద్రశాయి సకలశుభంబుల ॥ బాగొప్ప నొసగి రక్షించు గాత

## శ్రీ కేశవరెడ్డిగారి నారాయణరెడ్డిగారి

## వంశావళి

### ( లింగాపురము )

శ్రీ మాధవుసతి చెల్వొసలారగ ॥ ఇమ్మహి కేశవరెడ్డి వంశమున
భీమబలుండగు వీరారెడ్డియు ॥ నా మహనీయుని సతి సరస్వతమ
వెలసిరి లక్ష్మీకేశవుల భాతి ॥ మెలగిరి గౌరీపరమేశులట్లు
కలిగిరి వారికి పుత్రత్రయమ్ము ॥ తలపగ జ్యేష్ఠుడు రామిరెడ్డి యగు
కలికి రాములమ యాతని సతియా ॥ పొలుపుగ పుల్లారెడ్డి ద్వితీయుడు
పొలతి యీశ్వరమ యాతని భార్యగ ॥ విలసిల్లెను పతిభక్తి మెరయుగ
ఆ దంపతులకు జననం బందెను ॥ మోదం బేపారంగ వారికిని
సాధువర్తనుడు సజ్జనప్రియుండు ॥ మేధశ్శాలియు వేంకటరామా
భిధాను డనగను ముద్దులకుప్పన ॥ బుధతోషుండను సుడి గాంచంగను
అరయగ వీరారెడ్డికి జనించె ॥ నారాయణాఖ్యు డెలమి పుత్రుడై
పరగెను నాతని భార్యయై ధరణి ॥ వరగుణరత్నము నాగసంజమ్మ
వారిరువురికిని నొదవెను పుత్రుడు ॥ శరసుండగు రామకృష్ణారెడ్డి
ఈ వంశము ధరనింపు దలిర్పగ ॥ భావము చేతోమోద మొనరింప
పావనత గాంచ నాచంద్రార్కము ॥ భావజజనకుడు రక్షించుగాత

# శ్రీ పోచా చిన్న నాగిరెడ్డిగారి
# వంశావళి
( పారమంచాల )

శ్రీ పద్మాప్రియు దయను జనించెను ॥ నృపమానితంపు పోచాకులమున
విపులశౌర్యుడగు వేంకటరెడ్డియు ॥ ఆ పుణ్యపురుషు భార్యసుంకమ్మ
వారికి నుద్భవ మయ్యె బోరెడ్డి ॥ శౌరిభక్తు డాతనికి నరసమ్మ
వరుస భార్యయై భర విలసిల్లెను ॥ వారికి బుత్రుడు చిననాగిరెడ్డి
కూరిమి యాతని భార్య యంబమ్మ ॥ వారికి బుట్టిరి ముప్వురు పుత్రులు
పరగ నాగేశ్వరరెడ్డి మరియును ॥ బరగ జనించెను రామిరెడ్డియున్
సరసగుణుండగు చెంచిరెడ్డియును ॥ సురుచిరగాత్రులు శుద్ధమానసులు
ఆ నాగేశ్వరరెడ్డి సతీమణి ॥ అనఘచరిత నారాయణమ్మ యయె
ఆ నయసంపన్నులకును బుట్టిరి ॥ ఘనత మీరగను బుత్రిక లిర్వురు
పొనరుగ నర్సమ సులోచనమ్మను ॥ జననుతుండు రామిరెడ్డికి భార్యగ
వినయశీలయగా వేంకటలక్ష్మమ ॥ ఆ నీతిపరులకును జనియించిరి
తనయులు వేంకటరమణారెడ్డియు ॥ ఎనయగ వేంకటరెడ్డి యనంగను
అనఘమతి చెంచిరెడ్డి యర్ధాంగి ॥ సునీతివ్రతయగా రామకృష్ణమ్మ
అనయము నీవంశమును బ్రోచుతను ॥ ఘనుడగు శ్రీహరి కారుణ్యంబున

# శ్రీ చింతలపల్లె యాలంపల్లి బాలవేంకటరెడ్డిగారి
# వంశావళి

శ్రీల జెన్నొందు నందనుల్లనా ॥ మేలిమిగోత్రము నందు జేర్కొనగ
యాలముపల్లియ వంశమందునన్ ॥ జాలుగ తిమ్మారెడ్డి పొడమెగా
నాతనికి బుత్రు డుదయం బందెను ॥ బాతకదూరుడు వీరారెడ్డియు
నాతనికి భార్య బంగారమ్మయు ॥ నీతివర్తనయు నిష్కపటహృదయ
ఆ దంపతులకు గలిగెను సుతుండు ॥ మోద మేపార నాగిరెడ్డి యా
నందమయుండగు నతనికి సతియయె ॥ నిందువదన నారాయణమ్మ సూ
ఆ పుణ్యాత్ములకును బుత్రులిరువు ॥ రపురూపసుగుణ తేజోదాత్తులు
నేపుమీరు బాలవేంకటరెడ్డి ॥ చూపుల దయగనెడు వీరారెడ్డి
ఆ వేంకటరెడ్డికిని సతి యయ్యె ॥ వేంకటేశు గొలుచు గోపాలమ్మ

ఆ విజ్ఞానులకును గల్గె భువిని * సవినయంబూర్వుడు రాఘవరెడ్డియును
వీరారెడ్డికి భార్య యీశ్వరమ * పరపత్ని యీ విమలవతి యున
ధారుణి యీ వంశమున్నతంబై * పరగెను గావుత వేంకటేశుకృప.

## శ్రీ అన్నమరాజు గారి కృష్ణమూర్తి

## వంశావళి

(పెనగొండ)

శ్రీ రమేశుదయ బోడమరాజను * పాకవంశమున నాగరాజునా
వరసుగుణమణికి వనిత పార్వతమ * నాదిపుత్రికిన్ సుబ్బరాయుడున్
సుతరత్నంబై చెలగను నాతని * కాంతాతిలకము భార్య నాగమ్మ
మతిమంతులైన వారికి బుట్టిరి * సుతలు నాగలక్ష్మమ్మ పార్వతమ
ఆ నాగలక్ష్మమాంబకు రామయ * మానసీయుండు భర్తగా నయ్యె
ఆ నయవిదుండు అన్నపురాజను * మానితంబందు వంశజనితుండు
మానుగ వారికి రామచంద్రయ్య * నా నెగడ కృష్ణమూర్తియు గల్గిరి
అల కృష్ణమూర్తి భార్య శేషమ్మ * లలితసుగుణఖని వారికి కొమరుడు
విలసితాననుడు రామసుబ్బయ్య * ఫలదాయకుడగు హరికృప గల్గెను
ఇల నీగ్రంథపు పోషణమ్మునన్ * మేలుగను కృష్ణమూర్తి చా జేసె
వెలయు నీవంశ మాచంద్రార్కము * సల్లలితంబుగ మాధవుకరుణన్

## శ్రీ పట్నం హరిహరనాధం గారి ఈశ్వరమ్మ గారి

## వంశావళి

(వడ్డమాను)

శ్రీకర పట్నం హరిహరనాధుని * ప్రాకటవంశపు దీపం బనగను
లోకరక్షకుని కారుణ్యంబున * నకలంకుడు చెన్నప్ప జన్మించె
ఆ కరుణామయు కాంతారత్నము * కోకిలకంఠపు భాగమ్మ యయ్యె
ఆ దంపతులకు పుత్రులిర్వురును * మోదంబొప్పగ బుట్టిరి వరుసగ
సాదరుండు ఓబులయ్య యనగను * బీదలపెన్నిధి నరసింహయ్యయు
ఓబులయ్యసతి చిట్టెమ్మ యయ్యె * అబ్బెను వీరమ నరసింహయ్యకు
ఈ భాగ్యవంతులకు జనియించెను * సౌభాగ్యయుక్త ఈశ్వరమ్మనా
ఆ సుమతికినిన్ స్వామిరావునా * భూసురభక్తుడు భర్తగా నయ్యె

వాసిమీార నీ వంశము బొ్రిచుత ॥ వాసవవందితు డురుతరకృపచే
భాసిల నాచంద్రార్కము మేదిని ॥ భాసురయశంబు నెల్లదీపింప

## శ్రీ కేశవరెడ్డిగారి అంకిరెడ్డిగారి
## వంశావళి
(సుబ్బారెడ్డి) వడ్డమాను

శ్రీ కేశవరెడ్డిగారి వంశపు ॥ రాకాచంద్రుం డనగను బుట్టెను
అంకిరెడ్డినా నతనిసతీమణి ॥ పొంకముగ నయ్యె అంబమ్మ యనగ
వారిరువురికిని పెదనాగిరెడ్డి ॥ వరపుత్రికుడై పుట్టెను నాతని
దార యంబమ్మ వారికి గలిగెను ॥ తరసుడు సుబ్బారెడ్డి యనంగను
భూరిదయాళుడు పుణ్యమూర్తి నా ॥ పరమదాతయున భక్తుండనగను
ఆ సజ్జనునకు భార్య సుబ్బమ్మ ॥ భాసిల్లు సుగుణములకు దావలము
వాసి గాంచె నరుల నాదరింప ॥ నసమానభర్తృసేవాపరతను
ఆ సుదంపతులకును జనియించెను ॥ వసుధను ధీరుడు నాగిరెడ్డి నా
పసమీారు నాతనికి నయ్యె భార్య ॥ సత్ సౌశీల్యపు గోవిందమ్మన
ఆ సుమతికి శివశంకరరెడ్డియు ॥ భూసురులయొక్క యాశీస్సులచే
వెస జనియించెను శంకరు కృప గన ॥ నసమానపూర్వపుణ్యావశమ్మున
ఈ వంశమ్మును నాచంద్రార్కము ॥ భావము సంతసమున బ్రోచుగాత
పావనచరితుడు పరమేశ్వరుండు ॥ ధీవిశారదుడు దివిజస్తోత్రుడు

## శ్రీ కేశవరెడ్డిగారి రామలింగారెడ్డి
## వంశావళి
( లింగాపురము )

శ్రీ కేశవరెడ్డిగారి వంశము ॥ నాకాధీశుని దయ భువి నెగడెను
ప్రకటమ్ముగను నా వంశమందు ॥ రాకేందువదనుడు చెన్నారెడ్డి
జనియించి కీర్తిసంపాదించెను ॥ ఆ నయగుణునకు భార్యబుచ్చమ్మ
వనితారత్నము వారికి జనించె ॥ ఘనుడునయిన పెద్దనాగిరెడ్డియు
అనఘమతికి నాతనికి చెంచమ్మ ॥ తనరగ దారాభాగ్యము నందెను
వారికి జనించె చిననాగిరెడ్డి ॥ సారగుణుండయి సంతోషమ్ముగ
చారుతరకీర్తిదాయిని లక్ష్మమ ॥ విరచితానంద శేషమ యనగను

పొలుపుగ భార్యలునై విలసిల్లిరి ౹ వెలయంగను రామలింగారెడ్డి
మేలుగ వారికి బుట్టెను నాతని ౹ పొలతులు శకుంతలమ్మ శంకరమ
శకుంతలమ్మకు స్వామిరెడ్డియును ౹ సుకుమారుడైన నాగిరెడ్డియును
శంకరమ్మకును చంద్రశేఖరుడు ౹ అకలంకులైన పుత్రులు గలిగిరి
రామలింగాఖ్యునకు సోదరుడయె ౹ విమలంపు హృదయుడౌ చెంచిరెడ్డి
కమలారూపిణి లక్ష్మీదేవమ్మ ౹ ఆ మాననీయునకు నయ్యె సతిగ
ఆ మహనీయుల కలిమినా జెల్లు ౹ గమాలలామగు నాగమ పుట్టెను
చెంచిరెడ్డి సోదరుడై యొప్పెను ౹ అంచితుడు నాగభూషణరెడ్డియు
మించు ప్రేమచే లక్ష్మీదేవమ్మ ౹ ఎంచగ నాతని యర్ధాంగి యయ్యె
నాగభూషణారెడ్డి కినుండిరి ౹ జగతి ఖ్యాతులుగ నాదిశంకరుడు
నిగ్గుమీద మధుసూదనరెడ్డియు ౹ నెగ్గులేని మతిమంతు డనంగను
బుధజనకల్పుడు సుధాకరరెడ్డి ౹ పృథ్విని వెలసిరి పుణ్యమూర్తులయి
ఈ ధరణిని యీ వంశము బ్రోచుత ౹ మధుసూదనుండు భద్రముల నొసగి.

## శ్రీ తద్దూరి పెద్దముంతల శేషిరెడ్డిగారి వంశావళి

శ్రీ యలరారగ తద్దూరునందు ౹ ఆయతపుకీర్తివంతమైన శ్రో
భాయమానముగ పెద్దముంతలా ౹ హ్వాయమున బరగిన వంశ మందునన్
భూషితవర్తనుడును కృపాళుడును ౹ శేషిరెడ్డినా వెలయు నాతనికి
యోషిజ్జనమణి నాగమ్మ భార్య ౹ శేషశాయి మది నిల్పి సేవించు
వారిరువురికిని బుట్టిరి పుత్రులు ౹ వారితశతుడు తిమ్మారెడ్డియు
సరసుండు స్వామిరెడ్డి యనంగను ౹ నారీరత్నము నాగమ్మ యతని
దారాభాగ్యము బడసెను వారికి ౹ సరగున బుట్టిరి ముఫ్వురు పుత్రులు
వరగుణుడు శేషిరెడ్డి యనంగను ౹ గురుభక్తియుతుడు రంగారెడియు
శ్రీ రామిరెడ్డి శేషిరెడ్డికిని ౹ భార్య వేంకమ్మ వారికి బుట్టిరి
సుగుణభూషణుడు దేవేంద్రరెడ్డి ౹ విగతకల్మషుడు జనార్దనుండును
నాగా శివవరలక్ష్మమ్మ యనెడు ౹ సుగుణి పుత్రిక యు బుట్టిరి ప్రియమున
ఈ గేయకావ్య పోషణకార్యము ౹ బాగొప్ప చేసినట్టి వంశమును
గంగాధరు డిల యాచంద్రార్కము ౹ రంగుమీరగను బ్రోచు గావుత కా

## శ్రీ పీరుసాహేబుపేట అలంపూరు పెద్దనాగిరెడ్డిగారి వంశావళి

శ్రీ మించు అలంపూరు వంశమున ॥ గామింపగ నవిశాకు గోత్రమున
ధీమించు రామిరెడ్డి జనించెను ॥ నేమంపుచర్య లింపౌన గూర్పగ
ఆ సుగుణనిధికి భార్య అంకమ్మ ॥ భాసిల్లు భర్తృపరిచర్యలందు
వాసిమీర నా యుగ్మంబునకుఁ ॥ రాసినొందు సుగుణుడు లక్ష్మిరెడ్డి
ఆ సజ్జనునకు వెంగమ్మభార్య ॥ నాశ మీరగను పతిభక్తియు క్త
పసమీర వారికిని జనియించిరి ॥ వెస నల్వురు పుత్రులు పేరు వడయు
భూషితచర్యులు పుణ్యపూరుషులు ॥ పోషితయాచకబృందులు నైరన
భూషణములునై కులమున వెలయగ ॥ దోషరహితులై ధన్యమూర్తులై
అందు రామిరెడ్డి పెదనాగిరెడి ॥ అందమును వంశమున కొడగూర్చును
సుందరుండు సువిచారపరుడు గో ॥ విందు చరణములు మది నిల్పువాడు
చిన్న నాగిరెడ్డి వేంకటరెడ్డియు ॥ పిన్నకుమారుండునునై వెలసెను
వన్నె మీరగను పెదనాగిరెడ్డి ॥ పున్నములప్రోవు దానముల నెలవు
అన్నీతిపరుని భార్యసాలమ్మ ॥ మిన్నయైన పతిభక్తి నింపునది
వెన్నుని కృపచే నా దంపతులకు ॥ నెన్నగ బుట్టిరి లక్ష్మమ్మ మరియు
ఎనయగ కుమార్తె బాలవెంగమ్మ ॥ గన నింపుగొల్పు లక్ష్మిరెడ్డియును
ఈ దానపరుడు ధీవిశాలతను ॥ మేదిని యీ గేయభాగవతమును
నుదారగుణమున దా బోషించెను ॥ మేదురయశంబు తా నార్జింపగ
సాదరంబుగను నాచంద్రార్కము ॥ మోదముల నిచ్చి దాత పెంపు గన
మాధవు డెలమిని రక్షించు గాత ॥ రాధాసహితుండై యింపు నింప

## శ్రీ సూరపురాజుగారి రామరాజు

## వంశావళి

(పీపనగండ్ల)

శ్రీకరంబుగను సూరపురాజను ॥ బ్రికటితంబందు నా వంశమందు
సౌశర్యమందు కాశ్యపగోత్రము ॥ నాకర్షింపఁగఁ బుట్టె సుబ్బయ్య
ధీరుఁడుదారచరిత్రుఁడు వీరుఁడు ॥ కారుణ్యమొప్పఁ జూచు వర్థులను
వీరివరుసవారెల్లరు దాతలు ॥ ధారుణి యశమునకును నీడుగొంద్రు
అతని కొమరుఁడు పెద్ద రోశయ్య ॥ యాతని సతియగు సాధ్వి ఎల్లమ్మ
పాతకరహితులు వీరికిఁ బుత్రుఁడు ॥ చూతకింపైన సుబ్బయ నాముఁడు

అతని భార్యయు ఎల్లమ్మ యగును ॥ చేతము విశుద్ధి గల్గిన దామెయు
వీరికి వీరయ రామరాజునా ॥ శూరసమగుత్రులు సుతు లిద్దరైరి
వీరయ పత్నియు పుల్లమ్మ పేరు ॥ సారధర్మరతి పతికి యనుకూల
వారికిఁ బుత్రులు వేంకటసుబ్బయ ॥ మీరిన నయగుణి యితని తమ్ముండ
పారధర్ముండు నాగరాజు నా ॥ వరగుణు లిద్దరు వరుసగఁ బుట్టిరి
వేంకటసుబ్బయ సతిగా వరించె ॥ శాంకరినిఁ గొల్చు నారాయణమ
శంకకింకలను బొంకముఁ గననిది ॥ యంక మందగనె నిద్దర పుత్రుల
వారు వీరేశమయ్య రామయ్య ॥ ఆ రమణీయులు పుత్రులుగ నందు
వీరేశమయ్య యను నా బాలునిఁ ॥ గోరఁగ నిచ్చెను దత్తపుత్రునిగ
పేరుప్రఖ్యాతి గన్న యెఱ్ఱమఠ ॥ పురనివాస వేంకటరమణయ్యకు
శారదమ్మయును వేంకమ్మ యనఁ ॥ గూరిమి సుతలుగ వేంకటసుబ్బయ
కే రహి వృద్ధిగఁ బొడమిరి ముదంబు ॥ జేరగ నా నాగరాజు సతియౌ
కమలాలయకళ కమలాక్షమ్మయు ॥ శ్రీమదొలపు నర్ధి జనుల పతిగూడి
విమలమతులైన యా దంపతులకు ॥ కమనీయమంద నీలమ కొమార్తె
ధీమహితాత్ముండా రామరాజు ॥ గారాబ మందఁగొనె రత్నమ్మను
సారమైన నియమవ్రతచర్యను ॥ దారను భార్యగఁ బూజ్యంపు నిధిగ
వారికి వీరేశమయ్య పుత్రుడు ॥ కూరిమి యాతని భార్య శేషమ్మ
వీరికి బిడ్డలు రత్నమ్మయును ॥ చారువు నింపెడు సుబ్బలక్ష్మమ్మ
ఈ భాగవతంబును రామరాజు ॥ శోభాయమానముగ పోషణకై
యా భగవంతునిఁ దలఁచి యొకకొంత ॥ దాభరించె ద్రవ్యంబు భక్తిమై
ఈ భక్తవరుల రక్షించు హరియు ॥ సౌభాగ్యవృద్ధి సంతు నింపొందు

## శ్రీ మద్దికుంట నాగిరెడ్డిగారి
## వంశావళి
### ( జి. బన్నూరు - తరిగోపుల )

శ్రీ రుక్మిణీశు నేపారుకరుణ ॥ ధారుణి కుంభాల గోత్రమందున
నారయ వేంకటరెడ్డి జనించెను ॥ సారగుణుండును సత్యాత్ముండును
బరగెను నాతని భార్య వీరమ్మ ॥ పరమ పతిభక్తి నిరతము సల్పును
వారికి బుత్రుడు నాగిరెడ్డి యన ॥ భూరిదయాపరతత్వమయుండును
దానపరుండును దారుం డనగను ॥ మానసీయుం డుమాపతిభక్తుడు
దనరగ వేంకటసుబ్బారెడ్డియు ॥ నన పుత్రు లిరువురును మరియు పుత్రి
కలు వెంగమ్మయు చిలుకలనాగమ ॥ వెలయగ జన్మించిరి సజ్జనులన

పలువిధంబులగు భాగ్యశాలియగు ॥ బలయుతుండు నగు నాగిరెడ్డికిని
భార్య శివమ్మగ వెలసెను సతమ్మ ॥ ఆర్యాదేవిని నారాధించును
కార్యదక్షులగు నా దంపతులకు ॥ పూర్వపుణ్యమున రామకృష్ణమ్మ
శంకరమ్మ యను పుత్రిక లిద్దరు ॥ పంకజనాభుని కరుణానిలయుడు
జంకని మతి రామచంద్రారెడ్డి ॥ వేంకటేశు సద్భక్తుడు నాగను
కొమరుడు గలిగెను ముదము దలిర్పగ ॥ అమలుడు వేంకటసుబ్బారెడ్డికి
సమమతి వేంకటసుబ్బమ్మ యయ్యె ॥ కొమరొప్పంగను కూర్మి భార్యయదె
ఆ పుణ్యదంపతులకు జనించిరి ॥ యేపుగను రామకృష్ణారెడ్డియు
రూపొందగ వేంకటరమణమ్మయు ॥ చూపుల గరుణను నెరపెడు వీరము
ఈ గేయకావ్య మింపుగ పోషణ ॥ భాగధేయమయి సలిపిన వంశము
గాంగేయుకరుణ గాచిన శ్రీహరి ॥ బాగుగ వెలయఁగ జేయు గావుతన్.

## శ్రీ పోచా చంద్రశేఖరరెడ్డిగారి

## వంశావళి

### ( పారమంచాల )

శ్రీ రంజిల్లగ ఆవాలగోత్ర ॥ పారంపరమున పోచావంశము
ధారుణి వెలసెను ఆ వంశమందు ॥ కారుణ్యాత్ముడు చెంచిరెడ్డినా
జననం బందెను ధర్మపరుండయి ॥ ఆ నయవిదునకు భార్య సుబ్బమ్మ
వినయవిధేయుత విమలమానసము ॥ పెనగొనంగ నాసతి యొప్పె భువిని
ఆ దంపతులకు స్వామిరెడ్డినా ॥ మోదమానసుడు కార్యదక్షుండు
పొందుగ నాతని భార్య నాగమ్మ ॥ డెందమందు పతిభక్తి నిండినది
వారికి గల్గిరి శంకరు కరుణను ॥ సరసుండు చంద్రశేఖరరెడ్డియు
వరగుణఖని శివశంకరరెడ్డియు ॥ వీరవరులునై పుత్రులిర్వురుగ
చంద్రశేఖరాహ్వయునకు సతి యయె ॥ నింద్రాణివలె యా సుభద్రమ్మ
భద్రములపేటి వ్రతములకు మేటి ॥ ఛిద్రముల మీాటు శుద్ధాత్మరాలు
ఆ పుణ్యదంపతుల కుద్భవించె ॥ అపురూపగుణుడు రాఘవరెడ్డియు
విపులమానసుడు శివశంకరునకు ॥ కాపురంబందె క్షేమమ భార్యగ
ఆ సుజనవరుల కుదయం బందిరి ॥ వాసిమీార నారాయణరెడ్డియు
భాసురగుణుడు సుభాషితరెడ్డియు ॥ భూషితచర్యుడు భూరిదయాళుడు
ఈ భాగవతము పోషణకార్యము ॥ శుభములు సెల్లగ చేసిన ఘనునికి
అభయదానముల ధర నొసగి ప్రోచు ॥ నిభేంద్ర వరదుడు సంతసమ్ముగన్.

# విషయసూచిక

—:o:—

## దశమస్కంధము - ( పూర్వభాగము )


| | పుటసంఖ్య |
|---|---|
| బ్రహ్మాది దేవతలు దేవకీ గర్భస్థుడగు దేవుని స్తుతించుట. | 10 |
| శ్రీకృష్ణావతార ఘట్టము | 12 |
| దేవకీదేవి స్వామిని స్తుతించుట | 14 |
| దేవకీవసుదేవుల పూర్వవృత్తాంతము | 16 |
| కంసుని పంపునఁ బూతన యను రాక్షసి వ్రేపల్లెకుఁ జనుదెంచుట | 25 |
| బాలకృష్ణుండు శకటమును దన పాదములచేఁ గూలఁ దన్నుట | 29 |
| తృణావర్తుడను రాక్షసుఁడు సుడిగాలియై కృష్ణుని నెత్తుకొనిపోవుట | 31 |
| శ్రీకృష్ణబలరాముల బాలక్రీడాభివర్ణనము | 35 |
| మృద్భక్షణ విశ్వరూప ప్రదర్శనాభివర్ణనము | 41 |
| యశోదానందుల పూర్వజన్మ వృత్తాంతము | 42 |
| శ్రీకృష్ణుఁడు దధిభాండ వికలనాదులు చేయుటవలన యశోద యతనివెంటఁ దిరిగి పట్టుకొనుట | 43 |
| యమళార్జున భంజనము | 46 |
| నందాదులు బృందావనమున కరుగుట | 50 |
| వత్సాసుర బకాసురుల వధ | 51 |
| శ్రీకృష్ణుఁడు గోపకులతో బంతిచల్దులు గుడువ వనమున కేగుట | 54 |
| అఘాసుర వృత్తాంతము | 55 |
| గోపబాలురు కృష్ణునితోఁ గూడి చల్దు లారగించుట | 57 |
| బ్రహ్మ గోవత్సములను గోపాలకుల నంతర్ధానంబు సేయుట | 58 |
| శ్రీకృష్ణ బలరాములను బ్రహ్మ దర్శించి నుతించుట | 61 |
| గార్దభాకారుండైన ధేనుకాసురుని బలభద్రుండు వధించుట | 72 |
| కాళియుని భార్యలైన నాగకాంతలు శ్రీకృష్ణుని నుతించుట | 80 |
| కాళియుని పూర్వకథ | 86 |
| గో గోప గోపికా సంఘమును గార్చిచ్చు చుట్టుకొనుట | 88 |

| | పుటసంఖ్య |
|---|---|
| గ్రీష్మఋతు వర్ణనము | 89 |
| బలభద్రుఁడు ప్రలంబాసురుని వధించుట | 90 |
| శ్రీకృష్ణుఁడు దావాగ్నిని మ్రింగి గో గోపక సంఘమును కాపాడుట | 91 |
| వర్షర్తు వర్ణనము | 92 |
| శరదృతు వర్ణనము | 94 |
| హేమంత ఋతువర్ణనము | 9[illegible] |
| గోపికా వస్త్రాపహరణము | 101 |
| మునిపత్నులన్నముం దెచ్చి శ్రీకృష్ణబలరాముల కిచ్చుట | 10[illegible] |
| గోపాలకృష్ణుఁడు గోవర్ధన పర్వతము నెత్తుట | 10[illegible] |
| శ్రీకృష్ణమూర్తి నందుని వరుణనగరమునుండి గొనితెచ్చుట | 11[illegible] |
| శరద్రాత్రిం గాన మొనర్చు కృష్ణుని సన్నిధికి గోపికలు వచ్చుట | 11[illegible] |
| గోపికా గీతలు | 12[illegible] |
| రాసక్రీడాభి వర్ణనము | 13[illegible] |
| జలక్రీడాభి వర్ణనము | 13[illegible] |
| సర్పరూపియగు సుదర్శనుండను గంధర్వుని శాపవిమోచనము | 13[illegible] |
| కుబేరభటుండగు శంఖచూడుడను గుహ్యకుని సంహరించుట | 13[illegible] |
| శ్రీకృష్ణుఁడు వృషభాసురుని సంహరించుట | 13[illegible] |
| శ్రీకృష్ణుండు కేశిని సంహరించుట | 14[illegible] |
| శ్రీకృష్ణుండు వ్యోముని సంహరించుట | 14[illegible] |
| అక్రూరుండు బృందావనంబున కరుదెంచుట | 14[illegible] |
| అక్రూరుండు యమునాజలంబుల శ్రీరామకృష్ణుల దర్శించి నుతించుట | 15[illegible] |
| శ్రీకృష్ణమూర్తి మథురానగర ప్రవేశము సేయుట | 15[illegible] |
| శ్రీకృష్ణుఁడు రజకుని జంపి వాయక సుదాము లొసంగు పూజల నంగీకరించి తే లొసంగుట | 15[illegible] |
| సూర్యాస్తమయ చంద్రోదయ వర్ణనములు | 15[illegible] |
| సూర్యోదయ వర్ణనము | 16[illegible] |
| శ్రీకృష్ణుఁడు కువలయాపీడమను గజంబును | |

| | పుటసంఖ్య |
|---|---|
| వధించుట | 162 |
| శ్రీకృష్ణ బలరాములు చాణూరముష్టికులను వధించుట | 163 |
| శ్రీకృష్ణుండు కంసుని వధించుట | 168 |
| శ్రీకృష్ణుండు దేవకీవసుదేవుల చెఱ మాన్పి యుగ్రసేనునికిఁ బట్టంబు గట్టుట | 170 |
| శ్రీకృష్ణుండు గోపకాంతలచెంతకు నుద్ధవునిఁ బంపుట | 173 |
| భ్రమరగీతలు | 176 |
| శ్రీకృష్ణుం డుద్ధవునితోఁ జేరుకొని కుబ్జాగృహంబున కేగుట | 180 |
| శ్రీకృష్ణుం డక్రూరుని హస్తినాపురంబునకుఁ బంపుట | 181 |
| జరాసంధుఁడు మధుర మీఁద దండెత్తివచ్చి కృష్ణునితో యుద్ధము సేయుట | 185 |
| శ్రీకృష్ణుండు నిరాయుధుండై కాలయవనుడు వెంటనంటఁ బరుగెత్తుట | 192 |
| ముచికుందుని పూర్వకథాభివర్ణనము | 194 |
| ముచికుందుఁడు శ్రీకృష్ణుని స్తోత్రము సేయుట | 196 |
| జరాసంధుఁడు ప్రవర్షణగిరిని దహించుట | 198 |
| రుక్మిణీకల్యాణ కథాప్రారంభము | 200 |
| శ్రీకృష్ణుండు కుండిన నగరంబునకు రథారూఢుండై చనుట | 208 |
| శ్రీకృష్ణుండు శత్రురాజులు చూచుచుండ రుక్మిణీదేవిని గొనిపోవుట | 211 |
| సహోదరుని భంగమునకు ఖిన్నయగు రుక్మిణీదేవిని బలభద్రుం డూరార్చుట | 218 |
| శ్రీకృష్ణుండు రుక్మిణీదేవిని బెండ్లి యాడుట | 219 |
| దశమస్కంధము (ఉత్తరభాగము) | 221 |
| రతీదేవి ప్రద్యుమ్న సహితయై గగనమార్గమున ద్వారకకుఁ బోవుట | 225 |
| శ్రీకృష్ణుండు లోకాపవాదనివృత్తి కొఱకు శమంతకమణిఁ దెచ్చుట | 227 |
| శతధన్వుఁడు సత్రాజిత్తునిఁ జంపి మణి నపహరించుట | 283 |
| శ్రీకృష్ణుం డింద్రప్రస్థపురంబున కరుగుట | 289 |
| శ్రీకృష్ణుండు కాళింది, మిత్రవింద, నాగ్నజితి, భద్ర, లక్షణ, యను వారలఁ బరిణయం బగుట | 241 |
| శ్రీకృష్ణుండు సత్యభామతోఁ గూడ నరిగి | |

| | పుటసంఖ్య |
|---|---|
| నరకాసురుని వధించుట | 245 |
| సత్యభామ నరకాసురునితోఁ యుద్ధంబు సేయుట | 247 |
| భూదేవి శ్రీకృష్ణుని స్తుతించుట | 250 |
| శ్రీకృష్ణుండు పదాఱువేల కన్నియల వరించి దేవలోకమునకుఁ బోయి పారిజాతము దెచ్చుట | 251 |
| శ్రీకృష్ణుండు పారిజాతము దెచ్చుట | 253 |
| శ్రీకృష్ణుండు కేళీగృహమునందు రుక్మిణీదేవితో విరసోక్తు లాడుట | 255 |
| రుక్మిణీదేవి శ్రీకృష్ణలాలితయై యతనిని స్తుతించుట | 257 |
| బాణాసురుం డీశ్వరప్రసాదంబు నొందుట | 265 |
| బాణాసురుం డనిరుద్ధుని నాగపాశబద్ధునిఁ జేయుట | 278 |
| నారదునివలన ననిరుద్ధుని వృత్తాంతమును విని కృష్ణుండు బాణాసురునిపై దండెత్తుట | 279 |
| బాణాసురునకు సహాయుండగు శివునకుఁ గృష్ణునకు యుద్ధమగుట | 282 |
| బాణాసురుండు రెండవసారి యుద్ధమునకు వచ్చుట | 286 |
| శివుండు బాణుని రక్షింప శ్రీకృష్ణుని స్తుతించుట | 287 |
| ఉషానిరుద్ధసహితుండై కృష్ణుండు ద్వారకాపురంబున కరుదెంచుట | 289 |
| నృగమహారాజచరిత్ర | 290 |
| బలరాముఁడు సుహృద్బంధుజన దర్శనార్థమై వ్రేపల్లెకుఁ బోవుట | 293 |
| శ్రీకృష్ణుండు పౌండ్రకవాసుదేవుని మీఁద దండెత్తిపోయి వానిం జంపుట | 297 |
| బలరాముండు ద్వివిదుఁడను వానరుని సంహరించుట | 301 |
| బలరాముండు హస్తినాపురమును గంగలోఁ ద్రోయఁ బూనుట | 303 |
| షోడశసహస్ర స్త్రీసంగతుఁడైన శ్రీకృష్ణుని మహిమ నారదుం డరయుట | 307 |
| జరాసంధ భీతులయిన రాజుల పంపున విప్రుండు కృష్ణుసన్నిధి కేతెంచుట | 313 |
| నారదుండు శ్రీకృష్ణునితో ధర్మజు రాజసూయము నెరవేర్పుమని చెప్పుట | 314 |
| శ్రీకృష్ణుం డుద్ధవుని యాలోచన చొప్పున | |

| | పుటసంఖ్య |
|---|---|
| ధర్మరాజుపాలికిఁ బోవుట | 316 |
| పాండవులు శ్రీకృష్ణు నెదుర్కొని తోడ్కొని పోవుట | 318 |
| ధర్మరాజు శ్రీకృష్ణు ననుమతంబున భీమాదుల దిగ్విజయంబునకుఁ బంపుట | 320 |
| శ్రీకృష్ణభీమార్జునులు జరాసంధుని వధింపఁ బోవుట | 322 |
| ధర్మరాజు చేసెడు రాజసూయమునందు శ్రీకృష్ణుండు శిశుపాలుని వధించుట | 328 |
| సాల్వుండు శివప్రసాదంబున సౌభకవిమానంబు వడసి ద్వారకాపురిపై దండెత్తుట | 339 |
| శ్రీకృష్ణుండు దంతవక్త్రుని సంహరించుట | 346 |
| బలరాముండు తీర్థయాత్రకుఁ జనుట | 348 |
| కుచేలోపాఖ్యానము | 353 |
| శ్రీకృష్ణుండు సకుటుంబముగా గ్రహణస్నానమునకుఁ బోవుట | 361 |
| లక్షణయను శ్రీకృష్ణునిభార్య ద్రౌపదీదేవికి దన వివాహవృత్తాంతంబుఁ దెలుపుట | 367 |
| నారదాదిమహర్షులు శ్రీకృష్ణదర్శనంబు చేసికొని వసుదేవునిచేఁ గ్రతువు చేయించుట | 369 |
| శ్రీకృష్ణ బలభద్రులు మృతులైన తమ సహోదరులఁ దెచ్చి దేవకీదేవికిఁ గనఁబఱచుట | 375 |
| సుభద్రాపరిణయము | 379 |
| శ్రీకృష్ణుండు ఋషిసమేతుండై మిథిలానగరమునకుఁ బోవుట | 380 |
| శ్రుతిగీతలను పరమతత్త్వార్థ ప్రతిపాదకమైన పురాతనేతిహాసము | 384 |
| పరీక్షిత్తునకు శుకయోగి విష్ణుసేవా ప్రాశస్త్యంబు చెప్పుట | 390 |
| భృగుమహర్షి త్రిమూర్తుల ప్రాశస్త్యంబు | |

| | పుటసంఖ్య |
|---|---|
| శోధించుటకుం బోవుట | 395 |
| శ్రీకృష్ణుండు మృతులయిన విప్రసుతులఁ దెచ్చుట | 396 |
| ఏకాదశస్కంధము : | 408 |
| వసుదేవునకు నారదుండు పురాతనంబగు విదేహార్షభసంవాదంబుఁ దెల్పుట | 412 |
| బ్రహ్మాదిదేవతలు శ్రీకృష్ణుని వైకుంఠమునకుఁ బిలువ వచ్చుట | 425 |
| శ్రీకృష్ణుండు దుర్నిమిత్తంబులం గని యాదవుల నెల్ల ద్వారకనుండి ప్రభాసతీర్థమునకుఁ బంపుట | 425 |
| కృష్ణుండుద్ధవునకుఁ బరమార్థోపదేశము సేయుట | 426 |
| అవధూత యదుసంవాదము | 428 |
| భిక్షుగీత | 434 |
| పురూరవగీత | 440 |
| శ్రీకృష్ణబలరాములు వైకుంఠమున కరుగుట | 448 |
| ద్వాదశస్కంధము | 451 |
| యుగధర్మ ప్రాకృతాది ప్రళయచతుష్టయ వివేచన | 458 |
| పరీక్షిత్తు తక్షకునిచే దష్టుండై మృతి నొంద నతనిపుత్రుండు సర్పయాగము సేయుట | 463 |
| శ్రీ వేదవ్యాసుండు వేదములను లోకమునకుఁ బ్రవర్తింపఁ జేయుట | 467 |
| మార్కండేయోపాఖ్యానము | 470 |
| చైత్రాదిమాసంబుల సంచరించెడు ద్వాదశాదిత్యుల క్రమంబును దెలుపుట | 474 |


సమాప్తమ్.

---

శ్రీ గణేశ శారదా గురుభ్యో నమః

# శ్రీమదాంధ్ర గేయ మహాభాగవతము.

## దశమస్కంధము — (పూర్వభాగము)




మదాద్రిమ! వసుంధరాభరణ! । భీమదైత్యనిర్మూల! భవతరణ!
కామారి చాపఖండన! ప్రవీణ! । నామపవిత్రామరవినుతచరణ!
రాజీవనయన! రమ్యకిరీటవి । రాజమాన! భూనాథ! గిమేశా!
హే జయప్రకాశ! జగద్వినుత! హరి । రాజధరార్చిత! రాకేందుయశా
దాశరథీ! రఘువంశతిలక! గుణ । రాశిపి శేషత నిన్నాశ్రయించు
నీశరణము సూ! నిఃఖేదపదము । నాశుభంకరము లన్నిటి గదించు
దేవ! నిన్నుమతియందు నిలుపుకొని । భావము శుద్ధిగ భాగవతంబును
పావనాతిశయ భాగ్యము కరతల । మౌ విధాన ధర్మమున కది మూల
మౌనని యద్దానిని గేయరూప । మౌన సజ్జనుల హృది బింబింపగ
నేను రచించితి నన దగవు గంటి । వే నమస్కృతుల నీదయమె తోడు
శ్రీ నరసింహుడ నే నీదాసుడ । నానవ్యసరణినైన యీభజన
మానసుధీజన పఠనమున నంద । మాను సకలజ్ఞ వినుత! తత్వజ్ఞ!
దశమస్కంధం బిది కృష్ణచరిత । విశదఫణితి శ్రీ పోతనకవీంద్రు
వశమునందె కీర్తింప పద్యముల । దశదిశల యశము వడసె నాంధ్రమున
నది కృతిమెట్టున బహుళాంచితముగ । ముదము భజింపగ షడ్విధానుగతి
నొదవగ నాడిన నా మహన్మూర్తి । పదిలమున మదిని నిలిపి లిఖించితి
శ్రీకృష్ణా! జగదీశ! పరాత్పర! । శ్రీనిలయా! హే దేవ! భయాపహా!
ప్రాకృతులైనను భవాబ్ధిమునుగరు । భక్తిచేత నినుమ్రొక్కి భజించిన
దుష్టభంజనా! కష్టనివారణ! । ఇష్టదాయకా! ఈశ! ముకుందా!
శిష్టజనాదరణేచ్ఛ పృథివిపై । తుష్టివిరియ జన్మింతువు ముదమున
దేవాగ్రణి! నిను దీర్ఘతపమునను । సేవించియు గనె పావనత్వమతి
త్రోవ యిదియ మాకంచు మునీంద్రులు । భావమున నిలిపి పటిమను గాంచిరి
అవల యుగములను నది బెడిదముగా । భవము సార్థకము జేతు మెటులో నని

ప్రవిమలాత్ములౌ పెద్దలు కొందరు ఽ భువిని భక్తియే నిలుప సమమనిరి
దనుజ మనుజ సురలాదిగ సర్వులు ఽ వినమిత శిరులై విష్ణుని నిన్నున్
అనయ మర్చనల కీర్తనాదులను ఽ మనము జొనుపగా నైనను ధన్యులు
కాన మురారీ! యేము నిన్నుమతి ఽ లోన దలంచియు మానుగ బలుకుచు
గానమొనర్తుము కంసదమన! హరి ఽ కంజనేత్రా! కరుణాకర! శ్రీశా!
మందరధర! మహనీయ గుణాకర! ఽ సుందరాంగ! సుస్థిర! సర్వాత్మా!
ఇందుధరార్చిత! చెందజేయుమిక ఽ ముందు భవము మాకందని పథమును
నందసుతా! మునిబృందలోల! యా ఽ నంద విజయముల బొందింపుము నీ
యందు భక్తిచే నిందలి సుజనులు ఽ సందునిడక గోవిందా యందురు
ఆదికాలమున నజుని జేర్చితివి ఽ వేదతతుల మీనావతారమున
సాదరమున సుధ నిర్జరులకు నిడ ఽ మోదమైన తాఁమేటివి యైతివి
తదుపరి సవనపు కిటిరూపమునను ఽ ముదము జెఱిపితివి కనకాక్షుని యా
తదుపరి నరహరి వయ్యు జీరితివి ఽ అదురుబాయ ప్రహ్లాదుని జనకుని
అదితికి వామనరూపునఁ బొడమియు ఽ గదిరించితి నా బలిని సురలకై
కుదు రడంచితివి క్రూరనృపవరుల ఽ నెదురులేని శూరతను రాముఁడన
దశశీర్షు నతనితమ్ముని దుర్మదు ఽ దశరథరామాఖ్యను బరిమార్చితి
యశమున బలరాముఁడు నాఁబరగియు ఽ దశదిశలం గలఁ గుటిలుల నడచితి
అరిసూదన ! యో యబ్జనేత్ర ! హరి ! ఽ కరుణాకర ! నర సఖ ! దేవకిసుత !
పరమపావనా ! పద్మాధీశా ! ఽ పరిరక్షింపుము భక్తజనుల మము
కాపురుషసంగతుల దింపంచిన ఽ యా పరమగుణులు శౌనకాదిమును
లేపున నుబ్బున హరికథ లడిగిన ఽ నాపక్షమంది సూతముని వలికె
శ్రీ పరాశరుని మనుమని శుకముని ఽ నాపరీక్షితుం డనఘుః డడిగె నిటు
పాపహారము వినుడయ్యా యజ్ఞత ఽ బాపుమనము సిరి ప్రాపుకోపుగొను
మన మవియుఁబొగడ మలయుకలికలఁత ఽ మనువు పునీతము మరలజన్మ నహి
ఘనుఁ డాశుకముని జనవరునికరుణ ఽ గనుచుండ వినఁగ నిటుపృచ్ఛఁజేసె
తెలియనయ్యె శశి తరణి కులనృపుల ఽ తెలివియు ధర్మము దయాపరత్వము
గలిగినపదములు గాంచుసుఖమ్ములు ఽ గలవవి యున్నియుఁ గల్మషరహితము
ఏలాపుట్టె! మహాత్ముఁడు విష్ణువు ఽ లీలను వసుదేవునికి దేవకికి
బాలరూపు నడలెట్లు ? ఆమీద ఽ కాలచర్య లేపగిది విశాలము
చాలని వచింప రమేశచరితల ఽ నోలిని వీనుల విందు మానింప్ర!
భవరోగౌషధ మవును హరిస్మరణ ఽ చెవులకు చిత్తమునకు చవులుపెంపు

సవిధిన్నఘములు సమయు ముక్తాత్మ | లవల నివసించు పదము నిచ్చునది
తవులు దలగించుఁ దాపములశంతు | నవయించు దుష్ట కర్మలఫలముల
గవయించు శుభము లంద సుగుణముల | పవిత్రమతి నే సిద్ధిగని కుడుచు
నీలవర్ణుఁడు కాలరూపగుణ | జాలముల పెక్కు దోఁచి జన్మాదు
లోలిగలిగించు నన్నియుదొలఁపును | మేలుగ ముక్తిని గూర్చుఁదలఁపునను
అయ్యా! నాదగు తాతలు కృష్ణుని | చేయూతలఁ గొని కాదె వెలయుటలు
కయ్యాలను భీష్మాదియోధులను | కడిమిబాపియును ఘనయశముఁగొనుట
ఆ యుద్ధార్ణవమునను నావగా | నా యుమేశవందితుఁడె ముకుందుఁడె
సాయమయ్యె నా వారితప స్సది | యే యమేయు సత్పూత్రి సుకర్మగొ
నన్ను నాజనని గర్భమునందున | గన్న ద్రౌణి బ్రహ్మాస్త్రతాపమును
సన్నబుచ్చి వంశాభివృద్ధికయి | మిన్నదయను నాచక్రి బ్రోచుటయు
నెటులో వివరముగా వచింపుమా | కుటిలభయదుఁడౌ కృష్ణునికీర్తన
తోటి గీటడఁతు నాటినవెత నీ | బోటి గురుసదరి గంటిధన్యుఁడను
నీదు వదనకమలమ్మునఁ బొడమెడు | వాదరహితమగు హరినుతియమృతము
గాదా? యది నే గ్రోలెద నింకను | బోదు వాంఛ యద్దాన శ్రమదొలఁగె
చేదని సంసృతి సుఖముల వీడితి | నీదయాపరత వేదనదూరము
మోదమానె నను నాకలిదప్పియు | లేదు మనములో నూనితి హరి విన
లో యంతఃకరణాది సుస్థితుల | నీ యెల్ల వెలిని కాలగుణాదుల
బాయక లోకంబులను లోకాళి | కా యారాధ్యుఁడు సర్వము గూర్చును
జననస్థితి లయముల గూర్చుబాపు | మనమున నిహాపర విధిని నెరుంగగ
యనువుఁగన సంసృతిని బంధముక్తిఁ | దనరొందు పట్టులను నిచ్చునతఁడె
మును వినిపించితి రోహిణి సుతుఁడని | ఘనుని బలుని మరి దేవకి సుతునిగ
వినఁగ నద్భుతముఁగద! మహాముని! | వనమాలి నందురాణి యశోదయు
తనకు మాతగా ననువెటుల గూర్చె? | వనజ నయనుఁ డెటుఁ జేరె నందుపా
లనమున దా నుండుట యెన్నియేండ్లు? | వనిత లెంద రాయువు మితమెంతో?
హరి తాను మేనమామనుఁ గంసునినిన్ | బరిమార్చెడి కార్యమ్ములెట్టులో?
దనుజుల బొరిగొను టెట్టుల దరిసెను? | వినుపింపు మంత వేడ్కను వినియెద
ననగ శుకుం డాదరమున నృపు గని | జననాథ! విష్ణుకథల ప్రసంగతి
ననువున ప్రశ్నోత్తరముల నుభయులు | వినువారందరు ఫలమున సములే
గంగాజలముల నంగదోషతతిఁ | బృంగించుఁ దమ్మునమ్మి బృంగిడిన
అంగార పటవి నెండినమ్రాకుల | రంగేదినటుల నఘముల మలపును

విష్ణుధ్యానము విష్ణుపది మునుక | లుష్ణకరు రాక తమంబడఁగునటు
వృష్ణి కులోత్తముఁడైన శ్రీశునుతి | కృష్ణావతారచరిత వినజెల్లు
రాజవరా ! విను, దనుజులు క్షితిలో | రాజనామములఁ బొడమిధర్మముల
రాజి జెఱచి, సజ్జనుల నదల్చిన | ఓజఁబాసి యెటనేని డాగి రా
క్రూరమతులు దన్నేల ధరణియును | భార మోర్వకను గోరూపముతో
వారిజాసనుని పాలమొరయిడిన | కారుణ్యమొప్ప క్షితి నూరడించి
వారిజనయనుని గాంచ సురలతో | దారిబట్టి యొకచోటఁ దపంబున
పరమపురుష సూక్తంపు మంత్రమ్ముల | వరుసఁ జదివి నియమమునఁ దా నుండ
హరి సంతసిల్లి యబ్జజుని గని యిం | పరసి మేల్బలికె నవి తాను వినియు
సురలకు ధరణికి హితవు యిదంచని | మురువుగన వారికెల్ల జెప్పె నిటు
మీరు సురలు యాదవులుగఁ బుట్టుఁడు | జేరు హరియు వసుదేవుని సుతుఁడన
కూరిమితో సురకన్యలు సుందర | నారులయ్యు శ్రీదేవునిఁ గొల్వుఁడు
శేషుఁడు రాముఁడు నాగఁబుట్టి మీ | ద్వేషులఁ జంపును హరికి సన్నమై
దోషహారి శ్రీ మాయాదేవియు | వేషమందు పుడమిని సత్యంబిది
యంచుజెప్పి తననెలవుం జేరెను | మించు వేడ్క వాణీశుఁడు సురలును
కించిన్మతిఁ బోఁదోసియుఁబుట్టిరి | మించుబోడులై రమరకన్యకలు
వసుదేవుఁడు దేవకుని కూతురిని | కుసుమశరుని మాతను మించురూపు
అసమానసుగుణ యతివినయశీల | అసురారినిఁ దన కడుపుననుఁ బుట్ట
నోముఁ గనిన చానను దేవకియను | నామెను పెండిలి యాడి భార్యయుక్
మామ యరణముగ నిచ్చిన భూషణ | దామాదుల మరి రథముల హరులను
గరుల సుందరులఁగరము ప్రేమఁ గొని | తేరునెక్కి తన వీటికినై వడి
మీరఁబోవు నుత్సాహ మందుతను | జేరవచ్చె కంసుడు మరదియు సం
తోషము తోడను సోదరిదేవకి | తోషితయును గా సొం పది గాంచి వి
శేషం బిదియని వసుదేవుడు సం | భాషణ సల్పిన నతనికె మెప్పుగ
హరుల పగ్గముల కరమున దా గొని | పరమమంగళము వారికి దోపగ
భేరి మురజముల గూడిన మ్రోతల | తేరికి సారథి తానై హయముల
దారములను వదలియు రొప్పుచు నటు | దారితీసి తీవ్రతను బోవునెడ
నేరమోయి! యోయుగ్రసేనసుత ! | దూరమహాకాలమున ఫలమిది విను
నీదుసహోదరి దేవకి సూనుడు | జోదుయగుచు నిను జంపు నష్టముడు
మీదట దప్పదు సూ యని మిన్నున | నాదమొకటి బుట్టంగ విని నతడు
బెగ్గడిలియు నత్యుగ్రుడయ్యె హా ! | లగ్గగు నీమోము నంచురాగ నా

కెగ్గుగల్గు కారణమయ్యె నిచట ఽ నుగ్గడించె నాకాశంబారా
మ్రొగ్గజేతు నీకామిని నిపుడే ఽ తగ్గు భయము నాకెదు రెవ్వం డిట
నిగ్గునో యని తేరాపి యొర వన్న ఽ జగ్గుఖడ్గమును గైకొని సోదరి
డిగ్గజేసి కోపమున కొప్పునున్ ఽ వెగ్గలిపాటున బట్టె వెలదియును
అగ్గలమగు భీతిని వణంకుచును ఽ నగ్గోలున విభుకడకను గోరుచు
తన్ను జంపకను మాన డన్న యని ఽ ఖిన్నత నందిన తనదేవిని గని
విన్నదనముతో కంసుని డగ్గరి ఽ తిన్నగను బల్కనెంచి జడియకను
మన్నింపదగిన నిర్మలపు మృదుల ఽ నెన్నికలవిక్క గన వతసికనియె
అన్నవు నీ వీవిధమున గూర్తువె? ఽ కన్నియ దుఃఖము గాంచవ? శూరుల
మిన్నవు బలిమిని కలిమిని యశమును ఽ గన్నవాడవే! భోజరాజ! నా
విన్నప మింకిట వినుము చెల్లెలిని ఽ మన్నింపుము నొకమాట నీభయము
సన్నగిలునుగా మిన్ను వాక్యముల ఽ నెన్ననేల యేవన్నె పలుకో యది
యరులెవరు గూసి రొక్కొ మాయగొని ఽ దరికి రాక వెనుపున నదృశ్యతను
పరువుజెడరె నిను కడిమిని నెదురగ ఽ ధరణిని మగడవు నీవు నీ సములు
బెరలు నీహితులు దనుజులకు దొరలు ఽ వరుసగ నీమామయు బంధులట్లు
నరయుము మనమున నరులకపట మిది ఽ దురమునను పారుబోతుల చెయువిది
ఇట్టివాడు నాయన్నయంచుమది ఽ దిట్టమందు నీ యబలను సద్గుణ
మట్టి జెడగజేయకు మన్నరో! నీ ఽ మెట్టుదాట నుపమను జింతింతము
మానుము జంపుట తగ దపకీర్తియె ఽ మానకున్న విను ధీరు నిను జేరు
గాన కరుణచే గావుము కలికిని ఽ మానసమున నీమనువు కుశలమగు
మీననేత్రి! చింతించు నెల్లపుడు ఽ నేన యందులకు పూటయగుదు నీ
యాన సత్యమునె నేను వచింతును ఽ మాను కొంత యాలోచన జేయగ
మానినిజంపుట నీకు బోల దెటు ఽ దాని విమర్శన నే సలిపితి నిటు
ఉత్తముడవు! గుణకోవిదుండవును ఽ రిత్తజేతువే చిరయశంబుధర
చిత్తగింపు నామాటలన్నియును ఽ మత్తు విడువు కోపమున గలిగె నిది
చావుకు భయమును జెందరు విజ్ఞులు ఽ నీవ విజ్ఞుడవుగాదె ధర్మముల
త్రోవలన్నియును దెలియు నీకు గద? ఽ నే వచించగా నేల ఐన వినుము
మేను గలుగు జీవాళుల తప్పక ఽ నాని యుండునో మృత్యువు దృఢ మిది
గాన పుట్టుక లవెట్లును జెడునవె ఽ కాని కాలమది దరియగ నైనను
పుట్టుక తోడనె పుట్టు చచ్చుటయు ఽ గుట్టుగాదు గురియింపబోము, అది
యెట్టుల దప్పదుగాదె కంసనృప! ఽ యిట్టులగుట కర్మముల ఫలంబగు

కర్మయనగ తెమ్మొందు తమసేత ƒ ధర్మ మధర్మము నానడక నెల్లు
మర్మమేల నదె వృద్ధి క్షీణములు ƒ నిర్మలమతిచే నిజముఁ గను మధిప !
కీడులు మేళులు తడవ తడవ నిడు ƒ తోడున నవ్వల జన్మాదులకదె
కూడును జీవుఁడు దాన నూతఁగొన ƒ పీడఁదగదు ధర్మంబు మేలొసఁగు
కీడు దప్ప నిను నావాక్యాత్రము ƒ పోఁడిమి నీకగు వినుమింక నొకటి
యజునకునుగాదు కర్మఁ దప్పకొన ƒ త్రిజగము లాతని సృష్టిలోనివా
నిజముగ మన మద్దానసె పుట్టుక ƒ త్యజము సేయ నోపముగ నొందునది
గాన ధర్మరతినూని కలంగుట ƒ మానినను నీకు జయ మెటిగించెద
నో నయనిపుణా! యను సంబోధన ƒ గా నమ్మ బలుకుచును మానసమున
ధృతి నూని మింట వెడలిన ధాటిని ƒ సతిగర్భజుండు యష్టముడగు గా
మృతి నితనికిచ్చు నతఁడు బుట్టవలె ƒ వితథము గాదా యశరీరవాణి
మతిమంతులు దైవమున భారనిడి ƒ వెతలందుచుంట గడప సమర్థులు
అతిశయ భాగ్యమునంద తమ బుద్ధి ƒ రతి యెందాకను బాగుచుండునో
యందాక విడరు యత్న చయంబుల ƒ ముందెన్నికలను మోలెను నిల్పుచు
ముందున్న దైవయోగంబది యే ƒ చందాన నుండునో తెలియరెవరు
అనుచును దనలో, నొక యుపమునెంచి ƒ వనితకు బ్రతుకును గూర్ప నతనికనె
తను మధ్యఁగన్న సుతుల వందటిని ƒ గొనివచ్చి యిత్తు కొమ్మను విడుమా
జననాథా ! నా బావమరందివి ƒ ఘనుడవు మనెదవు చింత బో విడువు
గనెదము శుభముల నిపుడు ముందుగతి ƒ కనువగు మార్గము యోచింతమింక
దైవము మనపరమైన యడ్డముల ƒ నే వైపుననో దొలగు నిశ్చయము
ఆవల సంగతి మన కిపుడేలా? ƒ యీవనిత కంటిధార మరల్పుము
బాలురను శత్రుకోటిగ దలచిన ƒ నేలకు జేర్చుము గాద బ్రతికించి
యేలికవై నీవేలుము వారిని ƒ పాలుగొను యశము పుణ్యము నినొ్న
బావా! యని తిన్నగను సన్నిధిని ƒ తోవదెలిసి పూజించి యతని మది
సావకాశముగ బ్రసన్నముం గా ƒ బ్రోవగు పలుకుల జొనిపి చేసాచె
నవు డుగ్రసేనసుతుడు కంసుండు ƒ సపరిపాటి విని వసుదేవునివా
విపులార్థములును దోపు వచనముల ƒ నిపుణత నమ్రత ననర్మమర్మము
రిపుజయంబు పుణ్యంబు యశంబును ƒ కపట రహితమును తను జేసుట గని
కోపమొక్కింత తగ్గ చెల్లెలిని ƒ చూపుల నిప్పుల మాయఁ జూచుచును
యాపన్నరక్షణము ధర్మమన్న ! ƒ నాపట్టునె చింతించి సతి విడిచె
శ్రీదేవుని మును పూజలు సలిపిన ƒ నాదివ్య చిత్తులను భయమంటదు

గాదా? క్షితిపా! సిద్ధి యటులుండు § నీదు చిత్తమును ఈదెస నిలుపు
మనమున నొకవిధి ధృతిని నటుగాంచి § గుముకున నింటికి జేరెను కంసుఁడు
ఆనకదుందుభి తన కాంతను గని § మనల దరిజేర్చె భగవంతుఁడు హరి
యూ నిర్మలాత్మ బాగడుచు మనదగు § పూనికల నెల్ల విధి కల్పింతము
దేఱుకొనుము సతి! ప్రోచును దైవము § కాఱియబెట్టును కరుణాపరతను
దేఱిచూడ వాపదలు పుణ్యాలను § తాఱుమాఱు లవి కర్మవశంబులు
అనుచు నా వనజముఖిని నూరార్చి § ఘనత నిలుపుకొని గనెను తనగీము
దేవకీదేవి ప్రతివత్సరమును § భావపరిశుద్ధి పుత్రుల వెస గనె
పావనంపుమతి పతిబాంధవ హిత § సేవల మెప్పును బ్రియమును వడసెను
వెలది తొలుత గన్నట్టి సూను గొని § కలక నందబోకను వసుదేవుఁడు
విలసనరతి యా సత్యమునందే § పొలుపుగ నచలిత ధైర్యస్థితి గనె
కంసుని జేరియు సుతు నప్పగించి § నీ సుకృతమందు గాక యో బావ!
అంసమిది తలపు నాటిప్రసంగము § హింస నీపరము గాకుండు నెఱుగు
అలుకు విడిచి యీడింభకు గొనుమని § పలుకు దిగుగకను బలికిన శౌరిని
దిలకించి ధీరతను గాంచి, మెచ్చి § తలయూచి, మనమువి స్మయవశముగ
పినపాపడు నావైరిగాడుగా § కెనుక గొని చంప వీని గొనిపొమ్ము
ఎనిమిదవది యగు దేవకిగర్భము § నను బుట్టు శిశువు నావైరి యగును
దునుమగఁ జూతును వాని నే డేల § గొన నలుక వెఱపుఁగలుగ దిద్దాన
విను మికఁ బుట్టెడివారిఁ దేవలదు § నునికిఁ జెఱుతునే నష్టముని సుమ్ము
కనరు నీకు నిడ నిను శ్లాఘించితి § మనికి సార్థకము నీ చర్య గన్న
నిన్నుఁబోలు సుగుణంపు మానవుని § ఎన్నడేని నే గానఁబోయి రా
యన్న! నాత డాబాలకుని గొనియు § తిన్నగను మరలి నిజతలము జేరి
వారిజనేత్రికుఁ జెప్పె కంసునుడి § క్రూరు డెప్పు డేపగిది చరించునో
సారవచస్స్థితి పారము నిలుపునో § బీర మదెటులో గాని విధి చాలు
నారయుదగునని యాదంపతులకు § నారదు మోదము ముందుగతి నెంచి
మనమున వినుతిని వనజదళనయను § ఘనకృపఁ బైకొనగాఁ జలుపనైరి
వినుము నృపాలా! యవల నార్వురిని § తనయులఁ గనె నా తరుణీలలామ
వనజభవుని సుతుడైన నారదుఁడు § కినుక రేప నాకంసుని జేరెను
మునుకొన యొకనాటను నిటులనె § వినతుడైన యాతనికి భీతిగా
నీవు దనుజుడవు నీహితులందఱు § దేవవైరులే జగతిఁ బుట్టితిరి
గావున మిమ్మట గీ టడంప వసు § దేవుని సుతుడగు గోవిందుఁడు విను

ఆనకదుందుభి మొదలు యాదవులు ఽ మానినులు సహా నమరులెల్ల రను
మాన ముంపకుము నందు డాదిగా ఽ వానిహితులు సుతులంద రా పగిది
భూమిని దేవాంశలఁబరఁగిరి మీ ఽ నామము లడంగ నేమ మంది శ్రీ
కామునిఁగొల్చిరి పేరుపూర్వమున ఽ నా మహాత్ముఁడే యష్టముఁడగు నీ
సోదరికిఁ దేవకికి సిజం బిది ఽ నీదుపయిని నెనరున నేఁ జెప్పితి
గాదె రహస్యము పోకడ జాగ్రత ఽ నూడుకొనుము ధృతి కాలనేమియను
వీరుఁడవౌ నిను నారాయణుఁడే ఽ పారద్రుంచెఁ దనచేతిఖడ్గమున
సురలకు మీకును నయిన పోర తొలి ఽ యురసితినయ్యది యేఁదెలిపితి నిక
పోయివత్తు మరి జెప్ప నొకప్పుడు ఽ బాయువలదు ధైర్యంబు కార్యమున
కాయజ జనకుని మఱవ కతఁడె నీ ఽ బాయు సుమీ పరికింపుమంతటను
ఆ యనఘుమూలు నంగముధర్మము ఽ నీయదురుపాటు నను తాఁ దోపును
అనుచుఁజెప్పి తా నరిగె యథేచ్ఛను ఽ కనలు రెట్టిగా కంసురిడపుడే
జనకునిపదవిని బాపి యధిపుడయి ఽ కను కెంపున బంధించె సోదరిని
నామెపతిని మరి వారిసూనులను ఽ బ్రామె ఖడ్గమున దయఁదలఁపక నీ
భూమి నాకు నెదు రొడ్డెడివాడును ఽ లేమిగ గంటిని ఖ్యాతి బలిమియును
నారదుండు నే డాడె విపర్యయ ఽ మార యంచు తనవారినందరినిఁ
జేరఁ బిలుచుకొని యహితుల నందఱ ఽ జీరఁ గ్రమ్ముకొనె బాణ భౌమ ధే
నుక ప్రలంబ చాణూర ముష్టికుల ఽ బక మాగధ పూతన కేశి మొదలు
వికటు మహాశను ద్వివిదు నరిష్టుని ఽ పీక వెలయు సుడిగాలి రక్కసుని
శకటుని దుండగునిఁ మరికొందరి ఽ సకుటిలులగు దుర్మతులఁ జేర్చుకొని
వారు వీరు నా వారు పెరలనక ఽ కారుబెట్టె తనవంశసంబంధ
వీరులనెల్లను నందు యాదవులఁ ఽ గేరిపోరు క్రమ్మించిన భీతిని
వారుబారి నిషధాదిదేశముల ఽ దాఁరిరి కొందరు నతని శరణనిరి
వదనరుచులు వెలివార యథవులయి ఽ పదవులు వదలియు సదనభేదముల
కుదురు జెడిరి భోజాంధకవృష్ణులు ఽ ముదమంది రెల్లయెడల దనుజతతి
నదను యిదియ యని మాయాదేవిని ఽ సాదరంబునను బిలిచి యిటు లనియె
దేవి దేవకీగర్భములో నా ఽ దీప్తి చెలంగెడు శేషుసిబింబము
నీవు గొనియు నారోహిణి కడుపున ఽ తావు నేయుమా! వెలఁది వసుదేవు
యువతి మందలో నందునిప్రాపున ఽ తవిలియున్న దా నందునిరాణికి
నీవు శిశువుగా జననమందెదవు ఽ నేను దేవకీ దేవికిఁ బుట్టఁగఁ
దలఁచితి భూమిని జనులందరు నిను ఽ వలఁచినకోర్కుల నొసఁగుమాత వని

దలఁచి నుతింపుచు కానికలు బలులు § గొలఁదికి మించఁగ నిచ్చి మ్రొక్కెదరు
మోదమందు నీనామము లీయువి § పాడుకొనుచు విను పరమపావనీ !
భేదరహిత, యఘనాశని, విజయయు § నాదిశక్తి, నారాయణి, శారద,
యంబ, యంబికా, మాధవి, వైష్ణవి § కంబుకంఠి భవహారి చండికయు
నంబరచరనుత, దుర్గ, కృష్ణ, మో § యార్యాకన్యక, యీశాని కుముద
వీరదైత్య సంహారిణి, కాళీ, § ఘోరరూపి సతి, పరమేశ్వరి నా
సారభక్తి పూజింతు రిగాక యన § నా రమణి మ్రొక్కి యానతి వసతిని
నాతి దేవకికి నేడవగర్భము § పతనమయ్యెఁ జో యని పౌరులు పలు
గతుల వాకొనఁగ నట రోహిణిసతి § సుతుని గనునటులఁ జేర్చెను దేవియు
వనిత యొకనాటి శుభమైనవేళఁ § గనియె సుపుత్రుని ఘను నాదిశేషు
బలమున మీరుట బలుఁ డననొప్పెను § లలిని రెండు గర్భముల కర్షణను
పిలువ నయెను సంకర్షణుఁ డనఁగా § కల జగములకెల్లను రమణుఁడగుట
వెలసెను రామాఖ్యయు నాతనికే § కలిగె కాలాన మరికొన్ని పేర్లు
అంతట నానకదుందుభిమనమున § జింతించెను శ్రీధాముని కేశవు
కంతుజనకునిఁ బరముని కమలా § కాంతుని నిశ్చలు నిశ్చలబుద్ధిని
మానసమున సేవించి తేజమును § మానిని దేవకిగర్భంబున నిడ
దాను వెలిగె ప్రాక్సతిపూర్ణిమదినమున § దా నాచంద్రునిఁ దాల్చినట్లుగా
విమతులమోములు వెలవెలఁబారఁగ § విమలాంగిమోము నావిధ మగపడె
కుమతులకీర్తుల వెల్లనల్లగా § సుమగంధికిఁ జన్నులమొన లిట్లయె
పట్టు నదుష్టుల గీముల ధూమము § బుట్టునట్లుగాఁ గోమలియారున
బుట్టె రోమముల చాలు శత్రువుల § కట్టెతిండి యిక గిట్టదు గానన
బుట్ట దింతికిని నన్నముపై మతి § మట్టిపైన వాంఛయునుఁ బొడమెను
తట్టెశ్రమయు నా తన్వికి రిపులకు § నట్టికష్టములు సంధిలు నాగను
జడతయు నావిధి సమము గన్పడియె § కడుపున శ్రీహరి నిలిచి నెగడునెడ
చెడుగులంద ఆక గుడుతురు వెతలన § పడఁతిపతిహితపుబోధ వెత విడిచె
పంచభూతపరివేష్టితుఁడౌటను § మించు కుతుకమున నదియు హరిని సే
వించవచ్చెనన జేరె దేవకిని § ఎంచఁబోలు నిటు వేడుక వినుమా
చెమ్మటసలిలము తేజము తనురుచి § కొమ్మయూరుపులె పవన మనంగను
యెమ్మెలాడి నడుమది బలియుటయే § సుమ్మగ గన పరివేశపు చొప్పది
మన్నురుచిగొనుట మహిలోనఁ జొరుట § చిన్నెలయ్యెనిటు గర్భచిహ్నములు
వన్నెల నీవిధిఁ గాంచిరి దివ్యులు § కన్నులపండువుగా నాలలనను

దేవకితను వటు దీప్తిసహించఁగ । దీప్తు లుసిగె దుష్టాంగన లందఱు
నావలంచి కొలనూలు బిగువుగా । ఆవైళము పరసతులకు సడలెను
నెలకంతికి ... లు పెద్దదిగ । తులువలనాగల కడుపులు జారెను
నెలఁతికు నా ... నాలులోప్పపెరి । నెంతుల ... స్యవి వెడలుతరుణమయె
వాలఁతికిఁ బ్ర... బాధ్దులు వృద్ధిగ । ఖలుల వల్లభల విధవలు గానగు
నెలలు దిన ... లు డగ్గరియెను శ్రీకచెలువుఁడు దేవకిగర్భమున వెలుఁగ
కుటిలునిలోకలి విస్మయోలెమరి । ఘటములోని దీపంబుచాలునను
కటువుగొన్న కంసునియింటను నాకకుటిలాలక చెఱసాల నుండెగా
ఇట్టిచిత్రలిపి గాంచెనుకంసుఁడు । బుట్టెనప్పుడు బహుభయ మాతనికిఁ
దట్టకద్దిరా కాంతకుఁడుఁగు నాకదట్టపుధైర్యము పా తెగలించెను
మున్నగర్భమున యిట్లుండదు చెలికగన్నదీప్తి నాకన్నులబరువై
యున్నది యనాది మొనిమిదపచూలు । వెన్నుఁడు లోపల నుండె నొక్కా నే
నేమిసేతు నిక యెయ్యది దలతును । కామినిఁ జంపగాదు గర్భవతి
నామనంబు ధర్మంబు దెగడదుగ కనామరహితమా జంప యశము రమ
బ్రతికియు చచ్చినవాడె యగును దన । బ్రదుగునకై బంధుగుల హితుల నా
బ్రదుకుల బాపిన నదిగాక నఘము । పొదిగొని చుట్టును దుర్భావంబది
యనుచు కలత మన మందున గాంచియు । తాను క్రూరతకు దారక శూరత
నూని మానినియు ప్రసవించినంత । దనుజుఁడు బుట్టిన శిశువునంచు నె
ల్లపుడును హరి తనవైరియె యనెడి తలపునను దిరుగుచు నుండె భీతుడయి
ఎపు డేపగిదిని తనను దునుమునోకరిపుని నేమాఱగఁ దగదె నే ననుచు
నడఁచు నెడనుఁగూర్చున్న లేచుతరి । గుడుచుకాలమున శయనమున నిద్ర
దడను గొనియు గోపించుచు నలుగును । కడకమూని దడబడుచు నితరముల
వినుట కనుట సోకుటల మూర్కొనుట । జనులతోడ దా బల్క దలంచుట
యనెడు వానినన్నిటను నాహరిని । కనుల గనినటుల బెగ్గడిల్లు నృప !
మనసునకును జ్ఞానేంద్రియమ్ములకు । నైన శబ్దగంధాదు లవెల్లను
వనజలోచనుని తను చేయిదమనియు । కన నతనిమహిమలని నిశ్చయించె
అంత బ్రహ్మరుద్రాదిసురలు హరి । సంతసింప స్తుత్సి చెంగటికి.

-: బ్రహ్మాది దేవతలు దేవకీ గర్భస్థుడగు దేవుని స్తుతించుట :-

వింతనొందగా వచ్చి గర్భగు నసనంతుని మదిలో నిలుపుచు మ్రొక్కిరి

సత్యమూర్తి! యో సర్వేశాచ్యుత! । నిత్యవిమల సర్వజ్ఞ! పరాత్పర!
నిత్యనియమముల నారాధింతుము । పృథ్వీవాయు పరిపూర్ణమైన నిను
కాలత్రయములఁ గదలని వాడవు । గల భూతమ్ములు గలుగు తలమ్మవు
నీలవర్ణ! నీవే యై వానిలో । నిలువ నమరి యుని మరలిన లోలోన
వెలసిన పురుషా! సమదర్శనముచు । గలవానిగ నిను దెలిసి బాగడ మా
తలన నానా మాయావేష్టితుని । గల నేతరముగా దెలుపాపతి!
విబుధులు పెక్కగు గతుల నారియాక్షి గుబురుకొన్నట్టి మాయను గెటియు
దబదబ సంసృతినన్నియుఁ దెగకోయు । గబగబలనిన్ను సేవింతుము సూ
పాదు ప్రకృతి సంసారవృక్షమున । ఫలములు రెండగు సుఖదుఃఖమ్ములు
వేదవినుత మూడై నగుణములే । వేరులు నాలుగు రసములు ధర్మము
ఖాములు నై దింద్రియములు నెరుకగు । మీద నారు మోహామ్ములూర్మ్ములు
నాదగు గాదా! శాంతా! యనంత! । ఏడగు మే తోడలు నిన్న బాగడ
యెడునైన ధాతువ్రజ మై పొరలు । జూడగ ఎనిమిది ప్రకృతులు నై దగు
జాడలు భూతము లటు బుద్ధ్యాదులు । కూడ కోటరములగును రంధ్రములు
తొమ్మిది పది పత్రములు ప్రాణములు । ఇమ్ముగ నన్న పక్షులు జీవేశులు
నమ్మికముగ నీకృపఁ గలుగు మనును । గ్రమ్మరు నది యటు జేయగ ప్రభుడవు
మంచి వారికిని మంగళ మిడగా । కించన్మతులను కొంచపరుపగా
నెంచి జగమ్ముల బుట్టుక గందువు । సంచితాఘ సంహారకక్షితిధరా!
నీపైఁ దమమనములు నిల్పి పొగడ । ప్రాపొందువు సద్బంధువు పోలెను
యాపై భయములు బాసి సౌఖ్యములె । కాపుగ మనెదరు కరుణాలవాల!
అన్ని యాశ్రమములందు ఘనమతులు । నిన్నె దలపగా శుద్ధులు శిష్టులు
భిన్న రహితాత్మకులు సాత్వికులుగ । నెన్నబడుదురా తనువులు నీయవి
సత్వగుణము నీగాత్రము సుస్థిర । తత్వమది యు విజ్ఞానపూర్తి మి
త్రిత్వముతో దీపించునందు సహాసనత్వంబున నీవెలయుటయు గలదు
పలుకుల దలపుల కవ్వల దెలుపుగ । గలుగు నిన్ను గుణజన్మ కర్మలను
వలపులేని నీమాపు మేలిమిని । దలతురు పెద్దలు భవముల గాదను
మిన్న మన్నగానక యుంటిమి మేరమిన్ననాళ్ళలిము గంటిమి నీకృప
సన్నగిల్లు సకలంపు వెతలు వినుకగన్న నీవెలని ధన్యగుణమాన్య!
పుట్టువులేని తలంబు నెలవు గరొన్నట్టి నీవు యిట బుట్టుట క్రీడగ
దట్టుగాని యది మాయచేత నిను । జుట్టుట గాదో పీతాంబరధర!

మాయ మము జుట్ట పుట్టితిమి మేము § మాయందు భక్తి గలిగ బుట్టమిక
మాయింపుము కంసారి వైఖలుల § మా యగచాటులు మాయమగు దాన
ముద్రించఁబడె నీలోకము దుష్టుల § నిచ్చలోన జింతింపు వేగిరము
ఇచ్చఁ దోలుపు సుర శాత్రవు లందఱ § మచ్చికఁ గావుము సురల మునుల నిక
విచ్చేయు మింక తల్లి జఠరమున § నిచ్చ నివసింపనేల? మహాత్మా!
అచ్చెరు వదియగు నమరులకు మాకు § చెచ్చెర గీములఁ జేర మ్రొక్కులివె
మీన, కూర్మ, కిటి, నరహరి, వామన § ఘన హయగ్రీవ, క్షితిదేవభర్త!
జననాథ రూపముల దయను మేలు § గన జేసితి వింతకును గొలుతు మని
యంచు నుతిసలిపి దేవకిని గనియు § మించుబోడి! జనియించు వెన్నుఁడిక
జించు ఖలుల భయపడకుమమ్మ! యని § మించు కుతుకముల నెలవులఁ జేరిరి
పంకజాక్షుడట బుట్టు తరుణమయె § సంకటమాయెను తరుణి దేవకికి
సంకట మణగెను సత్పురుష తతికి § సంకటములు విపులములు పాపులకు

## -: శ్రీ కృ ష్ణా వ తా ర ఘ ట్ట ము :-

వెలఁది కది యణఁప వైకుంఠుఁడపుడు § దలఁచె క్షితిపైనఁ దాను రతిగూడ
జలధులు చంద్రునిగాంచి చెలఁగు క్రియ § జలదములు నలరి కలరవము లఱుమ
అల గ్రహములు శుభదృష్టులఁ గాంచఁగఁ § గొలఁకుల కమలపు సిరులు రహిగనఁగ
దారలు కాంతిని మిగులఁ జెన్నొంద § పారె నదులు నిర్మల తోయంబుల
పారతరంబుగ వీఁచె గాలియును § మీరి వెలిఁగె హోమాగ్ని నెలవులను
వసుమతి నెల్లెడ విస్తరిలె ముదము § కుసుమ ఫలమ్ముల విహంగ రుతముల
నసమాన శోభలందె వనమ్ములు § దేసలు తేజరిలె సురలు పుష్పముల
గురిసి రపుడె హరి బుట్టె దేవకికి § సరస నతుల గంధర్వులు వాడిరి
వరుస నచ్చరలు నృత్యము సల్పిరి § భేరు,లాదివాద్యంబులు మ్రోగెను
చారణసిద్ధులు గాంచి రభయముల § శౌరిపుట్టుకను స్వారు లిటులయ్యె
పౌరులెవ్వరికి దెలియ దా పురిని § హరిమాయవశతనందరు సుప్తులు
గాగను యుద్ధమరేయికాలమున § నా గజగమనకు నుద్భవించెగా
నాగశయను డా నాగధరుడు హరి § వాగీశుని జనకుండు విష్ణుడును
నల్లని దేహము జలధరంబువలె § కొల్లదయను చూపులుగల కన్నులు
నల్లన విచ్చిన కమలమ్ములవలె § చెల్లుచున్న యానాలుగుచేతులు
తీవి యొదవు కరితుండములవలెను § తేవ గలుగు శంఖమ్ము చక్రమును

తావి జిలుకు పద్మంబును గదయును । వాల్చి కంఠమున కౌస్తుభమణి రం
జిల్ల నెదను శ్రీవత్సలాంఛనము । వల్లె పసిండిది నొప్పగ శ్రీప్రశ
నుల్లసిలెడు కుండలములతోడను । నెల్లదిశల వెలిగించు మకుటమును
వెల్లుమణుల వైదూర్య నీలముల । నెల్లగాక కేయూరహారములు
వల్లగనిడు కటిసూత్రకంకణము । లెల్లయంగముల రుచిరము నొందగ
నవతరింప వసుదేవుడు బాడగనె । దేవదేవు జగదీశుని సూనుని
పావనచరితుల పాలినిధిని శ్రీదేవివరుని ఘను నిర్మలధాముని
గాంచి తనువు బులకించగ నుబ్బుచు । మించుభాగ్యదశ గంటి నేననుచు,
నెంచుచు స్నానము నెటుల జేతునని । యెంచి కుతుకమును పెరధి మునిగితి
చాలునదియె యీయదనున కంచని । చాలహర్షమును బొందియావులను
వేలుపదియు భూసురులకు నిత్తును । మేలుగలుగు కాలమ్మున ముందట
నని యాబాలుని జేరి తేరజూ । చిన దోచకు యెదలోన పాప డీ
యన నలుమొగముల పాపనిగాంచిన । వానిబోలియున్నాడు నిజంబిది
సాగిరిమ్రొక్కియు లేచియు నిలబడి । వేగము కరముల శిరమునను జేర్చి
రాగరహితజనబంధుడు విష్ణుడు । యోగిహృదయ సంచారుండితడని
బాగడదొడగె నాతని మూలచరిత । ఖగపతినెక్కెడు ఘనుడు వినె నదియు
భోగవిరమణుల మతిక నెక్కనది । త్యాగరహితు లాదారి బోనిమది
నీవు యుగమ్మకాదివచలుడవు । దేవ! సర్వమున దీపింతువుగద
పావనాత్మ! హరి ! పాపవినాశా! । తోవ దెలుపు నీతావుజేసుటకు
ఏను నిన్ను నిఖిలాత్మనిలయునిగ । జ్ఞాననిధివి యానందమూర్తి వని
మానసమున మరి మాయాదూరుడ । వైన సంతతుడవనియు దలతు గో
పతివినుతా! నిను సూనునిగా గన । నే తపంబు నాకు నూత యయ్యెనో
యతిజనపోషా! యత్యద్భుత మిది । మతిమంతుల కావిధి విశదమగును
త్రిగుణాత్మక ! యీప్రకృతిని బొందియు । త్రిగుణకలితమా జగముల లోపల
తగినవిధముగా జేరియు వెలియై । నగవు దనమునన్ గుదురుగ నుందువు
జేరియు జేరకయుందు పెట్లనిన । గురువులవలనన్ దెలిసితి పొగడెద
నారదాది మునిమానస నిలయ! విచారమాన్య ! దేవా ! భవహార ! హరి !
నీరజేక్షణా! నిర్గుణ ! సూక్ష్మపు । తరము లయిన భూతముల యునికివై
పారబుద్ధి నరయంగ పదియునన్ । యారు వికారము లవియు నాకృతిగ
పరమాత్మ ! విరాట్పురుషాఖ్యుడ! యని । జేసు దశమగవి వానినంటకను

దూరగుడవు నీవై తివనియు పది ƒ యారు వికారములందు ప్రకృతిచే
జేరుపడియు నొక్కటి యన్నియునగ ƒ యిరుపదేనుగా నందు వెలయుదువు
పరుడవందు నను పరమపావనా! ƒ పురుషోత్తము! సర్వంబు నీవెగా
ఆత్మవలననే యమరు శరీరము ƒ లాత్మకంటె వెరగావు యనిమూఢు
ఆత్మవిదులు దెలియుదురు దీనివశ ƒ అబ్ధిరాజపుత్రీశ! యధోక్షజ!
గుణము వికారము కోరికలులేక ƒ గుణాది చిహ్నాల మాయ నిను జేర
గుణవికార కోరికెల మూటిచే ƒ గుణాదిగా యాజకములు వెలయగ
దేవసేవకుల శౌర్యపు చెయువులు ƒ భావింపగ నాప్రభుని పక్షముగ
సద్వర్తనంబు నీయందె యొప్పు ƒ యావన్మ్నచాలు లవియెల్ల వెలయు
నా విశేషతను గుణవర్ణంబుల ƒ నీవరుస రక్త శ్వేతనీలముల
నీవలయు వాని మూడింట నంద ƒ నవ్వాసికెల్ల నద్భుతంబంద
నీవు ప్రాపువగుదువు దైత్యుల నటు ƒ కావర మడపగ బుట్టెద వీశా!
నీవు బుట్టుటయు దెలిసె మింటిచే ƒ తీవరంపు పగబూనె నీకయిన
నీయన్నల దునుమాడెను కంసుడు ƒ ఈ యింటను బంధించెను మమ్ముల
నీయుదయము విన్నంత వచ్చునిట ƒ నే యుపాయమున నీవు జరింతువో
యానతిమ్ము నే జేకునెనడి తరి ƒ సూనశరుని గురుగన్న తల్లి యగు.

### -: దేవకీదేవి స్వామిని నుతించుట :-

మీననయన వసుదేవుప్రియాంగన ƒ సూను డనంతుం డని నమ్మిపొగడె
నానోములెల్ల దొల్లివి ఫలించె ƒ నో నలినానాభ! నాకు తనయుడవు
నే నీభక్తిని సన్నుతింతు విను ƒ మన్నా! గుణసంపన్నా! యనంత!
నిన్ను నమ్మియే తరింతులార్యులు ƒ సన్నగాని యోగమ్ముల తపముల
మిన్నభక్తి భిన్నంబుగానిమతి ƒ మిన్నయైన నీ నిజతత్త్వమ్మును
చింతలన్ని విడనాడి యీశ్వరా! ƒ సంతతము నిన్ను సర్వాత్ముడ వని
ఎంతు నిన్ను నాపతివలనను విన్న ƒ వింతరూపు నత్యంత పవిత్రు
అట్టి దిట్టి దనరాని యాకృతిని ƒ యెట్టి విమర్శపు పట్టున జూచిన
మొట్ట మొదలు తుదిలేక వెలుగు గని ƒ పెట్టలేరు బ్రహ్మాదులునైనను
నీక గానియు నెల్లపుడు నొక్కటిగ ƒ నే కలిగియు నిర్విశేషమయ్యును
యొక్కటైన పని లేక యుండునది ƒ వాకొన మాకును గాదనియె శ్రుతులు
జ్ఞానరూప! యధ్యాత్మదీపమవు ƒ నీనందనుడగు విధి పరద్వితీయ

న యర్థంబు తుది నీజగములు ఽ తానదాని మాయంగ బిగు వెడలి
భూతగణము సూక్ష్మమగు భూత ఽ మునజేరగ నది ప్రకృతిలోపలను
ముగా నది వ్యక్తమందు జొర ఽ బో నది నహిగా శేషుఁడవు నీవు
విశ్వమును లీలనుదిరిప్పుచు ఽ నిర్వికారుడవె మాయకు బంధుడ
ము శాశ్వతమైనకాలంబు ఽ సర్వమును మాపు కేషంబు నీవె
ఁడు విశ్వేశుఁడని నిన్ను దలఁచు ఽ భువిని వాడె యభయుండు ముక్తుండు
జనముఁను జయసౌఖ్యస్థిరముల ఽ దవిలి మృతి గనఁడు చిరమును శ్రీగను
రాగముల గంటిమందురు పురాణ ఽ యోగులు నిక్కము గాన రావిధము
గుగ నెఱిగితి భక్తిచేత నిను ఽ భోగివాన్పునగు వాని కృపాళుని
లగంటి నీకన్నులు మాంసపు ఽ కనులగుట జూడ జాలవుగ నిన్ను
జ్ఞానాంబక మావశ్యకముగ ఽ గనజాలితి మాధవ! మనుజరూప
న మేలుగూర్పనెంచి తనయుఁడవు ఽ నిను దీననైతి పలు కాదరింపు
నుడ! నీతేజమును దాపమింక ఽ జనతతి మూఢత గన లేరు నిన్ను
రిక్కదను విశ్వగర్భ! నాగర్భ ఽ మక్కజముగ నీచచ్చుట యెట్లొకొ?
మెంచినను నిదియొక మాయయె ఽ చక్కని మూర్తివిస్వామి యచంచల
నశుభాంగ! శ్రీసంగ! ముదిత జను ఽ దినకరాభ! యీదినము శుభదినము
ు నీమాతగదలప ననువైన, మును ఽ కొన్నపూజ నాపాలిదేవా
గును! నీ జనులపగలు దొలగెను ఽ పగగొనువారల నగవులికదొలఁగు
ముల నాయకుడవు నీదుభవము ఽ భగభగ మండుచు విను కంసుడు మా
గులు వాయువడిదునుము ఖలుడతడు ఽ పగతురవలె మము చెర నిడి యలంచె
గీశవంద్య! యోకృష్ణవర్ణ! ఽ వేగ బలుకు నీవేడుక లేమో
గుముందెటులో యోగమును సెపుమ ఽ హా! గుణోత్కృష్ట! సన్మునిప్రతిష్ఠ
గ వినెను ఆయోగమవినుతుడు ఽ నాగురుజనోత్తములకు నిటువల్కె
యవ్వా! యో నాయనా వినుడు! ఽ మీయెడల వైరమందిన గంసుని
రాయువును గొనెద, నాయవశ్యమది ఽ మీ యంతరంగముల నెఱుంగుదురు
ానుడు చింతన మందగతి వినుడు ఽ నూనుడ గద నాపిన్న వాక్కులవె
నయునిగ నన్నుగంటిరె, ఇంతియ ఽ మును పుణ్యము నేనంతే యందితి
నఘులను మిమ్ము జననీజనకుల ఽ నను బెంచుపట్ల నాయనా! యమ్మ!
ని పిల్చుచు మీదఁగు నిందునంద ఽ నను బొందకుంటకై చింతింతును
ంతె యిపుడు సంబంధము జననీ ఽ వంతును దప్పక రాదో జనకా!

యెంతవారలకు కాలంపుదశల ఽ సంతుల దాటగరామి నిక్కవము
వింత నొందంగరాదు కర్మఫల ఽ మెంతో నాకు రుద్రునకు ధాతకును
యంతుగాంచ నను వైనంబందదు ఽ సంతసంబు మీకెత్తు ముందునను
యనగహర్ష బాష్పములు గ్రమ్మకొన ఽ జననియు జనకుడు తను జూచుచుండ
ననుకూల మెఱిగి యూరటనుబెంపు ఽ ఘనతను దోపెడు రుచిబెంచువాక్కు-
లను వనజభవుని జనకుడిటులనియె ఽ ననఘమతులైన యా దంపతులకు
మీరు పూర్వమున ననుగొల్చితిరా ఽ సారతపంబున నదియెల్ల వినుడు.

## -: దేవకీవసుదేవుల పూర్వవృత్తాంతము :-

దూరమైన స్వాయంభువు మన్వం ఽ తరమున సుతపుండను ప్రజాపతియు
నతని యువతి పృశ్నియు నాదం ఽ పతులు మీరు యజూపంపున నేమత
నతులధైర్యసంఘటన కామముల ఽ యతులన్నియును జితుకజేసియును
కౌతుకుదోల మీబ్రతుకు సార్థమగు ఽ గతిని గాంచ వాతాతపవృష్టుల
చేత నింక శీతంపుకాలముల ఽ చేత చలనముల భీతిపడక నే
కలత లేక యాకలములు దినుచును ఽ వేలుపదియు రెండైన దేవతల
చాలు మానమగు వర్షములెన్నో ఽ దూలదూలకను నను నర్పింపగ
నేను మిమ్ము కడుమెచ్చి కనిపించి ఽ మానుడయ్య తపమని నియమించియు
అనఘులార! వరమును గోరు డిత్తు ఽ నని యూరడించ మీరట్లుచేసి
మీరు నామహిమ నొకవిధిగా నాఽధారముగా గొని బాయ బాయకను
గోరితిరా మీ రంతదాక సంఽసార సుఖమ్ముల సంతతి గానని
వారు నగుట ననుజేరు గోరికను ఽ సారిమిదే యని తనయునిగ నన్ను
మీరిన దయ జన్మింపుమ యని మనఽసార బల్కుటయు మంచిదనుచు మీ
ధీరతనమునకు మోదమాన నేఽపారగ బుట్టితి, పృశ్నిగర్భుడను
పేర తొలిజన్మ మగల నొకతరిని ఽ మీరు కశ్యపాదితులనగా ధర
పేరుగాంచ వామనుడన బుట్టితి ఽ చేర జేసితిని వైభవమిందు న
పారసుకృతఫల మందితి రింకను ఽ మేరయుంటనిపు డుదితం బందితి
బాముల మాటిని నేను మీసుతుడ ఽ బాములు దొలగెను మీకు పూర్వంపు
ఈ మహిపుట్టుక లింక పనిగొనరు ఽ వేముక్తిపదము మీరలకు నెలవు
నాకు బుట్టు కార్యము లుండవింక ఽ వీకలు ఫలించ నన్ను పరమునిగ
నాక నివాసుల నేలునేలికగ ఽ నేకమతిని దల పుంచుడు ధన్యులు

అంచితమగు నాసత్స్వరూపమిదె । గాంచితిరని యొక్కింత మాటాడి
మించు మాయ దాపింప బాలుడయ్యెకించ వదలి రా శౌరియు దేవకి
నందనుండు పరమానందదాయి । ఇందిరాధీశు డేమాజ్ఞ యిడెను ?
ముందు నెరవేర్పనుండె తీవరపు । చందమొంది చిందాడగ మందను
నందుని భార్య యశోద గనియె సుత । మందలోని వారెవ్వరెరుంగరు
సందడిదెలియుట వసుదేవుం డాకందు నిట జేర్చి తనపాపని నట
వాస మొందింపు వడి నబ్బాలుని । వాసుదేవుడని వెలసెడు వానిని
వాసిగన్న తనదాసుల పాలుని । యీ సచరాచర పోషకు విష్ణుని
కరతలముల నడ్డముగ నెత్తుకొని । నఱిమునజేర్చుక నిల్లును వెడలిన
తెరువున నడ్డము లేవియునుగాక । తెరవబడియె ద్వారము తమంతన
అరుదు గన తాళముల కిళ్ళూడెను । జరుగ మరల నుండెను తొలియట్టుల
వలరున నాతడు మొగసాలలన్ని । దిలకించి గడచి చప్పుడడుగ పదము
లలి మెల్లమెలన వల నెరిగి నడచి । వెలికిని రాగనే శేషుడు పడగల
అలరు వెలయ విప్పుచును బాలునికి । మేలిగొడుగు తా బట్టిన యట్టుగ
జాలి రక్షకై తోడు రా నతడు । కలత లేక నాయనంతు చర్యల
తలపుల నాతడె తరుణమటుగూర్చు । విలసనమునకును కెలసనము నంది
నిలువకజనగా నపుడు మార్గమున । నలరునింపు తోయముల పొలుపుగొని
యలలు పొడవుగా నెగయు దరులనుఱ । గలయుచున్న యమునానది జేరిన
నానదిమార్గము నిడెను రామునకు । నా నదీవిభుడు దారినిడి నటుల
నానకదుందుభి యద్భుతంబనుచు । శ్రీని వరించినవాని ధ్యానించి
మానిని యశోద శయ్యను తృణమున । తాను డాసి యాచాలున జేరిచి
యా నాతిగన్న బాల నెత్తుకొని । వేగ ముందువలె దారినిబట్టియు
తనసతిని జేర్చి యథావిధంబున । పనులన్నియు శ్రీశుని యాజ్ఞచొప్పు
నను జేసి వెలికి నెఱుగని యటుండె । జనతతి యెఱుగదు విష్ణుమాయ యది
యని లో నెంచుచు నాసౌభాగ్యలం । కనిరి ముకుందుని జపమంతిలోన
హరిచిత్రము గొనియాడదరమె? క్షితి । వర ! మంద యందు నందుని సుతుండుఱ
కరము చెలంగుచు యొరులు దెలియలే । రురగభూషణా ద్యమరులు నలరిరి
అంత బాల రోదనము చేయ నాకెంత బరుండిన కావలివారలు
ఇంతి కనుటగ తలచి వేగమున । కంతు జనకు జననంబు కొఱకునె
చింతించు కంసనృపతికి జెప్పిన । నంతకాకృతిని నట్టె పాన్పుడిగి
అంత మొందింతు పుట్టినపాపని । గొంతుఖడ్గమున నంచుగొంచు తన

కేసరములు వడిజార చీరయును ఽ కసవున వ్రేలాడగ భీతిచేత
రోషము నొకపరి కలతను పైకొని ఽ డాసి వేగమున పదములు తడబడ
బుసకొట్టుచు నాపురుటిల్లునుగని ఽ వెసను ముద్రలను దీసి లోపలికి
బిసబిసన జేరి దేవకి పార్శ్వము ఽ నసిధార్యతిసక్త పాపను జంపగ
విసుమంతయేని కాలమున కేడము ఽ దెసనీక హుంకరించుచు పైకొన
సోదరియగా నాదేవకి యడ్డుచు ఽ గాదు బెదరు నీకన్నా! వినుమా!
ముదము బెంపు నీచిన్నది కోడలు ఽ యదురులేదు శత్రుండు జనింపడు
కనుము శిశువు బాలిక యనద ఽ యదియె కనికరమ్మ నీబోటికి జెల్లును
ఘనులకైన చిత్తమ్మున దిరుగుము ఽ ఘనయశంబునను మనెదవు ముందుగ
గనివ యార్వురిని కొడుకుల ద్రుంచిన ఽ మనసులోన వెత మానితిగా హితు
లును గారు అంచు నీవటు తలచుట ఽ యనువే! అనుచును నడ్డు నే సెప్ప
వినయమ్మున మ్రొక్కెదను పుత్రులను ఽ గన నే నోమను కన్నెను మనుపుము
జనపతి వన్నా! తగవగు నన్నా! దునుమ ఽ వలదన్నా! కోడలో యన్నా!
ననుజూడుమన్నా! కామిని యిదన్నా! ఽ ధనము యశమన్నా! నీకబ్బునన్నా!
యనుచు బాలికను నక్కున జేర్చక ఽ కనులనీరు గారగ దా గప్పుచు
తనపయ్యెదలో దాప నుగ్రుడయి ఽ తనసోదరి నదలించి తిట్టియును
పినపాపను గారవమున తీవ్రత ఽ తనకేలను రెండడుగు లొడిసి ప
ట్టిన వాపోయెడిదాని వినక దయ ఽ మాని మిన్నునకు బార గిరగిరను
ద్రిప్పి విసర సురసంఘము లెల్లను ఽ కుప్పగొన్నవారై సంతసమున
నప్పరంబునను చరియించుచు నా ఽ రొప్పుట నెఱిగియు నెదురు నడచి రా
బాలకు త్రిభువనపాలకు జేతకు ఽ నోలిలోకముల నేలగ బుట్టిన
శీలకు సుగుణాలయుకు మాయకును ఽ నా లలనామణి బాలపోలికను
జాలించియు సౌందర్యకాంతయయి ఽ మేలు చేలముల మణులప్రోవులను
డాలు దిశలకును బ్రాక సుగంధపు ఽ పూలమాలికల తారహారముల
నేలు నురము సకలాంగము లటులనె ఽ జాలు సొబగు భూషణతతిచే
యుల్లసిల్లె, మణి మకుటాదుల రం ఽ జిల్లె గదయు శంఖమ్ము చక్రమును
మొల్ల శరమ్ములు చాప మసిడాలు ఽ నల్లశూలమును నెనమిది కరములు
వరుసదాల్చియును ఘనమహిమకు దా ఽ నిరవుగొన్న యాదేవిని కిన్నర
గరుడసిద్ధచారణ గంధర్వులు ఽ వరవిమాన సంచారులు కాన్కల
నొసగి యప్సరసలాడగ నుబ్బుచు ఽ మెసవె వార లిడు నుపహారమ్ముల
పసిగాలి లలనకును గాసిదొలప ఽ వెసను సురలు దోసిళ్ళనొగ్గ సం

తసమున యాదేవియు కంసుగాంచి § కసివృద్ధిజెంద కంటికి నగపడి
వెంట నతనికనె సురసంఘ మబ్బ § మింటనుండియే జంట జయధ్వనుల
కంటుగొంటివేరా! నాపైనను § గొంటుడ బంటుతనంబేర! యిసీ!
కుంటరితనమున గోటునందెదవు § మంట గలుపు నిను తొంటికంటకుల
మంటిని గలిపినవాడె మాధవుడు § నింటివ బుట్టెను జేరె నొకచోటు
జంచితి వన్నుల నంచు కోపమున § బంచుచు కాలునిపోలు నిన్ను దిల
కించగపాపీ! మదాంధ! దుర్మతి § వంచు బలికి యామహాసియు వారి వ
చించిన పగిదిని జనపదముల గనె § వంచితుడయె నా దేవిని కంసుడు
యులికిపడిన మనమునను గలవరము § దలిగిన తంవర, చే నవి చెవులకు
ములుకులైనయా, మాయాచెలియలి § పలుకుల భీతిని, గడిసి సుడిగొనుచు
చెలియలి మరదిని, జేర రా బిలిచి § యులుకదీర్చు వాక్సరణి నాదరము
చులుకన సేయక సొంపున నిటులనె § తలచు తనలోనె, నిముడించు కొనుచు
బాలఘాతకుడ! పాపిని నైతిని § మేలుగాన బాంధవుడ దుష్టుడను
నేలగలరె నావంటి కఠినులే § కీలబు నిర్మలకులభూజములకు
నేల గలయ మీపాపల జంపితి § తూలించితి ధర్మమును మీయెడల
నీలవర్ణుడిట మీకు బుట్టునని § బైలువలుక నది, పాటించితి నో
యనఘులార! యోవిమలమతులార! కనుడు § నను శాంతమునను దయ నించి
నేన బోలితిని, జీవన్మృతునిగ § గాన యుపశమన మార్గము నింతకు
వినుడింక మేలు, మిమ్మెజెందెను § మనినాడ నపయశము తలకుగొన
దలప బోలదుగ, దశలు వచ్చునవి § యిల జనాళి కందఱకు మేల్కీళ్ళు
నెలకొంటి కలత దలగునె కర్మము § తొలి జేసితి గా దుష్టమతివడియె
ఫలమిది అవిధిగ తిరుగువారలకు § ఖలమహాత్మ్యము ఖిన్నమె సన్నిధి
చెడుపులు దొరలును జనుపుమారమగు § పిడువక దైవము నరసి జపించిన
కడు ముదమునొందు తనుదుడు కుడిగిన § బెడుపులేదు యువిసీతిని జిమ్మిన
నడిజెడు దుష్టపు కర్మఫలమ్ములె § వడి దరియు నసత్కర్మల రేఖలు
ననుచు వారిపాదములకు మొక్కుచు § వినయమ్మున సంకెలలు దప్పించి
పినయైన వదనమును వాల్చినిలువ § మనముల నక్కఱగని యొక ముదమున
దనరి రాపుణ్యాపరులు వసుదేవు § డును దేవకియును హరికైనవారు
మనమున శాంతము నెలకొన్నవారు § యనయ మచ్యుతుని నుతి సలుపువారు
అంతట కంసుని గనె వసుదేవుడు § చింత నుడుపగానెంచి యిట్లనియె
సంతసింపగల వాక్తతిని చెల్మి § సంతరిల్లగ నో బావా! ఇంతకు

చింతింపనేల? దైవంపు ఘటన | నెంతెంత వారు దప్పంగ బోరు
వంతొంద సున్న వంతున్నదరిన | సం తంది యుండు సత్కర్మఫలము
ఇంతకు మును నీపల్కిన వన్నియు | చింతింప దగిన గరిష్ఠ పదములె
యంతరంగముల సంతరింప మతి| మంతులు గారా యెంతటి మూఢులు
జ్ఞానరహితులై మీరు మేము సను| మానవమునకు వేదారుచు గర్వము
నూని కామవర్గముచే రెంటిని | నాని మఱతు రీశ్వరుని చెయిదము
ఈశు సర్వరూపావిష్టుని జీ | వేశులనెడి భేదరహితుని నిర్గుణు
నాశనరహితు ననాది నిశ్చలుని | పాసి భయము లేకుండ భవములను
పాశములఁ సడలించు దేవునిఁ | యాశల మురియుచు దలపరు ప్రాణులు
కోశములెవ్వియు కొనరు దరలునెడ | క్లేశము వదలితి నిదె తలతు నేను
ననియు నతని కూఱట యగు నటు గా | మనమున పరముని జింతించుటయున్
గనపడనీయని మృదులపు పలుకుల | వీనుల కింపుగ నాడిన కంసుఁడు
వారిచేత యనుమతిని వేగ కొని | చేరె తనదు భవనమ్మును రేయిని
సారవిచారము మీర గడపి తెల | వారగ మంత్రులఁ జేర బిలుచుకొని
మంతనమున దా విన్నదంతయును | చింతతోడ వచియించె వారలకు
చింతయు భీతియు వేగ ముసరుకొన | యంతరంగమున నలికి వెలికి నది
దోపనీక యోచించి వా రనిరి | భూపతిలక! జాగేల పంపుమా
ఇపుడే మ మ్మాశ్రజన నిలయములకు | నీపనుపున మేమరిగియు శిశువుల
వెదకి వెదకి జంపెదము మునివరుల | గదిసి గినిసి ధర్మములను జెఱుతుము
యదయుత మఖముల నన్ని జెడగ జే | యుదుము దేవతల పీచ మడంతుము
దేవాగారము లన్ని క్షితి గలిపి | గోవుల దూడల తోడ దునుమెదము
చా వందింతుము తపసుల వ్రతులను | పావనమగు వేదముల జింపుదుము
భూమిసురుల గారింతు మెల్లెడల | నీమ నియమముల నణగింతుము మరి
నామ రహితముగ నరుల బొలియించి | భీమబలముచే దిశల వణకించి
వత్తుము విష్ణుడు జచ్చునిటు సేయు | మత్తు గొనుట దగ దా శత్రువులను
బిత్తరంబు నొందంగ మాపవలె | రిత్తయోచనల కాలము ద్రోయగ
మేలుగాదు ఏమరంగ బోలదు | జులకన జూడగరాదు రిపుల నటు
పలుచ గనని రోగములును నింద్రియ | ములను బలము నల యౌషధసేవల
శాంతమతిని నణగింప వలయుతే | నంత పెంపుగొని యుందించు వెతల
యంతు మాప మా తరమగుసమయము | చెంత విడము నిను యెంతకైన యని
వారు బలుక విని ధీరత నందియు | మీరు యథేచ్ఛగ లోకము లన్నిట

దూరి యెట్టిడుల వెఱవబోక మీ ƒ సారపుకొలంది జంపు డగుల క
య్యాల త్రిమూర్తులు యెదురొడ్డిన మీ ƒ రాలసింపకను రండు నాకడకు
నేల రాతు నవ్వారల నాకును ƒ జాలి నిలుతురే ముఖమున వీరుడ
యని చెప్పియు సెలవిచ్చె, బోయి రత ƒ దును జేరె అంతిపురము లోపలికి
దనుజులు సుజనుల తలములజేరియు ƒ కనబడువారిని గాటియ వెట్టుచు
మునుల ఘనుల తాపసుల భూసురుల ƒ తనువుల వసతుల ధర్మముల దోపి
జనకంటకులై తర్జనఘర్జన ƒ లను భర్జనముల నన్నివిధుల నొ
ప్పించ బల ముడిగ వారు నడంగిరి ƒ మించునగ్ని బడు మిడుతల వలెనే
ఎంచుమనుష్యు సాధువుల జెనకినను ƒ కొంచపడరె మదమంతయు దుల్లగ
ఇంకవినుము నృప, పంకజనయనుని ƒ పొంకము దెలుపుడు వసుదేవుడు తను
సంకటము వాయ సఖయు నందు సతి ƒ చంకవగ్గిలుము సాంద్రశుభము నీ
కగునని బలుకుచు నచటి పాప గొని ƒ తగవున నింటికి జేరుట వింటివి
యోగమాయ తము నలమిన నిదురను ƒ దూగుమాని మేల్కని మందలో
నందుడు తనసతి నందను గనెనని ƒ నందమొంద విని యలరు శ్రుతుల నిం
పొందనేర్చి దీవించు భూమిసుర ƒ బృందములను రప్పించి స్నానమును
జేసి శుచియు జెందియును నలంకృత ƒ వాసియగుచు పుణ్యాహ వాచనము
వీసమైన లోపంబును లేకను ƒ జేసి పాడియావుల పెక్కింటిని
కనక కలశ మణి వసన విశాలము ƒ లైన తిలల శైలముల నేడింటి
యొనరదిగా విప్రులకు దానమిడె ƒ ఘనమైన ముదమునను దీవనలను
వీనిజన్మకాలమును గణించిన ƒ దానవుల కితడు దండి సముడగును
నల్లనివన్నెయు దిలకించినంత ƒ అల్ల వెన్ను డనదగు గొల్ల యితడు
యెల్లవిధుల దోపించె నిజమ్ముగ ƒ బెల్లు యశమునను పెద్దగ బ్రిదుకును
నంచు బల్కితరి సంతసములు తము ƒ మించు వేడ్కనాడిరి బాడిరి వం
దించిరి గాయకు లాదిగ నంతట ƒ మించె ధ్వనులు మంగళతూర్యమ్ములు
సుజనుల దీవన లక్షై బాలుని ƒ త్రిజగములను పూజ్యత నొందునని
కుజనులకు వైరి, యై ప్రభుత నొప్పు ƒ గజిబిజి నడంచు మహాత్ముడీతడు
సురుచిరవైభవముల గిములెల్ల ƒ వరుస చివురు తోరణముల నొప్పెను
విరిసె రాజ! ధూపముల వాసనలు ƒ గురుతరమయ్యెను పశువుల మందలు
మిసిమి గలిగ పసపు నూనె నలదిన ƒ పసిమి బర్హా బర్హా ప్రభ నొప్పెను
వాసికెక్కినా యావులు నెద్దులు ƒ పసిదూడలతో నందం బగుపడె
పాలు జిల్లె పెల్లుగ పొదువులను ƒ యెల్లయావు లాబాలుడు పుట్టిన

కాలము నందున నందుం డలరుచు ॥ చాలలేమిగల వారలకెల్లను
గోరకమున్నె జేర్చి ధనములను ॥ కోరిన గోవుల కొలదికి నెక్కువ
సారకీర్తనలు దిక్కులు నిండిన ॥ సారమైన హరిభక్తి పెంపుగని
మంద గోపకులు నందదంపతుల ॥ కందమైన వసనాదుల సొమ్ముల
పొందు గూర్చ తా మందరు నట్టుల ॥ మందమోదముల కానికలను గొని
వచ్చి బాలకుని లోకపాలకుని ॥ నిచ్చలు దీరగ కనుగొని మెచ్చుచు
పచ్చవిలుతు బోలు నితడని విని ॥ పచ్చవిల్తుగ జనకుడునా గొందరు
పలికియు దృఢమున పాటించిరి యదె ॥ చెలఁగి యందరు వసంతము లాడిరి
పాలుపెరుగు నీళుల వెన్న నేత ॥ చాల కుతుకముల మేలము లాడుచు
స్త్రీల సముదయముగనిరా సేతల ॥ మేలి నోము ఫలియించె మనమంద
నోలి ప్రీతిగల నందుని రాణికి ॥ బాలు డుదయించె మనసఖి యామెయు
యశోద మన రాకడల గోరు యా ॥ కిశోరు సుందరు లాలింపున పర
వశాన నగు మోదమ్ము మనకు గా ॥ దశకగంటి మట దరలవలె నిపుడ
యనుచు నొకరి కొక రెరిగించుచు నా ॥ వనితలు గుములయి శిశువును జూతము
వనజ నయనలారా! రండు రండు ॥ వనజాక్షుడంట బుట్టిన బాలుడు
గనెదము కన్నుల నని శీఘ్రగతిని ॥ గని తమ సుందరనడకలు చూపఱు
లకు నింపుగలుగ వేణిభరంబుల ॥ పిక శుకముల చాల్ నెనయు పల్కులను
అకలంకులు నై నడుము లసియాడ ॥ ముకురముల నునుపు గండతలమ్ముల
నిగనిగ లెగయగ కుచము లల్లాడ ॥ నగవు వదనముల చిందాడుచుండ
వగ లడుగుల మఱి శ్రోణి తలమ్ముల ॥ నగుపింప మేని సొమ్ములు ధరించి
మేలిక్రొమ్ముడులు వీడగ స్తనముల ॥ మీది హార సముదాయపు కలయిక
లల గను పయ్యెదలును తూలగ మిను ॥ కులు గలిగినట్టి హాటక తనురుచి
లలనలు మృదులంపు లలితములుగను ॥ గల నొయ్యారము కులుకు తళతళలు
యెంతో కమనీయము వారిచెలువు ॥ వంతల మలపును వారివిలాసము
కాంతలిట్లు రంజిల్లు చిత్తముల ॥ వింతల పెక్కులుగా నా యశోద
చెంతఁ జేరి తిలకించిరి కృష్ణుని ॥ రంతరు భక్త వశంకరుని ఘరుని
తెచ్చిన కానుక లిచ్చిరి చెచ్చెర ॥ హెచ్చిన ముదమున బుచ్చికొనిరి సిరి
నచ్చిన వాని జగన్నాథుని ముద ॥ మెచ్చిన వారల దు్రింపఁ గడంగెడు
వాని నెత్తికొని నూనె దలయంటి ॥ మేనున పసుపును బూసి నిర్మలము
దనరు నీరమును బోసియు పరిశు ॥ ద్ధునిగాఁ జేసియు ధూపమ్ము వేసి
యొనరున పొందఱు నందుని సుందర ॥ తనయుని హరిరక్ష పొమ్మనుచు పెస

నెనయఁగ జలముల గొన్నిటి ద్రిప్పియు ఽ మనమున నానందంబును మెరసి య
లంకరించి సొగసైన తొట్లనిడి ఽ పొంకమైన పాటలను బాడుచును
పంకజాక్షు లా పంకజనయను నిరంకుశ వృత్తుని నూచిరి యుయ్యాల
జో జో మునిమందారా ! కృష్ణా ! ఽ జో జో పూర్ణేందు వదన ! సుందర !
జో జో కోమలపల్లవ కరపద ! ఽ జో జో మృగరాజ మధ్య ! మాధవ !
యని చాల బాడి ముచ్చటించి ఽ యా వనిత యశోదాదేవిచేత మ
న్ననలనంది తామిండ్లకు నేగిరి ఽ వినయగుణాకర ! విను మవ్వలి కథ
పెక్కువిధుల భువనమ్ముల వెలయుట ఽ పెక్కుతోయముల నుంపుట మలపుట
పెక్కురూపముల దాను బుట్టుటయు ఽ పెక్కువిద్యలకు నిలయుడైన హరి
మక్కువగనె యాగోపాంగన లవి ఽ సుక్కునివీరుల జక్కపెంపుటల
నిక్కుచుండె సుర సమితియు సుజనులు ఽ మ్రొక్కుచుండ దా నలరెడు దేవుడు
లోకములన్నియు నిదురించినతరి ఽ జోక చేయు తా వెలసిన దైవము
లీక బూని గోపికల యూచుటల ఽ సోకె నిదుర తనకంచని జూపును
జననరహితుడై జననమందె నిట ఽ ఘనుడు కర్మరహితాత్ముడదియు గనె
జనని దొల్లి యెఱుగకయ యశోద ఽ చనుబాలు ద్రావవలసె బెఱుగుటకు
హానివృద్ధులను గానని వాడయి ఽ ధ్యానింప పరబ్రహ్మ నా నెగడి
మానుల తపముల నందమొందుచును ఽ తన కృపాపరత నందరును గోర
మనికే యెల్లపుడు గల తత్వమూర్తి ఽ నునికిపెంపు మురి పెంపు గనె మంద
జనులవలన యా వారివ్రితమేమొ ఽ మునుపు జన్మముల తలపులేమొ యా
కరణి గోపగోపికల పోషణల ఽ చరియించెను శ్రీజాని లీలచే
సరణిచేష్టలను ధాతను బోలుచు ఽ కరము సంతసపుం జూపుల విష్ణుని
స్మరణజేయ నలరారు కోపమున ఽ దారసించ రుద్రుండు నాగనై
తిరుగుట గల పరబ్రహ్మమనంగను ఽ నిరతానందము నిత్యసుఖము చెలు
వారంగ పెరుగుచునుండె నందుడును ఽ సారసాక్షి వసుదేవుని భార్యను
నారి గన్న సుతు రాముని మిక్కిలి ఽ చేరదీసి సౌందర్య వసనముల
తోరమైన భూషణముల గూర్చెను ఽ వారిజాక్షి యా పూజల ముదమున
నంది యతని యాదరణ నందించె ఽ నందనుండు యా యశోద సుతువలె
నందచందముల నొకకళ నందుట ఽ నంద రద్భుతము జెందుచుండ నా
నందుడు మథురకు జని కంసునికిని ఽ ముందురీతి జెల్లించె యరిని సెల
వంది యంత దనహితుని వసుదేవు ఽ డెందమునను దర్శింపనెంచియును
నందనుండు గలుగుటయును మొదలా ఽ నందమైన దశ లాతనికి వచింప

నెంచియు వారల నూరడింపగా § నంచితమగు వాక్యములతని కలన
వినగా నెంచియుఁజేర వసుదేవు § డును యానందముతోడ నసువులను
గనినవాడ నేనైతి మరల నా § తనువున నింతకుతేవు నేఁ గనగ
నంపితినన్నా! యవి నీవచ్చుట § నింపితి నన్నా మరల దేహమున
యింపున నవి నీ విచ్చుటయ్యె మఱి § నుంపితి తృప్తిని నీబోటి తలపు
సొంపేగద నీ సుతసతిహితులకు § పెంపుగ సూనుని గంటివట వింటి
ముంపుగొను నిన్ను మురిపెములింక ని § లింపవైభవము నాకు జెందు నిక
ముంపడు వెత మిము నెపుడు తపముల మ § ఖంపుల పెక్కుల గానని పదవుల
సంతతి లేదనుచింత దీరెగద § సంతతి సద్గతి జూడ యానుగద
సంతతి హీనుల సద్గతు లందవు § సంతస మయె నా భాగ్యము గంటిని
సంతతి పెక్కుల నిలువరపు వాని § వంతు సేవింపులను గాంచు గరిమ
యనుచు సత్కరించుచు నిటు పలికెను § జన వినుతములగు వచనము లివిగా
వినుము నెచ్చెలుడ సచ్చరితుడ నా § కొనరు నింక నాపదలులేని దశ
సకలమైన సుఖ దుఃఖమ్ముల నిడు § వికలతఁ గను నీ తనువులు మనువులు
నొకట నొక్కచోటను నిలుకడ గన § బోకను బారును నేటి వఱదలను
మాత్రికులు పోకల గాంచు విధముగా § సకలమైన పరివారము లిటులనె
వీకలు జెల్లవు కాలవశంబవి § కాకపోవు కాగల సంగము లవి
నీ మందల పసు లున్నవె సుఖమున § భీమమైన మెకములు దిరుగక మీ
భూమి పచ్చికల యిరవులు గలవే § నిర్మల జలములె కొలకుల వాగుల
నేరుల వనముల శోభలు సెల్లునె § మురియుచుంద్రు నీ బంధుహిత తతులు
కూరిమి నెఱపుదె వారి గృహాపతుల § మేర నీకు నే జెప్పవలయునా
బంధు మిత్రులను గూడ తనకు గల § బంధురమా విభవముల నందకను
కుందుదురే యవ్వారిని మోదము § నందబోదుగా మరియొకటి వినుము
నీతరుణి నిన్ను జనని జనకునిగ § చేతమ్మున నిలుపుచును దయ బ్రోవ
నా తనయుండట పెంపు గనుచుండె § నాత డలరు నిడు భావిని మనకన
నా నందుడు నవమోమున నాతని § నీ నందనులను జే బొరిగొనె కంసుడు
జీనందక తప్పెను తుది నందన § నీ నందను డందువె నానందను
గాని లెమ్ము శోకింతువె తజ్ఞుడ § వైన నీవు యావత్తుల గుందవు
నిన్నుగంటి సంతసమును నందితి § నన్నంపిన నిక పోయివత్తు నన
పోయిరమ్ము నీపనులు దీరె నిట § యోయి! తీవరమునను మందజేరు
ఏ యుత్పాతములో పొడమునందు § నాయెఱుక నవియు నడగు దైవకృప

నని సెలవీయఁగ తోడి గోపకులు ʃ వినిరి యందరును యెద్దుల
బూనికఁబూన్చిన శకటములనెక్కి ʃ వాని నాతురత తోలి త్రోవ రా
గానవయ్యె నుత్పాతములు గొన్ని ʃ మానసమున శ్రీహరిని దలపుంచి
ఆనకదుందుభి పలుకులు నిజమని ʃ జ్ఞాన కలిమి విని గని రబ్బురమును
ధ్యానంబీశుని పరముగ తలకరు ʃ లోన తోన వే తోలిరి బండ్లను

—* కంసుని పంపునఁ బూతన యను రాక్షసి వ్రేపల్లెకుఁ జనుదెంచుట *—

ఘోర రూపమును క్రూర గుణంబును ʃ భేరి బెగడు రవమును గల పూతన
నారి దురితసంచారి శిశుమారి ʃ తిరుగును ఖేచరియై యెల్లయెడల
భూమిని పురముల జనపదంబులను ʃ నామెయి దిరుగుచు బాలురను మృతిని
నాముకొనజేయు కామరూపియగు ʃ నేమ నీమ ధర్మముల నొప్ప నిది
ఖలుడైన కంసు పంపున మెలంగ ʃ వలను గన్న దది పని యట్టిది ఖల
ఖలుల నెవడు బరిమార్పబుట్టె శ్రీ ʃ లలనకు నెవ్వడు నాధుండగునో
ఇల సుజనావళి యెవ్వని నామము ʃ వలికిన తలచిన భవముల నందరో
అట్టివారు చరియించనైన యా ʃ దిట్టమైన నందుని పల్లెకు రా
దట్టెను చెవులకు ధ్వని యొకటి నందు ʃ పట్టి డంచు దా నెఱిగి తటుక్కున
గిట్టు ముదము నిండంచు నిల కుడిగి ʃ మట్టముగల శృంగార కాంత యయె
కనులు చూపులును కమలాల్ మినుకులు ʃ కరికి కుచ గండములు గిరు లద్దాల్
మీననేత్రి వదనము నవ్వులు యా ʃ పున్నమ చందురు డాతని కళలగు
పన్నది కౌ నామిన్నును మించును ʃ చిన్నవిగా వా శ్రోణి తలమ్ములు
నెన్నగ నినుకల తిన్నెలను బోలు ʃ చెన్నుమించు పల్లవములు పదములు
సన్నుతాంగి కొప్పును దొడ్డది యగు ʃ వన్నెను జివ్వురుల నేనిక్కకైలు
యన్ని యంగములు లలితమే యొప్పు ʃ కన్నియ యదిగా మోహినీభామ
విను మఱియు కర్ణమండల కాంతులు ʃ నునుపుచెక్కిళ్ళ సిగనిగలాడును
ఘనమైన జడను మల్లెలాది వా ʃ సనల సౌం ఘమరు పుష్పదామాలు
చరణముల నూపురముల విశేషము ʃ లరయుగ కరముల కంకణము లటుల
నురమున హారా త్రికము లాది సేరులు ʃ శిరమున దివ్యపు రత్నభూషలును
దనర మేలైన చీర కంచుకము ʃ లును మృదులంబగు సోయగము బిగువు
పయ్యెద యురోజముల మీద జార ʃ నయ్యువిద దృష్టి యెల్ల దిశఁబార
నయ్యెడ వచ్చుట గని యా మితారి ʃ తియ్యని విల్తుని గన్న సిరి యోహో!
మన కెయ్య వచ్చెనేమొ! సంపదల ʃ తనుతాన దయను రానయ్యె గదా

వనితనెట్లు పూజింప నేర్తుమో ఽ కనకాంగి మనము రంజిలుట యెట్లో
యనుచు మోహితులైరి యాపేటి ఽ జనులు మౌనమున దోగిరందమున
వనజనేత్రలా యశోద మొదలుగ ఽ గనుచుండి గంతె యా కాంతపాలాయలు
నాతు లెల్ల దను జూడగ గృష్ణుని ఽ జూతు ననుచు దా నేగె లోపలికి
భీతి లవము లేకను వడివడి నా ఽ యాతతాయి నారియు హాతమగుటకే
పాతక భంజను పరమేశ్వరు నిజ ఽ వీతరాగ పరిపాలకు శౌరిని
యాతుధాన భీకరుని శ్రీకరుని ఽ భూతమయుని మునిలోలు ననంతుని
సారసాక్షు పరు సర్వాధారుని ఽ నారదాది ముని నాయక వందితు
ధీరవైరి సంహారు కృపాకరు ఽ జేరి చూచె పర్యంక మధ్యమున
బూది లోని యనలంబునఁ బోలి యశరాతుల దుంపగ నదను గనువాని
ఆదిన తన్నే బొరిగొను మనమున ఽ గుదురుకొన్న యత్నంపు వాని హరి
ముదమున డాసెను కుచముల విషమును ఽ గదియ జేర్చినది గాన నది గుడిపి
బ్రతుకు జెఱతు నీ బాలు నటంచని ఽ బెదురు గనని చిత్తంబు తోడుతను
నది బరికింపఁగ నబ్జనేత్రుడును ఽ సుదతిని జూచెను మీఁదెఱుగని దీ
చెడిపె రక్కసియు దుర్బుద్ధియునై ఽ గుడుప వచ్చె చన్నుల విషమ్మనన్
జడుపు నెఱుంగదు నేటికి నిచ్చట ఽ బెడుపు గనుగాక లోకము నుతింప
నాదునేత ఫణివలనిసేత నను ఽ భేద పఱుప నెంచిన దీనికి నిక
ననుచు దాను నిదురించిన విధమున ఽ కనులు మూసి తా నుండె నా సుదతి
చనుబా లొసఁగెద నీ బాలుని కని ఽ కనికరమును వెలి జూపి, లేపి గొనె
కరముల బాలుని కనిరి రోహిణియు ఽ తరుణి యశోదయు తడిమి వల దనుచు
సరసను జేరిరి బాలుని యిమ్మని ఽ యిరు పార్శ్వములను పని విరమింపగ
వనిత కిట్లనిరి. వలదు చను గుడుప ఽ కనగ పసిబాలు డెటు త్రావగలడు
వినుమా పలుకుల గను నీదారిని ఽ కనకాంగీ! నీ చెయిద మిట దగదు
మా చనుబాలే చాలు బాలునకు ఽ నీ చనుబా లివి యేటికి పో యన
రో చెలులారా! పాలు పిల్లు నయె ఽ నాచనులను మతిలోన నరయుడని
మాయ గుప్పి వా రనకయుండ నా ఽ మాయవిదారుని నక్కునను మోపి
రోయి పినపాప! నాపాలు ద్రావు ఽ నాయభీష్ట మీపట్టున దీరును
నీ యభీష్ట మింపొందు నిహమ్మున ఽ కాయజ జనకుని వన్నె గలాడవు
గుణమతిని రేపు జడమతిని బోలె ఽ గుణహీన యయ్యు కోర్కెలటు గొనిన
గుణవిరాజితుడు నిదుర మొలకువన ఽ గణనకు నబ్బురముగ కనులు విచ్చి
ఋణము దీర భువి నీకో రక్కసి ఽ వ్రణముల పెద్దవు యమరతతి బొగడ

మొట్ట మొదట నిను మట్టగింపవలె ఽ నట్టె బాపవలె సుర వ్రజ నిచయము
ననుచు కరములను యాసురి పైననుఽ కినుకను జూపియు నావులించుచును
గన నాకలి దను పెనగొన్నటులే ఽ చను కుదురులపై మోపె వదనమును
చనుగవ కరయుగమున జేపు కొలిపి ఽ యును వెంట రెండు గుటుకల గ్రోలుట
యును నారక్కసి మది దల్లడిలుచు ఽ చనుల గుడుప నే జాల బాలుడా!
వినుము విడు విడుము చాలు చాలు నా ఽ ఘనుడేల విడుచు దాని యసురులను
గొనక భూనాథ! యా కూళశక్తి ఽ కనగ నొకక్షణము లోన దా బీల్చె
జనని పగిది తన యురభరముల నిడె ఽ ఘనపదమును నీ దనుజ వడయడెటు
వనజనయను డీ పగిది దాన విని ఽ తనువు బాయ ప్రాణంబుల గొనియెను
వనమాలి మనము లోని తలపేమొ ఽ దనుజను తనపదమున జేర్చదలచె
తనువటు భూమిని బడియె రక్కసిది ఽ దాని వెలుగు పరమేశు దరిజేరె
ఇటు లా పూతన యిల గూలుట గన ఽ పటుతరమగు వజ్రంపుధారచే
తటుకున బడెడి మహాగిరి బోలెను ఽ స్ఫుటమగు భయకర ధ్వని నిండె దిశల
గొల్ల లెల్లమతి దప్పి యాలొక్కనిరి ఽ దుల్లె శౌర లంబుధులు గలంగెను
ఎల్ల గిరులతో క్షితియు నల్లాడె ఽ యుల్లములను నలుకయ్యె యెల్లరకు
మొదటి రూపు తోడనె చచ్చుటయును ఽ విదిత మగునుగద నాదుష్టశవము
కుదురుకొనగ నారైన క్రోశముల ఽ మేదినీతలము తా నాక్రమించె
దారుణమగు వక్రింపు కోరలును ఽ ఘోరమైన గుహ బోలు నాసికము
నరభీకరంబు నగు నా వదనము ఽ చిరతమంబుగల నూతులు కన్నులు
పెను గొండలచా లమరు స్తనంబులు ఽ గన పెద్ద దిబ్బలను పిఱుదులు సా
గిన కట్టలు కరచరణంబులు నింకిన చెఱువునకు తులయగు కడుపును
కలిగి యుండె నా కఠినపు పీనుఁగు ఽ దిలకించిరి గోపకులు భయపడిరి
కలుగదే విషమగతి బాలకునకు ఽ నిలయము విషమును విషధరమె శయ్య
కల సఖుండట్టె విషగళుండగును ఽ అలరున విషధర రిపుడు వాహనము
తలప నావిషపు పౌత్రుడు కొడుకగు ఽ కలత బడడు పూతన స్తన విషమున
జలరుహ నయనున కిటు విషసంతతి ఽ కలకాలము హితమయ్యె యుండుట
చాల భీతిల్లె నేమొ బాలుండు ఽ లీలయగానె యా యాడుది రాక్షసి
నేల బొలియు కారణమేమో యని ఽ యాలసించకను పరువున పాపని
దాసి యెత్తికొని రోహిణి యశోద ఽ యా సుర రక్షకు కేశవుని మ్రొక్క
మోసము ద్రొబ్బిన దేవుండితడని ఽ వే సుసితికై రక్ష బెడుదుమని
యా వెలదులు శీఘ్రితను శుద్ధులయి ఽ పావనమని యావుల తోక ద్రిప్పి

గోవుల దుమ్మును మూత్రమును జల్లి § యావల గోమయమున దేహములది
తా మాచమించి రక్షాదక్షత § నేను విధులెల్ల నెఱిగి యుండుటను
నామముల బీజన్యాసముగా జేసి § యామంజుల బాలుని కృష్ణుని గని
చిన్నియన్న! నీ యడుగు లజుండును § జానువు లనిలుడు దొడలు యజ్ఞుడును
నెన్నగ కటితల మచ్యుతుండు నీ § మిన్నయగు కడుపు నా హయాస్యుడును
హృదయము కేశవుడు రమేశుండును § సదయు డినుడు కంఠమ్ము భుజమ్ముల
భిదుర వందితుడు చతుర్భుజుండును § ముదమున నుపక్రముండు ముఖమ్మును
శిరము నీశ్వరుడు సంరక్షింతురు § మురిపెము గను నీ ముందున చక్రియు
హరియు గదాధరుడయ్యు వెనుకనుగా § వరధనువు నసియు ధరియించువాడు
ఇరు పార్శ్వమ్ముల వారి నామములు § వరుసగ మధువైరియు వికుంఠుడును
తరమున మూలల గదాధరుండై § మరి శంఖ చక్రధరు డురుగాయుడు
నరయును యామీదను దేవేంద్రుడు మరి § వరమతి యా తార్క్ష్యుండు క్రిందునను
సరళమ్మున హలధరుడగు పురుషుడు § కరమొప్ప నంతటను బ్రోతు రిటుల
పదిలముగ హృషీకేశుండును నీ § పది యొక్క యింద్రియముల గా పందు
పది ప్రాణంబుల నారాయణుండు § సదయుడై బ్రోచు చిత్తమును శ్వేత
ద్వీపపతి యటులె నీమనంబు యో § గంపు నేత కపిలుడు నీ బుద్ధికి
కాపరియు బృశ్ని గర్భు డహంకా § రపు పనులను భగవంతుడు పరుడును
నాపగిదియె నీడల గోవిందుడు § ప్రాపు శయనమున మాధవుడును నీ
నడచుతరిని కేశవుడును కూర్చును § వడుపున శ్రీపతి బ్రోతురింకనున్
గుడుచు నెడను యాయజ్ఞభుజుడు తా § కడు భయదు డతడు సర్వ గ్రహములకు
అన్న! శ్రీకృష్ణ! ఇట్టి రక్షగల § నిన్ను దలచువా రందు కలలోఁ
గన్నచెడుగులను గానరు గా య § ట్లెన్నువారి బాల గ్రహంబులును
ముసలుల గ్రహములు కూష్మాండులు రా § క్షస భూతప్రేత యక్షపిశాచా
ది సమస్త వినాయకులు గోటరా § ది సకలు రక్లే దేవతులు జ్యేష్ఠ
పూతనాదిగా మాతృకా గణం § బాతరుణంబున నశియింతురు నా
చెడుగందరు నీయందు ప్రాణముల § నడకలు నింద్రియముల తను నిరోధ
మడుగంటును నున్మాదరోగములు § చెడు నట్లనె యపస్మార మహోత్పా
తమ్ములెల్ల నిను బొందకుండు గా § యమ్ములవగా మాదీవన లివి; నీ
కెమ్మగు సౌఖ్యము గూర్చు ననుచు యా § కొమ్మ యశోదా దేవి పాపనిగా
చన్నుగుడిపి పవళింపఁ జేయగనే § కన్నుల కూర్కొందిన యటుండు నా
యన్నను నుయ్యాల నూపి బాడుచును § గ్రన్నన వచ్చిరి నందాదులంత

మందను గాంచిరి పూతన శవమును § తందరపడి నిజ మొత్రిగి ధైర్యమున
నంను డాదిగా బాలుని జూచిరి § సంవము నందిరి యావల దనుజకు
మందమైన చితి జేర్చి దహించగ § సందంది ముందె దాని ఖండించి
మాదకు దూరముగా నొకతలమ్ము § సందు నేమించి యుందరట జేరి
పొందించి రగ్ని కాంతదేహమ్ము § సాదు లేని పాగ గ్రమ్మె నామేర
అందు నగరు మొదలైన వాసనలు § మాద కుతుకములు నిండ వెలువడిన
నందు డద్భుతము నందె నంగరాట § మందయాన యఘుమంతయు బోగా
నందమించె నీ ఫక్కి సువాసన § లందె గాదె యీ నందకుమారుడే
దీని కలుషంబు లడపెను నటుగా § దేవి యీ దనుజ పాపి కెదిగొట్లు
స్థానం బయె నిది యద్భుతంబనుచు § దాన విని పొగడి మరియు ననిరి యే
తెరమనిరి రాజ దనుజ విషమునే § పరపుగ జేర్చిన పాల్ద్రావి నంత
పరమ పదమిచ్చె తరుణి యశోదకు § వరదు డే మిచ్చునో పోషణకై
నరసిన నట్లిడె గోవులు క్షీరాల్ § సరసిజనేత్రుం డే మీయు నొక్కా!
పరమందు వీరు ముక్తి నెలవు మొద § లరసి మోదింతు రిదె నిజంబు సూ
హరి నిటు బెంచుచు చనుబాలిచ్చుచు § కర చరణాదుల తన తనువు బ్రాకు
వరుసల కుతుకము నందు నందు సతి § పరమ రసాయన మగు భవపు రుజల
తిరముగ దా నీ తెరగు భక్తులకు § నరనాధా యన నామునిని శుకుని
ఘనుని గురుని మోదమునను గనుగొని § వినజెప్పు మవల వనజాక్షు చరిత
భువిని దుష్టులను మాపె నే వలను § దవిలె నేవిధిని గోపికల ప్రియుల
ప్రియముల మందును విష్ణుకథలు విన § గవయ నీను యేకలతను సంసృతి
ననిన హర్షమున నాముని యిటులను § వినుము రాజ! వనజారి బావయిటు
దనుజుల చెఱుపంగ దనరె కృష్ణుడయి § వనజాసనునకు నుడివిన మేరకు
పూతన నటు దన నెలవునకు బంపి § నూతన చర్యల మాతల నలరిచె
నా తమ్మి కనులవాడు నల్లనయ § చాతుర్యము జూపగ కొన్నాళ్లను
నొదిగిల బొరలగ నది గని యాగమ § విదుల విప్రులను సదయతనుఁజేర్చి
విధిమంత్రములను నభిషేకాదుల § గదియఁగ జేసియు దానముల నిచ్చి
గోపిక లలరగ మంగళకరముగ § నోపిన వాద్యపు ధ్వనుల గీతముల
పావని దీవన లంద సావులను § నేపుని సరసాన్నముల వస్త్రముల

-: బాలకృష్ణుండు శకటమును దన పాదముచేఁ గూలఁ దన్నుట :-

ప్రాపించిన ధాన్యముల ధనమ్ముల § నోపికఁ దాపక సత్పాత్రుల కిడి

పను లచటివిగా నెల్లరను నంపు । పనుల బాలు తమ శకటము క్రిందున
మది కింపుగ శయ్యగూర్చి భద్రత । నిదుర బుచ్చి వే వేగవత్తునని
మొదలోఁ దలచియు నరిగె నప్పనికి । ముదవతి బో షందయెనని కంసుని
పదిలమైన ముదలను గొంచు వచ్చి । యదను వేచి యుండిన శకటు డనేఁడు
యదయుఁడు దనుజుఁడు ముదమున దోఁగుచు । భిదురపాణి సన్నుతుని గనుంగొని
పూతనాంతకుడు వీడే యానో । చేతనం బుడుగు నాచే దప్పక
వీతభయుండై నధిపుడు కంసుఁడు । భీతి దొలగు నాబోటి వారలకు
నం చా బండిని నావేశించియు । ద్రుంచు మార్గమ్ము నాలోచించుచు
జించుదు నా ప్రాణముల చక్రమున । ద్రుంచుదు నా కుత్తుక నే బారి యు
డంచుదు నాకూబరముల చేతను । నొంచుదు నా యీ కించుని పదమున
ననుచు దనుజు డిటు దలచెఁ జులకనను । వనమాలి యెరిగె వాని చిత్తమును
నను జెనకి మనువు జెడెదవు మూఢా! । కనవు నీపాటు కదిసె నంతు నిను
ననుచు మనము నిద్రను మేల్కొన్న యట్లు । తనువు నిక్కించి చన్నుకేడ్చి నటు
దోఁపుచు సన్నిధి రానైన బండి । నాపగిదె దన్నె వామచరణమున
నూటిగ దన్నిన వ్రేటునను వాడు । వాటము దప్పియు మింటికి నెగసియు
దీటు కొలది పైబోయి పుడమిపై । పాటన గిరగిర పడియె నద్భుతము
దానవుండు తన మొదలి యాకృతిని । నూని ప్రాణముల బాసి యా విధిని
గానవయె తనువు ఘోరతరంబున । దాన నమరు లెల్లను సంతసిలిరి
బండి మింటిపై కెగసి క్రిందువడ । బండమీద బడు మట్టి పాత్రవలె
గండులు వదలియు ఇరు సొక్కచోట । రెండు తిరుగుడులు చెదర పరము వే
శొకటను గూలెను నొగలు కుదురు జెడ । వికలచిత్తులై గోపికలు బెగడ
యకట బాలు డేమయ్యెను అంచును । కకవికలైన మనమ్ముల జేరియు
వికవిక నవ్వున నున్నవాని గని । చకచకను దీసి చక్క నెత్తికొని
పాపని యంకము జేర్చి పాలిచ్చి । పాటలగంధి యశోద భీతిగొను
యాపట్టును విని నందు డాతురత । నాపట్టిని జూడంగ వచ్చె యా
శకటపు చెదువును గని వెఱగునంది । సకల దక్షకుడు దేవుడు శ్రీపతి
సకల శుభాంగుడై యీ చిట్టిని కృపఁ బ్రకటింప బ్రోచెనని సర్వము విన
సరగున బ్రాహ్మణ వరుల రప్పించి । యరసి గ్రహశాంతికై దానమిచ్చి
హరిహరాది దివ్యులను స్మరియించె । నరసి మ్రొక్కె వారలను తిరమతిని
తరుణి రోహిణియు సంతసమందెను । కర మాలోచించిరి యా తెఱంగు
బాలురు కొందరు పాపడే యిట్లు । నేలపాలుగా బండిని దన్నను

చాలుగొనియు మేమిందె యుంటిమి ॥ నా లక్ష్యముంప రాశిసువుల నుడి
డింభకు డెక్కడ శకటము నెట్లు విజృంభణమునం దానెగయు జిమ్ముటలు
యంబర తలమున నది యూడుపడుట ॥ శాంబర మిదియె పగిదియొ లగ్గమె

-: తృణావర్తుడను రాక్షసుఁడు సుడిగాలియై కృష్ణుని నెత్తుకొనిపోవుట :-

గాక విచారింపను నేల యనుచు ॥ వే కడకల గొనియుండి రొకనాడు
యా కమలాక్షి యశోద బుడుత డిపు ॥ డాకలి గొనెనని వేగ నెత్తుకొని
తొడల నిడుకొంచు ప్రేమ క్షీరముల ॥ గుడుపుచుండ విభ్రాంతి దనరు గా
కడు భారము తా నయ్యెను గృష్ణుడు ॥ పడతి యటు డించె విభ్రమము వాయ
నేడు నేమికతముననొ బాలుండు ॥ చూడ నాకు బరువయ్యె నబ్బురము
దొడ్డ శిఖరమును బోలె దోచె బ్రహ్మాండనాయకుం డగు నీతండు
దండి దనుజ తండముల దునుపగా ॥ నిండు కృపను ధర వెలసె గావలయు
నీతలు చూపులు చిత్రతరములగు ॥ నీతని పొంకము హరిని బోలు నను
నంతలోన కంసుని సఖు డొక డా ॥ చెంతనున్న సుడిగాలి రాక్షసుఁడు
వింతయైన సుడివడుల దిరుగుచును ॥ అంతు జెనుటకై యంబర వీధి క
నంతు గృష్ణు పిన్నాతని గొనిపోవంతున నెల్లర కనుల దుమ్ము జొర
సుడినిడ మందకు సుడిసుడి తా గొని ॥ వడి మది ముసరుట కసిబిసి వారు గ
నెడి పగిదిని తా కృష్ణుని నెత్తుక ॥ కడు తీవరంబునను మింటఁ జేరె
సుడివడు టెరుగని శ్రీ మాధవుండు ॥ సుడిగాలి దనుజు కడక నొక్కింత
సుడిసి నట్లుండి యంతలోన హరి ॥ మెడ బిగియబట్టుకొని నలుపుచు దా
క్రింద దిగగ నట్టు లనె బట్టుకొని ॥ మందముగా నది బిగియంగ నైన
సందు నెఱిగి రక్కసుడు వాడిమెయి ॥ నందిన బలమున నందు బాలు వద
లించుకొనగడఁగ విడువడు కంఠము ॥ మించు వేగమున దిరిగె రాక్షసుడు
ఇంచుకేని గనరాదు భాను డా ॥ మించిన ధూళిని దిక్కులన్ని యటే
చీకటి గ్రమ్మెను దుఃఖించి రచట ॥ లోకమున భయము సోకె గతియేది
యీకడగండ్లను దాటు టేపగిది? ॥ ఆ కమలనాభునకు నిది యిష్టము!
శోక జేసికొను తరము మనకు లే ॥ దీకలవరమున బాలు రేమైరొ
యంచు నొకరి నొక రాసించని తరి ॥ నొంచె బలమ్మున దనుజుని కంఠము
మించుసత్తి హరి ధరణికి దిగ జింతించె వాడు నీలాటి బాలునే
గాంచలేదుగా పీడు విష్ణువగు ॥ ఎంచు తనువుపై నాశ వదలుకొని
సంచరించు సంయముల చందమున ॥ నెంచె సుగుణ రత్నాకరు దనుజ ని

రాకరు శుభకరు సుజనమోదకరు § సకలలోక పాలనకరు నీశ్వరు
నాకచరాభయకరుని శ్రీహరిని § లోకనాథు డా దనుజుని ఖగమును
నుఱిని లాగినటు బరువగుచు క్షితిని § దరిసి యఱు విసరి పుడమిని బడియగ
గిరగిర దిరుగుచుఁ బడెను క్షితిఁ దనువు § నరసిన తిల లంతటి ఖండములుగ
నుఱుము నుఱుముగా హరియు పిన్నపై § సరళపు గతినాడుచు నుండెను నా
నందమయుండయి నందనందనుడు § కుందుఁ దీర్చె సురబృందంబుల కటు
తొందర లడంగు మోదంబులు భువి § యందు సందుగొన నయ్యె జనాళికి
గన్నులఁ దెరచి యశోదబాలకుడు § సన్నిధి లేకుంటను సతి యెఱింగి
మిన్ను మన్ను దెలియంగ రాక నో § యన్నా! కృష్ణా! ఎందునుంటివో!
సన్నుఁబాసి యెచ్చటికి దొలగితివో? § పిన్నబాల ని న్నేమఱితినిగా
యెన్న డెవ్వరికి దట్టని సుడి యీ § తెన్నున నిందున బుట్టె నిను గాన
కున్న మున్నీటి కలము మాబ్రతుకు § లెన్నగ తీరము జెందుటే వన్నె
కుందు బాయు నీ యందము గాంచిన § ముందు ముకుందుడు మాయందున దయ
నందింపు నోము నే నోచి యుంటె § కుందు బాపు నాదేవు డింతటనె
ఇచ్చట దించితె యాడుచుంటివే § ముచ్చట వెలయఁగ నాతండ్రీ! యిక
యెచ్చట జూతునొ యేది నాకు గతి § అచ్చనేమొ మోదమున నిను గనగ
స్వచ్ఛము బొచ్చముగా నోమితినో § యిచ్చ నెవ్వరిని తొలి ఖేదపరచి
ముచ్చిలి నటుగా వారి కౌతుకము § చెచ్చెర మాపియు దేఱియుంటి నొకొ!
తెరువేది కృష్ణ! నాకు నీమంద § కరయగ దైవము కీడు దొలప డొకో!
సరళ హృదయ సంచారి! పరమాత్మ § వరదుడవుగ దిగ్వరులు నుతింతురె
పరమ మునుల తల పామెయి వర్తిలు § తరుణమున మాకు యది నాము గాత
పటువున నిల్తు మమైన నాదేవు § నిట శీఘ్రగతిని నిల్పుదు మను
తటమున నే యా దనుజుడు గూలుట § దిటము చెడక నాబాలుడు రాక్షసు
గుటుకు మనిపించి యెడ వ్రేలుచుండె § జటుల సన్నుతుని భయ మడరు నెట్లు
స్ఫుటతర తేజుని శ్రీ కృష్ణుని కౌ § గిటఁ జేర్చుకొనిరి గోపకామినులు
పటుతరముగ యశోద జేర్చిన § మటు మాయమయ్యె బోటికి వేదన
యటుగా నాబాలకు రక్షబెట్టి § ఇటులనె నాముదవతి కృష్ణు గాంచి
చేటు దప్పి నను జేరితివా యా § రాట మణగె శ్రీదేవు డీశ్వరుఁడు
చొటంద నిన్ను జేరనొ దనుజుని § గిటు మాపె నది యాయుర్బలాది
కముల నొప్పునది గద నాడింభక § క్రమమున నశించు నిను డాసి నంత
తమములమైన యాపదలు సర్వములు § శమియించును నీవారి వెతలన్ని

కోటిదేవతల మోకరిలెద నీ § బోటి సుతుని నా పుణ్యనిధానుని
చేటు గూర్పరా చెనటుల గెడఁపగ § గోటు నీటు నిను జేర్చిన కతమున
నీవు మేటి గుణతతి నలరెదవని § దేవదేవు డీవిధి బ్రోవగ నయె
కేవల మతి జూడగ నాపాపుల § గావ దలంపడు రాయిడులనె యిడు
నారాయణు పరమేశు జనార్దను § దూరదురిత నురగేశ తల్పగుని
సారభక్తి సంస్తుతుల నగసిన న § పారము సద్వృత్తుల నందు శుభము
మేర యగును నే తప జపఃఫలమొ § దారె మమ్ము నీతరిని యాపదలు
దూరమయ్యెనని యెంచుచుండ నటు § జేరె నందు డతి విస్మయతఁ యా
నా డానకదుందుభి యాడినట్టి § గూఢ వాక్యముల ఫలమిదె యానని
వేడ హరిని కరివరదుని విష్ణుని § వేడుక వెలయఁగ నావలను వినుము
యొక నాటను గృహకృత్యములు దీర § యకలంకాత్మ యశోద నర్మిలిని
సుకుమారు కృష్ణు నంకమున జేర్చి § సకుతూహలమున జేపుగొని పాల
ద్రావింప నెంచి వదనమ్ము నిమిరి § యావరుసన నురమున ముఖముగూర్చి
యా వనజనయను భావము తృప్తిని § దావల మందుట లోనఁ దలపోసి
మెల్లన చన్నులఁ దప్పించి యంత § వల్లన పనులకుఁ దాఁ బోవ దలఁప
అల్లలితరూప బాలుని నొకపరి § యుల్లన గాంచిన యంతలోనె నా
డింభకుం డావలింపుచు తల్లిని § యంభోజ గర్భునకు తొల్లి తన వి
జృంభమాణ కృపజూపిన మాయా § స్తంభనంబైన విశ్వరూపంబు
జూడగాఁజేసె తనవదనములో § జాడల పెక్కుల నెటు దిలకించిన
వేడుకయు నబ్బురంబు విభ్రమము § జోడుకొనగ నా యువిదయుఁ గాంచెను
చాలు జలనిధులు మేలి కులగిరులు § డాలుమించు దిననాథ చంద్రముల
గారి నేల నాకసమును ననలము § వాలాయమందు దిశలు నకలంపు
దారలు గ్రహములు దనరు భువనములు § చరము లచరసంజాతము లన్నియు
భూతజాలములు పుణ్యసరిత్తులు § పాతక రహితుల నందు సదనములు
చూతల మెప్పగు దివ్యనిలయములు § నాతతంబు సౌందర్యవికాసము
లన్ని గాంచి కన్మోడ్చె కరము లటు § సన్నుల సంస్తుతి వెన్నుని పరముగ
చిన్నబాలుగా నెన్నితి నౌరా ! § మున్ను యజుని గన్నాడు ఈయన్న
మున్న పుణ్యముల సారంబున నా § కిన్ని జూపించె నితడు జగత్పతి
సకల నియంతయు సర్వాధికుండు § సకుటిలుల మాప నిటు నుద్భవంబు
ప్రకటించె ననుచు మానవిస్ఫూర్తి § పికవాణి వొంద నాలీల మలపె
నకలంక చరిత యా నందువనిత § చకచకల మెలఁగు తనయు నెత్తుకొనె.

యొకదినమున నచ్చటికి గర్గముని § వికసితమగు దరహాసిత వదనమున
సకల లోకపాలకుల బాలకుల § యకలంకుల బలరామ కృష్ణులను
నికరమందు నానందసమృద్ధత § కిసలయ మ్మంద వీక్షింపగ నా
వసుదేవు పంపునను మునివరిష్ఠు § డసమాన సిద్ధ సన్నుత గుణుండు
విసువని నిష్ఠాపరతంత్రుడు మఱి § కుసుమాయుధు జనకుని ప్రియభక్తవరుడు
తా మాధవు దివ్యావతారమును § భూమి చరింపగనే దశల నంది
బాముల సజ్జన కోటి దప్పించి § నామకీర్తనము భక్తుల నిలుపునో
యా మాన మెన్ని నందునకు బ్రియము § సామంత మందజేతునని రాగ
నాతని నందుడు యెదురువచ్చి తన § చేతులు శిరమున మోడ్చి గొనియాడి
పూతహృదయు డీ మహానీయు డిందు § సేతలంపునను రానయ్యె ననుచు
నూరకవత్తురె మహానీయులు మా § దూరపు పల్లెకయ్య! మీము గొల్వ
నేరమయ్య! ధర్మముల విధులన్ని § కూరిమిని మీరు మా మొక్కు లంది
యాదరంబు పెంపొందు దీవనల § చే దుర్మతంబు మాయందు బాప
గా దోడెంతురు మీవంటివారు § గాదె మహానీయ నాచిన్న సేవ
గొనుమా! మునీంద్ర! మీ రాకవలను § నను వొందనైతి పిన్నకొలంకును
తన దివ్యతరగలను మిన్నువాక § గననెంచినట్లు నే సపవిత్రుడ
నీతి నిపుణుడవు నీవు మహానీయ § జ్యోతిశ్శాస్త్రము నీ హృన్నిలయము
యో తత్వజ్ఞా! యదు వంశజులకు § నూత నీ బోధగా కాంతి గాంచ
గలిగెడు వారికి మీరిందు రాగ § తలపేమి యొక్క యాజ్ఞాపింపుడు
ఇలను ధన్యుడను నయ్యెద దాస్యత § యలఘుడవు స్వామి! నామనవి యొకటి
తిలకింపవలయు నా బాలకులను § యల వీరివృద్ధి చోద్యంపు చరిత
లలవడు నొకొ యని వీక్షింప తనదు § నిలయమున జేర్చి సతులు తా పూజ
సలిపి యాపిన్నలను మ్రొక్కించిన § లలి నిక్క గాంచె మానిడింభకుల
మునుల శరణ్యుల మూర్తుల నిరువుర § తనదు నయనములు సాఫల్యముగా
గనియు నందు నేకతమున వారల § ఘనము జన్మంబు దుర్లభంబు నా
మనకు జగమునకు వినుము రహస్యపు § ధుని వీరిలీల కరుణామయంబు
మునుల ప్రీతిదము సుజనాహ్లాదము § వినదగును విష్ణువగు కృష్ణవర్ణు
డితడు దేవకికి బుట్టి యానాడు § స్తుతిని పవిత్రత గలవాడ వగుట
సుతు డన నీకడ బెరుగు చోద్యముగ § ఇత డనంతుండు మహిమ చొప్పుటులె
మోహన గాత్రులు అహిత హాంతకులు § నూహకు మింతురు విక్రమచర్యల
ద్రోహుల గడపుటకై దిట్టమిందు § దోహలం బంద నుందు రికముందు

ముందుజూచెదవు వీరియున్నతిని ¶ సందియ మందకు కంసునికి దేవి
యంటె వచించెను తా మింట నిలిచి ¶ యుండుమనె జన్మ యీ జగజ్జనని
బృందారకవందిత యోగమాయ ¶ నందన నీకయె యది హాని మతియే
ఇత డీపుడు నల్లవన్నెను దాల్చుట ¶ సతతము కృష్ణాఖ్యను ప్రసిద్ధుండు
వితతమ్మగు నామములు కార్యముల ¶ చతురతల పెక్కు యుగయుగమ్ములను
ధవళాదివర్ణముల ముం దొప్పెను ¶ చెవుల విందు చారిత్రిలు పెల్లగు
కవుల వర్ణనలు నగు ననంతములు ¶ భువి దివిచారుల స్తుతులు బహుళములు
గానగు నిజంబు వసుదేవసుతుండు ¶ గాన నిపుడు వాసుదేవు డీతడగు
దాన వారి యంకిత మీతని గుణి ¶ వేనమ్ము ధన్యుడవు రాము డీతడు
బలుడు బలభద్రుడును బలరాముడు ¶ ఖలభంజనుండు సంకర్షణుండు
తెలుపువన్నెగల మూర్తియిత డల్లె ¶ తెలిపితిని రక్ష గూర్చు మీ సుతుల
వీరు నారాయణాంశజనితులయి ¶ భారము భూమికి దాలుప నొప్పెదరు
మీరు భక్తి పోషింపుడు దనుజుల ¶ పార మాయలను జేయ గవయుదురు
వారెల్ల కాలవశమున జెడుదురు ¶ జేరెదరు ముక్తి మహిమల దలంచి
మేలు బొందు మిను క్రమములు నిట్టివి ¶ బాలుడితడు బ్రహ్మాండరక్షకుడు
కాల గతి సఖుడు ధ్యానప్రియుండగు ¶ జాలి దూలు నీ నీలశరీరుని
నీవ మీకబ్బె మీపూర్వతపము ¶ చేవ సిద్ధించె యాలించితి విక
బోవలయు నేను సెలవును జేరగ ¶ దేవదేవు నీతని వృద్ధి నంద
దీవించితి నని పూజింప నలరి ¶ సావిధిన మరలి వసుదేవుం జేరి
దేవకియు నుబ్బ విన జెప్పె నచటి ¶ సావకాశముల కొఱత వడకుండ
తనగీముం జేరె గర్గమునీంద్రుండు ¶ జనవరా! శూరసేను సుతుం డలరె

## -: శ్రీకృష్ణ బలరాముల బాలక్రీడాభివర్ణనము :-

వినుమిక గోపాలబాలుడౌ శ్రీ ¶ వనితాకళత్రు కృష్ణుని బాల్యము
బాలశశాంకుని బోలె దినదినము ¶ బాలురు వృద్ధిని గనిరి యది సెపుడు
యా లలితాంగుల యనుదినవర్తన ¶ లాలిత్యమొప్పు కళాస్ఫురత్వము
కేళ్ళు సాచి దోగాడుచు కూర్చొని ¶ కాళ్ళు పదిలముగ నిలువబడుచు త
ప్పు ళ్ళడుగులనుగ మెల్లన నడచుచు ¶ నిళ్ళ కడపలను దాటుచు నవ్వుల
కొంగు లూతగొని వెంట నరుగుచును ¶ సింగారము గూర్పంగ తప్పుకొని
రంగా రెడి గోవుల తోకల వద ¶ లంగ బోక నవి తిరుగ దిరుగుచును
బురదల మేనుల నలదంగం బొరుచు ¶ తరమున జన్నుల కేడ్చి యమ్మలను

సరసఁ జేరి తొడలెక్కి కంఠముల § నురములను మోపి చేప దడుముచును
బిరబిర క్షీరము లాని తృప్తిఁ గొని § సరసరఁ దొలఁగుచు చక్కని వచ్చిన
పెరబాలురతోఁ గూడి యలరుచును § దరియ నురుకుచును వేళలను బెద్ద
తడవుల నాడుచు తల్లుల గునుకుచు § కడు విలసిల్లగ తనువంగములును
దృఢతరములు నై చూపరులకు నిం § పడర దలఁచి సంతసమున నమరులు
తడవుల నుతింప రంభాదు లాడ § తడవుల మానులు తత్ప్రసంగతిని
తడబాటు చిహ్నముల నరులు గూడ § తడవుల భయములు వీడి సుజనులకు
తల్లుల చన్నుల పాలు గ్రోలుటల § ఎల్ల భువనముల నేలెడు మూర్తులు
వల్ల గొనిరి యందులను నగుసాక్కు § నుల్ల సనంబుల మాత లచలులుగ
వెల్లివిరియు యోగామృత పానుల § నల్లుకొన్న సంతసము తము జెల్ల
నల్లారుముద్దు లెల్లరకును గా § నల్ల బలరామకృష్ణులు నొప్పిరి
వదనకాంతి బాలార్కచంద్రులను § మదిలో బోల్పగ పరువునను హారులు
కుదిరికల శిరములను నిక్కించుట § గదియు నంకమది పన్నగ వరముల
బోల గన్పడుదు రేనుఁగు కొదముల § చాలున పంకములను రంగమింప
బాలుఁడు యశోద పాపడు కృష్ణుఁడు § లీల గొని యామె నమ్మయని బిలువ
నిమ్మన నేర్చెను ముందున యమ్మల § కొమ్ముల నెన్నడు గవయక దా ముపు
రమ్మల కవ్వల నెమ్మదిని మెలఁగు § యెమ్మెకాడు బాల్యమ్మున విధిగా
వెలసెను మాయావిజితుడు నవ్వున § యల వేదరాశి పలువిధుల తన్నుఁ
దలకొని నుతింప తా తరమందెడు § నలినాంబకుండు నవ్వ వృద్ధిగనె
పుడమియు మిన్నును పూర్వంబున రెం§డడుగుల నామిన మూర్తివటుడు దా
నడుగుల దృఢమున ముందరకు నిగుడ § నడుగు లడుగంటుటను రిపుల దోప
బడుట సూచించు విజ్ఞులదృష్టిని § కడుచోద్యమ్ములు స్వేచ్ఛ చలనములు
పలుకులు విందులు శ్రోతుల కెల్లరకు § ఇల నడయాటలు నేత్రోత్సవములు
వల నందు పనులు నద్భుతమ్ములగు § నల రామకృష్ణు లవియగు నృపవర !
హరి తా కృష్ణుడు తాను హరుభాతి § పరిగణన నిక్కు బాల్యమం దిటుల
హరునకు దనకు నభేదము గను డను § సరణి బొలుపందె భూరజమె భూతి
ముందర వెలసిన ముత్తెంపుబొట్టు § చందము బాల శశాంకుని కళగా
యంద మొప్ప ఫాలమున రక్షకయి § చెందించు జుక్కబొట్టు వీక్షణను
కాముని గెలిచిన తన్నది యనఁగా § నా మాడ్కిని కందమున నీలమణి
యా మహాదేవుని గంళకంఠమును § సామం బందగ నీబాలు మెడను
వేల్లు హారములు బోల్పదగును గా § జాలునను నురగహారముల శివ

చాలిట్టు నొప్పె నీ పరముడు హరి ƒ మేలందు ఛాయ నా నుమేనునకు
పినబాలుర నేమారక తల్లులు ƒ కనుల చక్కి తప్పంగనీక లా
లనల పశువులను బారి తప్పింతు ƒ రనల, జల, కంట కాదుల తలముల
భీతి గొల్పు బోనీక కాచియును ƒ చేతనైన రక్షణల గూర్చుచును
ప్రీతి గొనిరి చిత్తముల లీలలకు ƒ యా తరుణమందు పలుకు పలుకులకు
తాతా! యవ్వా! యమ్మా! నానా! ƒ దా, తే, మా, నా, పాపా, మామా
యని దినదినముల నేర్పిన నుడువుచు ƒ తనువు లా కళలు నిగ్గ జననులకు
వనితాజనముల మెలకువలన విడిచి ƒ పనులు విడిచి గోపకులు తముం జూడ
రామకృష్ణు లా తెరంగున నట లీ ƒ లామనుజ బాలురై చరియించిరి
రామ లంద రభిరామత వారి విశ్రామము లేకను వర్ణింతు రెపుడు
తా మొనరించిన యఘరాశి తొలిది ƒ నామ మడగె వారెంతటి ధన్యులో
చప్పుడు జేయకు మంచు జంకె నిడ ƒ దప్పుచు నలుగం బారి యంతలో
నెప్పటి యట్లన అంతుం జేసి తమ ƒ చొప్పు దప్పఁగొన యవ్వా! విందులు
ఇప్పుడె వచ్చిరి జూడు మటం చని ƒ మప్పెదరు వారి యాగడతనంబు
అప్పప్పబోణు లటు గని నవ్వుచుం ƒ గుప్పున నెత్తి కొనంగ పాల్గారివ
రొప్పు లొప్పు జూపింప పాపలకు ƒ దప్పిదీర చన్నులను గుడిపెదరు
దక్షులై రందులోన శౌరియును ƒ వక్షముగొను పరవారి గృహమ్ముల
వీక్షించి దొంగ జాడల నాతర ƒ జాక్షుల నేమరపాటున వెన్నల
భక్షణంబు దాం జేసి యిలుజేరు ƒ నాక్షణంబు నన తల్లిని విడువడు
తోడి బాలురను గూడి యాటలను ƒ జోడు పెద్ద తా నై వారలనుం
గూడలు లేగలు మీరు గండు నే ƒ నీడు గొనెద పాలకు డనగ తెలుగు
రాజు నేను నామేర మీరుండం ƒ జూచుకొనుడు నే పంచు కార్యముల
దాచుకొనక చేయుంగం దగునని ƒ చూచు బాను సేవకులని నొకపరి
యాటన నింకొక యాట సెపుదు నని ƒ వాట్రమైన దొంగను నే నయ్యెద
బూటకపు నిదుర మీ రుండవలయు ƒ మాటుం జేతు సొమ్ముల మరి యిత్తును
యని యొక యాటను నేను మిమ్ములను ƒ నొనరగు బొమ్మలు నంచుం జూతుగా
నను మీరలు ఆడించు వానిగా ƒ గనవలె నంచును తా నాడించును
ఇటుల మూలల నొన్నరుకుచు దాగుచు ƒ చటుల గతుల దిరుగుచును నవ్వుచును
పటుతరమ్ములగు నూయెల లూగుచు ƒ అటులగాక చేబంతుల నాడుచుం
జార చోర జాడలను దీరుచును ƒ నారులం బురుషుల నవ్వుల బఱపుచు
పేరు పెంపుగొని యారి తేరు యశోద్వారలు జేయని సాహసము లెల్ల

-: గోపికలు శ్రీకృష్ణుని దుడుకుఁదనములు యశోదాదేవితోఁ జెప్పుట:-

చారు తరంబుగ నటుఁడు రంగమును । చేరి చూపఱుల చూపగ దనరెడి
విధమున గొప్పట గోపసతుల నొకవిధిఁ బరచిన యా చేడియలందరు
ను ధవులు తమ్మను బరిహరింతురని । విధి జనకుండని తెలియరు బాలుని
గాన నా నందు రాణిఁ గన వచ్చి । వినయమ్ములు దొలుకాడ నిట్లనిరి
చేనందుము మాదండము తల్లీ! । నీ నందను దుడుకు లవియెల్ల విను
బాలురకును మా పాలు జాలవని । బాలెంతలు మొరవెట్టిన విని యీ
బాలుఁడు చేసిన పని విను మా యా । వులను గుడువ దూడలను విడిచె గడె
పడతిరో! నీదగు బిడ్డ డిలుజేరి । కడవపాల నాపడుచులకుఁ బోసె
తోడి వారగుట దావిరి గాదా । బోడి కడవలం బగులగొట్టెనే
మీ పాపడు మా యిండ్లఁ జొరబడుచు । ఆపోవఁ బ్రాలు దావి గనపడక
కోపమునం మమ్మగాంచి చిమ్ముకొని । వాపోవుచు నిటవచ్చెఁ గొట్టినటు
పుట్టియుఁ బుట్టడు నేడే దొంగిల । నుట్టి యందకను రోళ్ళు పీటలును
బెట్టి యెక్కి కుండలను చేతులఁ । బెట్టజాలకను క్రిందఁ గట్టె వే
తూటొనరించియు మీగడ పాలును । వాటముఁ గనియును దావె దోయిలిని
బోటీ! మా యింటను నంచు నొక్క । చేటి బల్కెడా గట్టి మిట్టిపడ
వీడు నాయింట పెరుగును మెక్కుట । కోడలు చూచిన వెఱగు గనక నా
కోడలు మూతిని జమిరి వచ్చెనిట । కోడలె దొంగిలె నంచు గొట్టితిని
వేడు కగునె నీ వింటివి జెపుమా! । చేడియరో! మాగోడు దవులుగద!
జూడ చక్కగాఁ జెప్పితివే నీకతోడు గోడు దూరమ్మ మే ల్గలుగు
నారీ! విను వారింటి లోపలికిఁ । జేరి మీ సుతుడు నేతిని మెక్కియుఁ
మేరదప్పి వీరింట కుండ నిడ । వారు వీరు వాదములఁ బెనంగిరి
వేలుపు లకు నాకంబెను మరి యే । వేలు పవండని పకపక నవ్వుచు
వేలుపు గోడను నెంగిలి పూసెను । లీలావతి! నీకొడుకునకు దగునె?
వెన్న తినంగను జూచెను గా మా । విన్న బిడ్డ యడ్డంబును రాగా
జున్నుల నొడిసియు బట్టియు రమ్మనె । చిన్ని కొడుకునకు నింతిరో! నేర్పితె
ఇమ్మగువయు తనయింటి వాకిటను । గుమ్మరుచున్నను బిలిచి పే రడుగ
కెమ్మోవిని గరచియును విభుండనె । కొమ్మా! యిది సామాన్యపుఁ బనియే
చేతి బంతి తప్పెను మీ యింటిలో । జాతు ననుచు భవనంపు దొడ్డిలో
యాతురమున నొకబంతి కని రాగ । చేతిబంతి యగ నిందుగంటి ననె
కూతురు పానము బిత్తుల జేయఁగ । నాతిరో! చూచితి ననుట మంచిదిదె!

కోతిచేష్టలివి పాటించుట యిది § నీతిగాదు విన జేసితి దెలియుము
ఇచ్చెలువయు నీ సుతు డింటిలోన § మ్రుచ్చిలుటయు దా వెంట న్బడగా
వచ్చెదవే నీ సొమ్మును నాతో, § బుచ్చుకొనగ నీ యిచ్ఛ యేమి యనె
తుచ్ఛపు మాటలు గావే! సకియా! § ఇచ్చిఱుతని జూడఁగ నచ్చెరువగు
మచ్చెకంటిరో! మానము గాదా! § మెచ్చుగాదు చీ బుచ్చు నీకొడుకు
కొడుకులు లేరని యొకసతి చింతిల § కొడుకుల గలిగించుట యెంత నాకు
పడతిరో! మగనిగ తను గైకొన్నను § వడయ జేతు నని పడతి! సహింతుమె
తలగినదానను రాకు దూర మన § తలిరుబోడి! నీ వెటు దలగితి వని
తలగుచోటు జూపింపు మనియె గా § తల యూచుచు నీసుతుఁడు తనుమధ్య
వ్రాలగ వచ్చిన నీ సతి కృష్ణా § చూలాలను దప్పంగ బొమ్మనఁగ
చూలు మూల మెట్లని యడిగెను § లలనామణిరో! సెప్పెదురె సతులు
మగువా! నీ కొమరుండు యింటిలో § మగవారలు లేకుంట చూచియును
తగు సమయముననను బొందుమనియె నే § జగమున నేర్చెనొ యిటుల మాటాడ
నిదురబట్టి నాపట్టి యుండ గని § యెదలో నేమని దలచె నొక్క గడె
యదయత జడనుఁ లేగతోక ముడి § గదియఁజేసి బెదిరించె దాని విను
పొట్టనిండ పాల్గుడిచియు నాదగు § పట్టె యుండగా బానెడు వెన్నను
ఎట్టు దెచ్చెనో పట్టెడు పట్టెడు § కుట్టూపిరిగొన పెట్టె నోటిలో
యొక్కనారి పెనుమత్తున నిద్రను § జొక్కియుండ చీరను దొలగించియు
ఎక్కడ యొక తేలుం దెచ్చి చు § రుక్కున గుట్టగ జేయ మొత్తుకొన
ప్రక్క నిల్చియును నవ్వును గ్రుక్కక § చక్కనిరూపున నిక్కి నిను గంటి
అక్కజం బయెను చక్కని చుక్కా! § యొక్కమంత్రమున నొప్పి మరల్తును
ప్రక్కఁ జేర రమ్మనె నే మది యిం § పెక్కనె యువతీ! నీకుఁ బుత్రునకు
పెక్కు లున్న వవి యందు జెప్పదు నిం § కొక్కటి విను మేమందువో యది విని
కొడుకు కోడలును ఏకాంతమ్మున § క్రీడలఁ దేలుచు సొక్కియున్నతరి
పాడితప్పి పెనుబాము గొనివైవ § చేడె తాను దిసమొలల దిశలకుఁ
గూడ బార నీబాలుడు వారికి § వేడుక దొలపుట గాక హాసించెను
వీడు ముందు జెడుద్రోవ గాన డా § తోడిసతుల యవమానము జూతువ
తరుణి! యొక్క తెయ దధిని భాండమున § నిరవుఁ జేసి దరువంగ వంగినను
పరువున నీతడు పణతి వెను గవిసి § చరుసగొనియె మగవారి చెయిదముల
తరుణిరో తగవటె తనయునకు నీకు § పరిభితి యులవడునుగ కొంటె నడత
కలకంఠీ! మావాడ గరితలము § పలువుర మొకటిగ జేర నీతనయు.

చులకన బట్టగ జాలుదుమని | మాపాలుల్ పెరుగును దాచి పొంచుకొని
చలనము లేకయు రాకల్ దలచియు | తలుపులకడ పార్శ్వముల నున్నండుట
చాలు చూచి గావలయు చిత్రముల | చాలు దెలియ వెఱగయ్యె కోమలీ!
తలుపుల ముద్రలు తాళము లున్నవి | నిలిచియున్న వారల మట్లనె యుంటిమి
నిలయములలో నగు చప్పుడు వింటిమి | కిలకిల నవ్వును నొక్కయింటిలో
వలవల నేడ్చును నొక్కభవనమున | తలగ జూచు నొక్కొక్క తలమునల్
మేలిపాట నొకచోటం బాడును | నిలపై చిందులు ద్రొక్కు నొక్కయెడ
కులుకు నాడు తల యూపును రొప్పిన | జాలిబుట్ట నీ లీల విడుతునను
పలుకు మానమును జూపు నొకటొకట | వెలదిరో యివ్విధ మందరి గృహముల
కలత బెట్టి దిట్టియు వెక్కిరించి | యలుకు మాకె గా ఖగ మృగ ధ్వనులల్
పోల గూసి తప్పించుక పరువిడి | తలిరుబోడి నీదాపు జేరె నొకో!
భూతములున్నవో? పీనికడుపులో | చూతము పాలుల్ పెరుగు నుత్త దయె
భీతి చాల పొడగట్టె గాదె యివి | లోతుగ జెప్పుట కేల మిగతలను
ఉత్తకుండ లవి వ్రక్కలు కొన్నిట | బిత్తరంబు మాకయ్యె నమ్మరో?
బిత్తరులగు మా కేమి దోచదొ | ఎత్తు లిప్పటికి నెరుగరు మగలుల్
వత్తు రివి విన్న మొత్తము క్రోధము | చిత్తములను నుప్పొంగ గతియేమి
కుత్తుకొందుమే మగవారలు మా | తత్తరంబు లిక దలగుట యెట్టులో
సిరియును గలిగిన గుడిచి కట్టుదురు | సరిసమానులము గామె యదల్పగ
విరసముగా మది దలపకు మతివా! | సరస జేరితిమి సరసము కోరక్తే
అమ్మ! నీవు నీకొడుకుకు జెప్పుము | మమ్ము మాతలములను జోరకుండగ
నుమ్ము యట్లు గాకున్న దరలుదుము | కొమ్మల కీర్తిని బూరించుచునున్
అని మరి బలుకగ నురియాటను గొని | మనమున మానము దలపోసియు నా
వనజ వదన లందరు వినగా నా | వనజనేత్రి నందునిసతి యిట్లనె
కనక లతల బోల్తునవుల మెరసెడి | వనితలార! నాజనులార! నే
పినయమ్మల మిము నూరడింతు నా | తనయుడు మీదరి రాకుండ జేతు
చన్ను దాపుటలు జాలింపక నా | సన్నిధినే తిరుగాడుచుండునే!
ఎన్నడు బొరుగిండ్లను దెలియ వనునె | వెన్నలు దొంగిలు టెట్లు? యివి యెట్లు?
అన్యము లెరుగని యట్లుండియు మీ | కన్యల కెట్లుల్ కడగండ్లు బెట్టె
అన్యాయం బగునట్లు దిరిగినను | ధన్యుండగు నా దండన నింకట
మంచివాని యాకృతిని మాటలు వ | చించుట యాడుట పాడుట నడచుట
వంచితు డంచును నెంచియుందు నే | కొంచ పరచినను కులము వెలిగాదె

కొమ్మలు బంగరు బొమ్మలు ముద్దుల ఽ గుమ్మలు క్షితికిని సొమ్ములు గుణముల
గుమ్మరించు నుడు లమృతమ్ములుగా ఽ నిమ్మకొన్న చరితమ్ములు నమ్మతి
కాంత లిటుల దన తల్లితో పలుకగ ఽ శాంతుఁ సొంపున సాధుని పగిదిఁ
భ్రాంతుని కైవడి భీతిగొన్నయటు ఽ చింతించినట్లు స్వాంతమున దోప
వింతబాల నీ వింతలు జేసితె! ఽ యెంత నేర్చితివి! చెంత విడకు మా
యింతుల చెంగట దిరుగఁబోక నీ ఽ వింతటిలోనే యాడుకొను మనియు
జనని వచించిన జడునివలెను తన ఽ తనువు గదల్పక గోలబోలె నను
వున చనుల నున్న పాలు ద్రావి యా ఽ స్తనవేదిక తన తలమోపి యాడె
బాలుడు లోకపరిపాల పాలుడు ఽ శీలుడు మునుల సుచరితల వ్రాలుడు
లోలుడు స్త్రీసంగతి గనుటల సుర ఽ జాలుడు వేడ్కల నుతి నందుటలుఁ
గనెడి వాని శ్రీకృష్ణుని లీలలు ఽ వనిత లెరుంగరు సుకృతఫలము లని
ఘనులునైన ముని జనులకె దెలియును ఽ యొనరులు దలపగ నెవరు గలరు నృప!
ఇటుల కొన్నిదినములు గడవంగను ఽ తటతట నడుగులు ధరణి మ్రోయఁగా
దిటవు చాల గల బలభద్రుడు మొద ఽ లట నాడుచున్న బాలుడు యశోద

-: మృద్భక్షణ విశ్వరూప ప్రదర్శనా ద్యభివర్ణనము :-

గని వెన్నుడు పెద్దింత మన్నదినె ఽ గనవేని రమ్మా యమ్మా!
వినదు జెప్పితిమి వేడుక లా యవి ఽ తినగ నేమయిన బెట్టి యది మాన్ప
మనగ వెన్నంటి చేరి బాలుకే ఽ లును బట్టికొనియు పలికె బాలునకు
విను చిన్నికృష్ణ! నను గన్నతండ్రి! ఽ దిన కన్న! మన్ను గని రన్న సఖులు
మన యింటఁ గలవు మంచిభక్ష్యములు ఽ దినుమంటి వేవి దెచ్చి యిత్తుఁ గద
రా నావెంట నవీనంబగు నవి ఽ నేనుఁ ఇపుడే నీకిత్తును గద
అని పలికిన యా ముగుద తల్లికిని ఽ ఘనుడు నెఱదంటయైన కొడుకని యె
నను నానోరును గని యనదగు గా ఽ మనమున రోతని యెఱుగనె తల్లీ
మను దినగను నాకేమి తక్కువయె ఽ ఘనమగు భక్ష్యములను దింటినిగా
కడుపును జూడుము నిండియున్నదియె ఽ దుడుకుఁదనమ్మనఁ జెప్పిరి వారలు
విడు మా మాటలు నీవు నన్ను ఽ గొట్టెడి యని యని జిన్నపుచ్చగను
ననుఁ జూచి నవ్వఁదలచిరి నిజ మిదె ఽ పినవాడనె యాకొంటినె వెఱ్ఱినె
చానరో గాదుగ మోద మిరవుగొనఁ ఽ గానుపింతు నానోటిని జూడుమ
నా నయమును వాసనయు న్మాతా! ఽ నే నబద్ధ మాడుమనె పునీతా!
విశ్వవిదిఁ డిట్లు నవువదను డగుచు ఽ విశ్వంబున కాధారభూతుడును

విశ్వము గుణముల చాలునఁ దిప్పుచు § శాశ్వతుఁడైన పరాత్పరుఁడు కృష్ణుఁ
డత డని వదనము విప్పుచు నువిదకు § సతమగు పల్కుల పరిగణించు డే
గతిఁ నను గొట్టగ చేతు లాడునా? § సతి జూచెను నా మాయాలోలుని
ముఖమునఁ జలములు వనములు భూమియు § శిఖి తరణులు శశి దశదిక్కులును
ముఖములుగా బ్రహ్మాండం బంతయు § నఖశిఖ పర్యంతము లోకమ్ములె
గాఁగన భ్రమ గొని నిలిపె చిత్తమును § భోగిశయనుఁడగు నేమొ యితఁడు దన
యోగము నాకునుఁ దేటపరచెనో § యోగమాయ తనబూమెలు జూపెనో ?
గలయో నేను యశోదను గానో ? § తలపున కెక్కువ గల చిత్రంబయె
కల సత్యము సంకల్పము లెట్టివో § ఇలాతలము లిం దెన్నియొ కంటిని
బాలకు డాబ్రహ్మాండపు మూలుఁడు § తూలుక గానుగా కడుపున జగములు
బాలమాత్రుఁడునుగాడు నిజముగా § భాసిల్లెడు సర్వాత్ముఁడు విష్ణువు
ఇమ్మహాత్ముఁడే విశ్వంబంతయు § నెమ్మి నిల్పగా వదన మందునను
ఇమ్మహనీయుని యాశ్రయింతునా § నెమ్మదికై రక్షింపు మంచునుక
నా సూనుడు నా యేమరియుంటిమి § నా సహాయులును నేను నా పతియు
వాసిగన్న మా గోవులు మందలు § యీ సన్నుతునిక మోమునం దుండ
నీసుడంచు దెలియంగ లేక నే § పాశములగు సంసార వాంఛలను
నాశ మయెడు తెర గిదియుక గానక § నాశమాది ప్రోవుల మది నిలుపక
ననుచు తన్ను పరమేశ్వరుఁ డని భా § వన జేయుచుండ హరి కప్పె మాయ
వనిత యంతటను కొడు కితడంచును § తనతొడ నిడుకొని మమతను బెనిచెను
యనెడు శుకునితో ఘనుఁడు పరీక్షితుఁడనియె నందుఁ డాతని యశోద
మును పేతపమున బెంపొందిరో యీ § ఘనుఁడు హరిసుతుఁడు నయ్యె నలరింప
వినిమెదఁ జెపుమా ! మునీంద్రవర ! యన § జనవరా ! అదియు నే జెప్పెద విను
వనజాసను డొకనాడు ద్రోణుడను § యనఘుని వసువుల ముఖ్యుని బిలిచియు

-: యశోదా నందుల పూర్వజన్మ వృత్తాంతము :-

మీరు ధరను జన్మింపవలయు గా § సార యుదార చరితులు దంపతులు
మీరు నాయాజ్ఞ యిద్ది హరిదె యని § జేరుమంచుఁ జెప్పిన వారు చెలగి
హరియాజ్ఞయెన నీయాజ్ఞయెన § హరిసేవ గూర్పవలె గాదె దేవ !
అరయ మా జన్మ పవిత్రమునుగా § చిరతరంపు నీపదము గను తెరువు
అదియె గాద యన నట్లే యనఁగా § గుదురనైరి జన్మింపఁగ నిలలో
సదయాత్ముఁడు ద్రోణుండు నందుఁడగు § విదితమతని సతి యా ధర యశోద

బరగుదురు వీరు విరించి పల్కుల § పరిపాటిని హరి కృష్ణు డన జెలగె
మురిపెముల నెత్తి ముద్దాడుచుండ § స్థిరమైన ముక్తి పేరి కిడ డెల్లు
ఒక్కనాడు తన యింటిపాపలను § నొక్కొక పనికై యందరు బోవగ
యొక్కతియై యాయశోద వేగమ § జక్కన దరికంబను కడ జేరియు
యొక్క పెద్దభాండమును గుదురునను § నుక్కుతోడ దా నిలిపి దధి నింపి
చక్కనను నాకత్రాడు చుట్టియును § మిక్కిలి వడిగా ద్రిప్పు పూనిక గని
కరపల్లవముల యరుణకాంతి యా § కరముగ కవ్వపుత్రాళ్ళ పవడముల
సారకాంతి చెలువారగఁ ద్రిప్పంగ § నారి యురోజము లట పెద్వసంగ
నవియు నొండొకటి రాచుకొనుచుండ § నవిటిపైన గప్పిన కొంగు జార
రవిలిన శోభయు గలహారంబులు § గవిసి పెనవడుచు వెలికిం గన్పడ
కౌను నులియగను గంకణముల దగు § ధ్వని నిండగ నా కొప్పును సడలగ
ఘనమగు కాంతుల చెవుల కమ్మలును § నొనరుగ చెక్కిళులను వెలిగింపఁగ
చెమట ముఖమ్మున బొడయుట గనిరన్ § విమలమైన పద్మంబు మీదుగా
హిమకరణములు దట్టముగాగ నమరు § సుమగంధియు తీవరమున దరువగ
చపుడుల బాలుడు బెదర బాడుచును § విపులమైన సొం పది వినువారికి
నపుడే తరుణులు చివురుల నరలగ § నా పువ్వుబోణి పెరు గిటు దరువగ
బుడుతఁడు కృష్ణుడు నిదురన్ విడిచియు § షడి చేయుచు కేదుకుచు వ్రాలుచు
వెడవెడ గంతులు వైచుచును పెరుగు § కడవదరికి వడి జేరె యమ్మరో!
నాకు చన్ను నీకున్న కవ్వమును § నాకత్రాడునను దియగనీయ నని
యా కవ్వమునున్ కరమున బట్టెను § యా కమలేక్షణ చిరున వ్వొలయగ
పెరుగుం దరచుట మాని సిద్ధమయి § కరముల నెత్తుక యంకతలమ్మును
నిలవుగ నిలుపుచు కూకటి దువ్వుచు § ముటిపముగా నా బాలు చన్గుడుపు
చుండగ పొంగెను పాలకుండ పొయి § నండబాప నా యండజయానయు
నిండువడిని బాలకుని డించియును § నుండుమన్న! శీఘ్రమ్మున వత్తును

## -: శ్రీకృష్ణుఁడు దధిభాండ వికలనాదుల్ చేయుటవలన యశోద యతని వెంటఁ దిరిగి పట్టుకొనుట :-

ఉండుగ ద్రావుడు వవల క్షీరమును § నిండింతును నీపొట్ట బట్టు నవి
రెండునిమిషములు దాళ లేవె యని § దండనగాని విధమ్మున బలుకుచు
కడుపునిండ బాల్ద్రావని కొడుకును § విడిచియును పోవ నాతం డంతట
వెడవెడ నేడ్చుచు బొర్లి నిలబడుచు § దుడుకుతనమ్ము సుడిబడగ ఛాయిగొని

పెఱుగకుండ దాకంగ విసరగను | బఱిగె వ్రియ్యలయి భాండము జెడగా
దొరలిన మీగడ పెఱుగు జుఱ్ఱుచును | వారిజముల నిరసించెడు కన్నుల
ధారలు గారగ దుడువ కరములను | బేరుకొన్న మీగడ పెఱుగును మో
మంత యంత దనువంత నదియుగా | సంతసంబు భయమును నొకతరి నే
వంతు గొనగ బాలుండు నుండుతరి | ఇంతి వచ్చె నట బాలుగ దించియు
రంతు జేయు కొమరునికి పా ల్గుడుప | సంతరించు మది శీఘ్రిత గనగా
చూచెను కడవను వ్రియ్యలైన తల | యూచి చిరుత డెట దారెను నంచని
చూచె పార్శ్వముల వెలిని గానకను | వాచకములఁ జెక్కుల నాతని నడ
తను మది నొప్పక చలమును గొనియుఁగ | బినవానిని నే దండింపగనుఁగ
దనరకుండుటయె యింతకు దెచ్చెన ! | కనెగా ! దుష్టతనమ్మును నన్నుఁగ
గనడుగ కొడుదును ననుచు బెదరడుగ | వినయము నయమును గానడు విడగా
ననరున గుదురదు నంచు వెదకగను | కనుల నెఱ్ఱజేసియు బెదవి గరచి
ఇలు వెడలియు బొరుగిండ్ల నడుగుచును | సెలగోలను చేపట్టి నడువగా
లలనబాలు డొకయింటి రోలునఁగ | వెలిపాటును బొర్లించి యది యెక్కి
యుట్టిమీది వెన్నను దా దినియును | కట్టెదుటనుఁ గోతికిని బెట్టుచును
యుండ గాంచి నిను నవనీతపు చోరుం డనియును గోపకసతు లాడఁగ
దండింపని కారణమున నీవుఁగ | దుండగీడు చందంబున నిక్కితె
కాని రమ్ము [illegible]ంచుకపోదువె | నను నీ మదిలో జుల్కన జూతువె
కాని నడత గని యూరకుండుటకు | చాన యశోదకు దగు ననుకొంటివ !
బాలు డీతడని భావించితి యీ | లీల పెద్దలకు నైనఁగ లేదే !
మేలికొడుకవుగ ! యొక్కడ వని నిను | పాలన జేసిన ఫలము జూపితివి
భయ ముంతునన్న! నది లేద నీకు | భయమున్న దొంగనడత యుండదుగ !
నయమతివై యొకచోట నుండువన | నయము వ్రియముగా నన్ని తిరిగితివ !
బుద్ధి వినుమని యెంతునేని నీ | బుద్ధి యింతటిది గానగవచ్చెను
శుద్ధమానసము గలదు వెదుక నక్రబద్ధములకు నది యునికిపట్టు నగు
నిన్ను బట్టి దలపోయ బారుటకు | నన్న లెన్ని యౌ పన్ను చుండువట
మిన్నవారి నెకసక్కెములాడుట | నెన్నగ నీతల బుట్టెనేమొ యవి
కొందరి వన్నియుఁ గూర్చి చెప్పినను | సందియ మే నందితి నపుడు నీ
వందున మన్నన జూపుటగానీ | తొందరగూర్చితి వే మెచ్చవచ్చు
లాలనమున బహుదోషితు లాదురు | బాలకులెల్లరు తలిదండ్రులు తమ
జాలినడకలను జూపగ పోషణ ! | బాలనమాత్రము దండింపగ దగు

రారా! చోర! దురాచారా! మహి ఽ నీ రాయిడి మాన్పఁ జాలుదు నా
వే రాకున్నను బోనివ్వను సూ! ఽ మా రాడిన మాఱెదు రాడుట యగు
నిలు నిలు మంచని కోల ఝళిపించి ఽ లలన బాలుఁ దగ్గఱని బెగ్గడిలి
నిలువక పాఱెను బోలుం డిగియుఁగ ఽ చలముఁ బూని తల్లియును వెంటఁబడ
మొలన గట్టినవి గజ్జెలు ఘల్లన ఽ తలకున నజ్జలు సాచి వేగమున
లలనలు సందడి సవ్వగ వెనుకను ఽ చులుకఁ జూప తనమాత యెదిగి రా
గనె నవ్వసితయు నడ నుడి వడుతును ఽ నోనడు దప్పి మోమున దీనతయును
తనువున జెమటయు నడు మల్లాడుల ఽ ఘన కచములముడి సడలి చెదరగా
దనరిరాగ నొకకొంత నిలిచియును ఽ నోసరు బడిన స్తంభముల నడ్డముగ
వనజనయన నట మలప్రుఁ బెట్టుచు ఽ కనుల నీరు వరదలుగ బారగా
అమ్మరో! నను గొట్టంగ బోకుమా! ఽ ఇమ్మెయి తప్పును జేయ నెన్నటికి
నమ్మ నావూఁ యిక నే దొంగిల ఽ కొమ్మలెల్ల నను జూచి నవ్విరిగ
పాఱజిమ్మ నెలగోల జేయుదును ఽ నోరు మెదల్పను నీదరి పెక్కులు
నారీమణి నీపాదముల బడుదు ఽ నేరనివానిని నను దయఁ జూడుమ!
కొడుకుమాట పాటింపవలె తల్లి ఽ యడుగుడు నేనే దుష్టచేష్టలను
గుడి దిరిగిన నైనన్ కూటిని గని ఽ యడుగు బోలి పక్షివలె నీదరి బాయను
అని కనులు నులుపు నాయాసపడును ఽ తనువు శోషిలఁగ నలుకున నడుగిడ
మనము పరవశము నుసురు నిట్టూర్పు ఽ గనపడదానను లోగె జననికిని
తరుణికి తనుపోషించు తన్వికిని ఽ వరగుణజలధికి వనరుహాక్షికిని
సురుచిర మానస పరిచార హారికి ఽ పరమ పతివ్రత యగు నా సుదతికి
యశోద కిట్టుల జిక్కె దయానిధి ఽ యశోదయుంబగు తనకు కుబేరుని
యశోధనులు నగు కుమారవరులచె ఽ యశోదనందను దిశలుం బొగడగ
ఇట్టి పట్టునకు లోనై చిక్కెను ఽ ముట్టడింపుగను పురమును బోలియు
చుట్టి బాహువుల విష్ణుపురము నిల ఽ పట్టుగ నెడి యావిష్ణుని గృష్ణుని
పట్టు కొన్నంతఁ జేష్టలు దక్కియు ఽ జుట్టుకొన్న విషయాదుల దృష్టిని
మట్టుపెట్టి యిట్లుండ నగును నని ఽ గుట్టెఱుంగు గురుయోగి విధమ్మున
నున్న బాలు గని యా యశోదయును ఽ వెన్న బోలు హృదయమ్ము గలదియై
గన్నకుమారుని గొట్టంజాలక ఽ వెన్నును మాయ యదేమో నృప! వినుఁ
తిన్నని నవ్వున శిశువును గృప గని ఽ చిన్నివాని శిక్షింప నెట్టు లని
ఇతఁ డా కృష్ణుఁడు వెన్నదొంగయును ఽ సతుల హాసించిన వరగుణుండు నా
కౌతుకట యెన్నఁడు నడి త్వరుగడంట ఽ మతిలోని వంట పాలు దధి నేయి

దొంగవం చనిన, నే గాదను నట ఽ రంగలించునట సద్గోష్ఠిం గడు
బ్రుంగఁ జేయు నట కొంటెగుణంబుల ఽ ముంగల నాకట్టున వసించు నట
నన విన బలుకుచు నాపిన్నను గని ఽ కనుగొంటిని నీనడత లన్నియును
వినయ దూరుడవు జనహిత రహితుడ ఽ వనఘచరిత రతిఁబోవువాడవే
గావు పట్టునం బట్టితి గాదా! నీవె ఽ వ్వారికిని బట్టుల బడకను
తావు తెలియకను దాగుదు వందును ఽ నీనలవల లన్నియు నాకు తెలియు
తోయములం దొలగకనుఁ జొత్తువు ఽ పాత్రయము చిన్నది గట్టుల నెత్తఁగ
నే యనువునవో గుదుర దలంతువు ఽ న్యాయమే? ఘట్టి యాటలు నీకును
మిన్నయైన కంబముల నగలింప ఽ సన్నలు జేసియు చాటును వందఱ
చిన్న లడుగుదువు యన్యుల జూచియు ఽ గన్నపరువునకు లోటిటు గూర్తువె
నీరుల కడ్డము కట్టలు గట్టియు ఽ బొంతువు పరతలముల వానిని
హారిపగిదిని జూతువుగా ముసలివి ఽ చిర మంబరంబు మొలకు నడుగవుగ
కలిమితనము నీకింక నేల! యది ఽ చులకన గాదా! యెఱుగవ నను నే
వలను నైన దప్పంగ లేవుగద ఽ యిలలో నిన్ను వ్రాల్పంగ వంప మరి
వనిత యిటుల తనమర్మంబులు వెలి ఽ కనగ పల్కి యొకజోలను గట్టెను
అనయమిటులె బిగియింతుగాదె ఽ నీజనము నిన్ను గని పరిహాసపటిమ
గను వారగుదురు నే నీ నయమును ఽ గనునంతవఱకు యుండవలె కట్టు
అని యిలుసేరియు పనులుం జేయుచు ఽ తనయుని మదిలో జాలి చెందుచును

## —: యమళార్జున భంజనము :—

జనులు తన్ను గొనియాడ నందనుని ఽ మనము సమత రానుండె నామెయును
వినుము పరీక్షిద్రాజా! తలపుము ఽ జనని తలంపును మఱవడు కృష్ణుడు
నవనీతచోరు ప్రియవాక్కులాను ఽ భువనపోషకుని తెలిసిన గట్టునె
అవినీతి బాపగా ధర బుట్టిన ఽ నవినీతి పరుసు సత్యస్వరూపుడు
కవులమతి నిలిచి వర్ణించ నతడు ఽ భవముల బాపును ముందు తనపదము
గవయుం జేయును కరిపురనాథా! ఽ ప్రవిమలనిలయుని కథ వినుము ముందు
జోల నిట్టు గట్టంగ బడుటయును ఽ ఆలాన నున్న హస్తియును బోలె
చాలాడ నేల తుది మొదలు లేక ఽ వెలి లోన లోకముల బరగు మేటి
వెలది కట్టులలో నిలిచి యుండుటకు ఽ లలన నతులు జేసెను గాదె త్రొల్లి
చిక్కడు సిరి సనకాదియోగులకు ఽ చిక్కడు శ్రుతులకు శివునకు నటు తే
చిక్కెను తల్లికి భక్తి మేలుంగద ఽ మొక్కినవారల జిక్కు సిద్ధముగ

పెద్దబొజ్జగద చిన్నపాశముల ƒ బద్ధము చేయుం గూర్ప జాలదమె
ముద్దియ తన్నుఁ గట్టు నీక తా ƒ రద్దు గనదు ఆయాస మెక్కుడుగ
జూచి కట్టుబడె నిందిరియజిష్ణుఁడు ƒ కాచుకొన్న మునిమతవర్ధిష్ణుడు
నోచుకొన్న పుణ్యుల రోచిష్ణుడు ƒ బూచులకేరికి ప్రియుడగు విష్ణుడు
బంధమోచనుడు దానై యుండియు ƒ బంధితుఁడయ్యెను మాతపట్టుదల
బంధు డగునుగా సుజనమండలికి ƒ బంధనమన్నది యదిమాయె గాదె
జ్ఞానులు మౌనులు దానచరితులును ƒ ధ్యాన తపములను బెంపు గనువారు
పూనిక దాసుల మంచు నతి యిడిన ƒ మానమె యగు హరికృప వడయుటకును
నందయశోదల నందను డంత న ƒ మందవేగమున ముద మందమింప
పొందిన శాపము తోడ మద్దులయి ƒ యుండె యలతిగ జేర నగు దూర
మందు నున్న యక్కుబేరసుతులను ƒ ముందుదశను పొందించుటకై జని
రోలీడ్చుక నన బలికె నృపవరుడు ƒ యేలా? శాపమునొంది రెవరితో
మేలు బొందెడు వారినామమును ƒ చాలు దప్పి యుండుటలు దెలుపవే
యాలసింపకను యయ్యా ముదమయె ƒ పాలింపుము దయ పావనుడ నగుదు
శుకు డిటు లడిగిన నారాజున కనె ƒ ప్రకటింతును యక్కథనున్ వినుమా
సకలలోకనాయకు డీశ్వరు డత ƒ నికి సఖుడుగా కుబేరు డతనికి
నలకూబరుడుఁ మణిగ్రీవుడు నా ƒ వెలయు నామముల సుతు లిరువురు వా
రలును న్నంకరు కింకరు లాటను ƒ చెలుల గూడి యా వెండికొండపై
యలరుల తోటల నాటలబాటల ƒ లలనల లాలన విడలేకను వడి
నలరుచునాడవియగు నేనుంగుల ƒ వలపున పై కొను మృగయేన్గులక్రియ
సురంగములు నగు తరంగములచే ƒ వరాంగులును గామాతురపరులై
పరమపాపులౌ జనుల పునీతుల ƒ బరపువసతి నెలవగు మందాకిని
జలముల క్రీడలఁ జనుప నారదుఁడు ƒ దలపోతల నారాయణు నిలుపుచు
పాలజలధి శయనా! పరమాత్మా! ƒ పాలనఁ జేయవె! లోకబంధనల
పాలుగాక చిత్తంబు నెల్లెపుడు ƒ నీలవర్ణ! నీపదమే శరణ మ
టంచు భాగ్యంబు నొసంగుమ ƒ మించు కుతుకమున నంద్రె దలైనను
మించుదు లక్ష్మీనృసింహా యంచును ƒ కంచు మ్రోగు ధ్వని గానమొనర్చుచు
సంచరించెదను త్రిజగంబుల నవి ƒ బెంచువాడవును నీవే గావున
నీచరణంబుల దరియుదు నటులే ƒ నే చరియింతునుగా నదెందుకన
వాచమ్యమ లెందరో నిను గన రా ƒ నీచరణంబుల నర్చింపఁగ రా
గను టవసరమగునని దిరుగుదుగా ƒ వీనుల కింపుగ నిట్టు పాడగా

నిను గొనియాడుచు నుండు నాజన్మ ఽ గన ధన్యము సామాన్యుల కగునే
యనుచు రా గనిరి నలినముఖులు దమ ఽ మానములు నిలువ వలువలు గట్టిరి
మానహీనులయి మత్తున నుండుట ఽ మానంబులపయి గప్పరు వలువల
వారిఁ జూచి నారదుఁడు శపింపఁగ ఽ వారి నాచమించియు నొకగీతము
సారమెరిగి లోకములు కుదురువడు ఽ మేరబల్కె నిట్లనుచు నృపవరా !
సంపన్నుఁడు నొరు నొర్వం గానఁడు ఽ పెంపునఁ దనువుం సంసారభద్రమును
సొంపు దన్ను గుదురంగ పెరవారి ఽ కింపుఁదొలగించి హింసల నిడుచును
కన్నుల మదమున బుద్ధిజాడ్యమున ఽ సన్నజూచు సాధుల కనఁడు వినఁడు
ఎన్నఁదగిన గుణములను దరిద్రుఁడు ఽ మిన్నయైన వాత్సల్యత నితరుల
గన్నవాడు నై యందుల దీనుల ఽ గన్నసర్వ మర్పించియు మ్రొక్కును
గా నట్టివాని కన్నులమదమును ఽ ఘనమగు నంధతఁ బాప నంజనము
పూనిక నిడదగు నదియె దరిద్రము ఽ మనసు రోయనగు హింస నిడుట యగు
దీన నొకటియగు హింసయొకటియే ఽ గానగు నదియే గూడిన ఫలమా
ధనము గలిగె మాకంచును మద మా ఽ ధనదుని కొడుకుల గని యిట్లనె మీ
జనకుం డెన్నఁడు మదము గొనఁడె మీ ఽ తనువుల క్రొవ్వును తరుగఁ జేయఁదగు
చేడిలకున్న వివేకము గనరే ఽ పాడి దప్పి చరియించు పాపులకు
గూడు మీకు నుడి ! నారులఁ గూడెడి ఽ వేడుక దొలగియు మద్దులరు గండు
అనుచు నారదుడు యథేచ్ఛ నందఁగ ఽ గనిరి వారు చరణమ్ములపైఁ బడి
మనుపు మహాత్మా ! కనులఁ దెరచితిమి ఽ ఘన దయాపరత శాప ముడుపవే !
యనఁగ నూరు దివ్యాబ్దముల మీద ఽ గనును హరియు కృష్ణావతారమును
మనుచు మిమ్ము నపు డిచటికి వత్తురు ఽ మునుకలిదును మీ పూర్వకిల్బిషము
యనఘుల పదంపు నిలయుని విష్ణుని ఽ ఘను ననంతు నారాయణు మ్రొక్కుడు
ముక్తిని గందురు సాధుభావమును ఽ రక్తి వెలయు చిత్తమును గందురా
సత్తమగును శాంతాత్మ మంతటను ఽ శక్తి గలుగు నదె నిరాక్షేపమగు
అనుచును నారాయణాశ్రమము చేఽరెను నారదుండు మునివంద్యుఁడగుచు
వనమాలి కృష్ణుఁ డా యజానందను ఽ ఘనవాక్యంబుల మనమున నెంచియు
మూఢజనుల భావమ్ములు తెను ఽ వేడువారి వచనమ్ము లొకప్పుడు
నాడ బాడ విన గన్న మూఢతను ఽ బోడిచేయు పెనుమాయకాడు యా
జోడు మద్ది వృక్షమ్ముల మధ్యను ఽ జోడుపరచి నా ఱో లడ్డముగా
ముందరికి నిగిడి పడద్రొబ్బెను నవి ఽ అందునుండియుఁ గుహ్యకు లిద్దరు
మందస్మితులై సుందరతనువు ల ఽ మందమైన తేజంబు దిక్కులను

నంద వెడలి స్థిరచిత్తముల సమ్మద ఽ మంది కరములను నిటలతలంబున
పొందుపఱచి యో యదుమందారవు ఽ సుందరఘనరూ! సురపరిపాలా!
వారిజాక్ష! వరదాయక! కేశవ! ఽ సారసుఖద! సత్యాంప్రమూర్తి! హరి!
నారద వందిత! నారాయణ! పర ఽ పరిభయంకర! పురాణపురుషా!
కారుణికోత్తమ! కంజగర్భపిత! ఽ కరివరదా! శ్రీపతి! యతివినుతా!
నిరంజనా! యో నీరధినిలయా ఽ పరాపరేశా! పక్షీంద్రగమన!
మందరధర! యో మాధవ! కృష్ణా! ఽ వందనమిదె మాయందు నెనరుంచు
నందసుతుండన బరగుదువే నీ ఽ విందు జగన్మయలీల బొల్చియును
నీవు బాలుడవు లోకపాలుడవు ఽ పావనమూర్తివి యోగివంద్యుడవు
ఈ విశ్వము నీ లీలా రూపము ఽ యే వేళల నెల్లపుడును జెడవుగ
నీవె భూతములు నిఖిలప్రాణులు ఽ నీవె ప్రకృతులకు నధిపతి వయ్యా!
నీవె జగంబుల సృష్టికర్తవును ఽ నీవే పాలనకర్తవు హర్తవు
నీవె మునిజనుల యోగము తపమును ఽ నీవె జననీ జనకాదులునుగా
నీవు మనిపితివి మమ్ము శాపమున ఽ తావుకొన్న తరువుల రూపమ్మును
నీవు బాపుటచె మొదటి దశలు మము ఽ తావు కొనియె నారదమునివా
మాటలు చెల్లెను విశ్వమంగళా! ఽ పాటుదప్పె సుఖవాటి గంటిమిక
తేటమయ్యె నీ యనురాగమహిమ ఽ సాటిచెప్ప మహనీయుల వశమా
గుణహీనుడవై సుగుణుల నిలుతువు ఽ గణనజేయ నా యజునకుఁ గాదే!
తృణము మొదల బ్రహ్మాండము వఱకును ఽ గుణముల చాలున వెలిగింతువు గద
నీ కథలను విన వీనులు చర్యల ఽ వాకొన నాలుక పూజలు సేయఁగ
నాకరమ్ము లగు కరములు మరియుఁ ఽ బోక రాకలుఁ నీ నెలవుల కగు
చూపులునుఁ గల్యాణమూర్తి వగు ఽ పాపహారుని నిను గనుటకె యొసగుము
యోపికఁ గను చిత్తము సకలము నగు ఽ ప్రాపు నొనరు యుగములు తనువునుఁ
నీ పరంబు నగునటుల నిమ్ము మిక ఽ యోపరమేశ్వర! పుట్టుక గల్గుచో
నని చరణమ్ముల సోక మ్రొక్కియును ఽ వనజాక్షుని యానతి మదిగోరుట
కనెను శ్రీకరుఁడు భావి దుర్జనుల ఽ మనువుఁ జెఱుప ధర తినువెత్తిన హరి
ఘనకృపాకరుఁడు శ్రీకృష్ణుండా ఽ ఘనపుణ్యులు నగు కుబేరసుతులకు
ననెను నగుచు సంతోషించితిగా ఽ సునయులార! బంధము లన్నియుఁ జెను
ననుజూచిన తలపుంచిన విరియును ఽ పెనుపగు చీకటి సమమగు యఘములు
మీరు ప్రబుద్ధుల రైతిరి గనుటచె ఽ జేసు డింక మీ రందుడు మదములు
నారదు గీతము నెద నుంచుడు మరి ఽ సారతరంబగు ధర్మపు విధుల్లును

ననగ సెలవు గొని తిరిగి చూచుచును ఽ జననదూరు సంస్తుల నొనర్చుచు
మనము నిండ సంతోషముతో జని ఽ గనిరి కుబేరుని జనకుని మ్రొక్కిరి
తనివిదీర చెప్పిరి కృష్ణు చరిత ఽ ధనదుం డది విని ధన్యత నొందెను
ఈ నతి విన్నను జదివిన వ్రాసిన ఽ మానసమున కేశవుడు వసించును
పూనికతో దా నిచ్చు నాయువును ఽ శ్రీని బలము నారోగ్యము శుభమును
రాజ! యావలని కథ విను మయ్యా! ఽ పూజనీయుడగు జగ దవనుచరిత
తేజరిల్లె కృష్ణుం డిట్టుల నట ఽ పూజాఫలమున కొంద రది గనిరి
నందాదులు గోపకులు చప్పు విని ఽ తొందర గని వచ్చిరి చూచి యా
నందమయుండయి తరులమధ్యమున ఽ నందు లేసి శ్రీకలను చెలగుగను
నందకుమారుని నందు డంతటను ఽ నందున కట్టిన బాపి యెత్తుకొని
నందిట గడువుచు నవ్వుచునను ఆ ఽ సుందరబాలకు సేతలన్ని విని
కొందలమతిరా దోచి శ్రీధరుని ఽ డెందమందు నిడి మోదము నందుచు
యాలోచించిరి పిడుగు పడమగా ఽ యీలో గాలియు బలముగ వీవదు
తూలగ నరుకగ బడ విపి తరువులు ఽ గూలగ కారణ మేమొ తెలియదని
పంతగించి ముందరకు లాగగా ఽ వింతలమ్యో నిద్దరు పురుషులు తరు
లందుండి వెడలి యితనికి మ్రొక్కిరి ఽ అందు కొన్నిమాటలను వింటి మని
నందు యిడక వచియింపుచుండగనె ఽ నందను కొరకై యశోద వచ్చెను
బాలుని దగ్గర యుంత దాను విని ఽ లీల యగునో యని సందియముల గని
మేలుగంటి మిక నేమి కొఱత మనకేల యీజోలి యొక యుత్పాతము
తేలిపోయె దైవము కీడు దొలపె ఽ జాల మదము తిరమయ్యెను మన కన
బాలుండును నది మలపు జిత్తమును ఽ నోలి తనున్న నాదరింప నాడెను
లాలన జూపెడు గోప లలనలకు ఽ కేలుల చప్పుడు తాళమ్ములుగా
బాలుడుగూడగ నవ్వును యెగురును ఽ పాలకొరకు మాతను జూచును దా

—: నందాదులు బృందావనమున కరుగుట :—

సంతసంబు పరవశతగ గూర్పంగ ఽ యెంతో ముచ్చటగ గరముల గన్నుల
జంతలన్ని బాయంగ దిగ్భ్రమచు ఽ వింతజేయ వారిండ్లకు జేరిరి
కూకటి పెరుగును పుడిసెడు బాలును ఽ నా కుమార! త్రావుమన్న యవ గొని
కూకటి పెరుగ లేదే? నాకను ఽ యా కమలముఖికి కూకటి జూపెను
లీల నట్లు నొకకోలను బట్టెను ఽ జలజనయన మాయమ్మా యిందున
జలకలశములో నుండె జూడవే ఽ బాలు డొకడు నను కొట్ట దివురు వనె

బిచ్చగాండ్రు నీ వేడ్కన జూచిన | బిచ్చపుసంచిలో నుంచుక పోదురు
అచ్చు పడెనె నీ కన తల్లిరి సూ | బిచ్చపువారిని జూచి భయంపకు
ఇట్టి చరితలను బట్టి జూపగా | చుట్టములను హితులు సేవకులను౯
చుట్టుపెట్టుకొని నందుడు వారికి | పట్టికైనవి దెబ్బలు జెప్పెను
ఉపనందుండను వృద్ధగోపకుడు | యుపాయము జెప్పె నిటు నుండరాదుగా
అపమృత్యువు పెక్కింటను దప్పెను | అపయశంబు మనపాల వట్ల యవె
దైవయోగమున నాపదలు గడపె | దోర్లెను ఇంటికి జాలు నిప్పటికి
పోవుద మిక బృందావనమ్మునకు | కావు విడిచినను నాపద తప్పును
పచ్చికలకును౯ నునికిప ట్టదియు | మెచ్చు నిచ్చునది జలములు తెరువులు
ఇచ్చ లిడరు యందుండి వెడలగను | హెచ్చరించి యటు జేసుట హితవగు
నం చన నందరు విని యందు పంచ | ంచ దగును సౌఖ్యమ్ములు కొల్లలు
నంచు నపుడె యావుల మందలను౯ | బంచి రచ్చటికి మందగమనముల
బాలవృద్ధనారీజనములను౯ | చాలు తేరులును, గదలించి తాము
పాలనకై కవచములధనువులను | మేలిబాణముల తూణీరమ్ముల
బూని యుత్సవపు వాద్యమ్ములచే | మానసములు ముద మంద సందడియు
లోను గాగ తా మూదుకొమ్ములను | మేనులు పులకలు బొడమ బూరించి
దానధర్మముల కీడుం బారగ | మీనా నేత్రిలకు ముద మిం పొదవగ
పసుపు కుంకుమల గంధము లల్లను | వాసనల నొప్పు గుసుమ దామముల
వేసముల సొంపు వడిగా గుదురగ | బూసిరి వేసిరి జుట్టిరి పెట్టిరి
బంగరు మాడల దండలు సొమ్ములు | అంగములకు నిటు లలంకరించి పొ
ఉంగుగ బాటలు బాడుచు శిశువుల | మంగలబెట్టుక మాఱియుచుండగా
నందునింటి వారంద రట్టులే | నందమింప రోహిణియు రామునిఁ
సుందరియైన యశోదకృష్ణు౯ | నుం దుంచుక నొకరథమున గూర్చొని
నందను లపి శృంగారచేష్టలను | విందుగొల్పు డెందములు౯ నిక్కుచు
నందుఁడు ప్రీపుగ నంద రటు గదల | బృందావనమును ముదమున జేరిరి
విందులం జేసిరి విడుదలయిండ్లను | బృందములై సురలతలులు తెమ జూడ
బృందావనమిది మందారవనము | బృందావనంపు దరి కాళిందియు
బృందావనంబు మునిబృందపోష్య | మిందు పొందదుటయె మనకు శుభము
వన నిశ్చయముల నిలిపి వసింపఁగ | చనెను కొన్నిదినములు నెలలును వే

—: వత్సాసుర బకాసురుల వధ :—

ఘన శశి బింబముల చాలును౯ | ఘనులు తేజముల నభివృద్ధిఁ గనిరి

రామకృష్ణులునుఁ దోడి బాలకుల § కోమలగాత్రులఁ గూడ జేర్చుకొని
కోమలమ్ముగ దమ మనముల నిల్పుచు § రామలు మెచ్చగ వేణువు లూదుచు
వివిధమ్ముల గంతులు వైచుచు మరి § నవ్వులు చాల గల్గగ కంబళిముల
గోవు లెద్దులుగ రూపుల జూపుచు § ప్రియముల పదముల గజ్జెలు మ్రోయగ
నడుగుల పుడమియు నదుర నడచుచును § దుముకు పందెములఁ జెట్టుల నెక్కుచు
వడి నడకల ఫలమంజరుల గూల్చి § ఘుడియ ఘుడియ పోట్లాట లంతటిలో
కూయు చెలుములను జంతుచయమ్ముల § వడుల వక్రితల బట్టఁ దలంచుచు
క్రీడల కొలకులు జల్లు లాడుచును § ఆడుకొను దూరములు బారుచును
దూడల గాచుచు పండ్లు మెక్కుచును § వేడుక లిటుగా యమున తీరమున
గోవుల నిలపియు యాటల నుండగ § గోవురూపు రక్కసుం డొక్కరుడు
ఆవులలో నిది మంచియావు యన § ఆవుల గొంతుల నాకుచు హింసకు
త్రోవ రోయుచున్నట్టి వాని గనె § గోవుబోలె భక్తుల నేలువాఁడు
భలభద్రున కా ఖలుని చెప్పియును § బలిమి వెలయ నద్దాని బొగడుచును
తలతోకను కేలను నిమిరియు దరి § నిలువఁ బొడవ రా నది గురి గాగన్
పదములు నాలుగు తోకయు గదియన్ § కుదురబట్టి యొక వెలగమ్రానునన్
జడియగ విసరిన పవనములు తనువు § సెదర వెడలె గోపబాలకులున్
కోయని యార్చిరి కుసుమములు గురిసె § బాయని ముదముల సురలసేత యది
ఆ యసురుని శవమును గాంచియును § యే యదురును గొనరు బాలికలు నట
గొంగడు లెగురగ వైచటులున్ మరి § చెంగున కృష్ణుని దరియన్ వచ్చియు
పొంగుచు బొగడుచు చప్పట విడుచుచు § బ్రుంగెను రక్కసు డిక భయము లేదు
వత్సాసురు నిటు జంపెను శ్రీహరి § వత్సలతను జగముల బ్రోచువాఁడు
వత్సములను మేపుచు తొల్దొలుతను § వత్సాంతకుడను బిరు దందె నృపా!
మరియొక నాటను రేపకడను వేగిరమున వనమున గోవులతోడన్
వరుసను గుమిగొని బాలును వినోద § చరణులై మీరు కౌతుకం బొప్ప
నడవికి వే చని గోవుల మేపుచు § వేడిమి చాలన్ యెండ మెం డగుట
సుడివడి దప్పిని బెండువడుచు నొక § యెడను కళంకము లేని కొలకునన్
జలముల ద్రావియుఁ దృష్ణ శమింపఁగ § చల్లనగు చెట్లదాపుల నిలిచియు
మెలమెల గోవుల దరికే వచ్చునెడ § నల త్రోవను రజతాద్రి శృంగమును
బోలు కాంతియును దూలపుచ్చగల § వెలుగు బలము పెనుభయము నాకృతియు
కలిగిన బకమును జూచి వెఱగుబడి § బాలకు లిల వెనుకకు నడగు లిడన్
అటియన్ పొడవున్ దృఢమున్ బెంచియు § చనునడచె నెవడు వత్సాసురునిన్

గదిసి మ్రింగుచును మొగమున వానిన్ | తమపతి రాముని యవల బాలురను
అనుచు తదేకధ్యానపరత గొని | మనమున మమతను విడిచి శ్రీహరిని
ఘనుని నిలుపు మునికైవడి గనపడి | యనఘుడు కృష్ణుడు తను దరియ రాగ
పదములెత్తి కుప్పించి ఱెక్కలను | పది దిశలును దన గాలి యల్లుకొన
విదలించుచు పైకెగిరి భయంబున | గదురఁ దన ముక్కువాడిని వదనము
త్వరితముగా దెఱచియును హరిపైన | నొరిగి నోర నాతని మ్రింగెను బా
లురు బలభద్రుఁడు వెఱగంది చూడ | గురు శిలాకృతుల నచేతనుల వలె
నిలిచియుండి రటునేమి దోచకను | కల జగమ్ములను లోగొని మ్రింగుచు
వెలిబెట్టుచునున్ బని గల్గువాఁడు | ఖలుఁడగు బకు డను దనుజుడు మ్రింగగ
నేలకో యూరక నుండె నొకత్రుటిని | యల నాదుర్మము వదనం బనలము
వలగొనిన కరణి గాగ నుమిసియున్ | వలసబోక చంచువున బొడువగా
దలచెగాదె దనుజుండు చెడుటకై | ఖల హంతకు నా యదుకులజాతుని
దలపఁడు యా దశ తనకు ఘటిల్లిన | దలఁగు కాల మది దరిసె నటు జేయ
లోకనాయకుడు కృష్ణుడు నిలిచియు | భీకరుడై యా బకరూపు గన్న
లోకకంటకుని వగు చంచువులన్ | వికటంబుగఁ జీల్చెను రోషమించి
రక్కసుడు జచ్చెఁ గృష్ణుండు బ్రిదికె | దిక్కుగంటి మని తోడులు కేకల
చక్కని కృష్ణుని పదములు మొక్కుల | గ్రిక్కున జేయుగ నమరులు ముదమును
గొనియు నట్టులే తామును జేసియు | మొనగున నందన వన కుసుమాదుల
దనరి గురిపించి చెలగును గాంచిరి | మును లుల్లసింపునను శ్లాఘింప స
చేతనులై రిటు బాలుడు రాముడు | భీతిన్ దొలగిరి కృష్ణుని ముందటి
నూత తోడుగా నావులమందను | నాతురమున దోడ్కొనుచు నెలవుఁ గని
పెద్దవారికిన్ జెప్పి రచ్చటిది | సుద్ది సత్యముచు నిబ్బరము గాగ
అద్దిర మనభాగ్యంబు కృష్ణునికి | దద్దయు దైవము తోడ్పడె ప్రియదము
నద్దిఁ గొంటి మిక భేదము దూరము | ఇద్దియు మన సుకృతంపు కలిమియగు
పెద్దగండములు నన్నను బోవును | ముద్దియ లందరు రక్ష యిడఁ దగును
ఈపాపని జెఱుపంగ లేరుగా ! | పాపులైన రక్కసులు వైరులును
నాపావకునిం జేరు శలభములె | యో పాపహారి ! మము బ్రోవు హరీ !
యనిరి మరియు గోవులను పాలనము | పూని రా ఘనులు రాముడు కృష్ణుడు
వినయభావముల గోపకబాలురను | ఘనులని వారల యాజ్ఞల మీరరు
కపులము మనమై జలధిని గట్టుము | యపురూపము యది చేతగాద మన
మిపుడు గట్టునది దానికైన యనియుఁ | జెప్పుచుఁ గాల్వను నద్దము గడుదురు

మునిజనమ్ములను గాను యిట్లె యని § మాన మూని మెప్పింతురు అందఱి
గానమందు గంధర్వుల మిట్టుల § గానమొనర్పర నంచు బాడుదురు
ఆడ తేమ యప్సరస లెక్కడే? § యాడుదమని వేసముల నాడుదురు
జూడ సురాసురులను మనమున్ గాను § వేడుక లవియని సరసుల కరముల
సర సర తిరుగన్ జేయుచు గా నృప! § సరసగతులనిటు హాసల దలంతురు
వరుస దప్ప నీగను నొకనాటను § తరణి యుదయగిరి చేరక ముందే
మురిపెమ్ములు తమ యిరవులుగా § తమ దెసువు దప్పకను చల్దికావడుల
కొమ్ముల బూరించుటల వేణువుల § క్రొమ్మి నాదములు మనోహరమ్ముగ

—: శ్రీకృష్ణుఁడు గోపకులతో బంతిచల్దులు గుడువ వనమున కేగుట :—

నెమ్మదిగను సొంపుల బాటల నా § ట్యమ్ముల గొందరు గొందరు బూనిక
వరధేనువులన్ రొప్పుక దోలుచు § సరసపు మాటల నొకరి నొకరి గొని
వరుసలు దప్పక వనికిం బోయిరి § చారు తలములను సద్దులు వెట్టిరి
బంగారముచే మణులు చేర్చియును § శృంగారముగా గూర్చిన సొమ్ములు
రంగారంగన్ బెక్కులు దాల్చియు § అంగు గందమని మొగ్గలు పూలును
చిగురులు పండ్లును పెట్టుకురు తోడు § సొగసుగ తుమ్మెద రొదలు శ్రుతి గాగ
నగుచు పాటలును గలయం బాడుచు § తగునని పికముల వలెనే కూయుచు
నెమళుల గని యట్టులే యాడుచును § భ్రమ గొన శుకముల రొదలన్ జేయుచు
గమనమ్మున బులుగుల నీడ మీరి § సమను మరాళపు నడక యిదే యనుచు
వాని దగ్గరుచుఁ గొంగలఁ బిలుచుచు § దేనెల జోపుచు దాఁవుచు నడులం
బూని దూరముగ బోవుచు మరలుచు § పానీయములనుఁ ద్రోగుచు దీవల
గనియు నూయెలలనుం జేసి యూగి § కన కపితండము వలె చెట్టెక్కియు
మనమలరగ నందు ఫలముల దినుచు § తనువుల నీడల గని హాసించుచును
ఆటల పోటిని గాలు ద్రిప్పుచును § నీటుల నిక్కుచుఁ దొలఁగుచు వ్రాలుచు
పాటి వారి నొకరొకరి మెచ్చకను § దీటు లేదు మన కెవ్వరు నంచును
దొంగలింతు రా సద్దులు పరులవి § మ్రింగుదు రితరుల భక్ష్యంబులు గొని
చెంగుదురు గనిన పొంగుదురు లేద § లొంగుదు రందఱు రామకృష్ణులకు
ఈవిధి వల్లవ బాలురు దేవత § లేవిధి నైనను దలపఁగ నేరని
దేవనాథ పరిరక్షకుని గృష్ణు § భావము లలరన్ గాగిటఁ జేర్చుచు
పై వడి నగుచున్ దన్నుచు గ్రుద్దుచు § సవినయ సవినయ నడకల విడకయు
గవిసి యుండురుగ హితుడని యెప్పుడు § యువల బోయి ఎడబాయుగ నొర్వ

కావలి గాయఁగ నుండువానివలె § కంటికి ఱెప్పయు వోలె శ్రీహరియు
నా వల్లవబాలుర గాపాడుచు § నావ యగుచు నాపదబ్ధి దాటఁగ
జేయును వారల భాగ్య మెట్టిదో § యా యరవిందోద్భవు నానందము
నాయెడ పొందు చున్నండిరా వారు § ఓ యర్జునపౌత్రా! వినుము మఱల
దేవత లమృతము ద్రావియు దిగులక § దోచ వేచు యా యఘుడను దనుజుడు
జీవమున నుండ మనకు నాయువును § నేవల జూచిన నస్థిర మనియుఁ

—: అఘాసుర వృత్తాంతము :—

అట్టివాడునుఁ గొంగరక్కసుని § పట్టువింటి వాతనికి సోదరుడు
పట్టె పగను యీ గుంపు నెల్లరను § పొట్టలోపలఁ బెట్టుక పోవుదు
వాడు కంసుపంపుననే వచ్చెను § దీడె మీాసమును కృష్ణు దుృంతు నని
జాడ నెఱుగు నెటు చెడుకాలము తను § గూడి తప్ప బో జాలడు నృపవర!
ఘోరమైన యజగరరూపమె తన § కూ్రరచరిత కాధారమగు తనువు
నోర వీరి మ్రింగంగ దగుదు నని § బిరమెక్క గిరివోలె నిక్కియును
ఆమడ నిడుపును జడుపు బొడముకొన § భూమి మిన్ను పెదవులు దాకగనుఁ
ఆ మదాంధ దనుజుడు నోరుఁ § భీమమయము నగు నిసిచే నిండిన
బెను గుహలబోలు చిగురుల సందులు § గనగ బిలములకు నగ్గల మగుచును
ఘనమగు నద్రుల శృంగముల బోలు § సునిశిత కోరలు వేడి యూర్పులును
గలిగి నాలబోృచు బాలురందర § నోలి మ్రింగగా నుండ నది గనిరి
బాలు రొక్కరికి నొక్కరు చెప్పిరి § కేలు లెత్తి చిందులు ద్రొక్కుచునుఁ
మేలు మేలు యీాపాము రక్కసుఁడో § చాలు జూడ భయంకరము దోచెను
వాలాయముగా గీడు తలఁచు నా § లీలాబాలుఁడు కృష్ణుఁడు బోరిగాను
వీనిభయము నవలీల దాటుదము § మేలి చూపులను నాతడె బోృచును
యనుచును బడుచులు యలుకని మనముల § యనఘరహితుపద మందనున్న యా
ఘనసత్వము దరిజేర బోవగా § మనములోన యుత్సాహపటిమ గని
దేవతలును భీతిసి దను జూడఁగ § దావదహనరుచి గాలు నాలుకను
నావ లీవలను సందులేని గతి § తావులన్ని నిండింపుచు దానిఁ
వెలికేఁ జూపి యాబాలకు లందరి § తలఁగనీక గోవులతో గూడఁ
ఆలసింపకను మ్రింగె నది గనియె § బాలలీల వెలుగొందు దేవుఁడుఁ
జాలిగొనెను వారల క్షేమపరుప § నేలాగున నో యని యోచించియు
ఈలాగున మదిలోన దలంచెను § బాలు రేరి శ్రీకృష్ణా! యనినను

గోపగోపికలు అడిగిన నీవిధి § చెప్పుట కగును విధినేత లిట్టులయె
నాపరంబుగా లేదే ప్రతిక్రియ § ప్రా పంపుడు మాయ గానెద నే నని
యా పరమేష్ఠిని గన్న యతడు సిరి § ప్రాపుఁ జేర నలరారు శ్రీశుడని
బరగువాడు వామనుడయ్యెను నా § దరమున సురలను మోదపరుప నా
బలిచే నేలను గొన్ననాడు యే § వలను రూపు బ్రహ్మాండము నించెను
ఖలుని బారిగొనగ నదియె దాల్తునని § నిలుకడ గొంతున జొరబడి పెరిగెను
శ్వాస వెడలకను వాపుగనె కడుపు § వాసె ప్రాణములు తనువున నుండక
వాసి బాగ ద్దల తన్ను గొలువగా § వేసము లొందిన సురల యంశలను
దోసరహితులై యట్లొప్పిన దశ § బాసి ముదముగ బయటకి వచ్చిరి
ధేనువు లయ్యెవి ఋషుల యంశములు § గన నాబాలును సురల యంశములు
దానును శ్రీ నారాయణు డగు గా § బూనె నట్లు గాపాడ వారియెడ
దాన వారి యెటు వారిని బ్రోచెను § దానిఁ గనెను సురజాలము గురిసిరి
దాన వారి హర్షింపఁ గుసుమముల § మునులాది సకల దేవజాతులును
తనివి నొంది రానందనాట్యముల § గానకళల సౌభాగ్యమొప్రితలును
దనర వినెను పద్మజు డిలకు డిగ్గి § గనెను వారి మహిమాతిశయములను
అంతకుమున్నె దనుజుని కాయము § అంతు గసిన మరుక్షణముననే యొక
వింతదీప్తి బయలాని దిరిగియు న § నంతు గృష్ణులో డిందె నృపవరా !
మోద మందె నిటు భువనములెల్లను § పాదు జెడెను యఘదైత్యుం డంచును
వేదవేద్యుఁడగు హరిచరిత దీని § వేడ్కఁ బాయఁగ వినిన శుభంబగు
మీద వినుము సర్వేశు చరిత్రము § పాదుచెఱచుఁ బాపాళుల సత్యము
యజగరచర్మము తదుపరి యెండియు § విజయము చాటెను తదుపరి కాలము
నిజ మిది యంచును జూచువారలును § భజియింతురు శ్రీహరి కృష్ణు డనుచు
పౌగండంబును ననెడు సమయ మది § యుగునంచును నా బాలురు దలఁతురు
బాగుగ విను మీ యర్థము క్షితిపర! § యోగులె యా నిర్ణయ మెఱుంగుదురు
అనఁగ నాత డిటు లనియె మునివరా! విను మైదేఁడులు కౌమారం బది
జనగ నామీద పౌగండం బగు § అను వెట్లు సంశయము దీర్పు మనగ
శుకుఁడు యోగదృష్టిని దిలకించియు § బ్రకటించెను యా రాజుకు నిట్టుల
నాకుఁ దోచె నిది పరికించుటలో § నీ కెఱిగింతును యోగరహస్యము
తృటి కాలమ్ముల యుగము లున్నయవి § ఆటు యుగమ్ములును నాత్మకు తృటులే
ఇటు లఘాసురు మొగమున వెలువడి § అట నిర్మల జలమందు శుద్ధులయి
చల్లని తరులం దరులం గలిగియు § ఫుల్లసిల్లు కమలాదుల వనముల

శ్రీపు లటవిలో దూరము వోయెను § గోపబాలు రందఱు దినుచుండుడు
చూపుల కోమల పచ్చికలకు నై § దాపున జనె నేమయ్యెనో యిటకుఁ
తోలుకొని వత్తు నేను నాసద్ది § కేల నుంచితిని వచ్చెద శీఘ్రము
కలగకు డన్నా ! యని హెచ్చరించి § యీలల వారికి వెలుంగు లిచ్చుచు
యాలకు దనదగు రాక విను ననుచు § జాలి నంత పరిమితినిఁ గన్నుల
చాలు విశాలము గాఁగాఁ బరపియు § నేలల నడకల గురుతు లివి యనుచు
శిరముల శిఖిపింఛమ్మును వెలయఁగ § నురమున గ్రైవేయమ్ములు దండలు
హిరణ్యభాసిత వేత్రి దండమును § కరమున నది వెలయంగ వేరొక్క-
కరమున నన్నపు ముద్ద యటు యుండ § వరుసల పరికించుచును నెల్లెడల
కందువుల నెరిగి వేసరియు దాను § నెం దెందున యవి తిరిగినవో యనుచు
పొందుఁ గొన్న తలమును దాఁ గానక § సందియ మందుచు బాలురచెంతకు
రా నటువారుఁ లేకుంట నెరిగి § యాననంబు నాలోచనపూరము
దనరినటులఁ జూపఱకుఁ దోఁపఁగా § వనములోన నలుదిక్కుల నరసియు
నలికెడి నడుగుల జాడల దెలియక § మనములోన నిశ్చయించె నిట్టుల
పలుకు వెలదికిం బ్రియుడవు వాడును § తలలు నాల్గునుఁ గల యతండు విధి

-: బ్రహ్మ గోపవత్సములను, గోపాలకుల నంతర్ధానంబు సేయుట :-

చులక నెంచె నను లీల గలదు నని § ఖలుని యఘుని నే జంపుట వలనఁ
దలపునను నుంచి యీకార్యమ్మును § వలపున జేసెను డాచెను వారిని
గోప బాలకుల గోవులతోసహా § నోపలేన ! నే నతని వంచింప
తాపము నతడే గనివచ్చు నంచు § పాపళియనుండు శ్రీ రమాధిపుడు
గోపబాలకుని లీల దిరుగాడు § పాపహారి యాకృష్ణు డిటుఁ దలఁచె
పాపలు లేగలు లేరు లేవనియు § గోపనారులకు గోపకులకు నే
నే పగిదిని జెప్పిన బాగుగాదు § పాపల రూపులు పసువుల రూపులు
నేన యేవు మీరంగ దాల్తునని § తా నట్లన్నిటి రూపుల నొప్పుచు
కనులు శిరమ్ములు చెవులును వదనాల్ § కనఁగ వెండ్రుకలు కల కాంతులునుఁ
తనను భుజవక్షములును పదములును § యొనరుల నడకలు మరియు నడుగులును
యూరులు పైక్రిందులు జంఘలునుఁ § వేరుగానగ దంతమ్ములు నఖములు
చారుతరంబగు పలుకులు ధ్వనులుఁ § తీరుగొన్న లీలలు నవ్వుల చాళ్ళును
వారువారు నెటు లుందురో యట్టుల § వారిసొమ్ము వస్త్రములు కోలలును
జరిగ వయసును విషాణవేణువులు § సరవిఁ దప్పకను బసవుల వన్నెలు

తోఁకలు గిట్టలు శృంగముల చాలు | పోకల రాకల చెంగు చెంగులును
ఏక దాల్చె నది యేమి పెద్దదియొ | జోకలోని సర్వంపు లోకముల
సోకిన భూతాదుల రూపులన్ని | ముక్కాలములం దనరు వానిఁ దా
పోకడఁ గూడుట లెక్కగాదు గా | ఆ కమలాక్షుం డిట్లు నొప్పియును
మరలుపు మనుటయు మరలించు మనుట | మరలెడు గోవులు మరలెడు బాలురు
వరుస లన్ని దొలియట్లు దప్పకను | పరమప్రీతి జేరిరి తమ నెలవులు
బాలురు తల్లుల జేరి ముద్దు లిడి | పాలుద్రాపి నీళుల బోసియునుఁ
మేలి గంధములఁ బూసి సొమ్ము లిడి | ఫాలముల రక్ష తిలకముల నుంచి
చాల రుచి గలుగు నన్నాదులు నిడ | చాలంది దినియు సెజ్జ పవళింతురి
కలువరింత లా పూర్వము వలెనే | కలిగియుండె భేదములు నహి రాజ!
లేగల తల్లులు సంబారవముల | సాగఁ జేరి చేరియుఁ బా ల్గుడిపియు
బాగందు నొప్ప మెడల నాకుచును | రాగమందు మామూలు తెఱంగున
తల్లులైన వ్రేతలు గోవులునుఁ | పిల్లలైన గోపబాల లేగల
కొల్లలైన యొద్దికలఁ జూడగాఁ | బెల్లగు ప్రియమును బెంచె శ్రీహరియు
ఇటుల నొక్క యే డరిగ నైదారు | పూటలు తక్కగ నం దొక్కనాడు
పటుతరమతియగా బలభద్రుండును | చటులతరమతిని యా పట్టుగాంచె
ఎటులందువ విను గోవర్ధన గిరి | తటమున మేయుచు నున్న గోవు లా
తటము సమీపము నందలి లేగల | నెటుఁ జూచినచో సంబారవముల
పరపుచు వడిగొని బెదరినటులగా | నురుకున క్రేవుల చెంతకు రాగని
పరిపాలకులగు గోపకులు నాప | సరకు చేయమిని వెంటబడి రంత
వారలు నటులే వచ్చి బాలురను | జేరి చూచి సంతోష మగపరచి
జేరిచి యురముల ముద్దులఁ గొంచును | సారతరముగా బుజ్జగించియును
బ్రీతిచేత లాతురమున నమరగ | చూత నిల్చి రాముండు నబ్బురము
చేతమందు గలతను బడియును | ఈ తరి నే పొరబడితి నొక్కొ నే
రాముఁడ గానో హరిమాయ యేమొ | భూమిలోన నఁ బూమెను పరుపగ
నే మగండుగలఁడా? హరిదక్కగ | నా మహనీయుని యంశచేత నే
నీమహి నాబుట్టుక యగు నితరుల | వౌ మాయలు దైత్యాధములవి నను
నామ వైన శ్రీకృష్ణుని లీలయె | నా మనమ్మునను దెలియఁగఁ జేరెను
ఇట్టిప్రేమ మున్ దెన్న డెరుంగను | గోపాలకులకు బుట్టి నాటనుం
జుట్టి యున్నటులగాను గోవులకు | ఎట్టు తెలియఁదగు హరివలె మమతను
వారువీరు వనకుండఁ జూతురా | సాగమైన యీ పొందిక లెటువలె

సురల యంశజులు గోపబాలురని § పరమమునుల యంశములు లేగలని
గనుచు నుండు నీ వజుఁడ నటు గాదె § ఘనమతిఁ జూచిన యన్ని హరిమయము
మనమున జ్ఞాన విలోకనమ్ముగాఁ § గనెద ననుచు యోగమునందు నిలిచి
నిజము తెలిసియును కృష్ణుని ముడిగిన § విజయశీలుఁడౌ యతఁడన్ని దెలిపె
భజించె రాముఁడు హరి మహత్త్వమును § రజనీచర హరణమునకుఁ బుట్టుట
యజు మానసమున స్ఫురితమై యెనసు § నిజముగ నొకయేడయ్యె నరుల కది
యజుఁడంతన యాలోచనఁ జేసెను § నిజమున నే నిటుఁ జేయరా దనియు
నెంచెనేమొ చని దెంచె నచ్చటికి § వంచన నెనుగని బాలుర లేగలఁ
గాంచి పైన మరి గాంచె వంచితుల § వంచితంపు మతి రెండు చేయిదముల
విరించి తనలో వితర్కమును గొనె § చరించు వీరల చరిత మెచ్చటిది
విరించి నొకడనో పెక్కులుండ్రొ యీ § చరించుటల గిరగిరంబు మతిగనె
తిరించితునెట్టుల తిరంపుమతి గొని § పరుఁడొకఁడిట వరింపఁబడెనొకో
రచింపు జగముల పరంబునకుగా § వచింపరెవ్వరు వినంగ నైనను
రుచింప దిక నా యొఱుక తేజంబు § అచంచలమ్మను గతికి చంచలము
గుఱి గంటినిగా ఘనము దొలంగెను § పెరగుణ మదేల రేగెను దాచితి
దరలరు బాలురు దలగవు లేగలు § పరరూపమ్ములు వీరిఁ బోలినవి
విలయకాలమున విశ్వము నంతయు § మలవువాని శ్రీహరిని వంచనను
మలవుదు నని యీగతి గంటినిగా § కలవరమగు మతి ఘనులఁ జెనకినను
వని వచింతునే మునులు వినఁగను § విదుషించుటయే గాని విరుద్ధపు
టనువున మతిబోఁ ప్రజ్ఞను బూనను § మని నందుల కిటు ఫలమందుచును
పగలు ఖద్యోతరుచి చెడు పగిదిని § బిగువంతఁబోవు రాత్రియు మంచును
తగవున చీకటియును నే నల్లే § నగుబాటందితి నాతండ్రి వెలుగ
జగదవనుపైన పరుల మాయలెటు § బిగువు గన్పడును తుచ్ఛలచేయిదము
నేను దలంపను మూఢుఁడ నైతిని § గాను విజ్ఞుఁడను నింతవాఁడనై
గాన నెందు నీ నూతన సృష్టులు § గనఁజాలితిగా మదము నడుగంట
ఘనుల పదమునకుఁ గంటి తిరమితిని § గనినవాడనైతిని నే ననుచును
వాణి మగఁడు పలువెంటల యోచన § పోనిచ్చుండి శ్రీరామ కృష్ణులను
వేణునాద విలసితుల సుందరుల § వీణాధరముని గానలోలురను
గాంచ నెంచి యుత్సాహవంతుడై § యొంచ నెవిమిదను కన్నుల దృష్టిని
వంచిత పరుషగా ముందుఁ జూచినను § వంచన నలయని వారు యెదుటనే
గాంచఁగలిగె నది వివరింతు వినుము § మించు శ్రద్ధ మనమున నేర్చి నృపా!

మించరావు నీసంచిత కర్మల ఽ కించనుండు ఽ మనమున నెంచినను
నేను మ్రొక్కెదను వాసుదేవునకు ఽ ధ్యానసమర్పిత ప్రీతినిలయునకు
దీనజన పరిత్రాణునకు భవున ఽ కేను దాసుండ నభియాన రహితుండ
అని జనపతి పిన బోగడి మ్రొక్కె ముని ఽ జనకాత్మజుండా శుకముని యిటులనె
వనజభవుండిటు దలంచి శ్రీహరిని ఽ ఘనుని యనంతుని లీల బొలుపను
ఇరువురు మేఘశ్యామ సుందరులు ఽ హారమకుట కేయూర కుండలపు
సారకాంతి చెన్నారు వారు మరి ఽ నీరజాక్షులును వనమాలి కాభి

## -: శ్రీకృష్ణ బలరాములను బ్రహ్మ దర్శించి నుతించుట :-

రాములు శ్రీవత్సమంగళాంగద ఽ ధాములు నూపుర కటక కంకణులు
ధీమహితులు మరి తులసి దాములును ఽ భూమియు గగనము నిండు తేజముల
వెలయువారు సుగుణముల భ్రాజితులు ఽ విలసదంగుళీయక స్తోములునుగా
జలజశంఖచక్రగదాహస్తులు ఽ నాలుగు భుజముల నలరారు వారు
చలువలరేంగ నవ్వేడి మోమున ఽ చెలువుపెద్దగను వారు చూపులను
చాలనము గల్గు వారు తేజమున ఽ కలువలవైరిని దీటందు వారు
అనంతు లవ్యయు లక్షరులు నిత్యు ఽ లనంగ వెలసిన సచ్చిదానంద
ఘనులు రూపులును నణిమాదులునుగా ఽ రొనరుగలిగి యున్నట్టి వారలును
భేదరహితులును శ్రీమహావిష్ణు ఽ సాధుజనోద్ధారుని బోలు వారు
వేదములుగా తత్వములు సిద్ధులు న ఽ గాధమయిన మాయా ప్రముఖశక్తు
లును గుణక్షోభ కాలపరిమితులు ఽ మునులు మెచ్చురూపముల నందియును
ఘనసేవింపుల గనెడు వారునుగా ఽ కన తత్త్వజ్ఞుల హృదయముల రములు
తాము రమణ మున్నందు వారు నగు ఽ నామహనీయుల బొలుప గనుగొని
శ్రీమహీశాధవు తేజమ్ము లిట్లు ఽ ధామము నందెను నీ సమయమునను
వీరు నామదికి బాసిన వారిని ఽ తేరిజూతునని కనుల నిగుడ్పగ
మీరు తేజమయి యది దిక్కులకుగా ఽ బారియు మిరుమిట్లుగొల్ప కన్నులు
మనువు తనువునుగా కర్మలన్నియును ఽ ఘనాఘహార మీకర్పణమంచును
వినయమెంతో తన యాకారముగాఁ ఽ దనర నాదేవుఁ గనుఁగొని కరములు
అట్టి మోడ్చి నా యజును తను మఱచె ఽ పట్టునప్పె తన యింద్రియ శక్తులు
కట్టా! మోసము దెచ్చుకొంటిగా ఽ చెట్టబావినను సవరింపగ నెవ
రనుచు చిత్రరూపమువలె కదలక ఽ మనమున భయమును జొరనిట్టులున్న
వనజభవుని గని మాయాతీతుండు ఽ వనజాక్షుండు విజ్ఞానదుర్లభుండు

తనబాహుళ్యము జూచి అట్లయిన § కనికరమ్మునఁ జూపందగునని
తాను ముదముగొన బుద్ధిగొంద డిక § నను శోధింపగ తా నెంతవాఁడు
మతినిదప్పి యిటులొప్పె నామహిమ § స్థితిని మరచె తనపదవి పెంపునను
యతులునైన యొకపరి తగుగతినిఁ § వితథపరతు రది కాలదశగదా
కనికరమును గనుపరచి పంపవలె § వనజ గర్భునకు గాసి నిడదగదు
ననుచు మాయజాలించి రూపముల § కనురెప్ప వేయు కాలమున డాచె
అంతధాత తెలివొందె నజీవుడు § సంతసంబుగా సజీవు డైనటు
ఎంత వింతలిటు జేసెనాతండ్రి § చెంతనున్న చెలికాండ్ర క్రేపులను
మాయజేసి ననుదాటిపోయె నౌరా § నేయనువుననే గాంతు నా దేవు
కాయమునను నేప్రజ్ఞ గనకుంటి § ఆయద్భుతచరితుం డెటకేగెనో
యనుచు పదంబులు కరములు గదలిచి § కనులు నిప్పుగానలు దెసలు గనియు
తనివి గొనక మూలలు మిన్నుమన్ను § మనమున తీవ్రతగొనియుఁ జూచి నను
ముందు కొంతదూరమ్మున హరియుఁ § మందితోడు నెవ్వరును లేకుండ
సుందరంబు తనొప్పంద జరించుట § బృందావనంబు నందమించె నిటు
నెందునైన తమ సహజ వైరముల § నందపు పక్షిమృగాదులు వేడ్కల
సందడిగొని సఖ్యంబుల దిరుగుట § కొండల మందక మునులు మెలంగుట
పావనంబు హరిసంచరంబు పరి § దేవనమ్ము వమ్ముగ నెచ్చటనుఁ
దేవజ్యేష్ఠుడు జూచిమెచ్చియును § నా వనమాలిని దరియ దలంచియు
నతఁ జూడ నిటు లొప్పియుండె నృప § వెత లుడుగును నీ వాయొప్పు వినుము
సతత సత్యవాక్శ్రియంత యచ్యుతు § డితర కలత లేనట్టి నిలయుడగు
తనకు పెరలెవ్వి లేనివాడు నయి § యొనరు నెఱయ ముమ్మూల విభుడునయి
జననాదుల నొందించు మూలలను § ఘనగుణముల సర్వంపు భూతముల
ననయము దనలో నమరి యుండగా § గనెనా వెతుకఁ గ్రేపుల బాలురఁ
నొక్కడయ్యె నఖిలజ్ఞుండయ్యును § ప్రక్కవారలకు పెక్కురు బాలురు
ఎక్కలేని యున్నటుల బిల్చుచును § చక్కన దిరుగుచు నున్న చక్కి గని
లో వెలి నంతట దాను జగములను § భావశూన్యతను నిండి యుండియును
అవివరము దనకును దెలియనియటు § భువి నడుగు చొప్పు నడక యునికిఁ
గలిగి లోతుపాతులన్ని దెలిసియు § దెలియనివానిఁ బోలి యాడుచును
చలనరహితుడయి చలియించు మాయను § నలంపు జేయగ గలండితండను
తలంపునను తా వెఱంగు గనుచును § నిలఁ గదలు గోపబాలుకై వడి
సితిఖ్యాతి కెలువారు కొలువుగని § చేతిసద్ది యున్నవు ముద్దనిడియు

ప్రీతివెలయ దాఁ దినుచు నరుగుచును § నతిజేసిన తను బ్రోచు నవువాని
యజాడుగాంచి శీఘ్రమున నంచడిగి § గజిబిజి మనమున గదుర నురుకుచును
త్యజమహాంకరింపు గాగ నా నీ § రజనయునుని ముందరికి వచ్చియును
కోమలచరణతలంబుల దనదగు § కోమలతనువుం గూర్చ నేలనుఁ
నామహాత్మ్యమది కింపుగ సాగిలె § నామ సహితముగ ప్రవర జెప్పుచును
అడుగుల పైఁబడు లేచు మరి బడును § జడత బోవఁ దా నింతకు మున్నగ
బాడగనిన రూపు తలంపునందిడి § దుఃకుదనంబనుగంట శిరములను
వంచి కరముజోడించి గళము సవ § రించికొంచు డగ్గుత్తిక నిట్లను
సంచితాఘముల సమయించువాని § మించబుధులఁ గరుణించువానిఁ గని
కనకరుచిని మించినవొల్లెయునుఁ § తనువుపైని వెలుగొందు దేవుడవు
ఘనుడవీవు నాకనులకగపడుట § గనిన దయాజలపూర్ణజలదమును
బోలెదవే యో జలధరవర్ణా ! § మేలైన పసపు చీరపై కప్పు
జలదమందు నొక మెఱుపు కాంతి గా § గలుగుచిత్రమది వేణు వేత్రములు
మరియు కొమ్ము శీతాన్నపు ముద్దయు § మురిపెముగా శిఖిపింఛ వేష్టితము
వరుసలన్ని వరదాయక కృష్ణా § వరకుండలముల చలితపు కాంతులె
కొంచెమైన పవనంబు తోడ్పడుట § పంచభూతనిలయా ! శ్రీహరి ?
మించినట్టి కృపజూచుటె వర్షము § నెంచితి దడియుటె నీదయవడయుట
మేలు గలుగ నిను దలపోయుటలే § వాలాయముగా నురుముల చాలును
ఫలము నను నిలుపుటయె గురియుటలుఁ § గలుగ నొప్పు నిను మొక్కితి గదవే
పాపహారివగు జనకా లీలను § గోపబాలునివలె నుంటివి గంటిని
బాపువెతలు నీ వగవులు నాకును § నీ పదంబులను గంటి సిరిగంటి
నను మన్నించియు నీ భక్తులకుఁ § ఘనతరంబు నగు మోదము గూర్తువు
తమరూపము నా మనంబునను వే § గనగ నచింత్యము విశ్వాకృతియగు
వైభవంబు చందం బెట్టిదియో § త్రిభువనాధీశ ! వినుతుడ వందున
యభవా నీ వగుటను దెలియుదుగా § ఇభవరదా! నీ యునికి గరిమ మగు
దాన తపోనియమాదులనుఁ విజ్ఞానలవంబును నెరుగకున్న య
జ్ఞానులైన కొంచెమగు వినికినిఁ § మనమాదులు నీకన గెల్తురు నిను
నట్టి భక్తి శ్రేయంబు నిజమును గా § కెట్టిదపము జేయంగ నైననుఁ
పట్టిదగును మోక్షంబు నంద దది § యెట్టులనగ పొట్టంత యైననుఁ
దట్టదు లాభము కష్టము వ్యర్థము § ఇట్టు లెరిగియే మాని జనులు యే
గుట్టు లేక నిను జెందెడి మార్గము § పట్టు యిదంచని బుద్ధిని నిలిపిరి

మొదఁలు నిను దెలియకున్నను వినికిని § సదయహృదయ నీచరిత నూతఁగా
మొదలు కర్మ నశియింపు నిలుకడను § గదిసి నిన్ను దలపోతలు ముక్తులు
ఈశ నిన్ను నే సంస్మరింతు నిక § కేశవాది నామముల నేను గిరి
క్లేశము నీయందును బొడముటయ్యె § రాసిగొన్న పాపాళి మాన్పు హరి !
నారములు నీకు స్థావరంబులగు § నారియైన సిరినాథ ! భూధరా !
చేరినవాడవు జగవిహారమున § క్రూరచరితు మధు బొరిగొనిన దేవ !
మూడడుగుల నెల్లెడల నిండితివి § వడుగు వీవె సిరి కాంత నందితివి
పాడి గొనవు సర్వేంద్రియంబులును § చూడ జగములను కమలము నాభియు
గలుగువాడ వయ్యా ! పరమాత్మా ! § ఉలూఖలంబున బంధితుండ వెటు
విలయకాలమున నన్ని మరల్తువు § నిలుతు వన్ని నీయందు యివి యటుల
నిండు కాంతిగలవాడవయ్యునుఁ § గండుగొనవు వైరుల నెవ్వరినిఁ
నుండ గుదిరితివి పురుషోత్తము డన § అండజవాహన ! క్షరాక్షరోత్తమ !
క్రిందునైన నీచంపు దశ లేని § సందుసందు కన శాత్రుసంహార ! పు
రందరాది మునివందితచరణా! § కుంద నీకుమా! కుహాకజనహారణ !
రూపశక్తి నసియింపదెప్పుడును § నీ పదభక్తుల కెల్లను నీకును
నోపరాత్పరా ! జనార్దనుడవుగ § వ్యాపకంబునగు నొక్క కాలమున
వాసవసోదర దశ నుంటివి దయ § వాసి గనగ యీ జగంబు నందున
దాసుల పాపనివారణ శ్రీహరి § వసుదేవసుతా ! వారిజాక్ష ! నతి
విషయవాసన లణుమాత్రమేనియు § విషయముగ గొనక నే క్రియయు లేక
విషయాకరింపు నెందును బూనక § మృష యని మూఢులు తృణీకరింపున
గనంగనేరరా నట్టిసద్రూప § మున వెలుగొందెడి దాని మనమాది
గను నేకంబున జేయు నధికతను § గనెడి జ్ఞానమున యోగులు గాంతురు
నీదగు నిర్గుణ శ్రీవిభూతిని § యదియు నిమయికము లన్ని మరలుపుట
గాద గోపబాల ! నాపాలినిధి ! § మోదమయ్యె నీసన్నిధి జేరుట
గుణయుతుడవు నను కొమరొందిన నీ § గుణసమూహముల నెన్నంగరాదు
పరిణతిఁజేతు నని మితము లేనివయి § గణనకు నందవు నాకు మరి నీకు
కారణపారక్యకరములకును § భూరజంబులకు లెక్కింప నలవె
నీరజాక్ష ! నీరమ్యగుణంబుల § మీరలెన్న తరమెవ్వరికిఁ గాదు
ఎట్టివారు కైవల్యఫలాప్తిని § గుట్టుఁగాంచు నంతేవిధ రమేశా !
దట్టమైన పూర్వంపుకర్మలను § మట్టుపరుపవలె నిను సేవించియు
శరణమునను నొకటిగ మాదుకొల్పి § హరి ! నీవు దయను జూతు వంచునా

నిరతరానందరతునిగ గనుచును ȝ పరసుఁడైన యతఁడగుదు ఈశ్వరా !
పరేశ ! పోషక ! నిరామయాచ్యుత ȝ విరాగహిత ! పరిపూర్ణ ! నమస్కృతి
పురారిసఖ! యోపుపీత! నిశ్చల! ȝ చరాచరమ్ముల విహార! సుస్థిర!
నీవు సమస్తము మాయను నింపుచు ȝ పావనమతులను దరింప జేయుచు
కావరమును గొన్నట్టి వారలను ȝ తీవరఁబుగాఁ దిరుగుడుఁ బరతువు
అట్టి నిన్ను నా మాయఁ గెలతు నని ȝ పట్టు బడక నే జేసి తిటుల దయ
బుట్ట వేడెదను నేర మెంచకువె ȝ ఎట్టు గెల్చు దవ దహనమును కీల
రజోగుణుండను మూఢుడ ప్రభుతను ȝ నిజంబుగా దగియుండదు శ్రీశా!
భజించితిని గర్వాంధకారతను ȝ త్యజించి తిప్పుడు భ్రమించి యుండుట
భూతపంచకము మహ దహంకృతియు ȝ నూతగ జట్టిన యండకుంభమున
నీతరంపు నేడైన జేనలను ȝ పాతు గొన్నట్టి తనువున నొప్పెడి
నాపరిమితెంత? పావనమూర్తీ! ȝ నీ పరిమితి దృగ్బ్రహ్మాండ మేరికి
నోపు సంఖ్య జేయుంగరాదు గద? ȝ ఆ పరమాణువు మొదలు బ్రహ్మాండ
మంతయు నొడలుగ సంతరింతువో ȝ వంతుఁ గొంటె రోమాది భాగముల
కెంతయు నోపుము నీవు ననంతా! ȝ ఎంత యంతరమొ? దలపఁ బొడఁగంటి
కంతుజనక! నను కరుణింపవలయు ȝ సంతతంబు నేమరను దలతు నిను
వింత యుండునే నన్ను బ్రోచుటలో ȝ సంతు గనెడు నారీమతల్లియును
పంతగించు నా కడుపులో పాప డ ȝ లంత బొడమ జనసిం దన్నిన
నించుకేని కోపింపదు గాదే? ȝ ఎంచు మటుల నను కారణ కార్యము
లంచుఁ గొన్న ఈ జగంబు లన్నియు ȝ మించగ నీ కుక్షిలోనివే గద
నేను న్నందలి వాడనె యాదును ȝ గాన నన్ను సరిగా దన దగదు
మీనరూప! సర్వేశా! శుభదా! ȝ దీనజనావన! త్రిభువనపాలన!
నను గనెడు మునులు జనవినుతముగను ȝ యనఘచరిత! నిను జనకునిగ బలుక
వినెద నదియు నిజమనుచును దలఁతును ȝ వనజముఖముగనుఁ దనువును బడసితి
విలయ జలనిధిలో హరివి నిదుర గొని ȝ అలత దరల జగములను మనిపినది
యులరున గుదిరితి కమలము బొడమెను ȝ గలిగితి నదియును పుట్ట నెలవగును
ఇటుల బుట్టియును ముదమును జెరుపక ȝ కుటిల మతిని విడకను నిను జెనకితి
జటివినుతుని నిను దలచు పుత్రుడను ȝ ఇటు గూర్పదగునె కన్నతండ్రికిని
జలరుహాక్ష ! సకలేశా ! దాస జ ȝ నుల పరిపాలా! నుతింపనోడుదు
జలములందు నీ యునికి వానికిని ȝ నెలవు నీ వగుదు నారాయణాఖ్య
జలము నారమని వెలయుట నటులగు ȝ చలన రహిత నిఖిలేశుడవు సాక్షీ

వలనుగొంటి శ్రీ కరివరదాతా ! ఽ తలపు నిలుప నీ నిర్ణయమేదో
చూ:నగా దది నూరేండ్లు వెదకి ఽ నలయు నెఱుంగక తపమున గంటిని
యొకతలంపు రుచి నీకు లేదుగా ఽ ప్రకటముగను యన్నింట దనరెదవు
సుకవి వాక్య సంచారా ! శ్రీహరి ! ఽ వికటదూర ! ప్రఖ్యాతపాపహార !
సకల ప్రపంచము నీ మాయగాదె ఽ చికురజాలసుందర తరముఖ ! హరి !
అకలుష మది గల యా సతి యశోద ఽ సుకరముగను గనె సర్వము వదనము
నందు నిన్ను సద్భక్తిని మ్రొక్కెన ఽ నందె ! యంతలో మాయ దాచితి వ
టెందుకన్న నీలీల భక్తతతి ఽ గందు రటంచను ప్రీతియగా గదే
ఒకడవయ్యు బెక్కురు బాలవత్స ఽ నికరముగా బరగియును నది దలగి
సకల్పంబున చతుర్భుజులునై ఽ సకల మూర్తులును సన్నుతి జేయగ
ఎమరి కనుమూసి తెరుచు నంతలో ఽ నమరితివా తొలిరూపు చోద్యముగ
నమలరూప ! సర్వాత్మ ! కేశవ ! ఽ అమరసన్నుతా ! అఖండరూపా !
అంతయు గంటిని అఖిలమయా ! నీ ఽ యంతరంబు గన నెరిగిన దోతువు
వింతయైన నీ ప్రకృతిచైదమును ఽ యంతుపరచినను సంతసంబునను
వంతునొంది నీదగు పాదసేవ ఽ చింత గుదిరినను స్వాంత నిలయమగు
వంతు బడకు జన్మాదుల నిం కిట ఽ నంత నీపదముచెంత సతతంబు
మాటికి నీవే మూలకర్త వని ఽ మాటికి జెప్పగనేల సుగుణనిధి
పేట శ్రీపదము బాట నీసేవ ఽ దాట భవజలధి గీటు పాపతతి
జలచర మృగ సుర మునివర కులముల ఽ ఖల నృపాల రూపముల దుష్టులను
నలమ సుజనులను యలరున మనుపగ ఽ వెలసిన నీ గరిమంబు గన నెవరు
గల రది యుండని కరుణాకర ! నా ఽ తలపులోని విన్నపము వినగదే
కలల వంటి వీజగముల నడకలు ఽ అలుకులకుం బెద్ద దుఃఖముల మద్ద
అలరుల నద్దిగ మఱలుపు బుద్ధుల ఽ కలయికలు గన తనువులు నిజ మొటు
నీవు సుఖబోధ తనుడవుం జెడవో ఽ యేవి. యైన లే వందు జననాదు
లో విమలా ! నందమయా ! తిరమగు ఽ లావు చాలు గన సర్వము నీవే
ఆత్మరూపుడ ! వుపాధిరహిత ! పర ఽ మాత్మ ! పూర్ణ ! యో పురాణపురుషా
ఆత్మవిదులు నిను వర్ధిని గొంతురు ఽ ఆత్మజితుల నత్యంత ప్రీతిగను
నమలవిచారా ! పరమపదవాస ! ఽ సుమనసవందిత ? సూరిజనస్తుత !
కుమతివారణ ! సుమతుల నేలు దేవ ! ఽ యమపాశభయావహా ! సత్యమూర్తి !
నిరతానందా ! నిత్యసుఖఖనీ ! ఽ పరమయోగిచిత్తప్రకాశ ! సుర
పరిపోషా ! వరమునీంద్రవందిత ! ఽ నిరంజనా ! నిష్కామ ! ప్రకామ !

శ్రీ విరాజితా ! శిష్టజనార్చిత ! । ఈ విరించిపై దయ జూతు వోకో
పావనుండ నే నొక ప్రణతి నీకు । నీవ నన్ను దరి జేర్పవలయు గద
దేవా ! నీవే జీవేశులుగా । భావం జేకత నేరు గాంతురో
యవ్వారు గురువు నా భానువలన । దావలం బందు తెలివిచే వెలసి
పావనోపనిషదర్థజ్ఞానము । త్రోవ పెంపునై సునేత్రి మదిగా
నావరిల్లు నీ ప్రకాశదర్శన । భావమొందు తథ్యంబు శుభము గని
సంసారసాగరమును దరింతురు । గాసిని బొందరు యది యసత్యమని
ఆశ సేయరా నిన్ను నెద నిలుపు । వాసిచేత నీ పదముల గొల్తురు
త్రాడు సర్పముగ గన్పడు భ్రాంతిని । కీడు పడుప త్రాడే యగుగా
జోడు చేయదగు నాత్మ మోహమున । గూడు భ్రమను వీడగ పరమాత్మయె
గాన భ్రమయనెడి భేద మది బోవు । మాను మదిని నిశ్చయ తత్త్వంబును
జ్ఞానరహితసంసారబంధనము । దాని విడుపునకు జ్ఞానవిజ్ఞాన
ములనకు జేరవు ముక్తి నీయు దది । విలసితం బయిన పరిపూర్ణజ్ఞాన
కలితాత్మ యనెడి పరమాత్మయందు । చలనసహిత యజ్ఞానము లేమిని
బంధనంబును జ్ఞానము లేమిని । బాధన మోక్షము రెండు లేనివగు
బంధమోక్షములు పరమాత్మను నిటు । బొందవు తెలియగవలయు నీ దయను
దేహాదికముల నాత్మవైన నిను । బాహాటముగా దలచి మరి త్రిప్పి
దేహమందు నిను వెలి నుండు వనుచు । నూహాల జెసుదురు మూఢు లట్లగుట
సుజనులు దేహమె దేవాలయముగ । నిజముగ జీవులె యీశ్వరుండు నని
త్యజము జేతు రజ్ఞానపు పూర్తిని । జయింతురు సుజ్ఞాన దీప్తి నిను
నీ పదసేవల నిల్పిన గద యా । యపవర్గమహిమ నెఱి దెలియుట యగు
తూ పరేశ ! సచ్చిదానందరూప ! । తాపపాపపరిహారా ! యనంత !
సకలలోకముల ప్రభుత వలదయ్య ! । యికముందున నీ విధి పదమంతమె
యిక జన్మలు నాకున్న యందునను । యొకవర మిమ్మది నిను బాగముభక్తి
క్రతుశతముల నీ కడుపు నిండదే । సుతుల క్రీవులను వడుపున గోపక
సతుల గోవులను తల్లులుగ గొనియు । కుతుక పూర్తి గన చన్నుల పాలను
గ్రోలితివా నాతండ్రీ ! యందుకు । మూల మేనుగా మునిజనపోషా !
నీలవర్ణ ! వా రెంత ధన్యులో । బోలుప నాగదు నుతింపు హెచ్చుగ
పరిపూర్ణుండవు ! పురాణపురుషా ! । పరమానందస్వరూప ! బ్రహ్మవు !
వరుసగొనిరి చెలికాడంచు నిన్ను । స్థిరమతి నందుని పురివార లెల్ల
వారిభాగ్యములు సామాన్యములే । నారదసంయమి గానవిహారా !

నారాయణ ! దామోదర ! మాధవ ! § సారభక్త హృత్కమల భాస్కరా !
మఱియు నొకటి దలపోయ మది గలిగె § వరుసగ పదినొక యింద్రియములకున్
మీఱజాఱి మొద లేను రుద్రుఁడను § మేరలైన యా యింద్రియ పాత్రల
నీ పదాబ్జ మకరంద మమృతముగ § నోపి ద్రావియు కృతార్థుల మైతిమి
పాపదూర! పక్షీంద్రవాహనా! § పరమపురుష! జగదేకసుందరా!
ఒక్కొకయింద్రియముల యధికారత § జిక్కిన మేమిటు లెక్కువ గంటిమి
చక్కని ఫక్కిని సకలేంద్రియముల § మిక్కిలి వ్యాప్తులు నీపై బరపియు
మ్రొక్కగాంచు గోపాలవర్గముల § జిక్కెడి పద మేదిక్కున యున్నదో!
నిక్కముగా నాకును దోప లేదు § ప్రక్కవారలకు నెవరి కెరుకయగు
రక్కసులహంత ! రాజ ! ముల్లోక ! § పక్కపాపగా చక్కగనుదేవ !
అక్కర నెఱపుము మ్రొక్కులంతే దయ § పెక్కు జాళ్ళనన్ నింపఁగోరితిని
హింసన్ జేయగ నెంచియు దాసిన § కంసు డంపిన క్రూరరక్కసిని
హంసుని నినుగను యోగులకైనను § ఆసింపగ నీయని పదమ్మునున్
బొందన్ జేసితి వయ్యా ! పరమాత్మ ! § ఇందున్ పల్లెల దారపుత్ర గృహ
సందోహంబుల గోవుల మందల § సుందరులన్ ప్రాణ దేహములనున్
నందమింప నర్పించిన వీరికి § బొందజేయు పద మదెట్టిదో యని
సందేహము నే బొందనాయెగా § మందరపర్వతభారవాహ ! హరి !
వేరు మమత నిన్నే మరి యున్నన్ § వారి తనువు కారాగేహమునా
నీరజాక్ష ! యా మమత లురులునగు § వైరులు తక్కిన ఆశాదికములు
ప్రపంచరహితుడవయ్యు నాశ్రితుల § ప్రపంచలీలల నలరు నింపుటకు
ప్రపంచమందున సంచరింతువా § సపింఛ వేష్టితదామ! శ్రీధామ !
యెఱిగినవారి యెఱుంగమి నంతయు § యెఱుగుదు పెక్కులు బల్కనేల నిను
నెఱుగుట వారల మది తోచినంత § తరుగులేని దా యెరుక యనంతము
సర్వాపరాధములను క్షమింపుము § సర్వజగత్పరిపాల ! మహనీయ !
సర్వాంతర్యనివాసి గాని జెడ § సర్వవిధమ్ముల బ్రోవనెంచు మిక
బోయివత్తు శ్రీకృష్ణ! నందసుత ! § బోయె సందియము ప్రీతి జూచితిని
నీ యకల్మషములగు పదము లిటుల § నాయవి కరముల నంద జాపుమా
యనియు ముట్టి మున్మూరు శిరంబుచు § దన హృదయానంద పూర్తి మోపియు
వినయవాక్యముల వినుతి జేసినన్ § దన నెలవును జేరంగ సెల వంది
జనకా! మునిహృత్ పాంసుల విహార ! § కనకాంగదవిభవాలంకారా !
సనకాది మునీశ్వర స్తవనీయా ! § యనఘాత్మనిలయ! యదుకుల దీపక !

నీకు కల్పపర్యంతము మ్రొక్కెద ꣻ నాకు ముదంబది యో కమలాధవ!
శోకచేయు నీవెందు నుందువని ꣻ వీకనెక్కె రాయుంచ నెలవు గనె
నందసుతుండును మందహాసమున ꣻ ముందునున్న యా వత్సబాలు లా
నందపు ముందటి పులినతలంబున ꣻ పొందజేరె బలరాముం డలరెను
ధాత తమ్ము వంచించిన యబ్దము ꣻ యాతరమ్ము గోపాల బాలురకు
చేతమునన్ యొక్కింత సేపుగనె ꣻ జూతురట్టు లాకాలము నెరుగరు
హరిమాయవలన జగమ్ములన్నియు ꣻ నిరవుకొనును మోహంబు పెంపునను
వరుస గాన రా బాలురం చనగ ꣻ సరియెగాద యో యభిమన్యుపుత్ర!
బాలురనిరి శ్రీహరి రాకనుగని ꣻ నీలవర్ణుడా! నీ వచ్చుదాక
కేలుబ నల్లె యెత్తి గుడువ మన ꣻ నా లలితాంగుడు నవ్వ నందఱును
గుడిచి రెలమి పెంపార నుత్సుకత ꣻ నెడబాయక దా రుందు ఱొక్కటిగ
వెడలి రచ్చటను యజగరచర్మము ꣻ వడువు జూచి ముచ్చటల నాడుచును
నెమలిపురితోడ సుమమాలికలన్ ꣻ దమించు శిరమున శోభిల్లుచునన్
ప్రమదమంద వేణువు నూదుచు నట ꣻ గమికాండ్రు దన్ను గొనియాడ చిత్ర
మొయ్యారంబుగ నడసాగించుచు ꣻ నయ్యారామం బంత వెలిగించి
నెయ్యుల సందర జేర బిల్చుకొని ꣻ చయ్యన పల్లెను జేరె గోపకులు
సంతసింప నా హరి శ్రీకృష్ణుని ꣻ వింతచర్యలను బాలురు జెప్పగ
రంతుమాని శ్రీ కాంతుం డితడని ꣻ యంతలో మఱచి ప్రేమం జూతురు
సుతులాదిగ ధనతతుల మీదనున్ ꣻ మతిపెద్దగ నిలుపరుగా కృష్ణుని
సతతము తమ హృదయమున దలంతురు ꣻ వెతలు దూరమగు నతని జేరగనె
యనిన నృపు డనియె శుకమునివరునకు ꣻ మనమున నాశ్చర్యము దోచె నాకు
ఘనుడెట్లు మనోరంజకు డయ్యెను ꣻ వినుతికి నెక్కుట యెట్లొ వివరింపు
మన నఘా! భవతి ధాతువెట్టుల ꣻ ఘనత భావార్థమై సర్వధాతు
గణమునందునన్ దనరునట్లుగా ꣻ జనసుతు డా శ్రీశు డుంచుటను
ఆకర్షింతురు తపము పెంపునను ꣻ యాకరమ్ముగా చిత్తము రతిగను
ఆ కర్మవశము నగునది వెనుకను ꣻ సాకతంబుచే నటులగును బుద్ధి
గాన హరిపైన వలపు వారలకు ꣻ గానంబడియెను అదియు వింతయే
దానిం జెప్పితి నో నరాధిపా! ꣻ దీనపోషకుడు మాయాతీతుడు
మాయతోడనే మూర్తిభవించె ꣻ నీ యుదారు డవ్వారి దయ గనియె
నీ యనువున నే మూడులోకముల ꣻ న్యాయము నిల్పెడు వాడతండు సూ
శ్రీపతిచరణమె నావ భవాబ్ధికి ꣻ నాపద దప్పగ తరింప జేయును

పాపదూరులకు సంసృతిసాగర § మీ పగిది వత్సలపు పదంబగును
గుట్టెఱుంగు మీపట్టు విన్నజే § పట్టు బరమాత్మ ముట్టించు దన్ను
జట్టుకొన్న మునినిలయము సిరి చే § పట్టిన విష్ణుని పురము దనపురము
అంతట నొకనాట రేపకడన య § నంతలీలగతి బాలుడు కృష్ణుడు
వింత సంతసము వినువారికి గా § చెంతకు తోడులు రాగ వేణువును
నూదిన బాలురు శీఘ్రిత నావుల § కదుపుల ముందుగ నిడుకొని దరి రా
మోదమంది బలరామునితో సహా § నా దయాపరుడు గోవుల దోడ్కొని
నిరంతరంబును వసంతసమయమె § చరింప నద నగు వనంపు తరులను
చరించు వేడుక సుమంబులన్ రుచి § కరంబు ఫలముల కిసలయమ్ములును
మరంద మానెడు భ్రమరనాదములు § కరంబు సొంపగు శుక పిక రవములు
చిరంపు శీతలమగు వారిదరుల § పరంబు లిడు తరుకదంబములునన్
తీవల సొంపును పొదరిండ్ల పెంపు § తావు లెల్ల వనమృగముల ఖగముల
చేవమించు ఉభావవైరముల § నే వలను నందకను దయఁ జెల్లగ
నలంకరించిన వనాంతరమ్ముల § చెలంగులను వారందరు చరింప
కలంక రహితపు జలంబులన్ గల § కొలంకుల న్గని నీరుల ద్రావుచు
నలంతలను లేకసంతు దరియుచు § తొలంగుచును వారంద రిటుండగ
వెన్న డన్నలన్ జూచి చిరియును § మన్నన పెద్దతనంబు మెప్పుగా
అన్నరో చూచితె వంగినతరువుల § నున్నతలఁపు నే నెఱిగితి వచింతు
చిన్నతరముగా నట్టి ఫలకుసుమ § వన్నెలన్ని పెను భారము మా కని
సన్నల దెలిపెడి శుక పిక రవముల § మిన్న వచించెడి పల్కులుగా విన
సన్నయోను మా భార మింక గొను § యిన్ని ఫలాదుల కాన్కలివె యనుచు
సన్నగాని యా కొమ్మల చేతుల § నిన్ను జూచె నవి యిన్ని గొనుము తిను
అవిగో తుమ్మెదలు నీకీర్తి నాడు § నవియుఁ జట్టు నీ చరణాబ్జతలము
లవియె నిను మెచ్చు తమ గాఢగతిని § భువి జడరహితుడు ఈగేవు డంచు
నడకల నిను శేరగ వత్తురు యా § జడవారులు నీ కడకును గనుమా !
జడుపు దీరు నీ సేతల నిక నను § నుడువుల నీ మహనీయత నెన్నుచు
నీలాంబరమున నీవు మెలగగా § నీలకంఠములు నాడు మేఘమని
చాలు ప్రీతి గోపాంగనలు చూచు § చాలుల హరిణము లట్లు చూచె నిను
మేలిబంధువని పరభృతములు నిను § పలుకుచున్న వవె నిర్మలసూక్తుల
ఈలాగున విపినచరులు సర్వులు § వాలాయము నీ వెలయుట ధన్యులు
వాచకమునకును నేటు యీ భూమి § నీ చరణమ్ములు సోకుట పాపపు

నీచ మడప పుణ్యంబు నెలవయ్యె | నీచదశలు బొందవు తృణము జలము
నీ నఖంబులను తగులత లట్లనే | నీ దయంపు జూపులు నవియెల్లను
నీదు కాంతులను ఖగమృగాదులును | బూవిక సురమున మోవ గోపకుల
నారుల జన్మలు సఫలంబులయ్యె | నారణ్యమంత నిటుల పావనము
ధీరాత్మ! జేసితి వనుచు బలికి | సారెకు చిరున వ్వొలయ నదులందు
గిరులందు సంతసము నొప్ప దిరిగి | వరమతి గోవుల మేపుచు పాడుచు
చరియించెను హరి తోడివారలును | సారదయామృత వృష్టి సించియుఁ
మరి భ్రమర హంస, కేకి, వనకరుల | మురిపెముల గనియు మోద్రియు ఘీంకృతుల
మీరుచు ధ్వనులను బరగించి నడచి | పారుచున్న వనమృగముల గని బారుచు
ఖగముల రుతముల తా రొద జేయగ | జగ దవనుడు శ్రీకృష్ణు డీ ట్లమరి
భగుని తేజమును మీరిన వపువును | నగవున చంద్రుడు సన్నగిలంగను
దూరపు గోవుల రా బిలుచు నిట్లు | తేరుల సొంపుల వినుమో రాజా!
భారతి! లక్ష్మి! మందమారుతీ! | చారుచంద్రికా! గౌతమి! గంగా!
భాగీరథి! క్షీరార్ణవ! శుభాంగి! | బాగు గన్న చింతామణి! సురభీ!
భోగవతీ! యో సర్వమంగళా! | నాగరత్న మణిదీప్త! శృంగార!
సారా! శుభాంగి! సులక్షణ! సత్యా! | నీరజాక్షి కళ! నీతినిధి! యని
చేర బిలుచుచును సొంపు పెంపుగను | సార ముదములను గాంతు రందరును
అన్న నిటుల కాంతార విహారణల | మిన్న విమర్శల నెన్నో జూపుచును
చెన్ను వెలయు గోపార్భకు లంత | కన్నురెప్పవలె గాపాడుచుండు
వేదాంతవీధి ఫణిరాజశయ్యా! | గా దాంతి నొందు కడు ప్రీతినొందు
వాదాంతరమ్మునకు నిమ్ము లేదు | వేదాంతముఖ్యు డగుట నట్టులగు
కాంతార నరక పల్లవపుశయ్య | లెంతేని విడక శాంతి యుత డుండు
సంతోషవృత్తి సంతాపవిజయ | మెంతైన వార లింత దెలియునగు
సంతానతరువు భక్తజనులకు య | నంతాది నామ రూపములు పెక్కు
యోగి మానసపు గుహల మెలంగెడి | యోగవిలసితుడు కొండగుహాలలో
డాగి చరించుట యొకలీల యగును | రాగరహితజను లది మెచ్చరెట్లు?
శ్రీ కాంతాసతి కటిపైన నలసి | యా కాంతయె తను నుపచరింపగా
రాకేందువదనరుచి నవుమోమున | యా కమలానన దిలకించువాడు
గోపబాలురను గూడి యాటలను | ఆ పగిదిని నలసతను నొందినను
తాపికలను నా గోపబాలురే | బాపుదు రాయాసములు పల్విధము
లగునది యెట్లన కొందరు శిశువులు | చిగురు టాకులను దెచ్చి విసరుదురు

భగవంతుడు తా నగుట వారలను ఽ నగుచు మెచ్చి మాటాడు చెమటడగ
తాను జగములకు నాశ్రయుడయ్యును ఽ తానే నీడల తరుల నిలుచునా
యాగఫలభాగ మశనముగా గొను ఽ భోగశాలి యటవీఫలముల దిను
దిండులుగా దమ తొడల శిరమునకు ఽ నండ నిడుదు రవ్వారు శ్రద్ధలను
ఎండల దిరుగన్నీరు నడకలను ఽ గుండులు రాళ్ళను తాము దొలపుదురు
నడవలేని తన మొకపరి జూపిన ఽ దుడుకు విడచి తమమూపున మోతురు
గొడుగులవలె బట్టుదురు వస్త్రముల ఽ దడదడ జేతురు పనులు వచించిన
పదములొత్తుదురు పానీయమ్ముల ఽ ముదము పెంపునం దెచ్చి యిత్తురా
సదయుల వారి నన్నారడించియును ఽ అదురుబోవ ధైర్యముల బురికొల్పి
రామకేశవులు గోపబాలురును ఽ ఆ మానములం గుదిరి యుండు నెడ
నా మహనీయులు విన నిటు లనె శ్రీ ఽ ధామనాముడౌ గోపబాలకుడు

—: గార్దభాకారుండైన ధేనుకాసురుని బలభద్రుండు వధించుట :—

అనతిదూరమునం దాళవృక్షముల ఽ వనము గలదు అద్దాని ఫలమ్ముల
దినగ మనసు మాకందగ నుండును ఽ కన రుచి నమృతపు పరువు తుల్యమగు
ఫలములు పతనము నొందె రాసులుగ ఽ నిలింపులును నవి దినంగ దలతురు
తలకును గందురు అచ్చటు దరియగ ఽ ఖలుడు బలుడు ధేనుకు డసురుండట
నుండు నెట్టిడుల గం డడగించును ఽ నిండుకృపను మాపై నుంచితి రే
లెండు మాకు దినిపింప జేరు డట ఽ నండగొనుచు మీ వెంబడి వత్తుము
మొండు బాయ నా దనుజుని గెడపుడు ఽ దండిప్రాణములు వానిం దొరలగ
వాడు ఖరము నాకారపువాడును ఽ తోడిహితులట్లె యుంద రేకముగ
వాడి మగలునై మనుజుల దిందురు ఽ బసుదురు మీచే బడయుదుము పండ్లు
ఫలరసగంధము నాసములను లో ఽ పలను దూరె మా మనములు వాన్ఛ
వలపు లెక్కువయె మము నమలింపుడు ఽ ఇలలో దనుజుని రూపు నిజము చెడు
నని పలికిన చెలికాని వాక్యముల ఽ నిని యాలస్యము విడిచి మోదమున
తినిపింతుము రం డంచు వారలకు ఽ మన మలర జెప్పి యా నెలవు జేరి
జేరిన వెంటనె బలరాముడు యా ఽ సారఫలంబులు కుప్పలుగ బడగ
తరుల బట్టి త్వరతోడ గదల్చెను ఽ కరివలె నప్పుడె ఫలము లిల గప్పె
రిపు డెవ్వడో నా వనిలో జొరబడియె ఽ నపురూపమౌర నను లెక్కగొనడ
ఇపుడె దీతునా వాని ప్రాణములు ఽ కుపితుడ నైనను త్రిపురారి యలుకు
అనుచు ధేనుకుడుం గాడిదరూపును ఽ మనమున రోషముం దొడబడ నడుగుల

వనములోని యా పుడమి వ్రియ్యలుగఁ ✽ దన రావ్రము గని సురవరులు బెగడ
దంతఘట్టనల భీతి నిండించి ✽ అంతమూయ దా నంతకువలె ముని
పంతము నెగ్గగ దలపు యాశ్వాసుని ✽ చెంత దాయఁ దా వచ్చుట బోలెను
సంతరింపు సజ్జనుల పరముగా ✽ వంతుగొనియు రూపమ్ము దాల్చిన యు
నంతు డీనుడగు బలభద్రుపైకి ✽ అంతున భీకరు డాచు జేలినవి
చెవులు గదల్చుచు వాల మల్లాడ ✽ దివులున గోపార్భకులు దను జూడ
గవిసెను నాతని గరవగ దన్నుగ ✽ భువనవిభు డా వట్టునకు దప్పి
సందు నీకున్న రోస మినుమడిసి ✽ బొంది మెట్టులో సుడివములు దన్న
నందుకొనియె నాపదముల నాల్గిటి ✽ కుందు నా రిపుడు వొంద పిడికిలిని
బట్టి చిరచిరం ద్రిప్పి యిలఁ గొట్టి ✽ అట్టె నసువులకు ష్టు మరల్చుట
దట్టము నటు మరి ద్రిప్పి యొకచెట్టు ✽ కొట్టకొనను దాకంగ విసరగా
నదియు విరిగి మరియొక్క చెట్టుకొన ✽ గదియ నదియు నింకొకటిపై బడగ
నదియు నట్టుగా నా వనమంతయు ✽ జదిసె కొన్ని దక్కంగ పెనుగాలి
వలన గూలు పోలికగా దనుజుడు ✽ ఇలను జీవముల నిటు బాసిన గని
చలము గొనియు గాడిదలై జ్ఞాతులు ✽ ఖలహంతకులను నందసు పైబడ
వారిజోదరుడు రాముండు వారి ✽ ధీరతనంబును జిక్కియున్న యా
తరుశిఖరమ్ముల తనువులను మోది ✽ సురల మెప్పుగా విసరి జంపిరా
వెనుక పాదములు బట్టి త్రిప్పుచును ✽ దనుజు లంద రిటు మడియగ నా ధర
కనువుగొట్టు లందిన తరుచయముల ✽ దనుజ శవములను గప్పంబడియెను
సురలు వారిపై విరుల స్గురిసిరి ✽ వరదులైన యువ్వారి దయవలన
కరము రుచి వెలయ నమలిరి ఫలముల ✽ దరమే వారల భాగ్యము గోపా
ర్భకు లది నటు పనిదీరగ హరియును ✽ వికచవదనుడై బాలురఁ గ్రోపుల
సకల శుభంబుల గుదిరించి కొంచు ✽ ప్రకటిత యశమున వీడులను జేర్చె
గోపదధూళియు ముంగురుల గప్పఁ ✽ నాపగిదిని శిఖిపింఛము భాసిల
చూపుల దయ నొలికించుచు చిరునగ ✽ వేపుగొనగ గోపిక లలరగ నా
వనములోని పుష్పముల మాలికలుఁ ✽ దనమెడ దాల్చిన కాంతి నందియును
జననీ యని దా ననెడి యశోదయుఁ ✽ దనకు నెనుదు రా దా గిము జేర
వాడల జేరిన బాలుర తల్లులు ✽ దూడల దరి గను గోవుల పగిదిని
గూడిరి ముదముల వేడ్కల గూర్చిరి ✽ పాడితోడ దిను భక్ష్యము లన్నియు
దిన దినమ్మనను గోపకాంతలును ✽ వినయమ్ముల వ్రీడా హాస విలో
కనముల నాదరపూరము గాగను ✽ గనుచునుండ రోహిణి యశోద

లును దమకొడుకుల రామకృష్ణులను | చను వెక్కుడుగా పాలన జేతురు
జనులు గొనియాడ దినచర్యలిట్లు | వనజ నయను డా గోపగోపికా
భ్రమరసంతతికిఁ దాను కమలమై | రమణ దనకృపయె మరందమునుగా
కమనీయంబుగ ద్రావ బఱపె నా | రమ రమణుడు శ్రీ విష్ణుడు కృష్ణుడు
ఒక్కనాడు బలభద్రు డడవికిని | పెక్కుమందితో బోక మోదమున
ఒక్క డింటికడ నందాదులు తన | చక్కని పలుకుల ముచ్చటలు వినఁగ
నుండె గృష్ణుడును గోపాలకులును | దండి గోవులును యడవికిఁ జనియును
ఎండచాలు పెక్కగుట దప్పిఁగొని | యుండి యొక్కచో కాళిందిమడువు
యుండగాగ నందలి విషవిషముల | మెండుగ ద్రావిరి గోగోపకులఁ
నిండు ప్రాణవాయువులు వెడలంగ | దండిప్రభుఁడు కృష్ణుండు వారలను
దండిదయను బ్రతికించె వారలును | మెండుకొన్న సుఖనిద్రలు తీరిన
గండుతనమ్మున దేరి మోదములు | నిండగ గోవుల గూడి సేవఁ గన
నుండ జూచి కాళింది మడువునఁ | నుండిన కాళియు డనెడు సర్పమును
గం డడగించియు యాతలంబునను | నుండనీక వేరైన నిమ్మ్రనకు
పంపెనన పరిక్షిత్తు శుకమునిఁ | సొంపుగాను దిలకించి యిట్లనియె
ఇం పయె వీనుల కీ నుడి మహాత్మ ! | కింపురుషాది సుతుండు పరమాత్మ
శేషశయనుఁడగు శ్రీశుని చరితము | దోషరహితమగు గాదె విపులముగ
వేష మెుంద నను వినుపింపుము దయ | తోషమునను జోడింతు కరములను
తొట్టుల గాచుచు నుండిన నందుని | కుఱ్ఱని చరితము పరమామృతమగు
జట్టదలతు నా చెవి దోయిళులఁ | వెఱ్ఱులయిన సుజ్ఞానులె యాదురు
కట్టె నెచ్చెలియు నా ప్రాణదాత | కుట్టియగును మునిజనుల కోర్కులకు
అఱ్ఱులెత్తి శ్రీకృష్ణుని బాడిన | కుఱ్ఱ లఘుములవి కూలబడునుగా
వన నుత్సహించి మునివర! యోనృప! | ఘనత నందెదవు శ్రీహరిని మతిని
జన రహితునిగ సగుణ విగుణునిగ | గనినవాడ వీ వైతి వని తెలిసె
వినఁచెప్పెదు నీవడిగిన విపులము | మునుల సమ్మతుని హృదయగతుని నా
జనకుని వినుతిఁ గన్న యాతనిఁ | వినయమ్మునన మ్రొక్కుచుందు గద !
కాళిందీనది యొక్క మడువునఁ | కాళియు డనెడు ఫణీంద్రుడు వసించు
కాళినాథ వినుతుం డాకృష్ణుఁడు | వేళగాంచె నా సర్పమును దోల
తన విషానలముచేత నావిషము | కనగ తప్తమగు నట్లు చేసె ఫణి
వినువీధిని జను పక్షులాజలము | పైనిఁబోవ నుడి తిరిగి యందు జెడు
మరియు నాజలము తుంపురులగాలి | దరుల మేర దిరుగాడు జంతుతతి

బారిన యంతన బారును తనువున ఽ పూరితంబుగా నున్నపవనములు
జలము నుడుకుచును పొంగుచు నుండును ఽ తలకుదురు సురలు నట తేరిచూడ
జలజాక్షుం డది చూచి వెఱగంది ఽ జలమును విషరహితముగాను జేసి
కలుష మడగ ద్రావింతు నెల్లరను ఽ చులకపఱతు నే భుజగపు నడకను
చులకనగాదే నాకిది లెక్కయె ఽ ఖలుల ఖలత్వము బాప నుంటినా
వని కినుకను తా వెంచి పాముపై ఽ కనికరమ్ము లవమున్ జెందబోక
కనియె దరిసి నొక కదంబ భూజము ఽ మునుతపంబు ఫలమేమొ హరిచరణ
ములను దనపైన దనరుభాగ్యదశ ఽ కలిమి గన్న దానిన్ వడి నెక్కియు
తలగబోకుమా! ఖలుడ! పొగ రడఁప ఽ చలము బూని నే వత్తునం చనెడి
మెలుగున కేకలు దివిముట్ట నింపి ఽ వలువ బిగించియు గొప్ప సవరించి
విపులశాఖపై నడచి గుభిల్లున ఽ జలము గలగ గోపాలసింహ మటు
చెలగె దివ్య లాసాంపును గనగన్ ఽ జలచరావతారము స్ఫురింపునగు
విలసితవర్తనుఁడా మనువు బ్రోవ ఽ నలరున హరి మెలగిన కథ యది యగు
దూకిన మాత్రన యా వేగమునను ఽ భీకరోర్మ్ములను జలము పొంగియును
ఆకసంబునకు సోకఁగ నెగసియు ఽ యా కడిమిని దరి దాటి ధనుశ్శత
దూర భూమిసిన్ గప్పె నాతరగ ఽ లా రక్కసిహాననుం డిటు కలపుట
వారిరాశి పిహరించు మీనహరి ఽ సారగతిన్ వలె నీట నాడుటను
భుజగనాథు హృత్ప్రితాగ్రమునన్ ఽ నిజరోషాగ్నియు జ్వలింపు నొందగ
విజయశ్రీకరుఁడు విష్ణుడు తనవగు ఽ భుజముల బలమున జలముల మెలగుట
బాలు డెవండీ నా మడుగునందు ఽ లీల విభ్రమోచ్ఛలత్కూర్ణ క
ల్లోలంబుగ గలచె జలంబుల గన ఽ జాలడో నే నిందుండుట విషాగ్ని
కీలల భస్మము తా నగు టెరుగఁడు ఽ శూలి శూలవేడిమినైన తప్పగను
బోలు నా జ్వాల మ్రగ్గక తక్కునె ఽ కాలఁజేతు నిపు డీ జలమ్మునని
ధీరు డొకడు నానెలవున నేటికి ఽ శూరత జూపగ రా గలిగె నంచు
ఘోరవిషానల ప్రభలు గ్రమ్మకొన ఽ భూరితరఁబగు నాగ్భటింపునన్
కూ్రర నిరాకరు సుగుణాకరు నా ఽ ధీరబాలకుని శ్రీనిధిని కృష్ణుఁ
జేరి కఱచి పిఱు తివక మరియునున్ ఽ ధీరత వెఱవక నిజవదన జనిత
విషదహనశిఖలు మెఱయ తనువునన్ ఽ విషధరవర్ణునిఁ దా జుట్టుకొనియె
విషపునయనుసఖు డితడని తెలిసిన ఽ విషధర మీతని జనకునె ! నృపవర !
గోపబాలు రది గాంచిరి కృష్ణుని ఽ పాపిభుజంగము మన చెలికానిని
పాప మనకనున్ పాప మనబోక ఽ ఈ పగిదిని కనకుండ జుట్టెగా

నోపలేము గద పాము నడ్డగను § నేపు నూపు క్రూరము మాపగను
గాదె మనల గాపాడువాని కిటు § రాదగునే దుర్దశ యిప్పట్టున
అడుగొనెడు వారెవ్వరు లేరే § యా దయానిధికి నాగతి దప్పగ
శ్రీదుడైన నిటు రాడే బలుడుఁ § బాదు వచ్చె నీ దినమున రాకను
జో దెవండు మనలోనే లేడే § యేది యుపాయము మది కెక్కదుగా
పోదమన్న కాళ్ళాడవె పల్లెకు § బీదలమైతిమె బలమున బ్రతుకుట
లేద మనకు నా కాలమంతటిదే § యాదరింప నా నందాదులైన
ఈతరి జేరెడు నసువు గుదురదే § యాదిదేవ యమలాత్మ! శ్రీహరీ!
నీదయనైనఁ దోడు బంపుమా! § యేదుగొల్పునే యాపద దేవా!
కాద మమ్ము శ్రీకృష్ణుని కౌగతి § నూదగొమ్మ మా పవనములు నీవ
యెన్ని యాపదల దప్పించితివో § చిన్నియన్న మను జేర వెఱచె నవి
యెన్ని పెనవడియు పైకొనె నాగా § ని న్నిపు డీపట్టున బెట్టు నగుచు
సన్న బుచ్చితే దనుజుల గొందఱ § నున్నబలము నే డేల వెలిగింప
వన్నరో! ఖన్నత నిన్ను దొలగి చన § కున్న నిన్ను గానంగ వత్తుమని
మిన్నయైన ఖేదమ్ముల బాలురు § కన్నుల నీరును గార్చుచు కృష్ణా!
వెన్నుడ! నీ విక మా ప్రాణల నిలువ § కున్న తలపు త్రైవంకల దారును
బాలురిట్లు పలువిధముల దుఃఖము § లోలి నలమటను వందురుచున్నను
లాలకించి లో వాపోవుచునుఁ § చాలుల నిలిపెను జూపుల చెదరక
బాలురవలెనే కన్నులధారల § మేలు దొలగె నా మనకన్న యటుల
వాలములైనఁ అల్లార్పక మే § పులదిక్కుల నైనను బోక నిలిచె
భూమి పడఁకె నుల్కలములు దుల్లెను § ధూమ మడరె దిక్కుల నన్నింటను
గామగణము లవి కేకలు వినఁబడె § నోముఫలముఁ జెడ బోలు మా కనుచు
మంగళగౌరిఁ బేర్కొంచును దమ § పొంగు లెల్ల యణఁ మరుగు పడఁగ నా
యంగతలమ్ముల ముంగలి సత్త్వము § బ్రుంగుడు పడగా నిదియేమొ యనఁగ
గొల్లల నిలుపుల యుత్పాతమ్ముల § కొల్లలుగాఁ దోపఁగ బెగడిరి వడి
జెల్లగ నిండ్లఁ వదల గోపకులు § వల్లలు దప్పిన నడకల వెడలిరి
నందయశోదాదులు రోహిణియును § ముందు బలభద్రుండు తోడుగను
మంద నున్న యా బాలకృష్ణులును § ముందు వెనుకలఁ గనగ వేగముల
నంది కృష్ణుఁ జేతట్టున నుండెనొ § కందుమ యతనిఁ బొందకుండు నే
మందమైన యుత్పాతఫలమ్ములు § నందసుతుఁడు మన కెదురు వచ్చునోకో
యనుచుఁ బెక్కు తెఱంగుల బలుకుచు § మనముల నెన్ని దురూహల దిరుగుచ

ఘనునిజాడ గననేది మార్గమని § తనువులు మరచియు బనులు మరచియును
ధనము మఱచి గోధనమును మఱచియు § తనయులాదిగా మమతలు విడిచియు
తనువు మనువు ధనతతులు సర్వమును § వనజాక్షుని జూచుటతో సమమును
గావుయంచు ఘోషంబు వెడల నట § యీ విధి దలపున కృష్ణుని నిలువుచు
బావురంచు వాపోవుచు పశువుల § దేవదేవు శ్రీహరి నెన్నుచునుఁ
పోవగ బలరామమూర్తి వారల § తోవల జూచియు నగుచున్ ధీరత
జూపుచుఁ దానే యూతగ జరుగుచు § అపమ చిత్రము వారిపై ప్రీతిని
నాపరంబుగా నుంట నెఱిఁయునియు § యా పునీతచిత్తుం డటు నడచెను
హారియుమగులు మార్గాభరణము § లరయుదు జాడ లివే యని యమునా
తీరము గని యా వారిమధ్యమున § క్రూరసర్పపరివేష్టితుడయ్యుఁ
ఘోరున నేర్చెడి బాలురనైనన్ § దేరిచూడగను తోవ గనని యా
బాలకృష్ణునిన్ పరమానందుని § చాలుఁ జూచి యెలుగెత్తి కృష్ణ! యని
లోలురైరి పెనువంతల పనివిరి § పోలజూడవా! నందసుతా! మము
నేల జూచి మాటాడవు కృష్ణా! § లీల లేవి నీతోడి బాలురను
నేల బిలువ వన్నా! ధైర్యమ్మున § చాలు దప్పితివె దుష్టభుజంగము
పాలుగంటి వెటులో బాలా! నీ § మేలికళల దిలకింప నగుమోము
వ్రాలె నిను బ్రోచు టెట్లగును § మాకు తూలె నేల నీపైన నాపదలు
దేవు డెపుడు నీపట్టున లేడో § యే వలనికి జన నిం కెవరు గతి మాకు
భావి నీవు ఘనుడ వయెదవని భూ § దేవులు బల్కుట హీనంబగునే!
యెదురువచ్చి నను బిలిచిన తలచిన § ఎదురు వచ్చుటయు బలుకుట నిలుచుట
ముదము గొల్పుటయు డాయ డాయుటయు § వదనమునందున చిరున వ్వొలయగ
జూచుచుందువే ప్రియమున జూచిన § జూచుట మాటలు మొదలు నన్నిటికి
కాచుకొందుమే కంజాక్షా! మము § జూచుట మొదలుగ మానితేల? నీ
నాడు పోడిమిఁ దాచితివేలా? § కీడు గొంటివే ఫణిచేత జాల
జాడ యేది మా కీడ నిను కీడు § పాడుచేసి మా గోడు బాప నె
వ్వాడు గలడు యోకృష్ణా! ఇయ్యెడ § తోడివారి గన్నెత్తిచూడ నా
వేడికోలు గమనింపడె దేవుడు § బీడుబోయె మా భాగ్యం బింకను
అడుగుల గల శుభలక్షణచిహ్నాలు § పుడమిదేవి కలంకరింతువె
పుడమికాంత నీపాలిసొమ్మ యని § నుడువుచుంటి మది గీటు ఋచ్చితివ!
పతితయైన పూతన చెడుటయు § గతి జెడి సుడిగాలిరక్కసుదు
క్షితిపై బడుటయు యంతకు ముందుగ § గతజీవుడు శకటుం డగుటయు

క్రూరరూపురాక్షసు డీలఁ బడుటయు § నాపగిదిని బకు డఘుడు గూలుటయు
పాపలు పసులుఁ జీదయ బ్రతుకుట § గోపకులందరు నిను మ్రొక్కుట గని
పాపవిధియు నోర్వంగ నోపదొకో § నీ పదసేవల మేము ధన్యులము
నీ పరిరక్షణ మోస మందితిమి § యేపు గానుట గని కీడెంచె నోకో
జగదీశుడ వసి నీ లీలల గని § పగ బూనిన నిను వగ నొందుదు రని
వగలు మాని మేమెల్ల శ్రీహరిని § దిగులు దొలప దినసేవ దనరుదుమె
యా దయాపరుడు తోడ్పడి నిన్నుఁ § యాదరించి మోదంబు గూర్పడే
యనుచు గోపికలు యారాటములను § వనరుచుండ గోపకులును నటులే
పనివి పనివి యలసియునుఁ జోలుచు § మనములు పరవశ మగునటుండ యా
నంద యశోదా రోహిణు లందరు § తందర నొందుచు బృందావనమున
చందము జెడగా జేతువె సజ్జన § బృందాశీస్సుల ఫల మంద వేల !
విషకుచ యగు రక్కసిని గూల్చియును § విషవిజయము నందితి పలనాటఁ
విషరుహాక్ష ! శ్రీకృష్ణా ! యద్భుత § విషయుడవే ఈ విషమున జిక్కితి
క్రూరుల కొందరి గెడపితి విరనుఁ § దూరపఱచు నీ లోకమునందున
క్రూరదూషితుడు నీనందను డని § ధీరత వినంగ గనియు నింతలో
కంటిమె నిన్నిట కాకోదరమున § గొంటుదనను గరవంగఁ జుట్టగను
బంటుదనంబును నీవు జూపమియు § కంటకమువలెను హృదయతాపమును
గంటిమె తండ్రీ ! మా జీవముఁలఁ § వెంట గొనక పోదగునే నీకుఁ
జంట గొనని యపరాధమేమి మము § గంటివన్న మాకంట నీ రిడితే
అకటా ! భుజగము మమ్ముఁ గరవకను § వికటమతిని నిను గరచె నెందులకొ
సుకరంబుగ నీ వఘాసురుండను § సకుటిలాత్ము శమయించిన శౌర్యము
నే డీ దుష్టభుజంగ పుంగవుని § వాడి జెఱుపఁగను యత్నమొనర్పని
వాడ వెందుకో ! కొడుక ! గుణోత్తమ ! § తోడున రాముడు లేక యుక్కైతివా!
తోడు నీ కగును ! రాము నిదె పిలువు § నేకు నగుచు నున్నాఁ డదెందుకో
పాము గఱచునెడ పలవించితివో § భీమరూపు గని భీతి నందితివో !
మము బిలిచితివో ! లేక తిట్టితివో § కమలాసనునిఁ నెటుల గుందితివో
నీవు భద్రమును బొందియుంటివా ! § త్రోవ జూతువా మా యాపదలను
బ్రోవలేమె మే ముండియు నిన్నుఁ § భావి మేము బ్రదుకుటయు నిష్ఫలమె
అందెలు పదములయందు మ్రోయగా § చిందులు ద్రొక్కుచు నీ వాడుచుండ
మంద నెల్ల రానందింతురె పి § రందఱి నేడ్పించుట హితవె తండ్రి !
గోపకాంతలను గలిసి నవ్వుదువె ! § యా పూబోడులె యంద రిటువచ్చి

నీ పరంబులగు లీలల దలచియు ఽ రాపుకంఠముల నిను జీరుచు వా
పోవుచుండ మాటాడకుండుటయు ఽ పావన చరితా! నీకు ధర్మమా!
అమ్మా! ఆకలిగొంటి నన్నమిడ ఽ రమ్మా యని నను బిల్తు రెవ రింక
అమ్మా! నోరును గనుమ! మన్నుదిన ఽ నమ్మ యనియు నీవదనమున సకల
మును జూపింపగ నేరితరంబగు ఽ నను నెత్తికొనుము అనుచు దనువుపై
పను లున్నను మరపించి బ్రాకియును ఽ జనువు గొల్పు ముద్దిడువార లెవరు
వీనుల సొంపుగ మాటాడ నెవరు ఽ లేవిసవ్వ దెప్పింప నేరికగు
మానసంబు సుకృతంపు కల్మినిక్ ఽ ఊనమొందె యింకేల మా యునికి
మాకు దిక్కు గాబోడు దైవము ఽ నీకే పాడిక్ దప్పె గావలయు
మా కిట కాగలపను లేవి లేవు ఽ మా కనులను నిను గాంచగ వత్తుము
అనుచు యమునలో దిగ నిశ్చయించు ఽ కొనగ జూచి సంకర్షణుండు నగి
ఘనుని మహిమ నిక తృటిలో ఽ గందురు వసరు విడు డింక వరలు మోదములు
పాముపైన బవళించు మేటికి ఽ పాములవలని భయముండునె నరయుడు
బాములన్ని బాపెడు శ్రీహరి యిట ఽ బూమె కొంత గొనె మీమది గనుటకు
అనుచు బల్కు సమయమున నా కృష్ణుడు ఽ తనువు బెంచె నా త్రివిక్రముని వలె
మనమున తలకును గనియె భుజగపతి ఽ తనపట్టులన్ని సడలె హరివలన
తాను గరచుటలు చాలించియునుక్ ఽ మేనున శక్తియు క్షీణింప దొలగి
గాననయె నిట్టూర్పులు బుచ్చుచు ఽ మానసంబు చలియింపగ ద్రిమ్మరి
మోముల నాసల విషము గ్రక్కుచును ఽ భూమి నభమ్మును దిక్కులు దోచక
భీమము జెడ శాంతుని వడుపునను ఽ నా మహాత్మునెడ మునుగొని నిలచెను
ధూమ కాష్ఠమును బోలి యత డుండ ఽ గుములుకొన్న కోపాగ్ని రవుల్కొని
వెలికి భయదముగ వెలుగు దోపగా ఽ ఖలుడగు భుజగుని గదిసి చే జరచి
నోలి ఖగేంద్రుని వలె లీల బట్టి ఽ జాలి మాని చిరచిరల తోకనుక్
సరసర ద్రిప్పుచు దుర్విషానలము ఽ కురియు గనులు పడగల ముఖములు
నురువు జెడగ నత్యంత క్రోధమున ఽ అరుదు బుట్ట సురజాతులు మెచ్చగ
బాజె జలముపై యాతని తనువును ఽ యూదినిలిపె దన పదములు పడగల
మీద నెదురు సూపంగ హీనుడయె ఽ గాద దుష్టత్వ మంతటిదె
చెడుగు గనరె యెవ్వారలు పరులకు ఽ చెడుగు దలంతురొ కడ కిటు లగుదురు
ఝుడియబోదు యచ్యుతుడు కృష్ణుండు ఽ గడు వేడ్కల నా పడగల నృత్యము
సేయ దలచి యా నది తరంగములు ఽ మేయ ధ్వనులన్ మృదంగనాదము
నా యనువుకు దగు తాళశబ్దములు ఽ రాయంచల నాదములు పల్కులును

కమనీయ శబ్దములుగాగ పాట § భ్రమరనాదమే పెంపారుచుండ
సుమనసు లాదిగ దివినుండి జూచు § విమలసమూహమె గూడిన సభ్యులు
రతనకాంతి విలసిల్లు ఫణితలలె § యతులితంపు రంగస్థలము గాగ
సతత విలసితుడు సత్యరూపగుడు § పతితపావనుడు శ్రీ పరమాత్ముడు
సకలభువనముల నాడించువాడు § అకుటిల మతులకు ప్రేమ గనువాడు
ప్రకటిత యశుడును వికటదూరగుడు § యకలంకుడు సర్వజ్ఞుడు సత్యుడు
నళినలోచనుడు తాను నటుండై § విలసనమ్ముగా నాడె తన్ను గని
నలికాక్షుండును నలినగర్భుడును § జలదవర్ణు గని జేజే లిడగా
కలకలనవ్వుల సురలు విరులవా § నలు మీద మీద గురిసిరి మెచ్చుచు
హింస నొంది కన్నుల విషము గ్రక్క § మాంసరక్తముల ముఖముల నుమియుచు
హంసు డిట్లు జేయంగ బెండు బడి § హంసవాహనుని వ్రాత నొసలిపై
నుండ నాకు నిటులైతి నా తలల § నుండి యాడు నత డాభీర కుమా
రుండునైన న న్నోడించుటెట్లు § దండియైన నా ఖండలుడైనన్
దండన్ జేరగ భీతిని గొందురె § కండక్రొవ్వు గరగించె నీతడున్
నిండుమతిని బరికింపగ నా సిరి § యంద బరుండడి వాడని దోచెను

-: కాళీయుని భార్యలైన నాగకాంతలు శ్రీకృష్ణుని నుతించుట :-

యా భీలము నా విషాగ్ని ప్రాణికి § యీ భారంబున నను రొప్పువాడు
యీ భీతి నాకు దోపెడి వాడగు § ఆ భవానిపతి హితుడు నిక్కముగ
నీతడు సర్వచరాచరంబునకు § నేత యగుట నా బోటివారలను
పాతకమతులను పరహింసపరుల § జాతము మలుపుటకై బుట్టెనేమొ
నీచసంఘముల నిర్జింపు దండి § వాచకము పెంపు వర్ణింప నైన
నోచునేమొ నా తనుబాధ పెంపు § దోచదయ్యె స్థిరమతి యిప్పట్టున
వాసుదేవ! సర్వామయరహితా! § యీసు కొంత తగ్గింపు మ్రొక్కెదను
జేసెద నుతినిన్ వాసవవినుతా! § నీ సమాను లెవరుం గారు దేవ!
నీ సరి నీవే పరమపురుష! సహా § వాసపడితి నే దుష్టగుణములను
గాసి మానెదుగ నీ దయజూచితే § దోసకారి కిటు జెల్లునంచు నా
యాసము పైకొన మైమరచియుండె § యో సుగుణమణీ! యవల వినుము హరి
జేరవచ్చి రాతని కాంతలెల్ల § దూరమయ్యెడినొ మన సౌభాగ్యము
వారిజాక్షుడే నలయించె పతిని § క్రూరగుణుడు నని యది తన ధర్మము
నారుల పతిహితపరుల బ్రోచుటయు § నారద నుతునకు సారధర్మ మగు

నారులార మన మందరమును నా క ధీరు దయాపరు నిగమవంద్యు హరి
జేరి మ్రొక్కి మన జీవితేశ్వరుని క గారింపకు మని కోరదగును విను
మేర యాను యిది చారునేత్రలకు క సారధర్మమే యగు పతిసేవయు
యని పతిపై గల నెయ్యము పెంపున క మనముల గలిగిన వేగముల నెలవు
లను విడిచియు కచముల ముడులు సడల క గను కౌను దీగ కంపము నందగ
రంగజేయు కుచభారముతో పై క కొంగులు నేలం జీరాడుచుండ
అంగములందలి సొమ్ములు విడిబడ క అంగలార్చుచును నర్తేర్చుచున్న
బాలబాలికల ముందుం బెట్టుకొని క సోలుచు మ్రొక్కుచు లీలగ్రిలు గో
పాలసుందరుని శాత్రవశూరుని క బాలుని వలె క్రీడించు పరాత్పరు
గనియు భక్తిచే నాగిల మ్రొక్కియు క వినయమొప్ప చేతులు జోడించియు
వనరుహాలోచన ! వైకుంఠాధిప ! క మునిమానస నిలయా ! సురావనా !
ధనద సఖుని సతి పతింను మంత్రియు క ననుసరింపుగల రూపములు పెక్కు
లనయము దుష్టుల జెనుపగం దాల్తువు క వనజభవునకే గాదు నిను నిజము
దెలిసి నుతింపగ దేవ ! జగత్పతి ! క త్రిజగనావన ! దివ్యవందితా !
జలధిసుతాపరిపాల ! యశోనిధి ! క ఖలజనదూరా ! బాల ! గోపాల !
క్రూరమారకుడ వీ వౌటను నీ క క్రూరచరితునిం దండించుట సరి
ధారుణిలో నీ విట్టి వారినిక్ క బీరమడంచుట నీకు ధర్మమా
ధరణికి భార మధర్మము ప్రబ్బుట క ధరణికి లఘువగు నది దొబ్బు బడుట
సురవరవందిత ! నీ వాధర్మవు క పరిరక్షణలో శత్రుమిత్రతను
బరగినవారిని ఖేద మొనర్పవు క పరుని సుతుని బోషింతు ధర్మమున
నరహరివి యయ్యు బాలు బోచితివి క వరసుతుండైన దారి దప్పనెడ
హారరూపుడవయి యార్తువు మదమును క కరుణాకర ! నీ నడవడి యిదియా
జగ దవనమె నీమతంబగు నచ్యుత ! క ఖగవిహార ! కామారి ప్రియా ! హరి !
దిగులు తొలంగ మాపతి మీశిక్షను క బెగడు గాక క్రూరంపు నడనడక
నిగ్రహమగు నా విషాస్య లగు మము క ఉగ్రమతుల శిక్షించుట ధర్మ ము
నుగ్రహంబుగా దలపంగ దగుగా క యుగ్రజన్మ పరిపాలన చరితా !
ఏరు గందురా తపాదికంబుల క పారముగా పూర్వంపు భవమ్ముల
చేరుబాటుగా నాచరించి యో క శ్రీ రమాధిపా ! నీచరణంబులు
శిరములపై నృత్యములు సేయుగా క బరగు మానమును గురిని గనె విభుని
యోగులకైనక్ బొందరావు అవి క భోగిశయన ! శ్రీకాంత ! బహుతరము
త్యాగసహితమతి నోచి బడయు నవి క యగు గద యా చరణములు మహనీయ !

వాని రజోవేశములు తనువునఁ ఽ పూనిక తము సోకగ నేమను గొన
ఆనందాబ్ధిని నోలి యూతగొని ఽ ఆనందనిధీ ! నీపదము గందు
ఆస సేయ రా యిందిరానంబును ఽ ఆస సేయ రంతకును నిక్కనవి
ఆసింతురు నీభక్తి పెంపురుఁ ఽ దోషదూరుడని నీయెడ మతి గని
సారహీనమని జేరుగా సం ఽ సార నడకలఁ ధీరులు గొందరు
దూరపరతు రవ్వారలపదమును ఽ జేర నేమమే గొనక మాపతియు
గాంచ జూచితిమి కాంచనాత్మహార! ఽ పొంచుకొన్న దుష్కర్మ పరువిడియె
నుంచు మయ్యా! దంటు యశోదనందన ! ఽ జించు పురాతన పాపసంఘముల
పరమపురుష! హరి ! సకలమునందున ఽ పురుషాంతర్యామిరూపతఁ హరి
సురుచిరంబుగా వెలయుదు నిక్కము ఽ గురుపోషక ! భూతాశ్రయ ! మాధవ !
భూతవాసుడవు ! భూరిగుణాకర ! ఽ భూతశబ్ద వాచ్యుండవు నీవే
ఆతతమా విజ్ఞాన పరిపూర్ణ ఽ చేతన పద ! సర్వాకార! నిర్గుణ !
బ్రహ్మానందా ! ప్రకృతి ప్రవర్తక ! ఽ బ్రహ్మాండ నిలయ! యాద్యంతరహిత !
బ్రహ్మమూల ! యో పరమ శుభదాత ! ఽ బ్రహ్మాది మూర్త్యాత్మ స్వరూపా !
పరమపదదాత ! భక్తసంప్రీత ! ఽ నిరత యుపాకృత సకల భువనపిత !
కరిరాజనత ! చక్రధరహస్త ! ఽ తురగ గ్రీవహార ! దుష్టభయంకర !
కాలచక్ర సంచాలిత రూపా ఽ కాలనాథ ! యో కల్యాణమూర్తి !
జనన స్థితి లయ కారణ చతురా ! ఽ దిననాథచంద్ర తారాది గ్రహగతుల
దనర జరుగు నా దివాదియుగంబుల ఽ యొనరు లన్నియును నీ యందె వెలయు
టను కాలావయసాక్షి వీవెగా ఽ ఘనమహనీయా ! నీవు నతి గొనుము
కనికరంబునఁ మము కనుల గనుము ఽ మనివి వినెదునందాక మ్రొక్కెలివె
మానుట నీతియు గాదె సతులకును ఽ దానఫలము లేదందురు పెద్దలు
మానినులకుఁ బతితోడి గతి గలుగ ఽ బూనవలయునని గాదె శాస్త్రములు
నీ నుడువులుగా బలుకును దేవా ! ఽ మా నుతి నందుము మర్యాద యగును
లేని యెడల ధర్మంబు జెడుగదే ఽ చేనును గంచెయె మేసినట్లగును
దీనదయాళో ! దేవ ! భవత్పద ఽ ధ్యానచరితు లశుభంబుల గందురే?
విశ్వ మీవ వై విశ్వము జూచుచు ఽ విశ్వము జేయుచు విశ్వహేతువయి
శాశ్వతుండవయి యిరువది నాల్గిట ఽ శశ్వత్ప్రకాశతన్ దాల్తువుగా
అట్టి యాత్మవయి గుణముల నావృత ఽ పట్టున నభిమానంబున జిక్కక
ఇట్టని జెప్పగరాని వాడవై ఽ గుట్టు గనఁ సూక్ష్ముండ వీవు నయి
వికార శూన్యత కూటస్థు డనఁ ఽ ప్రకాశతను గలిగియు గలదు లేదు

ప్రకారమిది యది యను నిర్ణయింపునక ఽ వకాశ మెచటన్ వచింపరాదుగ
కొంచెము గొప్పని యెంచ దగదుగా ఽ నంచితంబె యుగు యొకం డనేకుడు
వంచనచే బద్ధుండు విముక్తుడు ఽ నం చను యెల్లవి మాయవలను నని
నిరోధపరతురు మాయ నరసియును ఽ విరోధవర్గము దరి నుండనీరు
సరాగమున నీ సర్వము జూడరు ఽ విరాగమే నిందింత్రు మనమ్మున
రూప నామములు పెక్కు లగుటచే ఽ కోపు గందువుగ కాంతులు పెక్కులు
ఆ పగిదినె చక్షురాదులకునన్ ఽ దాపు లేకను ప్రమాణదర్శన
దనరి నిరపేక్ష జ్ఞానపు కలిమిని ఽ గని వాని దమయు నహరహమున నే
ర్పున శాస్త్రయోని వయ్యు మూర్తిత్వ ఽ మున సంకర్షణ వాసుదేవులును
ప్రద్యుమ్నుడు అనిరుద్ధుడు నాబడు ఽ ప్రద్యోతనంపు నాల్గురూపముల
ఉద్యోగత్వత నంది మహాత్మా! ఽ సద్యోజాతుడ వీవ రమ్యముగా
అంతఃకరణ ప్రకాశత్వమతిన్ ఽ సంతతంబు సజ్జనుల ఫలంబును
సంతు నొంద జేయంగ వెలసియును ఽ వంతుగొంటివో గుణముల గప్పుచు
చిత్తవర్తనన్ గుణముల సాక్షివి ఽ మత్తుగొన్న నల్లెరుంగరాదుగ
ఉత్తదిగా దది సత్యరూప! యా ఽ యెత్తు గందు రది సుజనులు శ్రీశా!
సకలకార్య కారణ విహార హరి ఽ సకలేంద్రియాధిపత్యము నీకే
సకల సుకర్మల నీ కర్పించియు ఽ అకుటిలులై నిను మాయాదూరుని
గాగ దలచి విద్యావిద్యలవొ ఽ ప్రోగులిట్లు గనిపించిన వారికి
దొగు బంధములు సాధనల వశము ఽ యోగిజనాశ్రయ గాదగు దెలియగ
మోదమందుదురు ఆత్మారాముడ ఽ వాది వీవ యని మాను లెరుగుదురు
అన్ని నెఱుంగుచు నంతట వెలసియు ఽ అన్నియు దెలియక నంతటను లేక
యున్న నిన్ను నుతియింప నేరికగు ఽ సన్నుతాంగ! సంసారము నందున
నెన్న నపారము నిను జంతించుట ఽ వెన్నుడ విధిలిన్ గన్న భువననుత!
సన్నుతింప మా తరమ ? జగన్మయ! ఽ చిన్నబుచ్చకుము మము నీ యధీన
మిన్నియు ననియున్ తెలసినట్లుగా ఽ విన్నవించితిమి యీశా! నీవే
మన్నింపవలయు మిన్నసంకటము ఽ లన్ని గడద్రొబ్బు పన్నగ నారుల
మన్న! వాక్యములు చిన్నవియైనను ఽ నిన్ను గూర్చి నవి యెన్నిన ఘనములె
మూఢజాతులము శాంతశూన్యులము ఽ గాఢ మదము మా తలన నుండుగా
రూఢమగును దిననాథ శశినయన ఽ గూఢుడ వగు నిను గొలుతు మెటుల దయ
తోడ మాపతిని బాధ బెట్టకుమె ఽ నేడు మొదలు నీ సేవకుల గూడు
జూడు మింక వ్రాబోడులపై మా ఽ గోడుబాపు కృప పాడిగాద యిది

చపలతమతి గల కుమతుల సుతులఁ § నెపము బెట్టి యువలీల తలిదండ్రి
యెపుడే తలఁగఁ ద్రోతు రెట్టులో § విపుల జ్ఞాననిలయా ! యశోద
తనయా ! యిక యాలసింతువా ! యా § యసిలాలయమును వెనుక బరచుమా
పెనిమిటి కగు యాయాస మికనొక్క § కనుగీటున దొలగింపవేసి మా
తనువులు నటులే గనెదవు నూ హరి ! § మనివి వినుము యింకొక్కటి వచింప
మనమున దోచెను మాధవ ! యదియే § దన మా పసిదనమున నైన పెండ్లి
యనువుగాదు నీ విపుడు మాకు విభు § ఘనతగూర్చి జేయగనైన పెండ్లి
నిజమగు మంగళసూత్రము నీ దయ § భజనపెంపు మము నుంచిన శోభన
మజ హరాది సంస్తూయమాన ! హరి ! § విజయ విషహరా ! విషచరరూపా !
తలలు వ్రస్సె పోకలను రాకలను § వెలికి లోనికిని దిరుగు మారుతము
బాలు డనుచు బహు మంచివా డనుచు § జోలిబెట్టమా శ్రీ లలనేశా !
బాలింపుము మము నీలవర్ణ ! మీ § రాలుఁ మగలుఁ కన్నబిడ్డలము
చాలు దప్పి వైధవ్యమున గుదుర § జాలి విడిచి చూడంగ నోపి తిక
వేల లేదు యీ దుఃఖాబ్ధికి నో § నీలవర్ణ నీ తలపు మా వలపు
మేలు జూచితివ ! పతి నింక మేము § నోలగన్న కూరింపు నడకలను
చాలుదప్పగా జేసుకొందు మిక § శూలిసఖా ! మా కేలుమోడ్పు లివె
బాలగోపాల ! పరిపంథిజాల ! § కీలముల వారిధార నీగుణము
అని యిటు తను నుతి సలిపెడి కాంతల § ఘనదయాపరుడు వనమాలి క్రీడ
దనరువాడు మది నిలిపి యువల నిలి § చిన నెట్టకేలకును స్మృతి గనియును
శిరము లన్నియును సవరించు కొనియు § మనములోన శ్రీకృష్ణుని విష్ణుని
పరము నిష్కాము బంధురయశునిఁ § సరసముగానే చేరి నుతింతు న
కరము భక్తి నని యంజలి ఘటించి § శిరములన్ని వంచియు నిటు నుతించె
గరళకంఠ ! వినుతాంఘ్రిద్వయ ! శ్రీ § గురుదేవా ! శ్రీకృష్ణ ! నందసుత !
సురపరిపాలా ! చరాచరాత్మక ! § శరణు శరణు సర్వేశ ! యఘహారా !
విరించి వందిత ! విహంగవాహన ! § విరామదుర్జన ! విశ్వశుభద ! యో
కరీంద్రవరదా ! కమలాక్షా ! యోం § కారరూప ! కరుణాకర ! సుకరా !
గతియు వంకరే మతియు వంకయే § వితరణ యున్నను వెతుకగ గానను
పతితుడనై విపరీతభావనత § యతిపోషక ! నిను స్తుతింప నెఱుగను
కోపము మదమును ఆపుగ గొనియును § నీ పదధ్యాన రతులను జెనకితి
తాపా పరమేశా ! నిన్ను గఱచితిని § నాపాపము నీవగిది బరిగించె
నదియు సమయమగు కటాక్షముంచిన § యదనున గుదిరితి నఖిలభీతహర !

హృదయతలమ్మున నీవు నిల్చుటచె ƒ జెదరె పూర్వకిల్బిషము బుధనిధీ!
పుట్టుకలోనే బాడమె బుద్ధి నిటు ƒ కట్టడితనమును యొడి గట్టుకొంటి
కెట్టితపము పెంపో యిపు డీ ƒ బెట్టు దప్పి మా కనుల నిను జూచు
కలిమి మాకు నీ కృప దావలించె ƒ జలరుహనయనా! యో చక్రిపాణి!
వివిధములగు భావాకారలీల ƒ లవి పేర్వ్యాజో యోని బీజాంశ
మవశత జరయోని యుతముగా యీ ƒ భువనము లన్నియు నీవ జేసితివి
గుణముల కలతన్ తనువులు పెక్కగు ƒ గుణమణీ! యవియు నీ మాయయందు
గుణములు వెలియగ మేము వానిలో ƒ నణువుల వలెనే వృద్ధి నందితిమి
సహజగుణముచే క్రూరము గందుము ƒ అహంకరింతుము అడప నీ మతము
అహ మంతయు నన్వదలె నీ దయయె ƒ యహహా! యన మతివెలయు మీదటను
నిను దెలియరాదు నీ మాయ దాటి ƒ చనరాదుగ సకలజ్ఞ! సర్వేశ!
మనుపదలచి తేనియు మన్నింపుము ƒ యునికి యెచట జూపెదో నీకె యెసక
సనకాదిమునుల పదము నాకబ్బె ƒ మునిపరిపాలా! బాలగోపాలా!
యనఘుల మదిలో దిరుగు గుణశీల! ƒ దినకరుదీప్తిని తమ మడంగు క్రియ
జెడియెను నా పాప మను అంధతయు ƒ ఘడియక్రింద గల వెత యదృశ్యమయె
చెడుగు దలప నిక నీ యడుగులాన ƒ విడిదిని జూపుము యెందు నుందునో
పడతుల బాలుర గమనించు దేవ! ƒ జడతలేని మతి వడయ వర మొసగు
జడధివాస! శ్రీనాథా! నా దగు ƒ నుడువు లివియె యని యడుగులపై బడ
ప్రీతి బొంది యా చతురు డిట్లనియె ƒ యీ తలంబు గోపాలురు గోవులు
ఆతతంబుగా దిరుగాడ వలయు ƒ చేత మింపుగొను వారికి నిమ్మగు
నీవు నీవారు ఇం దుండవలదు ƒ కేవల సుఖజీవనము సముద్రము
తావు నొందుమా భయరహితుడవై ƒ పావనంపు మతి మము దలపు మందు
నా పదలాంఛనములు నీ శిరముల ƒ జూపు వంది నిను గరుడుడు బట్టడు
నా పరంబువా డగుట భీతి విడు ƒ నీ పడతుల నుతి నాకు మెచ్చునయి
గాపాడె నిన్ను నాపలుకు వినుము ƒ పాపాళి మాప నా పుణ్యసతులు
ప్రాపయ్యె విభుని బ్రతికించుకొంద్రు ƒ యీ పుణ్యసతులు నీ సేవ నుంద్రు
నా పదంబు తుది మీ కబ్బనుంద్రు ƒ నీ పవిత్రతను గాపాడుకొంద్రు
అని శ్రీకృష్ణుడు నెనఱున నాడిన ƒ వినిరి యాజ్ఞ శిరసావహించియును
వననిధిని జొరగ నెంచి మోదమున ƒ వనజనాభునకు మ్రొక్కి కాన్కలుగ
కడు మెరసెడు రత్నాధికములన్ ƒ కడు వేడుక గన గూర్చిన సొమ్ముల
వడుపులేని కనకంబుమయముగా ƒ పడతులు తళియుల గొని వడి రా నా

భుజగేంద్రుడు హరి నలంకరించియు ఽ నిజభక్తిని నర్చించి కాన్క యిడి
నిజపరివారముతో సహాకరముల ఽ భజనక్కైన చప్పుళ్ళు దివి ముట్ట
జై రమాపతే! జయ సుందరాంగ! ఽ జై రజితగిరీశునిమిత్ర! వరద!
జై రత్నాకరశయన! మునివంద్య! ఽ జై రమణీయ వికుంఠవిహారా!
యనుచు ప్రదక్షిణ వందన మొనర్చి ఽ వనజాక్షుడు సెలవీయ నటు గదలి
గని రా రత్నాకరము ద్వీపమును ఽ కనినమాత్ర సుఖ మమర వసించెను

## —: కాళీయుని పూర్వకథ :—

కాళీయు డన శుకు నడిగె నృపవరుడు ఽ కాళీయు డచ్చట వసించె నెందుకు?
మేళుల నెలవులు నంబుధియందు న ఽ గాళ విహారమునకు నిమ్మగు నే?
ఏల యుండె నా పిన నెలవునందు ఽ చాలుకొన్న కారణము నే వినగ
నోలిగ వివరింపుము మహాత్మ! యన ఽ నీలవర్ణు శ్రీదేవు దలంచుచు
నృపతిలక! వినుము చెప్పెద నా చరిత ఽ కృపణపు భావము నీకు దూరమగు
విపుల సత్వఖని విహగేంద్రుండును ఽ రిపుత పెద్దదిగ నా కాళీయుని
జూచుచుండు నల్లెందు కంటివా ఽ ద్రోచువాడె నాకైన మేర యీ
నీచుడు ఫలమును దా ననుభవించు ఽ నేచువాఁడ నా కిడుభోజనమ్ము
దానె నమలెగా కని కనలు నొంది ఽ ఘనుఁడు గరుఁడు డాతని దన్న వచ్చె
కినుక వేగమును సహింపకను పవ ఽ నుని వసువును గన దాను దాల్చియును
అరెరే క్రూరా! భుజగాధముడా! ఽ మీరు భూజనుల రాయిడి బెడుదురు
వారు మీ దాడి శాంతమగుటకై ఽ ఆరాధన రూపమున మేలుకై
సారాన్నంబుల భక్ష్యంబు లాది ఽ నారగింపుగా నెల నెల నిడినవి
మీరు మీ కులజు లందరు నాకిడ ఽ ధీరత మీపై నే జూపకుండ
తరువుల క్రిందను జను లట్టిడినవి ఽ సరసత మీ మీ భాగములు నాకు
దిననిచ్చుట నే ప్రీతి మిము జంప ఽ కునికిగ న్యాయము గంటి మవి ద్రోసి
తినుట నీ కగునె నాకీయకుండ ఽ గని విని సహింతు నెటు నా యాకన
తనువును నలియగ డీకొందు మదము ఽ జినుగగ బారులు గనుగొందు నెందు
మనెదవో నీచా! రమ్మను నంతనె ఽ విని విషాగ్ని రోచులు దిశల బర్వ
పెను కోపమునను ఫణములు నిగిడ్చి ఽ జనభయదముగా కీలిజ్వాలలను
జోలి నాలుకలు గ్రోల గరుడునిని ఽ వ్రాలి తన్ను డాయంగను వదనున
కాళి పెంపునను బిరబిర గఱచిన ఽ మేలుమేలు రాజిలగ నీ నేల
జాల దూరమగు నీకని తన్నిన ఽ నేల గలిసె దన వదనముల రదము

ను విషము గ్రక్కి శిరములు పడియలు ॥ గను బారెను గరుడుండు వెన్నంట
న నీమడువును కాళిందియందు ॥ వనజ నయన తురగుండు రా డిటకు
ొనరున సుఖమున నునికి నందెదను ॥ ననుచు నాడాదిగా నుండె నిందు
దియు వినుము గరుడు డిందు జేరని ॥ యదను గలిగె పూర్వమున సౌభరియు
దయాన్విత చిత్తమున నీహ్రదము ॥ గడిసి తపము జేయుచుండ నాముని
ంద మీనులుం మెలగ మోదమున ॥ నుండ నొకప్పుడు ఖగేంద్రు డచ్చట
ందు నాకటం జేరి మీలను ॥ గంటువి గానివి నేర్పరింపకను
ండిగ దినుచును తనముదము దోప ॥ మెందుకోపమున యాముని ప్రచండు
ండ దగదు యో విహంగ వల్లభ! ॥ దుండగీడ వై మరల సిచ్చటికి
రిలేనియును గీటును గాంతువు ॥ కూ్రరదనము బో దారిబట్టు మన
రత జూపగ బెదరినా డాది ॥ దారడందు నాకథ యిత డెఱుంగు
రు సర్పముల కా కథ తెలియదు ॥ నారదమునిచే నొకట విని నతడు
గారిజాక్షు డిటు వెలయు నీ చరిత ॥ సారను నుతింప విష విజయులయ్యు
గ్రిరసర్పముల బారిబడ రని యు ॥ దారదయను వచియించి మరియు నీ
గారి మునిగి యుపవాసవిధి సలిపి ॥ తోరమైనట్టి భక్తి చేత నను
లచి దేవతల మొక్కి పితృదేవ ॥ తలకు బ్రీతిగా జలతర్పణంబు
లిపిన నమయును వారిపాపములు ॥ మేలు లిహమునను పరమున నా దరి
లుగు ననుచు నా కాళియుండు విన ॥ బలికి యుండె నాతడు బోకమున్న
లకించెను హరి తనవారి గోప ॥ కుల పెద్ద చిన్న లందర నారుల
లను ముందటి శోకధారలే ॥ చాలు రూపటియె మోదధారలుగ
నులవెడల వలువలును దడియగా ॥ దనరాక గోరు నందాది సర్వ
నుల హృదయముల కుతుకాభివృద్ధి ॥ దనర గంధమాల్యాదుల భూషణ
రాజి మెరయుచును రాక నాటిద్విజ ॥ రాజుపగిది శోభాయమానమగు
గాంతిచేత తమ తాపమంతయును ॥ సంతరింప శ్రీకృష్ణుడు మమువును
డలి జేరి రాముండు కౌగిటను ॥ కడుప్రీతి దనగ నిడుకొన్న నవల
డివడి నందరు నటులట దను జూడ ॥ వేడుకలను వా రందఱ నలరిచె
ంకె పెట్టి చెలువొందె వృషభముల ॥ హుంకారముతో లేగలు బరుగిడె
గొంకమందె గోవులును తరువులును ॥ నంకురించె నా హరి రాగ నచట
గారిజనము యశోద రోహిణుల ॥ జేరి యో యమ్మలారా! శ్రీహరి
ఈ రూపున మీ సుకృతఫలమ్మున ॥ జేరె మిమ్ము మీ నందను డనగను
నుచు నుండగనె భూసురులు సందు ॥ గొనివచ్చి జాలి హరిని తాము గని

ఘనుడ వచ్చెదవు వనమాలి ! వరద ! ఽ యనఘా ! కృష్ణా ! యని దీవించిరి
యశోదతనయుని గౌగలించుకొని ఽ యశోనిధీ ! నాబాల ! నాతండ్రి !
దిశాంతముల నీ కీర్తి నింపితివి ఽ పిశాచ పన్నగ భీతి హరణు డని
నిను గాని యాడగ బరగితి వన్నా ! ఽ ఘనమగు పన్నగ బాధను నడపిన
ఘను నిను కనులను గంటి నెమ్మదిని ఽ మును జేసిన నా సుకృతఫలమ్మన
నని నందరు సంతోషయుతులై నా ఽ వనజనాభు వర్ణించుచు బల్లెకు
జనక నచ్చటనె నివసించియుండ ఽ నినుడు చరమాద్రి జేరె నిశి బర్వె
నాకలి దప్పులు గలిగియు దలపరు ఽ ఆ కమనీయాకారు మాధవుని
పోక లన్నియును వినుచుం జెప్పుచును ఽ సోకిరి నిద్రను గోపకజనములు
లోకపావనుడు శ్రీకృష్ణమూర్తి ఽ వ్యాకులంబు నడగించె వారలకు
వనమున నొకయెడ పొడమె దవవహ్ని ఽ జనముల మీదికిం గ్రమ్మ జుట్టుకొనె
గనిన నిద్ర జాలించి కలవరము ఽ గని బెగడుచు నా దవానలమ్మును
గనిన యంతలో కీలల వేడిమి ఽ తనువులు సోకిన తాళలేక నా
వనజ దళాక్షుని కృష్ణుని మరియుం ఽ యనఘుని ఘను బలరాముని జీరుచు
వనవహ్ని మమ్ము మనికి జెరుపుటకు ఽ వినువీధి నెక్కె ఘనభీకరమ్మ
నగుబాటుం జెల్ల పగ గొన్నరిపుని ఽ పగిదిన పరువున యుగాంత తరుణము

-: గో గోప గోపికా సంఘమును గార్చిచ్చు చుట్టుకొనుట :-

నను వెలుగొందెడు విలయానలువలె ఽ మనము తొట్రుపడం జుట్టె నింకేటులో
దప్పుకొందు మీ యాపద నిపుడుం ఽ గుప్పున నార్పగ నొప్పు మీశక్తి
యప్పలార ! యని యఘసంహార శ్రీ ఽ మెప్పుకాడ వని చెప్పుదురు బుధులు
శ్రీహరి! గోవిందా ! జనార్దనా ! ఽ శ్రీకృష్ణా ! నీవారి బ్రోవుమా !
శ్రీహరాది వందిత చరితుడ ! ఽ యహాహా ! యని నిను నద్భుత చర్యను
గని బాగడి మ్రొక్క నానందింతువు ఽ మునిమానస ! పంకజపీఠా ! నం
దుని కుమార ! జగదేక శరణ్యా ! ఽ దినరాజతేజ ! దివ్యవినుతపద !
యనిన క్షణంతలోన యుదియు గదియ రా ఽ గని దాని వదనమును దెఱచి ద్రావె
హరివిజయము దశదిశలు నిండగా ఽ సురలు విరుల సోనలు గురియగ
హరి యుదయగిరికి వచ్చులోపలనె ఽ తరలి రచ్చట సదనములం జేర
ఆనందమునను తెలిసిరి మందలో ఽ యా నందసుతుడు పరమానందుడు
చేనంటు ముక్తి యితని నుతించిన ఽ వే యందుబాటు నగు విహారసుఖములు
పవళుల కాలము బ్రోసు తీవ వలె ఽ దినమణి యుత్తరదిక్కు పయనించె

సవిత తేజమును భరింప తాపము § భువి జీవతతికి పెంపు నొందగాఁ
గవయుబోయె భూరేణువులు మింట § పవమానుఁడు సహా వేడిగ గనపడు
ప్రబల పానీయశాల లచట టచట § ప్రభలు తరుగు వేండ్రమున కుసుమాది
లతలు కనగ దంపతులకు రతులఁ § ప్రీతి చాల వెలయుంగ గాంచవగు
శీతల తల జలముల నాసింపగ § నాతురత్వము జీవతతి నొందె
కేలి యడవులఁ గేళియు సల్పెను § నోలి గ్రీష్మఋతు విట్లు భీష్మమయె
మేలేమి దలచి బ్రహ్మ బ్రహ్మాండ § జాలములను నీ వేడిరస ముంచె
జగమంతయు నిట్లుండ యా వనము § జగదీశులు శ్రీకృష్ణుడు రాముడు
నగవుల గోప కుమారాయుతులై § పగతుర జయింప నట మెలగు చుండ
నమరినట్టి బృందావన తలమున § శమమును బొందెను వేడి యద్భుతము
విమలమైన యా వసంత కాలము § సమమే యబ్బెను సంతసము నిక్క
భయంకరంబగు నిదాఘ కాలము § ప్రియంబు నడలెను నిటుల మధుకాల
నయంబునఁ గాన్పించుచె గాకను § వ్యయంబు శోషము గాగ తరువులును
చివురుల మొగ్గల కుసుమఫలంబుల § సొంపు నింపు లతలను బెంపుఁ గనగ
చెవుల కింపుగా శుకపికముల రొద § నవపుష్పమకరందము నాన దిరుగు
భ్రమరనాదములు మయూరచయముల § కేకా రవంబులను కమనీయపు
విమల నదీహ్రద కల్లోల కంక § ణములఁ నిండిన పంకతలంబుల
కమల కల్హార నిలయంబగు నా § యమునానదివో తరంగముల చే
అమరిక గన్నవి యా సువాసనల § నమరిన యనిలము ముదమును గూర్పగ
నా వనమున హరి బలరాముండును § గోవుల గోపాలుర గూడి మేప
బోవు వేడ్కలును దీపింప వారు § కేవలమతి గొన వారలుల జేర
నందరు గలిసియు వడి మించ వెడలి § కొందరు కొందరు గుములుగ నేగుచు

## -: గ్రీష్మ ఋతు వర్ణనము :-

సందడి జేయుచు నగుచు నడచుచును § పొందిక వృక్షపు సందుల దాగుచు
అందు వారి బెదరింప నణచుచును § ముందుతటంబుల కురుకుచు వెన్కల
మందమయిన నడకల వచ్చువారి § నందరి గేకల గూడ బిల్చుచును
తిరుగుచు మలగుచు నెగురుచు వంగుచు § వరుసలు గొనియుఁ అపహాసించుచును
మరి మరి సరసము లంతలో విరసము § కరము ప్రీతి బింకంబు లంతటివి
గాగ నొక రొకరుఁ దన్నుచు గ్రుద్దుచు § దాగిలిమూతల నాడుచు గూడుచు
రాగములఁ గొని పాటలు బాడుచు § వేగముగఁ దరులెక్కియు ఫలముల

జల్లుల రాల్చియు దినుచు తేనియల | కొల్లలుగా ద్రావుచు పుష్పంబుల
నల్లుకొంచు దండలు వేసికొంచు | పిల్లనగ్రోవుల నూదుచు దూకుచు
పిల్ల జట్లు దూలంగ తలలూచి | పెల్లుగ పొదరిండ్లను దూరుచు వెడలుచు
యుల్లమందున్ ఉత్సాహపటిమ | చెల్ల గురుశిష్య భావన లొక్కొక
తేపల నృపసేవకులభాతిన్ | గ్రొవ్వులు గోపాలుర వలెను దామె
నొవ్వ వేమముల నొప్పుచు కృష్ణుని | భూపతి యంచును గొల్చుచు భుజముల
మోపు వహించుచు ప్రియద చిత్తులై | యా పరమేశుల రామ కేశవుల
దేవదేవులని తా రమకులవలె | భావమ్ముల దిరపరచి నుతింతురు
పావనాత్మ! యా తలపు నిజమొగద | నీవు వింటివా తెఱగు లన్నియును
ఇటుల వారు భాండీర వటము కడ | పటు రయమున జేరియును నాటలకు
దిటవుగొనగ యా యదనున వారల | తటమున జేరెను ప్రలంబుడను నా

—: బలభద్రుడు ప్రలంబాసురుని వధించుట :—

కుటిలుని కంసుని సఖుడు దనుజుడ | క్కటికదూరుడగు క్రూరుడు నయ్యెన్ ని
శాటులమేటి యన బరగువాడు | వాటమైన గోపాలక వేసము
తోటివారి నలయింప నా బలుల | దాటఁజేసి తప్పించి చంపగా
పాటిగొనియు నచుండ వెన్నుడా | చేటుదలచు దనుజాధము నెఱిగియు
ఆట నొకటి గల్పించి చెలిమిచే | పాటుదప్ప జేయుంతు నన్నచే
వాటముగా నత డితని జంపు నని | నాటకధారుని భంగి ధారుణిని
బూటకమతులను బొలియింప నున్న | నీటుకాడు హరి కృష్ణుడు దానున్
రాముడు పెన్నుద్దులగ జింకాట | నేమంబుగ నియమించి చెప్పియును
తాము నోటుపడ నితరుల వారిని | ఆ మేరను మోవన్ వలె భుజముల
నంచు నేర్పరచి యా యాటలోన | మించ జేసి బలభద్రుని జోడగు
ప్రలంబు డోడెను నంసభాగమున | బలుండు వానిని నధిరోహింపగ
దలంచి బిలువగ నా ఖలు డొప్పియు | చలంబు మనమున బూనియుండుటయు
కలంకు లేమిని కాన్పింపు గాక | నలంతు ము న్నితని యవల పరుల
నిల న్మిళితమున్ జేతు నాశక్తి | గలంత కంసుని కందు నామెప్పు
యనుచు మూపుపై నెక్కించుకొనియె | వనజదళాక్షుని యన్నను రాముని
ఘనాఘ తమహరు దినకరాభునిన్ | కానలోన కనుమేర దాటగనె
బలుడున్ గనియెను వాని వృత్తమును | ఖల విశేషమతి యైన వాడపుడె
తలకు లేక గంభీర నిజరూప | మలవడంగ శ్రీకృష్ణా ! కృష్ణా !

వీ డెవడో కను దుష్టనిశాటుడు § వాడి మిగుల నను గొంచు నెచ్చటికో
గోడు నా కిడగ తోడు బాపి నిను § వీడు తృణముగా జూచు పోక యిది
రమ్మా దనుజుని దుమ్మున గలుపగ § కొమ్ము నీకో అది నాకే యిత్తువో
ఇ మ్మానతి నానాథ శ్రీనాథ § నమ్మినాడ నాగతి యేమన్నరో
నేను బరువుగా నదిమిన బెరిగెను § కాని లెక్క గొనబోడు దుర్మదుడు
కనకరత్నమకుట కుండలధరుడు § జన భీకరుడు సుదగ్ర దంష్ట్రుడును
ఘన వికృతతనువు మనము కుటిలమా § నను జేసె నిటుల నీవ యోజింపు
మనిన విని హరియు నీవు నేను యను § టనెడు భేద మేలన్న నీతెఱగు
నీవు దెలియవా యా యనంతుండవు § గావే వేనవేలగు శిరములునుఁ
శ్రీవి నయనములు వానిరెట్టింపు § నవుగా జిహ్వలు నయనములవలెనె
తలల తలము గగనంబు చివర యగు § తలము నగును మూడవ లోకము భూ
తలము నడుముగా విశ్వమంతయును § నలవరింతువుగ నలపుము దనుజుని
నిల భారము కడ ద్రోయబుట్టితిమి § చులకనగా నీ నీచు హరింపుము
వీడు ప్రలంబుడు మదావలంబుడు § వీడు నీచేత జాగల డన్నా !
వీడు కంసుప్రేరణను నిట వచ్చె § జూడు విజ్ఞానదృష్టిని హలధర !
పిడికిటి పోటున పుడమిని బడండె § చెఱుపదలపు గలవాడే చెడు దే
వుడవగు నిను జెనకెడు వాడుండునె? § విడుమిం కిట వెత జడు పడుగంటఁ
బలవైరియు నిను మెచ్చు ఖలవైరి § తలను విరుల సోనలను గురియుదురో
బలారి యనుచరవర్గము రామా ! § ఇలాభరణములు నగు నీసేతలు
ననిన పిడికిలిని దృణత నలరించి § దనుజుని తలపై బడు పిడుగుబోలె
ఘనుడు బాది తా వడి లంఘించిన § నడుగులోనె వా డిల గూలె సురలు
వనజనాభు దన్నటుల జేసి రా § పెనుకౌతుకముల గోపకులు చెలగి
మునిజన వినుతు లనుచు మ్రొక్కిరి యో § వినయశీల విను ! చపలివృత్తమును
గోపకు లచ్చటి పచ్చికలపెంపు § ప్రాపుగ పసులం దోలుకొంచు వని
కేపున నడిభాగమునకును బోవ § నా పరిసరమున దవాగ్ని ప్రబలియు

## —. శ్రీకృష్ణుడు దావాగ్నిని మ్రింగి గో గోపక సంఘమును గాపాడుట :—

గోపకులఁ గోవులను ముట్టరాగ § బాపురె కృష్ణా ! భక్తార్తిహరణ !
భువనభరణ ! రణనిపుణ ! హరి ! శరణు § తవచరణయుగము తివిరి మతి గదియ
నవుదు ర ట్టిడులు భువిని పవిత్రులు § ప్రవిమల రోచిష్ణుడవు విష్ణుడవు
ద్రవము నీదు మము బొరలింపుము § దవుల వాపదలు తాపాగ్ను లారు

దవ్వులు నెట్లు ఈ దవాగ్ని వరదా ! | భవసంకటహార ! దీని హరింపుము
పవనుడు వోడుగ గట్టుచెట్టనక | నివ్వఱుచు యిదె కార్చిచ్చు గ్రమ్ముకొనె
యనవ మొనర్పగ నీవె నీవారి | దఖిలి రక్షసేయంగ నీచిత్త
మెటులొ యట్లు గావింపు మనగ హరి | తృటిలో మరల్తు కనులు మూయుడన
నటుల చేయగా మటుమాయముగా | గుటుక గొనెను దావాగ్ని మాధవుఁడు
చిటికలో శీతల వాయువులు తమ్మ | చటులత గాని సోక నయనముల
నటు దెరవగ శిఖి యదృశ్యతను గన | పటుభక్తిని శ్రీకృష్ణుని బాగడిరి
మును పటి తరువును సన్నిధి గనుగొని | వనజనయన ! నీవే దేవుడవో !
మనుజాకృతి మము గలిసి యుంటివో | వనజోద్భవాది వరనుతినిలయా !
యనుచుఁ దలంచుచు వారు ముదుకొనియు | ఘన ముదమ్మునను నడవ మందకును
జేరి వేణువు పూరించుచుఁ | వారిజాక్షుఁడా వీటప్రమదలను
ధీరతనము బో భ్రమింపు దనకై | కూడిన మనముల నెపుడు గందు మని
నిముసమె యుగములు గాగ దలంచుచు | గమనము నెదురుఁ జూచుట సఫలము
నమరు నటు జేర గోపకులందరు | యమునిమందిరము ప్రలంబు జేర్చుట
తము జుట్టిన గార్చిచ్చును మ్రింగుట | కమనీయముగా గాన మొనర్చిన
వినిరి వారు సురవరులు వీర లని | వినుతిచేసి రటు దినములు జరుగఁ.

## -: వర్షర్తు వర్ణనము :-

దిననాథు వేండ్రమది శమియింపగ | జనులెల్లరు సంతసము నిక్కఁగా
రొనరుసైన కాలంబు దరియయ్యె | వనదంబులు నభమందు గుమియయ్యె
ఇనబింబము పరివేషయుక్తమయె | అనిలంబులు తూర్పుదిక్కునవి యయె
జనపతి ! పడమర నింద్రచాపములు | దనరగ నుత్తర తటమున మెఱుపులు
ఇనసుతుని దిశను మేఘములు నడిచె | వనచరములకును వర్ధిలె కుతుకము
చాతకములకుఁ దప్పులు దీరెను | ప్రీతిహోత్రుడుఁ శాంతు డడవులను
అతలప్రీతిఁ బొందగ నిలకుఁ | చేతుల గొన్నవి యప్పులు వృద్ధిగ
గనుమని యర్కుఁడు నిచ్చె ననగ భూ | జనులందున మరి కర్షకులు నలర
వనితయైన భూదేవిని విటతఁ | దన నఖాంకముల చాలు లుంచెగా
ఘనతయు వర్షాకాలభుజంగున | కన నాగటి చాలులు నొప్ప నిలయు
చెలువుడయిన మూడవ ఋతుడను విభు | కలయిక బులకల గనెను భూకాంత
మొలక సస్యముల పొలవున వెలయగ | నిల జనావళికి నయ్యది కుతుకమె
నీలవర్ణ మేఘములు తెక్కలను | చాల బలము గన్పించు వేగముల

గాదు రిలవలె యవధి చాల గల ఽ చాల వేలనగు పథముల జరింప
ు గలిగియుం గుమిగ నేకతను ఽ గలిసి శశితరణి బింబముల దాపు
ను మెరసి చదలుం గప్పియు ఽ నిలతలమున జీకటుల బరపుచును
యునట్టి యా వారిదములచే ఽ పలుఖండములుగఁ బడెను వడగండ్లు
లు పెట్టి వన విను మిలాధిపతి ఽ జలదసమయ విటశేఖరుఁడు సరస
భూ లలనకు మేలిమిగా తా ఽ గడించి యిచ్చెడు కర్పూర తునుక
విరివిగ నర్పించుట దోచును ఽ జతగ వానితో గదియు జలధార
నిర్మలములు నయ్యు రంగులం ఽ మతికిఁదోచు నీలమణిమాలికల
మున మరియుం నల్లని పాముల ఽ విధముల తనువుల బోలి కన్పడఁగ
ఫితముగా మదధారల దొగెడు ఽ మదగజములవలె సలిలధారలును
పరు దోపుచుండెడి కొండలుఁనుం ఽ మదికి సొంపు జనియింప నందుపై
రము లందుండి ప్రవహించు ఽ నఖండఝరముల చెదరు తుంపురుల
ల భూమితల మచట నుండునది ఽ అఖండముంగా నావరించుటయు
తుకులను కువల చితుకుల తొంపులు ఽ పతము వెలయ వరదల చేరికలను
ంల నేడుపడు నేరులు వానిలో ఽ అతులసంఖ్య నెమరెక్క మీనములు
నసేత్రి తనువుల కాంతిని ఽ నూనలేమ మే మను మేల్మెఱుపులు
నముల మధ్యను వెలువడి గలియును ఽ గనిన తృణము గంపించియు దొలగును
మించుల చాలును విశదపఱుపగా ఽ నా మించుబోణులెల్లరు పురుషుల
మించ నిలువరని నలువయునుం ఽ భూమిని ఘంటాపథముగ వచించ
లు ననగ శబ్దముల నిడెడి మే ఽ ఘూల గర్జనలు వెలువడ ముదముల
లువిప్పు పింఛముల మయూరపు ఽ మేలి నృత్యముల మేళవింపుగా
గ భీకరము విరహులకుం గా ఽ నినుడు జనులకును నెఱుగబడక దు
ములుగా మాలతీకుసుమముల ఽ యొనరిక లడంగ దివావసాన
యములను మినుకులను వెల్వఱచు ఽ రమణ నొప్పు ఖద్యోత చయంబులు
మణిరాక తమ మనముల గోరుచు ఽ తమమున చలిచే వణకును గొనియును
నల పక్వముల నాహారముగా ఽ గొను సమయంబులు లేకను ఫలంబు
దినగా దలపోతల దిరమున ఽ వనమున ఖర్జూరజంబులాదిగ
డువులను నెటో బడిసి యుని కడుపు ఽ నిండుటకై తమయత్నముల జొనిపి
డితనంబెడ విడకనున్న ముని ఽ తండములును వారికి నింపు గలుగ
లి వాసనల మించు కేతకుల ఽ చాలు వాఱి కాంతలు భుజంగులను
లు విడని వడువులు దోచువాని ఽ నోలిని కదంబ కుటజ కుసుమముల

పరిమళమిళితములైన మార్గముల ఽ వరుసలన్ని గననీకను బెరిగియు
సరసికంబులగు పచ్చని కసవులు ఽ హరిమణి కిరణపుదీప్తులను బోల
వెలసిన మెసవియు మిసిమి గలవియై ఽ పలుద పొదువులఁ బాలు భారముగ
నిలిచి గదలకను నెమరుల వేయుచు ఽ నలరు నింపు గోవుల యున్నతి
పాలవలన నభిరామము నిక్కఁగ ఽ నీలకంఠు హస్తముఁ సాటికి
బోల మెండు సారంగ ప్రీతి నయి ఽ మేలి కనకగిరి చెలువున నింద్రుని
ధనువును పూర్వాపరదిశల వెలుగ ఽ ఘనత విభీషణుహృదయము వైఖరి
గనపడు తెఱగున హరిశబ్దములును ఽ దనర మరియు నిట్లొప్పు భూములను
వినుకులుగా నల్లెడల వెలువడగ ఽ ధపదపఖుని పూజనపు చందమున
నింద్రగోప విభవజనకముగ ఽ జనకుని యాగము వైఖరి సీతా
ప్రకరణాలంకృతమునై తొలి యుగ ఽ ప్రకరణఁ దోపెడు బహువర్ష జీవ
న కరముగాగఁ వర్షాకాలము ఽ సకలకాల సంతోషకరము నై
యేపుసూప శ్రీకృష్ణుని రాముని ఽ గోపకుమారుల చేరి విహారము
దోపఁ దిరుగుచును మనోహరమునగు ఽ వాపర్వతంపు మిఱ్ఱు భాగముల
సద్దులనఁ దినియు సరసతను మించి ఽ యుద్దుల నాడుచు ముద్దులుగా తమ
పెద్దవారు గన వత్తు రిండ్లకును ఽ అద్ది బుద్ధి కిటు దోచు నృపవరా!
బాలకృష్ణుఁడే మేఘమునుబోలు ఽ నొలయు చిరునగవు తటిల్లతయుగా
జలధరగర్జన వేణునాదముగ ఽ తల జుట్టిన శిఖిపింఛ దామమే
అల సొంపగు నా బలారి ధనువుగ ఽ విలసితశాంతము నగు దయారసమె
చెలువగు వర్షము చాలు వెలుగంగ ఽ దలపున తను తలపోయు మునిజనులు
అల గోపకులును చాతకములు గా ఽ లలితమైన బృందావనమె మిన్ననొ
ననుచు దోచు శ్రీకృష్ణుడక్కాల ఽ మున సర్వకాలరూపు తా గాడే
విను మత్తరుణము దాటెడు దినములు ఽ వనములు జొంపములను గుదు రండెను

## -: శరదృతువర్ణనము :-

గన రొంపు లిగిరె నెమళ్ళ రొదలులు ఽ గనక యూరకొను నదుల వేగములు
దినదినము తగ్గ గనె నిర్మలంబు ఽ వినువీధి మేఘములు పలుచవారె
వినరావు నుఱుములును నట్టులనే ఽ గనబడవు మెఱుపులును నన్ని దిశల
జీవనముల సంస్కృతిని వదలుకొని ఽ భావశుద్ధి విజ్ఞాన పరంబుగ
పావనాశమును బొంది యభిమాన ఽ మేవలను లేమి నందు పురుషులను
బోలి మేఘతతి నొందు నోలి యిటు ఽ కాలవశము గని వెల్లివిరిసె నవి

చాలుదోఁచె గగనంబు నిర్మలము ౯ డాలందె యోగిజనహృదయచ్ఛాయ
నీల దుకూల వితాన సంయుతపు ౯ మేలి ముక్తాఫలంబుల వడువున
తార లొప్పె వినువీధి ప్రకాశత ౯ గూర నాకాంతి సువ్యక్తమున గాను
మేర బ్రహ్మాండమను బరణియందు ౯ జేర్చిన యట్టి కర్పూరఖండ
ములు నానొప్పెను చంద్రికిరణములు ౯ అల కిరణస్పర్శలను సగర్వలయి
నిలకు దుర్భరములై సిండి పండి ౯ హరికుల నిశితపు కోడవళ్ళ వలన
గలుగు నాటోపమునకు తల్లడిలి ౯ వెల వెల బారుచు సిల యగు మాతకు
తమగోడు తెలుప ఎన్నుల వ్రేగున ౯ క్రమబలము తగ్గ గాలికి నిలువక
భ్రమ మర్మరముల నొప్పి వ్రాలు స ౯ స్యములు హానివలె మంజరీపుంజ
ముల గొంచక చంచువుల కబళించి ౯ నలరున శుకము లు శుకీసహిత బా
లలతోడ మెక్కి కడుపు నించుకొని ౯ యుల యున్నతమ్ములైన మంచెలను
వెలదులు వెన్నెల కావలి యుండగ ౯ నలరున వారల చిగురు మోవులను
అల గాంచి బింబఫలము లని గఱచి ౯ లలన లవి కరాస్ఫాలనల కలికి
కలకలరవంబులను శుకము లొప్ప ౯ కలహంస కోక సారస కోలా
హల మండితంబులై నిండినట్టి ౯ జలజాకరముల నిర్మలపు జలము
లను మీనంబులు విహారవశులను ౯ జను లాయువులను తరుగుట కనకను
గన నాసల సంస్మృతిని పెరుకు వల ౯ గని మూఢత దిరుగాడిన విధంబు
నను జలము లునికి దరుగుట గానవు ౯ జనవర ! జలచరములును భయ మడర
గను నదుల జలము దినదినము తగ్గ ౯ గను నందు సైకతముల నెలవు లవి
గనగ మణిసౌధముల సోపానము ౯ లను కర్పూర మంటపంబులును
కనుల దోప నందుల నుదయమ్ముల ౯ మునులు నిత్యశీలముల జపమంద
మునికన్యలు కలశముల జలములను ౯ నొనర బోసి పెంచిన కుసుమ లతల
సముదయముల పొందులను తరులును ౯ క్రమ మొప్ప వారి నిలయములను
విమల శోభ గన నందు బాలసా ౯ లములు రసాలములాది వృక్షముల
నమరు కొమ్మలను నాకలమ్ములను ౯ ప్రమదమున మెసవి మసరు గవిసియును
విమలకాంతిఁ జెన్నొందు కొమ్ములను ౯ నమలత ప్రవహించునట్టి యేఱుల
దవిలి దరుల ద్రవ్వుచుఁ జిమ్మి క్రుమ్మి ౯ సవసరమునందు కరుల సముదయము
లవి కుంభములఁ కనక కుంభరుచి ౯ సవురు గన్నట్టి కుచభారత భీ
రువులునై మధ్యములు నల్లాడుచు ౯ పువ్వుబోడులైన చెంచితలు వారి
ధనువులను విసరు నిశితవాలమ్ము ౯ లను పోటుల బడి పరువును గనియెను
ఘనమైనట్టి వరాహాదులాది ౯ ఘన పుండరీకము లమయమ్ముగా

నందు నున్న పుండరీక కుముదము § లందమిం చుటను వానిదైన మక
రందమును గ్రోల తేటి కదుపులును § నందమింపంగ గదుపులను గాంచి
పసదనమున దను గని సక్రరవిశార § రస ముద్భ్యాతిని వృషభములు వెంట
వెసగొని గోవుల మూలు నెక్కొలుపు § రసములట్టు లాకరము గనుగొన్న
వర శరదృతువు మరి వినుము రాజ! § వరరాజ రాజమందిరము బోలు
నరయ కుంద పద్మములచే నలరి § కరము మానధను చరితము పోల్పిన
కలుష రహిత జీవనము దనరుచు § వెలితి నీలకంఠశబ్దము గాక
కలన దోపగా లేని హీనువలె § యల శాస్త్రవేది హృదయము కైవడి
విలసిత కాలప్రకాశపదమున § వెలసి రాము ననివలెను బాగాస
నాలంకృతమైన పంకమగుచును § కాలువి మానసమును చెలువొందుచు
రాజహంసముల విరాజమానత § తేజమించు పంకజభవు నిలయము
నోజ కులవధూరత్నము చాలున § రాజిత పయోధరములు మరుగుగా
వననిధి వసువుల భూభృద్వ్యాహిని § యొనరులు సంకులముంగా ధరణిని
గన నృపులవిజయ గమన శోభనము § లను నొందిన హారతుల శ్రీలక్ష్మి
ననుకూలపూజ దేవోత్సవముల § గనసయ్యె వసుధలోన నల్లెడల
యోగము గని మదనుడు చెఱకువింట § బాగుగ నీలోత్పల బాణరాశి
వేగమున గూర్చి విరహిజనుల నల § భోగపరత గన పరితాప మిచ్చె
వగను బొంచియును వేసె మృగమ్ముల § దగ లుబ్ధకుండు వంచించు నటుల
ఇట్టి శరద్వాసరముల కృష్ణుడు § దిట్టత బృందావనమున బసువులు
దట్టమైన పచ్చిక జొంపముల § నట్టె మిసిమి గన మేపుచు నుండియు
నందసుతుండు శిఖిపింఛము మౌళిని § నందమింప కర్ణికల చెవికొనల
యందున దాల్చిన కాంతిగండముల § యందు ప్రభ గూర్ప నబ్జదామంబు
నురమందు వెలయ డాకాలుమీది § వసుసన నిలిచియు దారకల కాంతి
నిరవొందు నఖములవి రుచుల మెఱయ § ధరణి యొప్పుటల నృత్యవిన్యాస
పదముల కరముల వేణువును దాల్చి § ముదము వెలయ తల యోరగిల కొంత
గుడు రంద పచ్చనిది వలువ గట్టి § యుదిత విజ్ఞాన పూర్ణ చంద్రువలె
విదితకళ వెలయు మోహనపుమూర్తి § యధరమున మురళి నాన షడ్జాది
రవము లేర్పడగ వంగుళుల సొంపు § దవుల చాతుర్యమున నామోదము
నవిభాజితముగ గాంధర్వగీత § ప్రవిమలా పూర్తిగను మోహించెను
మార విహారములకు కారణమయె § నారీసముదయములకు మందలో
సారతరానందము గూర్చుచు గీ § తారవము విన్నమాత్ర నుత్సుకత

ు మించి పనుల వర్జించి గోప § వనితలు సిగ్గుల మలగించి బంధు
ులు వారించినను నిలువు గాంచ § కను పదుగు రైదుగురు నొక్కొకచో
మిజేరి ముచ్చటలకు తా జొచ్చి § తమలోన నిట్లు తలపోయుటలను
ములు బలికిరి యొకరితో నొకరు § సుమశరుని బారి తము నగ్గలింప
పాలచక్రవర్తిని యశోద § పాపని నందుని ముద్దుల బాలుని
రా పాటలగంధులు ఫుల్ల లెగయ § నాపాట బాడు కృష్ణుని పదముల
ు మనములందు నాలింగనంబు § భ్రమ దొలగని మతి కామవికారత
ు నెదురేగుచు వర్ణింతమనుచు § సుమగంధి రావె సుందరీ రావె
ాలతీ రాగదె పూబోణి యమునా § జలజనేత్రుండు బృందావనమున
లరున తన మధురాధరామృతము § యల మురళియందె పూరించె గదే!
ులవెంట వనమం దొప్పు గనుట § నా లలితమూర్తి గాంచితిమి గదే!
హా లతాంగీ! వేణునాదమును § యాలించినంత తలకెనె చిత్తము
లియ నే నెటుల తాళుదునమ్మా § నలినయను నను పరికింతువె యన
లికి యొకతె నే ముందున చనువున § కలిసికొని నిన్ను పలికింతు సఖి!
తోడ తప్ప నాడ నింతిరో § నీతోడివారు నిను మెత్తు రబల
ా తోడ రమ్మ సిగ్గంద కతివ § నీ తోడుననే నన్ని సమకూర్తు
రుణీ నందకుమారకులు వేడ్క § నరసి గోవులను మధ్య నిలిచియును
రుస నీలోత్పలముల పద్మముల § వర మాలల ధరియించి వస్త్రముల
రివేష్టనంబు సుందరంబొప్ప § సరసను గోపుల నూదగ గంటిర
రమ హార్షమున బహు నటుల చంద § మరయ తాండవము సలుపు గాంచుడో
ర పీన కుచోజ్జ్వలులార! శీత § కిరణబింబ సమ వదనలు కృష్ణుని
ని నార లలనలార! వేణు వా § ఘనుని కెమ్మోవి సుధారసంబును
ున కొకింత యేనియు మిగులకుండ § గను తా నానుచు చోద్యముగ మ్రోయు
ును మనల మోదమును పేరను మా § రుని బారి వేదనము జేరజూవు
ును మెరయుచున్న దది యే తపమున § గనెనో యా వంశ మావంశమందు
ుదితా! యే నదినీటిచే వేణు § విది బెరిగి వృద్ధిగాంచి చక్కనయి
దిసె నీ వెన్న దిన్న గోవిందు § యధరసుధ గ్రోల నోమధురాధరి
ును డీవేణువు జననియైన నది § తను సత్సంతతి గన్న మోదంబు
నుపద్మాదుల రోమాంచములను § తన హృదయహర్షమానోజ్జ్వలంబు
రగల కరముల నటింపు గూర్చును § తరుణులార యీ నది పుణ్యమెంతో
చెలియలార! భాగ్యములు వేలేల? § జలజ నయను దర్శించు కన్నులే

కలిమిఫలము దోపించు వర మ మరు ఽ నలివేణీ యీపూత చరిత్రుని
యతిభక్తిని హరి నర్చించువారి ఽ నతులహర్షమున పూజించుఘనుల
గతి దోప తరులు పీరి పూదేనె ఽ లతివిస్తరముల నర్పించు గనుడు
అతివ నే మోసమందితి గదవే ఽ మతి దోచె నిపుడె మానము వచింతు
నతులంపునోము మునుజన్మమందు ఽ నతి పాత్రమ్ముగ నోచనైతినే
అటులేవి యిచట కాళిందీనది ఽ తటమున వంశముగా నే పుట్టుక
నిటు గాంచి యుందుగా కుటిలాలక ఽ యటమట ముండదు నాకటులైనను
గనెద నిపుడైన యా నోము నోమ ఽ నన నింకొకసతి నాకదియె జాలు
కనికరమున నను గూడ యానోము ఽ నను సా లిమ్మన నలరుదు రందరు
కలికిరో మయూరతుటుముల గనవే ఽ జలదవర్ణుండు జలదమె యనుచును
నల వేణువు రవమును ఘూర్జవోలి ఽ చెలగున పింఛములను విప్పి నృత్య
ముల వారలల్లి యాడదొడంగెను ఽ చెలియలార మనమట్లు యాడుదము
గిరిచర మిథునము లలరున గనియెదు ఽ సరసిజనాభుని చరణపద్మముల
నరయు జాడ లవి సురపురముకన్న ఽ కరము బృందావనము మేలు తరుణి
అమరేంద్రాంగన లావిమానముల ఽ గమనంబు సలుపు చీవిమలాంగుని
క్రమమందు మనోహరము రూపమును ఽ విమలముగ శోత్రసుఖము దీప్తి గను
మనము హర్షమానమున విరహా వే ఽ దనము తముంగూర పరవశత పతుల
రొమ్ములం దూలుటల గనిరి మన్మథుని ఽ నడిగన్న పూవుటమ్ముల తాకున
పడతులార! మన మా యశోదకును ఽ కొడుకగు నీ ఘను శ్యామాకారుని
అడుగులకు మ్రొక్కి యాదరింపుమని ఽ యడుగుదము తపము నోముల వేలను
ఎదురనే నిలిచి యందరి మనముల ఽ గదిసి మానసపు మానధనములను
లాగె వనవీథి తా నందమందె ఽ తీగెబోడులను దరి జేరు పాట
రాగమున గూర్చె మన మనురాగము ఽ వేగమంది తను డాయ వలపించె
భోగమున గూర్ప తా డాయరాడ ఽ యీ గానమేల గూర్చితి వనుచును
నిలుపుదము కేలుబట్టి ధైర్యమున ఽ యల గౌరిదేవిని దలపుదమా!
బలమిచ్చునామె గాదా తో చెలి ఽ యలు కేల యనుచు నందరు కొందరు
మనము గానకళ నిపుణతను జొక్క ఽ గనివారమనుట యుండని యదిగో
కనగదే ధేనువులును వత్సములు ఽ వనచరయును నే జూచుచును మేపు
లను మాని పాలు గుడువ చేప వవి ఽ ఘనిత యా దూడలును చటుల పాలు
గోవత్స వృక్షములకొమ్మల ఖగములు ఽ కనులుమూసి తమ గమనముల నాపి
మనములలో కృష్ణరూపమును జిక్క ఽ గొని యానందమ్మునను బహు మరచె

ఘనులైన యోగిజనముల బోలుచు ఽ కనుడు వల్మీకముల భుజగచయము
లును తలల నిక్కి భయరహితంబున ఽ వినుచున్న వదిగో శర దంబుదంబు
విరులు గురిసి తనశరీరమెల్లన ఽ కరము ధవళ ఛత్రము బోలె వీరి
పరమున నీడను గూర్చి చలించని ఽ కరణి నభంబున నొప్పగను గదా
పింఛచేలములు గట్టి సోయగము ఽ మించ వనంబున మంచిఫలములను
చెంచితలు దెచ్చి హరిచేత నించి ఽ అంచితముగను కరాలంబనముల
మించి యుత్సాహమున క్రీడింతురౌ ఽ చంచలాక్షిరో ! గంటివ యదిగో !
యొక భిల్లవనిత కుచభరంబులను ఽ చకచకలఁ నడు మల్లాడుచు రా
సకలమనోహరం బైనపుష్పముల ఽ ప్రకటిత హారంబొప్పగా గూర్చు
కొని తెచ్చి నందసుతు మెడవైచియు ఽ గని చెంగు తా నగుచు నవ్వించె
కనలేదే మే మన కది యుబ్బిన ఽ మనము నవ్వామా ! యో పువ్వుబోడి !
తరులెల్లఁ జల్లవించె మోదులచె ఽ గిరులెల్ల జలములయ్యెను గన భూ
చరులెల్ల జొక్కిరా హరి యాడెడు ఽ మురళిగవామృతరసమును గ్రోలియు
ఓ గజిత రామకృష్ణ చరణముల ఽ వర సంగమమున ధన్యత నందుచు
ఈ గిరిరాజము వర పుష్పఫలము ఽ లరసి యర్పించు ధేనువులకునుఁ
జల ఘాసంబుల గూర్చి మిక్కుటపు ఽ నలరున ప్రకాశితపు భూజములను
విలసిత మందెడు పులకలను బోల్చి ఽ వలనొప్పు మెఱయు విధమును గంటిర !
యనుచు తమయిండ్లలోన నేకాంత ఽ మునజేరి తత్పరత జేతనముల
వనరుహనాభుని మదలుగొని యుండి ఽ రనఘా ! యని జనపతికి మరి మునియు
వినజెప్పె నవల ఋతుయాగమనము ఽ మునులు వినుండని సూతుడు వచించె
శౌనకాదులకు జెప్ప నీపగిది ఽ ముని శుకుం డనియె, నభిమన్యుసుతా !

## —: హే మ ం త ఋ తు వ ర్ణ న :—

శరత్తు గడ చనగానె వడివచ్చి ఽ తరంబందె హేమంతము ధరణిని
పరంబు గొనె విహరింప బలంబున ఽ నరాళి విరహుల పరిపాటి మిగుల
శరాసరిని హిమగిరి పంపుగొనుచు ఽ బిరాన చలితో జుట్టె నెల్లెడల
హేమంతఋతువు జాడ లీతెరుగు ఽ యీమహి సర్వము శీతలంబంద
సీమంతినుల కుచోష్ణ సన్నిధియే ఽ తాము శర ణనక పురుషుల తాలిమి
యేమెయి నయినను శాంతమును గనదు ఽ కాముకుల కెంతో నుబ్బు ప్రబ్బుగొన
గొబ్బున నహములు సన్నములుగాగ ఽ నిబ్బరముల కుదురంద దలంచిన
దబ్బున దహనుని హితమును వేడగ ఽ నిబ్బంది కొంత శాంతినిం జెంద

నైనట్టి తరుణ మది మరియు బొత్తు § చానలకు వారి ప్రాణ పతులకును
మేనుల మనముల నేకముగ నెన్ని § పూనికల వారు మెత్తు రొకరొకరి
అన్నుల చన్నుల దండల జేరి వి § పన్నులు గాకను బ్రతుకుదు రెల్లరు
చన్నుల ప్రాపును బొందకున్న నా § పన్నములును దప్పంగ బోరుగా
యన్నలువ శంభునను వెన్నుండును § వన్నెల మలగరు క్రిన్నన సతులను
దండ విడబోరు హిమమునకు వెఱచి § అండజయానల యోగం బందుట
మెండు ప్రియంబుల పడచుల గూర్చుట § సింధు ధృతికి వడకును గాంచకుంట
తెలియదగుఁ గాద వెద త్రిమూర్తుల § చెలువలను బొందనేల హంసులై
విలసిల నుండరె వినుమా భానుఁడు § చలికి వెఱచి యా ఋతువున పరువును
గొను పొదుపు మొదలు పడమటికొండను § తను దాపుకొనెడు దాకను నల్లే
యనల త్రితయంబు ననువుగొని దాగ § ఘనుడగు శంభుని కంటిలో నొకటి
వనధిలో నొకటి మరియు నింకొకటి § మనుజ మందిరములలోనఁ జేరెను
హరి చలికి వెఱచె వారిమధ్యమున § సిరి దన కుచంబులను దాపు నిచ్చె
హరునకు గౌరియు పర మందించెను § తరమున్నె చలికి వడకక నిలువగ
వినుమా చలికాలమున తొలిమాస § మున కాళిందీ సలిలంబులలో
వనిత లాగోపకుమారికలు వే § జని రేపకడనె నదిలోనఁ దోగి
నియమ మూని నిసుకను గౌరిదేవి § నయమున రూపము గూర్చి భక్తిచే
క్రియలగూర్చి పూజింపు యత్నతను § జయము తముబొంద నిత్యార్చనముల
సురభి కుసుమ గంధముల దీపముల § వరధూపంబుల బహువిధములయిన
సరసోపహారముల తాంబూలము § కరము దక్షిణల హారతులతోడ
వరుస పూజించి కరములు మొగిడ్చి § తరుణు లటు వినుతి సల్పిరి యంబను
గిరిజాదేవి! వరదాయిని! శ్రీ § సురుచిరభాగ్యైశ్వర్యరూపిణీ!
హరురాణీ! కాత్యాయని! పార్వతి! § శరణము నీ చరణముల నమ్మితిమి
సరసిజనయనుని నందకుమారుని § వరుసగ వరమును ననుకంప గూర్చు
ఓ తల్లీ! ఇటు దయ నించి జేసి § నేతిని పాలను పెరుగు వెన్నలను
ప్రీతి నిండగ వసంతము లాడుచు § జాతర గూర్తము దండి ముదుపులను
చేతము లన్నియు మావి శ్రీకృష్ణు § చేతఁ గొనబడియె దాపము కోర్కుల
బూతి నీరుగ్గపట్టున నిన్నే § యూత గొనుచు నీరతుణ విమవము
నెలపూర్తి నియమ మిటు సెల్లగ నా § వెలఁదులు వేకువ లేచి బల్కికొని
తలకరు చలికిని జలజాత నయను § నలరున బాడుచు చను లల్లాడగ
నసియాడు మధ్యముల తీవ్ర నడల § వెసవలయు వాని జలకలశంబుల ..

పసిడి భూషణము లొడలుల మెఱయఁగ § నిసి గడవక మునుపే యమున జేరి
చెలువులెల్ల తమ వలువల గట్టున § నిలువర ముంచియు నందర హ్వారె
తలపున శంకల గొనక చలంబుల § జలజగంధు లా జలముల జొచ్చిరి
వారిజలోచను బాడుచు నందే § సారమతుల వెలిబుచ్చి బల్కుచును
వారివిహారము సలిపిరి దివిజులు § నారులు వీరి విహారములు మెచ్చ
తోయమది చిత్తమున దా నెఱింగి § తోయజ నయనుడు తన తోయముతో
నా యమునానది వారలు దోగెడు § పాయ దూరమున నందరి నిలుపుచు
కదలి రాకుడని కనుసన్న నిలిపి § పదముల మెల్లన నేల మోపుచును
పొదలమాటు గని వలువల దొంగిలి § మదగజము లీల యవ్వల దాటుచు
అనతిదూరమున నున్న నీపతరు § వును నెక్కి వడిని లలనలు గాంచగ

## -: గోపికా వస్త్రాపహరణము :-

మనములు కలతను తొలుత ఝల్లనగ § మునుకొని వినయంబునను వేడుచే
ఘనమని మామా ! వలువలు ముట్టకు § వినుమా ! మానము గొన నీకు దగునో
కనుమా మా యెడదను దయగలవే ! § యొనరున మా మా చీరల నొసగుము
అనుచుఁ జెలువ లా ఘనుని నుతింపగ § గని రా పూర్వము సుకృతపు వాసన
గని రేమొక్కో ! వనజాక్ష ! నీకు § జనునా ? బహుజీవనమున జరించు
టను ననువొందెడి నీవు నీ గోత్రమును ధరింపవా వనచరపరతను
ధరణి మనుపవే మనుజహరివయ్యు § పరబలమ్ములను జెరుపు వరుసలను
సురలు నుతింతురె బలిని దెరల్చిన § వరదుడవు పిన్నవైనను బెద్దవు
అరయగ రాజుల గెలువ దగువాడ § వరుదా రగు నీ గురునాజ్ఞ చొప్పు
పరువున నొనరుచు పారము నందవొ § వర బలయుతుడవు వరుసగను మరియు
దనుజహంతకుడ వభిరామత గని § కనగ హాలభూతి నరుల గెడపెదవు
ఘనమతులు మెచ్చగను ప్రబుద్ధతను § గనదగును కల్కిదనము నీకొప్పు
నే నలిననాభ ! వనితలచేలము § లాన మానితమె ! మరియును వినుమా !
గన రాజసమున నీ యొప్పిదంబు § గనినారము వింతల చెయిదములను
అనఘ ! సత్త్వదీప్తిని గనిన సత్త్వ § మున గూడువారి దునుముట విందుము
ఘనుడవు తామసమున తామసులగు § దనుజుల రొప్పుట నవియు దెలియుదుము
మాయల మలపెడు మాయావినోది § వీ యబలల గారింప దగవగునె ?
యే యెలమిపాటి జూడ గుణ నడక § లా యనంతముల దోతువె ? ఇందున
న్యాయము గనుమా ! రాజగు నందుని § కీ యుదంతమును దెలుపం గందుము

నీవే రాజపుగావే వస్త్రము ౯ నీవే గై కొను మా వందనములు
దేవుడు మెచ్చునె నీవు దేవుడవ ౯ కావలయు నంబరము లిమ్మిప్పుడు
నా విని కృష్ణుడు నవ్వుచు నని నిటు ౯ యో వనితలార ! మీ రొప్పితిరా !
రాజు నందుడుగ నే రాజసుతుడ ౯ రాజపుత్త్రిలతో రాజీవాక్షులు
రోజలు సెల్లగ మేలమాడుదురె ౯ తేజమంద నీరంబును వెడలుచు
చీరలు గొనుండు నే నీ సందునె ౯ నారులార ! నందుండు వృద్ధువయి
మేర నన్ను లాలించుట దెలుతురె ౯ మీరకు డాజ్ఞను త ప్పొనర్చితిరి
దాని దెలిపెదను చలికి వడక రిక ౯ పూని నియమమున దేవీపూజను
మానిత మందుచు దిసమలను నీర ౯ మును జొరదగునే యది తప్పగాద
మునుకొని కరముల నెత్తి మ్రొక్కనను ౯ గనును దయ దేవి జలమును వెడలుడు
యన నా కనకాంగులు లజ్జల చే ౯ తను పెనగొని ముసి ముసి నగవున చలి
నిలువ వెఱచి తమ నోము ఫలించెను ౯ జలధరురాణియు జలధర దేహుని
వలపుల మనలను నేల ప్రత్యక్ష ౯ మలవడ గృష్ణుని మనపాల జేర్చె
ననుచు వనమధ్యమున నుండి వెడలు ౯ చును తమ మనముల వెల్లడిగ జూపు
నొనరున స్తనముల పొంకములు వెలిని ౯ గన కరము నొకట మర్మముల డాచి
మునుకొని యొక చేతను మ్రొక్క నగుచు ౯ ఘనమా తగు నావనిత లంబకును
తొలుత వరఫలము నంది మ్రొక్కటుల ౯ పలుచబార నొక కరమున బోలునె
అలుగునేమొ మిము నలరునను రెండు ౯ కలుపుడు హస్తములను గిరిజ మెచ్చు
తలపుడు మనమున శ్రీకంఠునిసతి ౯ కలక బడపి మిము నను గూర్చు ననిన
మర్మములు దాపనేల ? యింక నని ౯ ధర్మకలన కరతలముల రెంటిని
నర్మిలిని తమ్ము నావిష్ణుడు గన ౯ ధర్మమూర్తి హరి దుర్మదవిదార
నిర్మలాత్మ! జగదీశ్వర! సుందర! ౯ నర్మపు వరుసలు నీకె చెల్లు నీ
ఘనత లొప్పగన దయ నేలుదువో ౯ వనజనయన! మాధవ! మహనీయా!
యని నతులు సెల్ల సాగిల ముందున ౯ వనరుహాము దిగుచు చీరలు భుజమున
దనర సమీపము వారలు జేరిన ౯ ఘనమైన ప్రీతి వారిని గాంచియు
వనితలు కనకపు ప్రతిమ లనదగిన ౯ యొనరు సింగారముల మీరినారె
కనరయె మీమనముల వ్రతనియమము ౯ లనఘులార మిము పిననాట నుండి
కనినాడ చెలిమి మీరూపు గననె ౯ తనువుల మనముల ననిలముల మీరు
నను గూర్చినారు వలువ లిడె గొనుడు ౯ కనికరము నన్ను గదిసె చలి దీర
గొనుడు కట్టుడని యిచ్చె బాలికల ౯ కును తలల కరములను జేర్చె సిగ్గు
లను కడబుచ్చెను నియమవ్రతలకు ౯ కని రా వనితలు ముదమును హరి చే

గొని రంబరముల గట్టి వ్రతపూర్తి ఽ దనర సెల్లించి యంబను మొ్రక్కుచు
తగవున నందకుమారుని మగనిగ ఽ జిగి నంది ప్రక్కలను జేరి నిలువ
నగభేది పురంధ్రులు నారిపైన ఽ తగవున మందారాది సుమములను
గురిపించి రదియె జగన్మాత తము ఽ నరసి పెండ్లి యీాపిధిన బరపె నని
సరసమతుల సంతోషపూర్తి గని ఽ వనజనాభుపై కనుదృష్టి నిలిపి
తలలు వంచి మన మలర నమ్రలుగ ఽ నిలిచిన వారల చిత్తముల దెలిసి
లక్షణవతులకు మీాకు నాకృపను ఽ పక్షమంద నొసగితిని చిత్తంబు
నిక్షేపమనుచు గొనుడు నాయందు ఽ లక్షించినమతి యతివిస్రితంబు
గన దెలిసితి నిక నాభక్తిమీాకు ఽ ఘనత జేకూరు ముక్తి నిజమ్మన
వనితలార! నను శాశ్వతపురుషుని ఽ గన సర్వాత్మునిగా నమ్మ డబల
లార! మత్సంగతిచే కల్మషము ఽ జారు మిమ్ము నా పరమేశ్వరి కృప
జేర రాత్రులను నను నేకాంతత ఽ జేరి మోదమున యల గాంతు రనగ
నింతులు భ్రాంతుల నడగు మనంబుల ఽ సంతసమున నేగిరి యిండ్లకడకు
గొంతుల తీపిని గదుర వెన్నునికి ఽ బంతముల గొనుచుం బాటల పాటల
నెంతు మనోహరముగం గూర్చి దివ్య ఽ మంతనము లబ్బురము దోపగ నిటు
గోప గోపికావల్లభ! కృష్ణా! ఽ పాపహరణ! పరమాత్మ! మా వల్ల
భా! పరమశీలవృత్త! జనార్దన! ఽ మా పరజన్మలు భవ్యము లందెను
నీపదంబులను రేపు మాపనక ఽ పాప్రని యెల్లపుడును ధ్యానింతుము
యోపి యేకాంతమున సేవింతుము ఽ రాపిడుల మాపవలె బంధనముల
మోహాము నీపై మురళీలోలా! ఽ యూహాలు నీచరణార్చన విధులను
స్నేహామంద సంగమ సౌఖ్యములను ఽ దోహద దోహాన బాహాటములగు
ననుచు నుండిరని యా వనజాక్షుండు ఽ దనరు రా గోరు గోపబాలురను
ఘనుని విజ్ఞానభద్రు బలభద్రు ఽ మునుకొనుచు జేరి బృందావనమును
దాటి దూరమున నేగిధేనువుల ఽ వాటమైన నెలవులను మేపుచును
నాటల ధోరణి యెండతీండ్రమును ఽ నీటున చల్లన నిక్క నిక్కించు
తరుల దారి యట విశ్రామమంద ఽ పరువున గోపకుమారు లందరును
అరయవలయు నీ వృక్షతతి పెంపు ఽ అరవిందాక్ష! రామ! శ్రీదామ!
కర ముపకారము గూర్చు నరులవలె ఽ పరుల బీడింప కనె నర్థులకును
తా నొసగును సత్కారము వలసిన ఽ యే మానమ్మన నైన మీా కిచ్చు
ఆ మాత్రిన లోభమును గూర్ప వదె ఽ తాము శీతవాతాతప వర్షపు
ధాటి నిలిచి ఫలపుష్ప పూ దేన ఽ లాటంక ముందకుండ నిచ్చునవి

వీటి పుణ్యంబు పాపసంహరము ఽ చోటంద బల్కరాదు గద మేలు
దీటుగాన రిట్లు నరులు దమకూటి ఽ పాటునకు లోగి పాటును దెలియరు
గా యని గోపకులాడ మెచ్చుచును ఽ వే యమున జేరి పశువుల నీరును
న్యాయమొప్ప ద్రావించి మరియున్నా ఽ మేయ విడిచి పొద్దగుట యాకటిని
పొందు గనుచు శీఘ్రమున దరలంగ ఽ తందరల బల్కు తోడులను గాంచి
చందము గణించి గోవిందు డనియె ఽ యిందు కుపాయము గల దది వచింతు
ఇందె సమీపము గన్న యా ద్విజుల ఽ సందడి గను తలము సత్ర మద్ది
యుందరి కైనను నన్న మిడుదు రట ఽ ముందు స్వర్గమున కరుగదల పుంచి
పొందు గొని బ్రహ్మవాదు లొనర్తురు ఽ అందున నీకుంజును దొలగ మమ్ము
లను జెప్పి తెండు భుజింత మందర ఽ మన వారచ్చటి కేగి విప్రులను
గని మ్రొక్కి అయ్యా ! కృష్ణబలభద్రు ఽ లను గోపాలురు గూడి వనమ్మున
నునికి గని యాకలిని బాయ మిమ్ము ఽ గని యన్నమడిగి గొనిరా నిట మము
పనిచి రన్న మిడు డనఘులు విప్రులు ఽ ఘనతగలపెద్దలరు మీధర్మము
లనుసరింపు కార్యములు సత్ఫలము ఽ గనుగాక మసల నేల మా కోరు
టల దీర్ప కాలమును గాదె యయ్యా ఽ లల యాలోచనముల గూరనేల
నలరున గడచనె పశువధంబున్నా ఽ అల సౌత్రామణియును జరిగె మీద
గుడువ జెలు నేరికైన దోష ఽ మడరదు మీకును దెలియ కున్నదియే
నుడువుడు మీ మౌనవృత్తి మెట్టో ఽ తడవు పెద్ద బడలిక గంటి మనగ
మతిని మెచ్చ రవ్వాక్యముల ద్విజులు ఽ క్రతువు మంత్రములు కాలదేశములు
వితత ద్రవ్య విస్తారతంత్రములు ఽ అతుల తప వ్రత, జప దాన ధర్మ
ములకు మూల మెవ డట్టి దేవుండు ఽ తలప నాకలిని యన్నం బడిగిన
తెలియని మూఢమతుల వోలె ధర్మ ఽ కలన దల పుంపకను లేదనుచును
పలుక వారేగి వెన్నుని కంతయు ఽ వెలవెల లందుచు వచించి నంతన

-: మునిపత్ను లన్నముందెచ్చి శ్రీకృష్ణ బలరాముల కిచ్చుట :-

కిలకిల నవ్వుచు భూసురుల నడుగకేవలదు వారి పత్నులశాల కేగి
అలరు దోపంగ నడుగు డుచితంబు ఽ లలనలు ధర్మపు నడవడుల పెద్ద
నలరారు వారు వమ్ముడని పంప ఽ నలుకు గనక వారేగి నాతులను
గని మ్రొక్కి కృష్ణు సంగతి దెలిపిన ఽ మనముల హర్షము దోపు చెలువు గని
వననిధిని దాయు వాహినుల విధము ఽ నను దివ్యతరములగు భక్ష్యంబుల
మనము ప్రీతిగను భోజ్యలేహ్యముల ఽ ఘనమైన చోష్య పానీయంబుల

తన రుచి నింపెను సరసాన్నంబుల § గొనుమను సద్దము సెప్పబిడ్డలను
కనక నన్నలను మగల బాంధవుల § వినక మాపొడ్డుచును వారివెంట
వనజాక్షు గృష్ణు జగదీశ్వరునిఁ § గనియు నన్న మొసగంగ జని గాంచి
రెలమి నింపగా వనచరహితమ్ము § నలర పల్లవాదికముల గూర్చెడు
నొక యశోక మా యమునాతీరము § ప్రకటిత నిర్మల తటమునం దుండ
నకలంకమూర్తియైన గృష్ణుండు § సకలేశ్వరుండు దాని నీడలో
వశమంది తాను నిలువంగ గనిరి § శశిముఖులు వనజ నేత్రుం గాంచిన
విశదమగు చదురు దెలియ వినుమధిప! § యశమందు ధర్మమూర్తి యచ్యుతుడు
నొక సఖునిపైన చేయి జాచికొని § యొక కరమున లీలాబ్జము నూచుచు
కుటిల కుంతలములు కొన్ని గ్రమ్మ § ప్రకటిత గాంతిని నిక్క గండముల
పొట్టిగ చుంగులు పోసి కొమరంద § గట్టిన పచ్చని పట్టంపు వాని
అట్టే శిరమునను చుట్టుచు గూర్చిన § దట్టమైన శిఖి పింఛదామంబు
గలవాని కలువ రేకుల చెవులను § నలరున జేర్చిన వాని పెక్కు పూ
వుల దండల మెడదాల్చిన వానిని § నల భువనమోహనమునగు సుందర
తను మించువాని కృష్ణుని గాంచిరి § కనుల కరవుదీరంగ కాంత లిటు
వను జూడ నన్ని మరచి వడి గాంచి § ఘనమైన భక్తి తీవరతగూర్చె
వనుప్రీతినింక నర్చన నన్నము § లను దానమొప్ప లంద రాలోన
వా సత్కులజుల సచ్చరిత్రలను § వాసినించు గుణరాశి నెగడందు
యా సతీమణుల గాంచి కృష్ణుడనె § యో సన్నుతాంగులార! కుశలమే!
మీకు మీగృహములఁ గలయందర § కేకూరునె మంగళములు కొల్లగ
మీకు ముదము గూర్పంగ నేనేమి § జోకనందియ్య వలతురో రం డిట
నాకు సంతసము గూర్చె మీరాక § సోకుమురు పెక్కుకల్యాణములను
సతులార! పుణ్యవతులారా! మీ § పతులు గృహధర్మ సందీప్తవరులు
క్రతువు లొనర్తురు అవి నిర్విఘ్నత § గతుల సాఫల్యమును బొందుగాక
మతుల నలరు మీకగును నెమ్మదిని § యతివేగంబున యాగవాటముల
జేర బొండన్నముల మాకు నిడుచు § మీ రేల రావలయును నన్నముల
కూరిమి నిచ్చిన జాలుగద యింతు § లార! మీరాక వేచియుందురట
మీరజనదు వారల యాగముల § సారతరదీప్తి మీవలన గాద
యనిన శ్రీహరి! మాకేల వారి § గనబోవుట మరి పెక్కు జన్మముల
గనినార మిట పతి సుతాదులను § వనజనాభ శాశ్వతములు గావే!
మునిజనవినుతా! నీవాక్యమ్ములు § మనము నలరించె వారె నడ్డియు నన్

పతివి నీవె యీ భువనజాలముల ఽ మది దలంచి నిలిపితిమి నీయందె
సతులము కనికరమునను దయ బరపి ఽ సతి గొంచు దాసిజనులగా నేలు
నిను మాహృదయమ్ముల పతి వనుచు ఽ గన లోకపతివి ముక్తిసతి వనుచు
ఘనతరభక్తిని కామించి జేరి ఽ కను డాసితి మిక మము బంపకు మన
వనితలను చిత్తశుద్ధి పరికించి ఽ కనికరము పెంపు గన మరి యనియెను
ఘనమైన కల్మషముల నాయందు ఽ మునుకొన్న భక్తి జ్ఞానాభంబున
మలపగంటి తమమం దదింక చెలు ఽ వలార ! ధర్మమును పాటింపగన
వలయు లోకముల నియమ రూపమున ఽ చలనము నందని నా స్వరూపంబు
ననయము న్యాయపరంబున గూరును ఽ జనుడు మీరు నాసన్నిధి డాసిన
మనముల క్రోధము వారలు జెందరు ఽ ఘనతను నింతురు వారె యపరాధ
మున లోగితి మని చింతింతు రిదియు ఽ గన దగు నందున సమ్మదము మీకు
నా తనువు సంగసుఖమును గూర్తురె ఽ యాతర సౌఖ్యము వశ్యయే గదా
నాతోడియాత్మ సంగతి సుఖంప ఽ మీతోడి దగును మోక్ష సుఖం బది
నాకీర్తనంబు వినిన ధ్యానింప ఽ చేకూరు ముక్తి మీకు నిక్కముగ
మీకు మీవార కబ్బు శుభగతుల ఽ నా కూరిమిఁ గనినట్టి మహాత్వత
వారి యువ్వారి జేరిన వారిని ఽ వారి వారి వగు సప్త తరంబుల
వారు మరిక్రిందు మీద త్రిసప్తక ఽ పారమల్లు మీభక్తి విశేషత
పరమునను జెందెద దరుగు డనుచును ఽ వరుస నింప వా రిడిన యన్నముల
హరి సఖులతోడ గుడిచి సంప్రీతి ఽ తరుణులను బంపె యా విప్రులదరి
కిని వారు గాంచి వనితల మేలిమి ఽ గని ధన్య లనుచు నబ్బుర మందుచు
మనమున శ్రీహరి వాక్ప్రపంచమును ఽ విని దెలిసి మ్రొక్కి నిటు ధ్యానించిరి
వనితలపాటియు మనకు మతిలేద ఽ వనజాక్షు మహిమ గనిరి చిత్రముగ
మనము కులవృత్తమున నీచమంది ఽ మనివార మకట కల్మషము దారె
వనజ దళ నయను డాదిదేవు డని ఽ మునులు పలుమారు బలుకగ విందుము
మన యాగపర్వముల కధీశుండు ఽ ననయ మతని కృప గనగాదె యిటుల
నియమ మూనుటలు నిగమ స్తుతులును ఽ భయవిమోచనుని శరణ మందుటకె
నయము దప్పితిమి దైవమగు నతని ఽ చయున గనబోక రమ్మనక నన్న
మడిగిన లేదని చపలతను నాడ ఽ దుడుకువ జప తప శీలము లన్నియు
[illegible]డ నభిమానపరత నందియు మీ ఽ యొడలు ఘనమనుచు వెడగుల మైతిమి
సురలు యోగులును సిద్ధజనవరులు ఽ పరతత్వమయుని గన కాంక్షింతురె
హరిభక్తిలేని యాచారములు ఽ వరదు నతింపని వేదపఠనంబు

కరము డాంబికము గాదా సర్వగు ఽ డరయ నారాయణార్పణ మనకను
వరములెందునను వడయ రాదయ్యె ఽ సరసిజ భవహార సన్నుతు! నీశుని
పరమాయ మనల మోహింప జేసి ఽ తరుణు లుత్తములు మనకు సద్గతుల
హరి గూర్చి మొ్రక్కి వరముల గొని రా ఽ సరసిజ నయనుడు వీరిని మెచ్చెను
మనకు వీరిమూలమున ముక్తిగను ఽ ఘనభక్తి దోచె నగుట ధన్యులము
యనుచు నధోక్షజు నచ్యుతు పరేశు ఽ వినుతులు సల్పిరి వేడ్క లిగురొత్త
జననాథ వారు కంసుని పాలనమున ఽ వర్తిల్లుట నియమముల దనిరి
అనయము మనమున ధ్యానము గొనుటయు ఽ యొనరుగ కృష్ణుని గనబోరు వింటె
విను మిక కృష్ణుని వినుత మహత్వము ఽ దనకేల నెత్తె గిరిని నునిచె
గోపకసంఘము నారుల బాలుల ఽ నా పరీక్షితుడు నతి నొనరించియు
నా పరమపావనుని శుకుని గాంచి ఽ యేపగిది సెప్పుమా చర్రితమును
నా విన జెప్పెను నా మునీంద్రుండు ఽ పావనహృదయా ! జనవర ! వినుమని

—: గోపాలకృష్ణుడు గోవర్ధన పర్వతము నెత్తుట :—

ఒకనాడు నందు డాది గోపకులు ఽ సకలజ్ఞుడైన హరి జేర వచ్చి
యకలంకమతిని యింద్రయాగమును ఽ ప్రకటవై భవముగను నేటేటను
జరుపుచుంటి మది చేయవలె నిపుడు ఽ సరసిజనయనా ! సంసిద్ధత నీ
పంపున గావలె నేడాదినుండి ఽ పంపు నియమించవలయు నది గూర్ప
నింపు సొంపు పెం పదర నీచేత ఽ ముంపు గొను ముదము మా కన వారికి
శకటభంజనుడు శౌరి యిట్లనియె ఽ సకలసుగుణవృద్ధులు మీకు నేను
వికటత గూర్పక నెంచితి ననకను ఽ యకుటిల భావమునను వచింతు విన
వలయు నీయాగమున నేమిఫలము ఽ గలుగు నెవ్వండు దీనికి ప్రభుండు ?
దలప నేశుభము వలయు పరుం డన ఽ తలపగ తెలకక మీరున్న దెల్ల
దెలియజేయుడని యడిగి నందునికి ఽ గలయగాంచి యోయప్ప! నీకొమరు
దెలమిగూర్చు నిను యలుకగొనకు మని ఽ కిలకిలనవ్వున వలగొని బలికిన
నందు డానందమున పౌ్రఢసుతుని ఽ యందు మమతవాటించి యిట్లనియె
సందియ ముండున తండ్రి ! నీమాి్రల ఽ డెందమున దాచగల వవి యుండునె ?
సురనాథు డధిపు డాభగవంతుడు ఽ కర మీశ్వరుండు మేఘబృందముల
కరము మేదినిని భూత్రపీతిగను ఽ పరమదయను గురిపించు వర్షమును
పండుసస్యములు ధాన్యములరాశి ఽ మెండుకొన జనులు జీవింతు రందు
దండి భూషణము పశువుల కబ్బుడు ఽ నిండు పాడి మన వీటిపత్రిజ గనును

నిండుశుభము మోదంబు మనకెల్ల ఽ దండముల నతని గూర్తు మేలేట
గం డడగును దుర్భిక్షరోగములు ఽ ఖండితముగ మనయండ జేర వని
వచించె నందుడు రుచిర ఘనతగను ఽ నచింత్యనీయుని నచాల్పు సుగుణుఁ
శశిపతిని తన ప్రచార మదమును ఽ విచారమున రూపడంచ దలచిన
వనమాలికి జయశీలవృత్తునకు ఽ ఘనునకు సుందరమూర్తి కృష్ణునకు
వినె నది యెల్లను వదనము విలసిల ఽ పిన నగవు గూర్చి నా తాత! వినుమ
వినుడు మరియు గోపకుల వృద్ధులును ఽ మనమున నరయుడు నే జెప్పు నదియు
జనులు జగంబులు కర్మసంతతులు ఽ జననము కర్మమె మనుటయు కర్మమె
తనువు మాయుటయు కర్మమె సుండీ ఽ వనిత ధనాదులు కలిమియు లేమియు
గన వివరంబున కర్మబంధములె ఽ ఘను లెఱుంగుదురు గద నీయర్థము
కర్మమె దేవత శుభాశుభంబుల ఽ కర్మమే గూర్చు నదియె దైవమన
కర్మము ధర్మము నడవడిన శుభము ఽ నిర్మల ముక్తిని బొందించు నిజము
కర్మవిదూరుడు ఈశ్వరుం డొకడె ఽ నర్మము మర్మము లేదు గాదు స
త్యమునె బలికితిని ఇంద్రుం డొక్కడె ఽ క్రియ మించు మేలు జేర్ప ఘనుం డొకొ
విమలులు ముమ్మూర్తులును భానుచం ఽ ద్రములును పవనాగ్నులు వరుణుండును
యము డశ్వినిదేవతలు నుపేంద్రుడు ఽ సమత నింక నెందరో రక్ష నిలుప
నమరి యుందు రందున నెవరి గొల్వ ఽ క్రియము సంధిల్లు శ్రియ లవి మలయగ
ఇంకను జెప్పుదు కర్మఫలంబుల ఽ నంక మందకను దప్ప రెల్లరును
పంకజభవు డా వంక హరిహరులు ఽ కింకరులే నిష్కర్మ దాత్ముండె
యట్టి సర్వేశు నీశుల నీశుని ఽ గుట్టెరిగిన మతి పూజింపకున్న
దట్టరు శుద్ధము జ్ఞానసంపత్తి ఽ పట్టుగొన్న నా పరతత్త్వమయుని
మెట్టుగాంచ దల పుంచవలె గాద ఽ మట్టమంద దీపూజ మన కేల?
ఇట్టిది జారుని బట్టి నిజపతిని ఽ నెట్టిన కాంతను బోలు కర్మ యిది
చుట్టము లెవ్వరు బంధముల బాప ఽ నెట్టు డాబుద్ధి సర్వేశు నాజ్ఞ
చట్టమంది యింద్రుండు వర్షించు ఽ పట్టున నతండు వెలుగు సర్వమటు
వేదమయుడు కర్మముల సృజించెను ఽ వేదపఠనంబు విప్రులు గొనఁగా
వేదధర్మముల పోషింప నృపుల ఽ వేదిత కృష్యాదికముల వైశ్యుల
సదయు నందరిన్ని గాంచ శూద్రులను ఽ నుదితమనస్కులగా నాజ్ఞ యిడెను
యది విపరీతం బైన తా నవుడె ఽ గదియు నవతార మదిబాపు శక్తి
గను నిట్లు గాగ మనజీవనంపు ఽ ఘనుని పూజింత మదియు వచింతును
వినుడు మఘవుపను కోపం బనెదరో ఽ ఘనత మాయు తత్ఫలము తావందు

తన కర్మఫలము ఛాయ బోనిందు | ఁగున కేది బోవు మఖ్య మాన్యములు
ఘనత నేలు దేశముల నగరముల | జనుల మనుపనగు వ్యాపారంబుల
మనబ్రితుకు గూర్చు నీ గిరిరాజము | గనెదము పూజను హరిరూప మనుచు
వినదగు నిదియును గిరుల బ్రాహ్మణుల | దన కలిమి కొలది పూజింప గనుట
గననగు శుభముల యింద్ర యాగమున | కును దెప్పించిన వెల్లగూర్పు గన
దినశుద్ధిని గని పూజ నందింత | మనఘులార! నావచింపుబలు హిత
మనెదరేని తెప్పింపుడు సర్వము | మునుల బిలిపించి యర్చ లవి సెల్ల
గను భోజనముల పాయసంబులును | గన నపూపముల ఫలశాకములను
పాలు పెరుగు మీగడ నెయ్యి వెన్న | జాల గూర్చి మన మలర సకలురకు
మేలు బాగడు గన నధమకులు లాది | చాలుగ భుజింప జేతము ప్రియమున
మేలైన దాన దక్షిణలు గూర్చి | డాలంద గలము భూతతృప్తియగు
ఆల నలంకారము గూర్చినాడు | మేలైన ధాన్యముల దినిపింతము
అందరము బంధుయుతముగ మంచివి | గంధపుష్పాది భూషణములతో
అందె నలంకృతులము నగుచు మిగిల | పొందుల భాషింతము నాకు నిదియు
న్యాయ మని తోచె జనకా! పెద్దల | కీ యనువు బోల్ప టుచితంబ యేని
డాయ రందు సంభారంబులతో | పూయుం డలకులు కూర్పుడు మందల
అని నిలింపపతి లో మదము డింతు | నని దలపోసియు నాజ్ఞ యిడి నంత
ఘనత నటుగూర్చి భూసురుల బిలిచి | వివజెప్పి శుద్ధి నంది వేగంబు
గని స్వస్తిని పుణ్యాహవాచనము | లను జదివించియు దానము లొసంగి
వలసిన యట్లుగ భోజనంబు లిడి | తలుపు కొలది మోదముల కుదురంది
రల జలజాక్షుఁడు నొక వింత యందు | నొలయించె తెలియ విను జనపాలా!
తాను నిజరూపమున నందు వెలసి | పూనిక నొక శైలము రూపు నొంది
దీని గనుడు మన భక్తికి మెచ్చుచు | వేన మనమిచ్చు భోజనంబులను
దిను నంచు కామరూపము వెలయగ | ననువున నీ గిరి ధన్యమున మనల
గనునని తానే యదృశ్య రూపమునను దిన యందర నా యద్రికెనిక
ఘనత మ్రొక్కించి తాను నటుజేసి | ధేనువత్సవృషభాళి పూజించి
మన మీ శైలమునకు బ్రదక్షిణము | నొనరింతము వైభవమున ననుచును
గుఱ్ఱముల వేగమును మీరునట్టి | యెడ్డుల గట్టిన రథముల సిద్ధత
తొట్టుల మందల వత్సంబులతో | గుట్టల యార్పులు చెలగ శుభవాద్య
కలన నృత్యగీతముల నంగనలు | నలరున పాటలు బాడుచు ద్విజు లవి
వలసిన దీవెనలను తోడు గొనుచు | చెలగిన దిశలను గాంతులు నింపుచు

గనిరి ప్రదక్షిణ నతులాయద్రికి § కనె నింద్రుడంత వారి వృత్తమును
మనమున రోషము కలత గలుషించ § తన సన్నిధి సంవర్తక మేఘము
లను జేర బిలిచి విన నిట్లు బలికె § గను డా గొల్లలు పాల్పెరుగుఘృతము
లను దిని ద్రావిన పొగరున దూలుచు § నను గిరిభేదిని వజ్రధరుని గన
కను నొక మూఢుని బాలుని బెద్దగ § గొని గీటున నా యాగమును మాని
గిరిని పూజించి ప్రదక్షిణం బిడి § జరుగుచున్నారు వాడు కృష్ణుడట
పరిభవింపఁబడె నింద్రు గౌరవము § పర మందింతము గొల్లల మదమును
ఘనత కర్మమయ క్రతుమహోదధిని § జనవినుత జ్ఞాన పరవిద్యానావ
ననుసరంబునను దరింప నగుగా § కన దుర్మతి మూఢతను నుడుపముగ
దాట గను కొటుల నీ టడంపవలె § పీటుకొనుడు మీ పాటవంబు లవి
గొటంద బొందు బాట గనకుండ § ధాటిని గురియుడు మేటి శిలవృష్టి
ఘాటున గూడుదు కోటవలె మిమ్ము § నేటున పిడుగుల కోటిని బర్వుడు
చేటొందునట్టి పాటున పొల్పుడు § వాట మిదె పగకు చొటిడిరి వారె
కాటు జుట్టినటు వారి జీవముల § పీటు బుచ్చుడని పంపుచు సంకెల
లను దప్పించిన మహానిలంబులు § ఘనత తోడంద ప్రచండ గతులను
దనర మేఘాఘములు డాసి మండలను § మునుక నంద నినుని మరగించి
దెస లావరించి నిబిడతమంబును § వెస గూరిచి బలభంజనుని దైన
పసమించు రెండు నసెడి పాదమున § కసిబిసి నజాండ మంత చిట్లుగన
వెలి సముద్రములు నిర్ఝరము లనఁగ § తలపుల భీతిని బరవు నీటి ధా
రల నెడతెగకను గురియు శిలలచే § నలవిమించ బలుపిడుగులం బర్వ
గను మిట్టు పల్లములు సమతలమ్మ్రు § లును నేకంబుగ నిండి యంబుధిని
విను మందు రూపునను దోప నీదు § చును విలయకాల విద్యుల్లతలను
గన దీటందిన మెఱుపుల చూపులు § కనుల రిమ్మసొమ్మల గాంచు వేగ
లును నా లేగల మూతు లడ్డమిడి § యును ప్రళయకాల భైరవ హుంకృతి
ననుసరించు నురుములను చిందరల § గని బారుచున్న ధేనుచయంబులు
గన నా ధేనువులను వెనుకజేర్చు § కొని కాలరుద్ర కర గదాఘాత
లను నిర్ఝరముల ధాటి పోటు గని § వనమాలి చరణములను శరణమను
చును ఘోషించిన విధి నంభారవ § మున తలలు వాంచియున్న వృషభములు
వాని నొదలుకొని రక్షకు నిలిచిన § పూనికల గోప బృందములు శిలల
వానతాకుడుల తనువులు నలమట § మాన భ్రమానువడి నెలుగిడ లేకను
నిలువ నోపకను యున్న గోపతతి § లలజడి నొందుచు నడుములు సుడివడ

తలలు దాప నెడలేక వడకుచును 〡 జలజనయను గోవిందుని జీరుచు
చలిత ధైర్యముల వాపోవుట గన 〡 నల వారి కఠిన కుచకలశయుగళ
మును మరుంగుగొని శిరములను దాపి 〡 పెను రోదనముల బరగు శిశు సంతు
లును నటు గాగా గోపవృద్ధు లా 〡 ఘనుని బకాంతకు జేరి శ్రీకృష్ణ!
నందనందనా! గనుమా దయవడి 〡 నందకున్న నీ మందల గతియే
చందమొ తెలియదె యింతదనుక నీ 〡 వెందుంటివి జగదీశుండ వహో!
ముందెటిగితివా నింద్రుని కోపము 〡 తందరలు నిండె మాకిక బ్రతుకుల
నందింప నీవె గావే మాధవ! 〡 ఇందు కేది సంధించెదొ యుపంబు
ఇందు గన్నట్టి విపరీతవృష్టి 〡 ముందుకాలమున గనలేమ మేము
పెనుభయము నించె నుఱుములు మెఱుపులు〡వెసుకొనె పిడుగులు శిలావృష్టియును
గనవ కృపగనవ మనుపు వేగంబు 〡 మును నిను గంటిమొ దావాగ్ని నార్ప
మము రక్షించుట నీరజనయనా! 〡 భ్రమ వారింపుము ᒥమొక్కులు గను మన
విమలు డవ్యయుడు విష్ణువు కృష్ణుడు 〡 క్రిమమంత నెరిగి గర్వభంగంబు
గనజేతు నింక నీమఘువు ననుచు 〡 కనలి సురల మరి యదితిని దలంచి
మనికి జెరుప వలదిదె చాలు ననుచు 〡 మనము కొంత శమియించ నవ్వుచును
వినుడు పర్జన్యు డిపుడు కినుక గొని 〡 తనను యాగమున పూజింప రనుచు
మనల శిలావృష్టిని ముంచె నన్న 〡 తన మదం బడచు టెరుగడు కానడు
పరుల యున్నతిని తా నవమానము 〡 పరతగొను నింక వెరవకుడు మీరు
పరమేశ్వరుండు కరుణించు మిమ్ము 〡 వర ధేనువత్స వృషభ సముదయము
లను బాయనీక మీరు మీతరుణు 〡 లును శిశుసంతును భద్రము గాంతురు.

-: గోపాలకృష్ణుడు గోవర్ధన పర్వతము నెత్తుట :-

అనుచు కరమ్మున నొకట గిరినెత్తె 〡 మును కిరియై ధర పంట నెత్తినటు
సరసిజ ముకుళము కరి యెత్తు కరణి 〡 హరి వరదుడగుచు నద్దాని క్రిందు
త్వర గని సేరుడు మీరని నుడువుచు 〡 నరవరా! బాలు డాట వూగుత్తి
గొని ఛత్రమనుచు మీదికెత్తినటు 〡 వనజాక్షుడు గోవర్ధనగిరిని
తనహస్త పటిమ మిన్నందించియు 〡 కనగ బాలుండు పొట్టి తా నయ్యు
పొడుగెంతో బలము ధీరత లెంతో 〡 కడు చోద్యంబున బ్రహ్మాండధరుడు
వడిని భువనముల దాచెడు మేటియు 〡 జడుపుదీర నన జడి గీటు పుచ్చ
ధరించి తల్లీ! రమ్మా తండ్రీ! 〡 కరంబు సుఖమింట రండు యందరును
పరంబు గొనుడీ గిరి చాల పొడవు 〡 నిడివి గల దిందు నెమ్మదిని గనుడు

నిందు ధృతి గనుడు యిందులోనుండి § కొండ పెద్దదని కలగుడు నందకు
అండరూప బ్రహ్మాండంబులు పైకనండగొన్న నా కే లల్లాడదు
అనిన వారు సందేహము నందక § మనమున మోదము గుమురుకొన జేరి
కనిరి సుఖస్థితి నిమ్మలను గనుచు § జననాథ కృష్ణు విలోకనామృత
రసవృష్టి నాని యాకలి దప్పుల § దెస నాసింపక కృష్ణులీల గని
యసమానశక్తి యుతుడితడు హరియె § వెస మనల గావ నిటు ధర బుట్టెను
నయ వినోద మిది యా యింపునకును § భయము దూరంబు హరి దాపుగాంచి
జయమున నాపద గెంటితి నంచు వి§నయమున కృష్ణు వినుతులను నింపిరి
రాజీవ నయను కరమున శైలము § రాజీవము చాలంద మేఘములు
రాజిగొన్న మధుకరముల బోలెను § రాజ ! సప్తదినములు గడచె నిట్లు
గిరిభేది విసికి హరిచర్య వినుచు § త్వర గాంచి మరలె మేఘయుతంబుగ
కర మైరావతమును తరుముకొనుచు § పురముచేరె కనరాగ తా నుండె
పరముడు కృష్ణుడు వారి నందరెని § వరుస నిల్చె వర్షమునీరు దలగె
కరములెల్ల దిగ నభ్రితల మమరి § తరణి ప్రభలు దిశలన్ని ప్రసరించె
వెలికి జనుం డని యందరు బహిరా § జలదవర్ణుండు గిరిని యప్పటిని
నిలిపి తా నలరె వల్లవు లెల్లను § పలుపలు విధముల నుతు లొనర్చుచును
కౌగలించి దీవించి రెలమి గని§ యా గోపవనిత లెల్ల నేస లిడి
యా గోవిందుని దధ్యన్నకబళ § యోగమందించి యాశీర్వదించి
రంత నంద బలభద్ర రోహిణులు § సంతసమున మరి యశోదయుతముగ
నెంతో ప్రీతి మిన్నంద కౌగిళ్ళ § సంతరించి రా బాలగోపాలు
సురపతి నానతి గొని సురసిద్ధులు § గరుడ గంధర్వ విద్యాధరాది
వరులు పువ్వుసోనల విష్ణునిపై § బరపిరి జయ తూర్యంబుల మింటను
వారందరు తమ గోష్ఠప్రదేశము § జేర నరుగుచును వెన్నుని బాడుచు
ధీరత కోరిక లెల్ల ఫలింపగ § మేర గనిరి వైభవత నిలయముల
నరనాథ ! దొడ్డమతిగల గోపక § వరులు నందునిఁ గాంచి యిటు లనిరి
కరము చోద్యమగు గోపాలబాలు § డరయ కృష్ణుండు హరి యగుట నిజము
కనులు విప్పి నిప్పకనె పూతనను § చనుబాలు ద్రావునెపమున చంపెను
కన మూడునెలల బాలుడై బండి § దనుజాని పదమున జెండె దండివలె
వానికి నోమాను సుడిగాలియైన § దానవుని మెడను వ్రేలుచు దునిమెను
యా నాటికొక్క యేడు బాలుండె § యా నవ్య కోమల నయనుని జననియు
తాట రోలం మణికట్ట మద్దులను § గిటె నోలి బహు నావుల గాయుచు

మాటుగొన జంపె వత్సాసురు నటు ఽ మేటి వెలగతో బాది బొలియించె
ఖరుని సబలుడై జంపె చిత్రముగ ఽ వరమతి బలభద్రుడును నల్లె
ధరణికి బలిగా ప్రలంబు గూల్చెను ఽ వరుస కాళియుని నిలయము బాపె
దవ దహనంబును మ్రింగెను త్రుటికను ఽ కనుమూసినంత లోన చిత్రముగ
భువి నేడేడుల నీనాటి గిరిని ఽ జవము జతనంబుగా నెత్తి మనల
దవిలి రక్షించె వర్షంబు నుండి ఽ భవవందితు డీ బాలుడు విష్ణువు
నగు గాద యిట్టి యద్భుత శక్తుల ఽ జగదీశు పరము ననువందియుండు
జగతి నవతారమందె గాబోలు ఽ నగధరు డిపు డా మందరధరుడగు
ననిన వారి వినిపించె గర్గముని ఽ తనకు ముందు నాటను దెలిపినట్టి
వనజనయను వృత్తమును సర్వమును ఽ విను డీత డీశుండా నగు నిజమా
తనయు డితడె యవతార రమాపతి ఽ యనఘుల బ్రోవగ నిటు విహరించును
మన మితని నీశుడని నమ్మవలయు ఽ నని నందరటుల నుతి నతి సలిపిరి
హరిహయుడు కృష్ణు మహనీయమ్మును ఽ కర మద్భుతంబు వెరగు నింపగా
సరగున మందారపు సుమంబులను ఽ కరముల ధరించి దివినుండి భువికి
త్వర గని దారియు ధర దుష్టహరణ ఽ మరసి జనించిన హరిని జగత్ప్రభు
సరసిజసంభవ వినుతు శ్రీవరుని ఽ సురుచిర గాత్రుని సుందర వదనుని
కరుణామయునిఁ కనక చేలునిఁ ఽ దరహాసిత చంద్ర కిరణ యశోధను
నాదిమూర్తి నచ్యుతు నారాయణు ఽ నాదిత్యతేజు ననంత వాచకు
వాదభేదముల పాదును నెరుగని ఽ భేదమాన్యు నిష్కాము లోకనుతు
మోదమున గాంచి సుమములు పదముల ఽ మీదనుంచి పూజించి మ్రొక్కుచును
కరయుగమును జోడించి వినుతించె ఽ నరనాథ! వినుము ఇంద్రహరిస్తవము
పురుషోత్తమ! నీధామమ్ము సత్త్వ ఽ పరము శాంతంబు నగు రజస్తమము
లరయ లేవందు నిత్యము భద్రము ఽ వర తపోమయము మాయారహితము
నిరతానందము సత్యశేఖరము ఽ వరదాయకంబు నీపరం బదియు
గా నిర్గుణుడవు నిర్మలరూపివి ఽ దాన వికారములగు షోడశంబు
పూనిక నందవు పుణ్యధానమవు ఽ యో నళిననాభ! పదారుకళలను
భాసురమునందు అచింత్యభావత ఽ వో సత్యాత్మా! సచ్చిదానంద!
భాస్వంతనామ! పాపదూర! శ్రీ ఽ వాసితవక్షా! పరమేశ! కృష్ణ!
నీచరిత మద్భుతము దెలిసినాడ ఽ నీచమతి గొంటి నిజ మరయలేక
నీ చరణంబుల డాయ వచ్చితిని ఽ యోచన గొనుచును తత్త్వంబు గాంచి
తిని దేవా! నీ వఖిలాంతరాత్మ ఽ వును జ్యోతిస్సువు తత్త్వము లన్నిట

గన తేజరిల్లుచుండు వాని కవల § దనరు తత్త్వంబు నీ స్వరూపముగ
ఘనులు కొంద రభిరతిని సలుపుచు § గన రభిమానము కామాదిరిపుల
రోయనరు మాపుదురు నిష్కామ సురియ § ననువంద దాల్చి వాని పెంపులను
మోహాలతల మొదలంట గోయుదురు § ఆహవవీరుల వలె వాన విజిత
సాహసదీప్తిని దనరుదురు వారు § శ్రీహరీ ! నిన్ను నిట్టివా డనుచు
మదిని నరయకను మానవమాత్రునిగ § దలచి క్రోధమునుం గొని తప్పును
గుదికొను నీదు మేర మెలంగెడు § ముదిత మనస్కుల బైద రందించితి
మదము నను వీడె మాధవ ! నీ దయ § బ్రతుకు సార్థమున బరగింప జూడు
ఇదె వందనముల శతము లీశ్వరా ! § విదితవేదాంత ! వాగ్విలసన ! శ్రీ
నివాస ! సర్వేశ్వర ! నే మధుకర § భావచర్య నీ చరణాబ్జమ్మున
నవారితంబగు పావనతమంబు § నావర్ణింపగ ధ్యానమరందము
నాన నిలుపు నీ భక్తిని స్థిరముగ § దాన నాదైన పదవి భవ్యమగు
నేను నీయాజ్ఞ మెలగుదు నెప్పుడు § మా నిత్యవిభవ మంతయు నీచే
మానింపబడినదే గద కేశవ ! § నే నది మఱవను క్షమింపు మని మరి
చరణముల నతిని నొనరుప హరి యటు § పరమ దయ బలికె నింద్రునింగూర్చి
హరిహయా ! నీవు వైభవ మదమున § పరివేషమంది యుండుట దోపగ
కరము నీబోటి కది తగ దనుచును § పరిభవసూచక మగుటకే యట్లు
నీ మదాంధతను బాసి ప్రకాశము § నామ గనెద వని నీ చేష్ట లుడుగ
నా మహిమ జూపి తింతే తెలియుము § నా మేటిభక్తజనుల దుష్క్రియల
నీమెయి మలపుదు యోగహీనతకు § సామము దొలగకు నను జింతింపుము
నను పరబ్రహ్మ మనియె నమ్ముమా § గను మిక నెలవును నిరభిమానమున
ననుకూలభావమున త్రిభువనముల § ఘనత పాలింపు మని యాజ్ఞ నిడిన
సిత కరి గమనుడు బ్రతుకు గంటి నని § మతిని మోదమున యతిహృదయ గతుని
నతి సమర్పించి వెత దొలగి నిర్మ § లత నుండునంత స్తుతిని విధిపంపు
నను కామధేను వట జేరె గోవు § లను వెంట జుట్టుకొని రాగ నంద
తనయుని గృష్ణుని విశ్వంభరునిన్ § గని నమస్కార మందించి పలికె
వనజేక్షణ ! నిను పరమదైవమును § ఘనుని నింద్రునిగ నభిషేకింపగ
నను బంపించెను ధాత యా పంపు § నను రాక సర్వమును సంపన్నము
ననుబొందియున్న విధి ముహూర్త మున § వనజనాభున కలంపుతీర్థముల
పరమహర్షమున నభిషేకించగ § వరమతి నింద్రుడు సురభిక్షీరముల
సురల విజయ తూర్యములు మ్రోలంగగ § వరుస నారదుడు తుంబురు యుతముగ

గాన మొనరింప గంధర్వవరుల ǂ మానిత గీతముల నప్సరసనృత్య
మానతరంబుల చారణాదు లవి ǂ ధ్యాన వినుతులను ననుకూలమైన
సుమవృష్టి బర్వ జగంబు లలరగ ǂ క్రిమత గోగణము క్షీరములు గురియ
విమల జలమ్ముల నదులు ప్రవహింప ǂ నమిత కుతుకముల మునిజనుల నొనరు
తరులు లతలు గిరిప్రదేశములును ǂ సరసపుష్పఫలపత్ర భరితములు
కరము శృంగారవన్నెల రాజిల ǂ ధరణీసురల సమ్మోదములు దనరెను
పరమాత్ముం డట వేదధరణ సుర ǂ వరధర్మశీల సత్యాదిరక్ష
లరసి గోగోప గణములకు నధిపు ǂ డురుతరయశంబు నంద నభిషేక
మందిన తరుణము నందు పొం దమర ǂ నందమున నింద్రు డానందంబున
నందసుతామర వందితసద్గుణ ǂ బృందబృందావన విహారి ! హరీ !
సుందరవిలాస! సురుచియశోధన! ǂ ముందు భవములం దింపని దయ గను
మందులు పాపమతులు దుష్టులెల్ల ǂ సందు గొందు రా నిన్నొకపరి గో
వింద ! నృహరి వాసుదేవ యనగనె ǂ చెందుదురు నిరయగతి దప్పి ముక్తి
పదమని నుతించె కామధేనువటు ǂ గదిసి వినుతించె వారి కాన తిదే
హరిని మరి మరియు గనుచు వారేగ ǂ మురిపెమున కృష్ణు డట సుఖ ముండెను
నరనాథ! యీచరిత విన్న నెల్ల ǂ రరయ భద్రముల నందుదురు రెంట

## —: శ్రీకృష్ణమూర్తి నందుని వరుణనగరమునుండి గొనితెచ్చుట :—

విను మొక యేకాదశినా డధిపా! ǂ ఘనుడు నందు డుపవాసము నుండియు
దనుజవేళ యని యెరుగక వేకువ ǂ యనుచు యమునలో గ్రుంకిన నప్పుడె
నతని బట్టి కొనిపోయి వరుణునకు ǂ నతి నిడి యిచ్చెను దానవుం డొకడు
మతి వెఱగందుచు నాతని జుట్టిన ǂ మతి విశారదులు రామకృష్ణులను
పిలిచి రార్తి దమ పేరెలుంగులను ǂ నల మాధవుండు నిజము గురు తెరిగి
జలము సొచ్చి యోగమున వరుణు గన ǂ తలరుచు నెదురుగ డాసి శరణమని
జలధిపతి జలదవర్ణు చరణముల ǂ కలత బాపి మ్రొక్కుచు నిట్టులనియె
దేవ! దేవేశ! నా భటు డొక్కడు ǂ పావనుండైన నీతండ్రిని నా
తావున జేర్చెను క్షమింపవలయును ǂ నీవు సర్వమయ కాలమెరుగుదువు
నీవలని మాయ మమ్మావరించె ǂ కేవలము మూఢమతులమో యీశ !
స్థావర జంగమముల వెలయు దీవు ǂ భావము శుద్ధము పరమాత్మ! నీకు
పావనుల జేతువా నిను మ్రొక్కిన ǂ నీవలని దురితసంతతిని బెఱిగి
నట్టి వారలనె దయ పెద్ద జూచి ǂ నెట్టుగొన్న కర్మముల దొరలించి

పట్టున నమృతపదమ్మును మెట్టగ ఽ మెట్టు బొందింతువౌ పరమేశ్వర !
అట్టి నిన్ను భువనాధిపు మాటికి ఽ పట్టుగొమ్మ వగు నిను నిట గంటిని
దట్టి సుకృతపూర్వంబు నీసేవ ఽ నెట్టితి దురితము నీతండ్రి నిదే
గాని వేంచేయుము నా నొప్పగించి ఽ ఘన మోదము తా నందె కృష్ణుండు
జనకుని దోడ్కొని వరుణు మన్నించి ఽ మనముల గోపకు లలర దరిజేర్చి
వార లతని గని యీశ్వరు డితడని ఽ సారభక్తి నతి జేసి ధారణను
బారుచు నిశ్చలమున గురి నిల్పిన ఽ వారిజ నయనుడు వారికి ప్రకృతిని
దూర మొందింపు దృష్టి దయగూర్చి ఽ మేర మాయావిదూరమయి నిత్య
మై విశుద్ధమయి బ్రహ్మంబ సత్య ఽ మై విజ్ఞాన ప్రద్యోతన మగు
తా విశ్వరూప సంభూతి నంత ఽ యా వనితాతిలకంబు యశోదకు
ముం దక్రూరునకును జూపనైన ఽ ఇందుశేఖరాభ్యర్చితంబయిన
పొందుగన్న మూర్తిత్వము జూపెను ఽ ముందట పుణ్య ఫలంబు వా రంద
యుందరు హరి పూజింపుచు నిత్యము ఽ మందలో సుఖముండిరి వినుమా
నిండు మనమ్మున రుచిగల భోజ్యము ఽ విందు వీనులకు సుధరసము గ్రోల
విందు కనుల కా విష్ణువు రూపము ఽ విందు లేని భవరోగముల మందు

—: శరద్రాత్రిం గానమొనర్చు కృష్ణుని సన్నిధికి గోపికలు వచ్చుట :—

నరవర ! వినుమా శరద్రాత్రులకు ఽ వరుస కళలట్లు చకోరములకును
కరము సుఖమందు భోగకాలములు ఽ సరస్సులకు కలువలకు ప్రియకరము
లగు జారుల దుర్దశ లొక్కపగిది ఽ నగవు మొగమ్ముల నాడెను తరుణుల
బిగువందు మోహాతమి గూర్చు నవియు ఽ తగవున శశికిరణముల పెంపు లవి
గన కామతంత్రి శీవి కలువలకు ఽ ఘనమైన జోక కందర్పధాక
గన నటి విటులకు గల తాల్మి పోక ఽ దను గూర్చు చరిత మాచక్రవాక
ములను గూర్చు భూలోక సంప్రీత ఽ మల చంద్రరాక యా నిశియు రాక
తరుణి నొసల పతి యనురాగపరత ఽ వరముగ కుంకుమము న్నలదుమాడ్కి
పరమందె ప్రాక్సతీవదన మట్లె ఽ సరణి శశికిరణ సంభూతి నందె
అదురు విటసేవకులకు గూర్పవచ్చు ఽ మదనుని గుడార కనక శిఖర మన
మదిని ధృతి లతల కాముకుల ద్రెంప ఽ నది కాముచేతి చక్రంబే యన
మారుడు విరహులమతి జ్వలింపగా ఽ జేరిచిన పెద్ద నిప్పుల కుప్పన
దారిని పాంథమృగమ్ముల మదనుడు ఽ పారమంది వేటాడంగను నా
తీరున గానగ దెచ్చినట్టి యా ఽ మేటి వెలుగు మోహనపు దీప మన

వింత నునుపు వృత్తమ్ము యరుణంబు ౯ సంతరింప మతి కాంతి యుతంబును
సంతసము చోరులకు నిండ్లకేగు ౯ వంతున గాగా పొడుపు కొండపై
కెక్కె నెల్లరుల మరులారి నిక్క ౯ చక్కని కుంకుమ సంకితమునందు
అక్కజము నింపు మా దేవి ముఖము ౯ చక్కని కాంతిని చంద్రమండలము
వనజనయను డది కాంచి యమునదరి ౯ ఘనత నిలచె నొంటరిని వేణువున
వనజభవానంద గీతమును నా ౯ మునిజనులను మోహింపగ బాడెను
విని రా గానము గోపికాజనము ౯ లను రాగ మోహా పరవశలగుచును
కల పంచ భల్లు భల్లంపు మొల్ల ౯ ముల జల్లులందు పెల్లుల తల్లడ
ముల ఢిల్లుపడుచు నా పురుషోత్తము ౯ వలచి వలను గన వెలువడి రెట్లన
జలధర మధ్యమునుండి వెలువడిన ౯ విలసిత విద్యుల్లతల చాలునను
యులుకు గనక విన రెవ్వరి పలుకుల ౯ తలిదండ్రులు పతు లన్నదమ్ములును
యల వృద్ధు లత్తమామలు బిడ్డలు ౯ నిలుపుటల నాగకను పనుల విడిచి
చిత్తము లచ్యుతు సన్నిధిని డాయ ౯ తత్తరము తీవగంబును బొందుచు
మొత్తముల గొనుచు గోపజవరాండ్రు ౯ సత్తువ కొలదిన పరువెత్తి నిండ్ల
వెలువడు నప్పుడు నాలలన లెల్ల ౯ తలపుల చలనము నిశ్చలమునో
యల గోగణముల పాలను గొనుటకు ౯ నల లేతదూడలను చేపుకొలకు
ననువున విడిచియు విడిచి విడువకయు ౯ గనగనె బాలను పిదుకుట యందున
వినుము పితికియును పితుకక యట్లునె ౯ గొనిన వాని కాచుటల గలయట్టి
పని కాచి కాయకను నవి దించుట ౯ లను డించి దింపకయు నా పాలు
బాలురకు ద్రావ బోయు వృత్తమున ౯ పోలిక గన పోసియు పోయకనే
తా లలనలు తమ పతుల సేవించు ౯ నాలవాలమున నవియును మరచియు
తలల ముడి వదల ముడిచి మూడువకయు ౯ అల పయ్యెద లవి జారుట దలపక
లలి గొనరు భూషణముల దాల్పంగ ౯ వలగొనరు హారముల చిక్కుదీర్ప
జలజాక్షు నెపుడు జూతుమో యనుచు ౯ కలకంఠులందరును చాల్లు గొనుచు
గోవిందదర్శనము గోరి వచ్చి ౯ పావనమూర్తిని గాంచి రా యమున
పావనతీరము నందు శుద్ధతలి ౯ కేవలవిలాస నెలవు తనకు గా
నిలిచి యానందభావ మెలయంగ ౯ నలరున మురళీగాన విలోలత
ననురాగ వీక్షణముల తముగాంచు ౯ వనజనేత్రునకు వరుసన మొక్కుచు
కనుల నామూర్తిని రమియింపగ ౯ వనిత లటు నిల్చి యుండ గోరుదురు
ఇలు వెడలగ రారాక నందులకై ౯ అల మరుబారిని మరల్చ నేరక
తలపు హరిమీద మోహమున గూర్చి ౯ జలజాక్షు ధ్యానరూప సంగతిని

గని తమిక్రీరగ ముదమున కౌగిలి § తనివిదీర చనువంది రమించిరి
వనితలు జారుని వలె కృష్ణునెన్ని § కనువారు గలిసి గుణమయ దేహము
నభిమాన ముడిగి యా విష్ణుపరము § నభిరుచి నందగ ధన్యులై రనిన
జననాథు డనియె శుకుని మహాత్మ § వనితలు కృష్ణుని జారుం డనియే
కని రంటివె ? ధన్యంబె యది యెట్లు ? § ఘనుని పరమేశుడని గొల్వరారె
మనము సంశయమును దీర్పుమనగా § జనవరుండైన నభిమన్యుతనయు
విన జెప్పె నిట్లు వినుము మును జెప్పి § తిని చైద్యుడు తా విరోధి యగుచును
గనెను ముక్తి యా కామిను లందరె § ఘనత గలరు హరిపైన వలపుగొన
వినయమున మొక్కి పూజించి యిష్ట § మున కేళి సలిపి నట్టి కామినుల
కరయ ముక్తి యలవడదె సంశయపు § వరుస గననేల యే విధినైనను
హరిని దలంచి మనమున నిల్పి రేని § పరుసగొని వారి తన పదమొసగును
పగనైనను బాంధవమున నైనను § వగనైన కామమున నైన ప్రీతి
తగవున సఖ్యత నైన తపాదుల § నగధరుని భక్తి యన్నిట నొప్పును
జగతీనాథా ! యా దేవమయుడు § సగటున నభిమానము దొరగి తన్ను
తమకంటె వేరు గని నుతించినను § క్రమమున సాత్విక సరణి నందుదురు
జనన జరామరణముల దన కలిమి § యును లేమియు సుఖదుఃఖసంతు లి
ట్లును హర్ష విభ్రమాశ్చర్యమ్ముల § గనుట లాది నరభోజ్యము లవన్ని
వనజనాభు లీలలను నిశ్చయము § నన నచలితమతి హరిపై నిలుపుము
పరమాత్మ పురుషరూపముగానే § కరము భక్తి సతిపోలిక ఋషిగణ
మరసి బల్కరది నిర్విచారంబు § వరుస పతి సన్నిధిని కాంత యెటుల
మనము తనువు ప్రాణమును మానంబు § ఘనము తన్నంద మరుగును గూర్పరు
విను మేలు దాచినను నీచమె గద § ఘను డీశ్వరుండు అట్టిపురుషుడగు
మునివినుతు డతని పరనిత్యసుఖము § నను జేర నిశ్చయముగొన్న వార
లును నాగులవలె భక్తిని వలంచి § యుః దావదహనమున దప్పి బారు
వనమృగముల వలె శాపత్రయముల § ననువున దొలంగ వలె నిర్మోహత
గనవలె నీశుని భువనపతి విష్ణు § ననఘు నిరభిమానుని నాదిపురుషు
గను నిచ్చల నభిమానం బుడిగియు § వనితలవలె జిజ్ఞాసభావమున
జనవర ! చిత్సుఖమూర్తి ననంతుని § దనర భావించి సర్వమ్ము నతని
పరమైన కళలె గాదా భూతము § లరయ సకలంబు నాతని రూపము
వరమంద వేరు భావింప జనునె § సరణిదప్ప నేమరినట్టివారి
పరము భేదంబు గనడు లోకేశు § డరసి తనయందె యైక్యం బిచ్చును

విను మింక సర్వసాక్షి సర్గాది § కి పంచవింశతి తత్త్వసంజాత
మునన్నైన వానిలో నంతరాత్మక్రీడన దగినవాడు సకలము రమించు
నత డావనితల రమించె ననగా § మతి జింతింతు వదేల మాధవుని
సతతరూపంబు మనల రమింపదె § సతులభావంబు మనయం దొప్పదె
వనిత లట్లు జిజ్ఞాసువు లగుచును § ఘనవిచారమున బంధముల వదలి
జనని జనక సుత వనిత పతులాది § ధనపశువ్రాత పదార్ధ సంగతి
మనకేల యస్థిరముల కర్మముల § నొనరు లివి యేల నని యెల్ల విడిచి
పరముని పరేశు కృష్ణు జగద్గురు § కరము భక్తి రమియించిరి కరుణను
తరుణుల తమదా విమలనేత్రమున § పరు డితడు గాడు పతియె నిత్యుడని
తమ మాన ప్రాణ తను మానసముల § విమలుని నమ్మిరి విజ్ఞానవశత
క్రమమది పూర్వతపంబు పేర్మియగు § సముచితంబున నవ్వలి కథ విను
ఘనమధురగీతి విని చెంతనున్న § వనితలను జ్ఞానబీజహృదయులను
గనియు నా సుగుణి న్యాయనేర్పరియ § వనవిహారుడగు హరి వారి కనియె
వనిత లీ నిశిని డాయ వచ్చితిరి § మనము ఝల్లు మనె మంద నే భీతి
గనరయె బారగ గతమేమి ? సర్వక్రమును కుశలంబె క్రూరమృగంబుల
కును సునికిపట్టు వనితసంచారక్రమునకు నర్హంబు కాలంబు గాదు
మిము జూడ నందు నెమ్మది గనరయె § విమలాంగులార ! భ్రమల గూరితిర
కొమరొప్ప మీరు వెనుదిరిగి యిళ్ళ § క్రమమున జేరుడు శుభ మొదవు మీకు
మీ రిటురాగను మీ వారెల్లరు § మీరిన చింతల బరికింతు రెంతొ
నారులకు దగునె తోడు గొనకుండ § జేరరా యువిదలార ! సాహసము
గాదా ! గంటిరి చాలు చాలింక § నాదరింపదగు నా నియమపు మ
ర్యాద మీ రందవలెను నిలవపుల § గా దీ చర్యలు మగల తలవంపు
లను గూర్చి యత్తమామలను నొప్పి § గన జేసి బంధుజనుల వినబుచ్చి
విన జారవాంఛలను బుద్ధివిలిపి § నను కులాంగనలు మెత్తు రెటు బుధులు
మీరు సత్కులాంగనల చాలంది § బారు డిపు డిచట నాలసింపంగ
మేరదప్పు లోకంబు ధర్మగతి § ధీరతల నిటుల గోలుపుత్తురే !
మారవికారము నంద హితవగునె ? సారమతులు నీచతకు నొత్తురే ?
జీవితేశు డరిగిన జీవహాని § భూవరుడు దండనము గూర్చు మామ
కేవలమును దూషించు పలువ యగు § నావిధి దలవరి తలిదండ్రులకును
తలవంపు లివియె పొడుచు నేరాలు § నెలత లిటులుగా తనయులు నాదర
ముల దూరమెంతురి చుట్టములు వెలిని § నిలుపుదురు హితులు చుల్కన జూతురు

ఇతరులు రోతల కూయుదురు సతుల § గతు లిటు సుఖముల యశముల నందము
వెతకినను లేదు బ్రతుకు రుచిగాదు § మతి కేవగింపు నతుకు నిరయంబు
పతిమతి హీనుడు పామరుండైన § సతతము దుష్టరతుండు బడుగైన
యతడు రోగి జడభావుడు కురూపి § వెతగూర్పు వృద్ధు వికలాంగుడైన
వలదు విడువదగ మగని సన్నిధిని § లలన లెల్లరకు విధివిహితధర్మ
మిలన దూరు మీపాల నెడ విడదు § అలరుగని పొందు బిడ్డలపాలను
గుడుపుడు గోవుల మనుపుడు పతులను § బెడువు గనని సేవలను గొల్వుండు
కడు భయంకరపు యమునాతటమది § కడిది తరులు పొద రిండ్లు ప్రబ్బునది
హరి వృకసంచారము క్రూరసర్ప § పరిసరము లిందు మసలుటయు దగదు
హరిమధ్యలార! నను గంటి రదియు § వరుసన మందిరముల చేరి నన్ను
వినుతి గానముల జపమున వినుటల § ననువందిన ధన్యములు మీము జెందు
వినుడో మానవతులార! శీలము § ననువర్తిల్లుడు పతిభక్తి నిగుడ
గనుడు పెద్దలందరు మెత్తురు మిము § జననింద్యమ్ముల నుడిగి నడు డనిన
లలనలు విరహానల జ్వాలల చా § లుల వెడలు వేడియూర్పుల ముఖముల
వెలుఁకలు వాడ కనులజారు క § జ్జల ధారలు కుచముల మీద జార
నలదిన కుంకుమ గంధాదు లురల § అల చెక్కుల జేర్చిన కరతల వే
డిమిని వదన కమలముల కళమాయ § సుమశరునిపైన ప్రామిల్కి పొల్లు
దమ డెందములను తాప మిడగ దై § న్యముఃలు సన్నముగ దుఃఖభరమ్మున
భ్రమలు నుదువులను ద్రోప త్రొడిబడుచు § క్రమవిరుద్ధముగు శ్రీశుడగు కృష్ణు
పలుకులు కలవరమును గూర్ప చెలియ § లలరు లోలయ లనుకూలము లెట్టివో
తలప మనభాగ్యమెటుల సిద్ధిదమొ § అల వల్లవ నిటు వినుతింతమనుచు
ధ్యానమంత నా పురుషోత్తముపై § మానస విశుద్ధిమానం బెసగగ
ఓ నలిననయన! మానాథ! కరుణ § గానవ గావవ! కల్యాణమూర్తి!
ఓ నళినభవా ద్యమరవందితా! మా § నర్మిలి నీ చరణాబ్జములను
మాన మందింప గానవచ్చితిమి § మానితసజ్జన సారపూజితుని
శ్రీరమేశ నిను క్రూరుడంచనగ § నేరుతుమెట్టుల నో మనోహరా
కార! మా మారుతాపము హరింపు § చారుమూర్తి! పీ వని నాదరింతు
వని నమ్మినాము మక్కటు సర్వము § వను నిండ్ల మజ్జగించితిమి చెచ్చె
రను గాంచియును నవి మా కేల యనుచు § ఘనమతి నీదగు దివ్యమును గూర్చు
మురళీనాదము నాలకింపగ నె § తరమండ్రి లజ్జ నవల బోదరిమి
పత్తప నీసరణ నిర్లజ్జ సర్వ § పరిహార న్మూర్తి నిలిచి మావలపు

తలపు లిగురొత్త నిప్పు మా మనమును ❀ నలర రమింపగ రమణతను నీవు
లలనల ముముక్షుసక్తుల చిత్తముః ❀ వలగొన కరములు గీల్కొన శిరముల
వినుతి నీకరుణ పాలింపు నందు ❀ ఘనత నిత్యమోదంబు నీపొందు
గోరి కాక యిది మాధవ యిక విను ❀ సారసుఖము గననేరము మందను
వారిజనాభా! పతులబంధువుల ❀ కూరిమి వికారగతుల బంధములె
యో రమణా! నీ యంగసంగతివి ❀ జేరి యంకమున వసించు నందము
దారత మది మా విరహతాపంబు ❀ దా రందించును నమ్మితిమి కృష్ణ
నీవు పతిపుత్ర బంధుహితాదుల ❀ కేవలంపుమతి గూర్పు నడవడుల
పావనధర్మమటంచు బల్కితివి ❀ భావజసుందర గాదనము అదియు
దేవ! నీవ పతిబంధుహితాముల ❀ త్రోవలు పెక్కులు గాగ భాసిలుచు
భూవలయపతివి ఆత్మారామత ❀ కేవలము మాకెగాదు సర్వమున
యీవిధి పతిసుత భావముల ప్రకృతి ❀ దేవులాటగని భావింప నిన్ను
చిత్తమున భర్తృవాంఛ నుత్తమము ❀ పొత్తవి నిను సంస్మృతి హరుని నిత్యు
హత్తుకొన్న మోదమున రతిసల్పి ❀ తత్తరము నుడిగి తేజరిలుదు మని
గుత్తు గొంటి మో సత్స్వరూప హరి ❀ ఎత్తు దప్పింప కిపుడు మాప్రాణ
పతివి నిశ్చయము ఆ యిమ్ములెల్ల ❀ గతిని రిత్తయవు నవి యశాశ్వతము
నతుల దందు సౌఖ్యము నీకూడిక ❀ మతి తాపమడగు నేకాంతమందు
పతిసతివిలాస కేళీముదంబు ❀ సతత మందింపు మాలింగనమున
నిను బొందింతురే నీవిలాసంబు ❀ మనమున సహింతు రెటు నెవ్వారలు
గనరా జగత్పతి నెల్లరకు ననుచు ❀ వెనుదిరుగ బోము వారు నీత్రోవ
దిలకింప జెప్ప రట్టివారేల ❀ నలరుపింపార నీలీల బలుక
దెలియని వారిని సేవింపనేల? ❀ వలదు సంకటము వలచిన వారిని
కలయికను గూర్చి మలపుము దుస్థితి ❀ నిలయము గురుతర కరుణ పరమేశ!
నిరుపమానంద దాత! హృన్నేత! ❀ వరద! చరణముల నొత్త కరమ్ముల
వరుస నీయంగసుందర మరయగ ❀ వరమందుటకై మేలు నయనముల
హరి నిన్ను జేర రా మా పదములు ❀ పరముడ నీ చరితము విన వీనులు
మనమాదిగ త్రికరణముల నీసేవ ❀ ననయము దలపగ బలుక తిరుగాడ
నొనరందింతుము జీవంబు నీవ ❀ కనకచేల హరి మా జీవితేశ!
మేల మేల మా మనము దొంగిలియు ❀ జాలి నింపి యది దొలగంద్రొబ్బవు
నీలవర్ణ! తగవందితె? యిట్టుల ❀ పాలంద మరల బొమ్మన నేర్తువె?
శాంతియు చింత బాపు సర్వేశ! ❀ భ్రాంతముల జిమ్మ దరి నిచ్చి మమ్ము

చెంత జేరి మ్రొక్కితిమి నీవంతు § సంతసంబు నిను సమ్మతి నందగ
నెంతు మింతె వినయమ్ములు నేర్వము § పంతము గూర్పకు కంతుకేళి నీ
మంతనములు రంజిల్ల లాలించు § వంతున నీ పురుషోత్తమ ఖ్యాతిని
నిలుపుకొనుము శ్రీదేవ! మాదేవ! § జలజాసనాది సర్వదేవతలు
తలపుల నీపై వలపున సర్వము § లను నిన్నెగని శ్రీల నంది రది
దెలిసె నిను మతిని గూర్చిన యుష్మాకు § బలిమిని ద్రొబ్బకు చులకన గొనకుము
చపలమున నిండ్లవరుస లాదిగా § విపరీతమతివి విడిచి రనకు వే
సుపదాధీనా! యువి విడువకున్న § నిపుణత సెల్లునె? నిను గవయ దేవ!
భావము దెలియుదె? షడ్భావరహిత! నీవు కామదాయివి నానిజంబు
దేవాధీశా! శ్రీకాంత! నిన్ను § సేవింపలేదె? నీ చరణ రజము
గోరుచు తులసిని గూడ జేర్చుకొని § జేరె నీ వక్షమున వసియింపగ
నారులు మగలను మగలు వల్లభల § గోరుట లెందును లోక విదితములు
సారసాక్ష! మగవారి మాట లే § పార నొప్పుగా నారుల పట్టున
కూరిమిని కేలుజాపి కౌగలిని § జేరుపుము ముద్దు మాకగు కృష్ణా!
పరమానందము గూర్చు నీయధర § వరసుధ గ్రోలగ చెక్కులు ముద్దిడ
కరము నీముంగురు మా కరముల § వరుస చక్కనొత్తుచు నున్న మమ్ము
బిగువు ద్రోపగా రతిని గదియించి § జిగి నందింపుము మోదపు పొంకము
నగధర! నిను జూచిన చూపుల § తగ వందింపకు పెరవైపు ద్రిప్ప
వినుమ చెవులల్లే హృదయాదులల్లె § కనకరత్నమయములకన్న నిన్ను
కనికరము గోరి భూషింపు నంది § నిను మెచ్చ భోగ మందింతు మహా!
వనజేక్షణ! నీ వక్షస్థలమున § కవ మా చను మొగ్గలనాటి పెంపు
గను తొలుకు గాంచు ప్రేమరసంబున § దినదిన ముబ్బగ దీప్తి నిగుడుదుము
నీ దరహాసితము కనుదృష్టి మాకు § ప్రోదిగూర్చె నిక్కము కామ కోర్కె
రో దయానిధే! -ప్రీదు కరమ్ముల § మాదగు హృదయ తలముల దడవుమా!
రో పద్మాపతీ! లీలామూర్తీ! § మా పాలిండ్లను నీచరణమ్ముల
మోపవేని మా మారుని పరమ్ము § తాపసంతతులు ద్రోలగ వచ్యుతా!
నీ పదపద్మములను సేవింపగ § ప్రాపు నొసంగిన మా జీవంబులు
రాపిడి నందక నిలుచు గాదెని § త్రాపు పుష్కరాక్ష! యేమనో సద?
అంగమ్ముల నీ యాలింగనమున § భృంగములు పద్మముల నాశ్రయించి
సంగతి మకరందము నాని మురియు § రంగున చెలగుము గాంచగ నుందుము
కామజ్వరము [illegible] నాపదము § నీ మధురాధర సుధను శాంతించు

ఈ మరువిరహాబ్ధిని దరియింపగ § నీ మంజులరతి నావ వల్లభా!
ఈ మదనాగ్నిని నీ కేళివృష్టి § బాపెను ధూర్తము గాదె ప్రాణేశ!
ఈ మదనుబాణ వ్రణముల లేపన § మో మనోహరా! నిను ముద్దంమట
లనుచు పలుకులవి తడబడ చెమటల § తనువుల బొమ్మమ్ముల కను లొప్పగ
మనములు పరవశమంద మూర్ఛలను § గనుండగ దామోదరుడు వారి
నందర నన్నివిధంబుల హర్షము § నందింప దరిసి కేలుల గ్రహించి
సుందరకరముల హృదయములు తడవి § సందున గిలుగిలులను నొక్కుటలన్
చెక్కులు బులుముట చుంబించుటలన్ § మక్కువల నఖములను నురోజముల
చక్కని గుత్తుల నంచి చికురముల § ప్రక్కను దిద్దుచు పరిపరి విధముల
నిక్కగాంచ రతి నేలె స్మరతాప § మక్కజముగ మాయించె సుఖమొసగి
చుక్కల నడుమన సోముని పదుపున § నక్కుటిల కుంతలుల వెలుగందుచు
వనజాక్షుడు తా వనజముఖులతో § వనమధ్యమందు భూ వనజాక్షిని
వనితగ విలాస మందిన యనువున § వనరుబొప్పె యొనరున వారినెల్ల
వనమున పలుతావులయందు నొకట § వనరుహనాభుడు వనభూషణుడయె
హరి యిట్లు హరిణ నయనల సొంపున § వరదుడై భోగపరత జొక్కింప
తరుణులు మురిపెము లనుమించి అధిక § తరభాగ్యదశను తాము గరిష్ఠత
గనినార మనుచు మదమును గనుటల § యొనరున నది యుడుపగ వైనంబును
గనగ యోచించి కరుణామయుండు § మనసిజ జనకుడు మహితానందుడు
మందలుగా తను గొల్చు దేవతల § తందరల కుందుదూర్ప దానవుల
మందల కుందును బొందించు నాము § కుందుడు ముందర ముదమిడ దాగెను
మందయాన లా నందకుమారుని § సందిలిలోనే యంతర్హితుడుగ
చిందులనుగూరు చందము లన్నిట § కొందలమె నిండ కరిణి కరిణు లే
పగిదిని బాసిన విధి నరయుదురో § వగలాడు లటుల వెదుక దొడంగిరి
నగధరుని నాగ శయనుని నమరులు § వగబాధ వరముపొంద నిగుడుక్రియ
నేన నేన శ్రీకృష్ణుడ గనుమని § మానసముల పరిహాపత నందఱు
మానితాకారు మంజులమూర్తిని § ధ్యానానందుని నమందసుందరు
భూతలవిహారి ఖేచరవినుతుని § భూతలములలోను వెలి నమరు వాని
చాతుర్యమ్మున భూతముల నటన § ప్రతినిధులను మెఱయించు నేర్పఱిని
నాతులు గానగ నందరిని తమ్మ్రు § నాతురమందగ నడిగి కృష్ణు డెట
వని వడి గనుచును నాతని బొమచు § మునులు పరమేశు తమ హృదయమ్మున
గాన గోపి జపమును సలిపెడు విధి § వనజాక్షు! కృష్ణ! కృష్ణ! కృష్ణ! హరి!

మనసిజాకార మాధవ! మురళీ § గానవినోదా యని పిలువ జొచ్చి
వనతరులచాటు నంది తమహారాయులు § కనుచుండెనేమొ యని యా తరులత
లను నడుగుదమని యుండ రేకతను § గనినవారి తమ యిచ్చలకొలదిని
సురపొన్నగంటె సురవంద్యు కృష్ణు § వరమతిని నిటలతిలకుని గంటివ
సరసతిలక మా ఘనుని యశోధను § గురిగన్నావా ఘనసాలతరువ
మాబందుగునిఁ బందూక ! గంటె? § మాజోటి మదను మదనమ గంటివ?
పూబోడి ధనుని పుష్పఫల ! గంటె? § మా బుద్ధి మెప్పు మా కందగంటె
కువలయనేత్రిః సౌమ్యు నావాని § కువలతనువు గని యుంటివే? జెపుమా?
భువి నింద్రభూజమా ? యింద్రవిభవు § నువిదలపెన్నిధినిఁ గనినావే?
నల్లని వర్ణము నయనము లబ్జము § లల్ల వల్లె పచ్చనిది నవ్వు వెఁడ
జల్లు మోమెప్పు కరుణారసంబు § చిల్లించు చూపులను సింగారము
కొల్లనించు శిఖిపించ వేష్టితుడు § పెల్లుతేజముల దిసలు కులికించు
వల్ల నినుపోల్కి రాజిల్లు నతడు § మల్లెల చాల్దంతంబుల నొప్పందు
వల్లభుడు మాకు నీదారివచ్చె § మల్లియలాదులు గనిన వచింపుడు
వల్లభకాంతల మానధనంబుల § ముల్లెగా గొనుచు వల్లగూర్చె నిటు
పురుషసుందరుడు మరుజనకుడగు § కరము శ్రీరంగదురము చె న్నమరు
పరముడు మధురపు రవము నొలికించు § కరవేణు ధారి బుజ్జగింపులను
తరుణుల లజ్జల గొని స్మరుబారికి § గురిజేసి వచ్చె గంటిరె మీరో
వర లవంగ లుంగమ్ములు యో § తరములందు సారంగములారా!
సురుచిర కాంతుల సమరు తరువులును § పరమకాంతి చెన్నొందు లతలునుఁ
వరుసగ సర్వములగు మీరు సెప్పు § డరబెట్టక యా హరి గనిన జాడ
హరిచరణ ప్రియా! వరతులసివనమ! § హరి జాడ చెప్పి శుభ మందింపుము
కరము మ్రొక్కి నిను బెంతుము నిత్యము § వరదుడు మా దరిజేరినట్లయిన
ననుచు వనితలా తరు ల తాదులను § వాని నామముల హరి విశేషణత
కొనిపి యడుగుచును వన మెల్ల తెలము § లను దిరిగి కనక భ్రాంతి పరవశత
వనితలు కృష్ణుని అన్నిటియందున § గనుచున్న యట్లు గృష్ణమయమ్ముగ
పొనరుతరమంద వారికి వారే § వనితలార !. మనలోనె కొందరము
ఘనుడగు గృష్ణుని బోలె నటింతము § వినుడు తక్కరుల యాయా పోలిక
వనజనయను చందమునె ప్రకటింప § గనెదము గాకని యటాన రందిరి
వనిత యొకతి తా పూతన గాగా § చను గుడుచు నొక్కకాంత శౌరియై
కవ బాలునివలె నేడ్చె నొకయింతి § కనకాంగి యొకతె శకటం బయ్యెను

యొకతె సుడిగాలి యొకతె కృష్ణుండు । యొకతె బకుడుగా నొకతె శౌరి
యొకతె రాముండు యొకతె కృష్ణుండు । సకలురు గోపులు వారి రక్షకులు
దనుజహరుడ నే నను నొక్కకాంత । దనుజభటులుగ దామె మెలగుదురు
వినుమొక్క లలన భువనముల కుక్షి । యొనరున నిలిపిన కృష్ణుడ నే నన
కనకగాత్రి యొక్కతి యశోదగా । కన నోరు దెఱచు నితరు లుబ్బుదురు
కన్నె యొకతియు వెన్నదొంగ యన । వెన్నుడవైనను బట్టి కట్టుమను
యన్న మిన్నయగు నందుని రాణియై । నన్నలు మగవయు రోల నిడి చెలిని
గట్టు చెఱుంగున మద్దులము మేము । పట్టున ననుచును యిద్దరట్లుగా
జుట్టి యాశ్చర్యముల బుట్టింతురు । యిట్టు కృష్ణునే పట్టింపను గని
లలనలు గొందరు యమునవలె దోప । వలనుగ కాళియ ఫణి నను నొక్కతె
యల కృష్ణుడ నే నను నొక్కయువతి । తిలకింపుడు మము నాగాంగనలుగ
నని కొంద రట్లుగా కాళియు డను । వనితను బంపుడు నందుండి జరుగ
కనులు మూయుడిదె దావాగ్నిని । నే ఘనత మ్రింగుదును శౌరిని నేనే
యనుచు నిట్టులా వనిత లోక కొంత । ఘనమైన కృష్ణు లీలల గూడుచు
నరిగిరి జాడల నరయుచు నడుగుల । వగుస లాలోచనముల తద్భ్రమల
తరుణి కృష్ణుండు యొక తరుణికిగా । వనిపువ్వుమ్మల గోసి నా డిచట
చరణాగ్రమ్ముల నె మోపుట గంటిమి । తరమా వరాంగి యెవ్వతె మనలో
తరుణిని చంకను గొని యేగనేమొ । కరము జోడుగా దిందు జాడొక్క
వరుసయే యిందు తృణ మధిక మగుట । దరమదిగ దోపు నవ్వాల గందుమె
లలన యిట కొప్పు నను పూలు గూర్చె । వలను గంటిరే యిద్దరు కూర్చున
తలము లక్షణము గాన్పించె గదా । చెలియను కెమ్మోవిని నాన నిచ్చె
చెలువుడు కృష్ణుడు గనుమా పోలిక । కలికి నిక్క తా నందన చాలిదె
యనుచు మరికొన్ని విధముల జాడల । కనుచు నంతకంతకును దీవరము
గను డిట నిద్దరి రమణుల రమణుడు । మినుకు గని నడిచె మధ్యజాడ గన
ననుచు వనజాక్షు చరణముల గుర్తు । గని మ్రొక్కి యింతులార! యీచరణ
ముల సనకాదులు యోగముల హృదయ । ముల ధ్యానకలన గూర్తురో యబల!
లలన యివి వేదకామిని పాపట । దలరు వీధిగా విహరణ గన్నవి
ఇవి శ్రీబాలకు పట్టుగొమ్మలగు । ఇవి మోక్షలక్ష్మి మోహానంబులగు
ఇవె బ్రహ్మేశానులు దివిజవరులు । దవిలి పూజించు శిరముల దాల్తురు
అనుచు జాడ లగసియు శ్రీశుని । గనక పరితాపమున మరి రోయుచు
గని కొక్కచోట నాయా యడుగుల । ఘనుని చరణముల గుఱుతు గనబడమి

వనిత లిటు యోచనల పరికించిరి § గను డా కాంతలు గర్వమున మించి
యెత్తు కొమ్మనిన పుత్తడిబొమ్మల § హత్తుక నత్తువ కొలది జూపింప
చిత్తరము వారిదోపి యెత్తునను § గొత్తందనీక తా న త్తరుణుల
కను మరగినట్టి జాడ లిందొప్ప § ననుచు నట గొంత జరిగియు గాంచిరి
వనజేక్షణ నను బాయకు వెంటనె § జనుదెంతు గాని యెత్తుకొమ్మ నను
నను బాయవలదు నిలు నిలు మనియెడి § వనిత హరిమధ్య నెదుట నటుగాంచి
నీవెంత కపటమతివే కృష్ణుని § బ్రోవ మము దప్ప దోడ్కొని యేగియు
కావరము పెద్ద మము గూడితివా § దేవుడెటు మనల గదియు మన మలరు
గనుపాటి యేదొ యనుచును నొకతల § మున జేరి కృష్ణ ధ్యానముల నిలిపి
వనితలు వలపున మనము వికసింప § ఘనులైన మునులు హరిని విశ్వరూ
పుని గూర్చి ధారణను దలచినట్లు § మనములు కృష్ణుని, పరము మరల్పక
వరగీతములను నిటు గానమంది § రనఘా యర్జునపౌత్ర! విను మనుచు
ముని పరాశరుని పౌత్రుడు శుకుడీ § ఘన గీతలు జిజ్ఞాసపరంబుల
వినిపించె ననుచు సూతుడు శౌనక § ముని యాది సకలురకు వినిపించెను
మునులు విని రదియు శుభము నొన గూర్చ § వినువారికెల్ల ననియె శుకమునియె

## —: గోపికా గీతలు :—

వనితాజనములు కరములు మోడిచి § వినువీధి సురలు మెచ్చ బాడిరిటు
శ్రీ రమణా! గోపవ్రజమున § నీరమ్యపుజన్మ లక్ష్మి కళనొప్ప
వారు నీ వారు ప్రాణములు నిలిపి § ఆరయుచుందురు నీ సన్నిధినిక
నీ రూపము వారలకు జూపుమా § మేర దప్పకుము ధర్మసారమవు
నీ రమణీయపు దృష్టి యొప్పెసగు § శారద కమలోదర రుచిచేవా!
మేరగొన్న వేల సుందరరూపుగ § దారిచితివి మము దాసులుగ నీవు
ధీరుడవు నీవు నీ రమణుల మము § బా రందింతువే నొవ్వ వాడమ యది
గాద దర్శనము నిడి రక్షింపుము § మోదము గూర్పుము ముందరి యట్టుల
యో దయాపరా! మము బ్రోచినావె § గాదిలి నింపియు కాళిందిజలము
విషమును గూర్చిన కాళియుని పనిచి § విషము సంకటము దొలగించితి వటు
విషయదూర చనలమ్మున గాలిని § సుషుమ మమ్మందర బ్రతికించితివా
నీవు యశోదకు బుట్టుట నెన్నిన § దేవతల బ్రోవ విధి యను ప్రార్థన
నా వరం బడియు దనుజాల దునుమగ § కేవలము వినుతి గూరిన హరి వని
పావకాశమున తెలియనయె యెల్ల § బ్రోవ గని మహిమలును పెక్కుజూప

యట్టి మూర్తివిట నమ్మినవారిని ౯ రట్టున దవులగు గుట్టైన తెలిసిన
గొట్టు తప్పిదము నొనరుప లేదె ౯ బెట్టు చూపకను దర్శన మిమ్మా
దేవ ! నీవు గోవులవెంట దిరిగి ౯ నీ వెంట గొలుచు వారి యఘంబుల
త్రోవ గననీక జాలియున్నట్టి ౯ నీ వరచరణంబులు కాళీయుని
శిరముల నృత్యము నందిన వయ్యావి ౯ యురమున మము గూరుప కోరినాము
సరసిజ నయనా ! చాల్దప్పనీక ౯ మరుని తాపాధికము నార్పగదే !
నీ మధురవాణి బుధరంజనంబు ౯ మా మనములు గరగించె శ్రీవరా !
కామవశుల మందర మందునసె ౯ వే మరగినార మాగద నాథా !
కామినుల కౌర్యమున జూడదగునె ౯ కోమలాంగ ! మా కోమలము నీదె
ఘనము శ్రీయుతము కామ విదారము ౯ విన దురితనాశనము శోభనంబు
సనకాది వినుతిపరమునై తాప ౯ మును బాప నల్ల పున్నాగహృదయ
మున దోచినట్టి జీవనప్రదమ్ము ౯ నన బరగును నీ చరితపావనము
మునికాంక్షితమ్ము నగు యమృతరసము ౯ గన దాని గ్రోల మును దాన తపము
లను గనిన యబ్బు దేహ ముదితఫల ౯ మును గాంచు ముక్తిపద మదియు హరీ !
వనజనయన ! యో శ్రీ మనోహరా ! ౯ మనసిజారిహార ! నిను దలచు వారి
మునుగనీవు భీతిం సంసృతిని వార్ధిని శ్రీ కామా ! శ్రీకరంబైన
ఘనచింతామణి ! నొనరొప్పునట్టి ౯ జననభయము బాపంగ నభయ మిడు
టను మునుకొను చేయిని మా శిరమున ౯ పెనుగొనుముదముల నందింప జేస్తు
మనముల నియామకుడవు సర్వముల ౯ మనముల మాయని నీ వరయలేవె !
ననువందియుంట గాదనరాదో ౯ యనఘాత్మ యధర రస మాననిమ్ము
అనంగతాపజ్వరశాంతి నింపు ౯ మనంగజనకుడ వను ఘనత నిలుపు
మనంగ వేడెము నీ యంగనలను ౯ యనుంగునను కౌంగులను చేతార్చు
నీ నగవు చూడ్కి నర్మము నడలును ౯ ధ్యానమున పొందు గూరిన మనముల
దేన నితరముల పాలంద జొక ౯ మానసమందు నిను మా నాథుడ వను
ధేనువుల మేప గోపకుల గూడి ౯ కాననముల దిరుగాడ కోమలత
నాదు నీచరణముల కఠిన శిలల ౯ చే నొచ్చు ననుచు జల్లున తలకెద
మో నవసరోజనయన ! సందెలను ౯ గానవత్తువో మే మెదురుచూడ
నీవు ధూళిధూసరిత పూర్ణతను ౯ ఆవదనము ముంగురుల సమేతము
మావలన శుద్ధమును గూర్పనెంచి ౯ త్రోవ నరసెదము నేకాంతమంద
నీవు మము జూచి మరుని జూపెదవు ౯ కేవలము పరుడవు గావు ప్రియుడ
నిను మో కాంతా ! భక్తకామదము ౯ లనవరత దివ్య సేవఫలయుంబు

లనయం బీ యిల మండనంబులను § వనజాక్ష! నీదు పదములు మా వ
క్షములె సదనములుగా నిలుపు కృష్ణ § సమము గాదనెద మాసుధను నీదు
విమలాధర! సుచి గోప్రిలి మాపతీ § నమస్కృతుల నర్పింతుము రమ్మిక
సుమశరుని దుండగము వొలగింపుము § నమలనుతి ఋతుల కీవాసగునట్టి
ప్రియమవంబె మాకు నీ సతతుల కిదు § మము ఖేదమందకది నీ సహజమె
భువనభరణ! నిను గనము వనమునను § పవలు గోతతి గాయ చరింతువు
దవిలి కేలయిన నీ దివ్య రూపు సౌవిశాలత గన రెప్ప లడ్డమవు
కనులకు విధాత క్రూర మొంచెనొకో § గన కఠినహృదయునిగ జేసె నిన్ను
వనితల మోహారసముల మది! నించె § వినవ మాపురుషవర ! కంతుక్రూర!
తను మొరవెట్టిన గావు పగతురము § గన గాదె యేల దూర మందితివి
నిను నమ్మి సకలురను మా వారిని § గన మాజ్ఞ విలువ మది సంకటంబు
నను వందించగ తగు బంధనమ్ము § లనుచు నీసంగరతి పర మ్మనుచు
వినుతిని స్మరచింతను ద్రోహిబూని § కను జేరిన మము కేళిని దనుపవ
నీ మంజుల మురళీగానగీత § మే మానసధీరతల బాపె నా
కాముని చేష్టలు నాతని వాణుగ § గ్రామములు మమ్ము గాములై జుట్టె
గా మనోహారిణ గామిలి గాగా § శ్యామసుందరా! శ్యామల! నీ
వే మపరాధము గంటివో దాపకు § మో మనోహరా! మా మనోజ్ఞ! హరి!
యామదము డాస్య నీ మంతనములు § మామతులు వృద్ధిగను రేగి మమ్ము
నాకొయి నీ నగవుల కనుసన్నల § భామల మగు మము జిలిబిలి గిలిగిలి
వలపు నించి కళలంటి రమించియు § తలగిన నోర్తుమె? జలరుహాలోచన!
వలదు కఠినంబు లలనల వ్రాలుప § నలసిన తనువుల దడవి రతి నేల
వలువలు దొంగిలినట్టి దినమ్ముల § చెలియల కేమని సెల విచ్చితివో
యలనాటిలీల లీనాడు జూప § వలయురమ్ము నీ కరములు మాగళ
ముల కేళిలీల స్పర్శ గన జేయు § వలపు ఫలింపగ మా చన్ను గవల
నీ చరణమ్ములు నిలుపవలె గాకను § నో చక్రాంకితమూర్తి! కర్కశమౌ?
మోచినట్టి వనముల సంచరింప § చకోరాక్షులకు నొవ్వ గాదె!
దాచకింక నీమంగళరూపము § నోచిన ప్రియులకు ప్రాణముల పీడ
నించుట తగునా? విడువ న్యాయమా? § మించనీకుమా! చంచల గాత్రిల
నంచితంబంద పొంచుకొన రమ్ము § మించిన కాలము నెంచ మాప్రియుడ!
జీవములు నిలుపు కేవలజ్ఞాన § మే వలన మమ్ము నీవర్ధనమ్ము
భావముల లీనమందితి మంచని § దేవ! నీయాన సర్వమును మేము

వదలిన వారము గలియుదుము నిన్ను ƒ బదులాడవ నీదరి మెత్తుమిదే
గదియ వత్తుమని మేన సహంకృతి ƒ కదియనీక యా బింబాధరు లల
రున వనమాలిని దర్శించినటుల ƒ ఘనమైన పులక లెగయుచు కన్నుల
ఘన హర్షబాష్పముల ధార లొలయ ƒ ఘనత నిట్టూర్పు లడర వదనముల
సిల మోపి భక్తి సాగిలి నాయక ƒ కలలోని నిధిని వెలెని గన్నటుల
నలరున లోపల నాని వెలిగంటి ƒ ములవడెను సిద్ధి నిక్కపు సత్యము
గన నేల నిన్ను గను కలయిక యని ƒ వనితలాడి తె వుల స్మృతి విహామున
దనరందని మతినున్న తక్షణము ƒ కనకాంబరుండు కరుణామయుండు
వనజ నయనుండు వంశధరుండును ƒ పిన నగ వొప్పెను చందమున వనిత
లార! పని గల్గి మీతో నాడక ƒ జేరితి తీవరముంచుట వచ్చితి
కూరిమి నింపుడు నేరంబెన్నక ƒ నా రమణు లంత లేచి పరమ మో
దము సంధిల్లగ నాపోవు భంగి ƒ క్రమముగ నతులను నుతుల నాలింగ
నముల కిలకిలల నలుకల చూపుల ƒ విమల మానముల నవియు తొలగుటల
ముట్టుట గిల్లుట మొట్టిన చిహ్నాల ƒ తిట్టిన మెట్టున పొగడుటలే యుం
దుట్టిపడ నాడుటల బెట్టిదముగ ƒ కుట్టున గసరుట లటు శాంతి నంది
చుట్టుకొని రిక్షుఖండమునం బలె ƒ మట్టమున చీమ గమి ప్రాకినట్లు
నట్టి సుధ గ్రోలి బార్లందు దివ్య ƒ లట్టుల మోదము చాళ్ళమర గనిరి
చుట్టము రాకను గన్న గృహమేధి ƒ పట్టున దట్టిన మమతల కృష్ణుని
యొకతె కృష్ణునికి యే పని యుండెను ƒ సకల సిద్ధులవి నీలో నుండెను
ప్రకటిత మది యింకెందుకు దాపకు ƒ మకుటిలమతి నని యింకొక్కతి యనె
యొకకాంత కృష్ణ! నడచి తెటుల నని ƒ యొక చెలి పదములు గలవని బదులనె
యొకసతి వెన్నల దొంగిల గాననె ƒ యొకవనిత గాలి గొనిపోయె ననియె
లలన గాలి దనుజుడు లేడె యనియె ƒ కెలన నవ్వె నొకతె కేల్వట్టు నొకతె
పిలిచిన పలుకడు యొక యింతి చెలగు ƒ తలయూచె నొక్క కాంత లీరీతి
పలుపలు విధముల నలతి గానట్టి ƒ పలుకుల నీతులు వినుతులు నొనరుప
విరహతాపముల వెలువరించి యా ƒ జలజలోచనుల పరమకృపామతి
నరసి యా తాపములు దూల నలరి ƒ కర మాలింగనము లాడి సన్నిధి
వలసినట్టి యిచ్ఛలను తీవరపు ƒ కలతల చిత్తములను శాంతి గనుచు
చెలిమి గని పరమ ప్రీతి నుత్సాహ ƒ ముల గౌరవించి యానందించిరి
మును లష్టాంగములను బొందుసట్టి ƒ ఘనుని మోక్ష సామ్రాజ్య పట్టంపు
నను దిట్టమందు దేవుని హరనుతి ƒ దనరు యోగిజనమానస నిలయుని

గనిరి తమ జన్మభాగ్యము ఫలింప — వనజనాభు శవ్వారి దయ జొన్ప
అంత ననంతుడు హరి శ్రీకృష్ణుడు — చెంత శక్తిని కరములు మూర్తితను
వింత జేసినటు లింతుల దోష్కాని — సంతసమున మందారకుందముల
సంతులగు పుష్పవాసనల నింపు — టంతరంగముల కనుకూలవాయు
చలన కలన నలతలు వాయ యమున — వలని సైకతస్థలుల సుందరత
వెలయ జేరగని యా నారులెల్ల — కలిమి మించనగు జ్ఞాన కలిమినే
వలచి వలగన్న వధువుల జుట్టుగ — నిలిచి వేదములు ఆది పూరుషుని
గెలన గాంచినటు కల వెలయునొప్పి — వెలసిత ముఖముల విశ్వస్వరూపు
బంధురతర సంసార పాశముల — బంధముల మోహాలంపట లడంచు
బృందారక వినుతుని నందసుతుని — బృందావనభూషిత విహారునిగా
అతి మృదులంపు నటాంచలమ్ములను — యతిరమణీయపు పీఠగా నతని
యతివ లతని నుపవిష్టుని జేసియు — వెతి వలాయనపు గతి చిత్తవృత్తి
ముదముగ నతనికి నుత్సాహ పరత — యమునంశతిలసు ఢన ముందు వెలయు
మదనగోపాలు మదన సామ్రాజ్య — మదె యింద్రపదవి నంకమింపంగ
చదరున హాస విలాసాదులనుగ — కొదువ లేని కౌతుక మనుపట్టము
గట్టి పదములను నతి సేవించుచు — దట్టపు కూర్మిని కొంత కోపమును
దట్టి నటురహాస్యమున నర్మమునే — పట్టింపు పట్టి హరి మాప్రేమలు
లహరి కొనంగా నీవ విరహితవు — విహార మందియు విరహము గూర్చిన
సహన ముంచునే సహజ మిది గనవ — అహా ! నీసఖ్యము హాయలు కపటంబు
కొలిచిన గొలుతురు కొలువక యున్నను — కొలుతురు కొలువక యును యేరకుండు
రల సతులసతుల యిది గుణంబెగా — జలజాక్ష ! యిందు నీ ఛందమేదో
తెలుపుము నీచత లిందునను లేవు — కలికిచయము కన్నీరు నీ కలక
నావిని బలికెను నలిననాభుండు యో — వివేకసుందరులార ! వినుడు
నావలని గొలువు సర్వులకు గాదు — కేవల విచారమున గొంతగొంత
తా వంద నగుచు మీ విశదబుద్ధి — ఏ వలని జెడని భద్రమును గూర్ప
నేవడి బూన్చితి కనుల కగపడక — మీ వినిశ్చయము చొప్పున నరయుచును
కాయ కుండితిని నష్ట త్రిసంధుల — నేయము గందును నను నమ్మియున్న
మిను ముపకారము గని దాని గూర్ప — గను సౌహార్దయము పెద్ద యది గాదు
గనగ తా నదియె గోరి చేయుటయు — ఘనమది యంతదె తా ఫలము గోర
కనె యొనర్చువారలు గలరు వార — లును తమవారికే నైన దాంభికము
గవనగు మీదట గలరది బొందియు — గన రట్టివారి వారి విధము లటు

వినదగు విబుధుల వాక్యముల చాలు § వినయ ధురీణలు గమనింపు డదియు
జ్ఞానులును జనులు నాత్మదర్శకులు § గానగ దయ నెరుగని కఠిను లనగ
జ్ఞాని వలపు గూర్పను ప్రాప్తమనుచు § గాన దశ్శ్రుతిత జను డాత్మదర్శి
రెంటికి దూరుడు గాన నొసర్పను § తొంటి కర్మబంధముల పర మనును
వెంట రా లోభమున కఠిను డొప్పు § నంట నన్నింటి నేను పరముడను
మానసబంధుడ కారుణికుండను § ధ్యానదర్శనుడ నిత్యప్రకాశుడ
మానినుల మిమ్ము స్థిరతరధ్యాన § మాని రుచి గనుట కేను దాటియును
గానవచ్చితిని దృఢము మిమ్మురాదె § దీన నిష్కలుష సుఖకర మబ్బును
యే పుణ్యబీజ మికబంధుపక్షు § మేపండు శిక్ష సించితిని మిమ్ము
నా పక్షమంది పెరచో నివృత్తి § ప్రాపంది ధ్యానరతులైన నిట్టి
పక్షమ్మునసే పటుతరపదంబు § సాక్షాత్కరింప సంసిద్ధత మీ
కక్షయ ఫలంబు ఆనందము మీ § నాక్షులు మీ మది చింత లుడుగు డిక
నా రూపు నిక్కమున తీవరమున దా § రంద గనరు గనిన తక్షణము
గూరంగబారు గొందు రహంకృతి § జేరంగ లేరు సారూప్యముక్తి
నరు డాత్మధనము గానని యేపమున § పరితాపమ్మున బట్టు వాచరత
నరసి భద్రి మునుమగి యేమరందు § వరుస దలంపుడు మీరును నట్టుల
తగవు ధర్మమును నాపరంబుగా § సగటున బంధుల నరయక వచ్చిన
నగవుల మితారులను వగ నెంతునె § పగ గొందునె పరుడను గాను మీకు
వినుడు మీ యట్టి సంసృతి శృంఖల § మును నదల్చుకొని ధీరహృదయలై
నను సేవింపగ వచ్చిన మిమ్మును § ఘనమతుల దేన నుపకరింతు మిము
యుగయుగముల నాసేవ ప్రియమంద § జిగి మమ్ము గూర్ప దొలగితి నది త
ప్పుగ దోచనేని మన్నింపుడు నను § వగ దక్కడింక నా బిగికౌగిట
నన వారు కృష్ణు సంగమసుఖమును § గని వియోగతాపమును గెంటిరా!
జనవర! మగువలు మగని నటు గొల్వ § వగల గూరుదురె యిక విను మవ్వల
యాపద్మాక్షుడు పద్మాలయపతి § గోపికామనోహరుడు వారితో
నీపగిదిన భాషించి యలరించి § యే పందిన మోదమున రాసంబు

— రాసక్రీడాభివర్ణనము :—

గనగ నయనదృష్టికి పర్వంబుగ § మనమునకు విందు నా యప్సరసల
కును గాగ దివ్యగణములు బొగడగ § గని పుష్పవృష్టి ఘనత గురియింప
శ్రీరమావరుడు చిత్రతరంబుగ § నా రమావిలాసినుల కెల్ల తానె

కోరిక మెచ్చుచు గూర్చొ నను డనుచు § కూరిమి నోరిమి మండలం బొప్ప
గనగ వలయమున కెలకుల లలనలు § వనితల నడుమను దా నొప్పారగ
వనితల కిరువంకలను దా నొప్ప § ఘనమైన బాహువులను మెడలపై
నను భుజములపై నొక్కరి కొక్కరు § పెనవైచినట్లు మధ్యరంగమున
వనజాక్షు డట్లు నిలిచి వలయంబు § నను దీప్తివందె బహురూపమ్ముల
నేన నేన ధన్యను నోము పండె § నా నర్మిలి నే యిరుగెలకులందు
దాను రూపంది నను మోదంబుగ § మానవీయమతి మన్నించె ననుచు
దివిజుల తూర్యధ్వనులు తోడుగా § గవిసిరి గానము నృత్యము లొక్కట
ప్రవిమలానందమున గంధర్వులు § యువిదల యుక్తము వారి గీర్తింప
జయ లక్ష్మీశా! జగన్మోహనా! § జయ మునీంద్రనుత! చారువర్తనా!
జయ చంద్రముకుల! మాధవసైక్య! హరి § జయ జయ విజయాభ్యర్చిత నిజపద
కనకచేల! జయ గదాధర! జయ § వనజనేత్ర! జయ! వైష్ణవప్రియ! జయ
వనమాలీ! జయ వైకుంఠా! జయ § ఘనవర్ణ! జయా! గాయకనుత! జయ
నయమూర్తీ! జయ నారాయణ! జయ § భవవిదార! జయ భవమారా! జయ
జయ దనుజమారణ! సునందనందిత! § జయ నారద మునిమోద! ధృవపాల!
యనుచు ఘనమైన రాగభేదముల § వినుముట్ట గీతముల చెలగు గనగ
ఘనమైన నృత్యమున పదతలముల § నను వొప్ప నందియుల రవము చిందు
లను తాళ సరణి వృత్తములు సెల్ల § వనితలు కృష్ణుని నిండు రాసమున
కన్నె లిరువు రట వీణారవముల § గ్రిన్నన మేళన మొనరించి తోడు
వెన్నుడు మధ్యను మురళీరవంబు § తిన్నగ నందున నేకీభవింప
పాటలు నీటుగ రాగాలాపము § లాటలును మేటి కుదిరింపుల నా
బోటులు లీలాకృష్ణమూర్తులును § నోటిధాటి దప్పంగ నీకుండ
కనులు త్రిప్పుచును బొమ లెగయించుచు § వినుతి పరంబుల చేతులు ద్రిప్పుచు
ఘనతర పదములను లయగతిని నవ్వ § డిరి గను చర్యల విన్యాస మొప్ప
మెడ లన్ని ప్రక్కలను పోయగముల § నడుమున ద్రిప్పుచు జడల ధమ్మిల్ల
ముడులు వదలి మోవుల వీపుల వ్రే § లుడుల నొయ్యారముగను మధ్యములు
వీవ స్తనభారముల తోడుగా § మానమ్మున గదలింపు మనోహర!
మానమంద బహుభేద నృత్యముల § బూని రాగముల తాళానుసరణి
పలు ఛాయల బరగించె చెలువముల § చాలితులు గృష్ణుల కిలకిలలు గూర్చి
గిలిగిలి నులుకుచు నొనరుల గిల్లుచు § పల్లవపాణులు వల్లభుని హ స్త
ములను చెక్కిళ్ళ నూతముల జేయుచు § నలరు గనుచు నలివేణులు వినుడు

మొలనూళ్ళ గజ్జెలును నందెలు కర § ముల కంకణాది రవములు నేకత
వెలసిలుట బయలునను లయనాదము § లలరు దోప గను నాట్యం బిట్టులు
మొందు నలతగను నంతకు నాడిక § కుండల దీప్తుల గండ తలంబుల
దండిగ స్వేదము నిటలంబు లల్లై § అండజయానలు నా యాదిమూర్తి
యును నాడి యాట విలిపి విశ్రామ § మును బొంద లలన లందరి సన్నల
ననువొంద నిలుప వారలు నాలల § గసిన యలతలను వదలిన వలువలను
ముడులు బిగించుచు కొప్పులు కూర్చుచు § నెపదల గంచుకములును గొంగులును
నిడము గనక నివసించి యావిధిని § నొసలులు గదియగ స్పర్శసుఖంబుల
గనిన పరవశము నాధుని కరముని § ఘనత తడవబడి తెలివి వికసిలంగ
వనితల చేలాంచలముల స్వేదము § తటువున దొలంగ విసరుచు దుడుచుచు
బడలికల గొంత దీర కాళింది § మడువున దోగగ యత్నంబుల గని

## -: జలక్రీడాభివర్ణనము :-

నడచె కృష్ణుండు వనితల తోడుత § పడతులు దానును కరి కరేణువుల
వడువున జొచ్చెను సలిలమధ్యముల § నొడలు నంటిన స్వేదపరాగము
లను పరిశుద్ధిని నందెదు కాంక్షను § కన నిధి చంద్రుని గాంచి ముదంబున
గొనినటు మాధవు సతుల యుక్తముగ § తనయందు వారిప్రతిబింబము లవి
గన శరచ్చంద్ర కళల సికళల § దనర కుతుకంబు మిగులు గననొప్ప
వనితల ముదమున మునుగా దిగియు § గన చరణ జంఘ జాను జఘనముల
విను మధ్యంబుల కుచములబంటి § జని చక్రవాక జలచరావర్త
ములు శైవాలంబుల చందమొప్ప § నల కేళింద నందనయు వారలను
నలరున తనుదాసిన యేరు లనుచు § నబరి కరము ముదమున ముద్దుగొనగ
కరముల జూచిన తరంగములచే § తరమంది ముట్ట నులుకుచు నెగ్గుచు
తరుణులు బెగ్గురులకు చేయి సాచి § వరహంసములను బట్టి జోపుచును
నీట తప మూను చక్రవాకముల § బోటులు దోలుచు తమ వదనములను
దీటు గనలేక మింటి చంద్రుండు § నీట తన కందువాసి బొల్చునని
తాను జలంబుల జొచ్చియు యావిధి § గాంక చలించు నట్టుల యందున
గానరాగ యల దేటులు మరంద § మూన రాపటువిశ్లేష వాత
సముద్ధూత కుముదాది పరాగము § దము గప్ప వదన కమ్మదనమునకా
క్రమత మూగు నవ్వానికి వెరచుచు § విమలమగు నీటబింబు సందోహ
ముల దడియ పూపుదీగెల విధమున § నలినసయను డటు కరములను తోయ

ముల పెక్కు తోయముల జల్లుకొనుచు ఽ పులుగడిగిన మదనుని శరముల క్రియ
తనువుల మెరయగ వారలు కృష్ణుని ఽ కనుల శృంగార చూపుల నట్టుల
మునుములు గొని చల్లుచును నవ్వుచును ఽ గన భాషించుచు దాటుచు గూడుచు
హరి కరేణు కర వికీర్ణ ధారల ఽ కరము నొప్పు నభిషిక్త కరిరాజు
సరణి గన్పట్టె మరి వారు విసరు ఽ సరస కల్హార కైరవముల నగు
పుష్పాదుల గ్రమ్ముటల భూతిభూషు ఽ నొప్పిన నొప్పుచు నట్టె మనోహర
మొప్పగ సహస్రకనుల వేల్పువలె ఽ గుప్పిన కమలములను వైచుటలను
జలజాక్షుం డాలలనల వౌ కుచ ఽ కలశముల కుంకుమపు పంకంబుల
వలన బాలభానునివలె భాసిల ఽ కలకంఠుల పరకటాక్ష వీక్షే
షముల హరిచందనము కాంతి నమరి ఽ శమనము గని యా జలముల వెలువడి
విమల వస్త్రముల గంధమాల్యముల ఽ కొమరొందు భూషణముల నందరును
విలసిలు సొబగుల నొప్పి దరుల పూ ఽ వుల పొదరిండ్లను నింపగు తలముల
యుల కుంభికరేణుల గ్రీడ సల్పు ఽ వలనున వలపుల ముచ్చట రతులను
యా శరత్కాల వెన్నెల రాత్రుల ఽ నా శశివదనల రమించె నింపున
ఆ శచీనాథసన్నుతు డీసును ఽ శ్రీశు డింద్రియ స్ఖలన మొనర్పక
వన పరీక్షితుడు శుకమౌనిని గని ఽ మునివర్య! విష్ణువగు నాకృష్ణుడు
మునివంద్యా డమలరూపి సుదర్శను ఽ డనఘ మూర్తి పరమాత్మ ధర్ముడును
అనయ న్యాయపరిపాలనశీలుడు ఽ ఘను డంతరాత్మ తా జగన్మయుడు
వనితాజనముల పరాంగనల నల ఽ ఘనమార వికారముల నందించి
యనువేది గనియు నీపగిది వారి ఽ జనుల పతుల బంధువులాది వదలి
తను జారచిత్తముల గదియ మేలు ఽ ననుకూల మచ్చెరువుగ తా గూడె
సకల ధర్మజ్ఞుడైన శ్రీహరికి ఽ శుకవాణుల గ్రీడింప నే ధర్మ
మకటా యని నా మనము కలగెడును ఽ వికలమది బాయ విన జెప్పు మనగ
జనపాల! వినుమ యనలమూర్తి తా ఽ ఘనత వెలయగా సకలము భుజించు
ఇనుడు శశియు మరి యింకను గొందరు ఽ మునుకొన్న దివ్యమూర్తులు నావిధ
మున కళల హేయమగు చోటు నంద ఽ మునికి గాంచి దోషముల జెందరగు
వనమాలిగాదె యారూపు లన్ని ఽ గన ఘోర దురిత హరణుడగు హరికి
నవి యంటబోవు హాన దూరగుడు ఽ ఘనుడు సర్వేశు డగుట నటు లొప్పు
పరకాంతల నటు బొందు దుర్జనులు ఽ తరమందుదు రెటు బ్రతుకు పరపదము
లరయ నది పెద్దదోష మటంచని ఽ సరిగా డది నాశ్రుతి పరంపరల
హొవంగ నగు నది విపరీతము ఽ నాకలోకపతి వినుతిని పట్టున

గాక యన్యులకు గా దదేట్టులన ƒ లోకభీకరపు హాలాహలమును
పానమొనర్పఁగ గోరికొన కయె ƒ గాని యితురుకే యైన బ్రతుకుదురె
యో నరేశ్వరా! యింకను వినుమా ƒ యీ నిఖిల సృష్టికర్తయు దానై
యేపారు హరియు సర్వము నెఱిగి ƒ నిపుణించి గనరైన మృగాదుల
యాపరాత్పరుఁడె సాక్షి దా నగుచు ƒ వాటట్టి పురుషులు స్త్రీలు జంతు
వుల దా నభిరామముగా క్రీడను ƒ సలుపు రమేశుఁ డెరయ పురులెవరు
యల నారుల పెక్కండ్రి నొక్కరుఁడు ƒ చులకన గన డా నామాన్యనరుఁడు
పలుసారులు విని గన బహురూపుల ƒ వెలయు బ్రహ్మములగునని దోషము
లలఁడవు నిక్కమది యింద్రాదులు ƒ దలప హరిరూపు లనుట లటుండగ
జగముల పురుషుల రూపాంతరుండు ƒ నారుల రూపులు తగును శ్రీమాయ
భగవంతు డనెను వారికి నెల్లను ƒ పగరు తనవారు ననెడి భేదంబు
గనుపడని భంగి పాపశూన్యులకు ƒ మనము నిష్కామ వృత్తముగ జొరగు
గోపసతుల వర మావిధి బొందెను ƒ యాపడంతులకు దా బాస లిడిన
యాపరముం డటు కామముల దేర్చె ƒ నాపద్మాక్షుఁడు బంధ విదూరుఁడు
అతని స్మృతిమాత్రి పతితులె యనఘులు ƒ యతని గామించుటల నటులెవారు
అతుక వంహాములు నాదివ్యుని పర ƒ మతుల సతులకును సంశయింపకుమ!
వినుమా! యద్భుతశక్తి పరమాత్ముఁ ƒ డను విధిని సర్వమూర్తుల స్వేచ్ఛను
గని నటించు నట్టిడుల నడకలను ƒ జనులు భ్రాంతి నానిన గీడు గదియు
జనపతీ! బుధులచర్య లటుండని ƒ ఘనత శోభిల్ల వారి వచనముల
గొనుట హితవృద్ధి ముక్తికరస్థము ƒ వినుమా! దేవుఁడు తనయిచ్ఛ మెలగు
నని బూనరాదు లోకమర్ధముల ƒ వినికిడిని నిజము నరయక మూఢత
మారవికారము సంసృతి లంపట ƒ సారమైన ధీరత జ్ఞానసిద్ధి
నారయ కామేచ్ఛయె ముక్తియు నా ƒ సారసాక్షుఁ లెన్నగ సుజ్ఞానులు
గురు డా కృష్ణుడు బోధసుధాసమ ƒ మరయ సంగతమె సంగమోదంబు
తరుణులు కృష్ణుని మ్రొక్కియు నిండ్లకు ƒ నరుగ వారి శుద్ధిని పరిశుద్ధిని
నరసి చింతించి హరిదయను బొగడి ƒ కరము భక్తివశులైరి తరుణతల
నరవర! యా గోపాలకృష్ణునికి ƒ తరుణు లాగోపికల క్రీడింపుల
పరమ విజ్ఞాన మలవడు విన్నను ƒ పరమున ముక్తియు నిహమున సుఖంబె

—: సర్పరూపియగు సుదర్శనుండను గంధర్వుని శాపవిమోచనము :—

ఒకనాడు నందు డాది గోపకులు ƒ శకటంబు లెక్కి యంబికావనికి
సకల పూజార్హ ద్రవ్యముల గొనుచు ƒ సకలభూషణాత సన్నాహులగుచు

యకలుషమతి జాతరను వెల్లింప ఽ నికరోత్సాహములను చెలగు గాంచ
నరిగి సరస్వతి జలములను దోగి ఽ సరసమతుల భూసురుల దానముల
వర ధేనుహిరణ్యముల వస్త్రాది ఽ పరత బూజించి జలములను శుద్ధ
మతిని వాశించి నియమముల బూని ఽ గతి గొనిరి నిదుర లారాత్రి యచట
క్షితిప! యొక భుజగ మంతున నందుని ఽ యతి రయమున గరచియును మ్రింగగా
పనిగొన నందుడు తెలివిని గాంచియు ఽ వనజాక్ష! కృష్ణ! కృష్ణా! రాగదె!
నను పా మొకటి మ్రింగుచున్నదన ఽ విని యచటివారు గుదెలను మోదిన
విడువదయ్యె భీతిఁ గృష్ణుడు గని ఽ వడి నేతెంచియు దర్పమున మించి
చెడుగు పన్నగము చెడుమని పదముచ ఽ దడ దీర నందుపాదిగ నలరగ
తన్నిన మాత్రన యా సర్పరూపు ఽ క్రిన్నన మాయగ నాశ్చర్యంబున
మున్ను గలయట్టి దుష్కర్మఫలము ఽ తెన్నుదప్ప విద్యాధర రూపము
నంది హరికి మ్రొక్కిన నగధరుండు ఽ నంద మొంపొంద నాతని కిటులనె
విందు నీచరిత మంచితమూర్తీ! ఽ ఇందు భుజంగము తను వేల గలిగె?
సుందరాకార! వరరత్నభూష ఽ లందిన మంగళరూప! యెవ్వడవు?
ఆ వనజభవార్చిత! యో యచ్యుత! ఽ నా విముక్తిమూలంబ! జనార్దన!
దేవ! వినిపింతు నా నిజస్థితిని ఽ యో విశ్వమయా! విశ్వంభర! హరి!
నే విద్యాధరుడను; సుదర్శనుడ ఽ కేవల రూపము సంపద గర్వము
నావశంబుగా దిరుగుచు నల్లెడ ఽ నావిధిని నొక్కయెడ గాంచ గంటి
పావనుల నాంగిరసులను మౌనుల ఽ భావసుందరుల కురూపతనువుల
కావరమున నీరూపు గన్నట్టి ఽ తీవర మదపు విచార శూన్యతను
నవ్వినాపకను వడి బుఱచితి నను ఽ క్రొవ్వందినాడ వోర దుర్మతీ!
యవ్వనంబునను పామై యుండుము ఽ నొవ్వ మముగూర్చినందు కీఫలము
నావినుతి వారిచరణముల భయము ఽ దోపుదని మ్రొక్క నాదరము గూర్చి
ఈ విపినమునకు గోవిందుడు తా ఽ భావియందు వంశమున జన్మించియు
నీవు ముక్తిగన పదమున దన్నిన ఽ నా వరతరుణమునను తొలిరూపును
గాంతువు మూఢుడ! గర్వమందకుము ఽ సంతత సద్వర్తనము నీ వందు
చింతింపు మీశు శ్రీహరి నని రా ఽ వంతున శాపము వరమును ఫలించె
వందన మొనరుతు నిందిరాపతీ! ఽ ముందు భక్తి నీయందు గూర్తు నిక
మంద గొన నింక సర్వ మధోక్షజ! ఽ నందితహృదయ! సుసంఘవందితా!
యని సంస్తుతి యొనరించి దివమునకు ఽ జని మోదంబున విద్యాధరపతి
గని రెల్లవారు విని రావృత్తము ఽ జనవర! అంబాజాతర పూర్ణము.

ననువందించియు మందను జేరి § మనముల కృష్ణుని దైవమని యెంచి
రనఘ ! మరియొక్క రాత్రి వెన్నెలను § వనజనయనుండు బలభద్రుండును
ఘనము నిగుడ భూషిత గాత్రులగుచు § వనతటీ తీరమున జేరియు నట
వివిధ పుష్ప సౌరభముల తావుల § దవిలి గొనుచు నా మకరందసంతతి
గవిసి గ్రోలి రా మధుప గీతముల § చెవుల మనోహర మంద తా వినుచు
గోపిక లందల నుండగ బాడిన § యా పద్మముఖుల నందమె తగవున
యేపందిన మోదముల గూడియును § నా పదములనుం ధ్యానముల నిల్పి
వలువలు వీడుట కొప్పులు సడలుట § తలల పుష్పములు జారుటలు గనక
లలనలు పరవశ మంది యుండునెడ § నల కుబేరభటు డొకడు కుత్సితుడు

—: కుబేరభటుండగు శంఖచూడుడను గుహ్యకుని సంహరించుట :—

దలపడు వారల మహానీయు లనుచు § చెలువల కొందఱ యోగబలంబున
గొనుచు నుత్తరము దిక్కున బోవగ § వనిత లది యెరిగి రామా ! మాధవ !
వినుడు మ మ్మొక్క దుష్టు డెత్తుకొని § గనెను పరువు మము రక్షింపు డనగ
ఘను లిద్దరచటి సాలముల గొనుచు § వెనువెంట బడిరి వనితల భయమును
గూర బల్కుచును డానిని వాసిన § నాతులను డించి బారెను భీతిని
వారిజాక్షుండు యన్న నట రక్ష § జేర పిరి గనుమని నిలిపి వాని
బారనీక నా మేర కొంతలో § దారి యొరి నిలుపోకు మనంగనె
వాడు పెక్కు రూపముల దొలగుటకు § గూడిన మాయల దా నటు వెంబడి
దాశి వెట్టి పిడికిటను దల దొడిచె § వా డవని గూల వాని తల నున్న
రతనమును గొనుచు మరలి రామునకు § సతులకు మోదము నిక్కగా చేర్చె
యతులిత ప్రభా భాసమానమగు § రతన మాతనికి గానుకగా నిడ
యతివల తోడుత మందను చేరిరి § మతి మెప్పించిరి వజ్రమున ప్రజల
జనవర ! పవలుల రామకృష్ణులును § వనమున పసువుల మేపుచు గోపక
జనులతో నచట విహారములు గన § వనిత లిండ్లకడ వారల లీలల
మనముల నిట్లని దలచి బలికెదరు § వనిత లొకరొకరికిని వినుడు గొలువ
హరిమధ్యలార ! మనవల్లభుండు § సరసిజనేత్రుడు భూ విక్షేపత
కరము సొం పొంద దాపలి భుజమున § శిర మొకింత యొరగ గూర్చియు తన
మురళి యధరమున జేర్చి వాయింప § వరుస నంగుళుల ద్రిప్పుచును దాను
ధరను మోహనపు రూపంబు దీప్త § సరణి తా వెలయ దివ్యవనితలా
పరముని గాంచియు బ్రాణేశులు తమ § సరస నుండినను స్మరపరవశలయి

వరుస నీవిబంధములు సడలంగ ॥ తరమంది విభుల తొడల సోలుదురు
తరుణి మనవరుని మురళీనాదము ॥ వరధేనువత్సములు మృగాదు లవె
పరమానంద సుఖమ్ముల పీనుల ॥ పరమున మనములు సొక్క నాలించి
వసులను దీరి మోరల నెత్తియు ॥ కరము మేతలను గొనవు నా సుధా
రసము గ్రోలుటయె కర్ణపులు నింపుట ॥ దెసల నీక్షింప వా హరిని గనుచు
బిసరుహాక్షి ! ధ్యానించు మునుల వలె ॥ పస మించు చర్యలను నచలమ్ముల
నారీమణి! యా మనమనోహరుని ॥ తేరగాంచి యా వనమయూరములు
గారాబమందు నీలాభ్రము వలె ॥ హరరుచులు మిణుకులుగ నా వేణు
చారుతర రవము జలధర ధ్వనిగ ॥ పారమించు కేకలతో నటించెను
లలన మనప్రియుని గలిసి సుఖింపగ ॥ దెలవారె రవియు నుదయాద్రి నెక్కె
నలినభవుడు పవలుల నిర్మించెను ॥ కలువకంటులకు విరహాచిత్త మతు
లకు వెగటు గాగ తా మందగమున ॥ శుకముల పలుకులు మనకు నిం పెటుల
నకట వలరేడు వికటమై గుఱి పడె ॥ సకల తరుణముల నిశిగా మనబో
టులకు నొడగూర్ప విధికి గుడిగట్టి ॥ నలరుల పూజింతుము గా దేలను
తలప దతడు పలుకుల చెలియలి డా ॥ కలయికను నెపుడు విడడె యి దేటికో
కలికీ! కృష్ణుడు మన పజ్జ లేని ॥ వలనున క్షణములు జాములు దినములు
నెలలు వత్సరా లగ్గె కల్పముల ॥ తిలకింపనైన వరుస హృదయమున
తలపు నించు నీ కాల మెటు గడప ॥ జలజాక్షుం డెపుడు ఇలు సేర వచ్చు
జలజాప్తు డెపుడు తా మరుగు గనునో ॥ అలగున కౌగిలి లోన రతి నేలి
వలపు దీర్చు నా సమయంబునకై ॥ పలువరింపు గనపలసె నందసుతు
గలసిన తాపము దొలగు గద యనుచు ॥ నల రబ్బ ననుచు కాలమున లేచి
పనుల మరచుచును రొందరు నెటుల బో ॥ గనబుచ్చి కృష్ణు రాక గోరుదురు
ఇను డస్తమించు తరుణము గదియగ ॥ వనితలు దూరము నందు గోధూళి
గని యా మందల వృషభాది ధ్వనుల ॥ వినుచు నెమరేగి తమ వలపు నెఱపి
పలువిధ చేష్టల కులుకులను జూపి ॥ తలపు సిద్ధి నారాత్రుల గందురు
వల రందించును హరి వారి కెల్ల ॥ వలరాజుబారి దొలగించు ప్రీతి
వినుము జననాధ! వృషభాసురుండు ॥ దనుజు డతిదుష్టుడు విని నా కృష్ణుని
మనమున గలుషము నెంచి రోషించి ॥ దనలంక గర్భిణుల గర్భంబుల

## —: శ్రీకృష్ణుండు వృషభాసురుని సంహరించుట :—

పాత మొనరింప పదహతిని ధూళి ॥ క్షితిని లేగి యా పతంగు గప్పగ
యాలిని కొమ్ముల చిమ్ముటల గిరులు ॥ పాతులును గదలి పడగ మ్రొరయుచు

జలదముల రాయునేపున మిగులుచు ఽ నల మంద గవియ క్రేపులు గోవులు
తలకె వృషభములు గోపాలకులును ఽ అలుక గదిరి కృష్ణుని జేర బోగ
లలనలును బెగడ జంకెల దూకిన ఽ జలజనయన! రక్షింపు రక్షింపు
మని తను జేర్కొన నా వృషభదాన ఽ వుని నెదురొడ్డుచు వనజనయను డనె
నను ఢీకొర వృషాసురేంద్రా! ఽ వనితల బాలుర పసువుల బెదిరి
గన వెఱపించుట బంటు తనమగునె ఽ నిను దునుమబుట్టి నట్టి నే నుండ
టరయవె మూఢా! కృష్ణశార్దూల ఽ మరరె నీ గొంతు మ్రింప కెట్లుండు?
ననుచు డాసి తన హస్తమున వాని ఽ పెను మూపురమును దట్టించి వాడును
తన తోక మేఘములు దొలగ విసరు ఽ చును గిట్టల నేలను ద్రవ్వుచును గ
కనుల విస్ఫులింగంగ కోపమున ఽ ఘనుని వనమాలి గని తన కొమ్ముల
నురమునను గ్రుమ్మ నురువడిని జూప ఽ హరి యటు వానిని నెదిర్చి కొమ్ముల
పరువడిని బట్టి కరికరిని ద్రొబ్బు ఽ కరణి పదునెనిమి దడుగుల నెట్టిన
వెనుకకు వెలకిల బడి చమర్చియును ఽ కినుక పెంపు దుర్మదము తోడుగా
వనజనయను వక్షమ్ము నూటిగా ఽ దనదృష్టి నిల్పి వెస లంఘించిన
ఘను డా గోవిందుడు వాని కొమ్ము ఽ లను బట్టి ధరణి పెడగిలను ద్రొబ్బి
దనుజ భటులకొ మ్మది యూడి నటుల ఽ తను భజించు దేవతలకొ మ్మొబ్బ
రొక కొమ్ము బెరికి దాన శిరమ్మును ఽ వికలముగ దునియ మొత్త నిల గూలె
నెత్తురు గ్రక్కుచు రోజుచు మూత్రశ ఽ కృత్తుల విడుచుచు నాయరిష్టుండు
బొత్తు పాసె తన ప్రాణచయంబుల ఽ నత్తరి దివ్యుల సుమ వృష్టి నిగిడె
యందున గోపకు లెల్ల జెలంగిరి ఽ మందల నెల్లరు సతులాదిగ నా
నందము గూరగ బలభద్రుండన ఽ మంద మోదమున త న్నగ్గింపగ
నట సుఖ ముండిరి గోపవ్రజమున ఽ నిటలాక్షు వినుతు డై నట్టి విష్ణు
డట కృష్ణ రామ నామాఖ్యల తా ఽ నటన మొనర్చుట లోక భద్రతకు
దనుజ సంహారుని దావన హృదయుని ఽ ఘనుని బంధ నిర్మూలుని గృష్ణుని
దన మనంబునను ధ్యానమును గూర్చి ఽ గానమున సురల చిత్తము లలరగ
వినుతిని సలుపుచు నారద మహర్షి ఽ కన నేగె కంసునిఁ దనుజాంశుని
మునివరుని రాక గనియు కంసుండు ఽ ఘనత మ్రొక్కి కూర్చుండ పీఠ మిడ
విను భోజనృపా! నిను బోధింతును ఽ మునిపోషకుండు చక్రి దేవకికి
తనయుడై పుట్టి తన యాజ్ఞ చొప్ప ఽ నను యోగమాయ యశోద తనయగ
బుట్ట దా నచట జేరి తనమాయ ఽ పట్టున నా బాలను నిట జేర్పంగ
గుట్టు దెలిపె వసుదేవున కాతడు ఽ రట్టు గాకుండ నాజ్ఞ పాలించె

నతడును రోహిణి నందనుండును | సతి దేవకి తనయులె నిలువు మేదను
యతులిత బలంబు దీప్తి తము నంద | మతిజేతురు తనుజులను దనుజాంశ
జాతుల నపాలురను మదాంధుల | దునుము మరి వినుము పూతనాదిగా
దునిమినా డతడు గాదా తెలియవ | వినుము మ్రింతు ననుచు నెద గూరినాడు
నిను నా యాపద యుపమాన దప్పగ | ననుపొంది జరింతువుగా యని నే
విన జెప్పితి నీ యత్నంబు కొలది | గను చరింపు మన తా వసుదేవుని
మనమున కుత్సితు డని దూషించియు | తన ఖడ్గధార దునుమ నడచుటయు
జన దలని దునుమగ ద ప్పెలదు గనుడు | వనజాక్షమాయ బయల నుడువందు
నినుః దలచు మంచివర్తన మనమున | ననముః డలని పగః గొనకుః గృష్ణుపై
బలము జూపు నీశౌర్యము వెలయును | తెలివిని గంటివి చాలు దప్పకుము
దలపు పరము నే పని వినియెద నని | తలకు నించి తా నరిగె యథేచ్ఛను
నారదుని వాక్యముల రోషమంది | సారచరితులను చెల్లెలి మరదిని
క్రూరతను లోహపాశ బద్ధులను | గారవంబు జెడ గూర్చి చెఱ నిడిమె
దనుజవీపడగు కేశియను వాని | వనజనయనును వేదునుమ బంపించి
దన పరివారము నందఱ గూర్చుక | మనమున భయంబు వెలిని డాంబికము
దోప సభ కుదిరి సాళ్వ కోసలుల | నా పగిదిని చాణూరముష్టికుల
ప్రాపు నంచుకొని భట మంత్రులాది | పాప చింతనుల మరి గజారోహ
కులను గూడుకొని వారల గాంచియు | నలుకు లేనియటు వారల కిటులనె
వినుడు నావలని భీతి నిండ్రాను | లును వెలిబారరు కయ్యమున నన్ను
గని నిపుడు గొల్ల బాలకు లిద్దరు | ఘనత బెరుగుచును నాపై బడరా
నునికి గాంచి కంసుని మర్దింతుము | అనుచు బ్రేలుచును దిరిగెదరట నీ
దినమున నారదు డది యెల్ల జెప్పె | మును పూతనాదులను దునిమె వాడె
వనజాక్షు డంట కృష్ణనాము డట | వినదగు బలభద్రుడు వాని కన్న
యగునట వారిసి నిందు రప్పింతు | బిగువు జూపి వారలను ద్రుంతు నిట
జగి పెద్ద గనుడు మల్లవీరులును | పగరను గెడపుడు చాణూర ముష్టి
కులను మీము గెలువ రుద్రుడోపడుగ | నల రంద రార హాస్తిప కేంద్రా!
నిలు మచట మల్లరంగద్వారమున | చలమునను కువలయాపీడ గజము
నల మదము నిక్క వారందు జేర | బలి పెట్టవలయు పశుపతిని గూర్చి
మును రాగ నున్న చతుర్దశిని యా | దినము ధనుర్యాగమునకు నుచితము
విను డింత నీశ్వరునకు బ్రియంబుగ | ఘనమైన పశువులను విశసింపుడు
వను గొల్పు భద్రమును బొందింపుడు | వను బాణ నరక పొండ్రాదులెల్ల

వినుతింప సఖ్యతను వృద్ధి గాంచె ౯ దను సుండి యనుచు నక్రూరుని గని
ఘనుడ వనఘుడవు నాకు హితుండవు ౯ విన నయ్యోగ వా మందన శత్రులు
గలరు నారదుని మాట లబద్ధము ౯ వలను గూర్పదగ దివియు హితములగు
జలశాయి యూతనల సుర లందరు ౯ వలగొని వెఱపున గనుబాక లేక
మొరపెట్ట సిటుల జన్మ మెత్తె నట ౯ నరుడు గా దంట నారాయణుడట
కరము వసుదేవు తనయు డగు నంట ౯ కరము డట నందుతనయుడు గాడట
పరమమిత్రుడవు అక్రూరహృదయ ! ౯ త్వర గని వారల నిట దోడితెమ్ము
అరి నడిగి గొమ్ము ధనుర్యాగమును ౯ సరణి గాంచ ర మ్మనుము నందరను
ధరణి శత్రురహితముగ బాలింతు ౯ అరిద మను డనెడు వారి నే ద్రుంతును
వినుము దిక్కరుల మించు నొక గజము ౯ మనపాల నున్న దది యీాను నడ్డ
గన నా బౌలుర నది శాలరాయు ౯ నను జయమందును గాద నామల్లు
రనిలో వారి సమయింతురు లేదా ౯ ఘనత నా ఖడ్గధార జెండెదను
వారలను జంపి నీవు వసుదేవు ౯ ధారుణిని తనువును తునుకలుగా నే
పారుటను గూర్తు నుగ్రసేనుని ౯ కూరిమిని దలపరాదు తండ్రి యని
నాతని నీ టడగించి దేవకుని ౯ నాతనితో హా త్తంద బంపెదను
నాతోడి వైరమును గొన్న వారి ౯ నూతకొననీను జీవనంబులను
నను గొల్చువారి కెల్ల మోదమును ౯ పెనుపు గూర్తు నీకును మేలు గూడు
ననఘుడవు నీకు తగు సి కార్యము ౯ జనుము వారి దోడ్తెమ్ము ముద మిమ్ము
వినుడు మీా కెల్ల నా జన్మచరిత ౯ ముని నారదుండు రహస్యముగ నా
కును జెప్పినట్టి దది నాప నేల ౯ జనకు డాది బంధువులు నా శత్రు
లగుట నే వీరి జంప నెంచుటయు ౯ దగు కారణంబు పొం దిక గల దది
వినయగుణాధీర ! విజ్ఞానహృదయ ! ౯ జనని పతివ్రత ధర్మిష్టి శీల
మున ప్రఖ్యాతిని గన్నట్టి చాన ౯ వనమున సౌరభ పుష్ప వల్లులను
ఘనమైన తరుల కలయికల మించుకటను కుసుమశోభ చివురుల కాంతులు
తొనరుగల ఫలములను వేడుకతో ౯ గనుచు గొనుచు నట దిరుగుచు ఋతుకా
లపు స్నాన మొనర దీర్చి శుచియునై ౯ విపుల మణిభూషణముల గంధ మా
ల్యవు దార్యంబుల సొగసున నొప్పుచు ౯ నవుడె నా వనవు సొంపు తలమ్ముల
తన పతిని గూడి క్రీడింప నెంచి ౯ ఘనుని రాక నెద గోరు దానితో
లలిసి యిటు బల్కె నీవు వే పోయి ౯ యల విభుని నన్ను కలయ దెత్తువే
వలపు గొంటి నని జెప్పు మాతనితో ౯ లలన యొంటి నీ రాకగోరె నను
మని దాని బంపి తద్ధ్యానంబును గొని ౯ విరహావశత నాథా ! యనగా

వనితమానము గ్రహియించి కామియై ఽ వనజముఖిని దాసెను సుగ్రసేను
రూపున నామెయు నాసురంబునను ఽ నా పతిని నయమున బొందవచ్చితివె
నీ పడతిని నను మరుకేళి నెనపు ఽ మూపజాల తమి నేఁపు గొంటి నని
యుతని బిగి కౌగిలిని దక్కి నిలువ ఽ నతడు గంధర్వుడగు ద్రిమిడాఖ్యుడు
నతని కిలి లంటి నవ్వుచు బాస్ప్రము ఽ మతిమెచ్చ రతిని దెల్పె నతివ గనె
నతని తన విభుడు గామి రోసించి ఽ మతిని వెత రోత దోచ నటు బలికె
రోరి నీ వెవడవు! నిటు మోసగించి ఽ నాతిని నన్ను కూర! దుర్మేలా!
నాతిని పతివ్రతను నియమ చిత్త ఽ మారయ కలుషము గూర్చితౌర!
బలుకు నిజము శపియింతు నీమదవు ఽ పలువ నిను జూడ రోత పాతకుడ!
నిలువు జెరచితివి నాదు విఖ్యాతి ఽ ఖలచరితు నిన్ను బొలియ దిట్టనగు
నన విని నే నరుడను గాను బాల! ఽ వినుము సురజాతి గంధర్వుండను
నిను జూచి కామవశత నందితిని ఽ నను గొంటి నీమ హృదయ మట్టులుగ
నిది నాకు సమయ మగుట గడిపితిని ఽ సుదతి శుద్ధునిగ దలపుము మనమున
నుదము దీర్చి కోపము జెందనేల ఽ మదిరాక్షిరో! యునులోమంపు సంతు
గనెదవు దోషము బొందదగు నిన్ను ఽ వనమాలిని కెద నిలిపిన వ్రతస్థు
డను నేను నాదు తేజము నీకు ఽ తిష్టి నిలిచె నొక్క సుతుడు జన్మించు
గనలు విడువు మది దైవవశంబగు ఽ మునుల మర్యాద లిటు గొన్ని గలవు
ఘనుల కివి తెలుచు ప్రాప్తి ఘటిల్లును ఽ ననిన నా జనని యా గంధర్వుని

—: శ్రీకృష్ణుండు కేశిని సంహరించుట :—

కినుక సడలకనె బలుక నంతలో ఽ దనయుడు శ్రీమంతుడు ధీరతముడు
ఘనుడు బలిమి నుత్సాహము వెలసెను ఽ ననుచు శాంతి గొన నాడుచు నున్నను
విపరీత ధర్మమును సాకెదవో ఽ! కపటు డయిన శశి దిక్కాలగతుల
విపులధర్మ సత్పథముల నరయుక ఽ నిపుణత బల్కెడు పంచభూతముల
సరణి నెరుంగని పాపివి నీతో ఽ కరము సుతుని నే గనియెద నేనియు
వరగుణ సంతతి గనని క్రూరుడగు ఽ హరిని ద్వేషించి మదమున బంధుల
హారి హారి విరోధమున దూరత గని ఽ హరిపదము జెందు వానిపుత్రతను
మదము గొనను పో బొమ్మనునంతనె ఽ అదె సమయమనుచు బ్రతుకు గంటినని
సుదతిని శాపము విడకుమని వేసి ఽ గదిసె తినమార్గమును హరి దలచుచు
వనిత యా గట్టు దెలుప దెవ్వరికి ఽ నను గనియె నేను నానాట బంధు
జనులకు విరోధినైతి విధివశము ఽ నను చా లందితి నటుగాన వారి

జనకుఁడాది సర్వులను గెంటించి § ఘనత బాం॰ మాగధుల సఖ్యతను
క్షితిని బాలింతు నాయాజ్ఞ సరణి § వితతయశమునను దిశల నుతిగాంతు
యతిబలప్రాప్తి సతసికి మీరలు § సతతము గొల్వగ నాకు భయమేల?
ధృతిని గొన్నాక మదము గూర్చుడని § మతిమెచ్చ రథము గూర్చి యక్రూరు
వినుతి మరి జెప్ప నాతఁ డిట్లనియె § జనపాలు దప్పుకు మాబోంట్ల కేల
నిను నానతి విడ దప్పి నడుతునే § యనఘ! నీ పిల్పుల గొని తెత్తు నట్లె
ముని నారదుండు తెలియఁజేసినటు § మనము దైవేచ్ఛ మెలఁగుదుము గాద
ఘను డాదేవుని మాయావిచేష్ట § లను దెలియుము రాబోవు ఫలగతుల
గనలేము విశ్వమయుఁన కే దెలియు § వనజనాభు డతఁడైన నంతె గద
యని సెలవు గొనుచు నింటికి జేరెను § జనవరుఁడు కంసుఁడు భవన ముందే
విను మో జనవర! కేశి హయాకృతి § దనర ఖురఘట్టనమున ధరణికిన్
ఘన భారమ్ముల్లె శేషు ఫణములను § గనరొప్రుమ సకిలింపున దివ్యల
కినుక జూపులను నసలజ్వాల లన § గన దంతరుచులు మృత్యుకోరలన
గోప గోపికా బాలవృద్ధులను § వాపోవ భయము వోప విహరించి
యీపగిది నితరులను భీతి బాదుగు § సపరిపాటి గదియింపగ నేలను
రిపు పీరులనెను వారెవరో వారి § నిపుడు గదియ వలె నని హేష నింప
నపుడే కృష్ణుడు వాని నెదిరించి § నిపుణ నిశాటా! రమ్ము నాచేత
గనెదవు పరంబు నిను బోనిత్తునె § నిను కరివి సింహా మది జీల్చినట్లు
దునిమెద రమ్మన యున్నంత లోన § దనకోప వేగమున వదనం బది
వడి దెఱచి కృష్ణునిఁ గఱవ రాగ § పిడికిలను బొడిచి కాటంద దప్పి
వడుపు జూపింప వాడు పదంబుల § దడదడ గూర్పగ దన్న నాధీరు
డడరి వాని వ్రేటుల దప్పుకొనియు § జవుపున నా హయదనుజుఁడు పుడమిని
బడద్రొబ్బి వాని నడుగుల నాల్గిటి § కడకను బట్టియు గిరగిరను ద్రిప్పి
విసరె ధనుశ్శత మాత్రదూరంబు § కసిబిసిని వాడు బడి మఱలి రేగి
వసుదేవ సుతునిపై దుమికి నోరు § వెస విప్పి మ్రింగ నుద్యోగించిన
వనజనేత్రుండు దన హస్తంబును § దనర వాని గుహాహోలు వదనమున
ఘనమైన ఫణివి జొనుపు క్రియ గూర్చి § గన వాని రదములను డుల్లించియు
యుదరమున జొనిపి వృద్ధిబొందించె § నుదితరోగంబు పెంపొందు కరణి
యదె శ్రీకృష్ణుని కరము వానికయి § కదిసె మృత్యువన యూపిరి బిగియగ
పదములు దన్నక చెమటలు గ్రమ్మగ § బెదరు వెడలె నన మిసిగుడ్లు వెలిని
బడ పుడమి బడియు జీవముల విడిచె § జడి బఱపిరి కుసుమముల దేవతలు

జడధివాసుండు హస్తమును లాగ — నడుల వడి మొగిచి నుతిజేసి రతని
దివిజాలు మింటను నట గోపబృంద — మవిచార మందె నందరికి ముదము
గవిసె లోకమంగళము ప్రాపించె — సువిశాలయశము నందె కృష్ణుండు
శ్రీనికేతనుడు భువననిర్మాణ — ముగ వనజభవుని నిల్పిన దేవుని
ధ్యానధారణాదులకె వశమందు — మానిత మూర్తియు నగు నావిష్ణుని
గని రహస్యమున నారదసంయమి — ఘనత వెలయ నిటు సన్నుతి సలిపెను
విను భువనాధిప! హరి! వాసుదేవ! — నిను సర్వభూతమయునిగ పరమే
శ్వరునిగ దారువునందలి జ్యోతిగ — పరతత్త్వ విచారసమృద్ధ లెరిగి
పురుషవరుడనుచు లింగాఖ్య బల్కు — కరము నిర్గుణుని గుణాచర్య గూర్చి
జననాది రహితునకు జన్మ మొప్పు — లను నిల్పి సత్య ధర్మ స్వరూప
మున రాజిలెదవు సత్యాఖ్యముగ — నని ముక్తు నెదలో నిలిపి సేవింపు
లని నీకు నెల్ల నర్పించు బుద్ధి — దివి విముక్తి నిలయమును వేడెదరు
పరివిమలానంద! ప్రకృతి నిరాకర — సువిచార నిలయ! శుద్ధసిద్ధనుత!
పలువిధ రూపుల బరగు బ్రహ్మాంబ! — వలనుగ నమేయగుణస్పృష్టి నీది
ఇలలో నీవు దుర్జనుల బొలియించి — యలరున భారము దరుగ నీక్షితిని
పాలింతు వికను బాలియింతు నట్టి — పాలిత ఖలతతి దమనుడవు నగుచు
నీలవర్ణ! చాణూర ముష్టికులు — పోల నల్లె గజ కంస యవన ముర
నరక బాణ శిశుపాల పౌండ్రులును — వరుస మరికొందరను నని జంపుదు
వనఘ! పారిజాతమును క్షితి నిలిపి — ఘనత నిగుడ నర్జునునికి సారథి
వనగ ప్రబలమగు భారత రణమున — జనపతుల ధర్మద్రోహుల బొలియగ
జాతువు కృష్ణా! నీలీల లెన్న — నా తమ్మిచూలికిని శేషునకును
ఈ తత్త్వరాశిమూల మే తత్త్వ — మూతగానెనొ నిను నీకే తెలియును
విను ముక్తిప్రదునిగా వినుతింతును — మునిమందారా! నీకు నతు లిదే
నని సర్వమ్మును నెఱుగబలికి దా — వినువీధి నేగ నా బ్రహ్మసుతుడు
విను జనేశ్వరా! గోపకుమారులు — వనమున బశువుల మేపుచుండి యొక
దినమున నచ్చటి కొండదరి జేరి — మన మలర నిలాయన క్రీడగూడి
కొందరు గొఱియల మే మనగ వారె — కొందరు పాలకులుగ వరుస గనగ
కొందరు దొంగల మనుచు కొందరిని — మందబోలె గొని దాగు నందింతు

## —: శ్రీకృష్ణుండు వ్యోముని సంహరించుట :—

అందు మయాసురసుతుండు వ్యోముండు — ముందుగొ నియాడి ముచ్చు దా నగుచు
యందు గోపకుల నందరి మేకల — మంద నెపంబున దా గోపకువలె

చందమించు రూపునను గాని కొంక § నంధత సిండిన గుహాలోన శేర్చి
యల వారి నల్వు రేవురు దప్పగ § మెలమెల్లన శస్త్రాలను నొక్కటన
బలమున నొక్కటి గండశిల గప్పి § చలమున నందరి జంప గడగు నెడ
జలజ లోచనుడు హరి వాని దెలిసి § పలుక ! గడిదొంగ ! రారా మిగిలిన
మముగూడ గుహను జేర్తువె దుష్టుడ ! § క్రమము గంటి నీవిపరీత చర్య
భ్రమ గూర్చితివా ! నాతోడి వారి § సమమతిని హీన ! యనుచు సింహంబు
దను నెదురొడ్డిన వృకమునుగా బోల్చి § ఘనత వాని లంఘించి పట్టినగా
దన నిజరూపం బొప్ప బెరిగియును § దను దప్పకొనగ బలమును జాలక
శంక కింకిరిని కినుక పెనగొనగ § పంకజనాభుని బొడిచె శిరమునను
నొంకును గొనకను తన్నిటు గూల్చిన § పంకమతిని పిడికిటిని నురమ్మున
పిడుగు బోలి నడరించ వా డట్టె § పుడమి బడి తిరిగి తన్నుక జీవము
విడిచె సురలు సంతసమున గూరిరి § బడిరి వేదనల పాపముతు లెల్ల
వడి నరిగి కొండగుహాలోని వారి § కతు భీతివాయ గండశిల ద్రొబ్బ

## -: అక్రూరుండు బృందావనంబున కరుదెంచుట:-

దడ దొలగి వారు తను గూడిరాగ § వడచె మందకును బడతు లలరంగ
జననాథ! వింటివా కంసుపంపు § నను నక్రూరుడు బృందావనమున
కును నేగ రాత్రి మధురాపురంబు § నను నిదుర దీర్చి వేకువన లేచి
తన నిత్యకృత్యముల దీర్చుకొనుచు § ఘనత నెరయ రథ మెక్కి తా గదలె
వనజాక్షు డున్న బృందావనంబు § గన త్రోవలోన హరిని దలచె నిటు
ఎట్టి పుణ్యఫలముల సారంబో § వట్టున యోగులు ధ్యానంపు దృష్టి
పట్టున గానని పరబ్రహ్మమును § అట్టి యిట్టి దనరాని మహనీయ
తను వెలుగు గాంచినట్టి పరతత్త్వ § ననఘు చిద్విలాసుని భవదూరుని
గన నేగ గల్గె తొలిజన్మకలిమి § ధనదు నైశ్వర్య కలిమి యస్థిరమె
వనజాక్షు గొల్చు ధనము జపతపము § లును యథోచితపు దానవ్రతములు
అనయ మక్షయపు సుగతుల నలరున § మునుకొని నరతను వెత్తిన ఫలంబు
నను రాజ గూర్చు స్థిరధన మబ్బెను § గన నచంచలపు నిధి హరి సన్నుతి
మూరిజనులు తొలి యేదేవు నీ వా § సారస వైఖరి గను చరణంబుల
పారమందు నఖరాజి తేజమ్ము § దారుచు భవాంధకారాధిష్ఠిత
నని గొలుతు రట్టి పావన మూర్తిని § తన విరోధమున నైన దల పుంచి
నను బంచె విలువ శుభము నాకగును § గనగ కంసుండు హితవరిష్ఠుడగు

నాకు సందియము లేదందు నిజము § యా కంజాక్షుడు కంససఖు డనుచు
వీక సరిపోల దనుచు దలంచియు § వే కక్కసమున దుర్జనుం డనుచు
తన నైత్యము గనని దోషా భక్తిని § నను మెచ్చుకొ ననుచు నాదరించునో
గనద దివ్యచిత్తమున సర్వజ్ఞ § దుఃఖుల హృదయ నివాసి యచ్యుతుఁడు
అటులైన ధన్యుఁడను భాగ్యరాశి § తటమందు నన్ను పుణ్యాళికట మది
జటి వినతుఁ డా ధ్యాన మాత్రమున § కుటిలము చిత్తముగాని తత్త్వమిది
అకల విభ్రాజితము పూర్ణచంద్రు § వలచ గనుమోము దరహాస యుతము
జలజముల శ్రీవి కనుల సోయగము § యల కర్ణకుండలముల నా కాంతి
తిలకింప గండముల చెలింపు గన § నంకు నింప దనభక్తుల గాంచగ
రొనరు దయ గూర్చు హరి నను మెచ్చును § గనగ శుభము సూచించె మృగంబులు
జనుచున్నవి కుడిదిక్కు భద్రమది § వనమాలి కరుణ నాపై బొరలెడు
పరమ పురుషు డాహరి యవతరించె § ధరణిభారంబు గెడప విధి వినుతి
నరరూపున ధర్మంబు ఎడి నిలుప § కరము సుజన రక్షణము వృత్తముగ
నా సత్యమూర్తి దంట నే దరిసి § నా సకలాంగములను సాగిలంగ
చే సన్నుతింపు విని తన హస్తము § వాసవాది భయదారిత శ్రీదము
నాతలను జేర్చి ముదము బెంచు నని § కాతరుఁడు గాక ప్రీతిని నేగుచు
ఎవఁడు కార్య కారణముల రెంటిని § దవిలి సర్వసాక్షిగ నెన్నఁబడునో!
ఎవని సన్నుతిన మునీంద్ర గణములు § భవసాగరంబు దరింపఁ గందురో!
ఎవని సంస్మరణ పవిత్రితను గన § దవులనీని మతిఁ బో దట్టు! వాని
పొందు తన తనువు బోల్పఁదగు నట్లు § లవముగా నందు కైన భూషితమె
యని దలంతు నని ఘనులు విబుధాళి § మనముల కామము లెల్లఁ త్యజియించి
వనిత లాది సందడుల లంపటము § లని మమత సేయకను సర్వమయుఁడు
హరి యాశ్రయమందు పరమ పదవాసు § డరసి నిత్యసుఖ మొసఁగు చిరసితి
కరము సంప్రీతి తన చరణసేవ § పరమ మోక్షగతి గావర మొసగును
యదువంశభూష! నొందు తా వెలసె § ముదము దోప సౌహృదయభావముల
నుదిత జిజ్ఞాసఁ గదియు ప్రవర్తన § జనురంద నిమ్ము గొను వరదుఁ డచట
మును లది మెరుంగుటల వారి హృదయ § మున దా వసించు తా మోదపూర్తి
నను దుఃఖబహుళ సంసార గహన § మున త్రోవ జూపి ఘనత దయ నేలు
ననుచు మరి పెక్కు విధముల గృష్ణుని § తన వివేక సంస్థితిని చాల్గొనియు
వనరుహనాభా! వాసుదేవ! శ్రీ § కనకవసనధర! కాలవిజ్ఞాన!
మానవలక్ష్యాంతర్లక్ష్యనిలయ! § మానితసుందర! మారమణీశా!

యని నుతింపుచును జని గాంచె ముందు ఽ నను హరిచందన కుంద మందార !
ఘనసార సాల నింబ రసాలము ఽ లను పొంద తరువులను పుష్పలతల
ననుమోద ముబ్బుఁ గనఁ జేయునట్టి ఽ కనులపండువును మనములకు విందు
గను మెప్పు గూర్చు కాళిందీనది ఽ ఘనత పుణ్యాజన కౌతుక దర్శన
మును నగు ప్రవాహముఁ జెంపఁగన్న ఽ ముని జనవినుతము బృందావనంబు
గని తొలి నమస్కరింపు సెల్లించి ఽ వనజాక్షుఁ డింక నను గోచయముల
తాను పాలించ విహారమందును ఽ మానుషాధ హంతకుఁడు క్రీడమె
గాని బ్రహ్మాండములను పాలనంబు ఽ నాను దైవమున కిది యివ్వ యౌను
ననుచు నట పచ్చికలసొంపు గాంచి ఽ యును మేత గూర్చి దూర మరిగియును
గో పకులు బిలిచి నంతనె దూకుచు ఽ మేపుల దృష్టిఁ జూప వడి దరియు
నా పట్టుల గని సంతసిలుచు మరి ఽ ఆ పద్మనయను లీలలు బాడుచు
గో వృషభ మండలిని ప్రత్యేకము ఽ తీవ్రతల దోపఁ దోలుకొనివచ్చు
నా వ్రజవాసుల యాకారంబుల ఽ నా వ్రతధన్యుఁడు గాంచుచు మదను
దరియుచు మనమున రామకృష్ణులను ఽ కర మాదరింప నెపుడు ప్రొక్కెదను
కరి వరదుఁ డెపుడు తన యభయకరము ఽ శిరము పరము గన నిడు నొక్కొ యంచు
బలభద్రుఁ డల్లి నను జూచు నెపుడో ఽ యలుకనను జెందు నెప్పు డెప్పుడని
జలదశ్యాముని దలపుచు సూర్యుఁడు ఽ అల పశ్చిమాద్రి జేరక మునుమున
గనవలయు ననుచు తీవ్రత రథమును ఽ నడుపు కొనుచు తా ఘోషమున జేరి
గనె గోపవనిత లచట నచట నా ఽ వనజాక్షుని గన పనులెల్ల విడిచి
యొనరున సంకేత స్థలుల నిలుచు ఽ లను గాంచుచు దోహనముల చప్పుడు
వినుచు జలజాంకుశాది రేఖలను ఽ గని భూమి నచట తా రథము డిగ్గి
మనమున నివి యా హరి చరణచిహ్నా ఽ లని యాచరణ రజము దిక్పాలుర
వరులు కిరీటములను దాల్తు రట్టి ఽ సరసిజాక్షు పదధూళి నే బొరలి
ధరను పవిత్రుఁడ నయెద నని యటుల ఽ కరము తనువునను పులకలు హర్షము
నను బొడమ పొరలి హరి మందనున్న ఽ యొంర రచటి గోపకుల దెలిసి వేగ
మున నచటు జేరి రామకృష్ణులను ఽ గనె శ్వేత నీల గిరుల చందమున
దనరారు వారి లోకమండనుల ఽ ముని వినుతుల కమనీయ గాత్రులను
ఘనుల సుమహారథులను దయారతు ఽ లను నభయదాయులను దనుజ దమను
లను గని కృష్ణుని చరణముల వ్రాలి ఽ ఘనత సాష్టాంగమున నతి గూర్చిన
వనజనాభుఁ డాయ క్రూరుని తను ఽ మునుకొన్న భక్తి మై మరచువాని
వినయ సుందరుని జనహితంకరుని ఽ ఘనమైన భక్తి తను మ్రొక్కువాని

కరముల నొత్తుచు కౌగిటను జేర్చి । వరమతిని రాఁము డల్లి యాదరము
పర మందించెను వారిరువు రతని । సరస మందిరమునకు దోడుకొనుచు
విమల పీఠ మిడి పాదముల గడిగి । క్రమత మధుపర్కమును గోసహితము
సమమతి పూజను నిచ్చియు రసవం । తము నైన యన్నమున విందు గూర్చి
రమణీయ గంధమాల్యాదుల నిడి । కమనీయ తమ్ములము నిచ్చి శాంతి
గన నందు డతనిదరి నుపవిష్టత । వినయ మొలుక నో యనఘ ! యక్రూర !
వినుమయ్య సేమమే ! యని నుడువఁగ । మనము గొంకు నా కంసుపాలనము
నను నట చెల్లెలు కన్నీ రొలుకగ । తనయుల తనయను జంపినా డతడు
కనికరము దవ్వఁ గనడు క్రూరులను । తనసన్నిధి నిలువంగ మెప్పుగను
నను నంతలోన వారిజనేత్రుఁడు । వినవడిగె నచటి భద్రముల నతని
వారొనుము నీదు కుశలము మొదలుగ । నాశరణి బంధు హిత ప్రజలకును
మాకు మామగద కంసభూపతియు । సోకదే భయము నెద్దాన నైన
పావన చిత్తులు నా తలిదండ్రులు । దేవకియును వసుదేవుఁడు చెజిలో
మావలని పుట్టు వే నెపముగాగ । నావడి శోకము నంది యుందురుగ
నీవు రానైన తెరి మాటాడితె ? । నా వార్తలచట వినరు గాఁబోలు
ఏవలను వారి యిడుములు దొలగునో ! । దేవునకే తెలియు వారి సంకటము
లెటు ! లుండునో నీరాక యెందులకు । నిట నేమి గనగ నేతెంచితివో !
కుటిలహృదయుడవు గా వదెతీతిమి । చటుల మందకను తెలుపు సన్మతిని
నన వనజాక్షుని గాంచి యక్రూరుఁ । డనుమతిని సర్వమును తెలియఁ జేసె
మునివరుడు నారదుడు మధుర జేరి । కినుక కంసునకు రేపి తా నేగ
తను బంపువరకు నన్ని విశదముగ । వినజేసి మిమ్ము ధనుర్యాగమును
గన వచ్చుటకై పిలువ నను బంచె । వినుడిది నెపంబు మిము రొప్ప నెంచి
ఘనత నించి రథమిచ్చి పంపించె । మును మీ రరిని బెట్టవలసినది
గాని రమ్మనె నని నతి తోడు గూర్చె । ఘనులైన రామకృష్ణు లాసరణి
విని నవ్వి తమ్ముఁ జుట్టి కూర్చున్న । వినయ ధురీణుల గోపకుల జూచి
వరవరుడు ధనుర్యాగమును జూడ । నరిగొనుచు గావ్కలను గొని రమ్మని
వరయువలయు మన మా మధురయాత్ర । పరమోత్సాహము జేర నరుగుదము
కరము పాలు పెరుగులు నెయ్యి మొదలు । వరమైన యుపాయనముల గదలుడు
వర వృషభంబుల శకటముల బూన్చి । తరమందు యానముల సిద్ధమగుడు
అని యానతి శ్రీహరి తమవారికి । మన మలర జెప్పి యాత్రజాట గన
విని వనిత లాగోప సుందరులు । మానముల విచారమంది యుండి పోరి

వలని మనోహర లీలలు వాక్కులు ఽ యల నవ్వులు పరిహాసముల ప్రణయ
ములు నల్కలు లాలింపులు నేమగు ఽ వల నేడి యడ్డ? తగుపాటి యెద్ది ?
యనుచు నేకాంతముల గుములగుమను ఽ వనితలార ! విధి దుడుకు గూర్చె గద
ఘనుఁడు మేటి గృహపతి యని నమ్మక ఽ మున మోస మందితిమి మనల హరిని
ననయ సేవలను దన కందనీక ఽ ననుకూల వేగవశమునఁ బాపెన
మనము భారతిని మ్రొక్క వేమదమ ఽ తనవిభుని వ్రాత దిద్దింపు మనుచు
తరుణులార! హరిచర్యలఁ గాంచరె ఽ సరసిజగంధుల బాయ డెటు లనక
పరువున మధురకు బయనమయ్యెఁగదె ఽ కరము తను నమ్మినార మనముగా
మరుని కోలలను నేమామరో నను ఽ విరహమున నోపరని యెన్నడు గా
వల దట బోవగ నని గోపవరులు ఽ పలుకరె దప్పెను. మార్గము నరయుఁడు
యల కంసుదూత యక్రూర నామకమలవడ దాల్చుట క్రూరత మెలఁగుట
గాదేని విభుని మనవీట వదలి ఽ యాదవుల పురికి రావలదనవే
మాధవుని మనము నాన బోధింప ఽ నేది యనుకూల మరయుఁడు మెల్లన
వనజముఖులు మధురాపురమునందు ఽ వనజ నయను మన విభుని సోయగము
గని మేడలెక్కి సువర్ణలాజములను విరుల గురియు తా నలరు గాని
మనల వ్రేతలను మనమున మెచ్చునె ఽ కనునె దయ వారి సంగతిన మెలఁగి
కనకచేలుఁ డా కనకాంగులవౌ ఽ తనువుల మెఱుగుల నర్మముల నరసి
విన సొంపు వాక్యముల వలపు పాట ఽ లను మరగు క్రొత్తవనితల పొందుల
మనసు నిలుపుదురు నరవరులు గదే ఽ మన నోము లిటుల ఫలమందె గనుడి
పుట్టిన నాటను హరి నెఱుగని యా ఽ పట్టణ సుందరు లితని గూడంగ
పట్టంపుటయును మన మిట వసించి ఽ దట్టపు విరహము పట్టున విచార
మట్టె జుట్టుకొన గుట్టు వెలిగాగ ఽ రట్టున దైవము గూర్చె నిక నెట్టు
హరిని గాని పోకుమని యక్రూరుని ఽ చరణముల మ్రొక్కెదమ శ్రీవరుచే
తరుణుల మందర మడ్డి నిలుపుదమ ఽ వర మిడ వేల్పుల నర్చింతమ యిక
మనవారి కెరుక గూర్చె మరల్తుమ ఽ విభుఁడేది యనువు దృఢము గొను డనుచు
వనజ నాభు విరహమును నోర్వకను ఽ తను నంబర భూషణముల మనమున
దలపక నేడ్చిరి సిగ్గులను వదలి ఽ యల పవన చలిత లతల తనువొప్ప
కలికి చయము కన్నుల జలధారల ఽ నొలుక గండముల పల్లవ కరముల
జేరిచి మాధవ! మా జీవధనమ! ఽ సారసనయనా! సమ్మోదదాత!
నీ రమ్య సంగతిని బాయనేర ఽ మో రమణీయ! మనోహర! బాయక
మేర నీ వెంట బార నేతెంచి ఽ తీరము గందుము విరహాబ్ధి దాటి

నీరజనాభా! నీవే శరణివి § నారుల నమ్మిన వారివెంట గొను
మన వారికరుణ దూతిక ముఖమున § మనమున నూరట గనుఁడు వేవత్తు
నను మనమున జింతింపుడు సుఖమును § ముదుకొన గూర్తును సంగతిని ముందు
వనితలార! నే సత్యవిలాసితు § డని తెలియు నయ్యోగద మును చర్యల
నన వారు నమ్మి హరిదయను మెచ్చి § రనఘ! సద్ధర్మరతు డాత డనుచు
వినుమా వేకువ నన్నతోఁ గూడి § యొనరు వేచి సంసిద్ధులై యున్న
తన వెంట వచ్చు నందాది గోప § జనుల శకటముల గోరసము లాది
గను కానుకలను గొనుచు నుత్సాహ § మున కూడరాగ వారి తోడుతను
మునుముందే యక్రూరుఁడు సిద్ధము § గను తేరనైన రథమును రాముడు
ననుసరింపగా నెక్క యట నిలుచు § జనుల నిలుపుచును దినకరుని యుదయ
మనుకూల మెరిగి గదలె విష్ణుండు § ఘనుఁడు మున్ను దనుజుల వధియింపగ
వరిగెను విధంబు దోఁచె దివ్యులకు § హరి తా కృష్ణుఁడు మధురాభిముఖత
సరణి నక్రూరుఁ డరదము నడిగా § బరప మందవాసులు యా మూర్తుల
పరమపావనుల పరమేశ్వరులను § వరుస నుతింపుచు మొక్కుచు నిలిచిరి
వనితలు వనజాక్షుని మధురాయాత్రి § గనుచు నదిగో హరి వెంచేయు చుండె
వనమాల యదిగో శిఖిపింఛ మదిగో § కనకచేల మదె బలభద్రుఁ డదిగో
యనుచుఁ గనుచూపు లందిన యంతకుఁ § గని యిండ్ల చేరి హరిని నుతించిరి
శ్రీహరి రామాక్రూర సహితుఁడై § ఆ హరితనయయు పాపహారియును
నా హరిచే నిర్మలము తనొందు § మహనీయత కూరు రాహిని దోఁచిన

-: అక్రూరుండు యమునాజలంబుల శ్రీరామకృష్ణుల దర్శించి నుతించుట :-

పావనమూర్తిని నుతించు నదియును § నై వెలయు యమున గాంచి రథ మాపి
దేవవినుతుండు కృష్ణుఁడు జలముల § ద్రావ నెంచి బలభద్రుని గూడియు
నదిలోనఁ జేరి జలములను ద్రావి § ముదమున జెలంగి తీరమున నున్న
మది మెచ్చనైన తరునీడ నున్న § యుదితప్రకాశ రథమ్ము నెక్కను
అంత నక్రూరుఁడును వారి మ్రొక్కి § సంతస మొప్పఁగ వారి యానతిని
పొంత నున్న యా పావననది నీ § రింత నిర్మలము నౌ గాక యనుచు
స్వాంత విధుల జెల్లింప స్నానమున § యెంతో హాయి గని వేదమంత్రముల
చింతను గూర్చియు నుండ తనరైన § చెంత నీర నా రామకృష్ణులను
గని వీరలు రథమందు నుండిరే! § వనమును దరిసిన డెందుకో యనుచు
ఘనులిట నెప్పుడు వచ్చిరో యని యల § రుచ వడి రథమును గాంచె నందువను

వనజ నయను లిరువురు నొప్పుచుంట | మనము విభ్రమాశ్చర్యసంగతిని
నదిని మరలఁ గనె నందున నుండిరి | యిది చిత్రమనుచు మరియు నరదంబు
చదురంది యుంట మది వెర గందుచు | నదయులు వీరలు వెంట గనఁబడిరి
ముందు రథంబున నిందు లేరుఁగాఁ | నందమింపు గనుచుండిరి యందున
బొం దండి యుంట జాలమొ ! కలయో ! | చందమేమొ యోచింప నే నోప
ననుచు జలమునను నళ్ళల చిత్రము | నను విలోకింప వేదభూషితుని
ఘనుని వేయి మస్తకముల భాసితు | ననఘు నహీశుని మణిభూషితునిఁ
క్షితిని తలల నాడించు మూర్తినిఁ | క్షితిపతి వేషుని దయాభిలాషుని
సతత సంతోషు శాత్రవ జిగీషు | నతిశాంతు విగతదోషు శేషునిఁ
గన నీలాంబరసంయుతుని సిద్ధు | లును నురగవరుల వినుతింపగ నగు
మండిత మూర్తిని గని నతి యొనర్చి | నిందుముదంబున దేలి యందు బ్ర
హ్మాండ పరివేష్టు దివ్యప్రభావు | చండాంశు కోటి ప్రభ నొప్పు దేవు
హారిద్ర వస్త్రాంకితు డగు మూర్తిని | నురమున శ్రీదేవియు నొప్పువాని
కరము నలుమోములుం గనతనయుని | వర మంద బుట్టుకను గల్గినట్టి
వరుసఁ గనెను కమలపు నాభివాని | తరమున బహుపద క్రియ విశేషముల
రవము నింపు చరణముల నూపురాల్ | దవులందువాని ముని విరించి సుర
భవ సనందనాదులు మ్రొక్కువాని | భువన సుందరుని బురుషవర్యునిఁ
గన శుభలక్షణ లక్షిత నఖపద | ఘనతర గుల్ఫములును జాను జంఘ
లును నూరు కటితలము నాభిమధ్య | మును నుదరంబును పాదరంబునుఁ
గలిగి శ్రీవత్స కౌస్తుభ వనమా | లల విరాజితపు విశాల వక్షుని
నల కంబుకంధరుని నిందువదను | జలజ గదా చక్ర శంఖ హస్తుని
వర మణి కుండల హార కేయూర | కరకంకణ కటకాంగుళీయునిఁ
తరణి ప్రభ దోపు మకుటంబువాని | సరసిజ నయనుని సుందర కపోల
ఫాలభాగునిఁ కరుణాలోలుని | చాలు మెప్పందు నాసాధరములు
ఆ లలిత రదన కర్ణ గండములు | వలనొప్పువాని భక్తపాలితుని
నారద ప్రహ్లాద సునందనాది | సార సంస్తుతుల నాలించు వాని
శ్రీరంజితు శ్రీపుష్టియు తుష్టియు | నా ఁహిని కీర్తికాంతి నార్జవము
లారయ విద్యావిద్యయు శక్తియు | ధీరతయు మాయలును సేవింపగ
సరస సిద్ధులును సిద్ధ మహర్షులు | కరముల మోడ్చి వినుతించు వారి
గని గద్గద కంఠమున శిరమ్మున | తనహస్తములఁ జేర్చి మెల్లనను
వినుతి జేసె నిటు జనవర ! వినుమా ! | ఘనతరంపునుతి గాన వినోదము

శ్రీ పరమేశ్వర ! శ్రీ రమావిభో ! § యో పురాణపురుషోత్తమ ! నిర్గుణ
రూప ! బ్రహ్మాండలీనస్వరూప ! § ప్రాపక చిత్కళ ! విచిత్రభూతిమె
నీపరంబు నగు టది చిత్రతరము § యోపద్మనయన ! నీ సగుణరూప
మును నుతింప దర మెవ్వారి కగును § మునులు దోచినటు బల్కుదు రదియును
మనమున కచింత్యమగు వ్యాప్తికేశ ! § కన దొమను నీయందు నొప్పారగను
నిను మొదల దలప విన కన రాకను § నను వందునెద్దీ ? యది నీ మూలము
దాన నేమి తలపోసితో రూపము § గానరానివి తత్త్వముల కళలు
వేన వేల తెలిగల ప్రాణత్రాణ § బూని సంకల్పమాత్రమున బొడమ
వాని నీసకలమును దోపింపగ § వేన వస్త్వంతర వ్యాప్తి గూర్చి
తొలుత నీవొకటి దవ్వలిది మాయ § తెలిపి నీతత్త్వ మదిమాయ తత్త్వ
కలవగా రెంట బొల్పనగు నిన్ను § తొలిని వస్తుశూన్యుడ వీపథమున
గల సర్వంబుల నిన్నె కా దలచి § యలచి నలువ వేదములు బొగడుటలు
సురలు మును లదియు నమ్ముటలు బలుకు § టరయ నిజము యో దేవ! నిరాశ్రయ
పరుడవై భూతముల కాశ్రయుడవు § వరుస మాయాప్రధానపరిష్వంగ
మయిన మానసేంద్రియ వృత్తులట్ల § వయిన మొందంగ కారణ కార్యము
లను విస్ఫారిత మాయాప్రశక్తి § ననువుగ జొరగా పురుషరూపి వయి
ఘనత నీకళను నందు జేర్పంగ § వనజాక్ష ! నీదు లోన లీనంబు
నందినట్టి యీవిశ్వము జనన § మ్మందె యీప్రకృతి గర్భమున నదియె
నంద మెప్పెం దా మహత్తత్త్వమది § ముందు వెనుక లగు దంశ గుణముల
వినిక నది ప్రకృతి యంశముల కాల § ముఖ దేశంబును గుణముల చాలును
గని యిటుల భేదముల వెలుగు గాంచి § దనరె నేకముగ నామాయ పొత్తు
నను విశ్వమెల్ల సర్గాదికములు § ననయము నీలో నివి యయ్యె నీశ !
విలయ జలధి కల్లోల జాలమున § పొలుపునను బాలు లీల వటపత్రి
మలర శయనించి నారాయణాఖ్య § వెలయు దీవె నీ నాభికమలమున
నలువ బుట్టగద పంచభూతములు § దలప యోగ్యములు మానసాదులును
గన నింద్రియములు లోకసంతతులు § ననువొందనైన యా బీజమ్ముల
కును నెలవును నీవు నయి స్థూల మూర్తి § మన నొప్పు నాత్మ రూపమున భ్రాజి
తము నంది యణువు మొదలు నీమయము § విమలమూర్తి ! ఈ విశ్వజాలములు
క్రమిత నీ మహాదేహంబె యగును § సమత నందు నవి సర్గ స్థితి లయ
ముల నీవందున వైశ్వమూర్తి § కలవ విహరించు జ్యోతివి నీవో
అలద శ్యామా ! నీ యొప్పిద మిది § యల యధ్యాత్మములను పదునాల్గిట

మనమాది నాల్గు దశేంద్రియము లవి ॥ గన తన్మాత్రలు నైనవి యైదగు
వినుట తాకుటయు కనుట రుచి గొనుట ॥ యును వాసన గొనుటయును యట్టులే
పలుకుటయు దాన గమన విసర్జన ॥ ములు నానందము నిశ్చయ చింతన
ములు నభిమానము తలంపునను నివి ॥ వెలయు నవి భౌతికములు నీమయమై
నీ వధిదైవము లను భేదమ్ముల ॥ తోత్రవ దిగ్వాయు లరుణ వరుణులును
ఆ విధి నశ్వను లనలు డింద్రుండు ॥ దేవ యుపేంద్రుడు మృత్యువు బ్రహ్మయు
గురుడు క్షేత్రజ్ఞులును హరచంద్రులు ॥ కరము నీమూర్తి భేదమ్ములచే
వరయ నధిదైవతము లివె యయ్యు ॥ పరముడవు యొక్కడవె వెలయుదువు
వనమాలి ! నిన్ను విజ్ఞానధనులు ॥ ఘనత నిగుడు కర్మములు నిరసించి
మనము సంసార మితిని దప్పించి ॥ మునుకొని సన్న్యాసము నంది సర్వ
మున నిన్ను గనుచు ధన్యత గాంతురు ॥ ఘన మతులు పాంచ రాత్రానుసార
మున దన్మయత్వపరమున భవ్యులు ॥ నిలు వాసుదేవ ప్రద్యుమ్నులుగా
ననిరుద్ధుండని సంకర్షుండన ॥ గన నాల్గుభేదముల దలంతురో
నిరుపమాన ! సర్వేశ ! యచ్యుతా ! ॥ వరదాయక ! యీ సరిత్తు లన్నియు
వరయ నబ్ధిలో సంగతములై గద ॥ తరణి చంద్రులు కుంభాంతరముల
పలువిధుల దోచినను మూర్తి యొకటె ॥ తలప నభక్తుల మత్లే యేకము
నలినభవజనక! నీకొప్పిన మతి ॥ కల భువనంబులు పదునాల్గు నీమ
వలని దేహసంస్థితము లౌను హరి ॥ అల పదము లాది శిరము వర కటుల
బలారి వందిత ! దశావతారము ॥ లీలావతంసములుగా దాల్చియు
బలారి సంపదలను మదమందిన ॥ తలాలఖలులను సంహారింపగా
నీ వవతరింతు వంతట సుజనుల ॥ గావ ధర్మమును నిలుప రమేశా !
ఈవలను నిన్ను నిజరూపు గంటి ॥ దేవుడవు నిన్ను నీకృప దెలిసితి
జలవాంఛ నెండమావుల దరియగ ॥ నల తృష్ణ దీరు టెట్లు జగదీశ !
కలలోని సౌఖ్యగతులు వనితాది ॥ కలిమి నాశించ నిదియు చంచలమై
స్థిరముగా దిండు సుఖరహితమై గద ॥ నిరతర దుఃఖము నిడు నీడ మగును
పరమపదవాస ! నను దయ నేలుము ॥ నిరతము నీచరణముల భజియించు
వరము కృపసేయు మిదె మున్మారులు ॥ ధర సాగి మ్రొక్కెదను సర్వేశా !
సురపోషణ ! సుస్థిర యశోనిధీ ! ॥ ధరణీరమణ ! శ్రీకృష్ణ ! జగన్నుత !
యని వినుతించిన శ్రీను డానంద ॥ మును బొంది తనదు మాయలో గొనిన
ఘను డతడు సంతసమున రథమునకె ॥ పోవ నందియున్న రామకృష్ణులను
గని మెచ్చి మ్రొక్కుచును దాసి వారి ॥ విన నిట్టు బలికె నా గోవిందుడు

అనఘ! యక్రూర! చాల పొద్దయ్యె § కనినాడ వేమి! వింత నీటిలో
వినిపింపు మాకు నీచిత్తవృత్తి § గన నానందమునను దోగితివో
శ్రీహరి శివస్వరూపు నతింపుచు § వేశ మందితివె? సజ్జనవర్యా!
క్లేశంబులు శూన్యము నందును పర § మేశుని సన్నుతి నని బల్కెనంత
దివిజేశార్చిత! దిక్పాలకనుత! § పరివిమలా! చోద్యములు నీలోనివె
కవి బుధ రంజన! జల, భూ గగనము § లవి నిండిన నీచర్య కళచిత్రి

—: శ్రీకృష్ణమూర్తి మధురానగర ప్రవేశము సేయుట :—

మరయ దయ నన్ను జూచుటె భవ్యపు § తరము నాకబ్బె మోదమయ్యె నో
పంకజాక్ష! నిజపదము కేవలము § పరవశ మందిన నరుడు విజితుండగు
ననుచు రథము వడి మధురానగరము § గన సేర గడపె నంతకు మున్నే
వనమున పురమున వెలిని మనోహర § తను నిలువు నందియున్న నందాదు
లను జేర నిలిపి బలభద్రుని తా § నును రథముడిగ్గి యక్రూరును గని
యనఘ! నీవింక పురమును జొచ్చియు § వినజెప్పుము మారాక నెల్లరకు
వెనుక వచ్చెదము మావారి కూడి § యనుమతింపు మన నా హరిని గాంచి
మునిజనావనా! నే నీదాసుడ § నన్ను దయ గని నాయింట వసింతువు
ఘనమతి నిను పదముల నర్చింతును § తనువు గేహంబు పవిత్రమయ్యెడు
మును బలీంద్రు డీచరణ సంసేవ § దనరు టాపదవి నంద సమరుడు
సనకాది మునులు సురలు వారిపతి § వనజభవ భవులు దీన భవ్యులుగ
దంతు దేవ! యన నే నట్లు జేయ § గలను కంసు బారిగొన మోదంబున
గలయ వత్తు నన హరికి శరణమని § పలికి పురి జేరి కంసునికి జెప్పి
నిలు సేరె నినుడు గ్రుంకగ ముందునే § జలజనయను డట కొంత విహరించి
పంతసము వెలయ రామగోపకుల § చెంత జేర్చుకొని నగరమును జొరగ
నంత నపరాహ్ణ మది దాటగ భాస్వంతుని వేడిమి శాంతి నీయంగ
వరుస గాంచె నాహరి యా పట్టణ § పరిఘుల కోటల గొమ్మల పడగల
వరుడు గొల్పు ప్రాసాదవీధులను § హరులు తేరులును కరులు వీరభటు
లున్న నిలయముల గనుచు నేగుచును § వన్నెల దీరిన తరుణుల పురుషుల
మిన్నయైన ధన ధాన్య సమృద్ధిని § గన్నుల పండువుగా గాంచి యెవరు
లును మెచ్చుచు దా వరుదేరుచుండ § జనతతులు రామకృష్ణ గోపకుల
గని హర్షి యొప్పు చొప్పు దిలకించి § మనముల ముదమును దోప బలుకంగ
వినుచు ముందు జోవుచును శృంగార § మున నొప్పు భవనముల తావు గనుచు
మిన్నుడు బలుండు నింకేరాదు § లన్న తెలుగునను క్రొన్నన నడువగ

కన్నుల జూచిరి జన్మసాఫల్య ॥ మన్న నిదేగద మన కని జను లన
నందలి సుందర కామిను లల గో ॥ విందుని గాంచగ మది నుబ్బు చెలగ
నందుని తపంబు పంట మనపాట ॥ నంపముగ మెలగ వచ్చెనదె గనుడు
ముందు భవ భీతి నందరట వీరి ॥ పొందును గను మునిబృందము లెల్లను
బృందావనమున గోపీబృందము ॥ ఒందు నోముఫల మీతండె సుండి
యందరము గంద మీతని చందము ॥ మందయాన లిదె కంటు రం డనుచు
తమకము నందుచు తందర గొనుచుక ॥ క్రిమత నొనరించు కృత్యముల మరచి
తమ మానసముల కృష్ణదర్శనమె ॥ విమలతర భోగమందించు ననుచు
కనరు భోజనాదులను సొమ్ములను ॥ కనరు ధరించుట వస్త్రముల నటులె
తనువుల దోలంగ స్నానంబు లాను ॥ టను మరచి యుల్లె సిగముడులు వీడ
పడతులెల్ల దమ బుడుతలను మఱచి ॥ నుడువుటల మగల బదులాడ మరచి
దడదడల హారములు సుడులు పడగ ॥ నడుగులు తడబడ మేడలను నెక్కి

—: శ్రీకృష్ణుడు రజకుని జంపి వాయక సుధాము లొసంగు పూజల నంగీకరించి మే లొ స ం గు ట :—

వడివడుల నడుము లవి కుచభారము ॥ లడర నసియాడ నా సరోజాక్షు
గనిరి మేల్దృష్టి గూర కుతుకమున ॥ మనమున నాతని వినియున్న విధము
లను బల్క గనిరి వాక్పవిత్రమును ॥ తనువు భవ్యముగ నాతని లీలల
వనితలార ! వీడే నట పూతన ॥ చనుబాలు గుడిచి చంపిన బాలుడు
గనుడు వీడేను జగములను జూపె ॥ జననికి ముఖమున మను దిను నెపమున
వీడె గోపికల తోడి బాలురను ॥ గూడి వెన్నలను దిని నాడు దొంగ
వీడె వారి మానముల గెడపి గొనె ॥ పాడి యదే నట వీని సొగసిదే
అంద చందముల నితని గూర్తురట ॥ మందలోని యాగొల్ల సుందరులు
సుందరు డీతడు వారి సందుగొని ॥ పొందిక రతులను ముదము నించునట
ఇతని బొందకను జన్మమె వృథ యట ॥ ఇతని యునికి వైకుంఠ మగునంట
నితడు లేకున్న పుర మటవియె యట ॥ ఇతని నుడులు నా సు[illegible]ంపు లట
ఇతని తలంపులు ముక్తి నెలవు లట ॥ ఇతని గనుటయే భాగ్యరాశి యట
మునులు మెత్తురట ఈ మహనీయుని ॥ వనితలార ! మన మీతని సేవల
దనియింతమ యా గోపికల వలెనె ॥ ఘనత గొని పాడుచును వినుతింపుచు
మును జన్మములను వా రేమి నోములను ॥ నీ కృష్ణుని జలజలోచనుని
నలరువ దలంప బలుక నాడంగ ॥ గలయ సొలయ మోదముల దేలగ

తుల లేని భోగకలిమి నిల బొందు । వలను విహరింప నలినాక్షులార!
యనుచు హరిరూపు నయనముల వెంట । మనము తమి నింప లోగొని నతించి
ఘన సువాసనల పుష్పచయుంబుల । మనుజ లీల దనరారు హరిపైన
మునుకొన జల్లిరి జయము లనరు నం । వని తాజన మిటు దను గొనియాడగ
నడచుచుండె నా కృష్ణుం డన్నయు । కడు వేడుక గొని జనులు కాన్క లిడ
వడి నందుచు నవి గోపకుల కిడుచు । నడ దీర విప్రు లాది బూజించ
నరుగుచు నగరద్వారమున నుండి । బిర బిర బోయెడి నొక రజకు గాంచి
సరసిజ నయనుడు అరెరె! ర మ్మందు । వరుస నీ మూట డించి యొనరు గల
వర చేలమ్ముల మాకు దొడిగింప । నరపతిని జూడ నిట రాక మాది
వరమతిని నీవు మంచి పటమ్ముల । నరుదు గొల్పునవి యీవలె దప్పదు
మామ గావలయు మాకు గంసుండు । నీ మనమున సంకోచము నందకు
మా మందలోన నిట్టివి జిక్కునె? । మేము ధరింపగ నీర వేగమున
యోరీ! బల్క వదేల? పెక జూచె । దారా యనగా నా రజకు డనియె
మా రాజు వస్త్రముల నెత్తి గొల్ల । లార? గోరుదురె? కట్ట నెట్టట్రి
మీ రాడిసట్టి వెల్ల మదించిన । వా రాడు పోరు గీకరుకూతలు
దూరాన బొందు గాదేని జీవ । ధారల నెత్తురుధార పేకముగ
మీరు మా రాజు సొమ్ము గైకొనగ । నేరాజులైన గడగడ వడకగ
వీరాధివీరులను బోల బల్క । నోరాడ నార! తొలగుడు బ్రదుకుడు
మేర మీరితిర! నేనే జాలుదు । నారా! నల్లని గొల్లపిల్లడా!
యన రోషమంది వనజ నయనుండు । తన ముష్టి వానితలను వ్రయ్యలుగ
దునిమె పడమి బడ వానితోడు లట । నునిచిరి మూటల వడి గని రిండ్లను
జను లదరి రచట అన్నయును దాను । కని గట్టి రందు మేలైన వాని
తనవార లట్టి గట్ట మిగిలినవి । గన నట్టి విడిచి ముం దరుగుచుండ
ఘను డొక వాయకు డా రామకృష్ణు । లకు ఘనభక్తిని గని చేర బిలిచి
కొని పూజింపనెను మృదులవస్త్రముల । నొనరంగ గట్టనిచ్చె మది మెచ్చె
వనజాక్షుడు బలభద్రు డవి గట్టి । గనగ నలంకృత దిగ్గంతుల వెలె
గవ వారు దోప నా శూరవరులు । ఘనకృప వాయక నామునాతనిని
దన భక్తిధి సిరియును శిరంబును । తన వలచేతను దడవి వర మిడియె
యిక ఘనుడవు నిన్ను సారూప్యమందు । నను వైభవయుతుడవు వర్యోద వని
వినుతి నతి గొనుచు నచ్చటు గదలియు । గన సుదాముడను మాలాకారుని
ఘనుడు తన నెలవు చేరనై వట్టి । యతి సుగుణుల బలవీరులను గాంచి

మతిలోన ముదము పెనుగొన వేచియు ౹ గతికొలది పూజ నందించి మ్రొక్క
పావనమూర్తులు పుణ్యధాములు ౹ దేవవర్యా! సంస్తుత పాదపద్మ
భావులరు నన్ను పావనత గూర్ప ౹ మీ వేంచేయుట దీనశరణ్యులు
నా వంశమెల్ల పుణ్య గతి నందు ౹ త్రోవ యిదె కోర్కులన్ని నను జెందె
భూవలయంబును గావగ బుట్టిన ౹ దేవవరులు మీ రౌదురు కృష్ణా!
నావలని పనిని మీరు గొంమరని ౹ పావనుల పుష్పదామ గంధముల
తావుల గుప్పెమ్మను తాంబూలములను ౹ భావ సమగ్రత నందించి మ్రొక్క
నా వనజనయను డాతని కిటులనె ౹ యే వరము వలయు గోరు నీకిత్తు
నీవు నా భక్తపరుడవు మెచ్చితి ౹ నావిని యులరున నాత డడిగె నిటు
నీ పాదకమల సేవ యొసగవలె ౹ నీ పదభక్త జనముల నేయు మటె
నేపారు భూతదయ నింపు మనము ౹ తాపసమందారా! నను జెందని
యన నవియు బలము నాయువు కాంతియు ౹ ఘనమైన సంపదయు గీర్తి నిచ్చి
వినుతి నంది యటువెడలి మార్గమున ౹ గనియె నొకవనిత త్రివక్ర కుబ్జను
ఆ నలిననేత్రి నానావిధ లే ౹ పనముల సౌరభ విశేష భాజన
మున మేలుగూర్చి దను జేర రాగ ౹ గని యింతి కనియె శ్రీవరు డిట్లు
యెవరి దానవో! యింతి! గంధముల ౹ నెవరికి గొంపోయెదవు యిత్తువా!
దవిలెదు ఫలంబు మా కవి గూర్చిన ౹ పువుబోడి చక్కనవును నీ జన్మ
యనుచు కృష్ణు డన యతివయు నలరుచు ౹ వనజనయన! నీ వచనధాటిచే
నను సరసమాడ నేల చక్కదన ౹ మున నీచొప్పది యందరి కబ్బున
విను నేను కంసుదాసిని త్రివక్ర ౹ యని పేరు లేపనములు గూర్చు పని
కర్తెను నందున పేరు వడయుదును ౹ యిత్తును మీ కవి మంచి గంధముల
నత్తుకొనుడు మే లంద దేహముల ౹ గుత్తుగ సువాసనల మూపొత్తున
జొత్తు రందకత్తెలు వలసియున్న ౹ కుత్తుకల నురములను కరములను
నలదుడు వస్త్రములను బూయునగును ౹ వలనున మీకై దెచ్చితి నివె యన
నళివేణి పలుకు లాలించి కృష్ణు ౹ డలరున యో మెలనాగ! మా రూపు
లను మెచ్చితివా! గంధముల నలద ౹ గనదగుదుము నే మలదు మెట్టులనో
వినము మా గొల్లకల్లె నివి శేవో! ౹ వనిత! నీ వలది జూపింతు వో!
యన వారి వాక్యముల మనము మెత్తకదన మూని యిచ్చె నలయు గంధముల
వనిత తమ కిచ్చినట్టి లేపనము ౹ లను మేన నలది యా యింతి చక్క
నగు నట్లు జేయు దగ్గరకు బిలిచి ౹ నగుచు తన పదములను నాతియడుగు
లగణీతవు వింత దోపంగ ద్రొక్కి ౹ నిగ నిగల మెరసె దతివ నీ వనుచు

గవుదల కరతలముల జక్కనొత్తి ఽ యువిద చక్కనయె హరికరుణ వలన
పొరంగ వక్రదనములు సమ్మగ ఽ భువిని లోహంబు పరుసవేదిక
దగిలిన ఛాయను పొందిన రూపందె ఽ అవయవముల బహుసొంపు గాన్పించె
భామ పూర్వభవనోము ఫలమేమొ ఽ కాముని శరమున నొప్పి చూపరకు
కాముని జనకుండు చేతల నంటిన ఽ నా మహిమ ధాము తలపేమి యొక్క
వనిత వనజనాభునకు వల మ్రొక్కి ఽ దనయింటికి రమ్మనుచు బ్రార్థింప
వనిత నీ తలపు వేవు నెఱిగితిని ఽ గనవత్తు నవల పని దీరినంత
నను భజింపు సర్వమును సిద్ధించు ఽ మును పూజకలిమి నా దయ గంటివి
యని నచ్చజెప్పి యన్నతో గూడి ఽ గనె విపణివీధి యందున వారలు
ఘనమైన కానుక లిచ్చిన గొనుచును ఽ దనమతిని వారి దయ గనుచు నరిగి
కనిరి ధనుశ్శాలను నా వీరులు ఽ కననంతన జొఱరాగ వారలను
ఘనత నెఱుంగక నడ్డిరి కావలి ఽ జనులు లో బోవరాదన్న వారి
గొనక జొచ్చి సురరాజ ధనుస్సుల ఽ ననుకరించుచును వీరగుప్తంబు
నగునట్టి ధనువు బటువున పొడవును ఽ జిగి నందిదాని కృష్ణుడు చే గొని
నగుచు పుటుకవలె విరచిన నచ్చట ఽ జగము నిండ బ్రహ్మాండమైన ధ్వని
విన భీషణముగ రోప కరిసాల ఽ మును ద్రుంచినట్టుగాగ కావలిని
దనరి యున్నట్టి వీరభటులెల్ల ఽ కినుక వారలను జుట్టి నొప్పింప
దడియ నా వింటి ఖండముల గొనుచు ఽ నెదురించిన యో రోరి బాలురా!
కెదురు గనక మా రాజు ధనుస్సును ఽ చిదుపుటయుగాక నెదురింతురార!
అని బొదివి పోటులను బడ విసరిన ఽ మునుకొని జంపిరి వారి నావింటి
తునుకలచేతనె రామకృష్ణులా ఽ దినమున నంతట మరలిరి విడిదికి
గనిరి ముదంబును గోపకులతోడ ఽ వినజెప్పి రెల్ల సంగతు లన్నియు
జనవరుండైన కంసభూపతికి ఽ విననమాత్రమున భయము మనమ్మున
గొనివె వారిమహిమలను వినియుంటి ఽ మును నశరీరవువాణి బలుకుటయు
దలచి చింతించి వారి బొలియింప ఽ వల నేది యనుచు గలత దా గనుచు
తలకు నలుక మునుగొనగ వగవు గనె ఽ నలరున గోవిందుడు విడిది నుండె

-: సూర్యాస్తమయ చంద్రోదయ వర్ణనములు :-

విను మాశన మను వనమున దిరిగెడు ఽ ఘనమైన యంధకార గజంబును
గని కాలవ్యాధు డది బట్టనెంచి ఽ యొనరున చివురుల గల్పించి నట్టి
కందుకము వచ్చుగాపు నది యనగ ఽ మందప్రభ నినుడు పశ్చిమాద్రి తట

ముందె క్రియంబున నా చంద మిట్లు ✽ పొందుగూర్పఁ దగియుండె నరవరా!
గగనమను లక్ష్మి చంచలమతియై ✽ జగి నంతు వయసు గల శీతకిరణు
దగ బొందు గూడి యుష్ణకరు డగుచు ✽ బిగువును సడలిన ముదుసలి భానుని
గన జూడ రోసి తాను గెంటె నన ✽ గను సూర్యు డస్తమించె నా పట్టు
నను సాధ్వియైన సరోజకామిని ✽ తనపతిని జూచు కనుల పరువి గన
గనుచు తనమగడు తపనుడైన సరె ✽ మన మలరుచుండు గాని యా శశిని
గనను కళల వృద్ధిని గాంచనైన ✽ వనజాలయ తోబుట్టువైనను
తనను శివుడు ఘనతను గూర్చి శిరము ✽ నను నిలుపుకొన్న నని యొల్ల ననుచు
కనులు మూసికొనె తనను లోకములు ✽ వినుతి సలిపె నిపు డన ముకుళమందె
అందమొప్ప నొకకాంత యక్కాల ✽ మందు విప్రు లర్ఘ్యంబుల నిడగా
మందేహాదుల ద్రుంప నాధార ✽ లందె వజ్రధారలను నా దనుజ
మండల ఖండింపగ గారు మన్న ✽ సందున దోచెను రక్తధారలన
సందె దోచె నాపశ్చిమ దిక్కున ✽ సుందరఁ బొప్పె శ్రీహరి యశంబు
అమృతాబ్ధిగాగ ధరణిని నింపగ ✽ అమృతబిందువులు మింటి నించె నా
యమృతాబ్ధి నున్న మీనజాతులా ✽ యమృతతరంగములను నెగయించెనొ
నాయన చుక్కలు వినువీధి మెరసె ✽ నా యనువు మరియు దోచును నిట్టుల
నా యనంతుగుణ మణులవ్యాప్తి గన ✽ నా యజును సకల దిక్కుల జల్లిన
హరి చాయ దనరు మృగమదంబో యన ✽ కరము తమము వ్యాపించె నంతటను
పరువున చీకటి బార్రి తప్పవలె ✽ త్వర గనకున్నను నన్నఁజుట్టు నేమొ
తఱుముకొనె తమము నన్నని యరుణుడు ✽ వరుస భర్మాచలపు మలకత్రోవ
చరింప నేగెను గాక నిలిచినను ✽ తరం బందదెటు తమము పైబడక
గన ప్రాక్సతి ఫాలంపు తిలకమున ✽ పొనరున విరహుల ధైర్యలత త్రెంచు
ననువు లవిత్రము మదనిచేతి దన ✽ వినుకాలవ్యాధు డంధకార మృగ
మును ఖండించగ దాల్చు ఖడ్గ మన ✽ ఘను నా తమాలతరు తూర్పుకొమ్మ
యందలి నింపగు పల్లవ మనంగ ✽ సందుల దిరిగెను దొంగల గుంపులు
మందగొని పరువు గను క్షితి నింప ✽ అందమున తొగలు సంతసిల్లంగ
వారినిధికి నుప్పొంగు దోపంగ ✽ భూరి ప్రియము యా చకోరములకుగ
జారులకు భయము నింప తా నొప్ప ✽ మారునికి మామయగు శశి బొడమెను
వారిజభవాండమెల్ల పటీరము ✽ నారసి నింపిన యటుల వెన్నెలలు
ధారుణిని బర్వ సారసనయనుడు ✽ క్షీరాన్నంబును నన్నతో గూడి
కూరిమి ప్రేరిమి నంద భుజించియు ✽ ధీరత కంసుని దుష్టతను మావ
మీర విహరింపుటల నప్రమత్త ✽ చారమున నొప్పు మాటల గూరిరి

## —: సూర్యోదయ వర్ణనము :—

నరనాథ! కంసు డాదిఘుల దలచి ఽ హరిని దలచి యెదలోన నితరంబు
నరయక నన్నట హరిని గన్నటుల ఽ దరమౌదకు నిదురింపదు హరిపై
మతి జేరిచి నావలన జెసంగా ఽ యతబలవీరుడు కృష్ణు డనువాడు
యతుల హర్షమానుడు యచ్యుతుండు ఽ మతి నిలుపు మనెను నారదమహర్షి
ఇతని శర ణనగ హితులు నవ్వేరరు ఽ గతి వీరతయే నాకు శరణ్యము
అని చింతించుచు గలవరము నిద్ర ఽ గని దుష్టమైన కల గనె నది విను
గరళము దినుట ప్రేతమును దాను ఽ పరిరంభించుట నగ్నుండగుటయు
శిరమున తైలంబును నంటుటయును ఽ ఖరమును నెక్కుట రక్త సుమమాల
ధరించి యేగుట మొసలు కీడొందు ఽ పరంబులగు నవ్విఘ్నుల కల గాంచె
చెవులు మూసికొన ప్రాణఘోషంబు ఽ దవుల వినరాదు తలదర్పణమున
నా విధి జలాదు లందు గనరాదు ఽ సువిహారమతిం కరశాఖ నాస
కొన గుతి చూచిన బహుళంబు దోచె ఽ తనువు నీడ బయలందె వెలుగునదు
దవయుడుగులు కనబడవు దృష్టి నిడ ఽ వనరుహములన్ని హేమతరులయ్యె
గనుడు ధ్రువుని యా వశిష్ఠమారిని ఽ తనకు కాల మంత్యము దోప నిల్లు
హరిచేత పరము జెందెద నే నని ఽ కరము భీతి తా కుదురు గనె భోజ
నరపతి యంతట వేకువ జొచ్చెను ఽ తరణి యను సింహమున జేర్చబడిన
తిమిర గజ కుంభ మౌక్తికరాసుల ఽ క్రమత మెరసె నెత్తి కాంతి నుడులు
తమము దొలగ భానుండు నుదయాద్రి ఽ సుమనస వినుతుల బొందము తరియయ్యె
అల శచీదేవి తనబాలుపాన్పు ఽ వలనున పైగట్టిన పవన బంతి
వలె దోప నాయు రర్థవ్యయములు ఽ కలయు చాటుగతి కాలజంఘాలు
దనగ జీవితము జీవు లదిగొలువ ఽ దనరెడు హేమము కొలపాత్ర యనగ
గన నపరకాంత తనరూపు గాంచ ఽ గను ముందు నుంచుకొన్న యద్ద మన
అల చక్రవాక తాపము హరింప ఽ వలనగు ఘుటికయు నాగ పద్మినీ
లలన నోము ఫల మనగ త్రిమూర్తుల ఽ కలయిక సారపు ముద్ద యనంగా
నినుడు బొడమె నుదయాద్రి చల్లగా ఽ ననిలము ముందున జొచ్చె నత్తరిని
వనజములు విచ్చె చీకటులు పరువు ఽ గొని డాగె గుహల పద్మమకరందము
ఘనత గ్రోలంగ దనరె తుమ్మెదలు ఽ మానులు భానుని స్తుతించి రప్పుడు
జనవర! యంతట సర్వజనములును ఽ గని రుక్మావాము వనజ నయనుండు
జలధ్రదుండును ముందె మేల్కొనియు ఽ యలరువ కృత్యము లన్ని దీర్చుకొని

విలసితోత్సాహమున పురము సొరగ | దలపుల నెగడిన యచట కంసుండు
తన యాజ్ఞ నెఱపి సకల సన్నాహ | మున మల్లరంగమును దీప్తి నందు
చందమున ఱాలు వల్మీకాదుల | నందు లేకుండ మృదులతర మృత్తు
యం దండమింప గొజ్జంగి సీటి | బొందున కస్తూరియు శ్రీగంధము
కలయిక జల్లున గూర్చి యా నెలవు | పలువిధతోరణముల నలంకృతము
పొలుపున చందన దారుపరివృతము | గలుగ బంధించినట్టి బయలునను
ఘనులు వసింపగ శృంగార మంచ | ములను నిర్మించిన భాతి రమ్యంబు
గన మంగళవాద్యము లవి మ్రోయ | జను లుత్సాహములను గుములు గట్ట
వినుతి కెక్కు భూసురులు జనపతులు | మనము లలర తమ మంచల వసింప
నా తలమున జేరిరి వీరులయ్యు | పౌతరమున నుప్పొంగు మల్లులును
ఆతరమున చాణూర ముష్టికులు | కాతరము నెఱుగనట్టి పౌరుషమున
వారల శిష్యుల కల తోసలుండ | దారసూటును దా జేరగా
ధీరుని బోలె నుదారత దోపగ | భీరువు నై వెలి నది గనలేకను
సార శృంగారతను దా గూర్చొనె | మేరను బెట్టిన యున్నతమంచము
నను కంసు డంత జననాథపమ్ము | నను నందాదులు తెచ్చిన కానుకల
ఘనత గననిచ్చి తమ మంచలపై | ననుమతి చొప్పున తాము వసించిరి
వనజనాభుండును బలభద్రుండును | తనువులు మెరయగ భూషితులై నగుమో
గన వచ్చిరి యా మల్లరంగమును | మొనరున తూర్యధ్వనుల విని వరుస
నా యా ద్వారమున చెంత నున్నట్టి | సామజము పెద్దగా గూర్చినట్టి
యా యనంతు మార్కొన జాలియున్న | పాయు మహావీరి గొంటు దీకొనెడు
కువలయాపీడ మను గజంబుకును | భువనసంరక్షా పరోద్ధాముని
అవినయహంతకు డగు కృష్ణుంపై | గవియింపగ నా మావటీనితో
బలికె నిటుల హరి కుంజరపాలుడ | వలదు డీకొలుప మత్తగజంబును
చలపట్టు వలదు లేద బలి వెడుదు | నిలను నిన్ను మదగజంబు ననగా
యలుక గొని వాడు యారయాభీ ! | తులువ ! బాలుడవు ! పొగరున గూయుదే
దొలగి పోదువేటు నా బారి దప్పి | తులువ ! నిన్న బాలియింతు నిలు మనుచు
బలజాక్షుని బహు చులకగా నాకి | లలి లవము గనక నా కుంజరమును
గోప సింహుపై నలుక డీకొలుప | కోపమున కరియు గదిసి కృష్ణు
చూపున బలహీనునిగ దలచె నోహో | యేపున తుండము జాపి పట్టుకొన
పదమున నేలను జమిరెద ననుచును | యునను దప్పించుకొని తొలగె కృష్ణు
డది గని విలయపు కీలివలె వెలిగి | గదిసె విలయానిలుని వేగమున

ఘనుని మాయావి హననుని విష్ణుని § తన హస్తంబున జరచిన కరియును
వెనుదిరిగి మృత్యుదేవత భంగిని § తన తుండంబున జుట్టు పట్టుకొని
నేల విసరినను కృష్ణుడిల బడిన § కాల రాతునని గజ మటు దుమికిన
కాలుల సందున తా దిరుగువడుచు § నీలవర్ణుండు దప్పుకొనుచుండి
మొదమ కుడి తుండము త్రిప్పుటలో § దగబాటు గూర్చి దాని వాలంబు
నొడిసి గరుడుండు నాగ సర్పమును § వడి బట్టినట్లు పిడికిటిని బట్టి
కరిని ద్రిప్పి యిరుపదియైదు వింద్ర § పరిమితిని విసర నది సోలి లేచి
హరిని గదియ రాహువువలె హరిని § కరిగుప్పు గప్పి పదముల సందున
చిరచిర దిరుగుచు సందీకయున్న § త్వర త్వర హస్తియు నతనికి జిక్కక
తిరుగుడుల సమము నలసటలు సమను § అరిమర్దనుండు నట్టె తా బెరిగి

—: శ్రీకృష్ణుడు కువలయాపీడ మను గజంబును వధించుట :—

గిరిని కందుకము బోల్చి విసరినటు § కరము చిత్రముగ కరిని విసరినను
భూమిని దొరలుచు గెరలి మరి గవిసె § భీమరూపు డద్దానికి గుఱియై
నా మహాగజము తుండమును బట్టి § యా మందరంబు నబ్ధి విసరినటు
విసరిన బడియును వెస మాట్టి కృష్ణు § పస మాపె ననియు మావటీ లుబ్బు
నుసి సీక నందసుతుని కరంబుం § విసరె తాను నాలదుచు దొర్లాడ
అది గని యురవడి తనదంతములను § చిదుగ గుత్తువని మీదికే నెగసియు
నదిమె దంతముల నా నలినాక్షుని § మదిని దాని వృత్తమును ముందె గని
ఘనుడు సూక్ష్మరూపమున దప్పియును § కినుక బెరిగినటు తాను చెలగి వడి
తన వామచరణమున దాని నెదను § గని సూటి దన్న నది నేలబడిన
దానిపై నెగిరి కుంభతలంబును § మానము బెడ పిడికిలిని ఘట్టించి
మానవాభేద్యమగు నా గజమును § మానిత జీవములను బాప నెంచి
కొమ్ములను బెఱికె తుంగ మొలకవలె § దుమ్మున బారలెడి యేన్గు నటు బాడిచె
చిమ్మ దిరుగ నది జీవముల విడిచె § క్రొమ్మెరి మావటివారు శ్రీహరిని
ఓరోరి గొల్ల ! మా మేలు కరిని § బోరి కాలకాలుని జేరబంపి
తీర నిమ నటుల మా కరిని గూడ § జేరబుత్తు మని గవిసిరి దొమ్మిని
గదలు గుదెలుం గొని తాకిరి ముదమున § ముద్దముతోప లా గోపవీరుండె
అద్దిర విఘ్నాగజము పరమందు తన్ను § గదియ రాగోరు నట పాలింపుడు
ఇదె వీరి బాధ యనుచు దంతముల § బెదుకులు దొలంగ వారి మడియించె
హరియు రాముండు కరిదంతములను § కరముల భుజముల నిడుకొని వైరాముల

చిరుచెమట గ్రమ్మ గోపకుల ఽ గూడి దరహాసమ్మున దిసల బరికించు
చును రణవీరుల మల్లరంగమును ఽ దరియజేర నట జను లా మూర్తుల
గని హరిహరు లిటు వీరతేజములు ఽ జనవిరోధులను మునుము జేరి రన
బలియురు మల్లురు గిరిసమూహములు ఽ వలనుగ నట ధీరులును తము గాంచ
బలశౌర్యమ్ముల నచటి మల్లురకు ఽ తిలకింప పిడుగు లన సజ్జనులపాల
జనపతి యన కామినులు కాము డన ఽ గనగ కంసునికి కాలు శమనుడన
ఘనులను విప్రులమతికి దివ్యుడన ఽ తను బోషించిన నందుని సుతుడన
మునులు పరమాత్మ డీతండే యన ఽ దన బాంధుజనుల ప్రేమరూపు డన
ఖలులపాలి కాలానల జ్వాలన ఽ చెలులగు వారికి ప్రాణతుల్యుడన
యుల సురపాలికి శ్రీ రమేశు డన ఽ తలపున గురులకు గురువరు డిత డన
అల రంగమధ్యమున దాను జేర ఽ ఖలుడు కంసు డది యెల్ల విని వడకె
జనమండలంబు గని రా విప్రుల ఽ ఘనులు వీరు వసుదేవుని సుతు లట
వనజభవు ప్రార్థనముల బుట్టిరట ఽ మునుల కథయుంబు గూర్తు రట వీరు
యోగమూర్తులట భూమిని జనించి ఽ భోగ మదయుతుల బొరి గొందు రంట
భాగవతజనుల పరిపోషించియు ఽ నోగు గనసీక మోదమును బొందు
గూరుతు రట మన కనులు సార్థకము ఽ మేర మన జిహ్వ లివియు భవ్యములు
సారములు దెలియు మనములు ధన్యమె ఽ నారద వినుతుడు నారాయణుండు
వీరి క్రమంబులుగా ధర విహార ఽ మారసిరి వీరిచరిత మహితసుధ
కనుల జిహ్వలను మనముల భోజ్యము ఽ గని నారము మన మెల్లపుణ్యులము
దునిమెను పూతన యనుదాసి శకట ఽ దనుజుని గూల్చెను గాలి నటులనే
మనువు బాపె బకు నఘుని యా విధమె ఽ మనుట మలపె నా వత్సరక్కసుని
యమున కాళియుని వెడలించె నంత ఽ భ్రియ బాపె దావదహనమును మ్రింగి
తమవారి గోపకుల రక్షించెను ఽ సమమతిని గనని యింద్రు పోగ రడచె
గిరి నెత్తె కేశివ్యోముల హరించె ఽ తరుణుల గోపక సతుల కోరికల
పరిభూషించెను మాధవుడు నిజము ఽ దురిత మడుగు నీ కృష్ణసన్నుతిని

## శ్రీకృష్ణబలరాములు చాణూరముష్టికులను వధించుట:-

నని రహస్యమున జను లాడుచుండగను ఽ ఘనుల దరిజేరి చాణూరుం డనె
వినుడు గోపబాలురు వీరు లనగ ఽ జను లాడ వనిని గోవుల మేపుచు
సాముల నేర్చియు గొందరిని దునిమి ఽ భూమి ప్రఖ్యాతి పరగుటచే మా
భూమిపాలకుడు మీ సేవ గనగ ఽ నీ మల్లరంగమును ధనుర్యాగ

దూరని మల్లుఁడు లోకమున నరుఁడు § మీరు నాభీరబాలురు మూర్ఖులు
పారదలఁచినను బ్రతుకు గలిగెడును § సాంశృంగార లీల లిట కల్ల
కూరిమిని గూర్చి మీకు బలికితిఁ § కేరు డాభీరజనులు మిము గొల్వ
ఓటి పోరెఁ నా వ్రేలుపొంది § బాహు దర్పదానుర వెఱ్ఱులార!
చలమునను నన్ను జెనకిన తమఁకరి § దోలఁగ జలరాశి దూరంబె మీకు
దలఁగి వనమందు దిరుగ డా గంగ § నిలువున బద్దులు వనము లిడి గావు
చెలఁగను గనగా కొండ దరిగాదు § ఇ కొంకు జోరఁగ లేవు ననుఁడప్పి
మనుద సింహముని మలయరాదు నా § కును నెమర నిలిచి చెయి జూప లేవు
నను ననుసరించి పోడవునను జెరుగ § ననువొంద నేను భూనాధ బారు
గన బోవ నీవు కాన జోర నీవు § వినుము బలమూర్తిగను దలప నీవు
ఘనమని బుద్ధుల జెప్పంగనీవు § నిను కిల్కితనము చూప తెర మీను
వనజనయన! నను మార్కొను తలంపు § నను తరముగొనక తలగు తలగు డిట
వనమాలి ననెడ వేమొ ఘధుర యిది § వననిధిని వెలయు వైకుంఠ మగునె!
సంసారశూన్య సభ యనుకొందువో § కంసుని సభ యిది గాంచు నాపోడువు
హంసుడ ననెదవో! యిది నీ జీవపు § హంస యిందుండ గాను శ్రీకృష్ణ!
నారదు వీణాగాన మెటు వినగ § స్ఫారమైన నా భుజోదిత ధ్వని
పారజాడు మిది మల్లవిగ్రహము § నారుల పట్టుల ప్రణయవిగ్రహము!
తల దాచుకొన్న మానుల మనమా! § నొలసి తిరుగ వేదాంత వీధి యూ!
జలశేషుగా! నడువంగను నీ భ § క్తుల జాడగాదు నామ్రోల సుమ్ము
అనుచు రోషాగ్ని ధూమ మొలక యన § గను తలన నన్న సిగ వెలయుంగ
గనగ కరము లిడి దిక్కరులకైన § ఘన భీతి నించు కరములను బోలు
విలయ కమను కోరలు నా మీసలు § అల కాటుకకొండను తనువు నొప్ప
నిల చలింప నాకసము తూటంద § నలుక మల్ల సరచియును నార్భటిన
పలుల నూరుచును పౌరుల గుండెల § తలకుగొన వారిహృదయ భల్లునయి
జలజనయనుపై నడరె మల్లుండు § అల నందసుతుడు వలువను బిగించి
నిలిచె రంగమున ధీరత వలగొని § మెల మెల్ల మెల్ల మగు బీరంబున
వెలసె వల్లవుల వల్లభుండు హరి § వల రౌద్ర మంత కంతకు నెక్కగ
తిన భుజంబులను జరచె వానివలె § జనులు భయ మడర డాయ నడచి రా
ఘనులు చాణూరుడును నా కృష్ణుడు § విన భీషణంబు లగు కేకల నిడి
కరములను గలపి కరికరి హరిహరి § గిరిగిరి దాకిన కైవడి గవిసియు
ఇరువురు పరస్పరము హింస కోర్చ § వరుస దవానంపు జ్వాలలకైవడి

విలయ మేఘములు తాఁ సిల్లుటయు § విలయాంబుధు లవి వీక నొండొకటి
కలయ మీఁదంగ బడ దాకుచుకుఁ § అటుక మెయి బొదుచుటయు జప్పరించు
టయు దన్నుటయును పదచరణమ్ముల § వైపు నెఱిగి నలియంగ మొత్తుటయు
భయము గొన కలయ నదుర్రిల వలెనే § రయ ధాటిభ్రమణ సవ్యాపసవ్య
ముల పట్టువడుచు దప్పించుకొనుచు § తలబడి వఁబడి బడక తలగుచును
నిల నెత్తివేయు పట్టుల నెత్తిన § నిలబడని పొర్లులను మి న్నగయుచు
యుల మింట విసర దిశల లంఘించి § మెలుగుల వెలిబుచ్చుచు హుంకరించి
కలియబడి దేహములు నవశేయుగ § చులుకల చులకని పోటులని దలచి
జెట్టి పట్టులను శిరముల డీకొని § పట్టున బొమ్మల తట్టు గ్రుమ్మచును
యట్టె డొక్కలను మెదుకు పిడికిళుల § నట్టనడ బొడుచుచును బట్టువిడక
మెట్టు గని హరియు మల్లుని భూమిని § పట్టున బొంలగ ద్రొక్కిన లేచియు
ముట్టె పరిచి నొవ్వంది మల్లుండు § యట్టె హరిని గూర్పంగ మరి యడరి
నేల నడిమి జానువుల నడిమినను § కీలున కేలున మల్లుడు తనుసుడి
మాలిమిని గూర్చి తొలగిన హరియును § జేలుగని గనక పదముల పదముల
కరముల కరముల గదిపి మోకాల § పరి నడిమి పార్శ్వమున బొడువ వాడు
కర మలిగె హరిని పెకల నరచేత § పరువడి నడచిన ధరణి పడి పడక
యురువడి కోపమునను పిడికిటనుఁ § వర వక్షంబున బొడువ మూర్ఛిల్లి
తెలిసి మరి గవిసి గరుడధ్వజంబు § యల శ్యేనయుగము మింట బోరాడి
ఖలముల యూని గనకను నేలబారలు § వలనున క్రిందును మీదను వారలు
తనవుల పోటుల బహుట దాకుటల § కన చినుప లగుచు వాపులు గ్రమ్మగ
నను గతుల పోలి జేరి నిట్టూర్పు § లనల జ్వాలల విధమ్మున వెలి రా
మల్లుడు బిరబిర నేల దిరుగు వడ § గొల్లవీరుండు వడిగ నదేయున
వల్ల గూర్చి హరి తల్లడమున యా § మల్లుడు ఖలమతి కృష్ణునిపై బడ
హరి మింటికెగసి వానిపై దూక § బొరలి చాణూరు డటు చురచుర గని
వరుస బలరామ ముష్టికు లటులనె § సరిసరి జెనగిరి జను లలరును గన
పురమున సర్వులు వారి పోరాట § మరసి మనమ్ముల కరుణయు భయంబు
తరమంద పౌరకాంత లిట్లనుచు § పరిపరి లలనలు బలుకె దొడంగిరి
మంచి కుమారుల కుసుమకోమలుల § వంచింపగ బిలిపించె కంసుండు
మంచి గెన జోడు కీడ పొంచు గాను § అంచితుల మల్లురతో జెనగించెన
గురిగొన్నసభను పెద్ద లోకరైన § క్రమముగా దనరె కిశోరదేహుల
సము మంజులంబు గను పసివారలు § విమల బుద్ధులను జంపింప దిగునె

రు జత్తురే యమృత దేహముల ఽ కూరిమిని ముదము గూర్ప జెరిగి రా
పారసాక్షి నందుని యశోద ఽ మేర గని జెంచె వీరలు వీరల
లలనలార ! యీ నవ మోహనాంగు ఽ వలచి గోపికలు వరునిగ బడసిరి
తొలి నోము లెటులో మన కవి తెలియవె ఽ యల మరిజన్మల మనము మరిబుట్ట
వలసిన యా నోములను నోముదము ఽ తలపున గోర్కెల పొసగించు వితము
వనిత మాధవుని యధరమున సుధను ఽ దనివి తీర దా గ్రోలునట మురళి
మనకబ్బునె గద యా వేణుజన్మ ఽ మును నెత్తియుంట మోహము దొలగున
మోహన రూపుడు శ్రీహరి యితండు ఽ ఆహవప్రియుండు దోహల ప్రియుండు
దోహన ధేనువు భక్తజనములకు ఽ దేహము నీలము గల వనమాలియె
మనము బృందావనమున నే పగిది ఽ జనన మొందినను నీతని గాంతుమె
మనము విశుద్ధము ముక్తి యట చేత ఽ కనియుందుము గద యదె వినుతి గనుడు
గోపాలకృష్ణుడీ ఘనుని గూడి ఽ గోపాలు రెంత భాగ్య మొందుదురో
గోపాలన సమయంబున తోడున ఽ దోపు గోపబాలురకు దా దొల్లి
యీ కమలేక్షణు వదన కమలమున ఽ నా కమల బంధువులు దోపుచుంట
నీ కంసుడు మల్లుల వారి తోడ ఽ నీకరణిని బోరు గల్పించినట్టి
సమయమున దోచి నట్టి శ్రమవలన ఽ శ్రమము దెలియు నయె స్వేదం బదిగా
సుమకోమలాంగి! జూడడె దివ్యుల ఽ శ్రమ జూప తాను శ్రమగను లీలల
ఘను లాసభ గూడిన వారి కొంత ఽ నోరరు పాపంబు ధర్మము వలుకరు
ఘను లనగ రాదు దోషముల నెఱిగి ఽ విన జెప్పకున్న యూరకున్న నై
నను యెఱుగకున్న గాన యీసభను ఽ ఘనమతులు గారు వీరలు కంసుని
భయమున బలుకరు గాని యీవనజ ఽ నయనుడ ! గెలుపున వీరి పవిత్రుల
దయను వినుతి గని దొలగించు నఘము ఽ భయమున జెరునే జనపతి యనుచును
వనిత లిటు లనుచు విజయమోదమును ఽ కనకచేలుడగు శ్రీకృష్ణు పరము
గను బలుకుచున్న తరుణంబుననే ఽ గనిరి వడిని మల్లురను దుముకుటను
మొల దట్టిలను బట్టి పైకెత్తి ఽ పలువలార ! యిక బడుడు పుడమి నని
పలరులు తమ వారలకు సుజనులకు ఽ గలిగింప గోరె యట్లె యొనర్పగ
ధృతి సెడి మల్లుర లోబడగానే ఽ యతివరదులు బలరాముడు హరియును
మతి వెలయ ముష్టికుల చాణూరుల ఽ గత జీవులుగా బుడమిని మోదిరి
బుడ బుడ రక్తము నాసాముఖముల ఽ వెడల గ్రక్కుచును విడిచి రనిలముల
వీడి బరచిన యా కూటుని బలభద్రుడు ఽ ముష్టిని వానిని శిర మడచెను
వారిపై తోసల శల్లు లడర నట్లె ఽ బొరిగొని రచ్చట జనులు స్తుతులుగ

వరసి తక్కుంగల మల్లులు బారిరి । హరి విక్రమించెద నా హరివలెనే
ముదమున సభ్యులు కృష్ణు నుతించిరి । పదముల నందెలు మ్రోయ నా హరియు
కదియవచ్చె కంసుని సచటివాకు । బెదరున కలతల కలకలం బెంగ

## —: శ్రీకృష్ణుండు కంసుని వధించుట :—

జనపతి మంత్రుల గని యా గొల్లల । దునుమాడు ద్రొబ్బుడు నా యెదుర నుం
జనక వసుదేవులను జడ గెడపుడు । గనగ నందునకు మట్ట మందింపు
డని పలుకు నంత వడి బెంచు నడక । దన వెంట రాము డల్లె యదను గన
గన మంచె నున్న కంసు నృశంసుని । ఘన మదగజంబు గూల్చు మృగరాజు
పగిది నెనయుంగ వచ్చు కృష్ణుం గ । జగి ధీరత గని జనులు వీరు డన
తగ నెదురు నడచె ఖడ్గము దా గొని । యెగసి బట్టె నాతని వనజాక్షుడు
గరుడుడు భుజగము నొడిసి పట్టినటు । కరమున కేశము ముడిబట్టి వడిమి
పరువడిని ద్రొబ్బె మౌళి మకుటంపు । వర రత్నమౌక్తికములు కల్పాంత
మున ధరణి వ్రాలు తారలను బోల । గను నతడు భయమునను నెపుడో విడిచె
తన బొందె యన్న జీవయంబుం వగజ । నయును డా తనువును నీడ్చెను
సింహము గజమును నీడ్చిన విధంబు । సింహాకృతి తా ముందున్న నర
సింహ రూపమున నీతని నిప్పుడు । సంహరించె నని సురలు వినుతించి
వరముని ప్రముఖులు పెల్ల త్వర గనగ । హరి చేత బొలియుటను నా కంసుడు
కరము నెల్లప్పుడు తినుగుట గుడుచుట । నరయుట నిద్రను గూడుట దానను
హరిని తలచుటను హరినే జెందెను । నరవర ! యఘులె హరి నెటు దలచిన
పరమ కుతుకమున నారదుడు తనదు । కరతాళ యుక్తముల ధ్వని జేసి యాట
పరమున పదముల చిందందియు నొక । వరగీతంబును గాన మొనర్చెను
నరవర ! యటు హరి కంసుని జంపిన । నుదుతర క్రోధమునను సోదరులగు
వారు న్యగ్రోధ గహ్వునును మొదలు । మీరు కోపముల గోపాలు డొకడు
వీరుడగు కంసునిం మా యన్నను । ధారుణిని యీడ్చి జంపినా రౌర !
రా రండని సాయుధులునై జుట్ట । వారిని ధీరుడు సంకర్షణుండు
గని యొక పరిఘను నట నున్నదాని । గొని యడ్డి నందరిని తలలు జరిచి
దన ధీకరంబు శాంతి నందించె । గనిరి ముదంబు బా దేవకీసుతులు
జనవర ! దివి హర, సురేంద్ర, యజులును । ఘనులైన సురగణములును హాను
దనర నిలిచి వారల కుసుమవర్ష । మున ముంచి బొగడికలు తూర్యధ్వానుల
నారదుం డట్టె యాడుచు జడ లవి । జారుచుండ శ్రీ కృష్ణ ! కంసహర !

నీరజభవనుత ! నిత్యానందా ! | ధారుణీ భారము డింప లీలఁగ
మేర మెలయింప బుట్టిన మాయా | దూరా ! నారాయణ భక్తవరద !
పాపము శమింప నీ భోజరాజు | నీ పదంబు గనె నిజము పాపులను
నీ పరధ్యానమున గూరి రేని | దారి బోని సద్గతి నీ విత్తువు
యింక ముందు సాగింతు వెందరినో | పంకజనాభా ! పరమకల్యాణ !
యని బాగడ సర్వదివిజులు నెలవులు | గనిరి నారదుఁడు బ్రహ్మను దరిసెను
వనితలు గంసుని మరణంబు వినగ | కనుల కన్నీరు గార సదనముల
విడిచి యొడళ్ళను మరచి యేడ్చుచును | వడి కంసునిపై బడి మూర్ఛల బడి
ఎవ ద వ్వేగితె ? పుడమి మము విడిచి | మొదల సూత్రహారము లూడ నకట !
పెను దిరిగె ముదము మాకు గతి యేది ? | యొడయుఁడా ! విడువజేసె మము వ్రాత
ఫలము చెడ్డ దయె గోపాల సింహు | డలుక గొని గజము కరణి నిను బంప
యల దేవకి తనయుడు నీకు వజ్ర | వలె భీకరుడయి కొండ వడి గూల్చె
యాదవేశాబ్ధి నిను దీవి వలెను | యోధస్ఫూర్తిని ముంచెగా నాథ !
మాధవానిలము తరువువలె ద్రొబ్బె | మేదినిన్ బడగ మా కేటి బ్రతుకు
భూతముల కెగ్గు సేయు ద్రోహునకు | నే తెరగున శుభ మమరదని తెలిసి
భూతి జెడితివే ! యా భూతములే | యీ తరుణంబున ప్రతిఫలము గుడిపె
నని యేడ్చుచున్న వారి శాంతి గన | వనజనాభుండు పలికి సంస్కార
మును గూర్పు డింక వీరి కందరికి | ననుచు మోదమున తీవరము గనుచు
జననీ జనకుల గన నుత్సహించి | వినయదీప్తి జెలువార హర్షాశ్రు
లను తలిదండ్రుల చరణముల దడుప | జను లెల్ల నలర జేరి వారిని
మును ముందె సంకెలను బాసినట్టి | ఘనుల పుణ్యులను పదముల మ్రొక్కిరి
రామకృష్ణు లా ధన్యుల సాగిల | భూమి నందనల సవందనాదుల
నేమముల నేలు మహనీయు లనుచు | నా మంజుమతులు మాను లయి యుండ
జన సమ్మోహన మూర్తి వెన్నుండు | దన మాయ వారి ప్రకృతి సుతు లని[illegible]
గనెదరు గా కని దలప రూఢి గన | నని నిటుల నెన్న గలయ ముదంబున
కన్నట్టి జనని జనకులు యిదె మీ | చిన్నికుమారుల కన్నుల గాంచుడు
ఇన్ని నాళ్లు మిము సేవించు నోము | మున్ను నోమ లేకున్కి నిజ మమ్మ !
మము గంటి రంతె గాని మా బాల్య | క్రియముల పౌగండాది వయస్సుల
విమల రక్ష శిక్షణ లాలింపుల | మము మీరు గనుట యనుకలిమి గనము
మునుపటి తపముల ఫలము లుండవలె | జననీజనకుల సేవింప నయ్యా !
వినుడు మా భాగ్య మింతే యున్నది | ఘనులార ! దైవయోగ మిటులుంటె

మా తనువు మూల మన మీరె గారె § మాతా! మా పిత! యని మి మ్మెప్పుడు
వాతకరాసులు భస్మములు గాగ § నీ తరుణంబున నైన గంటిమో
ఎవరు జనని జనకుల సుత గురుల § నవల దార వృద్ధ విప్ర ప్రభృతుల
దవిలి పోషింప ప్రీతి గనకున్న § భవము వృథ యతడు జీవన్మృతుండు
పరము గనడు వా డాత్మవంచకుడు § నిరయము దప్పదు యట్టి కష్టునకు
వరమతులారా! మా పూజ్యు లరయ § ధర మీరు గారె? యాదరణ గూర్ప
నరుదెంచినార మిదె సరస గంటి § మరయు డిక మమ్ము మీ పుత్రులమో
చిరకాలమునను మిము జూడ గలిగె § కరుణ వినవలయు మాకొరకు మీరు
భర మందితిరా పెక్కు దుఃఖముల § తలమందుటె గాకను చెరసాలను
పరిభవము నందితిరి కంసువలని § నిరతర సంశయ భయ క్లేశమ్ముల
మురిపెమును గనదు యా దుష్టుండును § సరకు సేయడు మిము నుగ్రసేను
పరితాపమ్మున మీతోడ గూర్చి § కరము క్రూరులను హరించు శక్తిని
పరమందు పరుల మగు మేము నింత § వరుస గనువరకు మీ దరిని జేర
టరయని తప్పిదమును మన్నింపుడు § చరణములు మీవి మా తల నిల్పెదము
అనుచు తమ కరములను వారిపదము § లను విడువ నేరకున్న యవ్వారి
గనుచు హరివాక్యముల నలరు గనుచు § కని రంకములను వారి నిలుపంగ
కనుల నానంద ధార లొలుకంగ § తనయుల శిరముల దడిపిరి ముదమున
జననాథ! యుగ్రసేను నటు గూర్చి § మను జసింహుండు మాధవుం డిటు లనె
విను మో తాతా! యీ భూమి కెల్ల § జననాథుండవు నీవె భరింపుము
గను మాదరమును యదువృష్ణులాది § గను సేవింతురు యయాతి తలపున
గన యదువంశుల జననాథ! పట్ట § మును గాదెయుంగు దీవన్ని మొక్కుచు
జనవరు లెల్లను నీ కరి నిడగా § ఘనత మెఱయ నేలగను మాతోడు
తను మెలగ నీవె పూజ్యుండవు మాకు § ననుచు రొప్పించి యటు గూర్పెదలంచి

-:శ్రీకృష్ణుండు దేవకీవసుదేవుల చెఱ మాన్పి యుగ్రసేనునికిఁ బట్టంబు గట్టుట:-

విను మెన్నఁడు జనవరునిగ గూర్చుట § భువ నీతిసత్యపాలకు డితడని
జనులు గొనియాడ జనకుండు మెచ్చ § జనని యలరగా మునులు ముద మంద
గన ధర్మరతుండు నుగ్రసేనుండు § దినవాథు తేజ మై పాలించెను
వనజనాభు తన మనుమనిగ వడయు § మును సుకృత ఫలము చొప్ప దెట్టిదో
జనవరా! కంసుభయమున పారిన § తనవారి నెల్లరకు నిమ్ము లిచ్చి
తను వృద్ధనమ్మతిని మెలగుచు వన § గనిరి మోదముల పురవాసులెల్ల

తనసన్నిధి నెడబాయకుండు నా § తని యాతని పతిఁగా రామకృష్ణులును
మతి పెంపొందిన ప్రీతి గాంచి రా § యతిని కరమ్ముల జాపి మ్రొక్కుచును
నందయశోదలు వారు నానంద § మందిరి గోవిందుని తమకొడు కను
చుందు రీవరకు నిజము సందియము § నొంద మందుండె నది దొలగి యిపుడు.
నంద సుతుఁ డగునె బ్రహ్మాండనిలయు § డందమించె నేలీల నిజం బని
తందరను గనక వినుతించి రట్టె § మందహాసమున వారి దరిఁ జేరి
హరి బలికె వారు హర్షాశ్రువొప్ప § సరణి నరయు మెల్లన వల్ల గనుచు
మా జననీజనకు లైతిరి భాగ్యము § ఈ జగద్వినుతి మీపాల స్థిరము
మా జననీ జనకులను మిగుల మీరు § రాజ నరసి రక్షించి మనిచితిరి
కనినారు కడుపునను వీరు మమ్ము § గనుల గన్నారు మము మనిపినారు
వినుడు మీము మరువరాదుగా మాకు § గొనుడు మ్రొక్కులివె మందను జేరుడు
ఇందు పనులన్ని దీర మీచెంత § కుందు మాయింప వత్తుమని బహుళ
మందు కానుకలను మరియు గోపకుల § కందరికి నిచ్చి వ్రేపల్లె కంపె
వారును వనమాలిని నెదను నిల్పి § జేరిరి నెలవును నిరంతరము నా
నీరజ నయనుని బలభద్రుని నెపు § డారసి మనముల దివ్యులే యనుచు
తలచు చుందు రవ్వారి చర్యలను § నలరు సమయముల నెల్ల తరుణముల
తలచె వసుదేవు డాతని తనయుల § యుల నుపనయనమ్ముల గూర్ప బిల్వ
బనిచె గర్గాది భూసురోత్తముల § వనరుహ నయనుల నటు జేసి వారి
జననాదు లెఱుఁగ మునుకొనుట ముందె § కని వినియుండుట జగతి కీర్తించె
ఘనమైన దక్షిణలను గోవులను § కనకరత్న వస్త్రాది యన్నముల
మును జననకాలమున తల పుంచిన § యనువున గోచయములను ద్విజ తతికి
వసుదేవు డొసగె బ్రహ్మచర్యమున § వసువులాది దివ్యులును హరి రాము
వెస నుతించి రవ్వారి మహాత్మ్యము § దెసలన్ని వెలసె ద్విజులైరి వారు
ముదమున వేదము పఠింప గురువుల § సదన పరిసేవ కుదురంద వలయు
ఇదె తరుణ మనుచు నా యదువీరులు § మది నెంచిరి గురులయ్యు గురువునుఁగా
గనగ వారణాసిని విభవరాశి § ననయము పాపనివారణ రాశిగ
మును లరుగు తలము శివుడున్న నెలవు § ననుకూల మొంచి యాతీరంబున
పొనరున యవంతిపుర నివాసియును § వీన సకల విద్యలను వెలయు వాని
ఘనుని సుగుణ సమ్మతుని ప్రజ్ఞాను § వినయ ధురీణుని సాందీపుండను
మునివరుని జేరి మ్రొక్కి సేవింప § గనె నతడు వీరు మహానీయు లనుచు
తనను లోక వర్తనమున గురునిగ § తనవద్ద నేర్వ వచ్చినా రనుచు

మును మిడి వేదములను వేదాంగము ఽ లను శాస్త్రములను ధనుర్వేదమును
విను మింక తంత్రి ధర్మశాస్త్రముల ఽ జననాథుల నీతులను భైషజ్య
మును నాది సకల విద్య లకెల్లను ఽ మనమునకు దోచినట్టి చందమున
దినముల నరువది నాల్గిట నన్నియు ఽ ఘనులు నేర్చి రొక్కట దినవరుసల
వరనాథ ! గురుల కెల్లను గురుడగు ఽ సరసిజనేత్రుడు గురు లఘుభేదము
లరయ నీని మహనీయుం డట్టుల ఽ వర సురాది హితమనుచు దా నేర్చె
గురుహిత చర్యల పరమునందే తీవరము సుఖతరము పరమ నిధానము
అటుల నా రామకృష్ణులు విద్యల ఽ పటుతర శక్తిని నేర్చిన వారిని
దిటవు నెంచి మహనీయతలను విని ఽ ఇటు బలికె పరమపురుషులు వీరని
మీరు పుణ్యధాముల గంటినిగా ఽ సారమగు విద్య లన్ని నేర్చితిరి
కూరిమి గలదేనియు నాపుత్రుడు ఽ వారి మునిగె నా ప్రభాసమందున
తిరిగి మాయముగ వెలికి రాకుండె ఽ వర బలయుతులకు మీకు సాధ్యమగు
గురునకు పుత్రుని దక్షిణ నొసంగి ఽ కరము మీయశము నింపుడు భూమిని
గురులకు బ్రీతియు నగు శిష్యులెల్ల ఽ సురుచిరైశ్వర్య బల మహిమ గంద్రు
వర మిదియ నాకు మీకు జయమగును ఽ వరుస గొను డనగ వారు వెంబడిని
సాగరుని జేరి చయ్యనను మ్రొక్క ఽ మా గురుతనయుడు వారిని మునిగియు
వేగమున నదిని నిను జేరియుండు ఽ ఆగడము గూర్చి తేనియు పూర్వము
గనెదవు శ్రీరాముని నాటివలెనె ఽ నన సాగరుడన యయలార! యతని
గొనె పెద్ద యలయ నందున దనుజుడు ఽ ఘన మదమున నాబాలుని మ్రింగెను
ఘను డట వానిని యని త్రోవ దెలుప ఽ గని కాంచి రతని పంచజనుం డన
దనిమి వాని హరి యొక్కశరంబున ఽ గనెను వానియుదరమును శోధించి
తమ గురుని సుతుం డందు లేకుంట ఽ క్రమమున శమనుం డతని గొనె నేమో
విమల మార్గమున బోయి యడుగుదము ఽ సమమతి నిడునని దనుజుని దేహజ
మైన శంఖమును హరి గొనుచు నేగి ఽ వైన వెరిగింప శంఖము నూదిన
మానవు డెవండో ! మన పురము వెలిని ఽ మానవాపస్మారత గర్వించె
వాని దునిమెదను గాకని శమనుడు ఽ దాను దోష దహనునివలె మించియు
పూనిన ప్రజ్వల మూర్తియై జేరె ఽ మానవాతీతు మానాతిమాను
ధ్యాన వరిష్ఠుల హృదయ నివాసుని ఽ మా నాథు హృషీకేశుని కేశవు
మాననీయమతి నభిమాన ముడిగి ఽ దీనశరణ్యా ! దేవజనార్దన !
మానితసుందర ! లీలామానవ ఽ మూర్తి ! శ్రీహరి ! నీ వని యెరిగితి
నా పూజ గొనుము వను మన్నింపుము ఽ ఏపని గలిగెను ! యిట నీరాకయు

నాపుణ్యఫలమొ నిను గొనివచ్చెను ❧ ఏ పని సేయఁగ నన్ను నియమింతో
యని వచింప నా యముని కరుణ గని ❧ వినుము పితృపతీ ! నీకు దెలుపంగ
ననుకూల ముండి రాక నందితిని ❧ ఘనుఁడు సాందీపముని మాకు గురుఁడు
అతని తనయు పంచజనుడు భ్రమింగెను ❧ నతఁడు నాచేతఁ జచ్చె నెదిరించి
యతని తనువునను గనక నిన్నడిగి ❧ మతి మెచ్చు గురుని నతి నిడుదు మనుచు
యతి వడిని వచ్చితిని వాని నిమ్మ ❧ సతతము ధర్మమునను నిలువుమయ్య
యన వీడె గొనుడు అని యొప్పగించి ❧ మునివినుతుని మరి యర్చన సలిపిన
వనజ నయను డా దుర్జన దమనుని ❧ వినయనిధిని గరుణించి నిలువుచును
గురుసుతుని గొనుచు యోగమార్గమున ❧ పరమహర్షమున గురుని సన్నిధిని
వరుస గని జేరి దక్షిణ గొనుమని ❧ కరముల శిరమున జేర్చి పుత్రునిఁ
పరమ ప్రీతి గన యొప్పగించి యా ❧ గురు పత్నికి నింపున సాగిల్లిరి
వరమనుచు సుతుని గని శ్రీహరిఁ ❧ పరము డనంతుండని యెంచి వినుతి
కరము మోక్షవిద్యను గూర్చి బొగడి ❧ పరమవిజ్ఞాన నిధులు మీ రనుచు
దీవింప నింక నేమి యడుగు మన ❧ పావనమూర్తీ ! యేమియును కొతుకు
లేక మనమ్మున మీ ధ్యాన మతియె ❧ సావకాశమున నిలువుదు నంచని
మే లందెద రిక యశమున మెలగెద ❧ రోలి సౌభాగ్యములు మీకు వెలయు
చాలందు వృద్ధి మోదములు పెక్కు ❧ వాలాయమందు మ మ్మెద నిలువుదు
యనుచు మరి మరియు దీవించి పంపె ❧ వనరుహనేత్రుడు బలభద్రుండును
కనక రథమెక్కి మధురను జేరిరి ❧ గనిరి బంధువుల వారంద రలర
విన జెప్పె వారలకు తమ నేర్చుట ❧ ఘనత పాంచజన్యము తా నొందుట
విని రవ్వారలు యద్భుతం బనిరి ❧ వసుదేవు డలరె దేవకి యట్లనె
జనవరా ! యొక్క దినమున కృష్ణుడు ❧ తనమనంబునను దలచె వ్రేపల్లె
తినరగ జననీ జనకుల మిక్కిలి ❧ యనుప్రీతికరుల నంద యశోదల
తనసఖుల గోపవరుల యావనిత ❧ లను వారలెట్లు సుఖమున నుండిరో !
విన బోలు ననుచు తా నచట బోవ ❧ ననువు తగదనుచు నెంచెగా వలయు
మరి బరికించెను వారి క్షేమముల ❧ గతి విచారింప తాలిమిని పెంపు
స్థితి గూర్చ మంచి నేర్పరిని బంపి ❧ యతివల తాపము బాపి ముదంబున

—: శ్రీకృష్ణుండు గోపకాంతల చెంతకు నుద్ధవునిఁ బంపుట :—

గని తన్ను గనని యునికికి బెదరమి ❧ వనిత లొప్పగా చేతునం చనుచు
ఘనుని నుద్ధవుని బుద్ధిగురుసముని ❧ దనయందు భక్తి మును గొన్న వాని

వెనువెంట నెప్పుడు నెడబాటు గనని § వినయ వివేకుని గాంచి యిటు బలికె
వినుమో! యుద్ధవ! నీవు నా మంత్రి § వనఘుండవు నిన్ను వినిపింతు నొకటి
పోయి రావలయు మందకు నందుని § దాయువలయు మన కుశలము వచించి
సేయ ముఖ్య వారల క్షేమమెఱిఁగి § న్యాయమున సతుల తాపము మలపుము
నీ యనువు మంచిదని దోచె నాకు § నా యనఁగు సఖుఁడ వగుటఁజెప్పి తని
నను వారు పరముడని నమ్మి ప్రోతు § ఘనుఁ లవ్వారిని మరువను నెప్పుడు
మునులు వారి నెట్లు ధ్యానింతురో నను § వనిత లట్లు దలపోతల నుందురు
వినఁజెప్పవారి కెల్లన నేకతఁ § గని వత్తునను మాట తాపంబు డిందుఁ
గనవలె వారలు వెంత తపింతురో § నను గనని దినము లే యుగంబులుగ
దలఁతురు వలపుల మానముల దోలఁగరు § కిలకిలలఁ గూర్చు వాని నా పలుకు
లల రట్టిపడఁగ ముదమున మెలఁగుచు § చెలఁగుదను మించ చెప్పు తగుదు వన
విని యుద్ధవుండు పతి సడి యానతి § మునుకొని కనకపు రథ మెక్కి గదలి
ఇను డస్తమించుటకు ముందు గోవు § లును మందకేగు ధూళి తను గ్రమ్మ
గనె వ్రేపల్లెను నందు మందిరము § నను జొచ్చె నందు డానందంబున
గని కౌగిలించి పూజ లందించి § మనము శాంతి తనుశుద్ధి గనఁజేసి
ఘనతర గోక్షీర మంజులాన్నతుల § గొనరున భుజింప గూర్చి మార్గమున
గనిన యాయాసమును బాపి పీఠమున గూర్చుండగఁ జేసి ముదంబున
తన యింటిచెంత గని నిలువ నొక్క § యొనరైన పీఠమున తాఁ జేరియు
కనుల నానందమున దొరగుచున్న § వనధారల దనయొడలు దడియ ఘనె
ఘనుడగు నుద్ధవునకు ప్రబుద్ధునకు § వినయానందుడు నందగోపకుఁడు
అయ్యా! ఏమని యుగ్రసేనునకు § నెయ్యుడైన వసుదేవుఁడు కుశలమ
అ య్యువిదాతిలకంబు దేవకికి § చయ్యన మోదం బబ్బి యున్నదే!
మా పాల నున్న రోహిణీదేవి § ఏపున ప్రమదము నంది యున్నదే!
ఆ పాపచిత్తుడైన మత్తతన § ప్రాపందిన కంసుండు దీరగా
నా పుణ్యవరుల భద్రము దనరునా § ప్రాభుని విడరా రామకృష్ణు లా
నందము గాంతురె మమ్ము దలఁతువా § డెందమ్ములు మావి తమయందె నుండు
చంద మాడుదురె ముందు నా వీట § ముండనున్న హిత ములిరి దలతురె!
గోవుల దలంపు వని మెలంగుటలు § పావనచర్యలు యమునాతీరము
లావన తిరుపుఁ దా మెలంగుటయు § ఆ వరమతు లన విందు వచింపు
ఆ వనజ నయను నింక మా బిడ్డ § నే వలనున నైనను గాంతు మెల్ల
ఆ కలంక రహితేందువదనులను § మా కన్నులు వచ్చు మింకగాంతుమె!

మాకు వారిరాకను వినిపింతురె § జోక మిముం గనిన వారి వివరింపు
మనుచు కనుల నీ రాపక డగ్గుత్తి § కను గాన హరిని రాముని ముందున
నొనరించిన పను లెన్నొ వచించును § తనరాణి యశోదయు నట్లె బలుకు
టను గాంచి యుద్ధవుడు వారి శాంతి § గని యూరడించుచును చిరునవ్వును
దనర వారి కడి గూర్చ బలికె నిటు § ఘనులు మిము జేసుమరుగాక వేగ
వనరుహ నందకుడు జననీజనకుల § విన బల్కుచుండు నేమాటనైన
గన దల పుండును వినుడు నెమ్మదిని § వనజ నయనుండు వేగ వచ్చుటకె
యొవరు గల్పించి మిము జెప్ప నన్ను § బనిచె ముందు గనె నింతలో వచ్చు
వనమాలి యైన హరి యతడు సుమ్ము § తను దలచువారి దయ జూచు నంచు
బలుకడే ఖలుల బొలియింప బుట్టె § నల పద్మాపతి యిలాలిం దాను
నిలకు భారంబు దొలగింప గోరి § జలజ సంభవుని ప్రార్థన నంచును
అలవాడు గద్గ డవ వినియుంటివి § దలపున నుంచితె విన్న మొన్నటికి
తులువ కంసు జంపుట యొరని కగును § నలనాడు గిరిని నిలిపె దనకేల
పూతనను దునుము టాది యన్నియు § నీతల మందే గాదె మానవుని
సేత లన్నియును మహాప్రసాదము § లాతరంబు విన నత్యద్భుతంబు
ఆదిమూర్తి యా యనువల్లభుండు § నీవగు తపంబు పెంపున నిందున
మోదమును మీకు గూర్చ వసించెను § ఆదరించు దన ధ్యాన పముకుప్రి
పరమ హంసరూపుడు స్వయంభువు § నిరతుడు సత్యస్వమూర్తి మాధ్యుడు
నిరయదూరుండు నగు తను స్మరణము § కరము ముక్తినిడు సర్వసాక్షియై
కర్మఫలదాత తా నిష్క్రియుడు § మర్మమెరుంగుదు రతని తపంబున
నిర్మలచిత్తులు నీపరము గాంచి § నర్తముల గూడె నాడె మీ సంతు
లను గోపవరుల నొక్కట చిక్కెను § తగ నక్కజంబుగను భక్తి జిక్క
నగధరుడు నాగ వరదుడు నగు గా § నగపరచె గదా యమ్మ యశోదా
జగనంచు జగములన్ని మెలగమంచు § ఖగవాహనుండు సర్వపముడగుచు
పగతురు నెయ్యురు బంధుల్వనాగను § జగదీశునకును భేదము లేదే!
వగల దొలగి నుతియింప సన్నిధిని § నిగ నిగ లాడుచు నండను వీడదు
సుగుణుల చెంగట యవగుణుల దూరు § డగు నీలాంగుడు నిజము శ్రీహరియె
అని తెలిపినంత నా హరిని దెలిసి § వనట విడిచి రా నందయశోదలు
ఘనత నిద్రించె సుఖశయ్యపైన § దొనరున మేల్కనె దధి చిల్కధ్వనుల
గను పనిలెల నందళుల వేగుటను § ఘనులు దిరుగాడు సమయంబు గాదు
గన నుద్ధవుండు గాల విధులను § తన కార్యములను దీర్చి యొక్కచో

టను మంతనమున మాటాడ యోగ్య ॥ మును నైన యొనరు గని నివసించిన
వనిత లావణ్యవిజనం బాత ॥ గనిరి నందునింటికే వచ్చినట్టి
కనకరథపు గురుతును బట్టి యుడుగు ॥ చును మధురాపురినుండి వచ్చెనని
కనిన కాంత లా తక్కినవారికి ॥ వనజముల బోలు కనుల సుందరుడు
నురము విశాలము పీతాంబరముగ ॥ కరములు దీర్ఘము కమలమాలయును
వరముగ కంఠము నం దొప్పువాడు ॥ సరసిజ నయనుడే పంపించె నేమొ
అరయుద మాతని సరసకు నేగియు ॥ తరుణులు తీవ్రత పరమున జేరిరి
కరము సిగ్గు దోపంగ దిలకించి ॥ చిరునగవు లొప్ప సుందరముఖముల
నరోత్తమా ! నిను నడుగక తెలిసెను ॥ సరోజ నయనుడు పంపెను నిన్నని
పరాగమందుము తలిదండ్రుల వలె ॥ పరాన నైనను మేలె యిది కొంత
విరాగులైనను విజ్ఞుల బంధుల ॥ పరాక్ర్మ గాంతురు సఖు లట్టులె
నిరాదరింపరు యారాజముఖ్యు ॥ తరం బెరింగితిమి చరించు పట్టున
సరోజములను మరందమును గొని ॥ సరాసరిని బో నగునా షట్పదము
నరోత్తముని పస దా మెరింగినను ॥ నరాళి నిలుతురె యాతని చెంతను
పరాంగనారతి బారు జారుండు ॥ వరాంగి నింటను పొందు గోరునే !
సురాదిహృదయము నిదయాగుణం బెటు ॥ స్వైరంబు దోపును కటువు దొలగు నెటు
ధనహీనుడైన విటుని విడుచుగద ॥ వనిత వెలయాలు నాచార్యునట్లె
వినయమున జదువు నేర్చి మించియును ॥ గనడా గురువును దక్షిణను గొన్న
యతడు ఋత్విజుడు యజమాని దాటు ॥ గతి జేర డతని పని ముగిసె ననుచు
తతి ఫలము లేని తరువుల ఖగములు ॥ స్థితిని గనని యటు అతిథి భుజించిన
జనులు యిండ్లనుగ మృగములు బయలగు ॥ వనములను విడుచునట్లు మము విడిచె
మనమున మా జాలిని గనండుగా ॥ వనితల నిటు తా వంతల గూర్చెన
ఘనుని కందు సుఖయింప నను వగన ॥ పిననాటినుండి మము బూవు దశల
మునుపటి విలాసముల దలచి మేము ॥ దనను చింతింప నట నిలిచె నెట్లు
అని సిగ్గు విడిచి యాతని లీలల ॥ విన బాడుచుండ నుద్ధవుండు బలుక

—: భ్రమర గీతలు :—

నందునంతలో నొక గోపవనిత ॥ దండన దైవ వశంబున నుండుట
పొందుగొన్న సంభ్రమమును నడరెడు ॥ గెండు తుమ్మెదను గని కృష్ణునిమీద
మనసు బరపి పైమురచి యా భ్రమర ॥ మును కృష్ణు డంపి నట్టి దూత యని
తనలో నిలుపుచు దాని నాక్షేపణు ॥ వనిత పలికె నది యుద్ధవుని ప్రతమ

పదునగు నన్యాపదేశ పాటిని ♦ విను మో నరవర ! యా యింతిపల్కు-
భ్రమర కితవ బాంధవ ముట్టకుమా ♦ మము పదాబ్జముల నీవు వనమాలి
క్రమమున సవతుల కుచ కుంకుమాంకి ♦ తము నాయానుట నలిగిన దండను
నాని యాగురుతు గూడితివి నీవు ♦ మాన మది యోర్వ మిదె తెలిసిపొమ్ము
యా నళినాక్షుడు మన్నించు నిన్ను ♦ యదుసదన మందె మానినుల పొంత
యొకపుష్పరసము గ్రోలి యింకొకటి ♦ సుకరముగ గాంచి పోయెదు గా నీ
విక మరల నగును తనయధర సుధను ♦ నకలంక మతివి యిచ్చి యిపు డొసగ
డతని లక్ష్మి యెటు పద మాశ్రయించె ♦ సతతము కపటపు మాయవచనముల
సతి నమ్మబోలు మంచి యున్నదియె ♦ నతని చాతుర్య మంతే తెలిసినది
వింతలు గా వవి పాతబొంత లగు ♦ సంతసంబులకు నచటి కాంతలకె
చెంత నీ వతని గని సంగీతము ♦ వింతు విట మాకు ప్రీతియగు నెటుల
మే మెవర మిపుడు కావలసినట్టి ♦ రామలందు నను వింత గులుకంగ
ఆ మంజుమూర్తి పలుకుల నగవుల ♦ నే మహిళలు తమ మనము నీయరో
కామించె లక్ష్మి యందునసే కద ♦ నీ మనులు గొలుపు ప్రశంస వల దిట
వినబల్కెదో యది దీనరక్ష యని ♦ గనము మే మదియు మా పదము విడువు
వనితలము మేము తనను నమ్ముకొని ♦ ఘనబోము పతుల మొదలు బంధువుల
మము మోసగించె మెత్తురే ! విమలులు ♦ క్రమము నెఱుంగడు యా మానధనుడు
సుమబోడుల వంతల గుదిరింపగ ♦ సముడు గాడు ధర్మమును దన యిచ్చ
యగు నొకో ! వాలి దునుముట వంచన ♦ యగు గదా ! బలిని యడుగుట వెంటాట
తగవున తన్నొకపరి విన్న మింటి ♦ ఖగములకు ముక్తిపద మిచ్చు నతడు
తగునె మాపట్ల కఠినము గాగట ♦ పగ గొను నింతుల నొకటి వలవినను
తగవు విడిచియు విరూపిని దనుజను ♦ జగి దప్పుజేసె అదియు వినఁదగునె
బోయ కూత విని తమజాతి దనుచు ♦ నేయుముదు గోరి దండ తిరుగుటను
కాయ మిలను బడ నాటు శరము వలె ♦ నా యమలుడు మము మాడు నారాశ
ముల గూర్చి బారె పలికెద మెవరిని ♦ విలసిత భృంగమ ! నీ వేగి చెప్పు
లలనల విరహాబ్ధిని దోగ ద్రొబ్బి ♦ యుల పను వెత్తుట బలిమి గాదనుము
చలము వల దనుము పాడి గా దనుము ♦ లవి జావు మనుము మాపరము మొక్కు-
కలగిన మనముల నేమేమొ బలుక ♦ వలనందినారమో భృంగరాజ !
వలివనయును డీ నలివేణుల గన ♦ మలయక రమ్మను నలరంది నీవు
వినుత భవనములు కనకోజ్జ్వలములు ♦ గన మధురాపురి లోన గలుగుగా
గనవచ్చు నెటుల మా కుటీరముల ♦ ఘన నగరం బది మాది పల్లెగద

వర సురభిపాక ఫలశోభితములు § పుర సమీప వనములు నమరు నచట
నరయ కంటకాదులు మా వనములు § హరికి సొంపు నింపునే ! మా తలములు
వరతురగ కరివ్రాతము లచ్చట § సరణి నిక్కమాధేను పాలనము
కరము ముద మిడునె ! శ్రీకృష్ణునకును § తరుణులు సుందర పరత దివ్య లట
దరి జేరు టెట్లు ! గొల్లపడతులను § నరనాథు డతడు నూతన ప్రియుండు
మురిపెము నింపున మము తొలుతవారి § సరసిజనాథుని మెచ్చ జెపుదు పెటు
పరమసఖుండవు హరికి దెలియనదె § సరసగుణ ! మమ్ము దయ దిలకింపుము !
హరిపరములె మా సర్వము దెలిసితె § వరమతివి నీకు నింత జెప్పంగ
నేల నైన మావలని సంగతిని § నీలవర్ణునకు మ్రొక్కుటగఁ దెలుపు
చాల నాళ్ళయ్యె నాతని జూడక § మేలు కూర్పు నీకును శుభ మమరును
నావిని యుద్ధవు డలరుచు నిటులనె § యో వనజగంధులార ! పవిత్రము
నే వరించియున్నట్టి సౌందర్య § భావు లల్పముల నెఱుగని శుద్ధ మ
తులు మీరు మీకు నతు లొనర్పదగు § వలపున మనమున హరి నిలిపినారు
యల జప తపాదులను సలుపువారు § విలసిత శవనము లొనరించువారు
వలను గనరట్టి హరి మీకు వశుడు § లవి భక్తి దట్టితిరి యావెన్నుని
లీల వెలయ మీలీల హరి నిల్ప § జాలువా రెవరు ! జ్ఞానవేత్తలును
మీర గారె వగ పేల ! హరిదంత § జేరు మీ రతని గోరకనె ముందె
సారసనయనలు మీ తల పెరిగితి § నీరజేక్షుణునిచే వింటి మొదలె
మీర పరమ హంసముల దీప్తి మిము § జేర హరిసు మీ రొకటె యని దలతు
నే వచ్చునప్పుడు హరి బలికినట్టి § మీవలపు మెఱయు వాక్యముల నాడె
యా వర వచనములను దెలుపుచుందు § దేవ వినుతములు మీకును దెలియును
నను బల్కింతురు విన నపేక్ష గాని § వినుడు ముదంబది మీ జన్మవరము
వనజాక్షులార ! సకలంబునకును § గన నేన మొదలు కారణుడ ననియు
మనమున దలంప మత్పదము వేఱు § గనక మీసన్నిధానమున గనెడ
రనఘ మతు లెరుగదగు నీవాక్యము § లను రామలార ! చరాచరంబుల
గన మహాభూతములు వసింపు గను § వినుడు నాడు చైతన్యంబున వా
నిని బొందింపను గూర్చితిని నేన § దనరుచు నన్నిట ప్రాణ మువంబులు
ఘనత గుణేంద్రియ కర్మల యందున § ఘనులు గొనియాడ నాయుత్వ మనియు
జనన స్థితి లయములు నావశంబె § యనయు మని మన్న [illegible] నిర్మలు
డును ననాది నగు నేను నిత్యుడను § గనుచుంచు మాయయుంట నాపరంబె
యుడె యద్వయ్య యన నొప్పు ప్రకృతి యది § [illegible] వర్ణ్యంబు [illegible]

లదనుచ వెలుగును నను దెలియ నిలువ § సదనము గన వవి యా మాయకునకా
దూరుడ నేనని మునులు బలుకుదురు § జేకుదురు ముక్తి నటు మనోధృతిని
నారయ నది యానందరూపమగు § మేర దెలియ నదె నాస్వరూపంబు
గాన నేన నిత్యానందుడ నని § ధ్యానమంది నను స్మరించువారిని
నే వరసి దండ నిలుప నిలుతు నది § నా నిశ్చయంబు సుండీ నారులు
మానిత విజ్ఞానులు నేకమతిని § మాన మెంత యన మిన్న వెలయు నను
ఈ నయనాదుల కళల నను గనుచు § స్థానము నెరుగుచు సంసృతి పరముల
కలలోని భోగపరము లని తలచి § అల-మథనమునను ననలుని గని నటు
తలపు వలపు ఫలమున మొదల బరగు § జలజాప్తుని వెలిగించు నాకళను
యువలీల గాంచి నాలో నేకత § దవిలి సుఖింతురు భవముల వడయక
యువిదలార! తుచ్ఛముల వలపేల? § గవయుండు జ్ఞానధనము నార్జింపు
విధము తెలిసితిరి మీజన్మ భవ్య § మదిగాద చింత వినుడు యావృష్టి
నిధిని మిము స్థిరము గూర్ప నిందుంటి § విధిని భేదంబె గా గలయ జూడ
నను విశదమతిని యేకత వెలయగ § వనితల మము నాధ్యాన సహితలను
గనుచుందు నెపుడు సర్వసాక్షినై § గనుడు మోహంబు ముక్తి యదె మీకు
నను జెప్ప మనిరా చాలు దప్పకను § వినిపించితి నిక వగవును గొనకుడు
నా వనిత అలరుననుఁ యాతని గని § నీవు మాకు నీతరి జెప్పినట్టి
పావనవాక్యము విది సంతస మే § మావలను జొచ్చె మోహం బట్టిది
గాన యిట్టి వేదనకు పాల్పడగ § మానితుల మగుట బలికితిమి నీకు
ఆ నలిన నయను డిట వచ్చు నెపుడు § మానినులు మధురలోనివా రెల్ల
దా రాగ నడ్డ మరుదెంతు రేమొ § కూరిమిని ధాత గొనదు మామీద
నీ రాక మాకు జీవముల నిలిపె § నా రాజీవాక్షుడు బల్కినట్టి
చనువు నెరవు వాక్కులె మాపాలికి § గన సుధ ధారలు గద యో యుద్ధవ!
తను గాంచనున్న తనువుప్రాణముల § నుడికి వల్లయును వేగ రాకున్న
యమునా తీరమునందు మము గూడి § విమల సుధాకర కళల రాత్రులను
సుమ కోమలులము మము కుసుమ శరుని § క్రిమవు చాల్దప్ప నంకమున గొనుచు
శతము మా మోహమును దీర్ప కేళి § వరుస బంధముల గూర్పు జెప్పనే
వరదుడైన హరి మా మనోభర్త § చిర-తలంపులను తెన్ను బాయ మని
వనితల ధీరత చిత్తములు ప్రియ్యకలను గూర్చుటయా యావలి ఫలంబు
గనబోము సెప్పుమయ్యా మా హరికి § మనమున లజ్జల విడిచి చెప్పితిమి
మును [illegible]పురి కింకళవశనె § మనతునను శాంతి గనుచునె యుద్ధవ

అనుచు ధ్యానమున హరి నిలిపి విరహ ✽ మున నైన తాపముల నడపి యతని
ఘనత బూజింప గొన్ని నెలలుండి ✽ తనకు నందు డొసరించు సత్కార
ములను బ్రీతుడై పెక్కు గానుకల ✽ యల రామకృష్ణవసుదేవు డాది
కల హితులకెల్ల నర్పింప నొసగ ✽ పిలిసితానందమున నవి గొంచును
నెలవ ది విలువ జేసి యువిదలను ✽ వలనల్లగనుచు మధురకు హరి గన
వచ్చి వేడ్కో నందుం డొసగిన ✽ మెచ్చుల కెల్లను నందరికి నిచ్చి
ముచ్చటలెల్లను మోదమున జెప్పె ✽ యచ్చపోరాట్లు లాడిన వరుసల
జలజ నయనునకు దెలిపి మరి యనినె ✽ లలనల వలపున మనమున నిన్నే
తలపుచు తమ జీవములు నీపాల ✽ నెలయు నర్చులను దోగుదు రెప్పుడు
తిలకింపు రమ్మని నా బలికి రయ్య ✽ లలవరింపుమా యువిదల సన్నిధి
వనుచు వచ్చించె కృష్ణుడు తా నటె ✽ ఘను డుద్ధవుండు బుద్ధి బృహస్పతి
జననాథ! వినుము యనినాడు కృష్ణ! ✽ నను నేల? నాదుయింటికి రమ్మన

—: కృష్ణం డుద్ధవునితో జేరుకొని కుబ్జాగృహంబున కేగుట :—

వెనుక వత్తునని తా నాడినట్టి ✽ వనిత త్రివక్రను గని దానిక్రీడ
వల రండింతును గాకని యుద్ధవు ✽ డెలమి తను తోడుగొని రా యింతియు
వెలగు భవనమునకును నడచె హరియు ✽ లలనయు హరి రాకను వేచి యుండి
తుల మించు నలంకృత తా నగుచును ✽ నిలు నలంకారమును గూర్చి ద్వార
మున వేచియుండ ముదిత సదనమును ✽ వనజ నయనుండు జేర నా కాంత
ఘనభక్తి నెదురు కొని సంభ్రమమున ✽ దనచెలులు తాను నతిని పూజించి
తను బ్రీతి గాంచ కనకసుందరపు ✽ ఘనత నెగడు తల్పమున హరి జేర్చి
యొనరున నుద్ధవు పూజ నలరించి ✽ వనజనాభు నానతి నాత డుండ
కనకచేలుండు కామిని దలపును ✽ గని లోని కరిగి యట వింతపాన్పు
నను నుపవిష్టుం డయిన హరి జూచి ✽ కనకలతబోలు కామిని దేవా!
వనజ భవాదులకును నీ మహిమల ✽ నను వెలుగరావు నాకది లభ్యమె!
మును సుకృతఫలము మేర నాయింట ✽ నిను గనుగొంటిని కామించి నిన్ను
కామ కాముడవు నా మనము గొనియు ✽ కామమున నింపు గలుగు వరంబును
నేమంబు గొనగ నిమ్మా నా మనము ✽ నీ మహిత సంగమమున తనువుతో
జీవము ధన్యము నందు భూపత్రిభో! ✽ నీ యధరసుధను నాననిమ్మా నను
కేలను కౌగిలి నాదరింపు ✽ భావము భావజకేళి దేలింపు
హా విజితేంద్రియ! మనోభిరామా! ✽ నా వందనమిదె యని కౌగిలో

జేరిన నీవి సడల్చి నురగుంటి § సారసాక్షిఁగ పరిరంభణాది
మారు సంపూజ్యమాన పరంబుల § నారిని గూడెను రతి కేళిలీల
గూరిన మాయావిహారి యా శ్రీ § నారిప్రాణనాథుండు విష్ణుండు
యా రమణీ తపము లేమొ ముందునని § శ్రీరమణుడు తన చిత్తాబ్జ విహా
రియు నయ్యు వశంకరుడయ్యు తనకు § నయము క్తి నొసగు దాతగా నెంచె
వియచ్చరులు సంప్రీతి దను గనగ § నయ భయ వినయమ్ముల హరి కరుణను
గనె నా చక్రియు దాని గర్భమున § తనయు డొకడు బుట్టంగ వరమొసగి
గొనెను సేవ నమ్మదిత చేతనము § ననువు కొలది తా నలరి యిలు సేరె
వనిత సనకాది మునుల పాలించు § ఘనుడు తన్నేలుటను మురిసె మందె
జనవరా! వింటె! హరిని గామించి § వనిత మోహమున ముక్తిని యనుగకె
తను రతి నేలుట నడిగె కర్మఫల § మున నిట్లు ఘనులు సంపదల గోరి
మును కొందఱిచ్ఛలను నింక ముందు § నను నదియె ముక్తికూర్పు దమ కనుచు
మది దలతు రేమొ! యది హరిమె యెఱుగు § నదియు ప్రారబ్ధకలన దొలగుటకై
విను నరేశ్వరా! యనఘుడ వయ్యెదు § వనజనాభు డొక దినమున నుద్ధవు
డును బలభద్రుని నిరుపార్శ్వంబుల § దనరంది రాగ నక్రూరు నింటి
కిని జేర నరిగె అత డిచ్చు సన్న § తిని బ్రీతి బొంది యతని కరినగర
మునను తనదు బంధుల కుశలంబును § నను వెతింగి రా పాండవుల మనము

## —: కృష్ణుం డక్రూరుని హస్తినాపురంబునకుఁ బంపుట :—

నను నిలుపుచు నాతని గాంచినంత § గనియె మాధవుని రాము నుద్ధవుఁ
దన కౌంగేలుల నూతగొని నవ్వ § పెనగొను వదనవు చూడ్కి దను బరప
గని లేచి వారి | మొక్కి యుద్ధవుని § ఘనమతి గౌగిలి జేర్చి పూజించి
హరిచరణమ్ముల నూరుల నిలుపుచు § కరము మోదమున సన్నుతి బలికెను
దేవా! కుటిలుల గూడిన కంసుడు § దేవత లలరగ దీరె నా కుటిలు
డా విధిని గూర యదువంశములకు § తా వండె మోదజీవనపు త్రోవ
దేవసన్నుతులు విశ్వాది పురుషు § లీ విధంబునను ధర బొడమితిరా
నావలని పుణ్యరాశి నెగ్గింప § పావకాశమున నిట కరుదెంచితె!
వాసుదేవ! భక్తావన! శ్రీశా! § నా సద్భాగ్యఫలంబు నీచరణ
వాసన సోకిన మాత్రిన ధన్య ము § హో! సుశ్లోక! భవాబ్ధి దరింతును
విశ్వము నీచే వెలయుట లాదిగ § విశ్వమయుడ వీవే యం దొప్పియు
విశ్వకారణంబగు బహురూపుల § విశ్వాడ వొక్కడవే దోతు వట్టు

ఇను డొక్కండే కిరణ జాలముల § కనువైన జగములన్ని వెలిగించు
నొనరునను నీవు ప్రపంచకారణ § మున ప్రభూత కలనంబున నీలో
జనించియును కార్యములచే పొనరు § గన నగు తనువుల భూతంబులన్ని
యనుగత దీప్తిని నినుగూడి వెలసి § యనురూ పందించును కార్యములను
వాని గుణకలిత జీవు డహంకృతి § నాను కర్మలను దా పరంబు గాను
రో నళినేక్షణ! ని న్నాకర్మలు § స్థానంబు గానవు నిష్కర్మసిద్ధి
నీవు రూపమరి యుండుట నెఱుగక § నీ వది న్యాయము గలుగ రూపందు
దేవుడ వీ వన ధర్మపాలనము § గావింతు వంతే బాధ రహితుడవు
జీవు డహంకృతి జెందకున్న యెడల § లే వతనికి సహాకర్మ బంధములు
దేవుడ వగు నీకవి యుండు నెట్లు § భావవేద్య! సంభావిత భావుక!
నీకు జననాదు లీ ప్రకారంబునను § లేకుండి బంధమోక్షమ్ములచే
నాకర్షింపని జ్యోతివి నీవై § యే కరణి రోల బద్ధుడ వైతివో!
వే తెఱగున నా భుజగ ముక్తుడవో! § యో తమ్మిపాపదనక! రమేశా!
నీ తత్త్వమెఱుగ నేటికి గాదగు § పాతకదూరుడ వగు పరమేశ్వర!
ఎపుడు పాషండ ముఖరమార్గమున § నృపులు వేదవిధి తొలగు వర్తనల
రిపుల గాని సజ్జనుల బాధింతురో § యపుడు బుట్టెదవు నీవు వైకుంఠ
ధామ! పరాత్పర! ధర్మప్రభావ § నీ ముందుభవము వసుదేవు తపము
దేవకీదేవి నోమిన ఫలంబు § పావనులగు నా నందయశోదల
భావదీప్తి నెగ డందిన పుణ్యము § దేవతరుల సుఖదాయక మగు శ్రీ
హార సన్నుత మగు నీచరణము లివి § కరుణ నను పోక నిచ్చిన దానన
కరము నా వంశకరులు పవిత్రులు § నిరయముల విదూరంబు నిజమ్ముగ
నను నీ సంసారమున బహుభీతి § గనుచుందు దీనిసంబంధమైన
ధన వనితాదిక మమతల దవిలియు § గనగ తుచ్ఛ సౌఖ్యములను గూరియు
ముం దెన్ని జన్మలను గర్భనిరయ § మందితినో! ఇందీవరేక్షణా!
అందునను ముక్తి గనము తెల్లమని § సందులేక చాటును శ్రుతులాదిగ
నందరును వినుచు బల్కుచు నెఱుకను § నంద మొందు టదియును వంచనంబె
నను నిన్నెప్పుడు గొలువ దలవుంచి § మనముల నిలువగ బ్రార్థింతు నింతె
వనజాక్ష! తపము పండె నీరాక § యును బూజ గానట పని నెయ్యమ్మును!
సుమనసవినుతా! చక్రి! మహామతు § లమరెదరు యోగకలన నిను శేర
కమనీయాకార! కమలాపతి! యని § నమస్సు లిడ వార సంసారి యయ్యె
దను గనగ వలయు [illegible] § [illegible]

వనఘ! యక్రూర! నీవంటి భగవ ʃ దనుచరుల గనుచు చనువు సఖ్యమున
గన జేర నెట్లు! సర్వతీర్థముల ʃ మునిగిన ఫలంబు అన్ని కాలముల
కనియును దివ్యుల సేవ ఫలింపను ʃ విను మనిమె గాదనరాదు గాదని
రొకచోట గాంచ నగునివె యిమ్ములు ʃ సకలంబు నందు బరగుట దెలియును
అకలంక మతిని హస్తినాపురికి ʃ నకుతూహలమున నీవు జేరవలె
జనపతిసిర ధృతరాష్ట్రు యంధనృపు ʃ గనవలయు పాండు భూపతి పుత్రుల

—: కృష్ణుం డక్రూరుని హస్తినాపురంబునకుఁ బంపుట :—

తనవారి నొకట పాలింప జెప్పు ʃ విను పాండునృపతి పరమును జెందగ
వనిత మాయత్త కుంతి తనయులతో ʃ తను దా కందెను గాన నరయు మను
ఘనయశమునె కీర్తించు జగ మనుచు ʃ నను మదికి దెమ్ము ఇవినాయామాటల
లని యందరు విన జేయు మిందునను ʃ తను మాటయేవురును గొల్చియుంట
జగమెల్ల నీవె బాలింతు వనుము ʃ అగడున బోవని విధము నరయగా
నిగనిగ లాడును నీ వంశములను ʃ పగ జెంచితేని నృపక్షయం బనుము
ఇంకను దోచిన వెల్ల మాటాడి ʃ పొంకము నంకము నెఱిగి వే రమ్ము
జంకు గొంకు గొనకను బోయి రమ్ము ʃ సంకటము బాపు మత్తకు మ్రొక్కల
నని బంపు నంత నత డా పురి గన ʃ కనకరథ మెక్కి వడి చేరె నచట
గనె ధృతరాష్ట్రుని భీష్మ బాహ్లికు ʃ లను ద్రోణ విదుర కర్ణ గురుపుత్రు
లును సుయోధను దుశ్శాసనాదులను ʃ పాండుసుతుల నందరిని గుమిగ
వారలు దను సత్కారముల దనుప ʃ చారుతరానందమున స్నేహమున
గూరి యొకనాట విదురుడును వినగ ʃ ధీరత కుంతిని గని మ్రొక్కి యచటి
కిని తా వచ్చుట సెప్ప జేరుటయు ʃ వనిత యతని కిటు లనియె విమలతను
విను బంచునపుడు జనని జనకులు ʃ తన యన్నయు తోబుట్టులు వారల
వనిత లల్లుండ్రు నాతో నేమను ʃ మని రందరికిని కుశలంబ గదా!
తనయులును నేను వీరిమధ్యమున ʃ నునికి వ్యాఘ్రి మధ్యము హరిణంబు
రొనర వసించిన యట్టు లున్నదియు ʃ కినుకను సుయోధనుడు నాకొడుకుల
దునుమ దలచు నెల్లపుడు విషం బిడ ʃ ఘనమైన నాగముల గరపించెను
గనగ నీట దిగల జెట్టె నాకె ʃ ఘనత నిద్రింప నాయుష్మ్యులను
బాడిపించు జంప వెతుడీయ దన్న ʃ కొడుకును నుడుపదు దుష్టతనంబున
కదు పెంపున నదరింప యత్నాలకొను ʃ విధ దమ్మో పగయు ద్రోవంగ నుండె
నొకయుతు ధృతరాష్ట్రుని మతము దేమి ʃ కడుపుమాటకై నే వీరి గూడి

దినములు గడుపుచు నుండినదానను | ఘను లా బలభద్రకృష్ణమూర్తి
నను నా తనయుల దలఁప్రదుకై వచ్చి | తన మేనత్తకుమారుల పాలును
వారి నుండి విడదీసి యిప్పింప | వార లెంతురో త్రోవ గనరాదు
శ్రీకర రమ్మనుము నా కోర్కె దీర్ప | నా రాజీవాక్షుఁడు విశ్వవిదుఁడు
మునుల నుతి గనిరి దానవుల జంపి | మును వినిన దాన పుట్టుకాదిగా
నని జనార్దనా ! కరిపరిపాలా ! | గనుము దయను దైవంబు మాపాల
నిను జూపినాడు మాకు తోడందర | యనఘ ! కృపనేల నీవె గావె యని
వినతి పలుకంగ నక్రూరుం డనె | వినయ నయ సుగుణ కుంతికి శాంతిని
వరమతి వమ్మా ! చింతింపవలదు | సరసిజనయనుఁడు సర్వంబు గూర్చు
నిను మ్రొక్కినాడు నీ వేడ్కకొఱకె | నను బంపుట యుపబలికి యూరార్చి
జనపతులు తన్ను సేవింప గొలువు | నను భీష్మాదులు జేరి యుండంగ
గనెను కురుపతిని పాండుని యన్నను | ఘనుని ధృతరాష్ట్రు ప్రజ్ఞాచక్షుని
వినయమ్మున నిటు పలికె నక్రూరుఁడును | కరము మోడ్చి యో మహాప్రభో !
వనజనాభు తా యదుశిరోమణియు | దనుజ దమనుఁడగు కృష్ణు బల్కు లివి
నీవు పాండవేయులను నీసుతుల | త్రోవ గని రక్ష గూర్చుట గాంచగ
భావము నేకత సమదృష్టి వలయు | పావనులు మెత్తురో నిన్ను భూప !
నీ తమ్ముఁడైన పాండు నృపవరుఁడు | యే తనుజాంబుల నైన నీ యాజ్ఞ
చేతః ప్రీతిని చెల్లించి దిశల | నితరంపు బలప్రఖ్యాతి నిలిపె
జనవర ! మనుజుని ధర్మము యశమ్ము | నను గూర్చ దలప దైవంబు మెచ్చు
ధనమున కై తా ధర్మమును మీట | ధనముతో దాను జెడును యెల్లపుడు
ధనము శాశ్వతమె రాజ్యభోగంబు | లును నచంచలము ! నిలువ వెప్పటికి
నిలుచు పుణ్యంబు ధర్మాభివృద్ధి | కలిమియె పెద్ద జీవనం బంచు
దలపు మదంబున నొరుల వేధింపు | నరమి మెన్నాళ్ళు తను మని యుండుట
కన జనన మరణములును లేమి సిరి | విను మటు సుఖదుఃఖము లాది సర్వ
మును తటస్థించి కర్మఫలంబుల | ననువున గూడుచు మరలుటయె నటులె
తనువు దృఢంబె తనయులు స్థిరమా ! | వనితలు హితవర్గములు భవనములు
గనమొ యొకనాకని గవయుట విచ్చుట | వినికి పెద్దగల విజ్ఞాన మయుత
మన మొప్ప నీ వపకీర్తి గనకుము ! | తనయుల నందర మనజూడు దుష్ట
మతము వారింపు మార్గ్యంబు మాను | పతితము బుధానుమతమున పాండుని
సుతుల దయఁ జూడుమా పెదగూర్తువ ! | క్షితి తలంబునను ఖ్యాతిని గూర్తువు
ఖ్యాతము దారు నింతయును తేరు | నీతో నీ వంశ మ్మంతరించుఁ సుమ !

ఈ తరుణమునను నధిష్ఠిరునకును । ప్రీతి బెంపొంద వారి భాగంబు
గూరుపు కా దేనియు బుధుల నడుగు । వా రిది విన వేవియు నెగ్గు నీకు
మేర యిట్లనుచు వారిజనాభుడు । సారమతి వెలయ మ్రొక్క చెప్ప మనె
నన ధృతరాష్ట్రుండును నిట్టు లనియె । అనఘ ! నీ వాక్యములు మేలుగాన్పు
ననియు హితము లవియెల్లర కనియును । మనమున నిలుపఁదు గాని స్థిరంబున
నిలువ దామతియు నాసుతులగన్న । తలపు విచిత్రము గతి మార్పఁజెడు
దలతు నది ఈశ్వరేచ్ఛకొలది యని । యల పరమపురుషు డైన యామూర్తియే
తన యిచ్ఛ గూర్చు నేను నిమిత్తము । గను లీల ననుచు నూరక యుండును
మనుజావతారమును బొంది నట్టి । వనజనాభు మునివంద్యుని కృష్ణుని
ఘనత దలచి నుతియించి మ్రొక్కుదును । వినుము నా యుల్లమింతటి దె తెలియు
ఎవడు వనజభవువేమక బుట్టెను । ఎవడు వసుదేవ దేవికి తనయుడు
ఎవడు చరాచర విభుడైన హరియొ । యా విశ్వమూర్తి యగు నతనికి నతి
యనుచు వచించితి నని కృష్ణమూర్తికిని । ఘనత సత్కారముల గూర్చి పంపె
వనమాలిని గన వచ్చె నక్రూరు । డును మధురకు జేరగను మోదంబున
వనజనాభునకు సకల బంధులకు । తను పోయి వచ్చినట్టి దెఱిగింప
విని వారు దైవవిధి జరుగు ననియు । మనముల మోదము నే పొందుగూర్చి
ఘనత సౌఖ్యముల నుండి రంతటను । జనవరా ! వినుము అవ్వలి చరితము

—: జరాసంధుడు మధురమీద దండెత్తివచ్చి కృష్ణునితో యుద్ధము సేయుట :—

వనజాక్షుడు తమ మగని కంసునిన్ । దునుము నా వనిత లస్తియు ప్రాప్తియు
జనకుడైన యా జరాసంధునిన్ । గని వైధవ్యము దెలిపి మరియు నిది
వినుమో తండ్రీ ! యదువంశ్యు లెల్ల । మును మున్న దిసల బాఱిన వారలు
ఘన మదము గొంచు జనపతుల దిట్టు । చును వారె ప్రభుల మని మనపక్షము
వారిని జంపియు మాబోటివారి । నీరజ నాభుని ప్రాపున నిట్టుల
మేర గూర్చి రని దెలుప నుగ్రతను । వారిధాటి నే చెదుతు నిదె యదను
నాదగు చండ ప్రతాపానల శిఖ । యాదవాటవిని భస్మ మొనర్పెడి
మేదిని నను మీరెడువా డెవండు ! । ఊది నిలుచు శౌర్యమున నా యెదుర
హరి హర సురేంద్ర వరులు బారెదరు । అరెరె ! మదించిరె ! నీచమృగంబులు
హరికి తుల్య మెటు లని యార్భటించి । దురమునకు సిద్ధముగ సైన్యంబుల
నిరువది మూటిని యక్షౌహిణు లవి । వరుస కరి తురగ స్యందన పదాతి
జనవ్యూహంబుల ధరణి గ్రక్కదల । గను రేగు ధూళి చీకటిని బర్వ

గను తరణి వారులు తోఁగ తడయూఁడు । టను వడి దప్పగ జని యా మధురను
నిరంతరము కిసలయ పత్రంబుల । నరయ కోరక సుమముల ఫలములను
కరము సౌరభము లీను పూ లతల । తరచు తము ప్రాకు టాదిగా నిక్క
ఛరితభారమున నేలను వ్రాలిన । వర తరువుల సుందరమగు వనతతు
లవియు నందునను వాని బోషింప । దవులు యత్నముగ జలోన్నయనమున
సవురందు దారు యంత్రికముల । భువి దోపు వర్షమున తరుణమందు
కరణి జెన్నొంద కాలఘటుల వలె । పిరల కరితురగముల రథంబుల
పురజనుల మిగుల నొప్పగ నట్టి । సురల కభేద్యములగు కోటలు మఱి
వర యంత్ర చక్ర ప్రాకారంబుల । సరస సరోవరముల సొంపు మించు
హారిదయ గూర్చిన సకలైశ్వర్యము । లురవడిని కల్పతరు కామధేను
సమ దయమ్మలను విద్వజ్జనముల । క్రమమున కృష్ణుని పాలితంబునను
విమలప్రకాశత నొందు పురమును । విమతుల బొలియింపగ వనజాక్షుడు
నవతరించి నిర వొందు ద్వారక । గవిసి సైన్యముల చుట్టు ముట్టందె
భవనముల ముంపు వార్ధి వలె దోప । భువనపాలకుడు వెన్నుడదిగనియు
తన మనమున దలపోసె నీ పగిది । నను దాకవచ్చె పగగొని మాగధు
డనవుడ నిరువది మూడక్షౌహిణు । లను సైన్యాశ్రితములు నిక్క నిందు
ధరణి భారంబు బాపగా నేను । కరము జనించుట రాముని తోడుత
యరిని నామ దాన భేదమున । సరి సరయుగాదు దండనమ్మునన
వరున ఘాటించి జయము వదయు వలె । పరువడిని వీని దునుముటయు గాదు
బలముల మరి మరి చేర్చుకొని రాగ । వలను గన నగును ఖలుల గుంపులను
వలుకను వీడి కొనితెచ్చి నిందు । తల వ్రయ్యలింపు సవ్వుల జాతును
గా కని తనలో నేమి దలంచెను । ఆకసంబునం దుండి రెండైన
నాక వాస వినుత ప్రభావముల । యా కమలాపతి యైన కృష్ణునకు
తన మనోరథము సిద్ధి తత్త్వమున । ననుకూల మందు నటుల నది దైవ
మనెడు యోగంబు నా రూపమంది । ఘనత వచ్చెనని సకలాయుధముల
కును స్థానమయ్యు నతుల శక్తుల । ఘనత కలయట్టి శర శరాసనము
లును చక్ర శార్ఙ్గ పూరితంబులను । తన రందినట్టి రథములను గాంచి
బలభద్రుని తన దరి నిల్వ గాంచి । జలజాక్షు డనియె ఓ యన్న ! రామ !
ఖలుల దునుముటకె నీ విట బుట్టుట । దలపవలె నిదియె తరుణ మందులకు
మనల సేవించు యాదవుల బ్రోవ । నను విడె తెమ్ము పగతుర బోరిగొను
మని ఫలిక కానున్నాడ సిద్ధము । మనము పరతత్త్వ దీప్తి భువనములు

వెలిగించు లీల సమర సన్నాహ ʃ ముల పూర్ణ మోదయుతుండై చెలంగి
కలను తలమునను నిలిచె దారుకుఁడు ʃ నల సారథియై రథము వడి బరప
పగతురు తల్లడ పాటును గూరగ ʃ ఖగవర్ణుఁ డొత్తె పాంచజన్యమును
వగలు దొలగు ధరణికి నిక భారము ʃ నగధరుని వలన ననుచు సుర సమితి
పొగడు నిర్మలుల మోద పూర్తిఁగ ʃ జగము నిండ మ్రోయించ హరి విక్ర
మంపు రాక గని శంఖరవము విని ʃ సొంపు దరుఁగ దమ కళ లంతయును
పెంపొందినట్లు రిపుసైన్య మొప్ప ʃ తెంపరి యగు నా జరాసంధుండు
హరి జేరి వచ్చి వివర! గోపాల! ʃ కరిఘటలమంద నావుల గుంపని
జేర వచ్చితివ? తురగ హేషలను ʃ నరయక సంభారవము లని దలుతె?
గిరుల బోలు నా వరరథంబులను ʃ చిరుతలాఁగు బండులుగ దలంచితె?
యమునివి భీకరము దోపు వీరభట ʃ గుములు గాని యాభీరుల గుంపులె?
సమమును బోల్తువె? దావ దహనమ్ము ʃ క్రియుత గాని యార్చ బడని శిఖాగ్నుల?
మురిపెము గొన బృందావనము గాదు ʃ అరుల నురుమాడు సమరతలం బిది
వర యమునానది తీర సభ గాదు ʃ నరపతి చమూహా ఘోరకూట మిది
తరుణిని గొంగను తరుల నూకుటయు ʃ ఖరమును బామును గాలి గడపుటయు
గిరిని నొక శిలను నెత్తి పట్టుటయు ʃ దరము గొనువాడ వెటు శర సంహతి
పరమున కోర్తువో? నరపాల ధర్మ ʃ మరసి నిను దొలగు మనెద బ్రతుకగను
గోపికల వీణా రవ మిది గాదో? ʃ మోపగు శింజిని ధ్వనుల చెవు డమరు
యా పడతుల కరముల జల్లు లనకు ʃ యీ పటుత్వమగు శరధాటీ ధార
లను యా వనితల చూపుల తాకులె ʃ వినుము శరము లవి పదునులు సోకుట
వనితల కర కమలము లనుకోకుమ! ʃ ఘనమైన ముష్టిపోటులు నిండున
గన గొల్లపల్లె గాదు నీయాట ʃ మొనకొన భీకర జనపతి మూకలు
ననుపొందు వీర మకరాలయంబు ʃ ననుపొంది నిన్ను దీవివలె ముంచు
గాన దొలంగుము ఆజి నీకేల! ʃ నీ నటన చాలు పసిగొన దిందువ
నా నళిననయను డాతని గనుగొని ʃ నీ నరపాలుని నడగంటి మిందె
ఏల? నీబంటుతనము జగ మెఱుగు ʃ మేలు వారింతును నిన్ను నీ యనిలో
కాల దహనమును మాపు వృష్టివలె ʃ నీ లావు సెల్లదిం కిట వాగకు
గోపాలుఁడను గాదనను నిన్ను ʃ భూపాలక దుష్టుడవు నిను గెలిచి
గోపాల భూపకులుల క్షేమంబు ʃ నీపాటివారు పెండ నినుఁ గూల్తు
నన జరాసంధుఁ డనె మురి కృష్ణుని ʃ గని పిన్నవాఁడ వగుట నరపతుల
కినుకకు నోర్తువు నీకంటె పెద్ద ʃ ఘను డా రాముడు వానిని బిల్తుము!

తను లజ్జ గనుచు నీతో బోరిన § జనపతి పేరుకు జాలుని దలపడ
పలుక జూడ నన కీర్తి నిల్చునెటు § వలదు నీవు నీ యనని బంపు మన
నల హరియు నవ్వి యిటులని సతికి § పలుకు లని వీరతనము జూపెదవ!
పలువ! పలువతనమున గూయ కింక § విలువ బాగదుకొన నేల? శూరుండు
అలుక పెద్ద నిను జంపక వదలడు § హాలి గాన దొలగ దలచితే బ్రతుకుము
వలచితివి నీవు పొగరున గూయక § తలగి పోవ బలుకుట నా ధర్మము
తెలిసితె మాగధ! యనగ § రోషమున నల పవనుడు తన పన్నిన బలంబు
నను మేఘబృందము భానుకిరణము § లను గప్పు కరణి సైన్యముల దరిమి
యును నావరించె విక్రమపు పేర్మి § ఘనులు బలరామకృష్ణులు సురలను
మనుప ఖల భంజనులుగ ధర బుట్టి § మునుల సజ్జనుల బ్రోచుమూర్తులను
గనెను ఘనంబగు మాగధు సైన్యము § ననుసర విజృంభణమును మెచ్చగను
విలయ జలధులో యను నటు బొంగుచు § కలయబడి భటుల దాకిరి కడిమిని
విలయ కల్లోల ధ్వనుల బోలంగ § కలకలార్భటము లొక్కుమ్మడిగా
గిరి కందరముల వెడలి ఢీకొనెడు § కరులవలె మరియు హయలను బోలుచు
శరభముల ఛాయ గండభేరుండ § సరణి నొండొరులు రణభేరి మ్రోత
లను నుబ్బు గనుచు కుంతముల గదల § ఘన ముసలమ్ముల తోమరాదులను
మనమున వెరగును దరిమి మొత్తుచును § కన విసరుచునుగ ద్రిప్పి బాదుచును
శూలముల గ్రుచ్చి బాణముల ఉఱిపి § నేల పీనుగులమయము గావించి
జ్వాల లటు వాయుసఖ్యమున పెరుగు § పోలిక శౌర్యములను డీలు వోక
కరములను దునిమి కరుల బడగొట్టి § తురగముల జదిపి రథములను గడపి
వరభటుల శిరము లాది యంగముల § నురవడిని తురుముగా గూర్చుచు నటు
ఇరు సైన్యంబు లిట్లు పోరుచుండ § సరసిజనాభుని సైన్య మొక్కింత
కలత బడె చిక్కి మాగధ సైన్యములు § చెలరేగి తరుమ పురసతులు వీరి
పోలుపు భవనముల నిలిచి గనుగొనుచు § బలభద్రుడు శ్రీకృష్ణుండు వీరు
దిలకింప వీరవరులు బలయుతులు § పిలిచి మనసైన్య సమూహములను
గనుచుండగాను కష్టము గూరుట § విన గన చిత్రము ముందేమి యౌనో!
అనుచుండ హరియు మధ్యాహ్నభాను § ననుకరించు తీక్ష్ణతను శంఖంబు
దివి భువి నిండగ బూరింప నదియె § దనిలి ప్రళయపు మేఘగర్జనము
చెవు లవిసె మాగధుని బలంబునకు § జనములు దొలంగె ధృతి సన్నమయ్యె
తాన నీ మేఘంబు బలభద్రు § డా హలినేకడు తోడుపవనంబు
గా నిండువృష్టి శరపరంపరల § మానములు దూల మగధ వాహినుల--

నేల గలిపె దా విలయ రుద్రువలె ✽ మేలు మేలను దివ్యులు మెచ్చగ
తాలధ్వజుండు నట్లే గవిసియు ✽ కాలాంతకుండు బోలె సీరమును
గొని విజృంభించి పరుల వాహినుల ✽ దునిమెను ధరణికి కరుణభారంబు
ననువును తగ్గగ దోపింపు నొప్పె ✽ ఘనుల కది పెద్ద యగునె జనవరా!
విన వర్ణనమున గృతుల బలుకంగ ✽ మునులు సంస్తుతుల నిటు బొగడి రంతె
కినుక గొనిన జగములు మలయు నెట్లు? ✽ వనజనాభునకు నిది యొక లీలయె!
విను జరాసంధు డటు వారి గదియ ✽ ఘనుడు రాముండు వానిగుఱ్ఱముల
దునిమి సారథిని జంపి విరథునిగ ✽ దను లోకువ గొని దైన్యమున ముంచి
తనముష్టి వాని కంఠగతాసుని ✽ గను జేసి ముసలమున శిరము నలియ
గొట్టెదనని ముసలం బట్టి యెత్తు ✽ పట్టున హరి తా నడ్డంబు వచ్చి
ఇట్టి వీని బడ గొట్టిన నెట్టుల ✽ దట్టముగ వీని వారలు వత్తురె?
వీ డిది దప్పియు మరి వారి గూడి ✽ దాడి రానిమ్ము అపుడు జంపెదవు
పాడి మన కగును చెను నికముందున ✽ వీడు నీ గోటికిన గాడు విడువు
అని యతని జూచి యేడువ వలదో! ✽ కినుక బూని మరి రమ్ము సేనలతో
అని మము దాకు శౌర్యమును జూపు ✽ యొనరు గనలేని నిను భూతంబులు
దిన జచ్చి యశము నైనను గాంచుము ✽ నిను విడిపించుట మరలి వచ్చుటకె
యనుచు విడిపించగనె ముఖమునందు ✽ నను వన్నె దఱుగ దిశల గనరాక
వెను దిరిగిచూడక నె కోప కపట ✽ మనమునను దపము గొని యైన వీరి
దునుమ యత్నింతు నని బారె ముందె ✽ తనకొఱకు బారి యేను రందువారి
తోడున పురమును జొచ్చె నోటమిని ✽ పాడి వెలయ సుమవృష్టి యమరు లా
వేడుక పరమున హాలి హరులపైన ✽ పాడుచు నాడుచు పరపిరి మిన్నున
తనవార లెల్ల తూర్య ధ్వనులను ✽ ఘనమైన నృత్యగీతాది సంతు
లను మంగళకరవస్తువితతులను ✽ వినుతుల వందిగణముల వరుసలను
మును కొని ముందున నడువ నలంకృతి ✽ దనరు కనకమయ విజయధ్వజముల
నను వొందినట్టి తోరణాదులను ✽ యొనరుల మృగమద జలసిక్తములను
పొనుపున నలికిన రంగవల్లులను ✽ కనుల పండువుగ గూర్చిన పురమును
జేరి పుణ్యాంగనల సేసలచే ✽ మీరిన సమ్మోదముల నందరిని
పార మోదించి రానందమేర ✽ వారి దీవించె నుగ్రసేనుడును
ఆ జరాసంధు డిట్టుల తనదగు ✽ నోడ నుడుగకను పదునేడు తూర్లు
ఆ జగద్వీరులను దాక దుష్ట ✽ భూజననాథుల గలుపుకొని వచ్చి
యాదవుల దాకి హీన బలుడగుచు ✽ వే ధురమును మానుచు తిరుగుచుండి.

మీరాక పదునెనిమిదవ తూరి రాగ ॥ ఆనాము గాంచె రణ యత్నంబునె
సురముని కలహ ప్రియుడు నారదుడు ॥ పరమ హర్షమున హరి సన్నుతించి
సరస జేరి నొక తరుణమున కూర్చి ॥ సరణి చరియింపుగల కాల యవను
గని యవన ! నీవు లోకము నందలి ॥ జనపతుల గెల్చినాడవు పవనుడు
ఘనముగాను నెటుల కకవికలు గూర్చు ॥ దనరునో నట్టిడు లైం నీవేల
బలయుతుల మనుచు గర్వించినట్టి ॥ ఖలుల దునిమెదవు మేమును యార్భట
ముల నిగుడునట్టి యాదవులనెదవా ॥ కలుగవు తలపవు బలమును నెటువు
కలమున వారిని గదియ వింతకును ॥ నలరితివో వారి వీరత్వమెన్ని
వినవో ! వినికివో ? హీనబలుడవుదు ॥ గనవైతి వో శూర ! నేటికి నీ పస
దనము శూన్యమని నే మది గంటిని ॥ విను మున్న నెఱుగ భయమునగా దాగు
కొనువాడ వనుచు నని వినకుండిన ॥ విను మిప్పుడైనను వారల నొక్కడు
ఘనుడు ఖలహంతకుడు నై వెలిగెడు ॥ దనుజుల జంపెను కంసుని దునిమె
జనవినుతి గాంచె జరాసంధుని ॥ యనిలోన పెక్కు తడవల దరిమెను
నావిని యవనుడు ఏమేమి మునీ ! ॥ నే విన వానిని విశద మెరిగింపు
ఏవలని నడక రూపుశౌర్యంబు ॥ భూవిభుని కంసు జంపెను నెట్టుల !
కావరం బడతు నా కెదురొడ్డున ! ॥ తీవరముగ నాడును నన్నెరుగుడె !
నా విని మునివరు డనియె వానితో ॥ నీ వెఱుగవో శూర ! యది దెలియ వినుము
నీలమేఘంబు కరణి తను పమరు ॥ చాలున మోహనము దోపు వదనమ్ము
బాలున సూర్యుని కాంతి సతి దోప ॥ మేలికమలముల బోలి కనులొప్పు
కనకవసనమును ధరించు నాతడు ॥ ఘనమైన బాహువులును వక్షమును
గన విశాలంబు శ్రీవత్సయుతము ॥ విను కౌస్తుభమును మణికంఠమందు
దనరి తన తేజమునకు దిక్కులన్ని ॥ కనకసంగతిని వెలిగించు రాజ
యుతము మకర కుండలముల మెఱయును ॥ స్థితిని వర్ణింప దరముగా దెవరి
మతులకు తాన పరిమితి యంతటిదె ॥ యతులకే కొంత దెలియునేమొ నడ
యతుల శూరుండు నంతటను దిరుగు ॥ వితరులకు పట్టువడని సాహసుడు
పట్టున బట్టిన గాని చిక్కడగు ॥ దిట్టతనమునకు నునికిప ట్టతడు
పుట్టు గన దుర్జనుల జంపబుట్టె ॥ నట్టి వా డగు గట్టిగ జెప్పితి
యొకరుండె చాలు భువనములు గెలువ ॥ సుకరముగ న్నాకుడు జత గూడుక
ప్రకటిత సీరకాని చేరు మధుర ॥ సకలమును నీవు దెలిసెద వచ్చట
వని విన జెప్పెను యింకను వలసిన ॥ ఘనుని పట్టణము లీల ల వెన్నెమొ
వినెవాడు మీరాడు బిడిపెట్టుచు ॥ వనెమ్మునీ సేను వాని నాకరము

లను బడవైతును నా పరితాపంబు వినరు ముందువను వానిఁ నోర్తున!
ఘనుని నాహితుని కంసుని జంపిన వనజనయను విని యూరకుండు నెటు
గదలెద నిపుడే తాపసోత్తమా! కదనమున నాకు సములు గలరెందు
ఇదె నీవు చెత్తు కాజూడు మనుచు చనురొందె యుద్ధమునకు ప్రజ్ఞగాని
వెనరన నెఱుగని మూడుకోట్లు నగు సదయుత నతులను మర్దించునట్టి
ఘనభీతికరుల మ్లేచ్ఛుల గూర్చుక కినుక దాడికై జేరె మధురకు
వనజాక్షుడు విని వాని రాకడను దనపురము జుట్టి దాను విడియుటను
యవనుని దుడుకుదనంబును మదిలో సువిచారశీలన నంతయు గని యా
సవనపూజితుడు నారాయణుండు ప్రవిమల చిత్తుని తనయున్నను మో
దమున రామ! రమ్మని గూర్చి కొనుడు విమలమతిని విను కార్యము తెలిగిపు
డే మనలను స్థిర విచార మందగ నాముని బోలదు దండనమే విధి
ఈ యవనుడు మన వీటిని జుట్టెను వేయింత బలముతోడ మాగధుడు
బాయక కిపకను నేడో రేపో ఛాఱు గని వచ్చు చారుల వింటిని
మేదిని వీరల దుముము వలయు గద! యాదవుల రక్ష మనకు నవసరము
ఈ దుష్ట సైన్యములు రెండు గలయు నాదట వీరిని జూడ దుర్ఘటము
గాన మన మొకట బోక యింకొకట లోని వారి నొప్పింతు రా దుష్ట
లేను నుప మొక్కటిని గాంతు నిపుడె దాని తీవ్రమున మన మొవర్పవలె
యరుల ముట్టడికి సాధ్యమును గాని నిరవు గల యొక్క పురము విలసన
మరసి వీరి యోగమున నందుంచి యమముగను వీరి బారికొందమనుచు
జగదీశ్వరుండు జగముల లీలగ దగవున వెలయించను మనపజాలు
జగియు మహానీయుతను నొప్పు నతని కగుచు తలంపున నన్ని సిద్ధములై
తిన తలపులోన దేవశిల్పియగు ఘనుని విశ్వకర్మను బిలువ వచ్చె
వననిధిని యడిగి స్థాను నివసింప ననువగు పండ్రెండామడ చదరము
గన దీవి యొప్పి యుత డీయ శిల్పి జనవినుతమైన పురము నిర్మింపు
నిను వర్ణశక్తి నిలయమందినది వను నలరు నింపు నందు వసింతువు
వని యాజ్ఞ యిడిన తత్క్షణంబునను యొనరున మానవశక్తి నూహించి
వనమాలి మెచ్చ దగునట్టిదైన కనగ దిక్పాలురవి నగరంబుల
ఘనత మించు సౌందర్యము నిక్కగ తనదైన తపోమహిమ తను కళల
అకసము పొత్తునం దవులు గాంచు ప్రాకారమ్ముల ఎత్తు పాతాళ
లోకము వఱకును లోతు పరిఖలును నాకరణి నొప్పు గనదైన దాని
[illegible] హర్మ్యములు మణిశిఖరము లనునట్టి ధ్వజస్తంభము లాదిగ

ఘనమైన వీధులును వేదులునగు ॥ గనగు రచ్చలు సభాముఖమ్ములు
వర హేమవజ్ర వైడూర్యమ్ముల ॥ కరము ద్వార వాతాయనంబులను
ధర సొంపొప్పగ రమ్య భవనములు ॥ తరము నించు ముంగిళులు మందిరో
ద్యాన వనమ్ములు కమలాకరము ల ॥ నూన శృంగారరాజ హార్మ్యములు
మాననీయులగు భూసుర వర్గము లా ॥ నయమున రాజన్యులు వైశ్యులు
సార ధర్మ సంపన్నులు శూద్రులు ॥ మేరల నెఱిగి వసింప ననువులను
కరి తురగ శాలలును తేరులకును ॥ పరమైన నెలవులును వారివారి
కిని తగిన చిత్రగతుల నిర్మించి ॥ వనజ నయనునకి తా జెప్పినంత
తన తలపులోన దిక్పాల వరులు ॥ ఘనత నెంచి భయభక్తుల నలరున
సుర పరిపాలకునకు మనము మెచ్చ ॥ వరుస జేర్పవలె నక్షయ విభవము
వరదు డుపవిష్టుడుగ నిత్తు పీఠ ॥ మరయ వని యిచ్చె సుధర్మయను సభ
నలంకరింపగ మరి పారిజాత ॥ మెలమి గొనగ నర్పించె ఇంద్రుండు
నలుపొక్క చెవియు తనువు తను వో! యరుణము ॥ తెలుపు నావర్ణములు గలిగినట్టి
బలమైన గుఱ్ఱముల నొక్కవేయి ॥ నలినాక్షునకు ప్రీతి నొసంగెను
నల వాహినీశుడైన వరుణుండు ॥ వలసినన్ని నిధులను నర్పించెను
అలకాధిపుండు శ్రీహరికి తుష్టి ॥ కలన గూర్పంగ తక్కినవారికి
కలవన్ని వారి తరముల కొలదిని ॥ బలమున శత్రుల వడంప నిచ్చిరి
పరమేశ్వరు లగు రామ మాధవులు ॥ ఉరుతర యోగ ప్రభావంపు కలత
స్థితిని మధురాపుర మందలి వారిని ॥ మతి వెలయు గతిని ద్వారక జేర్చిరి
శ్రుతి వినుతు లైన రామకృష్ణులను ॥ నతి మతుల బడసి దవ్వోటి వారు
బలభద్రు ద్వారకను నుండం బంపి ॥ జలజ నయనుండు తా నొక్కరుండై
లలిని భక్తగణములను బాలింప ॥ వలసి యుండి తరుణమును నరసియును
నందన వనంబు నందుండి వెలికి ॥ మందగతి వచ్చు పూర్వదిగ్గజము
చందమున కనకగిరి గహ్వరమున ॥ పొందు నుండి హరి బయలు దేరినటు
యుదయాద్రి నుండి వెడలు భాను క్రియ ॥ యదువంశ భూషణుడు మధుర వెడలి

-: శ్రీకృష్ణుండు నిరాయుధుండై కాలయవనుడు వెంటనంటం బరుగెత్తుట :-

యెదురుగా వచ్చె యవన వాహినికి ॥ నది గాంచె యవను డవ్వ డిటు బలికెను
తనవారి గాంచి మీరు వినుడనుచు ॥ మన ముట్టడినిగ గని సేనరాదు
మనుజ లోకమ్ము నిర్భీతి మందనడ ॥ కను నే తెంచెను సంధి గోరెనో!
నను ధ్యాన మ్మడిగి నిరి వదయు నొక్క! ॥ మును విన్నయట్టు మాయ లవి ఛేమొ!

కనక చేలాది, లక్షణములనుగ ʒ ముని సెప్పియున్న చందము దోచెను
ననుచుండ డాసె నారద వంద్యుడు ʒ వనజభవాదుల కభిముఖుడై నడువ
రాని దేవుండు కాలయవనునికి ʒ దాసె యెదు రగుచు జేరె వాఁడగు
తనువు దివ్య సంజనితుల పదంబు ʒ నను బొందనుండె నేమొ జనవరా!
గనె వాఁ డా విభు చిహ్నముల చాలు ʒ మనమున వేగము కొలది నరయంగ
వనజ నయనుండు సింహమధ్యముడు ʒ గన నంబోధరతను విలసితుండు
ఘనుడు కౌస్తుభము ధరించె నట్టునె ʒ కనకచేలుండు శ్రీవత్సాంకుడు
వరమణి కుండల దీపితుండు మఱి ʒ కరకంకణాది భూషణోజ్జ్వలుడు
దరహాసిత వదనమును దోపు నటుల ʒ నురమున వనమాలాది హారతతు
లవి మెరయ జూచి నారదుం డన్న! ʒ భువిని మాయావులను దునుమునట్టి
ప్రవిమలాకారు డగు వీడె వచ్చె ʒ గదిసి పట్టెదను బంధింతు ననుచు
యల చటుల వాల సైంహికేయు వలె ʒ లాలితేతర జటా లతికదూల
విలయ పావకుని కీలల విధమున ʒ యల వాని మీస లొప్పగ దీడుచు
కరవాలము కాలాహిని బోలగ ʒ యొరను బెరికి కొని తురగంబు నెక్కి
హరిహరులు ధ్యానముల పట్టరాని ʒ హరిని సరసిజోదరుని మాయా వి
దారుని శూరుని అబ్జభవ వినుతు ʒ క్రూరత లో పెం పొనర మదంబున
బార బట్టంగ, తురగ వేగమున ʒ పార జూచి హరి వాని యురవడిని
యోరి! నను బట్ట నీ తరంబె! యని ʒ బార ననగ వెన్నుండు వానికిని
జిక్కక దూరం బరిగె మాయ గాని ʒ యెక్కడ బారెదవో యనువీరా!
నిక్కు జూపుదువె? నాకు జిక్కకను ʒ ఎక్కడ దాగెదు? నాదృష్టియందు
వననిధి జొత్తువా? వనరు నా కదియు ʒ గన భూమిక్రింద జేరిన విడువను
వనమున బారిన వెనువెంట నుందు ʒ తనువు వికటమున దాల్చ గనుచుందు
జలధి దాటినను ఇల నగ్రజన్మ ʒ మలవడ దాల్చిన హాలికాశ్వాటా
దుల రూపొందిన నిన్ను విడుతునే! ʒ వలదు పరుగిడక నిలువు శ్రమ యేల?
శరముల చులుకును గూర్చవా కార! ʒ కరిని జంపి తెటు! కంసుని దునుముట
యురులకు వెన్నడి తొలగు నీ కేడ? ʒ నరవరుల వీరవరుల మార్కొనెడి
భర మెటుల? నిన్ను నారదుం డెటుల ʒ తరము నెఱిగించె పురుష హీనుడవు
గనవు సిగ్గు నీ నిగ్గు తగ్గింతు ʒ కినుక రోషమును నిలిచి మాట్లాడు
మును నఘుని శకటు డాడగా జరా ʒ తనయునితో నని సలుపు టద్భుతమె!
యన నిలిచి నట్టె దూరం బరుగును ʒ నను జూచి భీతి పారె నన తోడ్తొ
దన సరస దోచు పరువున గూరిన ʒ కను మరగిపోవు గిరిగండశిలల

నిటు నటు త్రిప్పను పార్శ్వముల దప్పి ॥ బటువు తా నంది కటువు నుసిగొల్పు
విలువు బొడమించు మలుమూలు బరచు ॥ చిటుకలో నెన్నో కిటుకు లొనరించు
మిట్టల నెక్కును మీద బడరాగ ॥ గుట్టల దారును పల్లముల దాగు
పుట్టలను గికురు పెట్టు దట్టముగు ॥ గొట్టు గుహాల దరి దూరము గొని చని
లోక వీరుండు వాని ఛాకకును ॥ లోకువ గని నటు వాని కగపడుచు
నేకాకారత న న్నిట నొప్పెడు ॥ రాకాసి వైరి వాడు కన డాగు
కరణి జొచ్చె నొక పెద్దదైన గుహ ॥ నా కంజాక్షుని గనె యవను డచట
బారి బడె నంచు తురగమును వాడు ॥ ధీరతను నడపి అశ్వ మట గట్టి
శౌరి! యింకెందు దొలగెద వనుచును ॥ దూరె వాడు గుహ హరియున్న నెలవు
కరి జొచ్చు భంగి లోన చీకటిని ॥ నొరులు జొరరాని యొక్కతలంబున
సువినుతు డొక్క నరవరుడు దీర్ఘ ॥ పర తల్పంబున గురువెట్టి నిదుర
పరత సుఖంబును మేర గొన్నట్టి ॥ పురుషుని హరి యని దలచి ముదంబున
చరణము నెత్తియు దన్న నుంకించి ॥ కరము రోషమున బలికెను నిట్టుల
ఆలము సేయగ లేక పంద వయి ॥ పా లందితి విట దొంగ! యులసి నటు
నోలిన నిదురను మానహీనుడవు ॥ చాలు గొని నన్ను క్రూర శార్దూల
భీకర కుంజర ఖడ్గ గవ యాది ॥ కాకరంబైన కంటక ద్రుమలత
లీ కరణి ఘోర వృత్తిగను చోట ॥ నాకు నాయాసముగ గూఢ గతిని
దాగితివ? నిన్ను జేర రా ననుచు ॥ నో గర్వమతీ! క్రూర! వంచకా!
నా గురిని నీవు చులకయే సుమ్ము ॥ యోగ మెఱిగించె నారదుడు నిన్ను
ఓ గుణహీనుడ! ఈ పోటు నీకు ॥ భోగ మందించు ముందు లోకంబు
అని యార్భటించి తన్నె కొండగుహ ॥ ఘనతర ధ్వనియు ప్రతిధ్వని గూరగ
యనఘు డా పురుషపర్యు డటు లేచి ॥ ఘనత తనువు నిక్కించి వడి గాంచి
కనుదమ్ములు విచ్చుచు లోని కినుక ॥ గొనిన మనంబున దిక్కులను జూచి
గనె వాని తనదు చూపుల లోనే ॥ ననల జ్వాలలను వెలిగించి నంత
తనువు భస్మమయె సురలు గుంపులై ॥ ఘనత మోదంబు గూర జయములను
జనవరున కిచ్చి హరికని మ్రొక్కగ ॥ గనెను దివి సుఖము యవనుడు హరిదయ

## —: ముచికుందుని పూర్వకథాభివర్ణనము :—

అనిన భూవరుడు శోకమాని గాంచి ॥ ఘను డా పుణ్యుం డెవడు తెలుపవల
యను మహాసియా! యేల? యా నిద్ర ॥ గొని యుండె? ఎంత కాలమప్పటికి?
జనకు డెవ్వండు? యే జపము పెంపు ॥ నను యా దుష్టుని నటు జేయ నొప్పె

హరి యందు నతని కే వరం బిచ్చె! § కరుణ వినిపింపు మన శుకు డనియెను
మను కుల జాతుడు మాంధాత కొడుకు § ఘన సుగుణోజ్జ్వలు డస్త్ర బలశాలి
జన వినుతి నెగడు ఘనుడు ముచికుందు § డను బలవీరుడు సుగుణోత్తముండు
దనుజుల నెదురగ నాతని సాయము § గన గోరి సురలు ప్రార్థింప వినియు
యనఘమతిని వారల వెంట దివికి § తన కౌశలంబు పెంపున జేరియు
మునుమున రాక్షస వీరులను దునిమి § దను మెచ్చుసురల రక్షణ నించెను
వా రతని మెచ్చి వరము గోరు మన § కోరెను మోక్షము వారు మోదమున
శ్రీ రమ్యధాముడైన యచ్యుతుడు § కూరిమిని నిన్ను గని ముక్తినిచ్చు
భూ రమణ! నీవు దేవమానమున § మా రాయిడి బాపుచు నీ విందే
చేరియుంట నీ సంతతివారలు § యేరు ధారుణిని వేరు కాలవశ
మున పరమపదము జెందిరి శ్రీహరి § ఘనత వారి మోదంబు నందించె
శ్రీ పరాత్పరుడు కాలస్వరూపి § ప్రాపు దప్ప దది యెంత వారలకు
నా పరముడైన శ్రీధరు డొకడే § యా పరమ ముక్తి నొసగ సమర్థుడు
మా తరంబ యగు తక్కిన వన్నియు § నీతో దాపము ఇత్తు మని కలత
చేతమున నెరుగ నట్టి నిద్రయే § యీ తరుణమునకు నిచ్చితిమి నిన్ను
ఎవ డది కినుకను లేగ నిను దాసి § నవు రందు నిన్ను నిద్ర జెరుచునో
భువి వాడు చెడును ఈశ్వరు డపుడే § దవులును రెండవదృష్టి జయ మొసగు
అని వర మిచ్చిరి అంత భూవరుడు § ఘనత భూతలము జేరి యిందునను
తనువు మరచినటు నిదురించుండె § వినుమా! యవనుడు నీతైన వెంట
కనక వసనధరు డతని యెట్టెదుట § కనుపింపగానె జనవరుడు గాంచె
వనరుహలోచను వైజయంతిధరు § దినకోటి దీప్తు నిత్యు చిదాత్ముని
గన శ్రీవత్సాంకితవక్షు పరము § ఘన చతుర్బాహు దరహాసిత వదను
పురుషసుందరుని పుణ్యమూర్తిని § పరమహర్షమున నరవరుం డటుల
దర్శించి నంత వినుతి నిటు బలికె § పరమ సౌందర్యభూతి నెగడెదవు
కరము నీ తేజ మత్యద్భుతంబు § నరలోకమ్మున దిరిగెదు దివ్యుడ
వరయ సోమ సూర్యాగ్నుల వెలుగుదు § హరి హర సరసిజ గర్భ సురేశ్వరు
లను బోల్ప దగును నీయున్నత మహి § మను దెలుపు మింక నిను సేవింపగ
మనమున తీవర మెంచితి నిజంబు § ఘనుడవు సుకుమారంపు మూర్తివై
వనమున ఘోరభయంకర మృగముల § ననువుగాని కంటక కఠిన శిలల
చరింప నెందుకు చరణముల మృదువు § తర మది తెలుపును దృష్టి మహాత్మా!
సరసిజాప్తకులు డను మాంధాతను § వర సుతుండనై హరిని సేవింతు

కరుణ దెలుపవలె వినదగుదు నేని ఽ వర నిలయ మెద్ది ? కులగోత్రంబుల
వరుస జనన మూలంబు సెప్పుమా ! ఽ నరవినుత ! పుణ్యశరీర ! నే నిం
దున నిదురింపుచు నుండ నెవ్వడో ఽ నను లేపి వాని కిల్బిషమున జెడె
నిను గంటి నిపుడు శ్రీనాథాకృతి ఽ దనరినాడవో నిక్క మటులె యగు
వనమాలివేను మునిహృదయ ! విభా ఽ వన లసితు డవుదు నగు నీకు శరణు
విను ముచికుందుడ సాష్టాంగ మిదే ఽ గనుమ ! దయాంబుధి ! అన విని శ్రీహరి
సురవందితుడగు కృష్ణు డిటు లనియె ఽ నరపతివి పుణ్యవర్తనుడ వీవు
పరమప్రీతి విను దెలిపెద నాస్థితి ఽ పరతత్త్వరూప మైన నిత్యగుడ
హరి హర విరించి కళ లన్ని నేన ఽ తర మెవరికి నాగుణ జన్మ కర్మ
నామముల నెన్న ? ధాత శేషులకు ఽ నా మహిమ లిట్టివని నేను బలుకు
నేమము నందను ఆత్మరూపుడను ఽ భూమీశ ! నేను దుష్టులను దునుమ
సామమంది జన్మించితి ధరణిని ఽ శామప్రదుడను వసుదేవు నింట
నామములు పెక్కు నాకు గల వవియు ఽ కామినీరూపు నా మాయ యగును
నేను పురుష వాచకుడ పరిశుద్ధ ఽ మైన మానవాతీత మానగుడ,
నీ నయం బెరిగి తొలి పుణ్యకతన ఽ గాన వచ్చితిని ధన్యుడవు వరము
గోరు మిచ్చెదను నను దర్శించిన ఽ వారి నెల్ల శోభనముల గూర్తును
నా రమణీ యార్చన సన్నుతు లవి ఽ పార మందించు నక్షయసుఖంబు
నను దలచువారు మరి శోకంబుల ఽ గన బోరు ఉంచ్రు ముదము నిలయముగ
నన విని యా ముచికుందు డిటు యెఱిగి ఽ మును మునిగర్గుడు దనతో బల్కిన
వెన్నుడే యితడు సు మ్మంచు మ్రొక్కి ఽ తిన్నని వినుతిని సన్నుతింప దా

### -: ముచికుందుడు శ్రీకృష్ణుని స్తోత్రము సేయుట :-

కన్ను లతనిపై గవియించె చూడ్కి ఽ తెన్నున నో మహనీయ ! జగద్ధిత !
ఇందిరేశ ! నిను ముందు వినియుంటి ఽ ముందు సురతతుల యవల గర్గునిచె
పొందుగన్న పరబ్రహ్మంబు నీవ ! ఽ ఇందున నష్టావింశతి మహాయు
గముల ద్వాపరాం త్యమున బుట్టెదని ఽ సుమనసవర్ధనమున నొప్పు దనుచు
క్రమమున దెలిసితి నారాయణ ! నిను ఽ నమస్కృతులచేతను వినుతింతును
శ్రీమూర్తి ! నిను సకల భువనముల ఽ నీ మాయనైన బంధముల దవిలి
కామింతురు విత్తామయ గృహస్థ ఽ కాముల్తై యెల్ల శాశ్వతము లనుచు
మానవ జన్మము దుర్లభము దేవ ! ఽ వేన వేల జన్మల సుకృతఫల
మా వలినేటిణ ! దరి రూ పందగ ఽ తాను జన్మించి తాన డజ్ఞాన

వతి వాసుదేవ ! నీవు రెండైన § తతుల జీవ పరమాత్ము లన నొప్పి
యతి విమర్శనల పరాపరంబుల § స్థితిఁగూర్చియు మఱి విద్యావిద్యలు
నా దోఁచి యొకటి పూర్ణబాధ్యతను § నాదరం బంది రెండవ దానిని
యే దారినైననుం దారనీక § మోద రూపమున దూరుఁడవు గాక
నాదట నిలుతువు నిరభి మానమున § నీదెస దృష్టిని నిలిపి సంసృతిని
కూరిమి నింపకయున్న నటుగాక § భోరుకొన్న సంసార లంపటము
సారముగా దమ శాశ్వత సుఖమని § సారవిచారమునందు మైమఱవు
గొని తృణాభిలాషమున నజ మెట్లు § తను నిరోధించు కూపమున దొరలు
గనినటు నిను సంస్తుతి గొన్నయెడల § యొనరున నొడ్డున జేర్తువు భవాబ్ధి
మునుఁగ నీవు గద పరమహంసనుత ! § వినుతచరణ ! శ్రీరమణ ! భువనహిత !
నిను నిజ మెఱుఁగక పెక్కు భవములను § ననవరత దుఃఖముల సంసారము
లను బొక్కు గనుచు నిరయముల బారి § జనన క్లేశముల నొం పెల్ల సమయ
జనను కల్పంబు లెన్నో జాలు నిక § నను కరుణింపుము శోకమును బాపు
తనువు చంచలము హేయతకు నెలవు § కన ఘనకుంభం బను ఛాయ బోలు
జనపతి ననుచును చటుల కళేబర § మును నమ్మి చొచ్చితిని నభిమానత
నిది వదల కున్న తనువుఁ బట్టిది § కదిసి భయంకర మృగములు దినగా
నదను గన విట్క్రిమి భస్త్రి సంగ § తిదిగా దుఃఖము గూర్చు దప్పనగు
కుదురైన తెలివి గనలేదు చిత్రి § మది జూడ సకల భూముల గెలిచిన
తనువును మఱికిని గను కొంప యనుచు § గని నమ్మరాని స్థితి మెచ్చు నించి
తనను వెత నింపు ననుచు జీవాత్మ § డను నయము నెఱిఁగి మనమును జయించి
నిను తపమునందు దర్శించియునుఁ § గనెదరు పరముని కామసంతులనె
మునులైన యట్టి వారలో దేవ ! § మును జేసినట్టి కర్మలఫల మిది
యని కలతు గదే నను వాని గోరు § ననువు దప్పింపు నాధ ! రమాపతి !
జనుల సంసృతుల లంపటల దప్ప § నిను నీశ్వరునిఁ గృప దోప భజిం
చిన బంధనములు కర్మలు సడలునె ! § ఘనతరవుముక్తి గలుగు నమ్మితిని
నిను సత్సంగము వలన దెలియనగు § గనగ దానినే నీభక్తి గలుగు
పౌన రందించును నదె ముక్తిపదము § నను నీకృప తొలి ఫల మేమిటనో
వసంగతంబగు రాజ్యము వదలేను § సుసంగతిని నీ ధ్యాన మెక్కెంత
వసించె భాగ్యము కతన మనమ్మున § నుసిం గొల్పకుము నీమాయ నన్ను
వపజనాథ ! ఇక సంసార మెల్ల ! § నిను గాంచి తింక నిని శాశ్వతముకే
మునుకొనను వాని విధముల నే నిక § పెను వరము లనుచు నాసల గూర్పనే !

ప్రవిమలాకార ! ప్రేమస్వరూపా ! § వివిధాగమ సన్నుతనామ ! కృష్ణ !
శుభవిచార పారఁగు లైన విజ్ఞాను § లెవరు గోరుదురు ? గుణ బంధనముల
తవులు నైశ్వర్య కామముల బారు § సువిశాల విచక్షణుల దోషిదవు
దవిలితి నింతకు ముందు కామాది § సవురుల చాళ్ళవి వాని రిపువు లని
వినుకలి గాంచితి మునుల తొల్లింట § నిను నీశ్వరు నిక శరణం బంటిని
నను బ్రోవు ! ప్రోవు ! ప్రోవు ! దయానిధే ! § నిను వదల వదల వదల మోక్షమును
గదియు మార్గమును జూపు కనుమేర § నదె చాలు నింద్రి భోగములు గోర
మదిని వసింపుము నను సదనంబుగ § ముదము నందెదను మురళీవినోద !
గోపీనాథా ! గోకులవాసా § పాపహారణ ! పరమాత్మ ! భవదూరా !
నీ పవిత్ర భజనంబు శ్రేయంబు § ప్రాపించు శుభము లన్ని పొం దందు
నన విని యనంతు డైన కృష్ణుండు § కనికరమున మనుజేశు ముచికుందు
గని రాజతిలక ! నీదగు భక్తియు § వినయ వృత్తమును మెప్పించె నన్ను
నిను బొందు సర్వ పాలిత సుఖంబు § నను గొల్చు వారికిని కొర లుండవు
నీవు కోరికల గోర నొల్లకయె § భావము మత్పరమున నిల్పితివా
కేవలత షడ్రిపులను జయించి § పావనమగు నా పరము బొందెదవు
నృపధర్మ పరత వేటను మృగముల § కృప విరహిత మతి తొలి జంపినట్టి
యపవాద దురిత మది తపముచేత § సపరిశూన్యముగ బాయ ద్విజుడవై
యవల నా పదము బొందెదు గాకని § సవిధి బదరికావనమునకు బోవ
భువన భరణు డానతి యిచ్చి పంప § దలిలిన ముదమున గుహనుండి వెడలి
మునుపటి బలమున నన్నిట సూక్ష్మత § తనువుల నరులను తరుసంతు లటులె
గనుచు కలియుగము రా నుండె ననుచు § దనమనమున శ్రీనివాసు నెంచుచు
ఘనుడు ముచికుందు డా బదరి జేరి § వనజాక్షు నంశమున బుట్టినట్టి
మునులు నరులు నారాయణు లున్నెడ § గని సమీపమున దా తపము సలిపె
యదువల్లభుండు వాసుదేవుండు § ముదమున యవనుని సేనల దరిసియు
చదియు జేసె నందరిని కోపమున § మధురలో నింక యున్న ధనమ్ముల
ద్వారకకు బంపుటకు జనులతోడ § జేరిచిన ముల్లెలను బంపుచుండ

-: జరాసంధుండు ప్రవర్షణగిరిని దహించుట :-

తా రథసంబున వచ్చె మాగధుడు § సారసనయనుని ననిలో జయింతు
ఘోరు లెవరు ! నా సరిబోరువారు § వీరి నక్కడగ జేసి మోదింతు
ననుచు రథ, తురగ; వేగ ఘట్టనల § కనగ వగు భూమి రజ మాకాశము

నను మేఘ పటల మల దోప కరుల | ఘన మదధారలు జలధారలుగా
వీరుల కేకలు రథనేమి ధ్వనులు | కరి, తురగ, ఘీంకృతులు హేషలునుగ
ఘోరమైన యుఱుములను బోలంగ | ధీరులగు భటుల వైన కరవాల
శర శస్త్ర సమితిరోచుల మెరుపులు | తరళ గతులుగా విరోధులగు జన
వరుల ప్రతాపానలము శాంతింప | నిరువదిమూడగు నక్షౌహిణులను
కరము సైన్య ముప్పొంగ వారలకు | దరుముచు ముట్టడి చుట్టుట ధనముల
నట డించి పారి రా హరి భృత్యులు | చటులగతి నంది నట్టుల నేమియు
పటువు శౌర్యంబు చూపకను వారు | తటము నందిరా హలి శ్రీకృష్ణులు
తటమందరు ధనరాశిని విజయము | నటన వారి ముందంచు గా కనుచు
పరువు గొనిరి వడి బారు హరిణములు | కరము వ్యాఘ్ర దృష్టులకు దప్పు నటు
నరవరుడు గాంచె వారిపోకడను | దరుముచు నిటులనె ఆ మాగధుండు
అని యదువీరులు పారిపోవు రెటు | నను దాక్కొనుండు శూరత మెరయగ
మిను బ్రాకనైన బలమున డాగిన | వనసిధి జొచ్చిన విడువ నిమ్మనుచు
ఘనత తనవీర్యమును నుగ్గడించు | చును వెంట బడిన యామడలు కొన్ని
వెనుబుచ్చి శాత్రవులు గనుచుండగ | కర మింద్రుడు వర్షింప మిక్కుటపు
టానరున ప్రవృద్ధి నొంది యున్నట్టి | ఘన శైలంబును పదియొకామడను
నిలువును వెడలుపు గలిగి యున్నట్టి | వడి గల ప్రవర్ష మను నా యద్రిని
వడి నెక్కి రిపులకును డాగు విధము | తడబాటు తనవుగా జూపి మాయ
నదలించి యరుల కగపడక నొక్క | యెడరున యద్రిని దిగి సుఖతరంబు
నడక నాయాదవుల శిరోమణులు | పుడమిని భారం బడప వేడ్క గని
నరయాదు లీల బుట్టిన మూర్తులు | కడు ప్రీతి తమ్ము రాకను గోరెడు
తమవారి ద్వారకను నివసనంబె | క్రమము దీపింప నున్నట్టి వారి
భ్రమబాయ జేరి రా నగరంబును | విమల మతి జేరి సుఖముండి రంత
మాగధు సైనికు లెల్లరు గాంచిరి | యా గిరిగుహలను వారు డాగి రని
యోగవిదులు తము కనుల గప్పుటలు | సాగించినట్టి జాడలు తెలియక
రాజాజ్ఞ గొనియు నా కొండగుహల | తేజంబు జొనుప చితులగా గూర్చియు
నాజి నీయకనె పీరట మ్రగ్గగ | రాజా జెసుకొ గద ! నిజము నరయగ
అని యగ్నిగూర్చి రా గిరిచుట్టును | పెను పొగ లెగసెను మిను వీధి నిండ
గన వాని తుదల మిడుగురు లెగయగ | మునుకొని వానికి ముందె మంట లా
భూమి సర్వ దిక్కులను వ్యాపించె | నా మహాగ్ని వృక్షముల తీవలను
శ్రామిన కుంజము శాపగ చుట్టియు | భయంబు విస్తరిలగ ప్రజ్వరిలి

యందు నివసించు తరుజాతి లతలె § మందిరములుగా నెన్ను ఖగతతులు
మందలుగా తమసంతులు నసింపు § తందరల తిరుగుచుల నందె మాయ
దంచుగల మృగము లెన్నో మఱియుగ § చిందర వందర లగ్గిరివాసుల
తల్లడము గూర్ప దిక్కులకు నుఱుక § మెల్లెడల జుట్టి జ్వాల తీవ్రతలు
పెల్లు గవయ గనె చిట చిట ధ్వనుల § నుల్లముల బెగ్గడిల్లు సురలు గన
దవానలం బెటు పవన సంగతిని § నవార్యముగ ప్రజ్వలింప ఘోరము
నవాంతరము గిరియందు ప్రబ్బుటయు § నవారితముగా జయము మనకబ్బె
జగమందు మనల గ్రేడించువారు § పగటున లేరుగ నైన నీ డొక్క
బిగువుగను గొల్ల వాని యున్నతో § జగితప్ప నిద్ది యెక్కి డాగె నెటుటు
మంటల విస్తృతి యంటి యచలంబు § గెంటింప నిచ్చు టెటు లా మచ్చుల
తుంటరీఘులను తాన ఆహుతిని § జంటింప గొనియె నాటంక రహిత
మంట వీరి నడ విపరీతమందె § కంటు విడ చెల్లు నింక నాకంచు
జరాసంధు డాకొండ నంటించి § పరంబు జెందిరి ఇందున వారని
శరాసరివి తన సేనల నన్నిటి § కరంబు మోదము నింప బలుకుచును
బిరాన తనపురి గిరివ్రజంబును § సురాదు లందఱు మురువం జేరెను

:- రుక్మిణీ కల్యాణ కథాప్రారంభము :-

శ్రీ రుక్మిణీశు పరిణయ కథ విను § హో రాజావర ! యభిమన్యుపుత్ర !
శ్రీరాణ నందు శోభనం బమరు § నా రాజీవాక్షుని నిందు దలప
ధీర మతులకును మేరలు సుఖములు § దారు దుఃఖములు దరిని దూరకను
కూరిమి పెంపున విశద మొనర్తును § నారయ మోదము తోర మిది విన్న
ఆనాడు వింటివే రైవతుండు తాను § బ్రహ్మ పంపునను రేవతిని
మానిత మతి బలరాముని కొసగె నసమాన గుణవతిని తన కాతనయను
సురవరుల గెలిచి గరుడు డమృతమును § కరము ప్రీతి గొన్నటుల మురభేది
దురమున బగతుర శిశుపాలాదుల § పరిభూతి మాపి తరుణీమణినిగా
సరసిజాలయాంశను దసరి భువిని § వరమందింపగ జన్మించి నట్టి
సురుచి మిన్న సౌందర్య ఖనియైన § పరమోత్తమ గుణయైన రుక్మిణిని
వన శా జా మునియైన శుకుని గని § వినిపించినాడ వరయ ముందునను
వన [illegible]ందు రాక్షస వివాహ § మున స్వయంవరము నంపుల రాజుల
గెలిచి వనిత [illegible] పట్టి నటంచును § నలరు గల దద్ది వినెద వచింపుము
కలన పా[illegible] [illegible]లయు § బలము వెలయ హరి విక్రమించుటయు

దెలియ బలిచితిని లలి నాకేగింపుము § తలపు విదితమతి విలసిల సిద్ధుడ
నన విను విదర్భ దేశ మిా క్షితిని § ఘనమైన సంపదలను తులతూగు
ననువంది యుండె నా భూమినేలు § జనవరుల వీరు దత డన మించుచు
సుగుణ గరిష్ఠుడు భీష్మకుండు నా § దగు నా భూపతి కై దుగురు సుతులు
పగ వాటించుచు హరిని నెల్లపుడు § బిగువందు మదము రుక్మి నా బరగు
నతనికి తమ్ములు రుక్మ రథుండును § గతి నల్లి రుక్మ బాహువు నా మరి
యతి బలశాలియు రుక్మ కేశుండు § మతి నట్టివాడు రుక్మ నేత్రుండు
విను వీరి చెల్లెలగు రుక్మిణి యా § వనజగంధి కడచూలి సౌందర్య
తను మించు గనును శ్రీదేవిఛాయ § జననాథు గేహమును కళ నించును
గన బాల బాలచంద్రుని కాంతివి § దినదినప్రవృద్ధి గనిన యట్లుగా
నొనరు గని పెరుగు చుండి తన తోడు § గనిన బాలికల నాటలను గలిసి
మెలసి బుద్ధి వికసిల్ల తలంపున § లలిత చేష్ట గని కాంత లుబ్బ గన
నలరున బొమ్మల పెండ్లి సేతమని § పిలుచు బాలికల వియ్యపు రాండ్రగ
వలచి నిరువంక పెత్తనము లంద § నిలుపు చెలుల బోధించు మురియుచును
నలరున గుజ్జన గూళ్ళవండించు § లలనలు విందుల దినుడని బెట్టును
గన భవనపు ముంగిటల నారాము § ఘన పూ దీగెల పెంపున జలంగు
కనకమణిమయపు సౌధభాగముల § తన సఖుల జేర్చుకొని కనక నిర్మి
తపు టుయ్యేలలను తాను నూగగను § అపురూపు గతుల చేబంతు లాడు
కృప బెంచి కీర శారికల జేరి § సెప్పను బలుకులను నమవ్వ తా నెత్తిగి
నెమిళులకు మురువు గఱపు నాకొమ్మ § క్రమత రాయంచలకు నడలు నేర్ప
సమయమున బాల్య మటు జారు చుండ § సమయం బ దెను నవ్వాలి దశయును
తనువు కనకలత వలె మెఱు గెక్కును § వనజ నయనునకు రతికోర్కె నిక్క
గన సింతిముఖము కాంతి విలసిల్ల § ననువటుల గృష్ణుననము విరివి గన
మరు కేళి తలపు మాధవుని బాడమ § తరుణికి నురోజములు నాశ్రయించ
వరున కృష్ణునకు ధైర్యము సన్నము § సరసిజవదనను నడుము సన్నంబ
పురుషోత్తమునకు బ్రేమ ఘనముగా § నరవిందాక్షికి గొప్ప దొడ్డదనము
కరివరదుని ప్రమదంబు నిండుకొన § నరుణాధర సంపూర్ణ తనువు గన
పరమ మునుల తిథులై తండ్రి దాపు § వరుసల కృష్ణు వర్ణించు టవని
వరుడు తనకు వసుదేవు తనయుడని § సరిశెబుద్ధిగని లోన ముదమందె
హరియు నాయువిద రూపు గుణధర్మ § సరణి నల్లి విని చారు తరంబుగ
కరణి ప్రాణమును నా మెంతు గూర్పగ § స్థిరము గొనియుండె తనలోన వారుడు
ఆవవరుడు బంధుజనుల తపసులిడి § వినుపి కా బాల నెవని కీ త్తమని

జనపూజితుండు కమలనయనుండు ఽ మనకు చుట్టంబు ఘనుడు కృష్ణుండు
తగియుండు ననగ రుక్మి యండఱను ఽ బిగువంద గసరి చేదిపతి యతడె
జగి గాంచు బలము శౌర్యము గలదని ఽ తగురీతి గూర్తు నాదుచెల్లెలిని
గొనకుడు యత్నము యాలోచనంబు ఽ నను బొందు నన్ని నే నిందు పెద్ద
యన నెదు రాడరు వాని కెవ్వరును ఽ వినెను రుక్మిణియు దన కచ్చపట్టి
యన్న పలుకులకు విచార మందియు ఽ కన్నె యోచించె యన్న యత్నమును
కన్నుల నీ రిడి ధీరతను మలపి ఽ తెన్ను గందునని బ్రాహ్మణు నొక్కని
నన్న దెలుప బిలిపించి గర్వసం ఽ ఛన్ను డన్న దను చైద్యున కీయగ
నున్నవాడు నయి యత్నంబు నందె ఽ నన్ను దయ గాంచి కృష్ణు గన నఱిగి
యున్న విశేషము లన్ని విన్పించి ఽ నన్ను పరిణయం బంద దోడుకొని
రమ్మ నా యయ్య! వన నీవె యయ్య! ఽ నమ్మితిని నీవు తండ్రివలె యతని
దెమ్మ పుణ్యమ్మ మాట నెమ్మి గొను ఽ సొమ్ములు పరహిత కర్మము లెఱుగని
సేవకావనుడు వెలగి రక్షించు ఽ భావి కీర్తి నీయందు నిలుచు నిదె
భావము దెలిపితి పోయి రావలయు ఽ నావలని జీవములు నీవె యప్ప!
యని మ్రొక్క గాని యంగీకరించి ఽ వినిపింప నన్ని విశదముగ దెలిసి
కనియె ద్వారకామార్గము నరసియు ఽ గనియె నాపురము దరిసి వే జొచ్చి
మును ప్రతిహారుల వలన రాకయును ఽ వనజ నయనునకు దెలియ జేయగని
ఘనుని సెలవుగొని మనమున ముదంబు ఽ గని హరిని గాంచె వనమాలి మ్రొక్కు-
టకు యత్నమందు లోననే యతని ఽ సకలశోభనా! పెండ్లికొడుక! శ్రీ
సుకుమారాంగా! శ్రీకృష్ణ! భువిని ఽ యకలంకమ్మన యశము నిలుపు మన
ముసి ముసి నగవున వసుదేవ సుతుడు ఽ వెస తన గద్దియ డిగ్గి భూసురుని
దెస నెదురు నడచి నమ్రత గద్దియ ఽ వసియింప జేసి యానందంబున
తనను సురలెట్లు పూజ సేయుదురో ఽ యొన రటుగ బ్రాహ్మణుని బూజించియు
గనినట్టి గమన పరమగు బడలిక ఽ వనుకూలత గని తొలగించి వినయ
మున భోజనంబు పొందిక నమర్చి ఽ యును విరామంబు గూర్చి తరిని క్షని
తన లోకావన పవిత్ర హస్తము ఽ లనుకూల మంద నాతని చరణము
లను నొత్తుచు జాలింది హృద్భమర ఽ మన మానందపు ధామం బందగ
విన నఱిగ పంగతిని విను మిట్లు ఽ జనవరా! కృష్ణ వినయమార్గ మిటు
జగతీశ్వరేశ! నీ దేదేశము? ఽ తగవచ్చి యిచట జేయు పనియేమి?
విగతశ్రియుతవు నీవయి ముదమును ఽ సాగసంది యున్న దెలిపెదవు గాదె
విను భూదేవుల ధర్మ మెప్పారు ఽ గన నాధర్మమ్మె భువిని రక్షించు.

మనమున ముదమును వారు గన్న యెడ ✽ ఘన మోక్ష్యయందు దాని నందగను
అతడు నిత్య సంతోషము నొప్పుచు ✽ జత గనడు దుఃఖసమితి నెందునను
మతిని తోష పరిహీను డయినేని ✽ గతి దప్పి నింద్రుడైన కలత గను
స్తుతికి నర్హులౌదురు సంతుష్టిని ✽ మతి గన్న యట్టి సుమతులు సాధులు
మునులు భూసురులు నాకు సమ్మతులు ✽ యనుదినంబు నే వారికి మ్రొక్కుదు
జననాథు డెవడు? మీక్షితి నేలును? ✽ విను మతడు శాంత చిత్తుడె? యయ్యా!
ఘనత గలదె సజ్జనుల బోషింప ✽ విన జెప్పుము నీ విశేష మెల్లను
వనధిలోని నాదుర్గ మెటు జేరి ✽ తనఘ! మహాత్మా! యని పృచ్ఛ సేయ
తగుదువో దేవ! వినయ సౌందర్య ✽ మగుపించె తనువు తో డందినదియె
జగతిని విదర్భ మాకు నిలుచు క్షితి ✽ సొగసు నందునా కుండిన నగరము
తగవున దానిని భీష్మకుం డేలు ✽ నిగమ వినుతుడవు నీకన్ని దెలియు
నగవున నే సర్వమును గ్రహియింతువు ✽ వగలాడు వంట గోపికల లోన
తగి చెలుల పలుకులను నడక లంట ✽ బిగువు శౌర్యమట క్రూర దమనమున
నగధరుడ వంట వ్రేలి గొలందినె ✽ సగము వచింపగనే గ్రహియింతువు
మిగత నెరవేర్పు మీతలన యుండు ✽ సొగసు మించు నా సందేశము విను
వనజనాథ! మా రాజేంద్రునిసుత ✽ నిను గైంకర్యము సేయు వివాహము
ననుసరింప నీకగు నట్టి యొక్క ✽ మనవి వినయంబునను వినయ ఫణితి
నిను వీనుల జేర మనములో పాలు ✽ గొని చెప్పు మనియె సంగతు లేవో
నే నందితి నది నీచెంత రాక ✽ నీనవ్వుముందు గనెద మాపురిని
మానిని వాక్యములను మమత గొనుము ✽ దీన నీవార్త రక్షణ బిరుదము
ఖ్యాతి నిగుడు నా మాటయు దప్పదు ✽ నీతిమంతులకు పాతకమంటదు
పాతక రహితుడవైన నీకాంత ✽ యా తలోదరిది సంగతిని గతిని
దీన విశదంబు నే ధాటి గందు ✽ యా నలినాక్షిది విను తిరియు సుమ్మ
నాథా! త్రిభువననేతా! సుగుణస ✽ మేతా! పుణ్యశ్లోకనుత గీత!
ధాతాద్యమర పునీతా! సంస్మర ✽ ణేతరసంగత దూర సంభూత
ఏ నీ గుణముల కర్ణేంద్రియముల ✽ పానీయ మందెదను సుధను బోలి
ఏ నీ సౌందర్యమును కన్నులను ✽ గాన నభిలాష మనోభిరామత
ఏ నీ చరణములకు నొత్త కరము ✽ లాన దలతు నది భువన పవిత్రిత
ఏ నీ నామము నుతింప జిహ్వను ✽ బూనెద జపమును ముక్తిపద మనుచు
ఇట్టి నిన్ను విని పరిసేవింపగ ✽ పట్టుగ నుతింప మదిని నిల్పితిని
వట్టి మన్నించి నను దిట్టపరుప ✽ చుట్టరిక మందు నను మరద లనుచు

గూరిచి సేనల పరివేషముగా § మేఘ వైభవం బంద సరణి యగు
వేష మంది యట సిద్ధముగ నుండు § వాసుదేవ ! నీ వటు నేత్రపుగద
దోషకారులను దుమ్ముగ బోరలుపు § ఆ సమయంబున రథమునను గూర్చు
నే రథము గడప నేర్తు లే యటుల § వారిజలోచన! కావలయు నన్ను
నీరజముఖి యట నీకు జిక్కనట § దారుల ధీరత నే గనుదాసను
అరిసూదన ! తమ తమోనివృత్తి! § ధరియింతు నీదు చరణ సంజనిత
పరిశుద్ధ వారి హరునివలె నీదు § శరణ మొసగవిదో నూరుజన్మలను
కరము నిన్ను పతి గాగ జీవముల § తరుణి మందింతు నిది నావ్రతంబు
పరమధర్మ సంచరణ స్వభావా ! § తరుణివి జ్ఞానము నిలుప గందునోకో !
చెవులు నాకేల ? నీ చరిత వినక § భువి తను సొగసటె గవయ నిను గనక
యువనిరమణ ! నిను గనని కనులేల ? § చవి నీయధరము గనని జిహ్వేల ?
వనమాలిక వాసన గన దేనియు § దనరుపట్టి ఘ్రాణంబు నాకేల ?
ఇన శశి నయనా ! నిను బొందకున్న § కౌన రేల ? జన్మ గనుము నా మనము
గొనియుంటి వింత కేసును ధన్యను § వనజాక్షు చిత్త మెట్లో విహరింపు
అని మ్రొక్కు నింతి నెఱతనం బిద్ది § గనెద నాతోప్రియ వివాహ చారుడే
నిను దెలిపినాడ ఆమె కులు కిట్లు § విన దలతు వేని యది కొంత జెపుదు
నని నవ్వుగూర్చి కనులు మీనములు § తనువు మెఱపు దీవయు బోలు నయ్యా !
పదములు పల్లవ వైభవంబులగు § యద నందు కరము లరుణ ప్రభలను
తరుణి నూరువులు కనకపు టరటులు § వరుస గన గళము కంబు మంగళము
కలదు లే దనెను మహిమ మధ్యంబు § విలసిత నురోజములు పూల చెండ్లు
అల బాల ఫాల భాగ మర్ధశశి § లలన ముంగురులు మత్త భృంగములు
చూపులు మారుని తూపులవి నీకె § బాపురే ! దాపు నీ వీయు మనుచు
నాపై వెంటగొను దేమొ నేనెటు బలుక § నోపకను బొమలు మరుని ధనువులగు
కలికి పలుకులును కంఠ రవంబును § తలపు గొన శేయు శుకపికంబులను
వలపు నిను గూర్చు మోదకరంబులు § జలజ నయన వదనము శశి బింబము
మీకె దగు జంట నా వాకట్టుల § నీకు పాడిగా శేఖరత బలుకు
ఏ కరణి నాడెదవో యుత్తరంబు § నా కందింపుము ఆమెకు వచింతు
నన చిరునగవున నా నీలదేవ్రు § డన చెవిని దాపు రహస్యముగు నిది
వనితపై వలపునను నిద్ర బోను § మనము మరుబారి నీ చెప్పినట్లు
కనుల నిపుడె గన్నట్లు చిత్రమా § కనకాంగి తత్తరమును బాపెదను
అంతయును మున్నె దెలియరా నంటి § నింతిని గొనుటకు నాటలయు మ్మోల్లా

మెంతైన గాని నెఱపెద శత్రుల ఽ అంతర్గృహములలో దాగు నేను
మారిన నవ వహ్ని పొందిన చందము ఽ నేను నింతి గొని తెత్తు నాపురికి
వే నందము పయనంబు నావెంట ఽ మానిత మూర్తివి బ్రాహ్మణోత్తమా !
నీవు నడవ వలదయ్యా ! బడలెదవు ఽ పావనుడ వనుచు నది దొలగించితి
నావుడు భూసురు డా పెండ్లి తార ఽ వే విని రథమును రాబంచె నపుడె
దారకుడు రథము నాల్గు తురగముల ఽ ధీరతను బూన్చి తా దెచ్చి నిలిప
వారిజ లోచను డా తురగంబుల ఽ సారతర వార్షమున చప్పళించి
జనవర ! సైన్యము సుగ్రీవంబును ఽ విను మేఘపుష్ప వలాహక ములను
ఘనమైన పటిమ గల గుఱ్ఱములవి ఽ గనును ప్రియమునను విజయ మతములని
వనజ నయను డటు రథ మధిరోహణ ఽ మును జేసె భూసురుని ముందు గొనుచు
గనెను మార్గమున ననేక భూముల ఽ జొనుట గాంచె నా విదర్భ దేశము
నొక రాత్రిము నని ఇటు జేరె హరియు ఽ నికట మంది వసియించె నొనరు గని
ఇక విను మాపురి జనపతి భీష్మకు ఽ డకలంకు డయ్యు కొడుకు రుక్మికి
పెద్ద తన మిచ్చి తా పెద్దకాల ఽ ముద్ది గొనుటచే నతడు శిశుపాలు
పొత్తు నందింతు పెండ్లిసి రుక్మిణి ఽ జిత్తుల మారికి గొల్లని కిత్తునె !
యనుచు చాటి పురమును శోభ కలన ఽ నను వందించియు యత్నించె గొనెను
జనవర రచ్చలు సందు గొందులును ఽ ఘనమైన రాజమార్గంబులును
విపణి వీధులను విశద మందించి ఽ యవు రూప మందు నిలుచు నట్లుగా
నృపులు గని మెచ్చ సకల గృహంబుల ఽ నపుడె రమణీయ తోరణాల్గటి
జలముల గంధాదులచే నలుకుడు ఽ విలసిలగ రంగవల్లులను గూర్చి
యుల నరటి కంబముల నాటజేసి ఽ నలరు కుంకు మాగరు కర్పూర
ముల ధూపమ్ములు నగ రంత గప్ప ఽ చెలు వందించియు స్త్రీపురుషు లెల్ల
వివిధ వస్త్ర భూషణముల ధరించి ఽ నవరింపు నలంకారముల వడిని
దవుల మంగళవాద్యములు దివి నిండ ఽ నవులున ముదంబు లును పొప్పు నించి
దేవతల పితృదేవతల పూజ ఽ కేవల మొందుచు పూజలను గూర్చి
యా విధిని బ్రాహ్మణుల భోజన మిడి ఽ సావకాశముగ రుక్మిణిని స్నాన
మొనరింప గూర్చి వస్త్రరత్నమణు ఽ లను గూర్చి నట్టి భూషణంబులను
నలంకృతముగా నాజ్ఞ నందించి ఽ యుల వేదమంత్రముల మంగళంబు
పెలయ భూసురులు రక్షణాలు బలుక ఽ తలపున గ్రహముల శాంతి గూర్చియును
దమ పురోహితుడు నిగమ విదితంపు ఽ హోమ మొనరింప దంపతుల మేలు
క్షేమమందు నిటుల గూర్పంది యుండ ఽ నమధిక ముదంబున జేర వచ్చె

కరి, తురగ, రథవ్రజ భటసంఘము | పరిహిత బంధుల వారి మోదమున
పరివేష్టితుండు విశంకట వృత్తిని | త్వరగని వచ్చెను చైద్యు డచ్చటికి
నదను సర్వమును నెఱుగుమను గాన | గదియ జేరి రా జరాసంధుడును
విదిత గర్వుడగు నాతను నా బల | మధికతరము గొను మఱియు దోడుగా
వరుస గని వచ్చె దంతవక్త్రుండు | సరణి భయకరులు సాళ్వ పౌండ్రులును
నరనాథ! విదూరకు డాదిగాగ | ధరణి చలింపగ నడకల దడవడ
హరి బలభద్రులు బంధువుల గూడి | సరసిజ ముఖికై యుదెంతు రేని
పోరున వారిని పరాభవింపగ | కూరిమి చైద్యుకు మనల నుబ్బు గన
దీగల మెఱయగ గంధ మచట యని | వారి మతము చతురంగముల తోడ
విను భీష్మకుండు శిశుపాలు నెదురు | కొని పూజించియు విడిదిని జేర్చెను
తన రుక్మిణియు దక్క ననుచు మన | మున మోద గర్వభూయిష్ఠు డయ్యె
గన బోదు తెలివి చైద్యు డట్లాప్పు | విను మిక ద్వారక లోని వారివిధి
హరి యొకరుడె తరుణిని దెత్తు ననుచు | త్వర గని ధరణీసురు ననుసరించె
దుర మానవహిల్ల నైన నే దోడు | నరయుచలె ననుచు దా సేనతోడ
నరుల లెక్కగొన బోని కడిమి గని | పరిశౌర్య ధైర్య వీరోదగ్రత
నడిచి హరిబాసటను గని గాంచెను | నడయూదు ముదము నందెను కృష్ణుని
జనవర సౌధాంతరమున సేకత | గని రుక్మిణి యా లోకలోచనుని
మనమున దలంచి తలపు సందేహ | మును గూరగ తద్విచార పరతను
చింతింప జొచ్చె రేపె ముహూర్తము | వంతు గొనివచ్చె నధముడు చైద్యుడు
మంతనం బేమొ రాడె కృష్ణుండు | దంతి వరదుండు వన్నిటు గనడా!
రేపని యెఱుంగ లేదా! నిర్ణయము | నాపై గోవిందునకు దయ లేదా!
మాపై విధి నను నలమట గూర్చెనా! | ఏపగిది మనము నిలుపగ నాకగు!
యా పుణ్యమూర్తి యగ్నిద్యోతను | డేపగిది దడయు హేతు వదేమో!
యాపై విధి నను నలమట గూర్చెనా! | ఏపగిది మనము నిలుపగ నాకగు
నా పటుయత్నము సిద్ధమొ! భగ్నమొ! | దాపు దరి దొలకదయ్యె దైవగతి
ఏదా! జగదీశ్వరీకృప యెటులో! | నుదుటివ్రా లెట్లు శోధింపబడునొ!
నాదు సందేశమున మెప్పుగొనడా! | యదువల్లభునకు కార్యంబేమొ!
పోడా నా డా బ్రాహ్మణుం డనుచు | రాడో! వచ్చునో! మాధవుండనుచు
బీడో! ఫలమో! గౌరికటాక్షము | కీడో! మేలో! భాగ్యదశ యేమొ!
అనుచు తనతల్లికైన తనతలపు | వినిపింపబోదు యనురాగపుచెలి
[illegible]ని దరహాసితపు చంద్రికల దాచె | తన వదనమందు మూల నేవికనో

కనుచూపు కనకమణులపై బోదు § విన దేది గీతచరణంబునైన
మానం బెంచదు తా నందుచోటు § తాను ధరణిపై పొరలాట గొనును
దేవనైన నిష్టంబు మలపదా § గానమైన నిం పొనరుగ బాడదు
నిదుర గై కొనదు గదియదు శయ్యను § బదు లాడ దెవరు సదయత బిలిచిన
ముదిత ముదము దూరముగ దలంచెను § యదను దప్పింప దా కన్నీటిని
చెదరుట నెరుగదు విదిలింపుకొప్పు § నుదుట ముంగురుల సవరింపు గొనదు
వాసనలు గొనదు సుమరాజంబుల § దాసీజనముల పనులను మెలపదు
వేసమున సొంపు గన దద్దంబున § యా సమీప వనమందున దిరుగదు
వలపు గొన దన్న మది గృష్ణునలపై § చెలియ కగు దప్పి అతని రాకొక్క-
జలజంబు చేత గొనదు జలజాక్షి § సలిల మాడ దా సలలితహృదయము
చిలుకను బలుకదు చిలుకల కొలికియు § కలిమిక ముదిపెము గన దా కలికియు
తిలకము దిద్దదు తిలపుష్పనాస § సిలుగు లిటు గాంచె నా చెలువ చెలియ
మలగదు మెల్లని గాలి కా యువతి § తలగు మదభృంగధాటికి తొయ్యలి
అలుక గొను పికము లట గానమింప § కలత గను కీరసంభాషణమున
చలువ నింపు వెన్నెలయు వేండ్రముగ § యల మా కంపాంకురచ్ఛాయ లటులె
మనము మనసిజానల దోదూయము § యొనరు హెచ్చె హరి శుభవార్తపట్ల
వనితకు మంగళగాత్రి విజయంబు § గని వచించె నన్నట్లు నా యుతివ
గనె వామనేత్రభుజము లదరుటల § వినికి నది మోదచిహ్నముల నెఱుగు
గావ నూఱటను దాక చింతిలుట § మాని యా దిక్కు గాంచి నంతనే
శుభము నీ కనుచు జనుదెంచె ద్విజుడు § వనిత యెదు రేగి మ్రొక్క నాతనికి
విను శ్రీరాణీ! నిను మెచ్చె గృష్ణు § డనయము నీపై నలపు బెంచె మన
మున నో దేవీ! నా కీర్తనంబు § లను బహుమానంబును గూర్చె దెలియ
గనె సందేశమును దా వచ్చె § ఘను డతడు చక్రధారి రమాపతి
నిను పరిగ్రహించును దేవాసుర § జనలోక ముత్తమడ్డము బోరున
గెలిచి నిను బెండ్లియాడు నమ్ము మన § లలిని మది భక్తి జొనిపి మరి నతిని
సలిపి కరములను నుదుట గీలించి § నలరున బ్రాహ్మణు జూచి బలికె నిట్లు
నీవు నా [illegible]నుడవు దేవుడవును § కేవలము జీవనము గూర్చితివా

శ్రీకృష్ణుండు కుండిన నగరంబునకు రథారూఢుండై చనుట :-

నేను నీచరణములకు మ్రొక్కెద § నో వయ్యా నిపుడు! పూజ్య మతియును
నా మనమ్ము [illegible] చెంగట జన § [illegible]

ముల పలువిధాలహారముల గూర్చి శ్రీ విలసన మొప్పగ కర్పూరహార
తులు ప్రీతినిచ్చి రుక్మిణీదేవి శ్రీ యుల గౌరీశ్వరులకు మ్రొక్కి నిలువ
తెలివి విలసిలగ చేతుల ఫాలం శ్రీ బలవరము నించె ముకుళి మందించె
చెలియ నుతి సేయ దొడగె హృదయమున శ్రీ నల పరాపరములను నాఖ్య గన్న
చెలువందు శర్వ శర్వాణి నాగ శ్రీ యలరందు నట్టి యుమామహేశుల
నలరు తా నందె నీ పగిది స్తోత్ర శ్రీ మలరు జనపాల ! నీ వది వినుమా !
నమ్మితి మనమున భువన పోషకుల శ్రీ నమ్మితి నీశ్వరు నీశ్వరి నాయన
నమ్మితిని ధాత వేదముఖమ్ముల శ్రీ నిమ్ముగ పురాణ దంపతు లటంచు
నెమ్మతిని సురల వినిపించి నట్టి శ్రీ కమ్మని నాముల కరుణామయులను
నెమ్మి నతలింతును ఇచ్చ దోచినటు శ్రీ నెమ్మతి చిత్తములోన ప్రసింపుడు
నమ్మితి శంకర సంకటాపహర ! శ్రీ నమ్మితిని శాంకరీ ! యఘహారీ !
నమ్మితి పరమేశ్వర ! శుభోదార ! శ్రీ నమ్మితి పరమేశ్వరి ! సోమధారి !
నమ్మితి నంబా ! జగదంబ ! గౌరి ! శ్రీ నమ్మితి దయాంబ ! గరిమాంబవు గదె !
కొమ్మ నీప్రతి నను నా ముకుందు శ్రీ కొమ్మవు గమ్మని దీవింపు దేవి !
అమ్మ ! సాష్టాంగ నతి సల్పించితి శ్రీ నిమ్మెయిన నన్ను నశుభములు దొలగు
సర్వమంగళవు నిను మ్రొక్కగంటి శ్రీ సర్వమోద దాయకము నీదయను
సర్వశోభనము నేను దాల్పగంటి శ్రీ సర్వతరుణముల మిము మఱువ తల్లి !
ఎల్ల సౌఖ్యములు నన్నాశ్రయించు శ్రీ నెల్ల కాలంబు నల్లలితంబుగ
నల్లము మీపద సరసిజంబులను శ్రీ వల్లనైన నిమ్ము పూజలివె యమ్మ !
ఎల్ల జనులు మిము సేవించ గన్న శ్రీ కొల్ల సౌఖ్యములు ముల్లె మూటలవి
కని మొక్కు లెల్ల నచ్చట భూసుర శ్రీ జన వనితల లవణాపూపములను
వినయమున కంఠసూత్రముల మఱియు శ్రీ ఘనత తాంబూలముల నిక్షు దండ
ముల దక్షిణలను తుష్టి యొనరించి శ్రీ తలన సేషలను దాల్చి సకలురను
చెలువ దయ దలచి జనులు మోదిల్ల శ్రీ నల శివ శివులకు శివ మంద దండ
ములను మరి జేసి ధీరయై నిలిచి శ్రీ వెలికి రా జలద మధ్యము వెలువడి
యల మెఱుంగు నీ నిలుకడ జెలంగు శ్రీ తులత రూపమున గుమిగనె నాకొ్క !
యనగ భ్రామరనందనలను కొనియాడెడి శ్రీ మినుకుల ఛాయనె దీపింప కనుల
కును మించుమించని గమ్మ నీరదు చర శ్రీ దుని బోలు వదనరుచి శశికళ లే
యనె నెల్లలను నట్టి జనమ్ములకు శ్రీ ననురాగ హీన మతులను వెక్కస
మును నమురాగము దయ నిక్కవారి శ్రీ మనముల కంతుకము గూర్చుచు సర్వాల
కమలభవ [illegible] శ్రీ [illegible] వనితను ముఖ్యాగ వాని

ధనువుల శరముల వర్షపరంపర ✽ లను దోప గురిసి రా శస్త్రములను
ఘన భయంకరము దోప వెస ముసరి ✽ యును విసరి వారి నిలువరింపంగ
యాదవ సేనల దండనాయకులు ✽ కోదండముల ఎక్కిడి గుణములనుఁ
మీఁదుగాన దీడి శంఖంబుల నెఱ ✽ నూది భీషణము దోఁపగ నిలిచిరి
హరి యాజ్ఞఁ గొనగ నట్టహాసముల ✽ పరితోష మొప్ప రణవిహారతకు
హరి రాజమధ్య యా వీరవ్రతి ✽ సురుచిరాంగి రుక్మిణియు హరిఁజూచి
శరము భీతి దనరార భ్రమగొన్న ✽ సరణిని మలపగ సారసాక్షిఁ
గని యో బాలా! తంద్రిత గొనకుము ✽ మునుకొనెను భీతి దొలగు నిప్పుడే
మనకు విజయంబు సిద్ధము నమ్ముము ✽ మనమున ముదమును మనకు గూర్తు రదె
చొచ్చెద రనికిని యదువీరు లరుల ✽ వ్రచ్చెదరు గాత్రముల తూల్లు గ్రమ్మ
నొచ్చెదరు వారు రుధిరముల దోఁగి ✽ విచ్చెదరు దెశలు నవియును జక్కవు
వచ్చిన వారలు మచ్చరించినను ✽ ముచ్చట గాంతువు వా రచ్చు గతుల
మచ్చెకంటిరో! నా మాట లివియె ✽ హెచ్చును గన నివి విచ్చి చెప్పితిని
అని యూరడించె వనిత నవ్వు గొనె ✽ నని మొద లయ్యెను హరి సన్న లిచ్చ
కని మసగిరి రెండోరుల సైన్యముల ✽ అసురాసుర సమరమును బోల్పనట
వెసగొని చాతుర్యముల పోరాడు ✽ పసగొనియె రణము తొలి హంకంబున
అట్టహాసములు దట్టె నవి మోరి ✽ బెట్టు గన్నట్టి యార్భాటంబు లదె
పట్టున పెడబొబ్బలు క్రేకలయ్యె ✽ ముట్టె మింట నవి ప్రతిధ్వనులచే
మట్టములు మీరె దిట్టతనంబులు ✽ జట్టిరి శరముల గొట్టుటలు మొలచె
గిట్టుటలు దోచె క్రూర శరంబుల ✽ నెట్టు లయ్యెనవి యముని గణన కటు
పొట్టల జీల్తురు గట్టి ఖడ్గముల ✽ పట్టిస ప్రాసల తోమర ముద్గర
ములను గదల ముసలముల పరశువుల ✽ బిలుకు మార్తురా గ్రుచ్చి మొత్తుటల
నులు కొలది విసరుటల రువ్వుటల ✽ తలలు వక్షమధ్యములు వ్రయ్యలుగ
బరవుట కంఠములను ద్రెంచుటయు ✽ నరసి మధ్యముల వడి ఖండించుట
కరములు దునియగ చరణములు జీల ✽ వరుస పదాతుల గతు లట్లుగాగ
తురగారూఢులు వడి బారు నిలిచి ✽ వర ఖడ్గమ్ముల పరుల దారసిలి
తురగముల నట్ల తల లంతగాగ ✽ కరుల మొత్తముల గదల మొత్తుచును
కరము తుండముల నతికి కుంభముల ✽ శరజాలంబుల పరిఘములనుఁ
నను హెవర జీల్చి రథిక వర్గముల ✽ గని క్రీడించుచు తురుమురు దములుగ
దనరగ నిటు చతురంగములు పోరు ✽ గొన భయంకరము దోప యాదవులు
వర బలమ్ములను మిగిలియు తెగువకు ✽ తరుణమును గనుచు చెలరేగి హరి

దరికొను దవానలము వలె జుట్టియు § పరిసమాప్తి కాలమున జలదములు
కొలదిని మించియు నిలల నన్నిటిని § బలు పిడుగుల చాలుల వడు వమరెడు
నల జరాసంధు డాది శత్రువుల § తలగనీక నిశితంపు శిలీముఖ
ముల పరంపర లవారిత క్రోధం § బుల మచ్చరించి గురిపించి యరుల
కరి ఘటల ఖండ ఖండమ్ములు గా § తురగంబుల నఱి రథములు పొడి పొడి
వర కాల్బలముల కర చరణ శిరము § లురములు మధ్యములను తుండ్లు జేసి
ఘన కర్ణ గండ శ్రోత్ర ఫాలంబు § లను నేరుపంద నీని యటులుగ
పొనుగులు వడగా రూపముల బాపి § కినుక నతిశయముగా వారి ఛత్ర
ముల చామరాది కేతనముల నుసి § కలను బడ జేసి మకుట కేయూర
ముల హార కటక నూపురాదులు § నిల బడగ ననిలో ధూళి యది మలగ
కలన రక్త సిక్తముల ప్రవాహము § బలుకు గూర్పంగ శవముల పెంటలు
గా నొవరింపగ తమ సేన లుబ్బు § గొని తురగ నాభిపద ఘటిత శింజినీ
లను ఘణాత్కార వీర హుంకార § కనకమణిభూషణముల ఝుణఝుణల
రవముల నిస్సాణాది ధణ ధణల § తివిరి సింగినీ టంకారధ్వను
లవి యంతరాళమును నిండింపుచు § గవిసి యవిరళము లగు పరాక్రమము
లను విలసిల్లగ నెచ్చట జూచిన § తనువులు నవిసిన మాంసముల రొంపు
లను నెత్తు ఱేర్లు భూతభేతాళు § లును కంక కాక గృధ్ర ఫేరవము
లును గూడి సంకులములుగా దినగ § ననుకూలము గూర్చిన యట్లుగాగ
మగిడిరి సేనల మిగిలిన వారలు § బిగువు వదలి యంగములు క్రింతలుగ
దిగులు వెడల దోపంగ దిక్కులకు § తగవు శౌర్యముల గీటున గలిపియు
మాగధ ప్రముఖు లొక్కరి నొక్కరు § వగలు గనుచు బ్రదుకులు గంటిమనుచు
చేగలు హీనము నగు కళల దారి § వేగముల యూరువుల బుచ్చికొనుచు
బారున గన రాభగ్నపు పెండ్లికు § మారుని చైద్యుని శిశుపాలు ననుచు
తేరును దిగి యొక్కట బావు రనుచు § నారి నిల్లాలి గోలుపోయినటు
నీరు కన్నులను గార తనవారి § బోరున సన్నల రమ్మను వానిని
దారి ముందుజీవముల నుంటివే § పోరాటమ్మున బలము మాయ నీ
దారి మంచి దబ్బను నీకు జాలు § మోర యెత్తి మాటాడగ నుంటిమి
నారి గాదు నీ కోరినది మారి § యారయ నీకును నీతోడి వార
లగు మాకు దిక్కు దెలిసె నిప్పటికి § వగవ కన్న ! యావిడ విడుగుసుమ్ము !
తగదు నీకు మంగళము దోపదుగ § వగవులు మనలను దూలించె వగలు
మిగిలినవి జాలు ప్రాణములు నీవు § నగటున నివుడే దరలు నీ నీడ

మనకు మే మంతవార మిపుడు వలదు § మన యింటివారు పేర్పను గొందరు
కనవలయు మార్గమును ఇండ్ల కనగ § ఘనత కొంత జేకూర దెల్పి ఇటు
జనవర ! యాతని జరాతనయుడను § వినుము శిశుపాల ! యీ వగచుటేల !
బ్రతుకు గలిగితే భార్యలు లేరా ! § బ్రతికితివి భాగ్యమిదె చాలు ముదము
గతి గల నాటికి పెండ్లి దలంతువ ! § సతి యిది పోత్రది తా గొల్ల గొర
కొనిపోవ నిమ్ము దానికన్న చ § క్కనిదాని నీకు వెతకి తెత్తుమని
మనము విపరీతమును బొందితిమని § మనమున నెంచకు దైవయోగమును
ఘనులు మునిజాలములు నజ రుద్రులు § గనదాటలేరు ఇంక మానవుల
కును తరం బెటుల నీశ్వరుని చేతి § కను కూలమైన కీలుబొమ్మలము
మన మాతడు నాడించు చొప్పందు § గొనువారమయ్యా ! స్వతంత్ర్యములవడ
దనఘ! తనువు గన్నట్టి సర్వులను § గను కలిమి లేములును సుఖదుఃఖము
లనుకూల ధవ్రిముల జొచ్చువారు § ఘనులు చింతింప కుచితమునె గండ్రు
నేను మధుర పదునేను తోయముల § బూకను సైన్యములు జేర్చి కొనుచు
నాని ముట్టి రణమును జేసి కృష్ణు § చే నందితి పరిభవము మరి యొక్క
పరి చక్రిచేత నా బలచక్రము § పరిభీతిని గొని పరాభవంబున
నరపతుల రోయు నటు నేను సీరి § కరశాఖి జిక్కి సీరమును శిరము
బారింపక మును జారిన ధీరత § పారము నిలుపగ నారపాతుడే
చేరి వారించె కామపాలుచే § బారి దప్పి హారికరుణను లోగితి
బ్రతికివచ్చి పదునెనిమిదవతూరి § మతులు గలగ మధురాపురి వారిని
యతికిన వసింపులను విడి విజయము § సతివేల మందినాడ వింటివే !
బ్రతుకవచ్చు నోడలను ప్రాణమున్న § గతి వందవచ్చు బలము తేజంబు
సతత విజయ దోర్దర్ప యశంబుల § వితథములగు నవి మరి వెలయు నగును
వారల కీశాలము మంచి మనకు § గూరె నపజయము వగ దీన నేల !
నీరక్షేత్రుని మరల జయింతము § మేర మన కిపుడు మన పొలిమేరల
జేర మేలనుచు జెప్పి యందఱును § బారి రచట వే జేర తమ భూము
లను తల కందక నొక యక్షౌహిణి § ప్రకటింపనైన చతురంగబలము
సకలాయుధ సంపర్కవిజృంభిత § సకలవీర్య సంధాన మహోజ్జ్వల
నికర సాహసుల రామసహితునిగా § శకటభంజనుని వికటిత కంసుని
తన చెలి యలి గొని పోవ సహింపక § తనకు పితము తల కెక్క వెక్కసము
మనములో ముదము పెంపు గనుగొనుచు § ననికి సిద్ధముగ బలువు బారుచును
సారథిని బిల్చి రథము శీఘ్రముగ § బారింపుము యదుసేన నెదురుగ

ధీరుఁడ నపార శౌర్యసాహసుఁడ ఽ వీరశేఖరుఁడ భీష్మక తనయుఁడ
పేరు రుక్మిగా బిరుదు ధ్వజమ్మును ఽ నేర దరయుంగ పెట్టినొల్లండు
వాని గెలిచి మన పాపను దెత్తము ఽ మానధనుని మరి యొక్కని గూర్తము
తాను దగఁడు రుక్మిణికి నన్ననగు ఽ నేను గల్గియును మానిని హీనుల
పాలు గాదగునె యాపెకు మెప్పున ఽ నోలాడించెద విడిసెద శరముల
నేల బడునుగా నీలవర్ణుండు ఽ నీలాంబరుండు నట్టులే యగును
అని మిట్టవచ్చి యో వెన్నముచ్చ! నిను మానహీను ననిలో దాపెదను
గనరా నీ మిట్టిపాటు డింకగ ఽ మును మందలోని పలువ దనం బిట
పనికిరాదు మా బాలను డింపుము ఽ కన వింతవరకు చులుకు గను పోటు
విన జెప్పు మెవరికొడుకవో తెలియదు ఽ జనకుం డానకదుందుభి నందుఁడో !
వినిపింపు మూరు గొల్లపల్లెయో ? ఽ కన మధురాపురియో ! జనని దేవ
కియొ! యశోదయో ? వంశ మెయ్యదియొ ? ఽ అయనములు నీవి యన్ని వంచనలు
నయహీనుఁడ! నీజాడ నా వాడ ఽ నయిన యాఁడి గుమ్మలను కూడికలె
గలవాడవు మర్యాద నీకేడ ? ఽ తల మెచట ! పుట్టి పెరుగు టెచ్చటో !
దెలుపక మాసరి యే మిట తూగెదు ? ఽ చెలియలి వంచన గొనిపోవ జాల
దలచితివ ! సిగ్గుమాలిన గొల్లా ! ఽ నిలు నిలు డొల్లగ జేతు నీ నీటు
రాజవీరులను నిజ బలము మెఱయ ఽ నాజిలో నిలువ నీచేత నౌనె !
ఓజ గజదొంగ పగిది మాయచే ఽ పూజితుల మమ్ము నీచ మతి వగుచు
వలుక విరసైన మాపాప నిచ్చి ఽ తొలగుము గుణివై వానిని గైకొను
బలు వాఁడి దనరు శిలీముఖము లివె ఽ శలన జిక్కితివి బలమేది దాఁగ
వలబడ్డ పిట్టవలె జిక్కితివిక ఽ ఇల పారుబోత ! ఛీ ఛీ ! కపటీ !
యని మూఁడు బాణములను హరిని తను ఽ వున నొప్పించియు నుతిమి మాటాడ
వనజనాభుండు కనలి నవ్వుచును ఽ కనె వాని వన్ని నోట కూయుటలు
వినుట శౌర్యమ్ము మాప వేయుటయు ఽ ధనువు చేబూని యొక్క శరంబున
దునిమె వాని కోదండము నాదగు ఽ ఘనబాణమ్ముల తన్నువు ద్వారించి
నెనిమిది విశిఖమ్ముల తురగమ్ముల దునిమి రెండు తూపుల సారథిన టె
మునువు బాపి మూడైన ఖగములను ఽ కినుక పెంపునను కేతువు ద్రుంచియు
మును కొన్ని వానిని మదంబు డించిన ఽ ధను వే నందియు తన రుక్మిణ్యాదు
మ్మును స్రుగ్గడించి నక్కిఁడు లోపున ఽ తునుకలుగా వడి విరిచె శరమ్మున
ఘనమత మ్మద్రిప్రాంకటి గొన దాని న్నాటు ఽ విను మిక పర్విముల గదల పట్టెపల
మనుపొంద నంతక మ్మమియుము నాపగి ఽ తిని మూల చర్మ శక్తి ఖడ్గాదు

లను తోమరముల చక్రముల నొగల ఽ దునుకలనై కూల్చి పట్టిన విల్లను
వనజ నయనుచే వమ్ములై పోవ ఽ కన లార్పుచోక నొక్క కటారము
గొని లంఘనమున దన దెస రాగనె ఽ యనలజ్వాల నిగుడున శలభంబును
గదియు మాడ్కి రా నతని కవచంబు ఽ చదరముగు జెక్కిచి క త్తిని సడల్చి
అదనున మెఱుగుల నెన్నియును మాపి ఽ బెను రిత్తసికిగా ఖడ్గ మొర జెక్కి
కరము మిఱుమిట్లు దిసల మెఱయుంగ ఽ సరసిజనేత్రుడు ఝళిపించి వాని
శిరము దునుమంగ నడువ గడంగిన ఽ సరసి దేవ! యదువల్లభ! భావా
తీత జనార్దన! పాహి! పాహి! సద్యోత స్వయంభో! సంయమీంద్రనుత!
నీ తరలాక్షిని రుక్మిణిని శరణు ఽ ఈ తరుణమె నాకును నీవ తరణి
వయి శోకసాగరమును గెడప వలె ఽ భయము బాపు నను ననుచు హరి కరుణ
వయివు గన గోరి చరణములు వట్టి ఽ నయము దోప వినయమున మరి యనియె
నిను దేవదేవు భువన శరణ్యుని ఽ వినుతామరసంయుత కీర్తిధనుని
ఘన మహనీయత నా యన్న గనదు ఽ నను నెనరు చాలునను మన్నించియు
మనువు మొక కారణము మనివి గూర్తు ఽ వనజభవ వంద్య! దీనదయాపర!
నను నీకు ధారపోసె యల్లుడగు ఽ వనజాలయపతి యా శ్రీకృష్ణుడు
గనగ మా పుత్రి దారగా గొనెను ఽ ఘనభాగ్య కలిమి మము గూర్చి సేవ
గొనియు సంతోషమున ముక్తి నిచ్చు ఽ నని నా జననీ జనకులు నిన్నె
వినుతించు చుండ నే వినుచుందును ఽ విను మితని నదయతను గూల్చితేని
మతు లెటుల వారు పెద్దలు మన కని ఽ వెత నింపకువే! ధర్మసురూపా!
స్తుతిపాత్ర! వారు కరుణకు పాత్రులు ఽ యతిజన వంద్యా! నమోఽస్తు తే యన
తనుమధ్య కనుల నీరు కంపమున ఽ కన గద్గదంపు కంఠారవంబు
మన మాతురంపు తడబడు నుడువులు ఽ వనిత కలికితనమును విజ్ఞానము
తనుభక్తి వినుతి సంస్తవ పటిమను ఽ విన పికరవంబు శుకవాక్య సరణి
తను జేర నందసూను డానంద ఽ మున జేవు రడంగగ చిరునగవున
దన కరఖడ్గము రొయర నిడి బావా! ఽ కను మిదె! మరియాదను నే నొనర్తు
రమ్మని కమ్మన వలని మానమ్ము ఽ నెమ్మతిని బక్కి నట్టె యవమాన
మమ్మరమ్ము గొన దగ్గరకు దానె ఽ కొమ్మందజేరి మీసలను తలను
మరి రేవులు వారగ గడ్డంబును ఽ గొరిగె నొక విరుగు ఖడ్గపు టంచున
పరువు నీచముగ గూర్చె వాడెదను ఽ నురుక దలంచిన నెరిగి బంధించె
అంతటనె యరుల దోలిన వీరులు సంతసము పెద్దగా వారికి సెప్ప
వంతు సెల్లించ దరిసి జయమనుచు ఽ దంతివరదునకు శౌరికిం జెప్పి

చెంతనున్న యా వింత విరూపుని కై కొంత కొంత గేవులు వారు వరుస
శిరమును గొరుగుటలును గడ్డ మస్లె కై నరయ మీసముల చా లావిధమే
పరు డెవం డితని కిట్టు గూర్చె డని కై సరసిజాక్షుడే దీనిహేతు వని
దెలిసి యుపహాసమున నతనిమాన కై మున రోత బుట మాటాడు చుంట
నలినాంబకుండు తాలాంకు డచటి కై కలను వేగంబు గొన జేరవచ్చి
యల రుక్మిని గరుణించి బంధనం కై బుల దొలగించి కృష్ణుని గాంచియు
తలగ ద్రొబ్బ నగు గాని బంధువుని కై తల రేవులుగా బరబర గోకక
జలదశ్యామా! నీవె మూలమా కై తల దరుగుట కంటెను మేలు వాసి
ఇతనికి గూర్తువె లలి బుట్టె నాకు కై మతిలోన సిగ్గు గాంచె నీతండు
అతులమైన దయ సర్వమున బరవ కై మతి గల మంగళనామ! నీకు నరి
హితు లను భేదము లేదె! మేల్కొడు కై లతికింప నెవ్వరికి భక్తవరద!
ముందు తెలివిగల వర్తన గొన్నను కై కుందు వాయు బ్రతుకును నిను నుతించి
ఇందు ధరాదులె దెలియ లేరు నిను కై మందు డగు నితడు నిను దెలియు టెట్లు!
అనుచు విడిపించ నత డవమానము కై నను పురములోన జొరలేక వారిని
తన పరాక్రమమునను జయించి యే కై పున జేరెద నంచును వెలియె నుండె
పురసమీపమున నతడు బోరంగ కై తరుణీమణి రుక్మిణిని రాముండు

-: సహోదరుని భంగమునకు ఖిన్నయగు రుక్మిణీదేవిని బలభద్రుం డూరార్చుట :-

సరళమతి యగుచు యన్న కవమాన కై పరము హరి గూర్చుటను ఖిన్నమందె
వని చేరి యమ్మ! వనజాక్షు డిట్టు కై ఘనత బాపె రుక్మిని నా దలంచి
మనమున కృష్ణుని నెగ్గు గనకమ్మ! కై విను కర్మఫలము సర్వజీవులను
దవిలించును పూజ్యావమానములు కై భువి సంప్రదాయ మైన మేల్కొడు
లీ సుఖదుఃఖము లర్థవిభవములు కై యువిద! లేమి యాయాస మందుటలు
యెప్పుడు దప్పరు వారి సంచితము కై లొప్పరికించిన మనము కర్తలమ!
తప్పదు హర విధి ప్రభృతి సురేశుల కై కప్పుడప్పుడును బొంచుగొన్ని యుండు
చంపదగిన దోషము బంధువులును కై నింపు జడ గూర్చి రేనియు వారిని
చంపదగదు దోషంబు పెద్దయగు కై చంపకగంధీ! యల వారు మృత్యులైనా!
వారి పాపముల వారికే బోలియుగ కై నేరు శక్తు లుండురు? రాజన్యా!
ధారుణీపతుల ధర్మంబు లందు కై కూరిమి శౌర్యము యుద్ధవిషయముల
మీరుదు లొక్కనిధి కొలదిని నెరుగరు కై సారసాక్షిరో! ధన ధాన్య భూము
లను నారి పత్తమాయున మమతలను కై వనజ జనత బంధుల సంబంధము

లను మరల్చుచు లోక విదితంబు § లనుభవ సిద్ధము మన వంశములను
మును పెద్ద లంద రీక్రమము గనిరి § వనిత దైవమాయను దాట వశమె!
విను మోహసిద్ధ విధముల ఘనతను § దను నభిమానము గొని మనంబునను
దలపబో రీశ్వరుని నాత్మరూపి § జల ఘటాదులను భాను శశి గగన
ములు పెక్కు దెరగులను గదలునట్లు § అల తనువులందు నాత్మ యొకడయ్యు
గన ద్రవ్య ప్రాణ గుణాత్మకమ్ముల § ననువు ప్రకృతిపరమున నేకమగుచు
గను సంసృతి జిక్కులల దా మునిగి § గనరు నిశ్చయమునగు తత్త్వహితను
ఇనుడు తటనము నందిన తేజము § నను దృష్టినందు రూపమ్ముల చా
లున నాత్మ నొకట ఇన్నియు వెలుగును § గనగ గూర్పు నెడబాటు లాత్మనకు
గలుగ బోవమ్మ! యది వినిపింతును § జలజవైరికే క్షీణము గలుగదు
లలనరో! యతని కళలకు గలవవి § ఇలను సర్వజాతములకు నవస
లమరు నో యమ్మ! జననాదు లవియు § భ్రమలు సుమ్ము! ఈ లోకసంగతులు
సమమతి నెరిగిన స్వప్నసంగతులు § భ్రమ వాయ జ్ఞాన మలవడ గన్నను
భ్రమ జారు దాన అవిద్యమరుగున § విమలతయె వెలయు శుభము నేకూరు
కమలవదన! సుజ్ఞానకలితవగు § సుమనస వంద్యవు! నే జెప్పనేల?
యన నా దేవియు మనమున చింతను § గొనక మోదమున వదనరుచి తెలిపి
విను జననాథా! రాజీవాక్షుడు § జననాథ వీరవర్గముల నటుల మునుకొనె విజయము
మునుకొనె విజయము తన పురంబునకు § వనజాలయ కళ విలసిత రుక్మిణి
గొని తెచ్చి జనని చరణముల మ్రొక్కి § వనిత నట నుంచె బంధువు లలరగ

## —: శ్రీకృష్ణుండు రుక్మిణీదేవిని బెండ్లి యాడుట :—

ద్వారక నలంకరించిరి శోభన § వారమును ముందు గాని నెమ్మితిని
సార రత్న తోరణ విరాజితము § ద్వారాంగణముల వారిచందన క
ర్పూర పంక సలిలమ్ముల పొందిక § చారుతర రంగవల్లుల సంగతి
పరశితర ధూపముల మణిదీపము § లిర వందించియు సర్వ భవనముల
వరయ చిత్రితర వర్ణములసొంపు § గురియ సిద్ధమున కదళికాది తరు
శోభితము గూర్చు తలము లన్నిటను § వే భరితంబులు సర్వవస్తువులు
వే భద్రమతిని గూర్చి బంధువుల § నాభీరజనుల నందాదులను
కురు సృంజయ యదు విదర్భ కుంతీ § నరపతు లాదిక సర్వ మానులను
వరుసల హిత పరివార మండలిని § పరమ సౌహార్ద్రభావమున బిలువ
నంప కానుకల పెంపునను జేర § నిలింప చయమ్ములు సంతసింపగ

ముంపిరి గొను నటు మంగళ మ్రోతల § పెంపుల సందడి నృత్యముల జెలగ
దేవ భూదేవు లర్చనల దిరుగ § దేవకి యశోదలాదిగను సుదతు
లావనజాక్షుని హర్ష దృష్టి గొని § గేవలానంద బాష్ప నయనలై
నోలి సేసలను జల్లు దీపింప § వాలాయంబున దివ్య సుమవృష్టి
చాలున పెండ్లాడెను శ్రీకృష్ణుడు § పాలిత విధులను బ్రాహ్మణాశీస్సు
లను శ్రీ రుక్మిణి శ్రీ లలనేశుడు § వనిజ నిలయయౌ యిందిరారమణి
గని వరించు శ్రియ కరము గ్రహించెను § ఘనత చెన్నొందె కల్యాణ సరణి
విందుల నందర పొందొంద కూర్చి § చందనాది సత్కార్య పరంపర
డెందమున రుక్మిణిం జెంద దలప § నందనందనుని వరునిగ నందెను
ముందు నోముఫల మందె దంపతుల § నిందునని యెల్లను వారిదీవె
నల నించి తాము నిలయముల జేరి § జలజనాభు గీర్తించుచు నుండిరి
రాజవరా ! యీ వైభవచరిత్ర § రాజి గొని వినిన వారి శుభంబులు
భూజన సమ్మతమైన సౌఖ్యములు § పూజనీయముగ గని పురుషార్థము
లును గండ్రు భాగ్యగరిమ మిగు లొప్ప § గనెదరు ముక్తిని సత్య మిందునను
నిను వినిపించితి విను మవల చరిత్ర § లను మోదమతిని నే జెప్పుచుందు.



శ్రీ గణేశ శారదా గురుభ్యో నమః

# శ్రీమదాంధ్రగేయ మహాభాగవతము.

## దశమస్కంధము — ( ఉత్తరభాగము )



సత్యధర్మ! జ్ఞానవిలసితా! ǂ శ్రీ సత్యభామ హృదయగృహీతా!
శ్రీసమేత! శుభదాత! సురనేత! ǂ వాసవపూజిత! నాగధీశనుత!
శ్రీవత్సవక్ష! కౌస్తుభమణిధర! ǂ పావన! మహానుభావ? పరమాత్మ!
దేవవందితా! దివ్యభూషణా! ǂ కేవలానంద! నిర్భర! భవ! హరి!
వీరశేఖరా! కూర్మరవిదారా! ǂ ధారుణీపుత్రీ మానస చకోర!
సారసాహితా! రావణభంజన! ǂ మారకోటిసుందర! శ్రీరామా!

యనుచు శ్రీహరిని మనమున నుతించి ǂ వినమితశీర్షుండై వ్యాసతనయు
ఘనుని ప్రజ్ఞానమూర్తిని శుకుని ǂ గని యడిగె నిట్లు వినగ శ్రీశు కథ
లెన్ని విన్న నాకున్న తమి మిన్న ǂ వన్నె కెక్కు మునిసన్నుత! సిద్ధుని
వెన్నుని చెన్నును సన్నుల నందిన ǂ వన్ని విలసనములను లీల లెన్న
విన వేగ మంద పదిలము గంటిని ǂ వినవె మౌనివర! నీ వాచామృత
మును జుఱ్ఱుచుంటి నఱ్ఱాన నిదే ǂ నను బిఱ్ఱుకుక్షి గనె నఱ్ఱనగుము
మిఱ్ఱంద నింక పాపభయంబుల ǂ గిఱ్ఱున నెఱ్ఱన నాపట్టు గనవు
గెఱ్ఱలోన మోదంబు దరి నిలుచు ǂ బుఱ్ఱగను నెటులో పూర్వపు దుర్దశ
నగధరుని కృష్ణు నామకీర్తనము ǂ వగ బాపి ముక్తి భోగ మందించు
జగి దగినదైన యా హరి పెండిలి ǂ తగవు నెఱింగించి తవల వినిపింపు
మన పరీక్షితుని తన దయాదృష్టి ǂ వినుమని వనజాక్షునకు తనయుండు
మును శూలికంటి మంట మనసిజుడు ǂ తనువు మారి యిట జనన దశ గనియె
ముదమున నుమేశు గూర్చిన తపమున ǂ చదు రందినట్టి వరరేఖగునది
యుదధి మందిరుండైన విష్ణుండు ǂ సదయాంతరంగుడైన కృష్ణుండు
యుదధి పుత్రి శ్రీలక్ష్మి రుక్మిణియు ǂ గదిసి ప్రేమ మేళనమున భోగము
నంద వనజనయనుండు దనకళను ǂ మందయానయగు రుక్మిణి గర్భము
నందు జేర్ప గనె దాన రూపొంది ǂ యంద మించె ప్రద్యుమ్నుడు మదనుడు
[illegible]

నారసి రుక్మిణి పొదిగిట నుండిన ఽ నీరజనాభుని సుతు సుకుమారుని
క్రూరుడు మాయాజాల నిపుణుండు ఽ వీరుడు శంబరనామ దైత్యుండు
వైరిగా నెఱిగి జంప నెత్తుకొని ఽ బారె వడి శరధి లోన పసికూన
మీన కేతనుం డగుట వీని నా ఽ మీనములె దినని నే జంపనేల ?
దాను ఖడ్గమును చే బూననేల ? ఽ నే నిక నిర్భయుడను వీనివలన
జాలి దొలగె సుఖపాళి నాకిల్లు ఽ మేలు మేలనుచు బాలు నటు విసరి
పాలంబె నెలవు నెమ్మతి నుండెను ఽ బాలు నొక్క మీనము మ్రింగ దాని
జాలరులు బట్టి గనిరి గాలమున ఽ నోలి తము లలిని జూడ శంబరుని
కిచ్చిరి కానుక నత డాఝషంబు ఽ మెచ్చి వారి బహుమానమున బుచ్చి
హెచ్చు రుచి గూర్చి వండి తెండనియె ఽ నచ్చట తన బానసపు బాలకులు
కడుపు వ్రచ్చి రద్దాని నెడ గనుచు ఽ కడుపున చందురు బోలు బాలుండు
ఒడలు తేజరిల జీవముల నుంట ఽ నుడివి రచటి పెద్దకు రతి కా వని
తకు నంతలోన నారదమహర్షి ఽ తకిట తద్ధిమిత సారంగవరద !
భ్రుకుటి మాత్ర వికటాసుర దనుజాం ఽ తకుడవు నిర్మల ధర్మవిహారా !
సకలలోక మోహన దివ్యరూప ! ఽ సుకుమార ! సుందరాకార ! మార !
హరి ! పురుషోత్తమ ! తేజసంభూత ! ఽ వరమతని పూర్ణిమా సంఖ్య గణన
పరమందు నామ ప్రద్యుమ్నమూర్తి ఽ స రి గ మ ప ద ని స రి గ మ గ రి రి స ని
స ని ద ప మ గ రి స స ని ద ప ద ని సా ఽ యని సన్నుతించి కడువడి నచట
కిని జేర వచ్చి రతిని గని వినుము ఽ వనజనాభు తనయుడు నీకు భర్త
వినబాలుండగు నమ్మ మో యమ్మ ! ఽ యని జననవిధము శంబరు చర్యయు
వినిపించి నిచ్చ గనియె మునివరుడు ఽ వనిత శంబరుని నొప్పించి తాను
ఘనత పోషించె లలి నించి శిశువు ఽ ననుకూల వసతు లన్నిగూర్చుచును
తనకు పతియౌట దెలిసినది గాన ఽ మనుచుటయు భక్తి చాలు నిగుడించె
జనవరా ! యూహ మాయావతి యన ఽ తన పాతివ్రత్యము నతని యింట
వసతి నెల్లంగ వ్రతము తా బూనె ఽ కసటు విసువు గొనకుండ గౌరీశు
డసమాన దయను గూర్చిన వరమును ఽ వెసను నంబికాదేవి దీవనను
ననుకూల మంద నానాట నుండి ఽ విను మింత వరకు శంబరుని గొలిచి
యుండె బాలుండు వృద్ధినిగాంచి ఽ నిండు వయసు రా దండను దరిసెను
దండి మహంబున దనుజుం డందున ఽ నుండిన గుట్టును నరయుం దలందు
సుందరు లాతని మరుని యంద మన ఽ కొంద రా మరుం డతడు గాడు హరి
యందురు కొందరు యిట్టిట్లనకను ఽ తందర మతులను బొందియు నేరత

నంది యా మారు తీసిన వెలిగెను । సుందర రూపుని నిట్లనిరి వినుము
ఎవని పూ బాణములు శంభుమేన । దళించె సగము ప్రాణేశి గౌరి
ఎవని సుమశరము లలి వనజోద్భవు । గవయించె వాణి రూపవిలాసము ?
ఎవని యసమాన సుమతూపు గములు । దితిజ నేత వైరికనుల తా గుదిరె !
ఎవని పుష్పఖగముల గాధిసుతుం । డవలి తపముగా మేనకను లొగ్గె ?
ఎవని చివురాస్త్రముల మానివరుల । సవతు నంచుమరు కాముకుల వలపు !
ఘన తపము శంభునిది ధాత శీల । మును నింద్రిగెదిష్టతయు గాధిసుతు
డనువొంది నట్టి నిశ్చలయత్నము । గన ని వన్నియును ఎవనికృత్యముల
పెర బార గనెను ! సౌందర్యమందు । పరము డెవండో ? భువనము లన్నిట
కర మట్టిమరుడు యౌవనం బంది । వరఫలంబు తను గూర్చు భర్తయై
వరుస సర్వాంగ పూర్తి గనంబడ । తరుణీమణి రతి రతి నతని గలియ
సరస నిలుచు నొక పరిని ఒయ్యార । మరయ తనమీద వ్రాలు ముద్దుగొను
వడుపున చెక్కుల జేతులను జేర్చి । దడవుచు నధరము చివుకు నందించు
నిండు ప్రేమతను నిండ కౌగిలిని । నందు జేర్చుకొను నండజాక్షి యన
గండు నురంబులు రెండు నొక్కటిగ । మెండుకొన తనదు వక్షమున కొప్పు
చుండ నందుగొను కొంగు జారించు । బెండు వడ జూచు కిలకిలను గూర్చు
జిలిబిలి పలుకుల గిలిగిలి గొనువును । లలి గొను దిలకించుటల చలనమతి
వలపు నిలిపి కనురెప్పల ప్రక్కల । కొలకు లందించి యలరు దోపంగ
కలిమి చెలియ సుతు చెలువు చెలువుడగు । యలరు విల్తుడవు నీ ప్రాణేశికి
వరము నిండ వరమందిన వరుడవు । సరస నీసరస రతిని సుఖించెద
నను ప్రక్కడాగు నంతన నిక్కను । గను నెదుర నిలుచు మరి దోపు కౌగి
లిని నాకు మారుడవు నిన్ను విడువ । నను మా కుమారు డిటు వశంబైన
ఏ కరణి వలపు మరతు రంగనలు । నీకు నేను భూషింపు పోషింపు
నీకొరకె గాదు నీ తల్లికొరకు । ఏ కరువు పాపు మింక బల్కడగు
నీకడ యౌవనరాగ మింపొందె । నాకు నీ భోగ రుచిగూర్చు వనిత
నేన తెలిసితివ కార్యము గొందును । నీ వర్మిలి నాపాల పాలింపు
మానినీ మోహనాకృతి కన్నులం । నా నవిన వికసింపు తామరలు
నీదగు ప్రలంబ బాహుల పొంకము । పాదున లలనల జిక్కించుకొనుట
కాదరంబు గొను చివురు వాలు ! గల । యోధ ! మారవిజయంబు నీపొందు
అని లజ్జ గొన్న దాని వడుపునను । వినయమున లజ్జ గొనని మనంబును
గన చేయు రతిని మాయావతిని । జననివలె దన్ను పోషించిన సతి

గని యాతండనె కామినీ ! నీవు ॥ యొనరున నాడిన వన్ని నర్మములు
వనిత నిజ మేమొ ? మాతవు గావా ॥ తనయు నిటు ప్రియునివలె జూతు వెట్లు !
నీవు ప్రఖ్యాతివృత్తి కీర్తి గని ॥ యీవిధిని ప్రీతి పరకాంతవలెను
నా వర్తింపు నందుచు నన్ను బొంద ॥ కేవల నీచత కొడిగట్టితి విటు
భావ వేద్యమును గాదు నీచర్య ॥ దాపక తెలుపుము దూరముందు మిక
ధర్మమేది ! నీయందున దురితవు ॥ కర్మ రంగారు చున్నట్టు దోచె
నర్మిలిని గూర్చు కింకను మానిని ॥ దుర్మతి వని శంబరునికి జెప్పుదు
నన నవ్వుగొనుచు నా మనోహరా ! ॥ నిను రామారమణీయు నావిభుని
గని మ్రొక్కి చెప్పెదను నిజము వినుమా ॥ నిను కడుపున గనె రుక్మిణీమాత !
వనజనయనుండు నీతండ్రి కృష్ణు ॥ డనఘ ! నీ జనన మాది యారైన
దినమున రాతిరి ఈ దనుజవరుడు ॥ తన మాయవారి జొనిపి నిన్ను గొని
వనధి బడ విసరె నీవు పగఱ వని ॥ ఘనమైన చేప యొకటి నిను మ్రింగ
దనుజుండు వండి తెమ్మనియె దాని ॥ కనుపించితి వట ఉదరంబు జీల్ప
ముని నారదుండు నాకు వినిపించి ॥ మనమున శోకము నాకు మాన్పించె
మునుపె వ్రతము గొనియుంటి నిచ్చటనె ॥ నను గౌరీశుని వరమె నిట జేర్చె
నని సర్వంబును విశదముగ జెప్పి ॥ దనుజు డితడు బహు కపటి మాయావి
నిను జనని పొదిగితిని చాపి తెచ్చె ॥ దునుము వీని నీ చేతనే జచ్చు
గాని వీ డెవరిచేత జయింపగ ॥ గాన డపజయము నుందున నెఱుగడు
నీ జనకు డాది విష్ణుడు తెలియును ॥ నీ జననియు శ్రీదేవియె సుమ్ము
వే జనించితివి నీవు కాముడవు ॥ యో జగద్వినుత ! నీసతిని రతిని
ఈ జగద్ద్రోహిసి జంపు విద్య ॥ యా జగద్భర్తయైన మహేశ్వరు
కృప నాయందన నున్నది గొనుమని ॥ యపుడె యుపదేశ మందించె నతని
విపుల సత్యమున యశరీరవాణి ॥ రిపుని బొలియింప తథ్యంబ యనియె
సతి సంతసింప వీరాకృతి గని ॥ యతి సాహసంబు దనకు నుప్పొంగ
మతి వృద్ధి నంద కవచమును దొడిగి ॥ యతివేల మందు భీతిని గొలిపెడు
ధనువు చేత గొని తీక్ష్ణతర శరము ॥ లను గైకొంచును తా దివిజ నుతుల
గొనుచు దనుజునికి మండిపడ బిలిచె ॥ వినుమ ! దురాత్మా ! శంబరాసురా !
నను జనని బాపి యంభోనిధినిక ॥ మునుగ రువ్వితివి రణజలధి నిన్ను
మునుగ దునిమెదెను పోరికి ఢీకొన ॥ గను మోరి ! యధమ ! రాక్షస ! యనగా
విని వా డౌరా చెడియె కార్యమని ॥ మనము దడబుట్ట పిడుగుల వడువున
నుడివెడు శతఘ్ని కృ ని బుడుతని ॥ యుద్ధమున వహించిన రాద్రికారుని

దుడుకున వడి గని లేచి డాసె నని ! బడగొట్టుదు వీ డెంత నా కనుచు
పదతాడిత పన్నగవిధమున ॥ యదువంశ తిలకు నా ప్రద్యుమ్నుని
కుదురు జెఱతు నని గద చేత గొనుచు ॥ నదయత నెదకును నాటిగని వైచె
తన గద నా వేట్లను దప్పించుక ॥ ఘనతరంపుగతి వానిని తనదగు
కినుక బిగువునను దనుజు లితరులును ॥ తనుభీతి గనుచు నుండ గొట్టగని
దనుజుడు తప్పుచు తన మాయ వన్ని ॥ వినువీధి కేగసి మయు డొసంగించిన
ఘనవిద్య పెంపు నను మాయ గుప్పి ॥ వనజనాభు సుతు నంప వర్షమున
మునుగ జేసి నొప్పించిన మాయను ॥ తనదగు మాయావారణ విద్యను
వినువాడు బెగడ శాంతిని మలపగ ॥ ననలునివలె తా మండుచు మఱియును
పొనుగు వడ భుజగ గుహ్యాకాములగు ॥ పెనుతెఱగుల భీకరముల వంచన
లను గూర్చ నొచ్చి ధీరతను నిల్చి ॥ తన నిజదీప్తిని వానిలో జూచి
వినువీధి దివ్య సంఘము లలరగ ॥ మనముల వగపును వదుకు దనంబును
మునుకొని దైత్యులు దెసల బారగను ॥ తన యొర తళతళ మెరయు ఖడ్గమును
కరమునను గొనియు నోరి చావు మని ॥ వర మణి కిరీట కుండల భూషిత
శిరమును ఖండించియు శంఖ మూదె ॥ సురలు సుమవృష్టి నతనిపై గురిసి
రరులు దిక్కులకు బారిరి నిలువక ॥ పరమ హర్షమున భార్య యంకమున
మంగళము గూర్చె ప్రియను కౌగిటను ॥ సింగారించెను గండ చుంబనత

## -: రతీదేవి ప్రద్యుమ్న సహితయై గగనమార్గమున ద్వారకకుఁ బోవుట :-

రం గంది విభుని గొని యత్త చెంత ॥ చెంగలింపు మన్నింపు గొన దలచి
రతి మాయావతి మగనితో గూడి ॥ యతుల మహిమ తా గుదు రంది యుంట
మతి హర్షంబున గగనమార్గమున ॥ నతి దీప్తి వెలయు ద్వారక దరిసెను
నగరోపరి భాగమున రానయ్యె ॥ నగరి జనులు తన వైభవము గనగ
నగల తనుకాంతులను నతిశయింపు ॥ సొగసు గల శతములను మించుచెలుల
దిలకించిరి యా సుందరమిథునము ॥ అలరు పైకొనగ బాగడి రావురుషు
జలద శ్యాముడు ప్రలంబబాహుడు ॥ విలసిత పూర్ణ చంద్ర వదనుండు
అలరు నీలాలకముల చొప్పందు ॥ అల దరహాసితంబును వెడద యురము
మిల మిల కాంతుల పంచబాణుండు ॥ కల కలత లణప వచ్చె నిట ననుచు
చెలువు గని చెలులు తలకొన గాంచి ॥ తలపున చాలున తెలుపుల వారను
గన నిలిచి హరియె యగునని కొందరు ॥ వనిత లిట్టి చిహ్నములు కొనికొన్న
మున హరికి లేవు కను డితడు పిన్న ॥ వనమాలి విష్ణుడైన కొడుకేమొ !

వనజనయను కళ లీలనికి గలవు ౯ ఘనుడెవండో ! దెలియుదము మన మనుచు
గుణములు గట్టి యా కోమలగాత్రుని ౯ భ్రమలు వాయగను జాత మనుచు యా
సమయ మందుచును నాశ్చర్యంబున ౯ క్రమమంద మరియు దిలకించి రందు
అన్నలు కొందరు క్రిన్నన రుక్మిణి ౯ కన్ని దెలుప తా మిన్న కుతుకమున
చెన్ను శ్రీ గన్నులను గాంచి ౯ చన్ను లున్నతి చేపును గొన పాలు జల్ల
వెన్నుని తేజము తా గను గుణసం ౯ పన్ను డీకుమారుండు నా కొడుకు
కైవడి జాతుడు గా కని కాంచియు ౯ ఈ వనజేక్షణు నే భామ గనెనో !
లావణ్యాంగము గల వీని మాత ౯ యే వనితభాగ్య మిది యందియున్నో !
యే నోము ఫలంబున వీని గనెనో ? ౯ యే నాయకుండు వీనికి జనకుడో !
ఆనాట నిట్టి వాని నే గంటి ౯ ఏనాళ్ళు దాటె మరునటి దినమున
సూతికాగృహము లోన పొదిగిటను ౯ నే తటస్థమున బాలు నుంచికొని
హేతు వట్లుండ నేమరి నిద్రను ౯ నూతగొని యుండ నారాత్రియుండె
బాలుం డంతర్థాన మందె నే ౯ పాలసుండు నను వాని బాపెనో !
జాలి చాల నా మనము కలంగెడు ౯ నా లలిపుత్రుని నా లలితగాత్రు
తలచిన తలపున జల జల కన్ని ౯ రాలికెడి ఎచ్చట నిలిచెనో ? సుతుండు
తెలియరాదు మాకది యెవ్వరిచే ౯ చెలియ ! నేటి కాతడు నాచెంగట
మెలగుచుండినను యీ యలంకృతిని ౯ వెలసి నన్ను నలరించు మాత నని
యల భాగ్యగరిమ నను జెందు టెట్లు ౯ కొలది మతి దలప నాధుని రూపము
కలిమి సర్వాంగముల రేఖలన్ని ౯ జలజ నయను లక్ష్మములె చూడదగె
వలరు నిండె నా మనము నేత్రముల ౯ కొలుకుల కడలను హర్ష బాష్పముల
తిలకింప నివే ధార లమితములు ౯ పులక లెత్తె మోదమున తనువెల్ల
గదలె నా యెడమ భుజము కన్నునొస ౯ లదిగో మరి పాలు పాలిండ్ల నుబికె
సదయు డగుచు హరి యొకొక్కపుడు బలుకు ౯ ముదిత నీకొడుకు కోడలిని గొనుచు
గదియువచ్చు నని నవ్వు నను జూచి ౯ మది మంతు దాని వెలి జెప్ప నెవరి
విదిత మెందుకని సవతులు దానను ౯ ఎదకు నూటిగొన నాడుదు రంచని
సఖులారా ! యీతని గాంచ నన్ని ౯ ముఖముల గుర్తుల నా కొడుకే యని
నిఖిల సంగతుల నేన వచింతున ? ౯ యఖిలమును వారలే దెలుపుదురో !
నామాట సవతు లెత్తివేసెదరో ! ౯ నీ మర్మమేమొ ! హరి రాయగుణా !
నోచెండి నోముల గౌరిదయ యెట్లా ౯ ఏమొ నాభాగ్య ! మాదేవిదా కను
మాటలేల యీ పూట వారివలని ౯ ఏ టుండువో ! తేటపుగాదె
[illegible] ! ౯ చోటుండె నెవటా ఆటపాట లల

వాటు పొం దందు వాట మేముల్లో ✽ ఏటి కిట వచ్చినారని యడిగిన
దీటందునట్టి కార్య ఘటనయే ✽ ధాటి యమరునో! యనునంతలోన
వారిజ నయనుడు దేవకీదేవి ✽ సారవిజ్ఞాని వసుదేవుండును
వీరి రాక విని మోదంబు సెలగ ✽ దారి రట హర్ష మందె రుక్మిణియు
నారదుం డంత గగన మార్గమున ✽ ధీరుడై హరిని కీర్తనను గూర్చి
జేర సామోద పూజితుండగుచు ✽ మేర గని యెల్ల వారి నచ్చోట
చిరునవ్వున రతి తనుగని మ్రొక్కిన ✽ పరమ కౌతుకము తా మది నించియు
హరిని గాంచి తూా నీరజేక్షణా! ✽ యరయు మీలెరిగా బురుటింటిలోన
మటుమాయ మందినట్టి బాలుండ ✽ ఇట వచ్చె నీదు కొడుకె యెరుంగవ ?
నటన మాత్రధారివి నీవు గాన ✽ పటువంది చూచు చుంటి వీ లీల
అనుచు నందటు విన చెప్పె వీణా ✽ స్వన మేళనంపు కంఠధ్వనిచే
మనములు పల్లవముల నాకృతి గన ✽ ఘను డీ బాలుడు ప్రద్యుమ్న మూర్తి
హరికళ జనించె శంబరుని దునిమె ✽ సురల విజయ మోదములను గూర్చెను
ఘనతను గనుడీ ఈయమ రతి యగు ✽ వనిత పతివ్రత యనఘసచ్చరిత
పతిని పోషించె శౌర్యభూషితుని ✽ మతి మెచ్చ జేసె పూజ్యతను వెలసె
యతివినుతుడైన శ్రీహరి కోడలు ✽ సతీతిలక మా శ్రీ రుక్మిణినీ
అత్తా యనగల దిక నీ పుత్రుడి ✽ నెత్త మాడగల బొమ్మ సాత్వికము
సొత్తుగా తనకు మీ కొలువు ముక్తి ✽ నత్తు కొన జేరె చిత్తగింపు డన
మనము హర్ష పరవశమున కోడలి ✽ గని కౌగిలించి యత్త ముద్దు గొనె
జనులందరు మోదించి వారలను ✽ ఘనమైన ప్రేమ గూర్చి నుతించిరి
వర రత్నభూషణాంబర తతులను ✽ కర మలంకారమున గూరి మరల
పరిణయ వేడుక జరిపి విందుగొన ✽ హరియు మోదిల్లె తొల్లిటి చందము
నరవర! యీ చరితంబు విజయమును ✽ నరస నందించు పఠింతురెవ్వరు
వరదుడు కృష్ణుడు వారి కామ్యముల ✽ కరుణ జేకూర్చు నవ్వాల కథ విను

—: శ్రీకృష్ణుండు లోకాపవాదనివృత్తి కొఱకు శమంతకమణి దెచ్చుట :—

శ్రీసన్నిధానుడును పరమేశ్వరు ✽ డా సత్యభామను ప్రియురాలుగ
వాసవవైభవ సామ్రాజ్యపుకళ ✽ వాసి నిగుడ పెండ్లాడె తనమీద
దారినట్టి యపవాదము దొలంగ ✽ సారమైన నిష్కపట మానస ము
దార ధారుణాధీరతను మెఱసె ✽ మరి యుతెంబు శ్రీ రమణుం డంచెను
అన [illegible] హరి ✽ గనిన యపవాద [illegible]

తనయ ! సత్యపై హరి కూర్మి పెద్ద ఽ యని బల్క విని వమును లోకాళిని
వన శుకుడు మనుజపతిని పరీక్షిత్తు ఽ గని వచించె నిటు సత్రాజిత్తను
వతడు హరిమీద నొక నింద మోపి ఽ యతి విచారమును బొందించి నిజము
మతి నిర్మలతను తెలిసి యది మాప ఽ సుతను శమంతక మణి సహిత మొసగె
ఆ మణిని భాను వరమున నాతడు ఽ నేమంపు భక్తి మెప్పించి గొనియె
శ్రీ మహితం బా మణిరాజంబును ఽ దామ మధ్యమున జేర్చి కంఠమున
దాలిచి తపమును నిలిపి ఫలసిద్ధి ఽ మేలు గూర్చు తేజమున ద్వారకకు
కాలనడ గూర్చి రాక నెలవు గన ఽ నోలి తేజమున భాస్కరునివలెనె
మించి సంతసము బెంచిన వేగము ఽ నెంచి మార్గమున రా గాంచి పురిని
యంచితాహ్వా డీ యదువల్లభు న ఽ ర్చించ నేతెంచె నే మహనీయుడో ?
యంచు జను లతని గని కృష్ణు జేరి ఽ వంచనరహితా ! వనమాలి ! హరీ !
నారదసన్నుత ! నారాయణ ! యో ఽ సారసాక్ష ! దామోదర ! మాధవ !
శ్రీ రమేశ ! పరదైవమ ! గోవిం ఽ దా ! రాజముకుట ధారి నుతచరణ !
నీ రమణీయాకృతిని దర్శింప ఽ జేరి నీకరుణ వడసి ధన్యత్వ
మున నిన్ను మ్రొక్క గోరి సురేశులు ఽ మనమం దారసి ద్వారక జొత్తురు
విను మేము నిన్ను ప్రభువుగ వరించ ఽ గను భాగ్య కలిమి వారల పొగడుట
కును దగినారము హరిచరణ తులసి ఽ యును పవిత్రమనుటను మేము నట్ల
వనజనాభ ! యదె వచ్చె భానుడో ? ఽ గన హిమధాముడో ? బిడౌజుడేమో ?
వనజభవుం డొకో ? రుచిప్రచ్ఛన్నత ఽ ననుసరిణి దిక్కులన్నిట నెఱపుచు
మన పురము నూటి యీ రాక గనుము ఽ అన విన నవ్వుచు హరి వారి కనియె
మీ రింక మూఢతను దారలేర ? ఽ పీరాటోపము మాత్రమే గుఱిగ
అరయుం డతడు భానుండు గాడు ఽ ధీయుడు దారుడు గళ మణిధరుండు
వీరులార ! సత్రాజిత్తుగాడ ! ఽ సారతపంబున హరిచే గొను నది
తళ తళ మెఱయుచు వచ్చె వింతయే ! ఽ కళవళ మందకు డయ్యా ! యనుచుండ
తొలుకు లొలయు మణి కాంతుల నిలయముకనలుకు గనని మతి సుఖవు గని జేర
ఘను డాతడు మణి భాను రార్చనము ఽ గన జేసి దేవమందిరంబునను
దినదిన పూజలు నెల్ల నిలువు కొని ఽ యెనిమిది బారువల కనక మొసగు వస్త
వరతము దప్పక నా సిరిసంపద ఽ పరమున నాతడు ప్రఖ్యాతిని గని
నరవర ! యీమణి యేదేశంబున ఽ సురుచిని వెలుంగు ! పూజవందునో !
అరయ వాఘూమి యరిష్ట మందదు ఽ ధరణి సర్వశోభనముల మించును
మారీ దుర్భిక్షము లందు జోరవు ఽ సార సౌఖ్యములు సేరు కొల్ల లుగ

యో రాజేంద్రా! యాదవేంద్రునకు § నారాధనంబుగా నీయు మనుచు
కూరిమిని బెంచి నట్టి మతి నడిగె § వారిజాక్షు డాసత్రాజిత్తును
జేర దలం డా యుదారఘనతను § మేర పెద్ద గన దండున నిచ్చెయు
హరి యే మనందు ప్రసీన నాముడు § నరవర! సత్రాజిత్తుతమ్ముడా
తరణిదత్తమగు నా వరమణిశిర § గరముప్రీతి కంఠమున దాల్చి దా
మురిపెంబు వెలయ వేటాడ వనము § జొరబారి దీప్తి మెఱయ విహరింప
హరి యొకటి యతని గడిసి జంపియును § కరము తేజరిలు నామణిని గొంచు
కాననమధ్యము లోన దిరుగాడ § దాని జంపి యా మణిని తా గొనియె.
యో నరనాథా! భల్లూకపతియు § ధ్యానసమర్పన శ్రీరామచంద్రు
మానసమున తిరమంద గనినట్టి § మానిత గుణుండు జాంబవంతుండు
దా నుండు గుహాంతరమున జొచ్చియు § తాను గన్నట్టి పుత్రి జాంబవతి
కిడి కేళికందుకముగా నొసగెను § వినుమిట సత్రాజితు తన తమ్ముని
గనక దుఃఖంచి మణి దాల్చి వాడు § వనిలోన దిరుగ న్యాయమును మప్పి
వనజ నయనుండు మణి కాశించియు § తన యనుజు జంపి తాను దొంగిలియె.
ఇదియు మర్యాద? దయచాలిదేవ? § యదువల్లభునకు మదిని కపటంబు
గవియుట లోకమునందు విదితంబు § ముదము గొనుట పెత్తనము సిక్కునా!
యనుట నాలించె నా వనమాలియు § గనెను విచారము నే నే వ్రణంబు
గనను నింద నను బొందె నే విధిని § ననుసరంబు నను నపకీర్తి నణతు
ననుచు యోచించి బంధులచే విని § వనమున ప్రసేను మృతిబొందు టాది
విని వెంటనె పయనించి యరణ్యము § గని జాడ నరిగి ప్రసేను తురగము
పడియున్న చోటు వాని జంపియును § వడి బరచి సింహంబు పోబడియు
నడుగుల జాడల దాని మడియించి § వడువు గొన్న భల్లూకపు పదంబు
లను గుర్తు గాంచి గుహను వీక్షించి § మన మొక భంగిని కృతార్థమును గన
తన తోడివారి గుహాముఖంబున § దన రాక గోరుచును నిలువ జెప్పి
ఘనమైన సాహసమున లో జొచ్చి § యొనరందె పడచా యంధకారంబు
మనమునకు భయము గదియ నాచీక § టిన కోటగాగ నొప్పదు నందున
దూరము కొలంది మించ నడచియును § నారసె మినుకును జాడగా నేగి
ధీరతను బెంచి పొంచి దిలకించి § పార మొందు కళ కమంత మణిసిరి
అది యొక చక్కని బాల కాటకై § మది ముదము దోప కందుకము బోలి
కుదురున దారము తోడ వ్రేలాడు § యద నందించిన చాతుర్యమ్ముతో
గని దానిని హరియింప చరణముల § విన నలికిడి గని నీని తెల్లనవు [illegible]

దన యత్నమునను జోడంద నడచి § తన కరంబు మణిపై జాప నీడ
నటు గనిపించెనో గుండె ఝల్లనగ § నటనున్న దాసి మొర పెద్దగ నిడ
చటుల మతి గాంచ భల్లూకపతి § పటుతర బలంబునను శీఘ్ర మంద
నట జేరి హరిని గని దొంగ యనుచు § పటు ముష్టి బొడిచె నత డటు నొవ్వగ
దిట వంది రిపువు రనికి సిద్ధముగ § కటము లదర దంతముల పటపటల
నిటలముల భ్రుకుటి ముడుల తీక్షణము § లటము నించి భుజముల నప్పళించి
గుప్పున చప్పట్లల తొడలగూర్చి § గొప్పదు భీకర గాత్రముల శౌర్య
ముప్పొంగ కేక లిడుచు రణమునను § నొప్పి రట వారు భయమును దాకొన
హరి యిత డన డా భల్లూకపతియు § సరసు డిత డనదు శ్రీకృష్ణుండును
ధరణి ప్రాకృతుల పోడొకం డనగ § నరయ నిది యెలుగు బంటొకటి యంచు
వరుస గొని లొక్క మాంసపు తునకకు § తరమంది పోరు డేగల వడువున
కరి కరి హరి హరి మార్కొన్న యట్లు § గిరి గిరు లొండొక వడి డీకొన్నటు
ధరణి గ్రక్కదని యుల ధూళి రేగ § పరిపరి విధముల బొరలుటల గూరి
గరుడుల వడువున మీట దారసిలి § తరువుల శిలలను గిరి శిఖరంబుల
పరువడి గ్రహించి యొక రొకరు విసరి § కర మవి తుటుముగ నట్టహాసమున
అడిదము లాదిగ నన్ని చూర్ణముగ § పిడుగుల వడువున పిడికిటి పోటుల
బొడిచెడు కడకల నార్భటింపుచును § విడువరు పౌరుషములు కోపంబులు
జెడిదములు మగతనములు బిరు తివగ § యొడళులు బడలిక దోపగా పీక
నడుగులు ముందుకె సాగించి యిట్లు § నడుల సాగింప గడచె దినంబులు
ఇరువది యొనిమిది గణన కుదురంద § సరసిజనాభుడు పై చెయి గైకొని
వరుస ముష్టిహతులను జాంబవంతు § డురుదుగ దలంప పిండివలె తన్ను
గదిసి నొప్పింప రోషావ సందుచు § అదిర నరమాత్రు డనుకొంటి నితని
మొదట కొద్దుటల్లో మది ఖరయ నేను § చెదర దిప్పటికి నను మించె నితడు
కేవల విష్ణుడు పరమాత్మ హరియె § భావమున దెలియగంటి నన్నిటికి
అవరించి ప్రార్థింప నిట బుట్టె § దేవు డితడు న న్నేలిన దేవుడు
శ్రీరామమూర్తి శ్రీకృష్ణమూర్తి § సారస హిత వంశుం డా నాటను
దారుణరమూర్తి యదువంశమందు § ధీరత క్షాత్రుల దునుమ బుట్టె నా
నను బాలింపగ కేర భాగ్యముగ § ననుచు లో నెంచి కరములు మొగిడ్చి
నిను నాదేవుని వేదవన్నుతుని § వనజ హితవంశు రామచంద్రునిగ
దెలిసితి జ్ఞానహీనుడ పరాజితుని § తలపనింతి బంధించె సేతువును
అల దానవ కుల నేత దశకంఠు § [illegible] జేసి సురలకును [illegible]

నిజ మెరిగి తన్ను శరణం బందిన | భజింపదగు గుణి విభీషుని దయ
విజయ ధ్వజమును లంక నిలిపినటు | అజకల్ప పరిమితిని వెలయ నధిపు
జేసి నాస్వామి వ న్నేలినాడు | దాసుడ నతనికి అతడే నీవు
దోసిలి యొగ్గితి బ్రోవు మో దేవ ! | దోసము వమ్ముగ దీవింపుము నను
ననుచు మ్రొక్కి నను వడి కౌగిలించి | తనువు నిమిరి యలసతను మాపియును
వినుము భల్లుకేశ్వర ! యపవాదము | నను బాపి కొనగ మణికై వచ్చితి
విను నావర భక్తుని జూడ నొప్పె | నను పంపింపుము మణి నిచ్చి నాకు
పనులు గల వన్న హర్షించి మణిని | తనసుత జాంబవతిని పరిణయమును
గొన నిచ్చి మ్రొక్కె పురము చేరుమని | యనుమతించె హరియును మోద మంది
వెలిని గుహచెంత పదిరెండు దినము | లల పరివారము గాచి యుండియును
నిలువ నేల ? యిట హరియే వచ్చును | నలరున మనలను నాదరించునని
ఖలుల ద్రోలియింప బుట్టిన హరికే | జెలుగు అడ్డవని తలపుల నిలుపుచు
ద్వారకను జేరి హరి తెర గందర | కారయ వచింప యదువీరు లెల్ల
జేరి బంధువులు వసుదేవుండును | మీరిన చింతల దేవకి రుక్మిణి
వారి పరివార మందరు భక్తిని | పార మంద గని దుర్గాదేవిని
పూజించి యంబికాధీశు మ్రొక్కి | రోజ సెల్లంగ మరి యా దేవిని
రాజితంపు మతి గూర్చి యిట్లనుచు | ఓ జగన్మాత ! భద్రసంధాత !
హరి బిలమునుండి నిర్గతుడు వగుచు | వరుస శీఘ్రమున పురము జేరంగ
వర మొసగు మమ్మ ! ఏప్రొద్దు నిన్ను | తరమంది జాతరల గూర్తు మనుచు
వినుతి సలుపగా నా పరమేశ్వరి | ఘనుడు కృష్ణుండు బాలామణిగా
గనగ శమంతక మణినిం గొనుచును | మనము రంజిల్ల వచ్చు నింతటిలో
నని యశరీరత బలుక దొడంగిరి | విను మట దామోదరుడు గుహ వెడలి
ఘనత వెలయగను కన్యారత్నము | ననుపమాన సౌందర్యత నొప్పగ
తన యపవాదము దొలగి జనవినుతి | గన మూలమైన శమంత రత్నము
తోడు గొనుచు వడి ద్వారక జేరెను | వాడిన పైరుల తోరపు వర్షము
కూడ వంది నటు మోదములు సెంగ | వేడుకలను దివ్యులను ఉత్సవముల
నోచిన పుణ్యము కొలదుల జరిపిరి | వే చిత్రతరము గన పురి నలంక
రించి నావిధిని జాంబవతి పెండ్లి | మించిన విభవము దీప్తి రమణీయ
తను గూర్చి జరిపి రందు శ్రీహరి | తన యత్నంబున మణిని తే దగిన
ఘనశౌర్య పాటితవు విజయంబును | మునిజన మధ్యము నందున పచించి
యనఘు ! మణి గొనుము నీవని గౌరవ | మున సత్రాజితునకు విచ్చి [illegible]

వినయమును దోప మాటాడి పంపె § జను లెల్ల బొగడి రా వనజాక్షుని
తన లోన వగచె సత్రాజిత్తుడు § ఘనుని శ్రీకృష్ణు మహనీయుత నే
వినియు గనియు పాపమును మోపితిని § యనఘు! యని బిలిచె నే ననఘుడనే?
మునుకొని కల్మష మతినై తిట్టితి § యనఘుడ నౌటకు నా యత్నమేమి!
పాపరహితునకు పాపము గూర్చుట § మోపు పాపమగు నా వనజాక్షుడు
నాము జపము నన పాపము మలపెడు § స్వామిని పాపము లాడు నా జన్మ
యే మిట సార్థక మగు మణి యేలను § యీ మణి నతనికె యిత్తు నరణముగ
ఆ మహనీయుని భామగా గూర్తు § నామతి పవిత్రతమ గాంతు నందు
నీమెయి నపవాదము దోపినట్టి § యా మానపరిమితపు పాపంబును
బోకార్ప నగును మోదము సంధిలు § ఈ కరణి పెద్ద లందరికి హితము
ఆ కంజనేత్రు బాంధవ మొప్పును § నా కన్నపుత్రి యాతనికే దగును
చేకొను నింతిగ సత్యభామనుకే § యీ కలకంఠియు మెచ్చు నాతనినె
నా కింతకన్న మార్గము మంచిది § ప్రాకిందబోదు చేకూరు ముదము
అని కృష్ణు విందునకు బిలిచి పూజ § గొను మని మణులను జాంబవంతు వలె
తనయామణియును భాను దత్తమణి § గన నేకంబున నర్పించి మొక్కె
వనజాక్షు డలరె బంధువు లొప్పిరి § వనిత సత్యభామయు తనభాగ్యము
మనమున దలంచె తొలిజన్మ నోము § నను పతిగ గృష్ణు జెందు ఫల మనుచు
జనుల కానందముగ సత్యభామ § నన నవ్వాలయుగ వనజ నయనుండు
వదన జితసోము గుణగణధాము § మదిని పతిభక్తి నేమరని వనిత
హృదయమున దయయు నొప్పారు నదియు § పదిలత శీలము నంద గుదు రందు
నదియు నొక్క సుముహూర్తమందు నా § యదువంశ తిలకు డైన వసుదేవు
తనయుడు పరిణయ మందె శాస్త్రవిధి § ఘనత గన తాను సత్రాజిత్తును
మనమున హర్షము చెలగ పూజించె § వినుము నా మనవి మామవు నైతివి
నను ఘనత నెంచి తనయ నొసగితివి § వనితామణియే నాకు భూషణము
ఇనుడు నీకిచ్చి నట్టి యీ మణిని § గొనుము నీవె మనమున భేద మెన్న
నను వున్న శుభము నీయందొప్పును § మొనయున దీనిని నీవు పూజింపు
ధన మవసరమున నిను వేడుకొందు § నని యొప్పగించె మణిని యాతనికె
వినుము జనపతీ! పాండునందనులు § కన లక్కయింట దన యత్త కుంతి
యతిమగా నాపదను గాంచి రనుచు § మతి వెతను నించు వార్తలను వినియు
యతి వినుతుండైన శ్రీకృష్ణు డదను § వితత సత్యమును విజ్ఞానదృష్టి
ప్రతిభయును దెలిసి యుండు వాడు నయ్యు § ప్రకటిత ప్రపంచ నటన గన్పట్టు

సకల జనుల వలె దాను దోతెంచు ఽ సకలధర్మజ్ఞు డా హస్తిపురము
జేర నట బంధు జనుల శోకమును ఽ బార సంభాషణముల ననునయంబు
దార శుభంబుల గూర్చ బయలించి ఽ జేరి భీష్మాది పెద్దలను గాంచి
చదురు గాని మరియు భీష్మ ద్రోణ కృప ఽ విదుర గాంధారి ధృతరాష్ట్రుల
చింతలు కంతలు గానగ వేదాంత ఽ శాంతవచనముల వారి బోధించి
మంతనముల దైవమును నుతించిన ఽ సంతసమునె నెలకొందు రావంత
చింత గానకుండు దైవయోగమున ఽ కుంతీపుత్రులు తల్లియు తమ్ముగ
చెంత నండ గల దది ధర్మబలము ఽ వంతు గానెనేని దైవము తోడగు
కొంత వినికి వా రందు దప్పి రని ఽ యెంతు నది నేను సిద్ధబలంబున
గాంతును గద యొక్కింత లోపలనె ఽ ఇంత మోదంబు కుమురు మన కనుచు
కొన్నిదినము లట నుండె విదురుచే ఽ సన్నుతి నందుచు భీష్మానుమతిని
వెన్నుడు వసతిని లోపంబు గనక ఽ మిన్న సపర్యలు కురు కులుదు గొల్వ
అన్న యయిన బలభద్రుందు తోడు ఽ గన్నవాడగుట భద్రగు డెందమున
మన్నిడా! విను మా ద్వారకలో ఽ వెన్ను డిటు రాగ నొక్క సంఘటన

-: శతధన్వుడు సత్రాజిత్తుని జంపి మణి నపహరించుట :-

కును పాల్పడియెను ఏది యనెదవో ఽ కన నక్రూరుడు కృతవర్మయును తా
మనమున కపటముపాలుం గొంచును ఽ గనిరి శతధన్వుని కలుషమతిని
మంతన మందిరి మాట లవి వినుము ఽ అంత పనికొనియె సత్రాజిత్తుడు
వింతగ నాతడు మనల బిలువకును ఽ ఇంతిగా నిచ్చె కృష్ణమూర్తికి
ఇంతవరకు మనయెదుర దూషించు ఽ చింతలోన మనకిత్తుననె కన్య
నతని జెండించె మణికైన నీడు ఽ మతిమంతుం డెట్టు పాపచిత్తుండు
బ్రతుకు చెఱుప నగు సుతకు బదులుగా ఽ నతుల మణికైన నీవు గొనం దగు
మాకు సమ్మతము నీకు మాతోడు ఽ పోకడ బుచ్చుము వాని జీవనము
నీకేమి భయము లేదు పొమ్మన్న ఽ నా కరణి నిద్ర గొనియున్న వాని
చీకటిని దొంగ తా నగుచు దరిసి ఽ వే కరఖడ్గమున జా దునిమి మణిని
దా గొనుచు నింట జేరె క్రూరమతి ఽ దోగి చీకటియు నాతడు చచ్చుట
యా గరిష్ఠ మణి హరింప బడుటయు ఽ నా గజగామిని సత్యభామ కని
మాతలు గోడున నేడ్వ తా నేడ్చి ఽ యాతని దైలద్రోణి బెట్టించి
యాతురమున దా నేగ గజపురం ఽ బా తరుణము గని కార్య మే మనుచు
బల రామ కేశవు లాహా నడిగిన ఽ రామ యారాటమునను బొర్లాడుచు

ఆ మణికోటికై నాతండి జంపె § భీమాకారత శతధన్వు డిల్లు
జేరి కటికె గోవును బొడిగొన్నటు § వారలెల్ల రాపోవ ఖడ్గమున
మేరదప్పి యన్యాయము గూర్చి § వీరుని బోలెను వెలిగి చోరతను
భాను డొసంగిన మణి గొని యేగిన § నేను మీకు నావార్త దెలుపుటకు
గాన వచ్చితిని బాయని దుఃఖము § మానె పరిమితము నను ముట్టె గనక
నన వారు నీశ్వరులును దామైనను § మనుజభావమున కలవర మందుచు
వనిత నూరడించుచు నావెంటనె § ఘనకోపంబుల్ దీప్తములు గాగ
ద్వారకను జేరి శతధన్వు జంప § వీరవచనములు కేశవుం డాడ
ధీరతను విడిచి కృతవర్మ జేరి § మీకు నా ప్రాణభీతి దప్పింప
సాయ మగుం డని శతధన్వు డనియె § న్యాయ మెరుంగవు చాలు నీతోడు
నేయము భయదము హరికి జాలుదునె § నీ యగచాట్లను నను జుట్టుకొనగ
కూక లిడకు మిటు వారల శక్తియు § ఆ కంసుని జంపుటయు గాంచవె ?
నీకు వారి మహనీయత దెలియదె ! § పోకిరి తనమగు వారిని మార్కొన
భీకరమున మాగధుడు పదునేడు § పోకడ సమయము లందు మీదబడి
తాక లేక బలభద్రుని ధాటకు § నా కమలనయను కరుణకు దప్పను
ధీరుడవైతే మార్కొను లేదా § దారును పో యని కృతవర్మ యనగ
నా విని యలసిక బాసి యక్రూరు § డీవిధికి దోసు పడగ లడంచును
నీవు సహాయము చేయుటకుం దగు § నా విరోధులై రామకృష్ణు నీ
నెపంబునను నను వెదకుచు వత్తురు § ఉపకారము మించు నీ వన్న నతడు
రిపుహంతకు లని ఖ్యాతి గనువారి § రిపుల మన మగుట తప్పు నే నొప్ప
ఎవనిచేత జగములు పుట్టుచున్నవో ? § ఎవడు వాని పోషించి యడగించి
ఎవడు తన కుక్షిలోన దాపునో ! § ఎవడు బ్రహ్మేశ్వరులకును జిక్కడు
పూతనను జంపె? పురిటింటిలోన § యాత డేడేండ్ల నాడె గిరి నెత్తె
ఘాత లడచె కంసాది దుష్టుల వి § పాతకదూరుడు పరమాత్ము డతడు
భువనకూటస్థు డద్భుతకర్ముడు § పవలు రేయి వెలిగెడు వారు కనులు
పవనరూప మన ననల ముఖుండగు § సవిత సావిత్రి యగునతడె చంద్ర
ములు నతడే సుమా ! నీ వనిత బోర § దలపగ నగ్నిని బడు శలభము వడి
బిలుకు మాడదవు శరణను మంతే § వెలి బారిపొమ్ము నే రాను నీతో
వలదు సఖ్య మనిపించె చాల్చాలు § పలువ విందున్న తలకు నను చుట్టు
పో పొమ్మని మణి నక్రూరున కిడి § కోపమున నతడు ప్రాపించు మనము
తో పెరంగకను పాపు దరి లేదు § యాపట్టు వదలి పోవుచ తురుకుట

నా కుచిత మనుచు తురగము నెక్కియు § వే కడిమి నేటుగా పిక గొనుచు
పారికె నూరామడల నగు దూరము § ఆ కమలాయను డగ్గరి తోకాడి
యా కఠినచిత్తు వెంబడంటి రా § వోడగు త్తుల నెల్ల నెఱుఁగుచు
గరుడకేతనము గాంగెడి రథంబు § గరుడ వేగమున నరు దెంచి నంత
తురగము డిగ్గియు నా శతధన్వుడు § ధరణి నడుగున వరుగ వెంబడించి
క్షితియందు కృష్ణుడు దానని వెంబడి § అతి గమనమొప్ప వచ్చి యాతని
స్మృతి దప్ప దంచు నుఱికిన దుర్మతి § పతంగసుతు పరవ మడి నెల నెదురగు
నీకు దారి యిదె యనుచు చక్రమును § నా కటికహృదయు శిరమును ద్రుంపగ
భీకరము దోప బంపినను మంట § లాకసము పిండ వాని కంఠంబు
దునిమి హరి చేరె దివ్యాయుధ మది § వనజాక్షు డంత వెదకె వాని మణి
గనబడని చంద మన్నకు జెప్పెను § మనము వీనివలనను మణి గలదని
వెనుకొంటిమి బారంగ సుదర్శన § మున వాని జంపితిమి వృథ మణికే
మిని నరసితి తనువెల్ల నన రాము § డనె వీడు మణిని పత్రాజిత్తును
పొరిగొని దొంగిలె తప్ప డాపనియె § కర మెవరియింట నెప్పుడ దాచెను
నరయుము ద్వారకనే మిథిలాపతి § కరుణ పడ సెవను నధ్యాత్మవిద్య
వై దేహుడు నను బహుమానించును § ఆ దైవభక్తు సాధుసమ్మతుని
నే దర్శింపగ నిచ్ఛగించితిని § కా దనకుము మరి పత్తు నన కృష్ణు
డన్న నట విడిచి మిన్నవేగమున § ద న్నెదురు చూచుచున్న బంధులను
విన్ననైన వదనమ్ముల కుందును § గన్నట్టి వారి సమ్ముల సత్యను
గని వాని జంపినట్టిసంగతిని § వినిపించి కినుక తగ్గించి వనిత
కును శాంతిగూర్చి తను సత్యభామ § వినుతి లో గొనుట యామెకు బ్రీతిగ
తన మామ కన్నిసంస్కార విధుల § ఘనత జరిపించి సుగతి గలిగించి
తన హృదయమ్మున మణి జాడ గనగ § వినయ నయ భయములను బ్రకటించెను
మనుజేశా ! వినుమా ! యక్రూరుండును § కృతవర్మయు శతధన్వు మరణ
మును విన్నంతనె ద్వారకను వదలి § యును కాశీక్షేత్రమును జేరి యట
తన చెంతనున్న మణి వలన ధనము § కనక రాశిచే పెక్కుయాగములు
మునులు భూసురులు జనలోకమంత § విను మనుచు వనుచు హరిప్రీతి జెంద
ఘనుడు పరమేశ్వరుడు వనజాక్షుడు § గన జగన్మయుడు తన్నేమి సేయ
గసిన నట్లగును నాకేల వగవ § తనువు ధనము మన మా దేవునకే
వినయ పుర్పింతు పని యాశగొనడు § మునుల బలిపించు దక్షిణ లిచ్చెను
మనము తుష్టి నందెదు దాశ జనుల § కును సర్వభూతములకు నన్నాదు

లను కృత్తినించు నన్ని దేశముల § ఘనమైన ఖ్యాతి నిండ నధ్వరము
లటు జేయుచుండె కటువును మనమున § తటమున గనండు కుటిలము నడంచె
చటులము గొనండు దిటవు హరిభక్తి § జటిల దీనజన పటుతరాశీస్సు
గనుచు కృష్ణ నెద నెవ్వడు నతి మాన § కనఘుడట నుండ వినుము ద్వారకను
గనవయె నరిష్టములు మానవులకు § చినుకులు పోటుక్కమన దా భూమిని
మనము పస దూల రోగము లడరెను § వనజనయనుడు ఘనుల బిలిపించి
మునులు మీ రరయ వలె నరిష్టముల § మనికి మలపంగ శాంతు లేవియో!
జనుల వెతలు నిండెను గాంచు డయ్యా! § మును కాలములను యిటుల నొక్కపుడు
గలుగు చుండు నని వినియుంటి మయ్యా! § వలను గన్నప్పు డెల్లను నా విని
జలదవర్ణ! విను మక్రూరుండే § నెలవు విడుచుటయె ఈ యరిష్టముల
కలతల చాలున జను లటు మనములను § నిలుకడలు గనని చింతల దనరిరి
అతడు ఘనుడు సద్గుణుడు నీ భక్తు § డత డధ్వరముల జేయుచు గంగా
పతి చెంత వారణాసి నెలకొనియె § నతని బిలిపింపు మిది మాన దోచు
అతని తండ్రియగు శ్వఫల్కు నాముడు § మతిమంతుడు ఘనతపస్వి శాంతి
యుతుండు నగుట విని కాశీభూపతి § మతి పరపి నిట్టి కాలము దేశము
వాన లేక జను లాతురు లరిష్ట § మాన భీతులుగ తా విచారించి
యా నయగుణాఢ్యు దోడ్తెచ్చి యతని § మాననీయ మణి నా తనయను నా
యతుల గుణధన్య గాందిని నాయను § యతివను వివాహమున గూర్చి నంత
మతులు చివురింప ముదమున జనములు § అతుల సౌఖ్యముల నెలవు గనరైరి
అత డట్టి మహాత్ముడె యక్రూరుడు § అతని నీవు మన్నించి రప్పింపు
నెపము నెన్నకుము నీ వెఱుంగుదువు § విపరీత మతులు మునులె గాంతు రొక
నపరిపాటి కాలమున మాధవా! § అపు డత డీపురి జేరునప్పుడే
ఇప్పటి పీడలు జనతతికి దప్పు § విపుల సుఖమ్ముల వెలయుదు రంచన
తగిన వారి పంపించి రప్పించి § తగు వైనమ్ముల మర్యాద గూర్చి
జగతిని వానలు గురిసె మోదమున § సాగ నందిరి సర్వులును నెమ్మదిగ
ఒకనాట కృష్ణు డక్రూరు బిల్చి § యకుటిలమతి దా నొట్టు బెట్టుకొని
సర్వజ్ఞుడ వని నను దలంచెదవు § యకలంక చిత్తుడవు విను దెలియుదు
విను శతధన్వుడు మరి నీ కిచ్చెను § ధనము సత్రాజితను గూర్చి యాశ
మనము సంతోషమును నింపితివా § మునుల వినుతి కెక్కితివి భక్తి
నను గూర్తె వన్న! మణి నివ్వు మన్న! § తనయు లామణి వినెన్నికల పాలు
లను గొందు రన్న! ఇది మేలేగా § కినుక లేదు నీపైన నాయన్న!

జనకుడు దుర్మరణంబు జెందుటను ఽ తనయులు లేని కతమ్మున తనయులె
ఘనత సద్గతుల నాతని నందగ ఽ దనరు సుకర్మల దాన మొసగవలె.
విను మింక నొకటి నను నొవ్వ గలదు ఽ వనిత సత్యభామయు బలరాముడు
నను నమ్మకోరు మణి దాచితి నని ఽ యనఘుడవు మిత్రుడవు నొప్పిబావ
మన నలరి కొంగునను దాచినట్టి ఽ ఘనప్రకాశమణి సభాతలంబున
పరమ హర్షమున గోవిందార్పణ ఽ పరమని పలుకుచు శిరసా నిడియెను
హరి మోదించెను నరపతులు నరులు ఽ కర మతని మెచ్చి రా యక్రూరుని
హరి యా మణి భాసురంపు గల మణి ఽ వరముగ సత్రాజి త్తందిన మణి
యెనిమిది బార్వల కనక మొసగుమణి ఽ ఘనవైభవముల జెందించు మణిని
తన యపవాదము ద్రోలపిన మణిం గా ఽ గన మదలోభులు కృపా విరామల
గనగ దివిని బొందించిన మణిసిం గా ఽ ఘన మహామహిమ లన్ని గలయట్టి
దని చెప్పరాని మణి యెవరి దగునొ ! ఽ గన వ్రిక్క లిదియు జేయరాదు గద
వనితపై ప్రీతి సత్యభామ దని ఽ యనునొ యన్నయగు రామునికిచ్చునొ !
యనుచు జనులు పలుతెరగుల మనముల ఽ వనజాక్షచర్య లరయు భావముల
నొనరుటలు తెలిసి లోలోన నవ్వు ఽ కొనుచు సకల బంధువులు జనులు విన
భానుద త్తమణి ప్రభావ యుతమణి ఽ దీన కనకంబు నొడను దివ్యమణి
విను సాత్వికజన జీవనంపుమణి ఽ యనఘుల దానవ్రతుల వెలయుమణి
జనులు మదయుతుల లోభుల శఠులను ఽ దునియ నరిష్టములను గూర్చుమణిని
యకళంక నిష్కపటులు సుమతులును ఽ సకలము శ్రీహరి కర్పించు మతులు
ప్రకటిత నిలయము స్థిరత నందు మణి ఽ యకట ! నావశమునను నిల్పలేను
కపటమతుల నే కపటము గొందున ఽ సకల దుర్మతుల దునుముట కృప గన
మనమున దీనిని దలప ఝల్లనును ఽ వినుడు నా గుండె దడ దడ దాకెను
నేను దీని దాకిన నిట్లు నితని ఽ దీన నరిష్టము లంద రెఱిగినవె
నాకు నా సత్యభామకు వల దిది ఽ మీకు నా బంధు హితులకును వలదు
ఈ కరుణాహృదయుండు మునిసముడు ఽ నాకుత్తిత హితుండు ప్రమోదత
దనరునట్టి ఘను దానశీలుసిం గా ఽ అనయంబు నిలుచు నంచు నా మణిని
వినయమున దరికి బిలిచికొని కృష్ణ ఽ డనె కౌగిలించి యిది నీ సొమ్మగు
భయము విడిచి కొను జయము నీకబ్బు ఽ నయవేది నీవు ఆయురో సత్యంబు
ప్రియము గూర్చు నను ప్రియము దురితముగ ఽ నియతి నీసొమ్ము నాయందు
గలవాడ వనుచు నక్రూరున కిడె ఽ అలరున జయజయ ధ్వనుల చప్పటలు
అలరు సోనలను గుఱిసిరి దివిజులు ఽ కలుగు సిరులు శోభనముల నీ చరి

తమును వినిన యపవాదము దొలగును ఽ క్రిమత నివాసగము లందున పూజ్యము
సమమతిని ముక్తిసన్నిధి యబ్బును ఽ అమలమతు లెల్లు వలచిన జదివిన
జననాథా! సంకర్షణు డా నా ఽ టన మిథిల జేరె జనకుం డాతని
గని జగన్నుతుండు యనంతు డితడు ఽ మన పుణ్యావశమునను దాన వచ్చె
నని మంత్రుల భూదేవ సహితముగ ఽ ఘనమతిని నర్ఘ్య పాద్యాది యర్ప
లను సల్లించియు వలయు నవి గూర్చె ఽ ఘనుడట వసించు ననె కొన్నినాళ్ళ
మనము నలర నత డొప్పి యా ననియె ఽ ఘనుడు సుయోధను డది యెరిగి రాగ
జనకు డతని గౌరవమున గూర్చెను ఽ దన కౌశలమున బలభద్రు నొద్ద
గనె శిక్షణంబు తా గదాయుద్ధ ఽ మున నేర్పు గలుగ గురుభావంబున
మనము భీముపై పగ సాధించగ ఽ నునికి క్రోధమున గూడి యట నుండె

—: శ్రీకృష్ణుం డింద్రప్రస్థపురంబున కరుగుట :—

క్షితీశ! వినుమా! సరోరుహాక్షుడు ఽ నితాంత హర్షము పరమంది కుంతి
మతిం దలచి యా యతిసఖ్యమ్మును ఽ యతీంద్ర వినుతుల సతంబు గాంచగ
స్తుతుల భూ జనుల గనంగ సుఖముల ఽ గతుల్ వారివిగ యశంబు తనకుగ
వ్రతంబు బూనగ వడిగ పయనమయి ఽ యతండు సాత్యకి జతగ గూర్చుకొని
రథము నెక్కి యనుచరుల కొందరిని ఽ నతి వీర్యధనుల వెంట రం డనుచు
అతివేగంబున నింద్రప్రస్థము ఽ నతి నలకాపురి చె న్నొప్పుదాని
సిత భాను కళల ధావళ్యమందు ఽ మితి మించు స్ఫటికముల నిర్మించిన
చారు భవనముల కనక శిఖరముల ఽ నారయ మెటుపుల సముదయంబు లవి
సారసమిత్రుని కిరణముల మీరు ఽ మేరకాంతులను దిశల దీపింపు
భవనముల చాళ్ళ పెక్కులు నొప్పెడి ఽ దివిజనాథు పట్టణమును బోల్పగ
నవురు గనుదాని జేరినంత నే ఽ ప్రవినయశాలురు పాండునందనులు
జీవము లస్థిరముగను నింద్రియముల ఽ నా మడిని కేవ లానందహృదయు
లయి కృష్ణుని యాలింగన మొనర్చి ఽ జయహరి! భవ! హర! హర! శౌర్యవీర!
భయహరా! కృష్ణ! పరమాత్మ! యనుచు ఽ నయము వెలయ నా పురుషోత్తమునిగ
దయ సోకగ నిర్ఘాతాంహు లగుచు ఽ ప్రియమున హరి వదనారవిందమును
దరహసిత చంద్రకళల నతిశయిం ఽ ఛిరుచ వ్యాప్తగ బరికించి చెలిమి
పరిపాటి నెంచి మోద మతులుగా ఽ నరుడుగా గనుచు నారాయణుండు
వరుస యుధిష్ఠిర భీమసేనులకు ఽ చరణముల నంటి నతి సమర్పించి
వరమతి నర్జును కౌగిలించియును ఽ నర మాదరించె కవలు మొ్రక్కినను

అంచితోన్నతంపు కనక పీఠమున § రుచివెలయ చక్రిధరుడు వచించిన
నచలభక్తి నా పరమ నామగుని § వచన మనన పూజలను హృదయమున
నిలుపు గను ద్రుపదరాజసుతయైన § లలిత తనువిలసితాంగి శుభాంగియు
లలి భక్తి ముదము చిందు లనేకము § నెలమి చిగురువ్రే గొప్ప పతు లలర
వనజాక్షు చరణముల నతి గూర్చెను § కన కొత్త పెండ్లికూతు రగుటచే
కని సిగ్గు కొంత వినుతి లోపలనె § వినుము సాత్యకియు వనమాలి వలెను
కని మర్యాదల లోపములు గనక § యొన రటులె తక్కువారి బహుమతులు
వారి తిన్నన నటు లేచి వినయమ్ము § నరణి గని తనువు నమ్రతను దోప
కరములు మొగిడ్చి కుంతీదేవిని § పరిపూర్ణ కృపా లోకనామోద
భరితముగ మ్రొక్క యత్తా! కృష్ణుడ § నరసి దీవింపు నీ సుతుల వలెనె
కన నంకమందు జార్చి శుభముంచు § కనె ప్రమోదంబు కన్నులానంద
మున బాష్పధార తొలక డగ్గుత్తి § కను నామెయుండ కొడుకులు కోడలు
ననువశత నీమ నానతి మెలగద § రనువింపుమ్మల ముదము నభివృద్ధి
గని నిన్ను దలపువారితో బోల్తు § ఘని నే నెంతును నను సేవ నటుల
నన నో యన్నా! యన్నబలభద్రు § లను శుభము నిండుకొనగ కుశలులే!
వనిత దేవకికి మోదంబే గద! § నీ నర్మిలి సుతులకు సేమంబే!
గనవచ్చి యుండె నా యన్న యిచటి § కిని నీ పంపు కృప నించి మరలె
నీలవర్ణ! నీదయ బంధుజనుల § నోలి నిలుపుటయు దాన దలప నయె
పాలింప నీవె బలము దిక్కులై § మ్రోల మెలగవలె నాకు నీ బావ
మఱదులకు మనము నీమీద గుర్తు § దరమరలు లేవు మా కెల్ల నీవు
గుఱి నెఱుగుదైవమా జనార్దనా! § మఱుకు మెల్లపుడు నామీదిప్రీతి
వల్ల నయ్యా నీలీలలు దివిజుల § కెల్ల నుతిపాత్రములు నీ మహిమల
నెల్ల మునివల్లభుల భూషితములు § గొల్లల వెన్నలు దిన్న చిన్నయ్యా!
నిన్ను యశోదాదేవి పోషింప § చన్ను గుడిచితివి భువనపోషణా!
వన్నె కెఱచితివి ఎందరో దనుజుల § మిన్న యశము నీపాల వలచినది
నిను సనకాదులు దెలియలే రయ్యా! § నను నాబోటికి బొగడ దరమగునె!
వినుమ మము చుట్టము లని చూడ వచ్చి § ఘనత నింపితివి మా వాశ్యమెంతో!
గతజన్మసిద్ధి తపోఫలం బిది § నుతి సతుల నిన్ను గన నీవె దొవ్వు
వెతల సుయోధను డెన్నెదో కూర్చ § మతిని నిను దలప గనిన యవి మాయ
వని పార్థ మానవుల గొనియాడిన § తనజనాధు గని ధర్మరా జనియె!
వనిగొను మించటనె యొకర కొన్నినాళ్లు § అనఘా! నిను గొలిచి మనెదము దిక్కుల

మనుము లేవి యొదలోన గణింపము ౯ గన మా సుకృత పరంపర రూపము
నీవె దేవ! యదువీర! రుక్మిణీ ౯ దేవేశ! కృష్ణ! జగదవన! విష్ణు!
భువనమోహనా! పోషితామరా! ౯ రవి శశి నేత్రా! కరధార్యగోత్ర!
యన సమ్మతించె నర్జును డొకదిన ౯ మున వేటకేగ హరిం దోడుగొనుచు
ధనువు తూణీర కవచముల దాల్చి ౯ వని జేరి సింహ శరభ శార్దూల
ముల చమరీ కిటి కాసర భల్లుక ౯ ముల ఖడ్గశల్య హరిణ సారంగ
ముల లెక్క గొనని యన్నిటిని జంపి ౯ యలరున నృపాలునకు పంపొనర్చి
పరివారమ్ముల పురికి నంపించి ౯ హరిని రథమ్మును పరిచరుల లవము
సరస నుంచుకొని నీరువట్టునను ౯ నరుడు నారాయణుడు యమున జేరి
కర చరణ ధౌత పరిశుద్ధి నంది ౯ పరమ నియతి వార్చి యును గ్రోలియును
ఒక పులినప్రదేశమున విహారత ౯ నకలంకచిత్తులై కూర్చుండియు
వికట ప్రయాసములు శాంతి నొంద ౯ నికర ముదములను ప్రవాహమును గన
హరికిని నరునకు నద్భుతము దోప ౯ కరము సౌందర్య కరి కుంభ స్తని
హరిమధ్య చంద్రవదన కమలాక్షి ౯ వరమాను తుణుము కనకలత మేను
మీరు నద్దముల గండభాగములు ౯ చారుకరశాఖ లబ్జముల తూండ్లు
వరుల నొక బాల తపనువిపుత్రిక ౯ అల నదీ వీచికల మధ్య గాంచి
నళినలోచనుం డర్జునుని జూచి ౯ కలికి యెవరో నీ వరసి రమ్మనిన
నరు డేగి యామె దరిని నిలిచియును ౯ సరసిజనేత్రి! యెవరితనయవో!
తరుణి! యిందునను చరించె దేటికి? ౯ కరము ఫల మేది గోరెద విచ్చట?
వరుస పేరేమి? నెల వెచట నీకు? ౯ వరుని నరసినటు వివాహకాంక్షను
మనమున నొప్పితి వనుట నిను గనుట ౯ కనుల కరమ్ముల కళల దెలియ నదె
వనజాతాక్షుడు హరి కృష్ణు డతడు ౯ నిను తెలియ బంపె నే నతని పంపు
నను నడిగితి వినదగు నేని సెప్పు ౯ మన వనిత నరుని జూచి హర్షమున
ననె నీవు నరుడ వతడు హరి యగుట ౯ విని యున్నదాన నా తండ్రివలన
వరమునను మీరు గన్నవుడె తెలిసె ౯ అరుణుని కూతుర పేరు కాళింది
హరిని వరునిగా దపము నందితిని ౯ తరణియే నాకు నిలయ మిట గూర్చె
నౌరుల గోర వరునిగ కంజాక్షుడె ౯ ధరణిలో నాకు పతి యతడు విష్ణు
డును రోచిష్ణుడు నను గ్రహించు నని ౯ కని చెపుము! హరికి నాతలపు నిదియె
నన అర్క! యపుడె తోడ్కొని యేగుదు ౯ వనజ నయనునికి జెప్పి వత్తు నిలు
మనుచు వడి బారి యా కనకచేల! ౯ వనిత నిను పెండ్లి యాడ తపంబును
గొనుట రమ్మా! పావ మత్తన్వి ౯ కనికరమ్మునను పెండ్లాడు బావ!

వనమునకు వేటకై వచ్చి నేను § ఘనత విజయుడను మఱియు నీపెండ్లి
కిని దగినయమ్మ నిచట జిక్కించు § కొని నీపెండ్లిని నే జూడగంటి
నని మఱియు ననియె కృష్ణుని తోడుత § వనికి నావెంట వచ్చి వనమ్మువ
వనజగంధిని వనితగా గొనగ § ఘనత వెలసితివి మునివందిత ! శ్రీ
వనజాలయ రమణా ! క్షితిభరణా ! § వనజభవవినుత ! ఋషిగణసంస్తుత !
యన నా సర్వజ్ఞుడు సమ్మతించె § వినుము నరు డామె పిలుచుకొని వచ్చి
తన రథంబుపయి వారి నెక్కించు § కొని పురముజేరి ధర్మజుని గాంచి
విన జెప్పె సకలమును ముదము దోప § ఘను డాన్నృపుండు విశ్వకర్మనున్
బిలిపించి పురము చిత్రి మొనగూర్చె § పలువిధ వైభవముల వారికి మెప్ప
జలజ నయనుండు అర్జునుని గూడి § యలరున నతనికి సారథియు తాని
యుగుచు నరణ్యములో విహరింపగ § తగవు గాని చేరి యొక్కచో నిలువ
జగదీశులు నరనారాయణులను § నిగ నిగల జిగిని వనిని కళ నింప
ధగ ధగల సిగుడు ననలుడు మూర్తిత § నగధరుని పార్థు గని యిచ్చ దెలుప
నిండుధైర్యములు వెలయ తోడయ్యె § ఖాండవ వనమును దహనుడు భుజించె
ఖండనమున సురనాథ ముఖ్యులను § గం గడంచె పాండవమధ్యముండు
పవనసఖు డతని గాండీవంబున § భువిని జయమంద రథము ధవళంపు
పవిత్రితను గను హరుల నాల్గింటి § సవిధి నక్షయపు తూణీరమ్ములను
ఘనత గల యొక్క కవచరాజంబు § వినుతి నందించి నతి నంది యిచ్చె
జనవరా ! యంతెగాక కృప పెంపు § జనవినుతుడైన కృష్ణమూర్తికిని
ననలు డొసగె కౌమోదకి యనియెడు § ఘనమైన గదను చక్రము నక్షయ
బలదీప్తిమెఱయ రిపువిజయము గొన § ఖలరిపుని తోటమిని గూర్పజాలి
నిలిచి రవ్వాన మరి మయుడందున § నలరు గని ఖాండవమున బ్రతికించె
నరు డని లోక ఘనతమ మగు భవనము § దివిజ వర్ణితాలంకారమ్ములను
వరరత్నచయ ప్రభల నిర్మించి § పరరాధుడైన ధర్మజున కిచ్చె
పవమానసుతున కొక దివ్యగదను § సవిజయము నందగా నిచ్చె నతడె
యా సభలోనే విహారమందుచు § బాసె నుల్లాసమును సుయోధనుడు
దోసపు గుణ భూషితుల కట్ల యగు § వాసియందు జలస్థల నిర్ణయంబు
వాసుదేవుండు ధర్మజుని గాంచి § ఈసు పాటించు ఖలు లది తెలియరు

-: శ్రీకృష్ణుండు కాళింది, మిత్రవింద, నాగ్నజితి, భద్ర, లక్షణ, యను వారల
బరిణయం బగుట :-

మాధవు డనుమతి గొనెను ధర్మజుని § రాధత మెఱయగ సాత్యకి ప్రముఖుల
తో ధరని వినుతి గన్నట్టివైన § సాధ్యైర్యోధాచార్యాదిపత్రిభలను

యాదవు లెదురుగ రాగ ద్వారకను ఽ మోదమందు చిందాడు భవనమున
నా దరహాసితను నుంచి బంధుతతు ఽ లాదరంబు గనుచుండ నందొక్క
మంచి దినంబున యముని చెల్లెలిని ఽ అంచితము దివ్యులనుగూర్చి పెండ్లి
మించిన వైభవసందదుల నాడె ఽ కొంచెము గొప్పల భక్తుల నెంచక
సంచితముల దలపుంచిన మాత్రన ఽ పొంచు దప్పించు మంచిదేవుండు
కాంచనచేలుడు కరుణామయుం డ ఽ కించనుండు విజ్ఞానసుధానిధి
విందాన విందు లనువీరులు గో ఽ విందు మేనత్త రాజాదేవికి
నందనులు వారి చెల్లెలు సద్గుణ ఽ సుందరరూపము చంద మట్టులుగ
అందె నభిధాన మాతన్మిత్ర ఽ విందనాగ శీలంబు మందగొను
డెందము హరిపై నిలిపె భర్తగా ఽ నంద నందనుడె తనకు దగు ననుచు
అన్నలు పాటిరి స్వయంవరంబును ఽ క్రన్నన హరియును అందులకు నేగి
అన్నల మిన్నను నందఱు చూడగ ఽ తన్ను గదియ రా రథమున నిడుకొని
సందడి నడంచి తెచ్చి పెండ్లాడె ఽ నందరి సమ్మతి మేనమరందలి
కోసలనాథుడు సుమతి ధార్మికుడు ఽ వాసుదేవునిగ విరోధమెన్నడు;
వాసి నిక్కు వరబల విభవములను ఽ నా సుగుణుని నామమగు నగ్నజిత్తు
అతనికి పుత్రిక నాగ్నజితి యగు ఽ సతి వినయవతియు జ్ఞానశీలనిధి
పతిని వడయుదగు సమయవతి యగుట ఽ మతిని యోచించి పందెము బెట్టెను
యామెజనకుండు అతనియింటిలో ఽ భూమిని ఖ్యాతిని ముదము గొన్ననగు
క్రూరమున పెద్ద సప్తవృషభముల ఽ యేరైన వాటి నొక్కదారమున
జారని ముడినిగ గట్టి యాడ్చినను ఽ వారిజాననను వారికే గూర్తును
వీరులు నరపతిసూనులు రండని ఽ పారమున సాటె భూముల నెల్లను
నరపతులు శూరులెందరో వచ్చి ఽ దారుచుందు రా రథటిని తలకువ
ద్వారకను జాట శౌరియును వినియు ఽ జేరవచ్చె నాభూమికి ముదమున
నా రాజవరుం డతని పూజించి ఽ మేర వినిపించె నటు వినయమునను
రాజీవాక్షుని దివ్యాకారము ఽ రాజపుత్రి గని మదిని వరించియు
తేజ మించు నా దివ్యభవనమున ఽ పూజించి హరిని భర్తగా వడయ
నోమంది యంటె ఈయత్నంబున ఽ నీ మహాపురుషుడే జయ మందుచు
[illegible] నను సుఖింపజేయును ఽ నా మనంబు జీవంబు నితడె యగు
శ్రీమనోహరుడు తను నమ్మువారి ఽ కామితదాయియు నను మహావాక్య
మేమొయి ఫలింప జేక తక్క దని ఽ యామంజువాణి శివను నుతించెను
వాడి కొమ్ములను వజ్రపు టంచుల ఽ [illegible] మించును గిట్టల దీటన

పోడు కొండలగు వానిచూపులును ॥ జోడుశూలి శూలంబు రుచులనున్
వాసనను వీరులను సోకితేని ॥ రోషము గొని వారలను నుసిచేయు
మోసము లుసురులు అసుర సంతతులు ॥ ఆస వల దిచట యీ సతిని యాలి
గా నేల దలచుచునో మృత్యువు ॥ దా నోర బిలిచి యటు గాలుపోలు
గానబోనైన యాత్రికు నేది ॥ బూనిక వేలను జూపరా దనెను
వారివి వినుచును నరపతిని జూచి ॥ వారిజనయనుడు నగుచు నిట్లనియె
నీరజాక్షి కిది కన్యాశుల్కం ॥ బీ రమణీమణి సుతను గొనంగా
నేరను ధనంబు నీ కిచ్చుటకును ॥ కూరిమిని సొమ్ముగా గొను శౌర్యము
ధీరతను వాని నే డిట జెండెద ॥ సారసాక్షి నా దారగ గొనెదను
నని వానినెలవు చేరె గంధుగొని ॥ ఘనమైనభీతి దోచెడు ముఖముల
నునువు ఖడ్గముల వడువున రోమము ॥ లను నిట్టవడగ కొమ్ములనగ్గర
వందువారి కొమ్ములను గ్రుచ్చంగ ॥ మందగొను మదము పొందున నుండెడు
చందమును గాంచె నే డెద్దులట్లు ॥ నందనందనుడు చేలము చక్కగ
గట్టిపట్టు గని బిట్టుగా కేక ॥ బెట్టి యవి అంకెలను దివి ముట్టగ
నట్టె గూర్చుచును మీద దుముకగనె ॥ బెట్టి తా నొకడు ఏడు మూర్తులయి
ముట్టె వాని పులిబట్టు మృగంబుల ॥ దట్టిన రూపము పట్టపగలుగా
చుట్టు చూపఱకు దోప రుద్రుడై ॥ ముట్టడించె నాయెద్దుల శక్తిని
దట్టెను మెడిమల తాకున కొండలు ॥ ఇట్టె దొరలెనని భూమి బడగొట్టి
గట్టె నొకత్రాట పిడికిటి గ్రుద్దుల ॥ నట్టె బడనీడ్చె మట్టె వాటిమద
మట్టము కని రానందం బచ్చట ॥ పట్టంద భువనజాలముల నెట్టు
జెట్టికి పొడవును పొట్టిగా నేర్చు ॥ దిట్టరికి వానిపొట్ట కొరి వ్వణప
గొట్టుగను నెట్టు! ఓ మనుజేశ్వర! ॥ పట్టె నాగ్నజితి నట్టె ముందుగొని
పట్టితోడ రత్నాల రాసులను ॥ కట్టకుల యరణముల పెక్కు నించి
చుట్ట మందితివి యల్లుడవు మాకు ॥ పుట్టు దెలిసితివి పరమాత్ముండవు
నీవు విష్ణుడవు నవ్యయుండవును ॥ గావు పరమాత్ముడవు శ్రీనాథుడ
వౌ విశ్వమయా! నాపుత్రి నోము ॥ కేవల సార్థక మందె నీభార్య
యై సుఖ మందును గాక! యని పెండ్లి ॥ జయజయ ధ్వని విధి ననుసరముల
నయము గని భూసురాశీర్వాదపు ॥ చయము లవి నెల్ల నిచ్చె మోదమున
అవి చెప్పెద విను వరుస పదితొమ్మి ॥ దవి వేలు గోవులును గజంబులుగ
భువిని గణింపగ కరుల నూరంత ॥ లవి రథంబులును నా నూరంతలు
తురగములు మూడు వేల దాసీల ॥ పరమప్రీతి మణిభూషణాంబరము

లరసి భూషించి యని యిచ్చి పంపె ఽ నరపతు లోర్వక దాక నవ్వారి
పరిభీతులుగా బారించి వేగ ఽ మరసి ద్వారకను నెమ్మదిని జేరె
విను మింక యొక్క యత్త పుత్రికీర్తి ఽ వనిత కేకయాధీశుని సతియగా
కన నామెసుతకు మేనమరదలగు ఽ దనకు భద్ర పేరగునది సముద్ర
మును బోలు సుగుణముల ప్రవాహముల ఽ గన నయోన్నిద్ర భద్ర సౌందర్య
వనితగా గొనియె నామెను జననీ ఽ జనకుల మోదములను వెలిగించియు
తనయ హితులు భీ తిల్లి తొలంగగ ఽ ఘనత మెరయ ద్వారకను సుఖ మందె
వనజాక్షున కెనిమిదవభార్య యగ్యె ఽ వనిత లక్షణయు మద్రరాజసుత
మును వినతాసుతు డమృతము గొన్నటు ఽ ఘనత మీనయంత్రమును బడగొట్టి
తనకు నాతిగా గైకొను మురిపెము ఽ దనరంతే నని యింతి సంతసిలు
మనుజేశ్వర ! యామెను ప్రీతినింపు ఽ విను మన్నింటను లక్షణ సుశీల
వినుము రుక్మిణియు జాంబవతియును ఽ గన సత్యభామ కాళిందియును
విను మటు మిత్రవింద నాగ్నజితి ఽ గనగా భద్రయు లక్షణయు ననగ
వనిత లష్టమగు సంఖ్య పట్టంపు ఽ కనకాంగులుగా కృష్ణమూర్తికిని
మనుజనాథ ! పదునారువేల్ నూరు ఽ వనితల సుందర రాచకన్నియల
తను రుచి విజిత దివిజుల సతు లనగ ఽ ఘన సుశీల భాగ్యముల సిరిసములు
నరకుని జయించి వారి నిల్లాండ్ర ఽ తరమందె నీశ్వరుండైన శౌరి
యరయ సర్వమయు డన్ని రూపులను ఽ సరసిజేక్షణల సౌఖ్యముల నించె
నన పరీక్షిత్తు భూదేవికొడుకు ఽ తన తనయు వలెనె యానాడు బ్రోచి
యును నేడు జంపుటే హేతువనిన ఽ ననెను శుకుడు జనపాలున కా కథ
మనమున మోదము విరియ శుభ మనుచు ఽ మును లచటివారు విన రుచి నవ్వ
మునిజనపోషక ! సుగుణహృత్కంజ ఽ మన దగు నీ నుతి పావనము భవము
లను జిమ్మదోలుటకును నద నొసగు ఽ వినిపింతు ననుచు నతి నిడె మనమున
అనఘా ! యింద్రుడు హరి జేరవచ్చి ఽ విన జెప్పె దివిజ పరివారయుతము
వనజనాభ ! నరకుండు మము లజ్జ ఽ గొన నదితి కమ్మలను వరుణు గొడుగు
ఘనమైన దేవగిరిని మణికూట ఽ మును మూడింటిని బలిమి బుచ్చుకొనె
విను మేము జాల మరచు నీ తేజ ఽ మున గ్రోలుచుండు నిను లెక్కింపక
దనుజు డటు మడియు వనమున ననలుడు ఽ మునుక గాంచు రూపంబు నా పగది
యని నతించి యవ్వాని జంపు మని ఽ వినతి జేసె తా తన నెలవుజేరె
కనవచ్చె తార్క్ష్యు డతని తలంపున ఽ వనమాలి సాయుధుడును నయ్యె నా
కోపాన [illegible] వంటఱ గని నే ఽ సాహసంబు చెన్నొంద బీరుండు

డే హరు డొడ్డిన వానిని ద్రుంచెద ఽ నాహంకారత పురమును నరయుదు
నే నిదె నెమ్మది నరిగి వత్తునని ఽ వినజెప్పి భామలందరిని నమ్మ్ర
తిని బడసియును నిజ జననీ జనకు ఽ లను నచ్చగాంచి మరి మరి పెద్దల
గని దీవన గొని హేగుసందమున ఽ మును దనప్రార్థన నదనుని దెలిపియు
కన చెంత జేరి కనకాంగి సత్య ఽ వనజనాభు నెద వ్రాలి మనోహర!

—: శ్రీకృష్ణుడు సత్యభామతోఁగూడ నరిగి నరకాసురుని వధించుట :—

నిను రణమ్మునను నేద దీక్షంగ ఽ నను నీ దాసిగ తోడు గన గొనుము
విను ప్రియము గలదు రణమునను నీవు ఽ గనెదు రౌద్రరూపమును నాతోడి
వనిత లందరును గనియున్న వారు ఽ నను జూడనిమ్ము నాకోర్కె యిదియు
వనిత సాహసవు పట్టు నీకెఱుక ఽ గననగు దేవా! యని చక్రిహస్త
కరము చక్రముల బోలు నట్టి తన ఽ యురుతర రుచిగను సరోజముల పై
సరగున జేర్చుక జంకక నిలిచిన ఽ కరము సమ్మతిని తాను నెక్కించె
గరుడుని మున్నుగ దా నెక్కె యంత ఽ హరి గగనమార్గమున వడి నేగుచు
తరుణిని దరహాసితము దోప గాంచి ఽ సర సర నేగుచు వరాంగి నరకా
సురుని ముందె మురదైత్యుని దునుమగ ఽ నరుగుదెంచునను జూచివత్తునను
శరణి బలికితివి గడు నెటు నేర్చితి ఽ వరసిన నదియదా జదువు గొనుతలము
నడచు నప్పుడే నడుము వడకుగొను ఽ పిడికిట నణగెడు పరిణామ మదియు
జెడిసిపాటుగను నవు డెల దాగెడు ఽ పడతి చెప్పు మన నింతియు నవ్వుచు
వడకు గనను నీ పిడికిటి బటువున ఽ జదువు నందగొన నీ యడుగునీడ
యుండి నీయెడ గన దాగ నాకేమి ఽ బిడియము గాదా! యొండయుడు దగ్గర
నుడివెద నెట్టుల! నీ వాడినటుల ఽ జడిమ గందువో! కాదు దృఢమనుము
కరి బృంహితముల నేమని దలతువు! ఽ వరవృష్యంధయ ఝుంకృతు లందును
తురగపు గిట్టల ధూళి నేమనెదు! ఽ వర పవనవశపు కమలపు పుప్పొడి
యరుల శరమ్ములో! యవి చినుకులుగా ఽ నరకుని మూకలో! కోలకుల పిట్టలు
ఆయుధపు విసరు టలో! పూలచాలు ఽ ఈ యనవులేన! నాయులవి యిటె
ఈ యుపాయముల జాణవు దంటవో! ఽ ఈ యుపాయముల నీవును దంటవె
అనుచు సరస వాక్యముల నాడుచును ఽ పిననవ్వున గరుడుండు వడి బరవ
హరి గాంచె మురాసుర పాశంబుల ఽ పరివృతంబైన ప్రాగ్జ్యోతిష పురి
నరసి మైదుమర్గముల వరుస గని ఽ కరము కోపమున గద గిరిదుర్గము
తునుక తొనరించి బాణదుర్గమును ఽ తన తీవ్ర విశిఖముల ఖండించియు

ఘనభీకరంపు చక్రమున వాయు ఽ వన యనల దుర్గముల రూపుమాపి
తన కరఖడ్గము నందకము నంది ఽ దురమె మురపాశముల నన్నింటిని
ప్రాకార వప్ర యంత్రాలయముల ఽ నాకారాతుల గుండె ఝల్లు మన
నాశీళవృందము మట్టముల జెరిపి ఽ యాకాశము భేదిల్ల కఠినంపు
రవము నింపునది యురుముల పెక్కుల ఽ భువనములు తూల్లు వడ కఠోరముగ
పవతుర చేతన పముల గావింప ఽ ప్రవిమలామోదమును సుమతులు గన
తన పాంచజన్యమును హరి యూదిన ఽ గన విలయకాలముల పిడుగుల వని
ఘన భీతిపర్వ నిగుడు మేఘముల ఽ ఘన గర్జ లనగ పంచశిరుండగు
మురదానవుండు నిదుర సాలించి ఽ కరము భీషణమునను గ్రాలువడిని
తరమెక్కుడైన కోపమున చలము ఽ పత్తువు నిలయమును వెడలియును వచ్చి
హరిని జూచి విలయాగ్నివలె మండి ఽ సురలు బెగడ గర్జించి నైదైన
వరుస మోరలను నైదు భూతముల ఽ పరమైన లోకముల మ్రింగు చాలు
గన నప్పళించుచును గుప్పు గనియు ఽ దనశూలంబున గరుడుని వైచియు
గని నట్టహాసమున హరి రోయగ ఽ దన వికృత చేష్టలను బెగడు నింప
దుర దూర నందియు బరువిడి బిరుసున ఽ హరి హరి నిలు నిలు మనుచును గదిసిన
ముర! ముర! రమ్మా! దివిజుల హృదయముఽమెర మెర లడ పెద నని హరియు మెరసి
గరుడుని విసరిన శూలము నడుమనె ఽ కరమున నొడిసియు మూడు తునుకలుగ
కర మెసదు గొలుప విఱచి వదనముల ఽ నరసి నిశిత శరముల గ్రుచ్చి నొప్పి
బరగింప వాడు గెరలి కంసారి ఽ చొరగానెద నీదు స్థిర జీవమ్మని
యురవడిని గదను చిర చిరను ద్రిప్పి ఽ యురమునకు సూటి పారించి విసర
హరి కౌమోదకి వడిదాని దట్టి ఽ సురరిపు మృత్యువు ఖలజీవ హరము
అరిజన దవానలంబగు చక్రము ఽ పరమహర్షమును భువి నింపుకొనగ
మురుని శిరములను దెగిపడగ విడిచి ఽ ధరణి దనుజు లార్వగ ఖండించియు
సురనాథు వజ్రమున గూలుగిరిని ఽ కరణి శిరంబులు దునుమ మొండెంబు
బడెను వననిధిని మోదంబె పొడమె ఽ దశ మందినట్టి సిద్ధ చయములకు
జలధి శయను డరి జేరె చక్రంబు ఽ అదరె చెదుగు తరుణంబు నరకునికి
మురవనుజు తనయు లేడ్వు రది గాంచి ఽ హరిని జుట్టిరా నరకుని పంపున
నహహా! తామ్రుడు నంతరిక్షుండు ఽ వరుస శ్రవణుండు విభావసుండును
అరుణుడు వసుండు నభస్వంతుండును ఽ పరమ కోపమున కృష్ణుని గరుడుని
నరసి శస్త్రాస్త్రములను గప్పినను ఽ వరుస గని హరి నరకు సేనాని
[illegible] వారిని ఽ [illegible] హరికి గాసిర

పిడుగువంటి బాణముల గదాముల § రోకళుల నవి గూర్చెను నట్టిదైన
పరశు ఖడ్గ తోరణ శూలములను § నరకదనుజు డగ్గించ గురియించె
పురుషోత్తముండు మిడిమిడి వెలుంగు § తరణి వడువునను నుగ్రశరంబుల
నరుణ కిరణజాలముల నిబిడగతి § సరళగతుల విశిఖంబుల వారిని
కర చరణ యూరుమధ్యోరుశిరము § లరయ తిలలంత ఖండములు గాగ
దునిమి శంఖంబు పూరించిన విని § తనవారి నెల్ల శరజాలంబుల
మనికి జెడ ననిని బడ గెడపినట్టి § వనరుహాక్షు దూషించి తన్నను
తనబలము నెంచుకొని విజృంభించి § ఘనతరంబునగు మణిభూషణముల
తను వలంకారమును బొందు పఱచి § కొని వర కుండల భూషితుండు నయి
దాన ధార పెంపారు గండముల § మాననీయ వేదండ తండములు
వేనవేలు యోధులు దైత్యవరులు § తాను నడకొండవలె వారిమధ్య
వెలుగుచును వచ్చె విలయదావాగ్ని § వలె మండు క్రోధశిఖల పరివేష
మలవడు భీమంబున నరకుడచట § నలిననయనునిగ అతనిప్రక్కన
నిలిచి కొంగుకొన నాతని విసరెడు § లలిత సుకుమారి పాలించు సేవ
చాలును గను నవ్వారిద వర్ణుని § నోలిని శంపాలతి కానితంపు
నీలమేఘమని భ్రమ నింపువాని § డాలున గుహానాసంగు నిమంగుని
గరుడుని భుజపీఠముపైన నిలిచి § తరుణితోడ ననిసంబంధ విధుల
పరప్రస్తావన మోదయుతుడైన § పరమాత్ము కృష్ణు జిష్ణు ప్రభవిష్ణు
గని యా యుద్ధమునకు వడి జూపక § కనుచుండె తమక మందే లోనుగ
వినయమున కృష్ణు గనుచు జారుడడ § ఘనత వెలయ దా గట్టిగ బట్టుచు
దన పోకముడిని బిట్టుగ బిగించి § కనకాంగదముల చక్క సవరించి
తన ముఖేందు మండలమున కాంతుల § వనజాక్షుడు గన పయ్యెదను పదిల
మున బొందు పఱచి ధను వం దిమ్మా! § దనుజుని మదమును నేన యడగింతు
నా వర్మిలి విభునకు పని దప్పగ § నేను వీని దునుమంగ మోదమున
గనుగాక! నన్ను చతువున గెలువును § దనర జూచునని బలుక హర్షమున

— సత్యభామ నరకాసురునితో యుద్ధంబు వేయుట :—

వనితయే ధనువు గొని వైరి బోరి § తనకు విరామము గూర్చునట్టిదిగ
రూనరు! గల సతిని గనుట ఘనమే గద! § వనిత నీకేల! కలన తోటా కలికి!
బాల యలుకవలదు తే పొలతియాల § మలత నీ కగును అలుకవు నిజంబు
అలుక గొనెదేని ధను విడే గొనుము § అలుకలుకొాయ నలయున నలుప్పు

లలన ! నీదుయాలంవు లీలగన § పలచితిని నీవు వల నటు నిలువుము
అనుచును దివ్యోత్సాహజననమ్ము § దనుజసంతాప దర్శనోద్భవము
విపులజనభీషణంబైన యుంబు § సుముఖోడి కిచ్చె యామె యాలీఢ
మమర జేసికొని బల ముప్పొంగగ § సమ మెరుగని రౌద్రిమున యరివీరు
లకును దుర్లోక యయ్యె గుణధ్వని § వికటమరుల సైన్యముల గూర్చియును
ప్రకటిత బలరుచి వైరుల రుచిగన § నికరముల శరములను బరగించియు
నారీమణి యా యరి బల సంప § న్నారీబాధకముల మూర్ఛ నింపె
తరుణి కర కంకణముల చరణముల § పరమందునంది యల ఝుణఝుణ రవ
మరయ గుణధ్వని కేకముగ చెలిమి § తరమందినట్లు తరుణమ్ము వలయ
తాటంక మణుల ధగ ధగ లట్లనె § నీటుగను గండమండల రుచియును
పాటింపు నొకటిగా నటు కొలకుల § పాటిత చూపుల ధళ ధళ కాంతులు
శరముల దీప్తిని సఖ్యము నందగ § శరపాత ఘుమఘ్వని పగతుర
పరమైన కల కల ధ్వను లేకమె § వరుస లిట్టుగా వీరశృంగార
భయరౌద్రాద్భుతము లన్ని కలయిక § నయము నెంచి యాయమను బుట్టించె
నయవిద్యాపోడిమిని గనెడు నలువ § చెయువు లిటులగా ప్రత్యాలీఢత
పదమున మరియును నాకర్ణాంతము § గదియగ జ్యా నఖ పుంఖ దీధితిని
పదిలత లక్ష్యము దృష్టి బాణతతి § హృదయము లగలింపును వరుల బరపె
బొమ్మల పెండ్లని జడతను గాంచెడు § కొమ్మ యుద్ధమున వడి గనె ధీరత
నిమ్మల పురుషుల గన మరుగునందు § యిమ్మెయి శత్రుల దుమ్ము రేగించె
వీసత కనకపు టూయెల నూగెడు § దారి వల దనునె గరుడు భుజమ్మున
తేరు తరిని గనె శూరత నిట్టుల § సారసాక్షి సఖు లాడ గసరునది
క్రూరారుల కేకలను విననోర్చె § సారమందె నెట్టు నడు గిడ రణమున
కూరిమి మయూర నడల నలయునది § నారికి వీణయె బాణాసనంబు
నాదయ మ్రోకున తీగ కూర్చుటయె § యా రమణికి గుణమును గదియించుట
ము త్తెములకూర్పు శరసంధానము § య త్తరుని పద్యమయె శరమంత్రము
పలుకు లా యరుల ఘర్జించ నొప్పె § లలన పలుకుమన బలుకని ముదియ
నిలువగలిగె నా వానకాలమును § బోలుపించె కృష్ణుడే ఘనంబుగా
దను సెలువు వలెను గుణము ఘర్జగా § కన వృష్టి బాణచయ పరివేషము
రవిచంద్రబింబముల ముఖ మొప్పెను § భువిని ధూమకేతువు మరు కేతువు
వగు నాపెంకొంగు పొంకవు తరమ్ము § నగు మరుని పరిధి విలయమ్ము పరిధి
[illegible] లటుల § మగువ దర్శనము [illegible]

ముదము రోషంబు హృదయమున గూర్చి ఽ సదయ యుదయుతను పరిపాటి నింపు
మదవతి పర మిటు హరికి మంగళము ఽ చెదురుగా నరకునకు నమంగళము
గన దోప నొప్పు నామె నెదురొడ్డు ఽ గన లేక వెనుక నరకుని దాపున
గూని దైత్యసేన హరి వనిత జూచి ఽ వనజనేత్రిరో! నిను జయ మందెను
నేను కాన్క లందింతు భూషింతు ఽ నీ నర్మిలి నను జెందె నే నంతె
నని ధను విమ్మని యుంది శంఖమును ఽ మనములు బెదరగ నూది గరుడునిఁ
నరకుని నూటిని వడిని జరపినను ఽ హరి జూచి నగుచు దనుజుం డిటులనె
నీవెటు ? మగవాడవు వీరమెద్ది ? ఽ యావిడసహాయమున గల్గెనుగా
నీవును వీరవిహీనుడ వెఱిగితి ఽ నీ విధి నీచత దానవులు గనరు
నే వీరధనుడ నయు మెఱిగి నీకు ఽ సావకాశముగ బోరాడినట్టి
యా వనిత జంప నిది నావీర్యము ఽ నీ వాడదాని జంపినది వినియు
నిను నెవరు జంప కునికి దెగనీల్గు ఽ గనిన వాడ విట వచ్చితె మనువును
బాపెదను సుమ్ము మనదలతు వేని ఽ వే పఱువుగొనుము మన్నింతు నిన్ను
నీ పూబోడిని జూచి చెప్పితిని ఽ యాపడతిని మెచ్చ తగదు కుత్సిత!
కిరి నరహరి వరపటు ధరణీసుర ఽ నరపతిరూపుల తోలగ దలచితివ!
నరకుని ముందర సాగదు కపటము ఽ హరి! హరి! మురహర! పరమగుణహీన!
నరవర! నరకుం డిటులాడ వినియు ఽ హరి వానిజూచి నరకా! యిదె నిను
సురలోకమునకు బంతు నిందు కి ఽ న్నర సురకామినుల లందంద నవ్వ
సురసుర మ్రిగ్గెడు నా విశిఖమ్ముల ఽ పురపుర బొక్కుచు గను నీ జననియు
బొరిపొరి హర్షపు డోలల దిప్పులు ఽ తరతరంబులను నూగుదు రింతట
వరము నీచ నీబంధిత తరుణులు ఽ హరిని వరునిగా తపముల గొలుగుట
కరము నీచావు నెదురు చూచు టే ఽ వరకు సిద్ధించె సిద్ధముగ నిజము
అనుచును శతఘ్ని యను దివ్యాస్త్రము ఽ ననువున సవిధిని నది గూర్చివైవ
గన గన ఘనతర ననలజ్వాలల ఽ దనరిన తీక్ష్ణపు రుచుల నక్షయత
నరకునిసైన్యము లన్ని వ్యథ జెంద ఽ హరులు తురుములయె రథములు చూర్ణము
కరు లన్ని గదాఘాతముల చదియ ఽ యరి వీరు లా సుదర్శన ధారల
కరము తనువులను శిరము డొల్లగను ఽ నరకుడు బెగడగ చావక మిగిలిన
పరివారము పరువెత్తిరి దిశలకు ఽ దురమున ధీరత నిలిచిన వారిని
త్వర గని మూడగు విశిఖమ్ములనుఁ ఽ వరుస నొక్కరుని నాల్గు తునకలుగ
జదిపె గరుడుండు తనసామర్థ్యము ఽ విదితోపాయము దనుజుండు కనగ
వదిలత కృష్ణుని సత్యభామనుఁ ఽ చదురున భుజముల గుదురు బాపకను

నురుపుగొన్న వేగమున దనుజాలను ఽ పరువు మెచ్చగన దునిమిన నరకుడు
గరుడుని సహింపు గానక పక్షముల ఽ పరమైన గాలి దూలు తా గనుచు
దురమున దనవారందరు నిలువక ఽ పురమున జొరుదటయు సారపు బాటయె
గనగ కనలు పెద్దగ నా గరుడుని ఽ వజ్రి వజ్రమును సరకుగొనని తన
ఘనమైన శక్తి చే బూని విసర ఽ ఘన బలంబులను దానివూల
దండ వేటు వలె యందిన యటంది ఽ గండున దానిఁ బెండువలె బట్టి
నిండుమోదమున గరుడు డద్దాని ఽ తుండమున విఱిచె నరకుం డదరగ
నరకుండు దోష పటిమ మదకరిని ఽ సరగున హరిపై వడి గన దరుముచు
కరము ఘోరతరమైన శూలంబు ఽ పరువడి వైచెను హరియురమునూటి
పరమాత్ముడైన కృష్ణుండు దాని ఽ కర కర చక్రమ్మున నల్పి వెంట
సురమాత రత్నకుండల శోభిత ఽ శిరము నరకునిది ఖండించె వడిగ
గిరి శిఖరమ్మును నింద్రుడు ద్రెంచిన ఽ కరణి హరి యొప్ప వాని శిరం బిల
కరము జారునెడ వసుస యిటులుండె ఽ ధరణిని దూరుచు దూరె నెట్లనిన
ధరణీదేవిని నేను నాభర్త ఽ హరి యని పొంగుచు నుంటి వానాడు
కిరి రూపంబున దా నందినపుడు ఽ వరమతి నిల్లాలను అన్నమాట
చరుస లిల్లేన వాక్కులస్థిరమ తరుణి! ఽ నీకొడుకుకైన చొప్పదియె
యని దూరినట్లు దూరె భూమినిఁ ఽ ఘనతను కృష్ణుని సురలు పుష్ప వృ
ష్టిని నింపిరి మోదమున గుంపులై ఽ వినుతి యొనర్చిరి దివి మ్రోసె తూర్య
ధ్వనులు నాట్యముల పాటల జెలంగ ఽ ఘన గంధర్వాప్సరస లాదిగను
ధరణీ దేవియు సరస నేతెంచి ఽ వర కనకరత్న కుండలంబులను
వరుణ ధవళఛత్రము వైజయంతి ఽ కర మొక్క సుందరపు మణిహారము
కానుక నిడ సద్భక్తి సాగిల్లి ఽ దా నిటు నుతించె నా వనజనేత్రు

-: భూదేవి శ్రీకృష్ణుని స్తుతించుట :-

ధ్యాననేత్ర హాస్తయు జ్ఞానకళను ఽ కాను మున్ను నుతియుహియు గుణియుసుట
అబ్జజ జనకా! యో యబ్జనాభ ! ఽ యబ్జనేత్ర! శ్రీ యబ్జపాదకర !
యబ్జాలయాతరుణీ మణివర ! హరి! ఽ యబ్జవదన ! యబ్జాసనవినుతా !
అనంతావతారా! యనిరుద్ధా ! ఽ నందనందనా ! సర్వేశ్వర ! శ్రీ
పినాకహస్త విబుధేశ్వరాదులు ఽ అనవరతము నీ యడుగుల నాథా
నిలిపి నీదు మహిమలన జపింతురు ఽ తలప నశక్యము నీత త్వస్థి
తిం మహాత్మ త్రిభువనకారణకీర్త ! ఽ విలసనద్యోత ! విశ్వమూర్తి !

విశ్వభావనా ! వికారదూరా ! § విశ్వేశ ! నిగమవినుత ! రమేశ !
విశ్వంభర ! నను నభిక నను జెందె § విశ్వంభరు నిను నే సేవించుట
చే నిను దెలిసినదానను మునిపద § నానుతి మన్నించియు సతి గొనుమా !
యో నీలవర్ణ ! నీరూపు భక్త § మానస మానసపంచర నీవటె
తొలి గన్పడెదు నీ చరణముల § మూలముగ బాగను రుచి నందితి గద !
పాలింపుము దయ నాపై నెనరున § ప్రోలదియ నాకు తొలినాటినుండి
నీవు రజోగుణమున బ్రహ్మ వనగ § కేవల సాత్వికమున విష్ణు వనగ
నావిధి తమంబునను శంకరుడవు § భావింప వానిమూలం బీవే !
పరాపరేశా ! పాపవినాశా ! § సురాసురాదుల జాతువు నొక్కట
నిరాలంబ ! సత్యాశ్రయ ! యచ్యుత ! § సరోజసంభవు పదము నీపదము
నిధాన విజ్ఞానానందభావ ! § సుధాప్రపూర్ణము నీ నామ మొకటె
విధాన రహిత సుపథంబు నీనుతి § విధాన మదియే మోక్షరమ నందు
టకు జగత్పతీ ! ప్రధానపురుషా ! § సకలభూత తన్మాత్రహృషీకము
లకు దేవతలకు మనోబుద్ధులకు § ప్రకటిత గుణచయ మహాత్త్వ మా
దిగ నీవ కర్త భర్త హర్త తను § దగి వృత్తిహీనుడై వృత్తులన్నిటను
తగ వందించియు వాటి నశింపున § నిగ నిగ లందెదు ఖగరాజవాహా !
జగదంతరాత్మ ! నీ కిదె మ్రొక్కెద § దిగులు బావు నీ బాలుని కృపచే
నరకుని తనయుడు నాకు మనుమడగు § కరము భయము గొన్నాడు బీరంబు
దరిని గన డింక నాశ్రియ మొసగుము § వర మిదే యనిన ధరణి యులర నా
నరకతనయు భగదత్తు నాభూమి § పర మందించియు ప్రభుత నెలకొల్పి

### -: శ్రీకృష్ణుడు పదాఱువేల కన్నియల వరించి దేవలోకమునకుఁబోయి పారిజాతము దెచ్చుట :-

సిరులన్ని నించి నగరులో జొచ్చి § నరపతుల నాజిలో ద్రుంచి వారి
పరమై భవముల శూరగొని మరియు § ధరణీతనయుండు వారితనయులను
సరససౌందర్య గుణవిభూషితల § కరము వినీతుల శీల సమేతల
గొని చెర నించిన వారి తన దయను § గొనియాడగ విడిపించె కృష్ణుండు
వనజవంశీకుల పరిభూషితుండు § వనజవైరిప్రభ వెలయు సుందరుల
విన మృగేంద్ర విక్రముడు శౌరి యా § వనజముఖుల నటు విడిపించి వారి
పరిశుద్ధజలముల నాడ జడ నిచ్చి § వర వస్త్రభూషణముల మానించి
పరమ [illegible] పల్లకిరితల జేసియు § వరమతుల వెలయ నిండ్పుమ గూర్చిన

కని రా రమణులు కంజ నయనునిఁ § దినకర కోటి సమప్రభ తేజుని
వనమాలధరుని ఘనకృపామయుని § ముని వర్ధిష్ణుని మనసిజ జనకుని
గోపనారిసమ్మతుని సంగతుని § యా పడతుల వరదాతను గృష్ణుని
చూపులనే యాకర్షణరూపము § పాప్రున మనమును జేర జేర్పగా
నా పద్మనయనుడే తమ విభుడని § దోపుచిత్తముల మోహము నందిరి
యానందమయుని సౌందర్యరేఖ § నా నిర్మలు చాతుర్య శౌర్యమును
దాన నిరూఢియు గంభీరమనము § వే నైజభావ సదయానిలయుని
గని సిగ్గు వదలి మనసిజబారిని § మనము తోట్రుగన వనిత లతడె విభు
డని తము గౌగిలి నంది సుఖంబును § గన బొందునోయని యువ్విళు లూరుచు
వనితలు తమలో గుసగుసలుఁ గొనుచు § దనుజాధముండు నరకుడు మనలను
కరుణాహీనత చెర నిడె ననుచును § వరుస మున్ను దూషింతు మటుగాదు
మన మనోహరుడు మనపాల వచ్చె § మన తపఃఫలము పండించ దెచ్చె
మును సిద్ధమయ్యె నుపకారియె గద ! § కనుగొందము మన చిత్తాపహారుని
మన బాహుమధ్యమున దారాడగ § ఘనమైన హారచయముల తెరమున
కనక కలశ సమములను జేనందు § ననువును జెందింపగను నోతుమా !
అతని కౌగిలిని నను గదుపు కొనడ ! § బ్రిదుకేల నంచు మనజీవపువ్వ
తతుల చరణముల సంగతి నిడుదము § యతివరదుడు దయచాలు వర్తిలని
గన మింతదనుక మానినీస్మరుని § వనఘుని కోమలమూర్తిచెలువుండు
వనితా నేనే వైజయంతినై § జనియించియుంటె మెడ వ్రేలాడుదు
ఘనుని పీతాంబరమునై యుంటే § తనువు నిండుకొని యుందునె బాయక
కనకాంగి ! కౌస్తుభమునై యుంటే § తన నెడదను నే విడిచి యుండగద !
విను పాంచజన్య మేనై యుంటే § మొనసి చొక్కుదును మోవిని గ్రోలుచు
కనకై యుందును నే బర్హిదామ § మును నై యుంటే నెత్తి నిక్కుదును
నని వనితలంద రొక్కొక్క విధమున § వనజాక్షు వలచి చిత్తము దెలిపిన
విని వారికోర్కె గని వారిసాగసు § తను మంచి దనుచు వారలు పదారు
వేలు మరి నూరుమందియు నగుదురు § చాలున సుమతులు సాత్త్వికశీలురు
నోలి సురాసుర సిద్ధనృపసుతులు § బాలలకు ధరణియును భగదత్తుడు
యొనగిరి రత్నాభరణాంబరముల § ననమువ్రాజలను పద్మాక్షుడు గొని
వసతి గల యందలములను పెక్కులను § పసిడి రథమ్ముల తురగంబుల్లెల్లె
వినుమిక నైరావత కుల జనకము § లను చతుర్దంత ధవళ మదకరుల
దను ప్రీతి నందుమ వాని నన్నింటి § దన విజయంబును కో దందించియు

ద్వారకాపురమునకు జంపించెను ౯ వారిజాక్షుండు సురల ఏను గన
చారుముఖి సత్యభామ తో డుండ ౯ మీరిన కుతుకము దార జేరియును
వనజాక్షు డదితి మందిరము జొచ్చి ౯ వినతి యొనరించె నా పెద్దమ్మకు
కని కృష్ణు ముద్దుగొని యంకమందు ౯ నను జేర్చి చనువు నెఱపి దీవించి
వనితకు మణికిరణముల ప్రభ నొప్పు ౯ నినమండలములు నా కుండలములు
యొనరంద నిచ్చి వరుణఛత్రమును ౯ ఘనత వజ్రి కందిచ్చి మణిగిరిని
యమరుల వశమున నప్పగించియును ౯ యమరనాయకుడు శచీసమేతము
క్రమ మెఱిగి పూజ లొసగ గైకొనుచు ౯ నమరాళి నెల్ల నతి ప్రీతి నింపి
వనిత గోర తా నింద్రనివనంబు ౯ ననువొంద నందనాభిఖ్య దనరు
నందున విహారమును సలుప నంది ౯ యంద మింపొంద తిరుగాడుచుండ

## –: శ్రీకృష్ణుండు పారిజాతము దెచ్చుట :–

వందనమున గోరెను సత్యభామ ౯ ఇందున్న పారిజాతము నా వన
మందు నుంప మనసయ్యె గొంద మను ౯ చందమునను నందిచ్చి మోదమున
సుందరపుష్పమరంద మానరా ౯ నిందిందిర నాదముల రాణించు
వరపల్లవాది సుమగుచ్ఛములను ౯ సరస మధురఫల శాఖలమురిపెము
సరణి నింద్రపోషణత జెంపారు ౯ సారకల్పముల నొకటై విలసిలు
పారిజాతమును గేల పెకలించి ౯ వారి ముద మంద గరుడునిపై నిడి
ధీరత కృష్ణుడు దేవపురి వెడలి ౯ ద్వారకను జేర పథమును గనగా
సురపతి దేవసమూహముల గొనుచు ౯ క్షరము నుపకారమును మరచి పట్టి
సరసిజనాభుని దాకి పోరాడియును ౯ సురశ్రేష్ఠుని యనుమతిని దివి జేరె
నరవర ! ఇంద్రుని చర్య వింటి వే ౯ నరకుని వధింప చరణముల పడిన
దినమును మఱచెను సురల పోషించు ౯ టను మఱచె వరుణఛత్రి మందించు
టను మఱచె కుండలపు మూట మఱచె ౯ విను వైభవంపు ముదముచా లదియె
జనపతీ ! భక్తవరముడు కృష్ణుడు ౯ దనపురము జేరి సంతసం బొప్ప
తనవారి మోద మందించి వినుతి ౯ గని సత్యభామ విహారించుతోట
దన మనం బచ్చ నాటించె తరువు ౯ వనిత తనఘనతి చాటె సవతులను
జననీ జనకుల హితబంధుజనుల ౯ యనుమతిని పదారువేల నూరగు
వనితల వరించె విధివిధానముల ౯ మునుల భూసురుల పిండుల గూరిచి
జనులప్రీతి నందించె నట్టులనె ౯ కనకాంబరమణు లాది దానముల
నరనాథా ! శ్రీకృష్ణు డందరకు ౯ వరరత్నకవాటముల మందిరాల్

వరుస ప్రత్యేక మంద శిల్పమున § వరవినుతి గన్న విశ్వకర్మచే
సిరశోభనంబు గుదురంద నంది § తరుణుల నుంచెను సర్వపూర్ణతను
సకలైశ్వర్యము సమకూర్చి వారి § సకలమునందుల సంప్రీతిబొందె
సకల నిగమ సంవేది ధర్మజ్ఞు § డకలంకుడు పైకైకనరూపముల
సకలమునుల సన్నుతము గృహాసము § సకల విధుల పాటించి తా జరిపి
జగద్వల్లభుడు విభూతినందెను § వగలాడు లందరును సగటు దన్ను
మగడు ప్రేమించు నందఱ కెక్కువ § జగి వన్నెనించు పగళ్లు రేలును
నా యిల్లు వదలి పొరుగు నెఱుంగడు § నేయమున సొమ్ము లందించు నాకు
నా యనురాగము నంది మోదించు § నా యర్చ లంది నగవు నింపునను
తగుభాగ్యగరిమ నాకె గరిష్ఠము § నగధరుని పూజ నేనే ధన్యను
జగతి నావంటి యతివలు గలరే ? § ఖగవాహనుండు నాకె ప్రియతముడు
అనియు నందఱును హరి సేవించుచు § ఘనత పూర్వదురితమ్ములు దొలంగ
ఘనమైన ముక్తిపదము చేరువగ § గనగ పరిపూర్ణ సుఖముల దనిసిరి
హరిని రాగోర వచ్చినంతనే § చరణముల గడిగి యాసనంబిచ్చి
పరిశుద్ధస్నానమొనరించి దివ్య § తర పీతాంబరములు గట్టనిచ్చి
వరరత్నభూషణముల గంధముల § తరతమపుష్పము లక్షతల చేర్చి
పరమాన్నములను భుజింపఁ బెట్టియు § సరస కర్పూర తాంబూల మొసగి
వెస గదిసి శిరము దువ్వి శయ్యనుఁ § పసదనంబునను సిద్ధ మందించి
పసిమింప దాము భూషిత లన్నిట § కుసుమాయుధ జనముల బోల్కి దాసి
నొసలు సోక నడుగులకు మ్రొక్కుచును § బిసుకుచు దాసీజనములు విసరగ
నరుదార సౌఖ్యరతుల సలుపుదురు § సరసిజాక్షుండు మెరయుమోదమున
హరి యంతమరెది తరుణుల నొక్కట § బఱవు విలాసము లరుదు నిండింప
పరము డగుట నది జెల్లె యోగరతి § వరుస భోగరతి యోగం బొకటిగ
వరతపంబులను యోగధ్యానముల § నరయ దుర్లభుడు మోహావరూపుడు
పరమశివ విధాతలకు నర్చింప § దరమందని దేవుండు తరుణులకు
వరము లొసగ వరదు డయ్యె నరవరా ! § సరసిజనేత్రల తొంటి తప మేమొ
ఆ రామలతో నెప్పు డాహరియు § పోరాముల గనుచుండు మెచ్చుగను
ఆరామంబుల దిరుగువారి జత § నారాజముఖుల గౌరవ మొప్పగ
సారసాక్షు [illegible] § [illegible] లభింప నారాధ్యు గనె

-: శ్రీకృష్ణుండు కేళీగృహమునందు రుక్మిణీదేవితో విరసోక్తు లాడుట :-

శ్రీశుడు భీష్మక రాజనందనను § వేళమందు నొక విలాసరమణత
దాశరథిజాత చా లంది తనకు § కేశవునివశము సంచిరి నంచని
తాసె మిన్నయని హృదయమున మదము § నానె నది బాపదని నిశ్చయించి
వేన రుక్మిణీకాంత మోదింప § నా నీలవర్ణు డింద్రనీలముల
మరకతాది మణిస్తంభంబులచే § నరుదుగొల్పు రత్నంపు దీపికల
బంగారు కుంభ కుడ్యగవాక్షము § లంగు మించు సోపాన వేదికల
రంగైన చంద్రశాలల ముత్యపు § చెంగలింపు గను చిత్ర కౌశేయ
వితానములచే రమ్య మందించు § నితాంతహర్షము నింపు నా మంది
రాంతర్గృహమున కుసుమమాలికల § సంతసం బమర నలంకరించిన
శీతకరుని కిరణంబుల చాయలు § వాతాయనముల జొచ్చి సొంపు నిడ
నా తమ్మికనుల నలరుదేవుండు § ఆ తలోదరియె సిద్ధమొనర్చిన
ఆతతంబైన శరత్సోమకళ § చేత జయమందు ధావళ్యతల్ప
మునను సుఖాసీనుండు తా గాగ § కనకభూషణాలంకృతులు దాసి
జనులు చామరములను వీవ పోయి § గనుచుండు నంత చిందంద మంద
యంచయాన గిరి శిఖర జిత్స్తని § మించుచంచలల నా తను వొప్పగ
నంచితంపు కరపల్లవముల గద § లించ కంకణము లుంగరముల రుచి
నచట వెలిగించుచును నూపురాదు § లంచుల నొరపిడి రవమింపు గాగ
చెక్కులు బంగరు కమ్మలకాంతుల § నొక్కట నిక్కగ నగ ముద్దు నింప
చక్కనిపయ్యెద కొంగు దూగంగ § చక్కన కృష్ణుని సన్నిధిని జేరి
బోటిచేతి చామరము తా నంది § నీటు నందు తను మాధవుడు గనగ
పేటుగను ప్రియము వాటించి యింతి § గోటు గొనె విసరుటకు దరిని నిలిచి
పతి దాల్చినట్టివైన యవతార § గతుల దా పట్టె నతని సేవింప
గతి గాను శ్రీ వనితామణి రుక్మిణి § యతివరదుడు తను మరినిర్మల యా
వనజ జనకుండు వనజాతనిలయు § మను పతండైన శతరూప యగును
ఘనుడు వైన్యుడగు దా నర్చి యగును § జనవరోత్తముండైన జనకసుత
వనిత శుద్ధాంత రంగనిక్కపటి § కనక చేలుండు గాంచి యిట్లనియె
కొమ్మా! శుభాంగి! క్షమ్మానవతులు § నెమ్మతుల నిన్ను శ్రీమవు నమ్మ
కమ్మని వాక్కుల బల్క నే విందు § సుమ్ము నీ సుగుణమందరికి మిన్న
రాజవదన! రణమున బోలెదవు § రాజవినుతుడగు భీష్మకుని సుతవు

రాజపుత్రి! నీశీల మద్భుతము ఽ ఈ జగన్నుతము నీరూప మతివ !
నీకు వరుడు బలశౌర్యసాహసుడు ఽ ప్రకటయశుండు పతిగ గాదగును
నాకు నిను పతిగ బ్రహ్మ గూర్చెనో ! ఽ ఈకరణి గూర్చు నేరమి యతనిది
లోక నడవడికి గానివాడ గద ! ఽ పోకడ నితరుల కగపడగ నీను
భీకరు లుగ్రులు బలియురు రాజులు ఽ ఓ కమలాక్షీ ! పగగొండ్రు నాతో
రాజలోకముల పదవీశమ్ముల ఽ రాజిత మందగ బో మాకార్యము
నీ జలరాశిలో నొక దీవిగడ్డ ఽ మా జనంబు నివసింప మిద్దెలను
గట్టుకొనియున్న వార మింతియే ఽ పెట్టుబడికి ధనముల గుట్టలేదు
చుట్టములైనను భాగ్యములపెద్ద ఽ గిట్టుబడుల గలవారలే యరుదు
పనిలేనివారె బంధువులు మాకు ఽ వినుమా ! నడవడి గుట్టువెలి నిడము
మునుకొను గుణముల హీనతి గాంతును ఽ వనిత ! సన్న్యాసులే నాజత గన
నీవు నను మగనిగా గొంటి వెట్లు ? ఽ నీవలని బుద్ధి యెందు నే దెలియ
రో వనజగంధి ! తగుదునే ? నీకు ఽ సేవలని సుఖము, నా వలన నీకు ?
నీవు యాదవుని వనిత వనదగవు ఽ కేవలము రూపు సిరి, కుల, బలములు
లేవు నీయన్న యనినట్లు సరిని ఽ యే విధినైనను తూగ నిజంబుగ
తగవు వరయకను నే పొరపాటున ఽ తగుల దలచితివి ఐన నేమాయె
జగి వేళ నాకుగా దగిన నన్ను ఽ దగుల నవ్వుదురు నాకు నిది దగదు ॥
వగబాయు తగిన మనుజేంద్రు నొకని ఽ తగ వరింపు మది నీకు హితంబగు
మగువ ! నిను సాగ, నడ్డము చెప్పను ఽ తగవైన చోటికిని పరువు గొనుము
గోపకుని విధముననను గాచితి నని ఽ పాప మెన్న నే రిపుల జంపునెడ
భూపతుల విజ్ఞప్తిగుట కోర్వను ఽ నీపగిదిని నే రాజుల పెక్కుర
విరోధి నైదును శిశుపాలాదులు ఽ జరాతనయుడును మదించి యుండుట
దురంబునను వారలను సడి యడప ఽ తరం బెంచి నిను, దెచ్చు టయ్యె నో
సరోజనేత్రి ! యది తప్పైనను ఽ పరంబెంచి నీ కనుమతి నిచ్చితి
వరింపు నీమది నెలకొను తలమును ఽ బిరాన నంపుదు కాన్క వలతేని
యదియు నొసగుదును చేతనైనంత ఽ వదలు ప్రీతి యిందుండగా దతివ !
కాముల సంగతిని బోను నేను ఽ కామమోహాదుల దూర మెంతు
నీ మది నమ్ముము కాంతా, తనూజ ఽ ధామ, భూ ధనములను, నాసింపను
దేహ మిదియు నిందు నుండి తొలగు మన ఽ నా మహిళామణి యా మహాసీయు ని
యామక మిటు లనుటను వనరుగొనుచు ఽ భూమియు నాకసమును నేకమందు
టను వెలుగు గనక కనుల కోకమున ఽ యొనరంగా దిర్చినట్టి కాటుకయు

కన నీటిధారలను మాయ వక్ష ǂ మున దరలి కుంకుమాది లేపనము
లను రుచి మలపగ వేడినిట్టూర్పు ǂ లను బరువుమోవి కందంగ పన్న
తనువున వికృతిని గన చెలువుమాయ ǂ వనిత ముఖపద్మ మపుడె వాడంగ
ననిలు వడి దూలు తనువును బోలియు ǂ తనకరముల పత్రికలను గండములను
కనకలత బోలు తనువు వడకు గన ǂ మునుగొన్న స్వేదమున శీతలమ్ము
దనర మనము పరవశముగ హా యని ǂ వినుము నృపాలా! చెవ్వుల శూలముల
వేనవేలుగా బొడుచుటను బోలి ǂ తనదు ధీరతయు వ్రయ్యలుగా నల
గనక జింక పులిసామ్యమున తన్ను ǂ వనజనయను నుడువులను జీవకళలు
తూలె నన్నట్లు నేలపై వ్రాలె ǂ నోలి నా హరిని లక్ష్యమున నిలిపి
జాలి మిక్కుటపు దశ లలన యట్ల ǂ పా లందినంత నీలవర్ణుండు
కీ లెడలి పడిన పుత్తడిబొమ్మను ǂ కీలు గూర్చి జీవముల గుత్తుగొన
నిలుప కరుణ చాల్గొనిపె నన్నట్లు ǂ వనజనేత్రుడా లలన దెలివంద
గనజేసినట్టి చర్యల జెప్పెద ǂ నని యా శ్రీహరి యింతిని జూసియు
వనితను కరముల తనువునను దార్చి ǂ కనుల పన్నీట గడుగుచును చంద
నము నలది కర్పూరము పలుకు లంత ǂ క్రమమున చెవులను నూది ధృతి గొలిపి
విమల దయామతి ముత్యమ్ముల హా ǂ రముల చిక్కు నవరించుచు నుదుటను
తిలకమును దీర్చి తొలగిన సొమ్ముల ǂ నల సరి పరచియు లవి చాలుగూర్చి
తొలగిన పయ్యెద కుచములను పొందు ǂ నలవరిచి చెమటలను బాయ తాళ
వృంతముల విసరి మెలన కన్నులను ǂ సంతసము దోప విప్ప సమ్మదము
నింతికి నింపగ మనము విలసిల్ల ǂ చింత బాయ నాయాసము నడంచి
వదనమున కళయు జేర కరుణించి ǂ బెదరు పో జేసి ప్రియము సంవృద్ధి
యద నందిశయ్య పదిలమున గూర్చి ǂ హృదయము శాంతికి నెలవుగా నిల్చు
చును నా జిష్ణుడు కృష్ణు డయ్యింతి ǂ గని లాలనమున నలర నిటు లనియె
వనిత ఫుల్లాబ్జవదన! నీకలత ǂ నను వందించితి యది దరలె ననుచు
బిగి కౌగిలించి మోమును నివురుచు ǂ వగను దొలగించి వన్నె వెలిగించి
తగవున తిన్నన ననునయించినను ǂ జగదీశు కృష్ణు గని యా రుక్మిణి

## —: రుక్మిణీదేవి శ్రీకృష్ణలాలితయై యతనిని స్తుతించుట :—

పురుషోత్తమ! శ్రీకమలదళాక్షా! ǂ మురహర! సురేంద్రవినుత! గుణభూషా!
నిరవధిక! విమలతేజ! విలాసా! ǂ పరమదయాబ్ధీ! పన్నగశయనా!
ఖలనిర్వాణమె పనిగా గొనుచును ǂ ఇల నవతరించినట్టి నిను దెలియ

నలవడునె భక్తవత్సల! యనంత! § యల విజ్ఞానం బాదిసర్వమగు
బలశక్తులన్ని నీ సహజరూపు § వలన వెలి. గనగ దోచుమాయచే
వెలుగు నశించును లీనము నీలో § జలధరశ్యామ! నేను నీవలని
కీలుబొమ్మనగు దాన జడమతిని § నోలి నీకు దగ నెత్తు వత్తునే
సలిలమందిరా! సకలజగత్పరి § వలయోదారా! యుదారమూలా!
యుదరస్థిత బ్రహ్మాండ ధారణా! § ఉదితపరమేష్ఠి! యుపేంద్ర! జయ హరి!
సదయ! సర్వజ్ఞ! కాలస్వరూప! § యదనున ప్రకృతిని వెలిగింతు వీవ
నీవు శుద్ధసాత్త్విక సిద్ధమూర్తి § కేవ లానంద చిదాత్మకుం డని
పావనుండు ప్రణతిల్ల నర్హుండు § రే వలను గన్న నద్వితీయు డవె
యనుచు నిను మొదట నుతి నతి మానత § మునులు కరములను మోడ్తు రట్టి నిను
దనర సమీపము నంద నీ మూఢ § వనితకు దరమెటు నీ దయాదృష్టి
వర మందితే గా వరుస నటు గనుట § తరణి శశి నయన! తారకమూర్తీ!
నిను తన్మాత్రల గుణవిశేషముల § రొనరిన మంగళసుందరవిగ్రహ
మునుగా నవిద్యనైన తమస్సును § నినుడు బాపినటు నిను లక్ష్య మెరిగి
గని వినుతిజేయువారికి వశుడవు § మనుజపశువులకు దుర్విభావ్యుడవు
వనజభవుడు నీ నిజ మెరుంగ డన § వినియును సుమతులు నుడుగని యత్నత
కును జొచ్చి యోగముల విశదమంది § కనిరి నిశ్చయము బ్రహ్మయును తోడు
గను ధారణమున బద్ధుడవు నిన్ను § మనమున చలతను నిలుపవలె తొలుత
మునుకొని భక్తి నీ సంగతినే § గని ముక్తసంగతిని సంసృతినిగ్గా
నిరసించి దివ్యధామ మందెదరు § నిరుపమానంద మది నీ పదంబె
నీ పద సరసిజ మకరందమ్మును § నీ పరసత్సుతులను విను పవిత్ర
తే పట్టుగొన్న భృంగములమేర § నా పరమ సుధను గ్రోలుదురు దేవ!
నీరజాక్ష! నీ దాన పరతంత్ర § భూ రంజితుడవు లోకలీలకై
కారణంబు వెఱలేదు స్వతంత్రుడ § వరయ తత్త్వారులు నీ మాయాబద్ధత
మునిగెదరు దేవ! నే నీ దాసిని § మనవి విను మట్లు నే నగుట నెఱుక
గన దగితి నింత మటుకె మదించిన § నను వడగించితి వది నా భాగ్యము
నీవు మునీశ్వరయోగి వర సురల § పావనధ్యాన వైభవోన్మతివి
ఈ వనిత కెట్లు ఆ జ్ఞాన మబ్బు నీ § ఏవేళ సుస్మృతి నిబద్ధ మంది
కేవల ప్రాకృతజనుల నడవడిని § తా వందియుంటి నీ శిక్ష దెలియ
నమో సర్వేశ్వర! నీ బామ్మమిడి తో § నయివున కాలపువేగమున గన్న
భయమున గేనదరా కమలభవుడు § నయమాదిగ బ్రహ్మాండ నిందారిమును

కన నమంగళమ్ముల విభవంబుల ƒ రొనరు లెల్ల దప్పుదురు నిను గతి గ
నని తేటపడియె నా తొంటిపూజ ƒ నిను వరించితిని నా కోర్కె సెల్ల
శరశార్ఙ్గధనువు శరసాధనముల ƒ నరుల జయించియు శూరత నెఱపి
హరివి హరిబోలె విక్రమించినను ƒ తరుణి నుద్ధారమున గూర్చి పాసి
నను గైకొంటివి నా కదియె చాలు ƒ నిను జరాసంధు డాదిగా నెఱపు
నను వనధిలోన నిలుగట్టి తనుట ƒ వనజలోచనా! మాయయొ! లీలయొ!
నిను గొల్వ మున్ను రాజర్షివరులు ƒ ఘనమైన రాజ్య విభవముల వదలి
వనములను నిలిచి మనములను చలన ƒ మును గనక కామమత్తుల జయించి
విమల విజ్ఞాన నిరూఢు లగుచును ƒ విమలాంబు పర్ణ వాయుభక్షణాల
క్రమత నీపాద కంజమరందము ƒ శమమంద నాని సుజన వందితము
నగు పదము గనిరి నారదసన్నుత! ƒ తగ విట్టిదిగా నెఱుగు కృతమున్న
జగి కొంత నేను గన్నట్టిదాన ƒ తగవు బో నితర మానవాధముని
సేవ గోరుదున! యది నిన్నె జెందె ƒ దేవ! నిను దొలగిపోవ దలంపను
ప్రోవులుగ దలగు కల్పములనైన ƒ యావిధిని కాలముల న వెన్నింటను
నీవె యధికారి వరయ నీయింతి ƒ కీవె జీవంబు పరమపదం బిదె
పరమార్థ గీత శబ్దవాచ్యుడవు ƒ వరద! షడ్గుణైశ్వర్యస్వరూపి
వరయ శుద్ధసత్వస్వరూపియు ƒ పరబ్రహ్మ మనదగియున్న నిన్నె
జగ దధిపతిగా నెరిగి సేవింప ƒ దగ వందితి విను మింక నా మనవి
తగులు మరణాది వృత్తముల దిరుగ ƒ బెగడు నిరయమున గూడెను నడతల
మదమును విహీన మతులైన జనుల ƒ సదనము దురితాంధమునను తలంబె
వెదకుచు బోయెడు దుర్మతుల నేను ƒ గదియ దలంతునె శౌరి! నరకారి!
పురుషుడు నీపదసేవానుసరణి ƒ చరియింపడేని వాని తను రోమ
పరములు మీసములును నఖ క్లేశము ƒ లరయగా నింక లోన యున్నట్టి
వరమాంస రక్త శల్య సంఘాది ƒ పరనీచధాతు సంగతిని గన్న
తనువు కామింప దలతునే నీచ ƒ తను గూడి రతికి పురుషాదేశత
పురుషోత్తమ! నీ వలన వినినట్టి ƒ నరపతులు తరుణి ధనములను దగిలి
ఖర, బిడాల, గో, ఉశ్వాది ప్రాయులయి ƒ పరము చింతింప నభిమాన వశత
పరమేశ్వర! నీ చరిత హారాదుల ƒ పరమై మునీంద్ర పతితమంత్రమై
పరమానంద నిధానమై కామ ƒ నిరసన పథమై ముక్తి నందించు
సకల శ్రుతి దంతరాత్మవైనట్టి ƒ సకల దురితాపహరణ స్ఫురణాత
సకల కామ్యపరితుష్టి ప్రదంబు ƒ సుకర మోక్షరూపంబు నగు నిన్ను

జపము నొనర్పగ జాలి వెలసితిని ఽ విపుల సంసారవార్ధిని గడచితి
కృప నింపు మంతె చాలు నీసేవ ఽ నపరిపాటి నీ విచ్చుకాన్కల వె
మెపుడు వలపునను గూర్చ నవి ప్రాప్తి ఽ యపుడు ఘటించుట లో నమ్మదావ
వాన గుఃయుతెరి యా ధారలనే ఽ పాన మొనరింపఁ గోరు చాతకం
బే నాటికైన చొటిపడె జేర ఽ మానస ముంచునె నను నరయు మటుల
సురుచి నందు మా కందఫలరసము ఽ వరుస మోదమున గ్రోలు కీరమటు
పరువు బారు నుమ్మత్తచోటులకు ఽ పరమపురుష ! నను బోలువు మట్టుల
నీరదపుగర్జ విన్నమాత్రమున ఽ సారతరపు టుత్సాహము నందియు
చారుపింఛమును విప్పు యా నెమలి ఽ శోరునే ! కఠిన ఝల్లీరవంబు
సారసనాభా ! ననుజూడు మటుల ఽ వీరశేఖరా ! నా మనోహరా !
నా జీవితేశ ! భవదీయ పాద ఽ రాజీవయుగ్మమును సేవింపగ
రాజి గాంచి యుద్యోగము గంటిని ఽ ఓ జగద్వినుత ! అన్యు వరింతునె !
భర్తవే ! హృదయభర్తవే ! భువన ఽ భర్తవే ! ఆర్తి బాలగించి తీవు
వర్తిలెద నింక నభిమానమెన్న ఽ నర్చింతు నిన్ను ముక్తిభర్త వని
యతిశయంబైన కృపచేత నన్ను ఽ మతిని పరిశుద్ధి నందించి తీవు
యతీంద్రవినుతా ! అమలస్వభావ ! ఽ వితథ సంసార ! వితతమందార !
మగు నీస్మరణము నే బొందగంటి ఽ నగవాసవినుత ! మది నీజపంబు
వగబాయ జన్మ పరపూర్వ సుకృత ఽ ముగ ఫలింపుగా మత్పతీ ! జగత్పతి !
యనిన వనిత దనఘనత గొనియాడ ఽ వినుచు దరహాసిత మునుఁ దోపనుండ
మనమున ప్రమోదమంది మరి యనియె ఽ వనజాక్షు ! వనిత పరపురుషసక్త
యైన విడువదగు స్వైరిణి యదిగా ఽ కాను దాని విడకుండిన నరాధ
ముడు వాడు భయమ్ముల భ్రష్టుండగు ఽ వడి గనడు ముక్తి యడరు వాటిల్లు
మును భీష్మ డిట్టె చాలున యంబను ఽ గని వెడల నడిచె తమ్ముని గూర్పక
దనదువృత్తమున సుఖంబు నెరుగక ఽ వనిత యష్టకష్టముల చా లందె
వనితలు స్వైరిణి వృత్తిని దప్పిన ఽ కినుక గొని పతియు నాకొను విడిచిన
యతని కట్టులనె సుగతి సున్నయగు ఽ మతిని మనవి యున్నతి నోడ గొనుము
పరమపురుషు మది నెన్న విజ్ఞాని ఽ తరుణి పాపమతిగా వదలడేని
వరుస నింద్రియములను లోగి పరమ ఽ పరణిదప్ప ధనమున తనువునైన
మునుకొన్నయాశ నిరసింపబోక ఽ ఘనశీలవృత్త మడచి యపయశము
గను వానికెల్ల సుగతి చొప్పదదు ఽ వనజనయన ! కృప నను దృఢము నిలుప
మునివినుతా ! యుద్దాన ముదితహృద ఽ యను నే నయ్యెద నన శ్రీకృష్ణుడు
వనితను మెచ్చుచు తనచాతుర్యము ఽ నను బుద్ధి కుదిర నని కరుణ నించి

## -: కృష్ణుండు రుక్మిణీదేవి నూఱడించుట :-

యలివేణి ! నవ్వుల కన్నమాటలకు | నలికి యిట్లుగ తగవు కొన దగునె
వలరాజురతుల యనిసేయుపట్ల | తలపున వనిలో వేడాడుపట్ల
పలికిన రెన్నియొ నలు కలుకుగొనుట | అలత కలతపను గుటి బొందు టతివ !
విను మెగ్గుగొనుట మేలె నీ కతివ | నను నెరుంగుదువె ! నీ వలన మెలగు
పని నీచిత్తము గన గోరి పలికె | తిని నీకు నిండ చింత కూడుటను
దలప నాబాల ! కలతను విడుమా ! | చెలువురు చెలియల ముద్దుపల్కులను
కినుకలు కనులను గెంపును తియ్యన | దనువు మోవియును జంకెల తీరిన
కనుచూపులు నెగసక్కెము లాడుట | లును మగల మగువలను సమాధికత
లనుకూలరేఖలను గూడునాట | లను తగునందున కిలసమేతల
లలనల రతు లబ్బుటలు తొలిజన్మ | ఫల కలిత గరిమ నా లలితవు సతి
దేవి ! సద్గుణవు నీవు పతిభక్తి | నావరింపు గని దైవమని దివ్య
భావన గొల్తువు నీ మానసంబు | నావైపు వలపు నీవుట్టుకాది
యో వనజగంధి ! నిజము పెద్దలను | నే విన్నాడను నెల్లసంగతుల
తప్పుగా బల్కుటయ్యె నీకైన | యొప్పుల కుప్పవు యోగ్యంగవలదె !
మెప్పు నింపితివి ముద్దువాక్కులను | తప్పక నిత్తును కామ్యముల నన్ని
నేను సర్వపూర్ణుడను సన్నుతుల | వేనినైన నొసగుటకు సంసిద్ధ
మానమున నిలుతు భక్తహృదయముల | చానరో ! నన్ను యేకాంత మెన్ని
సేవింపులనే మతినైక్యపఱచు | దేవమయుడ నారాయణ నాముడ
భావిభూతముల నేకాకారుడ | నీ విశ్వమెల్ల నా స్వరూప మని
ధ్యానము నిలిపిన నన్నుటం తృప్తుల | నేన యొసరింతు నీ వట్టిదాన
వైనందున నీకిత్తు నాసేవ | దాన సకలమగు సిరులు నీయందు
నిలిచె నీభాగ్యకలిమిని ద్వారక | వలచి నిలువుకొని సంసారినైన
లలన తనువు మానసము ప్రాణమును | వలపుగొని దివ్యతను సిద్ధిగాంచి
వినుమ ! విశ్రుతతమభావమున నన్ను | గనుటగాదు సతులకు నేరికైన
వనిత ! కడు దుష్కరంబు నాసేవ | కును జాలితివో నా వాక్యములను
కననగు విభూతి నీయందు నిలువు | కొన పదిలత గని రాజిల్లితి విటు
నిరతానంద పథంబు నాచిత్త | మరయు నీకబ్బె కొరత నంద నిక
తరుణి కామవశమున సుఖముల | ధర నన్ను తపోవ్రతము లాదిగా
కోరి ధాన ముక్తివి దూరమాన | సరణి దారుదురు దాంపత్యయోగ

ముల సతివ ! నన్ను గలిసితట్టులే ఽ చలనమిది యనుచు నచలితంబు మన
వలపున దాంపత్యమును వహించుట ఽ కలికి ! నీనేర్పు గానబడు నింక
కుసుమబోడి ! నీ యసమానభక్తి ఽ అసదృశమ్మనగు ననీ ముక్తిమొలక
విను మంతలోన నిటు వాడి గంటె ఽ పసిదాన వగుట పస గన వో కొమ్మా !
బిసరుహనేత్రి ! పోషింపుభక్తి ఽ వెస ముక్తి దక్కు నీకు నిక్కంబు
వసియింతు నేను నీ మధురఫణితి ఽ సుసమంజసము నగు నీసన్నుతి
కసటు బాయ నీ కౌగిలి బాయను ఽ పసిడి బొమ్మవగు నీ సొమ్ము నేను
బాలా ! నీ వా నాట నీయన్న ఽ ఆలాన నన్ను తూలనాడగద !
నాలోని కినుక నెఱిగిన హృదయపు ఽ యాలోన దెలియ నేరగ మే లిది !
నాలావు నెఱుగకుండెను నతనిని ఽ వేలార్చితి నవమాన సంగతిని
ఓ లతాంగి ! యందునను నను దెగడు ఽ పాలందవు నను విడ నిచ్చగొనవు
నీలకుంతలీ ! నీలాంబరుండు ఽ ఓలి నీయన్న నేల కొరిగించ
నాలోకించియు నీలో వగపును ఽ బోలగొనవుగద కాలముల నెన్నొ
నీకు వహితములు గానైన భక్తి ఽ నాకార్యసరణి మెచ్చిన దానవు
నాకు నీస్తోత్రలత బంధనంబు ఽ నే కట్టుగందు నది నాకు సహజ
మనిన నానంద ముప్పతిల్ల నా ఽ వనితామతల్లి సిరికల్పవల్లి
యన వికసిల్లిన వదనరుచి పతిని ఽ వనజములబోలు చరణముల శరణ
మని మ్రొక్కె ననిన విని పరీక్షిత్తు ఽ మునివర ! రాముం డెటు జంపె రుక్మి !
తన కేమి కీడు గూర్ప త ప్పరసి ఽ పనిగొని దునిమెను ! వరుస వివరింపు
మన మాని శుకుడు పాండవపౌత్రుని ఽ గని విను మో పరీక్షిత్తు జననాథా !
ఇటుల శ్రీహరియు లీలానటుడై ఽ తటమున గృహస్థు డను ధర్మరతిని
కుటిల కుంతలిని నగవుల గూర్చియు ఽ జటిలవినుత శీలమున వర్తిలుచు
నెలమిని వనముల పూపొదల మరియు ఽ కొలకుల కెలకుల తరుల నీడలను
విలసిత నవీన శృంగారభవన ఽ ముల రచ్చలందు నాట్యరంగముల
నా రామామణి రుక్మిణీభామ ఽ తో రాణ నంద నానందంబున
నా రామభూము లందు విహరించి ఽ పోరామిని మరుకేళీ వినోద
ములను మోదంబు గూరిచె నామెకు ఽ లలన కృష్ణు తేజమున దనరారు
తనయులను గనెను వారు పదిమంది ఽ మును ప్రద్యుమ్నుని కథ చాల విన్న
ఘనుడు తొలిచాలు యవలివారి విను ఽ మనుజేశ ! చారుదేష్ణ సుదేష్ణులు
గనగ సుచారువు, చారుదేహుండు ఽ విను మటులె చారుగుప్తుడును భద్ర
చారువును, చారు చంద్రుండు మరి వి ఽ చారువు చారువు నను వారు వారు

మీరిన బలాఢ్యు లందరు వీరులు ఽ సారస నయనుని సములు, శౌర్యమున
వారిజ నాభుం డాసత్యభామ ఽ చే రమణీయములైన సేవలను
కోరిమి నెఱపుచు సంతు నటుగాంచె ఽ వారల కందఱకును నాపగిదిన
పదియారువేల నూరుసతులందు ఽ నుదితులై రట్టి పుత్రు లసమాను
లుదయార్క భానుకిరణముల పోల్కి ఽ యదువంశతరణి యబ్జనేత్రునకు
గలిగిరి తామర తంపరను బోలె ఽ కొలదికేని మించె మరి వారిసంతు
లల యాదవ వృష్ణులు భోజాంధకు ఽ లిలలో వంశము లవి నూట యొకటి
మే లంద విద్య బోధించు గురుల ఽ వేల గొన మూడుకోట్ల నెనుబదియు
వేలు మరి యెనిమి దట్టివే యగును ఽ బాలుర నెన్నగ కూలియో తామర
చూలియో వలయు వారి తరమేమొ ఽ నేల యేలికా! విను ప్రద్యుమ్నుడు
ఘనుడు తన మేనమామకూతురును ఽ వినయసౌశీల్య రుక్మవతి నాగ
వనితను పరిణయమందె బలమెఱయ ఽ నన వదియెట్టుల హరిని పగగొన్న
మును నాటి రుక్మి నా డాతండును ఽ తనపుత్రి నెట్లు ప్రద్యుమ్ననకు
పరిణయంబునకు నొప్పె వివరింపు ఽ మరయ చిత్రమన నరనాథ! యతడు
హరిపైన కోపమునను గూరియును ఽ సరసతను గనియె కాలంబు కొంత
జరిగిన చెల్లెలిపైన మమతచే ఽ వరుసగ పెద్దగ వైరము వెలికిని
గనపడనీకను నుండి తనపుత్రి ఽ కిని స్వయంవరము చాటించి రాజ
తనయులను దెసల నుండి రప్పించె ఽ ఘనుడు మాధవుని సుతు డతడు తీక్ష
తను భీషణముల ధనురస్త్రములను ఽ ననువుగ దాల్చి రథముపై నెగి
జనపతుల సుతుల మానమున డులిచె ఽ వనితను రథమున జేర్చి కూరతను
నింపి జనకుడగు కృష్ణు డగ్గింప ఽ సొంపున ద్వారక జేరి బంధుగులు
ముంపిరి ముదముల మంచిదినంబున ఽ ఇంపున బెండిలి యాడె రుక్మిసుత
నువిద కింకొక్క చెల్లెలు గల దా ఽ యువతి చారుమతి నామమున వెలయు
ప్రవిమల గుణుండు కృతవర్మ సుతుడు ఽ సవిధిని వివాహ మందె హరి మెచ్చ
విను రుక్మి యిట్లు వైరంబు మరచి ఽ మనమున నొకవిధి బంధుత్వ మొంది
యునికి ననువు చొప్పదియె యందుననూ ఽ మనుమరా లొకతె రుక్మి తనయసుత
కనకాంగి రుక్మలోచన యను నా ఽ వనితను ప్రద్యుమ్నుని తనయుండగు
యనిరుద్ధునకును పెండ్లి యొనరించె ఽ వినుమా! వైభవ మట విదర్భలో
కనుల రమణీయత మెఱయ కీర్తి గన ఽ పుడమిని జనులకు పరలర విందుల
నిడుచు దంపతుల కనక రత్నముల ఽ జడిగొను భూషణ రాశిని నింపుచు
హరి బలభద్రులు బంధుజనంబులు ఽ వరుసల రుక్మిణి రేవతియును మెచ్చ

తరుణులు ప్రద్యుమ్నుడు రుక్మవతియు § కరి తురగ స్యందనముల పదాతుల
పరితోష మొప్ప విదర్భ కరిగిరి § వర సత్కారము లంది రచ్చటను
నరపతులు రుక్మి కనుకూలు రందు § హరి సేవగించు వారందు గలరు
వారలు పెండిలి గాంచ జేరిన § సారతరంబుగ విందుల గుడిచిరి
యదుకుమారు లుత్సాహమున మిగుల § నది యోర్వలేమి ఎకసక్కెములను
ఆదిరా! గొల్లల సంగడికాం డ్రిట § గదిసిరి బంధులుగా మనదయచే
గుదిరి రన వారు విని నవ్వుకొనుచు § పదిలమగు మానధనులు మీ రగుట
మిము జేరి నేర్చుకొంటిమి మానము § క్రమత దూల నిలుపంగ మా సుతుల
సుముఖోడుల మీ మగసుతుల కిచ్చి § సమపౌరుషంబు జెందు యుక్తినన
నదియు వారి నెకసక్కె మాడుటయె § బదులు బనులట్టు మాటల రేగుచు
నదను సెల్ల బో నుండి రందునను § మదమున గ్రాలెను కళింగనరపతి
యదువరుల నీవు పగ దీర్చుకొమ్ము § మదిలో దలపుము నీ మొదటి ప్రజ్ఞ
కిది సమయ మగును బలరామునకును § ముదము జూద మాడంగ నందునను
నేరుపు నెరుగడు ఓమను సర్వము § వారి బోడిగా నవ్వి ద్రొబ్బుదము
కూరిమిపట్టున గాని గొల్వ మన § దారు నరిష్టము దలపక రుక్మియు
నొసటి వ్రాత యట్లుండ సమ్మతిని § వెస నుబ్బు గొనుచు ప్రలంబువైరిని
బిసరుహాక్షు పరవీరోదారుని § నసమాన ధీరు నా హలాయుధుని
బిలిచె నో బావ! పొద్దుబుత్తు మిట § నలరున నెత్తము నాడ నేర్పరివి
తెలియవలె నిన్ను రామ! రా మారు § బలుకకు ధనంబు లొడ్డుట కొంచెము
నన సంతసమున సంకర్షణుండు § మునుకొనియె జూదమున రంగమంది
జనులు గ్రమ్మి నిలువంగ క్రమంబున § ధనము పదినూరు వేలు పదివేలు
ననుచు పందె మిడి యాడగా గెలిచె § దనమదము దీప్తముగ నారనున్న
ఘన దీపకళిక వలె యాటలన్ని § వెను దీయ డందు బలు డాతురమున
వినడు దనవారి యనువగు నుడువుల § మనమున శాంతము గనె పరులు నవ్వ
జనవర! కళింగపతి నవ్వె మిగుల § వనజభవు డిచ్చినట్టి యాయు వా
ఘనుని చేతిలో నుండ పండ్లిగిలు § గన పకపక వినువారి నందరితో
దన కవమానము కినుకయు దోడుగ § మునుకొని పెనుకువ నంద రోసమున
మన మారియాటకు లక్ష పణమొడ్డె § ఘను డాకృష్ణుడు వారింప డదియు
తన మనము బ్రహ్మలిఖిత మనుసరము § జనవరా! యప్ప టాటను గెలిచెను
బలభద్రుండే యతడు గాదనగ § యల రాజలోకమును జనులతులను
తెలియ బల్కరో! యయ్యలు! యాటను § గెలిచితిని నేన యతడు గాదన

ఇలను న్యాయమున మీరు మధ్యవ ౯ ర్తులు నాగ బదులు బలుక కెవ్వరును
ఖలమతుని రుక్మిపట్టున గాదన ౯ చల మొగమాటమునఁ గూడి యుంట
బలుడు మరి రొడ్డి గెలిచి మరి యడుగ ౯ దలలు వాల్చి బలుకుటకు జంకి రా
యదునన నీయాటను బలిదేవుడ ౯ యుదిత జయంబును బొందె విదర్భుడు
ఇది గెలువ డనుచు నశరీరవాణి ౯ బలుకు బల్కె దిశ లన్ని ధ్వని నిండ
చదురందినట్టి సభ మెచ్చి రతని ౯ పదిలతను వినడు దాని పెడచెవిని
మది కినుక రేగ నేనే గెలిచితి ౯ ఇదియు మాయచే తా ననిపించెను
యదువంశజాతి నరపతుల గెలువ ౯ యదను గొందు రెటు యతివి మదంబును
గుదురు కొన్నాడు నాగలిని దున్న ౯ నదును గల యితడు పందెము గెలుచుట
కల్ల యే మనగ కన్నుల నిప్పుల ౯ ఢుల్లినటు కనలి హలము చే గొనియు
పెల్లుకోపమున నార్భాటమ్మున ౯ వల్లగొని రణము రుక్మి నిఁ గేరి
పట పటను దంతముల రాపు బెట్టి ౯ కుటిలుడ ! నిన్నాద గీ టడంతు నని
మటమట వెలుంగు మధ్యాహ్నభాను ౯ నటువలె యరులను కుటిల తనువులను
దండతాడిత వ్యాఘ్రమును బోలు ౯ గండున మెలగుచు ప్రచండ కోపము
నిండ హలంబున రుక్మిని మోదుచు ౯ దండ వాని కగు హిత నృప ఖలులను
జదిపె కళింగుని తల వ్రక్కలించె ౯ కుదురుగొనె జీవముల నారుక్మివి
యదువీరుల శౌర్యముల విజృంభణ ౯ ముదము లడిగె నట మధువైరివైరు
లకు భీతిగొనుచు వారటుదారగ ౯ పకలజ్ఞ డన్న శాంతింపు నన్న
ప్రకటింపడు త న్నేమనుకొను నే ౯ వికలచిత్తమున నున్నరుక్మిణియు
పలుకరింపదా యేమనునో యని ౯ ఖలచర్యల తన యన్న యుండుటయు
తిలకించియున్న దగుటయు రుక్మిణి ౯ కలత గన దందు యనంతు డలరెను
యాదవు లంతను మోదమున జెలఁగి ౯ మాధవ యుతముగ దంపతుల గొనుచు
వాదుగొను మంగళధ్వనుల్ ముద ౯ మూను కొన గదలి కుశస్థలీపురి
కరి తురగ రథ వ్రాత పరివార ౯ వర భట కదంబములతో ననమున
నిలిచి యచ్యుతుని విందారగించి ౯ యుటయ కెంపార లోనఁ జొచ్చిరి
జలజనాభు డుత్సాహపూర్ణమతి ౯ గొలువుదీర సుఖముండె నరవరా !

-: బాణాసురుం డీశ్వర ప్రసాదంబు నొందుట :-

విను మనఘా ! నా శ్రీముని పన్నుతి ౯ ఘనపదవి కర్హుడై నట్టి బలికి
తనయులు నూర్వురు తొలుతటి పుత్రుడు ౯ దనుజ ప్రముఖుడును సహస్రకరముల
వినుత బలవీర్య సమగ్రతను నా ౯ యినుని సహస్రకిరణుని బోలుచు

యహిత తిమిరముల నడప తేజరిలు । విహితమైన మతి శంకరుని గూర్చి
అహిభూషణుండు నద్రివాసుండు । విహిత గజచర్మవసనుడు శంభుడు
సహజ మహిమాన్వితుండు భర్గుండు । మహదాది మూలప్రకృతి కధీశుడు
సహితదైత్య దానవహంతకుండు । మిహిర శశి కృపీటయోని నయనుడు
తనకు సేవనీయుండు నగు ననుచు । ఘనమైన తపము సలిపి యా దేవు
ననయము కన్నుల గన నిలుచునట్లు । తనయునిగ తన్ను గన వరంబు గొని
కుమారునకు దా ననుగు దమ్ముడయి । సమానవీర్యం బొప్ప శోణపురి
క్రమమున తనవారిని పాలు గొనుచు । సమాతిశయ న్యాయమున ప్రభుత్వము
నంది బహునాళ్ళ నుండి రుద్రుడే । యం దండమింపు గొనియుండ గోరి
ముందు సాగిలె యద్రిజేశులకు । నందుని వలని వందనమ్ములను
గొని వారు నలరు గని ముచ్చటాడ । వినయమున వ్యాఘ్రచర్ముని బొగడెను
శ్రీ గౌరీశా ! గౌరవర్ణ ! హర ! । భోగీశాభరణా ! దిగ్వసనా !
వాగీశవినుత ! వామదేవ ! భవ ! । యోగీశ్వరనుతచరణారవింద !
సోమకళాధర ! శమశమనశివా ! । కామదమన ! కరుణాకర ! మహేశ !
హో మంజు జటాకలాప జలధర ! । శ్యామగళా ! శాశ్వత భద్రమూర్తి !
నీ మహిమలెన్న మునిగణ మోపునె । భీమా ! సురమదసంచయాపహార !
పాపపరిహార ! పాణిపినాకా ! । తాపసనిలయా ! తత్త్వవిచారా !
యాపదార్తిహర ణోజ్జ్వలమహేశ ! । కృపామయా ! త్రిపురాంతక ! యభవా !
స్వతంత్రదీపా ! కలహాంతరుద్ర ! । కుతంత్రదూరా ! కుమారజనకా !
యతీంద్రధాతార్చిత లింగరూప ! । మతంగసంస్తుత ! మతంగవైరి !
మాతంగీశా ! మతిపరిశుద్ధా ! । పతంగ దురితాంధస్తోమవిజయ !
వితర్కరహితా ! నందస్వరూప ! । సతీయాంకసంస్తూయశాశ్వతా !
మతిం గనుము వే శరణమందు స్థిర । వెతల మలపెదవు నీభక్తజనుల
నతి విభవోజ్జ్వల సౌఖ్యములగూర్తు । వతి యుదారగుణ భూషితరుద్రా !
నాపురివాకిట-కావలియుండగ । నోపి నను రక్ష సేయ న్వలయును
నీపదసేవయు నా కబ్బు సతము । ఏవు నందెదను కార్తికేయువలె
నీపట్టికోర్కె నీవు సెల్లింపు । ప్రాపు నీవ నాతండ్రికి యనంతు
డేపగిది బూట నెడమీక వాకి । లేపట్టు నిలిచె నా కాపట్టున
వరము నిమ్మన్న పరమేశ్వరుండు । తరమందించెను దా నట్ల యుండె
గిరిజతో గూడ విహరించు నచట । సురవరు లాశ్చర్యమున తను మ్రొక్క
శంకరుడు భక్త వశంకరుడు నా । యంకిలి చెప్పడు యా గిరిజాహ్వత్

పంకజహితుండు యోగిచకోరక | పంకజహితుండు భోగికంకణుడు
బాణుం డంతట పరమహర్షమున | స్థాణుడు తన కగు కావలి బంటను
త్రాణ చెలగు గని శోణపురంబును | రాణ వెలయ తన పాణిసహస్రము
బలవిజృంభణము గా దనుజు లుబ్బ | నిల నజేయుడై పాలించు నంత
దలపున దివులును లవమున నందని | అలయుటల గనక సమస్తసిద్ధులు
వలచి తనుజేర పెక్కేండ్లు సుఖము | నలరు తన నిలయముగ గిరిజ వరము
తనకు దోడుగా నొకసుతను గనియె | కనకమున మణియు ప్రభ నింపుకరణి
ఘనత గలిగించు నను నా లలితవు | తనయుకుఁ జే రిడె సుపాకన్య నా
బాణుడు నిర్దళితాశమబాణుని | వాణీనాథసన్నుతుని సంఘు గీ
ర్వాణవంద్యునిఁ భక్తత్రాణుని | స్థాణు సకలభూప్రాణు స్వయంభువు
వీణాంకు విష్ణుసఖుని భూతేశు | గణనాథపితృ కార్ముక భూధరు
తాండవధురీణునిఁ పాండురాంగు | దండిగండు సడలించిన గండని
మొండుదయ భక్తతండముల బ్రోవ | నుండు కొండరాచూలి పెనిమిటిని
దేవాధీశుని భావజ వినుతుని | కేవల నమరానీకసంస్తుత్య
పావనమూర్తిని భద్రసంధాను | తీవరమున నొకనాట గర్వమున
వినుతి సర్పించి నతని సాగిల్లి | కన నైదునూర్ల జోళ్ళ మొగుడ్పుల
తనబాహువులను శిరము గీలించి | వినుము సర్వేశ ! నా విన్నపంబు
జగన్నాథ నీదయచాలున నీ | జిగి నంది వగల నెఱుగని సుఖముల
పగతు రకు దండ భాసిల గంటిని | జగతి నన్నెదురు శూరుండు రాడు
నాతో బోరగ రా రిట దివిజులు | చేతగారంట దిక్పాలాదుల
నీతో సమానుడను నే నట యని | కే తెరగున దా మాఱ్కొనజాలక
నాతట్టు తలపరా బలసందడి | చేతనము ప్రీతి గానను సద్దాన
భూతపతి నీవు పంచభూతాత్మ | చైతన్యరూప ! శక్తిసమేతుండ
వగు నీవు నాకు మిగుల దేవుడవు | తగుదు వనిలోన నాభుజబలమ్ము
జగమెరుగగ కండూతి నణగించు | భగవంతుడ నా తేడ ! ఢీకొనుము
నిను జయించుటయు నాకు యశంబే | తనయుడనె నెట్టులయిన మేలె యని
మనము వెలిబుచ్చి మరి యనియె నిట్లు | ఘనత గొని యుద్ధమున వీరుల పర
మున హుంకారత మణి కంకణాదు | లను త్రేంకారములను గుణధ్వనియు
వినశౌర్యము పెనుగొన దోర్బలంబు | నను చండకాండముల నృపమండలి
కిని భీతి దోప శూలశస్త్రాదు | లను బొందుగొనెడి కీలాల నదుల
నోలికేళి సాం పండగ వీరభ | టాలి కరి తురగ స్యందనాదులను

కేలివల జుట్టి కరకరను జడిపి ఽ డాలంద జీల్చి తురుము ధరణి మి
శ్రమున పంకిలముగా నెఱపనైన ఽ క్రమము గనకున్న కరము లవేలను?
విమల యశము శాకరములుగా నవి ఽ సమమతిని శోకకరములై యరసిన
నన శంకరుండు కనలి యో మూఢ ఽ తనయ! నీకోర్కి సంఘటిలు నింత
చనట నీకేల? నేనేల? నీతో ఽ ననికి? సిద్ధముగు టేల? శీఘ్రమున
నను నిన్ను గెలుచు నాయంతవాని ఽ కిని నీకు రణము గూడు సిద్ధముగ
విను మిక నీ కేతన మెప్పుడు భూ ఽ మిని నిష్కారణముగ దొర్ల నగునో
కను మక్కాలము కాచియుండుమా! ఽ యన తనదగు మణికిరీట మా హరు
చరణముల సోక మ్రొక్కి కొలువు గని ఽ వరుస నెదురు చూచుచు నుండె దాని
వరనాథా! యా బాణతనయ యుమ ఽ సరళతర సుగుణ గౌరిసమార్చన
మతి వెలయు సతీతిలకము యౌవన ఽ వతి శీలసమేతయు నై భవాని
కరుణ వరుడు సుందరుడు తనకు గా ఽ కరము వినుతించె నంబా దేవిని
గిరిజ సంతోష మందె బూజింప ఽ వర మొసగె నెట్లు? యది వినిపింతును
బాల! నీవు నను ధ్యానమున నిల్పి ఽ యోలి శయనింపు మేలు స్వప్నమున
యే లలితమూర్తి పురుషరత్నంబు ఽ లీల నిను రతిని దేల్చు నాతండె
వరుడు నీ కగును పరితోష మబ్బు ఽ తరుణి! నీకోర్కి సఫలత నందెడు
నావిని యట్టుల వ్రతము గొనియుండె ఽ పావనమతిచే గౌరి నుతించుచు
ఆ వనజాక్షికి వైశాఖశుద్ధ ఽ మావరణ మందు ద్వాదశి యందున
కేవల నిద్రను తా గూరి యుండ ఽ దేవి బల్కినటు దివ్యతేజమున
భావజుని వన్నె నూతనం బంది ఽ యీవిధిని పురుషు నందు బింబించె
నో యను వానిని సుందర కపోలు ఽ సోయగము మిన్న యంగవిలాసము
కాయజుని కేళి తనను లాలించి ఽ నాయనుంగు కనకంపు బొమ్మవే
నీ యధర మాననిమ్ము ముద్దిమ్ము ఽ నాయెద నీయెద నైక్య! మొనర్తము
తనువు మనము సోక తీరున రతికే ఽ ళిని మురిపెంబును పాలు గొంద మా
వనిత! యనుచు చెక్కిళ్ళ చుంబించి ఽ తనదు పీన కుచ కలశము లుబ్బగ
కమలవదన! నను కలయుము కరుణను ఽ విమలోజ్జ్వలాంగ! నను విభుని గాను
కమనీయ దృష్టి మనోరమవు నీ ఽ కమనీయ వాక్సుమముల బూజింపు
మృగరాజమధ్య! కౌగిలిని దార్చు ఽ జగి నందనిమ్ము నీ చెలిమి నన్ను
సగవుల [illegible] నగుదువె నాయకి! ఽ తగు వందుము నీ నాయకునిగ నను
నన తా నలరువ [illegible]! ఽ నిను గౌరి దెలిపె నా విభుడ వనుచు
మనమును గొంటివి [illegible] నీకు ఽ ననుకూల యుండ భోగమున [illegible]

మని సౌఖ్యమిచ్చి తా నది గొన్నటు ఽ గనెను స్వప్నంబు కళ మించి నట్లు
వనిత మేల్కనియు మేల్కొనని యట్లె ఽ తన యొడలు చూచుకొని సవరించుచు
ఘను డెటు దాగెనో ! దాగ పని యేమి ఽ తన యింతిని నాకెక నుండ నేల ?
వనిత ! కలయు మన కలిసితివి గాద ! ఽ కినుక కెందు సమయము లేదు తలగు
టను చిత్రమనుచు కనుల కగపడిన ఽ యనువునే నవ్వగొనుచు నాతనికి
తన యొయ్యారము చూపగా నిలిచి ఽ విను నా మానధనము దొంగిలితివి
కనుగొంటి జిక్కితివి నే ప్రేమను ఽ నిను బంధింతును నేను దనుజేను
తనయను నీరాణిని యాజ్ఞచాలు ఽ నను మెలగవలెను నాయకుడవుగా
నను నాయకి యని పిలిచితివి గాద ! ఽ నిను జూచుభాగ్య మా యుమాశంక
రుల యనుగ్రహమె యనుచు మురియుచును ఽ నలరు నిండ నా నాతి దిక్కులను
కలయ జూచి కనులను నీరు నింపి ఽ జలజనేత్రలింల నను బరిహాసిరప
కలికిని వలపున నించి మరుగు గని ఽ యలత నే నందగూర్చి తదేలను ?
అంబ ! నీతరమునను మే లందితి ఽ నంబుజాక్షు డావిశాలవక్షుడు
కంబుకంధరుడు కల్యాణమూర్తి ఽ శంబరాంతకుని క్రీడ లో గొనియె
కనుమా ! దయ నామీద శివసతీ ! ఽ నిను బ్రస్తుతింతు కార్యము నింపుము
వినుతి జేతు నని యా సర్వమంగ ఽ శను నెదురు గాంచినటుల కొంతసే
పున మౌన మంది జనులు దిరుగాడ ఽ గని కలయే నని నిశ్చయ మందుచు
జయ జయ పార్వతి ! శంకరురాణీ ! ఽ జయ జయ పద్మాలయావదినె ! మదమూ
నయము గనజూడు నమ్మితిని జనని ! ఽ భయాపహారిణి రమా ! పరమేశ్వరి !

దండకము

శ్రీ మన్మహాదేవి ! శ్రీశైలరాట్పుత్రి ! శ్రీకంఠుయర్ధాంగి ! శ్రీగౌరి రక్షింపు లీలాస్వ
రూపాంగివై శోభనాంగంబులం దీప్తివర్ణింప దేవాంగము ల్వర్ధిత జ్ఞాండులాడగ దే
నాకు ప్రాంతు చిత్తంబు చాంచల్య జ్ఞానత్వ మేకత్వ ధర్మత్వ సత్వ త్వానిష్మ
జాబాలి మౌనీంద్ర సంఘంబు లెల్ల ప్పుడుంబాలి శాపంగనిత్యాబలంబ ల్విహృత్పత్మ
పీఠంబు లందుండగ న్నిల్పి బూతా సంస్కృతి క్కల్పి సమృద్ధి నంకం సదాధ్యాన
మంత ప్రస్మయత్నంబు లల్లో దగ్గం బొల్తు రో యంబ ! మూర్తాంబ ! ధీరా ! యపారంబు
గ ప్పీమహాత్మ్యంబు నెన్నంగ వా రంతమింపగ నాగాశ నేనేడ నౌ్రైన బ్రహ్మాది
మునవ్యాహ్రులుం దేవతాసంఘ యక్షాదులుం చార గాపిత్యా విద్యాధ రాతిర్యాం
ప్రాదులుం బాల రేమింత యంచున్విన మ్మయ్య లందో పమానంబులంత్యు దక్ష్మారంబు
లుంగా ర్తు రద్దాత నేధమ్యునై రంచు నన్మిస్మ్మ నేవదిక్కు నాజన్మసాఫల్య కంఠజ్యోగ

మిట్లుండె యో కంబుకంఠీ! సుఖ శ్రీనొసంగంగ నాకాంక్షచే నాకరంబుల్మొగుడ్పుంద
జోడింతు కళ్యాణి! సర్వేశ్వరీ! కాళి! కాత్యాయనీ! యంబ దుర్గా! మహాభీమ!
చాముండ! వాగ్దేవి యింద్రాణి శ్రీవైష్ణవీ యాదినామంబు లొప్పంగమంత్రంబ
వై సిద్ధిఁగూర్పంగ బాల్గొంటిపాలింపు మంచున్నతిన్సల్పు చుందున్నిదే గమ్మ యో
కొమ్మ! సాష్టాంగ ముజ్జేతుగా వెయ్యి యో దేవి! నీప్రీతి చేనన్నునందింప చేసాచి
తిన్నివు చేసాచి భద్రంబు గానాదు శీర్షంబు నంజేర్చి దీవింపు మాతా భవత్సేవ చేసా
ముదం బాసురేంద్రుండు గానంకు బ్రహ్మాదులంతే గదా వట్టి డంబాలనిన్గొల్చి
మెప్పింపనౌనా! నినాదంబు హాస్యాస్పదంబే గదా తల్లి యన్నింటిపూర్ణంబు
సౌఖ్యంబులంతుష్టి మోగంబు నీకుండు నీవిత్తుయాచింపసాగిల్ల మోదంబు నన్నొందు
యోగీశ్వరీశాని! శ్రీశంకరీ! మాయ సర్వేశ్వరీ! లక్ష్మి! యార్యా! నిరాలంబ
ధీరాత్మ! యో దివ్యబోధాత్మ దేహాత్మ నీప్రార్థనంబు న్సదామాన కుందుంజగ
ద్దీప్త మాతేజమత్యంతనీయమ్మ నీయాప్త వర్గమ్మ నాభక్త తండమ్ము లందంగ
ముల్గొంచు కావ్యంబులన్ జెక్కు నిండింతుహో శూలిరాణీ! పృథుశ్రోణి
యోనీలవేణీ సువాణీ! నినుల్గొల్చు వారెల్ల తమ్మిష్ట మా సద్వరంబుల్ దగంబొందు
చున్నారు నారీ యుమావారి కారుణ్య సంధాత వై పారి జాతంబు నానొప్పి
ప్రోవంగ నైయ్యుందు హోయట్లు దర్శింప వేంచేయు దామోద దాయా! యో
చండికాభద్ర యార్యారమాయాది శక్తీపరాశక్తి త్రైశక్తులున్నీవె యైయుందు
దావెండి త్రైగుణ్యరూపంబు లందుం దగంబొంది స్వర్గాది త్రైభేదమూర్తిత్వ
మున్నుంది వే పౌరుష స్త్రీత్వ మూర్తిత్వముల్నీవె యైదోతువీసర్వ లోకంబులన్నావ
నీసౌఖ్యసంధాయి నీ యింకనాపంచ శక్తుల్క్రియం బెన్ని కల్గంగ నీయా కృతింజెందు
నందున్నిజంబౌను యో యీశ్వరీ! యార్తరక్షాకరీ! సుందరాకారి! వైయ్యాస్య
వచ్చ్యాసనంబుల్కడందోయి దుష్టాత్ములంజేర గావుండరీకాక్షుడుం దోడుగా
భీకరాకారివై నీవు వారి న్వడింజేరి దేశంబులన్గావ గానుందు
వామాత! నీపంపునన్యాత గానింపుగాదోచు నంచున్మొగిన్నన్ను
తింజేయుచున్నాను యో యిందుబింబాననా! యాశ్రితాళింప్రపోషించు
భారంబు నీదేన నావోప్పునా భాగధేయా రమాధీశ సహోదరీ! మోదకారీ!
పురారీ! సతీ! యోసతీ! రత్న మాయత్న ముల్గూర్ప నీయత్నమే ప్రాపు నానంచు
ధ్యానింతు నో పాపసంహారిణీ! దుఃఖసంహారిణీ! తాపసంశోషిణీ మృత్యు
సంశోషిణీ! శోభనాకారిణీ! యో జగత్కారిణీ! శాంతసంవేషిణీ! యాత్మసం
తోషిణీ! భీతినిర్మూలినీ! పావనీ! సత్యసల్లాపినీ! లీలనీశైలబాలా! కృపాల!
సుశీలా! వియచ్చారసంస్తోత్ర! నాకేమివక్తైన రానీకుమాపట్టు

లం గ్రూరరోగాదులం భూతసంఘాదులఁ జోరదుర్మార్గులుఁ బోరగా
శాకినీ ఢాకినీ బ్రహ్మరక్షస్సులేగర్వ దయ్యముల్ఘోర మాయాపిశాచగ్ర
హాదుల్ వడిందూల నాయందు నీవుండగానుండు మంబా ! ప్రచండాంశు
తేజంబవేదీప్తి నిండింపదండంబు నాకొందు ఛిద్రింబు రాకుండ జండించు నాదంత
రాదండియు న్దేరిచూడందు యెల్లెన నానంద మున్నన్ను జేయంగదాతల్లి నా
తల్లి ! యోసత్కృపావల్లి ! శ్రీకల్పవల్లీ ! దయాబ్ధిమతల్లీ ! యుదేవారిజల్లగాయ
ఘంబుల్ పటాపంచలై జిల్ల పోల్లైవడిందార్లు గాచల్ల నౌచూడ్కు లన్నిపు
రక్షింప గాకల్కలన్నింటి దోప్రపంగ నే జాలి యుండుం గదా యద్రి
వాసీ ! సురేంద్రాదు లర్చించునీపాద ముల్డాసిసేవించి నాదోసిలిన్మొడ్చి యా
నందమునాశ్రి గాబొందనున్నట్టి నీభక్తికామ్యార్థ ముజ్జెంద గాజేయ నందింతు
నోశాశ్వతైశ్వర్యసంధాయినీ వాదుగాయమ్మ ! కోపమ్ముమాయించి కా
మంబు బారించి క్రోధంబు దూలించి లోభంబు ఛిందించి మోహమ్ము ద్రొల్లించి
గర్వమ్ముజారించి మాత్సర్య ముంద్రెంచి నీసేవ రూపంచ నాయందు నిండించి
స్థానంబునౌముక్తి నందించి మేలున్దగంగూర్చు మో దీనసంరక్షణీదాస పక్షావలంబీ
శివాలంబవాశాంభవీ ! భైరవీ ! దుర్గ ! దేవీ ! యుహోమాత ! యో విశ్వనేత్రా !
యుహోపాపభీతా ! యుహోమోక్షదాతా ! యుహోదోషధూతా ! నమస్తే
నమస్తే నమస్తే నమః॥

యని నుతించుచుండెను తరుణమ్మున ʃ నిను దుదయాద్రిని బొడమగా నుండె
ఘనత మాసె తిమిరములు నావెలది ʃ కని ముందుశుభము పొందంద నుంట
తనచింత దొలగు వనుబోల్చునట్టి ʃ యొనరున నవ్వుచు వచ్చు కుంభాండు
తనయ చాతుర్యసద్గుణాలయయు ʃ వినయపరివేష వేషభాషిణియు
కనవచ్చు నుషాసతిని బ్రీతిగొని ʃ వనిత సరస్వతి నాదగు విద్యను
నయమెఱుంగునది యామెదరిజేరి ʃ చయ్యన యా చిత్రరేఖ యిట్లనె
జయము రాట్సుతా ! చెలియలా ! యుషా ʃ నయము దీపింప స్వప్నము గంటివె!
భయమేల ! జగజ్జనని వరమదే ʃ భయమందదు గాంధర్వవిధి హితము
న్యాయంబేగద ! నీ కది సెల్లెను ʃ నోయబ్జాక్షీ ! యని రేఖ గాంచి
యడిగిన నుడువులు తడబడ కన్నుల ʃ జడిగొను ధారల పులకలు మేనున
బొడము రతిలక్షణముల నొడలెల్ల ʃ నుడిగొన్నటు తనచొక్కుల నొక్కులం
జడ చిక్కువడుట నఖ రదన, స్పర్శ ʃ లదర చొప్పందు లక్షణముల కడు
బడలియున్న యా వడువుల నిటులన ʃ వడి గంటి నన్ను! మరుని శరాల
జ్వాల నను ముట్టి నోలి చిహ్నాలివి ʃ లీల నావలపు గొని యు లీలనో

నా మనోహరుడు నిపుడె వేంచేసి | కామిని సంతాపము నాకు గూర్చి
కోమలాంగు డెటుకూరిమి గూరెనో ! | ఏమియు దోచదు ఏమి బల్కుదునో !
ఏమి బల్కితినో ! లజ్జగొని నతడు | కాము బారి నను పొందున వగపును
దారిచె దవ్వున నారిమోహమున | బారుగంటి నా కూడిక యెట్లో !
నారీతిలకమ ! నా యమ్మ ! నీవు | దారుచు జయమును వాక్రుచ్చితివా
ధీరత నిలుపుము నాప్రాణసఖి ! | సారతరమైన తెలివి నీపాల !
నూరుపులబుచ్చనైన నోర్కింత | నోరువ జాలను పరవశము దారె
మనము సంతప్తమాన మిందునను | రోయన రందితి నను కనుల గంటివా
వినువారి హేళనకు గురుమైతిని | వినుమింక నన్ను మనమున గర్భము
లోన గను మమ్మ ! దాచక చెప్పుదు | నీ నర్మిలియే నాకిక శరణము
చానరో ! యెరుంగు మన మంత్రితనయ | ఓ నలినేక్షణ ! దాచవల దమ్మ !
ఏను నీప్రాణమని చెప్పియున్న | దాని సరిగూర్తు నంబ ! తోడంది
నగవు నేగూర్తు బెగడు వగ పడుగ | మృగనేత్రి ! దాచితేని నీయున్న
దిగులు నేనెట్లు బాపుదును జెలీ ! | దగ జెప్పుకున్న వంత లెటు దలగు !
నావిని యుష యనె నా చిత్రరేఖ | పావనమతి యని తా నెరుగుగాన
రావో వరాననా ! దాచవు మాతవు | గావ నీవు వినుమీ వేకువను
కలగంటి నమ్మ ! అంబవరంబున | నలరు నించె నా కలవలపు బెంచె
నీలవర్ణుండు మణికుండలుండు | డాలు కెన్నొందు పీతాంబరుండు
యేలదగినట్టి దీర్ఘబాహుండు | మేలిరత్న కన కాంగద కిరీటు
డును కటక హార నూపురధరుండు | వనజాక్షుండు నురు వక్షుండు మోము
గన పూర్ణచంద్రు నెనయు చిరునగవు | నను నాతని కళలనె గుల్కు నతివ !
కంబుకంధరుడు కరుణానిలయుడు | డంబు చా ల్వ్యాలయు డంబంబు వెలయు
డంబము గొనందు నుడువుల దెలిసితి | రంభకైన నల కూబరు మించిన
సుందరరూపుడు నామది దొంగిలి | మందయాన ! రమ్మంచు కౌగిటను
సందంది గడవి యధర సుధారస | మంది తా నొసగి మెత్తని పల్కుల
చిత్తంబును గరగించి లాలించి | హా త్తందించెను స్మరుని కేళినీ
పాత్తు తనకు నే నని నిచ్చ బలికె | గొత్తు చెప్పకన బిత్తరి ననకను
బిత్తరమ్ము నన్ను కెంద డగ్గుత్తి | గుత్తగా గూర్చి యొత్తుకొని డాగ
కేరనెన్నో ! యెదా కొమ్మ ! స్థలమేదో ! | నారీమణి ! యా పేరు పేరేమొ !
సార్థమైన యాతని వంశమేదో ! | యేరికి పుత్రుడో ! తలిదండ్రుల నా
మము తెలియకున్నావో వివరం బెరుగను | మమ్మోరుచి తెలివాలువ మగ్నత

మము గన్నమోద మతిని పొరబోక | క్రమమిందె గాగను ఇతరము లనగము
అతివా! యేగతి ముందు నను జెంద | నతిబలప్రౌఢి విధివ్రాలు గలవో!
సతతానుభవము దైవయోగంబు | సతికి తగదు నిం కొకని వరింపను
వనిలోని మోహవార్ధి బొంగె నన | కనుల నెడతెగని ధార లుమ్మలిగ
వనిత చింత దోపంగ మానమున | గన నవశమందు గతి గాన్పించిన
చినబోకమ్మా! నీమోహజలధి | కివి తీరమరయు నా పురుషుడె గద!
మించుబోడి యవ్వాని దెచ్చిత్తు | నందు మది నెంచు సందియం బైన
మంచివిద్య నాయం దొప్పును గవి | పించు దాన నీకెల్ల భువనముల
పురుషుల నెల్లను పటమున లిఖింతు | తరుణి! వారి గురుతింపు మమ్మ
సురచారణ కింపురుషుల సాధ్యాసుర | గరుడోరగ యక్షసిద్ధు లా
దిగ నరలోకపు వారల నృపతుల | తగ మూర్తిత్వాల గన్నట్టి మగల
జిగి గాంచి చూపు నే గొనివత్తును | వగ జెందవలదు నగ లేమిత్తువో!
మగని నడిగి యిత్తువులే యని బు | జ్జగించి యుషను దా విద్యాప్రతిష్ఠ
గనబరపనల్లె వ్రాసి పటంబును | మనమున కింపగు నట్లు తళతళల
కళ కళల వెలయు వజ్రమాదించి | సులువు లో నెంచి వన్నెలను జేర్చి
అలి నీలాలక కళల దోపంగ | ఘళి ఘళి యని తను జాలమెచ్చు నటు
కేల తూలికను దాల్చి పూర్తిగని | చాలున వారివి కులగోత్రనామ
ముల మేల్పదవుల పోలిక లన్నియు | కాల దేశ వాసముల తెరగులును
నోపిక గొని వ్రాసియును వేగమున | చూపగ వచ్చెను బాణుని పుత్రి
కో పద్మగంధి! యీపటము గనుము! | యోపిక నేకత ప్రాపున లిఖించి
తిని దృష్టి నిడుము నీ మెచ్చు వాని | కని విన జెప్పిన చాల్గొని తెత్తు
దాన మేల మిది గాదు కొమ్మ యన | యా నీలవేణి యుషపటమ్ములను
చే నందిజూడ నా చిత్రరేఖ | యానందము చెలువార జెప్పె నిటు
వనిత వీరు సంగీత కోవిదులు | గను కిన్నర కింపురుష గంధర్వు
లను వీర యావనేచ్ఛ స్వేచ్ఛగను | మునులు సిద్ధసాధ్యులు నా చారణు
లను నభశ్చరులు ఘన విభవమ్ముల | నను వొందు సురాసురుల మరుత్తులు
ననువారు యక్షరాక్షసు లతివా! | గను మటు కళ గను కామరూపకులు
అమరలోకవినుత సుందరభుజగుల | గని పరుస క్రింది మీది లోకముల
జనుల దిక్పాలవరుల మూర్తులను | వనితమును జూపి కాంచని గ్రహించి
నరనాథ! ధరణిలోన గలయట్టి | నరపతుల నముల పరిశ్రమంబున
తర పరమండిన జన జనాధిపుల | నరపతి నయమున సంక్తిగా చెక్కి

విను ముజ్జ్వలాంగి ! కర్ణాటాంధ్రము § లను యవంతికా భోజ కరూశము
లును మాగధ నేపాళ కుకురమ్ములును § వరాట కురు కేకయ సౌరా
ష్ట్రముల సింధు పాంచాలాంగ బర్బ § రములు కాంభోట ప్రాగ్జ్యోతిష భో
జములు కాశి కేరళమును, కాశ్మీ § రములు, పాండ్య శబరములు, కుంతలము
లాదిగ నరపతు లందరు గలరిట § నీదు మనమునకు గుర్తింపు వచ్చు
నో దనుజనాధ తనయ ! యుషాసతి ! § యీ దండి వీరవరుల నామములు
విను జరాసంధ, సైంధవ, చైద్యులు § గనుము పాండవుల ధర్మజు డాదిగ
గను మిట దుర్యోధనుడు, తమ్ములును § వనజ వదన రాధేయుడు, సుశర్మ
లును భగదత్తుడు విందాను విందు § లును సాళ్వ, పౌండ్ర, దంతవక్త్రులును
గను మిక యాదవ వరుల శూరులను § ఘనుడు సాత్యకియు బలరాముండును
సరసుడు సాత్యకి సాంబ కృతవర్మ § లరయుమా శౌరి నాబరగు గృష్ణు
నరయుమా ! యితడు నీరదవర్ణుడు § సరసిజనేత్రుడు కనకాంబరుండు
తరుణి నీ చెప్పినట్టి చిహ్నములు § పరగు నితండే గోపికామనో
హరుడు నయ్యో పెక్కులగు విధుల § వర మందించెను వారి సుఖరతుల
పరమ యోగులకు భద్రపదం బిడు § స్మరణమాత్రమున దురితహారంబగు
నితని సుతు గనుము మరు డీశ్వరుచే § రతి నుతిని వరము వడసె రుక్మిణీ
సుతు డనగ బుట్టినట్టి సుందరుడు § ధృతిని సడలించు జితేంద్రియులనే
గాక వనజాసనాదుల సయితము § లోక వినుతు హరుడైన జయించును
చీకు నించు తన చివురుటంపముల § యో కలికీ ! చూచుటను మెచ్చితివా !
వనితా ! యితడగు ప్రద్యుమ్నసుతుడు § తనతండ్రిని సరిమించు రూపమున
పినవాడు యౌవనపు మొలక నవ్వ § గను వదనమింక మీసము లటులే
యన నతని జూచినంత తనువునను § మునుకొని పులకలు కుచముడి సడలెను
కల కలత వడువు మోహనపుగాలి § కిని తూలినట్లు కనుల నటు దృష్టి
నిలిపి కడకొలుకులను ధాత లడచు § చెలి ! యని మానత వ్రేలట్టి నిలిపి
లలన ప్రమదంబునను భ్రమను బూని § విలసితాననము చెలిమిం గని వంచి
యక్కా ! యీతడే చక్కన కౌగిట § జిక్కించుక నాచెక్కిలి నొక్కెడు
ప్రక్కకేగ దా నిక్కన గదుసరి § పొక్కిలి బుడికిన పక్కాదాంగయ
ప్రక్క బాయనని చుట్ట మీవె యని § నొక్కి మాటాడి గ్రుక్కిళుల గూర్చి
మ్రొక్కనను గొనుచు చిక్కక బారెను § చిక్కడే ! దేవి ! చక్కని వరమున
నీకు మ్రొక్కెదను నాచిత్తాపము § దే కులదీపకు డెల్ల వినిపింపు
నాకు సంబంధ మే కరణి చాటు § నీకొటు సాధ్యంబగు తోడ్త్రెల !

అన నింతీ ! విను మితడు యదువంశ ƒ మున శ్రీదేవుండైన విష్ణుండు
దనుజ విధ్వంసిగా గృష్ణుండన ƒ జనియించినట్టి ఘనుని మనుమండు
సుగుణ సాహసౌదార్య బలుండగు ƒ జగిని శౌర్యమున యరివరుల మీరు
తగిన వరుడే నిను గొన నిత డర్హుడు ƒ తగు నిత డనిరుద్ధుడు నాయకమున
వగ దక్కమింక నే నేగివత్తు ƒ నగ వొప్ప గూర్తు జగదీశ్వరినీ
మగని యుతమ్ముగ దగ బూజింపుచు ƒ మగువ ! నారాక నిగ నిగ లందుము
నను శుభమందును సమయం బిదె యని ƒ మనమున మంగళగౌరి మతి నెంచి
వనజాక్షు డుండు ద్వారకాపురికి ƒ వనిత యోగవిద్యను గగనమార్గ
మున గమింప గని యాపురిని దరిసి ƒ తన భాగ్య కలిమి నొక సలిలాశయ
మునను నీరమును గ్రోల దలంచిన ƒ గననగు నచ్చట సురమౌని వరుని
ఘనుని త్రిమూర్తుల దర్శించ నేగు ƒ చును వనజనాభు వీణారవమున
తన గానకళానిపుణత లాశలు ƒ విని ప్రజ్వరిల్ల శ్రవణామృతవిధి
వనజేక్షణ ! దేవకీతనయా ! హరి ! ƒ వనజాసన జనకా ! హరవినుతా !
మునివర మానసవిహార ! మోక్షద ! ƒ నిను నా చిత్తములోన జపింతును
వను నింక భవములను బొందనీకు ƒ తనువు మనము జీవంబు గల కర్మ
లను నీపరంబునన విరాగముగ ƒ నిను భజింతు నిటు గాన ఫణితి నే
శ్రీపతి ! శరణ మో పరమాత్మా ! ƒ గోపకాంతవల్లభ సాత్వికాత్మ !
యో పాపహరణ ! మాధవ ! యదువర ! ƒ నీ పదాబ్జసేవయె నా మనుగడ
యంచు వినుతించు నాముని చెంతకు ƒ మించు కుతుకముగ జేరి చరణము
న్వంచితమతి నెఱిగియు హణుల జో ƒ డించి నిలిచినను నారదుం డడిగె
వనితా ! యిందుల కేల నీ రాక ƒ వినుపింపు మేమి గోరి నా చెంత
కును జొచ్చితి వన యెల్ల సంగతుల ƒ మును దుర్గవరము మొదలుగా జెప్పి
తనకు భయమిందునను జెందకుండ ƒ గనవలయు దయను నిడి మీ చిత్తము
నను శుభమౌనని తలంతురేనియు ƒ వనిత యుపాసతి నందింపు డదిము
ననుచు వనిత దను కృపదోప నడుగ ƒ ముని యోగదృష్టి నంతయును దెలిసి
వనజభవు యోగ మట్లీశ్వరేచ్ఛ ƒ యని మనములోన ముదము తా నంది
వనితా ! హరి హర యుద్ధ మిందునను ƒ దనుజనాథుడగు బాణుని మదంబు
ననువు వొలగుటయు నా భోజనంబు ƒ ననుకూలమంద నచట జెలగుదును
విను భయ మందదు యిదె విద్య గొనుము ƒ గనవు భీతి వనజాక్షుని పట్టున
గనెదవు సిద్ధిని నీ వేగిన మరి ƒ వినజేతు కృష్ణునకు నీవార్తను
గననగు మీదట గ్రాగల వన్నియు ƒ మనము నీమ ధలవున మనుట తెల్ప

యనిరుద్ధు జేర్పు శోణపురంబును ౹ నిను శుభము జెందు గోరు ముపదేశ
మనుచు తాపసియు నా విద్యనిచ్చి ౹ ముని యర్థేచ్ఛ గనె హరిహరుల నుతుల
వనితయు పరాత్పరుల భజించుచును ౹ గన సమయమ్మైన నిశి జేరువరకు
నట నిరీక్షించి యిట తరుణామంది ౹ పటుతరపు యోగపటిమ ప్రచ్ఛన్న
మట గుదురుగట్టి బటువు వేషమున ౹ కటకమును జొచ్చి కుటిల రహితమతి
యెటులజూచినను మణిప్రభలను ను ౹ త్కట కాంతి హేమకలశముల నొప్పు
దిటమైన భవనముల గోటు నిక్క ౹ చటులమతి గనని భజనకూటముల
వటపత్రశాయి యవతారలీల ౹ నట నానుమోదభరిత జనమ్ముల
నటనట గాయక బృందసంఘటన ౹ ఘటనాఘటు సల్లలితాకారుని
చిటిపాటితాళపు రవములనాదిగ ౹ తటములెల్ల హరిస్తుతుల హరిధ్వనుల
బొటమరింపు దగ వినుచు మెచ్చుచును ౹ పటిమ వడి వెలయ ననిరుద్ధు గృహము
చిటికెలో జొచ్చి యట నిద్ర గూరి ౹ నిటలమున చెమట గ్రమ్మ నూర్పులను
కనకమణిమయపు చెలువారు మంచ ౹ మున విమలమయిన పుష్పమృదుత్వము
గల ధవళపాన్పునను శయనించిన ౹ యలరు నింపు చిరునగవు చాలొసగ
విలసిత ముఖరుచి వెలయ గూర్కొను ౹ నల ననిరుద్ధుని మాయయే మచ్చు
గను గుప్పి యెత్తుకొనుచు చక్కనను ౹ దన పురముజేరి తనరాక నెదురు
గనుచున్న బాణు సుతయు యుషారమణి ౹ మన ముబ్బుదోప సుందర తల్పము
నను జేర్చి దనుజనాథుపుత్రి విన ౹ నని నో యతివా! మేరు నగధీరు
సుకుమారు మారు కుమారు శూరుని ౹ ప్రకటితసుందరు ననిరుద్ధు జూడు
వికటమతిగాని యకలంకు డబల ౹ సకలురు పదారుమూర్తిగ నుతించు
వనధిగంభీరుడు వనదచ్ఛాయను ౹ మన మభిరామత తనువునే బోలు
దను కినుకగొన్న వనిత పురాంతకు ౹ నెనయు శౌర్య మీతని యందొప్పు
నను నేలుకొనుము వీనిచేత నే ౹ వనిత! పాలింపు గనుము నీ వలపు
కొలది కొలువు గైకొనుము విలు నేరగ ౹ సెలవిమ్ము నాకు తొలగు లజ్జ యిక
యన కుంభాండుని సుతకు మ్రొక్క ౹ ఘన యోగనిపుణ వగుదు వో యమ్మ!
నిను నే రసాంజనముగ నా ప్రాణ ౹ ధనుని యంకమున బొరలగ గంటివి
నను చింత దొలగె నానంద మబ్బె ౹ వనధినను మోహజలధి తరించితి
నిను నెట్లు మ్రొక్కవలెనో నీ దయా ౹ వనమున నతి నేతు నంబికను వలె
ననుచు కుసుమముల నామె నర్చించి ౹ యుని పె నింటికేని తా ననిరుద్ధుని
గని నిద్ర మేల్కొనగోరి సేవ ౹ గొని యుండె వరుడు కన్నులను విచ్చి
కలతు కనకంబులతీవ నానొప్పు ౹ వనితను దనుజోద్యానమున [illegible]

తనయును సతివలె తను సేవించుచు ఽ మునుపటి పరిచయమును నిచ్చినట్లు
మనమును కొంకును గొనక నానంద ఽ మున సర్వంబును వినజెప్పి యదను
గని భోగమందె నవలి సౌఖ్యముల ఽ వినుము జనపాల! యీవిధిని గృష్ణు
మనుమడు నా యుష కేలు నటు దివసు ఽ లును జరుగు బెరుక గనరాని పగిది
చెలులు తన గుట్టు వెలికి రానీని ఽ కలయికల కాలముల తగిన సేవ
తలపు కొలదికిని మీర ననిరుద్ధు ఽ వలని మహిమ నలరార నొప్పిదము
తిలకించుట తమ తొలిభాగ్యమనుచు ఽ జలదశ్యాముడు సుందరమూర్తియు
జలజాక్షుఁగృష్ణు మనుమడు నా నిని ఽ తలపుభక్తి నా దురితముల మలపు
టను ముదము గొనుచు వెలికి నణుమాత్ర ఽ మును బలుకబోరు లలన చూలండె
మనములు గుస గుసలను వెలిబుచ్చిరి ఽ మన మిక దాచగ ప్రభుని కినుకకును
పాలంది భీతి గనెదమది దప్ప ఽ దీ లలితాకారుని చర్యలన్ని
యాలసింపకను బలిపౌత్రునకును ఽ వాలాయమంద వినిపింపవలయు
ననుచు చెలులట్లు జంకుచు బాణుని ఽ గని మ్రొక్కి వినయఫణితి నమ్రలై
దనుజేశ! మమ్ము తప్పు గొనకుమా! ఽ వినుమ! మా వేగు పౌరపా టందక
వడి నంతిపురమునను పోతుటీగ ఽ నడి బొంకనీక ఖడ్గ మేమరక
జడు పెదురు గనగ దుడుకు నీవలని ఽ కడమనమునందు జడిగొన్న యట్లు
పుడమీశ! నీదు నుడులపా లందు ఽ టడవి పాలై నిగుడు శశికళలయె
పుడమి మానోట నీవు చెవిసోకు ఽ కడక ఝే తెరగుగా నుండునొక్కొ!
యని వెలి బరగించక మాటమరుగు ఽ నను గూర్పద గనుచు వచింతుము
వినుడు చూలాలు నయె విచిత్రముగ ఽ మనము రిచ్చ మము గూర్చి వచ్చితిమి
నిన్ను శరణ మందితిమి భీతి గొనము ఽ కనకాంగి తెరగు చిత్రతర మదియు
యనుచు నిదంతయు నీతనూజ యుషయె ఽ యన పదతాడిత కాలవ్యాళమును
ననుకరణి రోజుచును దనుజేంద్రుం ఽ డనలువలె కోపశిఖల తను వుజ్జ్వ
లతను దండివలె భీకరత గ్రాల ఽ నతి భయదుడగుచు కరమున ఖడ్గము
శితము తీక్ష్ణము నగు దాని గొనుచు ఽ గతిని రాక్షసావేశ ముట్టిపడ
వనధిగభీరము ననిలువేగంబు ఽ గని జిగి ధనదుని ఛాయ దీపించి
తనమనము రోయ విన్నంత కాద్రి ఽ మున రుద్రుడగుచు నార్భాటించిన
దనుజు లతివీర్యులగువారు దన్ను ఽ మునుకొని సాయుధముల విసరి కేకె
విట వెంటనడవ పుడమి దడ గొనగ ఽ కదు కసగొనుచు నతదుష్టమనుచు
వెడద తనబిడ్డ నుఱిమిన దృష్టిని ఽ వడకు గూర్చి కని జడమతి! యెవడు
వను చూచుకొనుచు ననసిరుమవ్వుని ఽ గన చూతంగ్యాహం దనువగువానిని

కనుల వికసించు కమలకళ మించ ఽ తను నింద్రనీల మణులచాయలను
కనకాంబర పరిధానుండు నగుచు ఽ దన వదనరుచియు శశి నపహసించు
టను గుదు గందుచు కనకాంగదముల ఽ జనవినుత హారకంకణాంగుళీ
యకముల మణికిరీటమున జెన్నొందు ఽ సమ మతిశయించు వీర్యంపుచాలు
నమర తేజంబు మూర్తీభవించు ఽ కుమతుల నన్నిట భ్రమ నింపు వాని
గని పటపట మంచని కటము లదర ఽ గను దంతములను గొఱికి యధర మఱ
గన నొప్ప సైనికుల వీనిబట్టి ఽ యను దిట్టి కొట్టి యవల వెలి నిలిపి
తనమట్టు డనుచు నట్టె నార్చినను ఽ తులువ ? యులుకు గనకుంటివ ! పలువిధ
ముల నీకండలు శల్యసంఘములు ఽ తిలలంత పిండిపిండిగ మడిపెద
మని గవిసినంత మనోహరాకృతి ఽ ఘనభీషణముగ గ్రాల నుప్పొంగి
తనమీద శస్త్రముల జాచినట్టి ఽ దనుజనాథు సేనలను మృగములను
గనగనైన హరికిశోరవిక్రమ ఽ మును దనదీప్తిని గనపఱచి వారి
మీద దుముకు గని పిడికిటిపోటుల ఽ నే దనుజవీరులను గోము గుదుర
గా దివినిగూర్చి రణసంవిహార ఽ మోదితు లుబ్బున దను జూచి మెచ్చ
కంగారువారి గూర్పనం దొక్క ఽ పొంగారు మదము చాలందు శూరు
భంగంబు శిరముగా పొడిచి మెయిది ఽ శృంగార శూరతనము వడి జూప
పరిఘంబు వానివలనైనది గొని ఽ చిర చిరల దిరుగు మందరము వలెను
సరసత సురలకు నరుల భీకరత ఽ పరముగా సేన వారాశి గాగ
శరము దవానల చాయ వారంద ఽ రరయ ప్రచండత వలయు సాధనల
తరము లందుచును శిరముల బగిల్చి ఽ నురములను వ్రచ్చి కరములను ద్రెంచి
చరణముల నఱికి సొమ్మలను రాల్చి ఽ పరువున జెలంగి వారి మడియించి
సరభసమున గర్జించె బాణుండు ఽ నరయ నీబిడ్డకైన వరుడ నన
చుర చురల జోరి ! క్రూర ! నరాధమ ! ఽ యరి భయద విక్రమాటోప నిలయ
తరుని హరువరము నందిన శూరుని ఽ పరమనీచతను బలికిన ద్రోహివి
నిను దునిమెద నని క్రూరశరమ్ముల ఽ పరువడిఁ బరపి తరణిని వారిద
మున దాసినట్లు ననిరుద్ధు కడిమి ఽ ననుకూలం బెడగా చకితుడుగా

—: బాణాసురుం డనిరుద్ధుని నాగపాశబద్ధునిఁ జేయుట :—

నిలువ నాగపాశముల బంధించి ఽ విలసితఖడ్గము చేనంది యార్చి
తలను ఖండింతు నని చేయెత్తిన ఽ వల దుడుగు మనుచు మంత్రి కుంభాండు
డను చుండ నతని కోపము [illegible] ఽ కిని దొరలిపడియె ననిమి [illegible]

విను మనుజేంద్రా! హరుని సంకల్ప § మును గాబోలును వీడల్లె ఘనుడు
తన మహనీయత నీపుత్రిఁగూడె § నిను సురాసురుల గణము నే భీతి
గన నీతం డీపనికి సాహసము § గన దీర్చుకొనియె తన ముద్దుసెల్ల
నిను రణముదారు శంభుని వరమని § మును బల్కినాడ పడె కేతనంబు
గతిగాంచు మితిని జంపక చెఱవిడు § వెత నింపవలదు సుతకు నీపట్ల
మతి జింతింపుము మానిని సుశీల § యతని వరించెను నాతం డట్టులె
యతివను వరించె గాంధర్వవిధిని § సుతను తప్పుగాని చూడకు తొందర
వలదు గనియుండ మొక్కింత శాం § మిల యెల్ల గలుగు నిట్టివి విన్నవె
యలుక వలదిపుడు చులుకు శత్రువుల § వలను మెలపువము యుక్తమది యగును
నన మంత్రి వాక్యముల ననుసరించి § తల పుంచె రణము తారసిల్లుటనె
విను మానవేశ ! యనిరుద్ధుం డొక § దినమున నిశిలో నెటకో మాయమున
దనవారి విడిచి యేగ నని తెలిసి § వనజనయను డా జగదేకభర్త
తన మనములోన సర్వమును గనెడి § యనఘస్వరూపి ప్రకృతి జనులవలె
మునుల భిక్షులను దనదు చారులను § అనిరుద్ధు జాడలను వరయుచుండు

—: నారదునివలన ననిరుద్ధుని వృత్తాంతమును విని కృష్ణుడు బాణాసురునిపై దండెత్తుట :—

నొకనాడు బ్రహ్మమానస తనయుడు § సకలభువన పరిపాలకు గృష్ణుని
వికటిత తరునిఁ బకవిధ్వంసిని § నికరమందు నుతు లెన్నని గూర్చి
బలుకదగు వాని పద్మాక్షుని దను § నలరున యాదవులెల్ల గొలువంగ
చలన రహితకృప వారల నింపెడు § నలినభవాదుల కే విధి నందని
యొడుపుగలవాని జడధి నివాసుని § వడి గనవచ్చెను హరియు దూరమున
జడదారిని గని పీఠము నుడిగియు § కడక నతని యర్చింప దోత్తర
యాదవు లందరు మాధవు వెనుకొని § దా దండిభక్తవరుని నారదుని
యాదర మందున నెల్లరు బొందగ § మోదముఖమ్మున కృప వెదజల్లుచు
మాధవ ! మురారి ! మధువైరి ! హరీ ! § వేదవిహిత భువనాధారధర్మ !
రూపాధిష్ఠా ! సర్వాత్మ ! శ్రీశ ! § పాపదూర ! యనుచుండ నతి నొసగి
తాపసోత్తముని తగ వైనవిధుల § నొప్పి పూజలను జెల్ల పీఠమున
నుపవేశము నందించి కృష్ణు డనె § యో పుణ్యమునీశ్వర ! శరదావి
ర్భూతవారిధరవర్ణ ! శుభ్రగుణ ! § పాతకపరిభూతము మీదర్శన
మాతతంబు మీ దీవెన శుభంబు § లే తెరగునైన మీరాక మాకు

మోదదాయకమె గాదగు మునీంద్ర! । మేదిని యందున మీరు విహరింతు
రేది విశేషము లందును దెలియగ । మీ దివ్యచిత్తమున నిజము దోచు
వినుము నామనుమడు శౌర్యప్రసిద్ధుడు । గన ఘనప్రబుద్ధు డనిరుద్ధు డనగ
దననాత్మకైన వృత్తిని దెలుపక । జనె యర్ధనిశిని కను మరగి పోయె
శయనించియుండె సతి యనువశతనె । భయము గూర్ప నెవ రెత్తుకపోయిరో!
అయరో! మున్నుప్రద్యుమ్నునిబోలెను । నయ నియతి చొప్ప దెలియజెప్ప మన
యనఘునిలయ! హరి! నీ కెఱుక లేదా! । కనెడి భువనముల ఘనదయాదృష్టి
మనుపు నీవు నన్నడుగుట చోద్యము । వినుము బాణుమందిరమున సుతతోడ
ఘనమైన విభవములగూడి భోగ । మున దాని చూలు నిలిపి బయలువడి
దను బాహుబలము నెఱపి యా దనుజు । ఘనభీతి నింపి దైవవశంబున
నాగపాశముల బంధింపబడియు । యోగంబును గొను మీ రాకతోడ
జాగు వల దింక సైన్యసమేతం । బేగి తే వలయు జేరుము శీఘ్రము
హాయ డతని నరసి సంరక్షణకై । దుర మొనరించును నీతో భద్రము
పర మందెదవా హరుని ధ్యానమున । వరమందినాడ వది స్మరియింపుము
హరుడు శాంతుడయి జయముగూర్చు నిను । వర మదం బడగు బాణుని భుజముల
నరసి ఖండించెదవు చక్రధార । పరముడ పీశ్వరుడవు నీకు సాధ్య
మగు నిది దీనను యశము గాంచుమని । చిందు జగదీశ! కొనెద నాయుద్ధ
మగజాపతిభక్తుని బాణు గెలిచి । తగవున ననిరుద్ధుని బాణపుత్రి
యుతముగ జేరంగలవు నీ వనుచును । సతతము గానము సల్పును యథేచ్ఛ
యతివరుం డేగె మతి దెలిసి కృష్ణు । డతి వడి గనుడని సమరభేరిని
ధణ ధణ మ్రోయగ సాటించె పురము । రణ రణత కాలు ద్రవ్వ యాదవులు
గణ గణధ్వనుల గంటలభూషిత । గణనీయామిత రవము దివి నిండ
కరి తురగసైన్య వర్గపరంపర । ధరణి రథనేమి గతులగ్రక్కదల
నరుల ధీకొనెడి శౌర్యములను భీ । కరములు పొంగుతను విజృంభణత
గముల గట్టి ధనురాది శస్త్రముల । శ్రీమ భూషణముల ధారణ మొనర్చి
విమలమతి సర్వసురల పూజించి । సమాతిశయ వీర్యంబు తేజముల
క్రమవృద్ధి నడచి రా బాణుపురికి । రమణితోడ ననిరుద్ధు డత్తరిని
సారస నేత్రుడు మణికిరీట కే । యూర కటక కంకణ నూపురముల
చారువనమాల కౌస్తుభమణియుత । హారచయంబుల భూషితుండగుచు
కరములను శంఖ చక్ర గదాబ్జముల । వరమందహాస్య గంధంబు, లలిత
పరిభూతి నాయత కోమలబరము । పరిధానయుగళి పరమాకృతి గొలిచి

కరము భూసురుల యాశీర్వాదము § లరసి పుణ్యాంగనల సేస లంది
దారకుడు ధీరతను దోపగ శృం § గార మందింపు గూర్చిన రథంబు
కూరిమిని సైన్య సుగ్రీవములను § సారమటు మేఘపుష్పవలాహక
ములు నా తురగములను బూన్చినట్టి § యలరున బోల్చిన భానురథము సరి
వాలాయమందు ప్రభల దిక్కులును § చాల దీప్తిగన దాని తా నరుగ
వలె నెక్కె వెంట బలభద్రుం డల § యలరు విల్తుడగు ప్రద్యుమ్నుండును
కెలన సాత్యకియు సాంబుడు గదుండు § తిలకింప తక్క భోజాంధవృష్ణి
కులు లాది వీరవరులు పండ్రెండు § వలనైనయట్టి యక్షౌహిణు లవి
వనజ నయను వెనువెంటనే నడచి § కనిరి ప్రయాణము కతిపయదినముల
కొనరున జేరిరి శోణితపురంబు § ననలాక్షరక్షితపు బాణుపురము
వడి గని ముట్టడి నించి రా భూమి § కడలుగ్ర క్కదల దుడుకు లుడుకెత్త
పడనూకిరి కోటలను పరిఘలను § ఘడియలు శీఘ్రత గని పూడ్చి మరియు
చెడిపిరి కొలకుల వనముల వసతుల § గెడపిరి ప్రాకారముల చప్పరాల్
దడ బుట్టించిరి లోపలి జనులకు § కడు భీకరముగ యాదవ వాహిను
లడరె వంచనను లెంచి యుంచితపు § నడల ధైర్యములు జడిగొన్న కడిని
ఇటు గాసి గూర్పు తట మెఱిగి బాణు § డట నుగ్రుడగుచు నరి మూకల గని
కటము లదర దంతముల నూరుటయు § పట పటలు మించ భట తండములకు
తటుకున సంగర భేరి మ్రోగింప § చిటిమిటి చిడిముడిపాటున కన్నుల
పొట పొట నిప్పులు కణ కణలు రాల § పటుకోపంబున సేనల నడపెను
చటులమందె భూమండలము తిరిగి § అట కడగిరె దాకెను జలధులెల్ల
బుట బుట బుడుకల సంక్షోభ మందె § కటిల గతు లబ్బె గ్రహకోటి కెల్ల
సురలు భీతిల్ల గిరు లాటాడెను § పరువడి దిక్కులు బగిలె రణధ్వని
యురగుడు శిరముల వంచె భారమున § ధర ధూళి మింట తాండవము సలిపె
పరమున దొరలెను తారలు భయమున § వరుస మేఘములు బూరుగ పింజలు
అరుల తల్లడం బసురుల భ్రమలుగ § గరుడగంధర్వ చయముల జదువుట
గనగ కరుల ఘీంకారశబ్దములు § వినుము తురగ హేషా రవంబులును
ఘనభయ నినాద వీరార్భటముల § జనతతి కల్లోలతయు రథనేమి
ధ్వనులు బ్రహ్మాండ భాగముల ముట్ట § గను బాణుడు వర కనక రత్నముల
మకుట, కేయూర, కంకణము లాది § సకల భూషలను భూషితుండగుచు
నికరమందు తేజమున కరములను § ప్రకటితాభీల ముసల కరవాల
పరిఘ ప్రాస కుంతల పట్టిస తో § మర భిండివాల శూల క్షురికా

పరశు గద శక్తి మొదలు శస్త్రతతి । శర శరాసనములును తూణీరము
లును పెక్కు లుక్కుమిగుల ధరించియు । కనుల మిఱుమిట్లు సురతతికి గూర్చి
వెలయ నిక్కుచును నెక్కి యనికిని । కలసేన లెల్ల దను చుట్టి రాగ

-: బాణాసురునకు సహాయుండగు శివునకుఁ, గృష్ణునకు యుద్ధమగుట :-

కలనికి సిద్ధత గని రాగమందె । చలువలఱేనిధరుండు శంకరుడు
వలరాజువైరి త్రిపురాసురారి । విలసిత రౌద్రుడు భక్తవత్సలుడు
నలువ వినుత మహనీయ తమోగుణ । కలిత విలయసమయోత్కట భీముడు
కుమారజనకుడు కుమారు డాదిగ । సమానాతిశయ బలవీర్యశౌర్య
ప్రమాణ చాలుల ప్రమథులు భూతము । లమానుషపు భీకరంబులునుగా
దాను దురము నొనరింప సిద్ధుడయె । వేన పినాకము భీషణశూలము
భూ నభోంతరాళములు నిండంగ । గానదైన నుగ్రమును మూర్తిభ
వింపుట దోపుచు భువనము బెగడ ని । లింపులు వెఱగని చూడగ బాణుని
పెంపు తా గోరుటను నతనిపక్ష । మింపును గూర్పగ విష్ణుండదిగన
ఖురపుటహతిచే ధరణిపరాగము । తరణిమండలము బొడవ రేగించి
వరుస వాలవిక్షేపవాతమున । సరణిగన్న మేఘముల దూలించి
కురుచ వాడికొమ్ములను జిమ్ముటల । నరయ జగతి కొప్పెరను జల్లించి
తరమున ఖణిల్లు నను ఱంకెరవము । నిరవు గొన్నట్టి మిన్ను భేదించి
పరుల తనరౌద్రమును రుద్రునివలె । కరము బెగడు నింపెడు నద్దు నెక్కి
వరమునను దాని మెడలోని ఘంట । లొరపిడి రవంబు దిశల నాకులత
జెందింప ధాతదేహుడు శంభుడు । తొందరను నీలదేహుని గృష్ణుని
సంధించి యుద్ధమును చేయనెంచి । బంధురయత్నము దోపగా మ్ముట్టె
హరుని బలమ్ములు నరసఖు బలములు । యొరులొరులు నెదుర వార్థితరగలను
శర వెందురొడ్డుల నిలువరించి నటు । వరుసలను గొనిరి ద్వంద్వ రణంబును
నరసఖుడు హరుడు మారకుమారులు । తరిమల్ల కూపకర్ణ కుంభాండు
లును బలభద్రుడు బలుడను ఘనుండు । విను బాణుతనయ డతడు జననాథ ।
జనవినుత శౌర్యుడై నట్టి సాంబు । డును సాత్యకియును బాణాసురుండు
మొనలుగా దిరి మొనలెత్తు క్రోధ । మున చురచూపుల సింహగర్జనల
ఢీకొని నిలిచియు సాగిలె కలయిక । యా కడమ నెఱిగి రథికులు రథికుల
దాకిరి కరిఘట లట్టి తురగములు । నేకతను వీరభటు లుగ్రలగుచు
వరుసలను సింహనాద హుంకార । వర ధనుర్గుణములను పిల్వరింప

కరితురగంబుల ఘూర్ణిల్లుటలును § వర భేరి ప్రభృతి సర్వరవంబులు
భువులన్నియు భేదిల్ల విని వరుస § దివిజవరు లంతరిక్షమున నిలిచి
అవిరళ ప్రకాశ విమానచయముల § భవుని వనజభవు భవముూలు కమల
మలరున నాభిని గనెడు దేవునకు § కలహము ఘటిల్లె కారణము బాణు
నెలమిని గూర్చుటకే హరుడిట్టుల § లలన విషయమున ననిరుద్ధునికై
చలముగొని యతని మదమడప హరియు § కలన దారసిల్లుట వీరి కయ్యో
ననుచుండ నారదుం డొక్క చక్కి § తనలోన దాను నవ్వుచు చిందుల
గనుచుండె నోగిరంబు జిక్కె నని § ఘనుడు శంభుండు కనలి కృష్ణుపై
నురువడిని గదిసి వీరమునుజూపు § తరుణమున గృష్ణుడట్టె చెలరేగి
యురుతర శరవృష్టిని హరుసేనల § బరుసల గుహ్యక భూత పిశాచుల
మరియు ఢాకినీ ప్రేత ప్రమథులను § నరిమురి గూర్చియు పారగను జేసి
కఱకు టమ్ములను వెను దిరుగకుండ § తరుమ వారి బీరములు సాధనాల్
లాగ నార్చినను హరు డతనిపైన § వేగవయింతెను పినాక గుణముక్
లాగి ధ్వని నిగుడ బ్రహ్మాస్త్రంబును § నా గరుడధ్వజు డద్దాని గాంచి
పరమ నియతి నాయస్త్రంబుననే § సరగున విసరిన రెండు సమ మగుట
వరుస శాంతింప నిటలాక్షు డలికి § మురభేదిపైన వాయవ్యాస్త్రము
సురలు భీతి నొన ప్రయోగింపగా § సరసిజనాభుం డచలాస్త్రంబున
స్థిరత ధీరత్వ కలిమి శాంతింప § హరు డాగ్నేయము ననెడి శరంబును
కరము నుగ్రతను గూర్చి వైచుటయు § హరి యైంద్రాస్త్రమునను దాని నుడిపె
ఈశాను డార్చి భూతగణ ముబ్బ § పాశుపతము దుర్మతుల భీతిదము
కేశవునిపైన నురివోసి వ్రేసె § శ్రీశుం డట్టులె భూతేశుపైన
రోషరాధ్రముల పాశుపతంబును § భూషితము లెరుగ నారాయణ మను
దోషాచరహరణంబునైనట్టి § భీషణాస్త్రమును దానిపై బరపె
నవి రెండు మింట మంటలెగయంగ § గవిసి పోరాడి శాంతి నందుటయు
భవుడు తా జిన్న వోయె గృష్ణుండు § చివురెత్తునవ్వు మోమునను దోప
హర ! నిన్ను దరమునను బారజేతు § నరయు మనుచు సమ్మోహనాస్త్రంబు
పరువడి కోదండము నెక్కువెట్టి § సురవరులు భళిర యని యగ్గింపగ
బాహాటమ్మున విక్షిప్తమంద § నూహా మలపె నది శంభుని మనమును
దేహము పరవశ మందగా నతడు § వ్యూహ మధ్యమున వృషభమున మూర్ఛ
మునిగిన డొల్లంగ బారె వృషభంబు § వనజనయను డంతట భూతగణము
లవిలో నిల్వక విముఖముల బార § కన కనలునిండు కొనువటివృష్టి

వారి యాయుధము లెల్ల తుండములుగ ఽ గూరిచె మరియుఁ దుత్తునియలుగా
చూరందించిన హరి బారి దప్ప ఽ బారిరి మరుడును కుమారు డటులే
క్రూరనిశిత బాణంబుల నొవ్వ్వాలు ఽ జేర విసరు కొన నందుల నిలువక
ప్రక్కజూచుకొని పారె కుమారుడు ఽ ఉక్కున రాముడు కుంభాండు నటుల
స్రుక్కించె ముసలహతి వా డనికిఁ ఽ దక్క దిక్కులను గని పేరం బిడ
నాపగిది కూప కర్ణు నాగలిని ఽ చేపట్టున శిరమున మోద నటుల
ఆవేసగ వచ్చె బాణుడు సాత్యకి ఽ యేపు మిగుల బోరాడుచుండగను
నతడు సాత్యకికి జిక్కె మరి గెరలి ఽ యతని ఘోర శరముల మాయగూర్చి
వితథబలు లగుచు వారు తనవారి ఽ మతికి నూత నిడి మరి కలయబడిన
హరియు సాత్యకియు తమ వాహినులకు ఽ తరతమోత్సాహముల గూర్చి బలుక
కర ముభయ సేనలును జయమునకై ఽ ఉరువడించుచును వీరాట్టహాస
ముల నుదగ్రక్షేణముల వారిధులు ఽ కలయిక కన్నటు కడు ఘోరముగా
కలనను శరములు గదల ముసలముల ఽ అల పరిఘ పట్టిసముల కుంతముల
పరశువుల చక్రముల శూలములను ఽ కరవాలమ్ముల గుఠారములనుఁ
సురియల శక్తుల గుదియ లాదిగను ఽ దరమందిన యాయుధముల సమితిని
పరిమితశక్తిని చీల్చుచు గ్రుచ్చుచు ఽ పరువడి మోదుచు బాదుచు విసరుచు
శిరము లురమ్ములు నూరు జఘనములు ఽ చరణములు పిక్కలను మడమలనుఁ
గరములు భుజములు చెక్కులు డొక్కలు ఽ వరుస వదనమ్ము చెవి కను నాసిక
ములు తెలియరాక నుగ్గు తుగ్గుగా ఽ దల మిగులుచు సోలుచు మూర్ఛ గనుచు
డెలియుచు నురుముచు వెలికి జారుచును ఽ కలన సర్వతలముల తెగిన మొండె
ములును ఖండాంగములు నచ్చ టచట ఽ నలి నలిగ రక్తమున గలిసి రొంపి
వెంట లెల్లెడల ప్రేవుల ప్రోగులు ఽ కంటి కెక్కసపు శల్యపు గుట్టలు
తుంటలుగ నరుకబడిన మాంసముల ఽ గంటిమ కొండలుగా నగు జనవర !
ఇట్టు లిరువాగు లాపట్టుల గన ఽ పట్టుటలు జూడ భీతిని దోపెడు
పట్టున కరితురగము లట్టిగాగ ఽ దట్టె నాయుద్ధభూమి భూతములు
చుట్టములు గూడి విందు గొన్నట్టి ఽ పొట్టనిండ మాంసముల మెక్కుచును
త్రేవుచు రక్తము గ్రోలుచు సోలుచు ఽ ప్రేవుల మాలికలుగ మెడల వేసి
త్రోవలు మత్తున గనక నల్లెడల ఽ దేవులాడుటల నాభీలముగా
కన శోణపురము శోణనదమువలె ఽ విను శరతతి ఖండనములు కుముదము
లన చామరతతి ఫేనమునబోల ఽ ననువొందు నాతపత్రము లబ్జము
లన శోణితంబె రసపూర్ణముగా ఽ తనువుల శల్యము లిసుక తిన్నెలుగ

గనగ భుజంబులు నాగకులంబన ǁ ఘనమైన కేశములె నాచుగాగ
నని చాలిట్టుల భీమంబు నిండె ǁ విను జననాథా! బాణుం డత్తరి
వనజ నయనుపై రథము దోలించె ǁ కినుక బాహుబల మదము పెంపునను
కనగ నైదైన నూరుల ధనువుల ǁ సునిశితాస్త్రముల వేయిశరంబుల
బా ననువుగాంచి యరివీరుని గృష్ణుని ǁ దనువు నాట వైచిన కనకచేలు
డును వాని నడుమనే ఖండించియు ǁ దనుజనాథు కోదండము లన్నిటి
తనవాడి బాణములను బరపియును ǁ దునిమిన నాతం డితరాయుధముల
వరుసలగా దిప్పి వైచెను గృష్ణుని ǁ మురహంతకుండు అవియును దునుకల
పరమందించియు సారథిని జంపి ǁ తురగముల దునిమి రథమును జెఱచియు
కరము కినుక దా గొని పాంచజన్య ǁ మును నూదుచు నాతని జంపు కడక
త్వర బూని చక్రమును దాల్పనున్న ǁ సరగున కోటర యను బాణుజనని
వరయుతుని సుతుని దా బ్రోవ దలచి ǁ సరసిజనయనుం డొక్కరుడె జూడ
నతి బీభత్సము నిండ శిరమునను ǁ మదికి వెగటు దోపంగ విరబోసి
యతి వినుతుడైన కృష్ణుని యెదుటను ǁ గతిని పరిధాన హీనయై యంబి
కాదేవి యంశజయునై నిలువగ ǁ నా దివిజవినుతు డైనకృష్ణుండు
రౌూ దేవీ! తొలగుము రోత కొర్చి ǁ నాదుబారి తప్పింతువె బాణుని
నీదు మతి గనుము నీకు శోకమును ǁ నెదనుం గూర్పను బొమ్మన నాసం
దున బాణుడు దా పాఱె యుద్ధమున ǁ వనమాలి నవ్వుకొనుచు దీప్తి గనె
ఘను డా యుగ్రుడు భీకరాకృతిని ǁ దనరారునట్టి మూడుపాదములు
విను మాత లటు వెలయ మహేశ్వర ǁ మను జ్వరంబు నావనజాక్షుమీాద
గవయుంగ బంప నదియు నుగ్రతను ǁ భువనములు భీతి గనదో గృష్ణు
దవుల రా నవ్వుచును దాని నడప ǁ నవిధి గని వైష్ణవజ్వరంబునా
దవులంగ బంప శైవజ్వరంబును ǁ భువన దీపకుని జ్వరంబు ముంగట
నిలువక బారెను వెనువెంట బడియె ǁ బలుదెబ్బగుల నెటుబోరిన విడువక
యలసె నా జ్వరము శైవంబగునది ǁ నలినాక్షు డాసి శరణం బటంచు
మొనసిన దుఃఖమునను గోవిందా! ǁ గనగదే! దయను నీవ! నీపట్టు
నను గెలిచి వెంటబడె వైష్ణవియును ǁ యన పీడు పాటి డాగ నెందైన
నిను మ్రొక్కెదాన మనవి విను దీన ǁ మును గన్నదాన వినుతింతు ధ్యాన
మున సంతసించుఘను డవాచ్యుడవు ǁ వనజభవాండము లన్ని నీవదువు
ననె పుట్టు వెలుగు నడగు దేవేశ! ǁ నను నీవ దోపుదువు సకలభువన
జనకస్ఫూర్తి వి దాల్చిన బ్రహ్మవు ǁ మనుప ననంతుండ వటు మరల రుద్రు

డవు నీవే పరమాత్మ జగజ్జ్యో ʃ తివి శక్తియుతుడ వయ్యా గుణమూల
మవు ప్రకృతి మొదలు నీవే పరతత్త్వ ʃ భువనము లన్నియు నీభవనమ్ములె
జగదవనా! శాశ్వత! దేవదేవ! ʃ భగవంత! రమావర! పాహి! పాహి!
ఖగవరారూఢ! కంజాక్ష! యీశ ʃ నిగమప్రకాశ! నిత్యసర్వేశ!
నిను చిన్మయునిన్ నిర్వికారునిఁ ʃ గన యాత్మరూపు నద్వితీయునిఁ
సనకాది సేవ్యు ఘనుని నిరామయు ʃ మునివంద్యు పంచభూతమయు మఱియు
నాదిపురుషు విశ్వేశు షడ్గుణ్యు ʃ శోధనీయు పరిశుద్ధు గేవలుని
బోధనీయసాధనల వేదశా ʃ స్త్రాదుల కగమ్యు భావుడ వోహరి!
ఆది చతుర్వ్యూహముల సమస్త ము ʃ పాదితంబు నీదివ్యచిత్తంబు
ఇట్టి నిన్ను నే మొక్కితి నండను ʃ పట్టు గన నిలుపు నీదయయే నా
జుట్టిన వేదన పట్టు దొరలింప ʃ మట్టమైనదయ పాలింప వయ్యా!
నా యమేశుడను నీ వొకటి గాదె! ʃ యో యఖిలపోష! నీకు నమోయన
నాయుచిత స్తోత్రమున ప్రీతి గని ʃ వే యుపశాంతిని నించి యిటులనియె
నను నీవు నుతించిన యీ గీతము ʃ మనమున శుద్ధిని గూర్చి పఠించిన
గనబోరు శైవవైష్ణవ జ్వరముల ʃ మునుకొను డింకను మీయిచ్ఛ భువిని
యనఘుల జెనకకు డని వరము నొసగి ʃ ఘనత దయ వెలయ నానతుల వలరె
యుల బాణుండటు పారి పురి జేరి ʃ తలమున ధైర్యము పంపునఁ గొనుచు
విలసిత పరాక్రమ ముద్దీప్తిని గన ʃ బలము రెట్టింపు సలవడ మహోహ
రమునైన భూషణముల దాల్చియుఁ ʃ గ్రమముల ఘంటల కింకిణీధ్వానుల
నముల హేమరథమున నిం పొలయగ ʃ విమలతర మయూరధ్వజము గ్రాలంగ
వేయికరంబుల ధనురస్త్రశస్త్ర ʃ తోయముల కెన్నొ మిత మిన్ని యనక
నాయితంబు గొని దివ్యరథ్యముల ʃ చే యుత్కర్షత సిద్ధముగ నెక్కి

—: బాణాసురుండు రెండవసారి యుద్ధమునకు వచ్చుట :—

కాయజుని గన్నతండ్రిని విష్ణుని ʃ నా యమేయబలు మధ్యాహ్నసమయ
ఛాయాపతిఁ బ్రభ వెలుగొందెడు ʃ శ్రీయనుంగు చెలికాని కృష్ణునిఁ
ఘనముజాంధ పరిపంథిచక్రమును ʃ దునుము దవానలు డవ మించువాని
గని శాత్రవుఁడును ఘూర్జించి దాశ ʃ మునధి శయనుండు వాని మద్దుంబుము
దుముమునా శరపరంపర నింపిన ʃ దనుజవీరుండు వాని గ్రైకొనక
దనభయుడయిన ధనురస్త్రంబుల ʃ ననువున యుప్పొంగ పెక్కు యుద్ధముల
మెక్కు మిగులు గతి మున్నెక్కును జెందక ʃ నొక్కమొగిన పద్మాక్షుని గుప్పిన

యక్కజం బంది యా యదువల్లభు § డక్కర దలపక వాని వడి మలిపి
వీని కింక మురిపెంబు డింతునని § దనుజభీకరము దుర్జనత్రాసము
మానసీయ సురమండలికెల్లను § గన నత్రాసము నగు సుదర్శనము
తాను కేల ధరియించి చక్షులకు § భానుకోటి తేజమున మిరుమిట్లు
గూరిచి మదాంధ! దనుజ! గను మిదే! § నీరముగ గ్రోలు నీ బీరమెల్ల
ఓరి సుదర్శన బడబానలంబు § దారతలపుమా! హారు డదేమగునా!
కరముల దునిమెద శిరముగతి యేమొ? § ఇరవుగాను ధృతికి బ్రతుకదలతువా!
సరసతనుగూర్చి యనిరుద్ధు నిమ్ము § తరుణి యుషాసతితోడ నందింపు
మన వీరహుంకృతి నీలవర్ణు § కినుక కనుల నిప్పుకలు రాలంగ
దనకరంబులను మణికంకణముల § దనరు మెరపిడుల ధ్వనుల నాయుధాల్
విసర విజృంభితుడుంగా నాతని § పస మాప చక్రమును విసరునంత

### -: శివుండు బాణుని రక్షింప శ్రీకృష్ణుని స్తుతించుట :-

పసరుపేతుణా! వైకుంఠేశా! § కనుమా! కనికర మో కనకచేల!
దునుమకు నీతని శిరమును కేశవ! § వినుమీ దనుజుడు నను గొని వరమున
తనయుడు నాకన గౌరిముదము గన § మును నే కృప నించితి వీని నేన
అది యుండ నిమ్ము మఖాధారా! § మదిలోన నిన్ను నుతిచేయగ నే
గదియ వచ్చితిని వినుమతి యొనర్తు § సదయామయ! నీ యదను సుదిన మహో
యదువంశాంబుధిచంద్రమ! కృష్ణా! § విదితయశోధన! నీ మహామహిమ
పదిలత గని నుతిసలుప వశమగునె § యుదరస్థిత బ్రహ్మాండ విశ్వగురు
వేదచతుష్కము లెవ్వని ముఖంబున § పాడుకొని వృత్తి నిను బొగడ నొప్పు
ఆదిత్యాగ్రజు డెవ డా యుతండు § నీదు పాపడగు ధాత నామాఖ్య
డతని తలంపున నే జనించితిని § గతి గూర్చితివా నను తమోగుణము
కృతఫలంబు నా ప్రభుత గూర్చితివి § యతివినుత! పరంజ్యోతిస్వరూప!
నీవ విరాట్టువు పావనాకార! § భావింతు హృదయమున ధారణముగ
దేవ! నిర్మలసమానాధికరహి § తా! విష్ణూ! శ్రీవిష్ణేప! విశ్వ
తావకీన సంకల్పమానములె § భావింప జగము లన్ని మహా త్తత్
త్వావిశేషమూర్తి వనందగు నీ § వే విశేషమున నిటుల వెలయుదువా!
కేవల నిర్గుణభావ! నిరాలం § బా! వర్ధిష్ణుడ వయ్యు జిష్ణుడవు
నీ వర్తనంబు లీలచే వెలయు § పావకముఖంబు దిశలు శర్మములు
ఆ వనజాప్తుడు నయనంబులు గా § నా వనజారియు మానసంబు గా

పదముల ధరణియు నాభిదివంబును ॥ సదనమగు స్వర్గలోకము శిరంబు
నుదధులు జఠరము రేతము జలంబు ॥ భిదురపాణి భుజములు రోమము లో
షధులు శిరోజము లవి బోల్పగదగు ॥ చదురున మేఘమ్ము చాలులన్ని
విను మీశ! బుద్ధి, బ్రహ్మంబు, నాగ ॥ జను విసర్గంబు ప్రజాపతియుగా
గనగ హృదయమే ధర్మంబగు గా ॥ వెనుక నధర్మము మోదంబు ము క్తి
గా వెలయు నీవు లోకభద్రతకు ॥ పావకాశతను ప్రభవింతు విటుల
దేవ నాబోటి కిని గాదెన్నగ ॥ నీవ! పురాణపురుషుడవు సత్యము
ఇను వంబుదముల కప్పును బొందుచు ॥ గనగ భిన్నరూపముల దోపించు
ననువున ఘటనాఘటన సిద్ధతను ॥ ఘనుడవు గుణానుషంగివయ్యునుగ
వాని కతీతుడ వయ్యు నచ్యుతా! ॥ మానసావేద్యమున దనరు దీశ!
నీవు సజ్జనుల సాత్వికవతంస ॥ తాపరత గూర్చి మోదింతు వంత
త్రోవ నిది కనక నీవల నేమఱి ॥ కేవలము ప్రాకృతము జుట్ట దుష్ట
భావములను సంసార లంపటులు ॥ పావనంబునుగ గవయ రెందునను
తనువున శాశ్వత మావరం బంద ॥ గనుచు నిత్యమని దార ధనాదుల
కును మోహమంది సాగరపు సుడుల ॥ కును పాటిమునుకు లిహమునగ గుండు
గని పరమొంచక నిరయస్థితియే ॥ తన కభిమాన పరంపర ఫలంబు
గను నో శ్రీపతి! శ్రీపదనిలయా! ॥ విను మింద్రియపరతంత్రులై నిను
మనమున స్మరింపకను హేళనమున ॥ వనజాసన సన్నుతములగు నీదు
చరణార్చనాదికమ్ముల భక్తిని ॥ శరణం బెంచక పరంబు మూఢత
తరింప నెరుగక తా నాత్మ దిగడి ॥ నిరవుకొను వంచనమునె ఓ యభవ!
విపరీతబుద్ధి నీధ్యానామృత ॥ సపరిపాటినిగ గీటువుచ్చియును
నపుడె మత్తంది హాలాహలమును ॥ కృపణచిత్తుడై సేవించి పూర్వ
తపఃఫలమునగ గన్నట్టిదైన ॥ యపురూపతనువు వ్యర్థమును బుచ్చు
నిను పుణ్యావశిత సర్వము నీవని ॥ వనజోద్భవుండు నేను మునీంద్రులు
మనమున విజితమునను బొందుపఱచి ॥ నిను సేవించుటచే ధన్యులమని
తలతు మదియు మాకోలది నీవలని ॥ విలసితాపహసితంబుగ లజ్జనె
వలగొందు మీశ్వరా! పురుషోత్తమ! ॥ జలదశ్యామా! శ్యామలాగ్రజా
యని నుతించు శ్రీకంఠుని తా గని ॥ కవకాంబరుండు ఘనత నిటులనియె
యంబికాపతే! యజ్ఞధ్వంసా! ॥ డంబరహిత! ధవళాంగ! మహేశ్వర!
లంబితజటాకలాప! శశిధర! ॥ యంబరకేశ! దిగంబర శంభో!
గను ఈ కాంచను నీవుభుత్తము ॥ తన తపఃఫలంబు వను నిను చెప్పెను

గనజేసి వరము గొని నీతనయుని శ్రీ నెనసి యననేల నిజము సుతుండవ్వో
విను నిన్ను గొల్చుటలు నను గొల్చుట శ్రీ యును వేరు దలప నేను విశ్వేశు
డన నీవె కావె భేదమున్నదే ? శ్రీ విను మీతని నని లోన దుంపగా
ననుసరము నంద నీను మనంబును శ్రీ మును విన్నవాడవే శశిభూషణ !
ఘనుడు ప్రహ్లాదునకు వరమొసగెడు శ్రీ ననువునను నతని వంశమున బుట్టు
దనుజవరుల జంపను నే నంటిని శ్రీ విను మిందరినేను డతని మనుమండు
తనయు డాతనికి నితడగు నీతని శ్రీ తనయు నా మనుమడైన యనిరుద్ధు
వనితయయ్యె నిటు చుట్టరిక మొదవె శ్రీ గను మిక యభీప్సితము కరుణించితి
వినుతి నతి యిదియె శమదమనా ! యన శ్రీ విని యుమాపతియు ముదమున భ్రాజిలె
దనుజేంద్రు బిలిచి తనువున వ్రణములు శ్రీ గననీక మాపి చిరంజీవిగా
కనికరమున దీవించి వరము లిడె శ్రీ వినుము నరవరా ! బలినందనుండు
ఈవిధి రణభూమియె యజ్ఞవేది శ్రీ యా వనజాక్షుడె యాగభోక్తగా
పావన మంత్రములగు హుంకృతులే శ్రీ కేవలాజ్యంబు కీలాలధార
సమిత్ప్రచయములు బహుశాఖలుగ శ్రీ నమస్కృతులు నాయుధవిహారములు
సుమజాలంబులు సేనల క్రమములు శ్రీ సమమతి నందుటయే యతని సుగతి
నా యాగపూర్తి యచ్యుతుని చెంత శ్రీ డాయ వచ్చుటయే నా యన కృష్ణుని

-: ఉషానిరుద్ధసహితుండై కృష్ణుండు ద్వారకాపురంబున కరుదెంచుట :-

వేయైన చేతు లెత్తి మ్రొక్కినటు శ్రీ న్యాయమున నిల్చె నట్టి నాల్గైన
కరముల జోడింపునుగూర్చి కృష్ణు శ్రీ చరణముల మ్రొక్కి యా వనజనాభు
కరమధ్యమంది కడుసంతసమున శ్రీ పరమేశ్వరి కరుణను నాగపాశ
పరబంధనములు వదలి తరుణితో శ్రీ మురిసెను నందెడి యనిరుద్ధు గాంచి
పరమాశ్చర్యము నంది నిజమెరిగి శ్రీ వర తనయు మ్రొక్క వారిదంపతుల
తాను దీవించి గోవిందునితో శ్రీ వేన వారి వరరత్నభూషలును
వేనవేలు కరితురగమ్ములాది శ్రీ మానిత రూపవిలాసినులు నయిన
దాసీజనులను వరణం బిచ్చుచు శ్రీ వాస వాదులును మెచ్చ కేశవుని
డాసి యర్పించె నా వధూవరుల శ్రీ వాసుదేవుండునుక బ్రీతి నందె
ముకవైరి యంతె త్రిపురవైరినిక శ్రీ పరమ సంప్రీతి నీలిపి బాణుండు
కరము తన్నా తన తండ్రివలె నుతిని శ్రీ పరుప మోదించి వీడ్కొని సేనల
వరుసల నన్నియు బ్రిద్యుమ్నాదులు శ్రీ తరముగొని నడువ ద్వారకను గాంచ
పరువడి నడకల గనుచు నప్పురము శ్రీ సరణి మున్నుగా దనరాక గోరి

పరమశృంగారలీల నింపంగ । నరకాంతకుండు జేరె పురి వెలుప
లను విలసిల్లెడు వనమున మునుమని । ఘన విజయంబును కల్యాణ పరిణ
తిని జాట బంపి తా సకలబంధు । జను లెదుర్కొనగ మంగళధ్వనుల
వందిమాగధుల సంగీత నుతుల । ఇందిరను బోల నలంకరించిన
మందిరములు వర కనక మణులచే । సుందరనిర్మాణముల తోరణము
లంద మింప కల యంపులు నిర్మల । గంధాదుల తరులతల పందిళ్ల
రంగవల్లులను ముద్దులు గుల్కెడు । బంగారు స్తంభముల ధ్వజము లొప్ప
అంగు దోపు గోపురముల రత్నాల్ । రంగు నింపగా చెన్నొందునట్టి
పురమున జేరెను వనంబునందే । వరుస విందు లారగించి ముదమున
సరసీరుహ నయనుండు దిగ్విజయ । పరతను యశంబునను దీప్తి గనుచు
జేరి సర్వు లానందమున తన్ను । వారల నేత్రములకు పర్వంబుగ
దేరి గనగ సుఖమున ప్రభుతగాంచి । సారసుఖంబుల పాలించె తాత
ధీరతను ధర్మమును మేర లిడగ । పారమందె మోదంబు వారలను
అనుచు శుకమౌని జనపాలునికిని । వినజెప్పె కృష్ణువిజయ మీచరిత
విన జదువ జెప్ప వ్రాయువారలను । జలజనాభుండు ఇహమున సుఖంబు
లను పరమునందు ముక్తి బొందించు । అనుకూల మొసగు నారోగ్యబలము
శ్రీని యాయువును మరి పెంపు గాంచు । టను తోడుచేయు మంగళతరముల
నన పరీక్షిత్తు మరి కృష్ణుచరిత । లనువొంద బల్కు మన జెప్పె నిట్లు

## -: నృ గ మ హా రా జు చ రి త్ర :-

ఒకనాడు యదుకుమారు లుద్యాన । నికరముల విహారము సలుప నతిగ
రకలంకమతులు సాంబుడు గదుండు । ప్రకటితవీరుడు ప్రద్యుమ్నుడు మఱి
చారుభానుండు సునందులాదిగ । ధీరత విహారముల నల్లగిరి
మీరు నుత్సాహములు గిరిభూముల । నీరు గ్రోలగా దలచి పిపాసను
పారమంది యాచోటుల వెదకుచు । వారి కొంచెమగు నొక్క కూపమున
జేరి కాంచి రొక కొండగుట్టవలె । దోరంపుమేన నొక కృకలాసము
వారబ్బురమున దాని వెడలించి । నీర మేమైన లోనుండు నంచు
చూతమనుచు వదలింపబోవుచున్న । నూతకోలలను జడిపించ గాక
రాతల విసిరియు దలగింప లేక । చేతులను నూకి యందునను వ్యర్థ
లగుచు పాశముల వంటగట్టియును । బిగు వంది పనిని సాగింప గవక
వగరుపు బుచ్చుచు నేగి నగధరుని । కొగి జేరి చెప్పి రాద్యంతముగా

విని వారు వెంట నరుగ నాశ్చర్య § మున మరికొందరు జనులు జనపతులు
దనుచుట్టిరాగ ఘను డాకృష్ణుడు § గనె నాకూపము నందున్నయట్టి
బీనూసర వెల్లిని భీకరము నెఱపు § గాసి తనవారి కొడగూర్చినట్టి
వాసిగట్టి పట్టున భూమి నాని § యేసందడులను బెదరు గనకున్న
దాని కేశవుడు డాసి మనంబున § దీన ముత్తిగను నీతం డనుచును
దేని జింతించెనో వేగ మరసి § పూనిక పవిత్ర మాతనువు గూర్చ
నెదమ చేతనా నుడుముతలపట్టి § యెడజిమ్మెను మింటికి దానితనువు
వడి దృశ్యుండయె ఘనుడొక్కరుండు § వడి లేని సుందరమున మణిభూష
లమరగ రత్నమకుటంబు దాల్చి § దడ గననియట్టి వడుపున ధీరత
పుడమి విహరింప నే పుణ్యధనుడొ! § నిడుదభక్తి శ్రీహరిని దర్శింప
గొనవచ్చె ననగ శ్రీకృష్ణు సన్ని § ధిని దృష్టి నిలిపి చరణముల వ్రాల
వనజనయను డాదరమున నాతని § దగు కౌగిటిలో ధీరతను నిలిపి
మనమున సర్వము బోధ నెరిగియును § వినువారికెల్ల నాతని వృత్తము
వినిపింపగోరి యో మనుజవరా! § వినుపింపు మెవరు? ఎందు కిట్లుంటి?
వనఘుడవు బోలె నీ రూపమొప్పె § కన నీచమైన నువ్వాన్నై తొండ
వగుట యెట్లు? సకలంబు మాకెఱుగ § ఘనుడవు వచింపు మనిన జనవరుడు
జగద్రక్షకా! శ్రీశా! పరేశ! § భగవంతుండవు నీవు నావలన
వినదలచి యడిగె దింతయే గాని § వనజభవుని జనకుండవు దెలియవ!
యనఘస్వరూప! చెప్పెదను నాజ్ఞ § మునివినుతా! నే నిక్ష్వాకుసుతుడ
జనపాలుండను నృగు డండ్రు నన్ను § నగు నేన పొగడుకొనుటగా బలుక
వలసె పాప మది యైనను దేవా! § బలికెద నభూపవర్త నీ వగుట
నిల యేలుచుండు న్యాయాన్యాయత § కలకాలంబును గోదానంబుల
కొలది మించు గణనంబున గూర్చితి § పలువిధ దానము లెన్నో యొనర్చితి
నవియును గో భూ హిరణ్యమాదిగ § సవిధిని యజ్ఞములను జెల్లించితి
భువిని సంతాన సప్తకము కొలత § దవుల నీక యొనరించితి పెక్కుగ
యనవరత మిట్టుల దానముల గోవు § లను పాడిగలవి తొలుచూలు గూడి
కన సాధువులై కనకశృంగములు § విను రజితఖురము లలంకరించిన
నవి యొసగుచుండు వేదవిప్రులకు § ప్రవిమలు డొక్కడు భూమీసురుండు
యంచితుండు శిలవృత్తి జీవించు § కొంచెమైన పదివేలని యెప్పును
వంచితుడు గాడు నే నట్టివాని § పొంచి దాన మిచ్చితి నొక్కయావు

సదయుఁడైన భూసురునికి దానము $ మదిని మెచ్చఁగా నిచ్చితి దానిని
గొనుచు నతఁడేఁగ మొదటి క్షితిసురుఁడు $ దన గోవుగ్రుణుతు నెంచి యావిప్రు
గినిసి చోరుఁడవు భూసురవృత్తి౽ $ మును గొంటివయ్యా ! ముగ్ధ్బలితన్నముఁ
జనపతికి జెప్పి శిక్ష నందంగ $ నిను గూర్తు ననఁగ యోరీ ! పాపుఁడ !
విను మిప్పు డేను జననాథునిచే $ గొని తెచ్చి కొన్న దానవు గోవిది
యని కుత్సితుఁడవు యదియు నీపాడి $ తన గద్దెట్లు శిలవృత్తిని చెడుగవు !
జనవరుని కెలన నీకె యది గూర్తు $ ననుచు నిద్దరును నను జేరరాఁగ
ఘనమైన భీతి దనువున కంపము $ గన వారి చరణ ములవఁడి వేడియు
వలసినన్ని గోవుల, కనకాదుల $ తులలేనిమణుల నిత్తు గొనుండని
దెలివి వికసిల్ల నే విన్నవింప $ నలుక మానకం దొకఁ భూసురుఁడు
బలిమి గవదనుచు ఖలము కోర్చితివి $ వలదు నావృత్తి కిది చాలు పాలు
వలచి కోరితిని బాలుల కొఱకై $ వల దది మాత్రము కావలయు నాకు
ననుచు నను దొలఁగి పోయె నాద్విజుఁడు $ కనకముల మరియు పెక్కు గోవులను
ఘనత నిత్తు నన్ను రక్షింపు మనఁగ $ వినక మరియొక్క విప్రుఁడు నను గని
కపటమతీ ! నీ కలి మేల ? నాకు $ రిపునిగా నెంతు దాని నాతపము
నపహరించు ధనమున కాసించుట $ చపలుఁడను నాను నిది దప్పు నొల్ల
నృపుఁడ వపహర్త వీవే గావే $ చెపుమా ! యని నామాట గైకొనక
వెస గొని యేఁగెను నావిధిచొప్పున $ బిసరుహనాభా ! ఘను లా ద్విజు లటు
పసిడికాసింప రట్టివారికేని $ కసటు నించితిని యా పాప మంటె
కాలవేగమున యముని పోలికేని $ చాలునె జేరిన నతఁడు ననుగాంచి
మేలు పుణ్యశీలుఁడవు రావయ్యా ! $ ఓలి పుణ్యలోకముల నీపాల
నెలవులు పెక్కులు గలవవి యైనను $ దలపు మొక్కింత జాలి నినుఁజెందు
తలమున వసింపవలె దాని దప్పు $ దలవిగా దేరికైన సిద్ధంబ
యలనాటి గోవులను దానంబున $ కలత నొసరితిని ఫల మనుభవింపు
మది యజ్ఞానం బంటక నోపదు $ విదిత మనలమ్మనను గదిసి తేని
యది గాల్పకున్న మరపును మార్చునె $ సదయుఁడవు నిన్ను ముదమందు వెనుక
యదువల్లభుండు ముక్తినందించు $ గదియ నందు విజ్ఞానము భక్తియు
నని యిందుండఁగ రూపంద ద్రొబ్బె $ వనజదళాక్షా ! నాచరిత్ర యిది
కనఁగదే ! యింక కరుణ నీదాసు $ డను చక్రధరా ! స్వామి ! భువనపతి !
గతి నీవె ! కృష్ణ ! కనక మయచేల ! $ యతులజ్యోతీ ! యనంతమూర్తీ !
వాసుదేవ ! సర్వేశ ! భవహర ! $ నీ సన్నుతి గను జన్మ మొక్కటియ

దోసములు గూడు పెక్కుజన్మములకై వ్రాసి వ్యర్థములౌ నిది భవ్యతరము
నీకు మ్రొక్కెదను నీరజనయనా ! నాకు దక్కెనిక మోక్షపదమ్ము గదే
నీ కరుణగూడె నిను జూడగంటి పోకడ నందెను తొంటి దురితములు,
ననుచుండ నంత దివ్యవిమానము ఘనరత్నరుచుల మిన్నంటు దీప్తిని
గన వచ్చి నిలిచె కృష్ణు ననుమతిని యనఘు డానృపుడు దాని నెక్కియున్న
గనె ముక్తిపదము నంద అది గాంచి వనజనాభు చరణంబుల మ్రొక్కిరి
వారి జూచి యనె వింటిర! యీతని సారచరిత్రము సద్బోధ గనుడు
మీర వినదగును పరధనహారంబు ఘోర నరకాగ్ని బౌరందు మిడుత
నరపతుల వంశ మును నరణ్యమున కరయ దావంబు బ్రాహ్మణధనంబు
సరణి వార్ధికగు వైభవవార్ధిని వరుస నింకింప నది బడబాగ్నియే
వారి సంపదలు నా గిరులకెల్ల ఘోరతర వజ్ర ధార యౌ సొమ్ము
చారుతరచంద్ర కిరణసమ యశము వారి మాయింప నినురశ్మి యదియౌ
గరళంబు మిన్న విప్రుని ధనంబు గరళ మొక్కనిది కులమె బొలియించు
గరళమునకైన మందు గలదు ఈ గరళమునకు బెజ లేదు నిజ మరయు
నిరయమందు గుంభీపాకమ్ముందు తరముల వారును క్రిందున మీదను
వరుస గొన్న పదిచాలుల వారలు పరమపుణ్యా లోకముల జారెదరు
పరదత్తమైన స్వదత్తమైనను ధరణీసురక్షేత్రాదులపట్టున
కరము జూపంగ రాదు నరకంబె తిరమందు చంద మదిద ప్పగాదు
చిరకాలమందు క్రిమి తా నగుచున్న బరమదుఃఖమును విట్కూపమందు
తరముగా దినుచు నుండు బ్రాహ్మణుల నరయక దండన నిడుటయును దగదు
వరుసవారలన్ను కీడు గననైన పరిపాటి గనక మ్రొక్కుట హితంబు
నే ననుదినంబు వారి సేవింతు గాన వారియెడ రోసము కపటము
మానక దండింతును వారి యెడల పూనిక దోషములను గూర్చి రేని
యే రయిన సరియె నాకు కనెద రది మీరు బ్రాహ్మణుల సేవింపు డనుచు
ధీరత విష్ణుడు చార్థుముదంబున వారి గూడి పురిజేరి సుఖముండె
భూరమణా! యీచరిత నుతించిన వార లిహపరము లందు సుఖంతురు
నరనాథా! బలరాముడు శోకనాడు వరరథమునెక్కి వ్రేపల్లె కేగె

-: బలరాముడు సుహృద్బంధుజన దర్శనార్థమై వ్రేపల్లెకు బోవుట :-

వరమతి నచ్చటి బంధుల హితులను నరసి వేడ్క తానంద దలంచియు
చిరకాల్య నంగడీలైన న్ట్రి వరగోపగోపికాది సంఘములు

కరము మోదమున తన్నెదురు కొనగ ఽ ధరను డిగి వారి సముచితాలింగ
నముల ప్రీతి నింపుచు వేగజేరి ఽ సమమతిని నందయశోదలకు వడి
నమస్సు లొనరుప వా రతని బ్రీతి ఽ క్రమత నంకముల గౌగిలుల జేర్చి
శిరమును మూర్కొని చుబుకంబు పుడికి ఽ పరమానందమునను బాష్పధార
లరయ కపోలములను జార దడిపి ఽ వర కుశలమ్ముల బ్రశ్నించి రెలమి
గని యన్నా! నీవును గృష్ణుండును ఽ ఘనులు భద్రముల నొలి గందురే!
మము బోచు భారమును మీ దెసయే ఽ క్రమమటులె గూర్చ వలయు రక్షణము
విమలమతులు వసుదేవుడు దేవకి ఽ సహ కుశలములను గన్నారె! మమ్ము
దలపుంతురె! మిము మేము పాలింపు ఽ టల నెడ రుంతురె! మీ రక్లేగద!
ననుచు దివ్యాన్నముల పాల్బెరుగుల ఽ దినుమన్న యనుచు నిష్టాగోష్ఠిని
గని యుండినంత గోపాలవరులు ఽ గనవచ్చి హలధరునకును మ్రొక్కిరి
ఘనత వారి నందించి తా జెలంగు ఽ గని తా నములను గవిసి చేతులను
పెనవేసి మెడల, తనువుల మోదము ఽ ననువొందు నవ్వులను మీరియుండి
వారి భుజింపగ బంపి సుందరము ఽ జేరినట్టి యొక విజన తలంబున
ధీరతను కైలాసగిరివదువు ఽ మీద గూర్చున్నయెడ నచ్చోటికి
చారుశృంగారవతు లాగోపిక ఽ నారు లందెలను ఘల్లని మ్రోయగ
దారు నొయ్యారముల కర కంకణ ఽ చారుతర ధ్వని మేళనము గనగ
విరుల ముత్తెముల సరులు చిందాడ ఽ కురుల ముడులు తూగాడ పాలిండ్లు
నడుమున ననియాడుటను గూర్చుముఖము ఽ లెడ లేని హసితమును గూర్చ వడిని
తడబా టందని మతి తడబడగా ఽ నిడుదలు నడలుగ దడబడలను దా
లాంకుని పంకేరుహాభవనుత శ్రీ ఽ లాంకుని రాక్షస భీమ నామాంకు
సంకర్షణు నకలంకు సాధు ప ఽ క్షాంకు నంచితపు వాత్సల్యాంకుని
బలయుతుని శౌర్యవార్ధిని భద్రుని ఽ విలసిత పటీర తుషార రుచినిక
లలిత మించుతను వొప్పు సుగుణముల ఽ నలరున నిలుపగ నమరు విజ్ఞాన
నిలయుని నశోక రిపు మారకునిక ఽ దలప మహాత్ముని శ్రీను సత్కళను
లలన లటు వచ్చి కని మ్రొక్కి నిలిచి ఽ లలి దోప నేమ మడిగి యిట్లనిరి
హలపాణీ! నీ యనుంగుతమ్ముడు ఽ విలసితవ క్త్రనుడును గోపాలుం
డల బలజగర్భ నుతి నలరుమేటి ఽ చెలులకు మనోభిరాము డగువాడు
వల మధురాపురి నవ లలిత లతాం ఽ గుల కనక గాత్రులను విహరించు నొక్కొ!
దలచునొకొ! మమ్ము నొకపరియేనియు ఽ నలరు మిక్కుటము వారందీయగ
దలఫనేల! మమ్ముల నాటిప్రియము ఽ వలపు నించినను జాలు మాకు. గద

జననీజనకుల ననుజుల తనుజుల | విను పతిబంధువులను మిత్రతతుల
వనజనయను రతి నే మాసించియు | తన పొంత జేరునది తలపుంచునె?
మము యమునలోని సైకత తలముల | శమము జేకూర్చి కామతంత్రముల
విమల బృందావనపు వీధులందు | మము చుబుకంబుల బుడికి మరి బుజ్జ
వము గూర్చి వనుల పుష్పవాటికల | సమమతి స్తనముల ముట్టియును నాద
రము జొనిపి నింక కొలకుల పొంతను | నమస్కృతుల గొని కౌగిలి నదిమెను
బలికె మనోహర ముట్టిలు నట్టుల | పలువిధముల మము మనము లాగికొని
లలి నభిమానము గాఢపు వలపును | చలమున గొనియెను ధీరతను లాగి
కొని మధురాపురిజేరె నమ్మించి | విను మాపురి ముగ్ధంపు బాలికలు
తన చిత్రపు వన్నెల లోగి రొక్కొ! | మును మాకు గూర్చినవి దెలియరుగా
నగవు లేమాయె నర్మము లేగతి | జిగి చూపు లెట్లు? బిగువు సఖ్య? మెటు
వగ లేతోవలు? రతు లెటు బారెనో? | తగవు వినయంబు చుట్టరికంబును
సగటున నాడిన సరసోక్తు లన్ని | యుగడు పరచి మ మ్మన్నిట దప్పగ
జగతి ననంగు శరాగ్ని బొల్పడగ | జగదవనుం డా పురిని వసింపగ
గనె తాపవృద్ధి మము గన రాడా? | వనమాలి మమ్ముగూర్చిన పలుకుల
వినుపింపు మున్న! వెన్నునిచేష్టల | కనుల గట్టినటు మునినుతు డెదురనె
నిలిచి నటు దలతు మే మని శోకము | వలగొని బలికిన వనజ నయనులకు
జలధర దేహుని ఖలసంహారణము | లలతి కార్యముల చాళ్ళ నెఱిగించి
మిము గాంచు నతడు తనను జింతించు | సుమనసులకు సము లైన మిమ్ములకా
నములు డచ్యుతుడు మరవ డెన్నడును | భ్రమ లుడిపి నాడె విమలమతి నెలమి
గొనుడని లాలన నిచ్చెను కృష్ణుడు | అనుకూల వాక్యముల నిట్లుచెప్పె
ఘనముదం బొప్ప బలరాముం డిటు | వనితల నిండ్లకు బంపి వసంతం
బనువంద రెండుమాసంబు లచట | తనకుతుకం బట సెల్లింపంగా
నిలిచెను యమునాతటమున దిరుగుచు | బలభద్రుడు తా నరిభటరుద్రుడు
తలపునను భద్రముల గూర్చునట్టి | జలదవర్ణు తేజితుడు ననంతుడు
ఘన సార దేవదారు జంబీర | ఘనతర రుచిమాకంద ఖర్జూర
వనవాటికలను ఏలాల తీవ | లును మల్లె మాలతీ వల్లి కాదు
లను బెంపు నింపు పొదరిండ్లకడను | మనము హాయిగను యమునాతరంగ
జలబిందుసహిత పవనంబు సోకు | నలరునించుసైకతపు నెలవులను
నల మరందపానమున మదభృంగ | ములు రంజిలు నెలవులను రొదనించు
తలముల పొంతను సానుదేశముల | చలువ పెంపొందు శశికాంత శిలా

తలముల లీలను నిచ్ఛావిహార § ముల గోపకాంతలును గొల్వనుండ
వరుణుని యాజ్ఞను వారుణీదేవి § తరు కోటరముల మధ్యభావమున
నిరవొంద నిలిచి నిర్గమింప పంద § పరమందువాసనల నించె వనము
నల్లెడల రుచిని వెలయ బర్వంగ § చల్లనిగాడ్పుల రాము డాఘ్రాణ
సల్లలితాకృతి నందంగ దాని § వల్లగొని గ్రోలె వల్లవీతరుణుల
లుల్లములను విలసిల్ల గ్రోలిరా § ఎల్లరు ముదముల కొల్లల నందిరి
పెల్లుగ చిందుల ఘలు ఘల్లందెల § మ్రల్లడి రవముల పల్లవముల చా
ళ్లందెను కరముల కంకణధ్వనుల § నందమింప తాళముల దట్టుచును
సుందరమొప్పగ నందరు రాముని § ముందుగొని. యాటలందిరి బాటల
తనచెయిదాంకిత గీతంబుల నా § వనరుహనేత్రలు వర్ణింప వినుచు
కనుల కాదంబరిని గ్రోలుటచే § తను నారుచి వాలారు దృష్టి గన
వనపుష్పమాలికోరస్థలుడై § యనుపమ కుండల గండభాగద్యుతి
వరరత్నకాంతి ప్రతిబింబ మంద § సరసిజముబోలు తనవదనమందు
దరముగామించు బిందువులతీవి § వరుస ఘర్మసలిల బిందువులుగా
బలవిసుతుడు శ్రీ యనంతభోగియు § జలకేళిసలుప నిచ్ఛగించియును
అల నది నిటు రా నే నాడవలయు § పిలుపులోన నా చరణముల దార
వలయు నో జమున! రావ నీ నీటు § తలము గీటు దప్పింతు నని నవ్వ
కలనను బిలిచిన తరుణులు నవ్వుచు § తలకెక్క మత్తు యమునా రా యన
నను దరియ నొక్కయని గేలిసేయ § విని కాళిందియు నతని మదయుతుని
గను దలచి రాక దడసిన గినిసియు § మనమున నది రేగింప హలమ్మును
తనకరమున గొని చాచి నది తన్ను § మునుమున్న బార లాగ నా యమున
బీరమున గిరపడి భీకరమున § వారిని జూచిన కాళింది భీతి
దార సుందరి వేసము నందియు § జేరవచ్చె విస్త్రారకానుకల
రాముని చరణములని మ్రొక్కనిక్క § నామహానీయుని వినుతి నిటు గూర్చె
రామ ! రామ ! నీయత్నము మానుము § కామినిని మూఢతను గూరిసంత
తమానక్రోధమును బూనదగునె ! § నేను విరుద్ధముగా రాదలపుమా
భీమమును విడిచి సామము వహించి § కామిత మందుము భూమిని యశంబు
నిను బొందు ననుచు వినయమున నతని § ఘనత నందింప గనెను శాంతంబు
వనితలను గూడి వన విహారశ్రమ § ననువున వన కేళిని బాసి యంత
కరి కరణాగేళి దలముల నెడలి § వరవస్త్రరత్న హారభూషణము
లరసి కాళింది నొసఁ దరియించి § కరము మోదమున మరియు నాసుచే

తరుణం బందిన కాంచనమాలను § పరమప్రీతి కంఠమున గీలించి
హాలధరు డవిరళగతి దీప్తి నంద § నలరున సుమనస్సంఘములు విరుల
బలునిపై గురిసి యలరున నాడిరి § విలసిత గీతములను నప్సరసలు
ఘనత గంధర్వు లాతని బాడిరి § మునులు సానందమున గూడి రపుడు
జనవర ! యమునానది నిప్పటికిని § గననగు నా నది పజెయల చిహ్నము
దనకీర్తి ధరణి తిరమంద నదియు § వనజాక్షు నన్నయగు రామమూర్తి
యనిశము స్మరణను గూర్చు శుభంబుల § కునికిపట్టచటు వినుతిని గూర్చిన
నీలాంబరుండు వ్రేపల్లెయందు § నీల విహారమునంది వారు
పాలింప నుండు మని ప్రీతిగోరు § చాలున నుండెను యశోద యలరగ
మేలు మెచ్చి యల వారివిజ్ఞాన § లోలమతులుగా బోధ నందించు
చుండె నట ద్వారకను మాధవుడు § నిండు కొలువుండె తనబంధుజనులు

-: శ్రీకృష్ణుండు పౌండ్రికవాసుదేవునిమీద దండెత్తిపోయి వానిం జంపుట :-

నండగని మోదమున నొప్పారగ § దండినుతుల జనపాలబృందములు
నిండు భక్తి నతు లర్పించుచుండ § చండవేగమువ దూత యొక్కండు
గండు మిగుల తనరాక నెఱిగించె § యొండుమతి గనక మ్రొక్కి యిటులనె
వినుము నీలగాత్రుడ ! కంసదమన ! § నను కరూశపతి పంపినదూతగ
మనమున నెన్నుము మారాజు మాట § లను విను మాతడు జంకక సెప్పుమనె
నిను వినుపింతును కినుక నటు నుంచి § గొనదగు నెల్లను నిను మేలందును
ఘను డతం డగును పౌండ్రికనాముడు § దనువాసుదేవనామ నిరూఢత
గని యున్నవాడు రాయబారంబు § నను గూర్చెను బలికెదను హెచ్చరిక
గొల్లడవు నీవు కల్లరివౌదువు ! § వల్లను యుక్తుల జల్లంది నావు
ఇల్లు జలధిలో నల్లనదొంగవు § జెల్లవు శూరత పిల్లతనము యిది
వాసుదేవుడను నేన నీవిట్లు § వేస మందితివి-నాపేరు చిన్నె
లాసించి వీసమేనియు లజ్జను § వాసిగా గొనవు మోసపు తీవ్రత
రోసము నందవు ఛీ ఛీ వదలుము ! § వాసుదేవ ! నామము నీకు దగదు
ఈ సమయమందె నను మ్రొక్కరమ్ము § దోసిలి యొగ్గుము రక్షింతు నిన్ను
ఈ సందును నీ వొప్పకున్నయెడ § మీసము దీడితి నిను ద్రుంతు ననుచు
వాసవాదులను దోడు బిల్చుకొని § రా సమరమునకు వేగము నందును
నని సెప్పు మనియె యుత్తరమేదో ! § విని మారాజు దెలియ నీవాక్కుల
వినకేతు ననగ పద్మాక్షు డలరు § నతు డిందువదక నాతని గనుచును

తనవారి కనిమె కినియకుడు వీని § దనప్రభునానతి నాడె మనకేమి?
యని వాని జూచి యోరీ! నీప్రభు § గని చెప్పు వత్తు ననిలో నాచిహ్న
ముల నొప్పింతును వాని ప్రాణముల § యల దండధరునిపాల నొప్పింతు
తలగక సేనల జతపఱచుకొమ్ము § వల దాలస్యము ముందు వేగుగను
నిలువవల దిచట వేగము గొనుమని § వలువ లొసగి వానిని బంపి యవల
జలజాక్షుడు తనవారి యానతిని § వఁచి పెద్దలకు మ్రొక్కి దీవెనల
గొని పయనంబయి దారకుండు వడి § గని తెచ్చినట్టి రథంబు నెక్కెను
వనజాక్షుడు విశ్వేశుడు దానై § ఘనత విశ్వేశ సంస్మరణ జయము
తనవారు బల్క వేగము నందెను § తన రథగమనపు ధ్వని వనధిమ్రోత
జనతతికి దోప నఱిగి కనిమె నా § ఘనుడు మాధవుడు కాశీపురంబు
విను శంభు డందు వెలసి యుండునది § కనక చేలుండు పురిని వెలి నిలిచి
తనరాక దెలిపె పాంచజన్యమున § విని పౌండ్రుం డది యుద్ధోత్సాహత
తను సేనల రెం డక్షౌహిణులను § ఘనత తనమిత్రుడగు కాశీపతి
యును మూ డక్షౌహిణుల సేనలను § తనుగూడిరాగ దోడ్కొనుచు
పురము వెడలి మురవైరిని దాకగ § నురుతరక్రోధము మదంబు పేర్మిని
కరము కృత్రిమములై నట్టి వైన § కరముల శంఖము చక్రము శార్ఙ్గము
తరమందిన గద కౌస్తుభమణియును § కరకుండలములు హారచయంబులు
కర కంకణ మంజీర వనమాల § లరయ కనకగ్రైవేయ కేయూర
వర మకుటంబుల దాల్చియు నటు పీ § తాంబరంబు గట్టిన ఛాయ దనర
గరుడకేతనము గల హేమరథము § ధరణిపాల యివి యన్ని వంచనమె!
ఇటు రా వాసిని యదువల్లభుండు § కుటిల హంతకుడు కృష్ణుండు గాంచి
చిటిమిటి వానికి దోపగ నవ్వెన § పటిమ కటువు జూపించి నస్త్రముల
పరిఘ, ముసల, కుంతల చక్ర గదల § పరశు భిండివాలముల శక్తులను
బిర బిర గ్రుమ్మెను తననేర్పు జూచి § హరి తనదు బిరుదు వదలుకొను నంచు
హరి యఱిగి వాని శస్త్రపరంపర § శరవేగంబును తన తీవ్రమయిన
శరవృష్టి నడచి యరిభీషణంబు § కర మత్యుత్కట రవము నిండించు
పరమపూజ్యంబు పాంచజన్యంబు § పరు లార్వగ పూరించె హర్షమున
వారని యలుకను యా వాహినులను § మారి మసంగిన యట్లు బాణముల
బోరు ధారలను బోలె పఱగించి § బీర మడగ ఖండించె కరి తురగ
వీర వ్రాత రథ రథసారథులను § నా రణస్థలము పీన్గుల పెంటలు
గా నొక్కుమ్మడి పై రాగ జేసి § తా నడ్డు జమ్మ పౌండ్రునిఁ డాసి

యో నరాధమా ! కుటిలమదాంధా ! ఽ గానవచ్చి తిరి వేన పరుగిడక
నే నిత్తు గొనుము నా వీరబిరుదు ఽ దాన వారివీవాదు వయ్యెదవు !
నీచత గూసిన నీ విదే చావ ఽ నోచి తింకెందు పోవచ్చు నీకు ?
కాచెద భారము బ్రతుక దలచితివ ? ఽ నీచుడా ! జక్కనగుము శిరమి దే
నీకు నే శరణ మీవలెగాదా ! ఽ పోకిరివి నిన్ను నిటు శరణు గూర్తు
పోకడ లివె ! నీ జీవముల గొనగ ఽ నాకు రాక గూర్చితివి మెచ్చితిని
ననుచు చక్రమును చేత గొని మున్నె ఽ కనక రథము పొడిజేసి సారథిని
దునిమి గుఱ్ఱముల దుంచి వే బంపె ఽ ఘనుడు సుదర్శనమున వాని మొండె
మును తలను వేరుపరుప నాజ్ఞ నిడె ఽ ఘనత నదియు విలయాగ్ని కైవడిని
వెలుగు నింపుచును వేగమ పౌండ్రుని ఽ తలను ఖండించ వజ్రధారచే
కులపర్వతంబు గూలుచందమున ఽ నిలబడె రెండుగ శిఖరము గిరి వలె
జలజనాభు డంతటను వేగంబ ఽ తల నట్లు దునిమె మొండె మచ్చటనె
ననిలోన బడియె శిరము విశిఖముల ఽ జనిపెను పురమున భువనమున బడగ
ఘను డాదిమూర్తి కృష్ణుం డప్పుడు ఽ తనశంఖము పూరించి విజయమున
సురలు పూజింప ద్వారకను జేరి ఽ పరితోషంబును తనవారి గూర్చి
నిరవందు సౌఖ్యముల దూగుచుండె ఽ కరము దుష్ట మర్దనుడు తా నగుచు
నరనాథ ! పౌండ్రు డిటు వాసుదేవ ఽ పరకృత్రిమచిహ్నముల మదము గొనియు
హరి నెదిరించియు ననవరత స్మరణ ఽ కపము నందె నటు శ్రీశుని వలనను
శిరము దునుమబడి రణమున ధీరత ఽ హరి జెందవచ్చు నెటుల స్మరించిన
వారణాశిలో కాశీప్రభుతల ఽ నారాచమ్ముల కృష్ణుం డట్టుల
పారమంది బడవేయ గుర్తించి ఽ పౌరు లెరిగింప నతనిఁ జుట్టుక
నారులు బంధులు హితపరివారము ఽ కూరిమి సుతుండు సుదక్షిణుండును
మీరిన శోకము, నంది బావురున ఽ దారి శమించియు పరలోకవిధుల
సారతరంబుగ నుతి నొనర విధిని ఽ భూరి దానముల నెరవేర్చి యంత
యాదవుం డొకడు మాతండ్రి జంపె ఽ మేదిని నేను తద్వంశంబును
బూది గూర్తునని యత్నపటుత్వాత ఽ యా దండి దండియైన రుద్రుడు
సాదరంబునను వరమిచ్చు నంచు ఽ బాదుకొన్నమతి పౌరోహితునిఁ
ఏకాంతంబున దిగంబరేశుని ఽ సాకారమంద తనకు వర మొసగ
నేకమతిని హరు చరణ కమలములె ఽ నాకరం బనుచు యత్నసిద్ధికై
ధ్యానమందగా పార్వతీరమణుడు ఽ ఆనందధాము డబ్జాక్షహితుడు
కేనోపనిషత్ వాచకమూర్తియు ఽ నైన శంకరుడు ప్రత్యక్షముగా

సంబికాపతే! అఘోరమూర్తీ! § శంబరారి! హర! శత్రువిధ్వంస!
డంబధ్వంసా! దక్ష మదహరణ! § శంభో! ముండాలాసురమర్దన!
వర మాయగదే! పురహర! యభవా! § దురమున కృష్ణుని గెలువవలె నేను
యని వినుతించిన హరుడు ప్రసన్నత § విను మతడు విష్ణుడిపుడు దుష్టులను
దునుమగ బుట్టెను దుర్లభ మాతని § యనిలో నిలువున బ్రతికిపోరాదు
నిను జయమందదు వినవ నభిచార § మొనరింపుము నిర్మత్సరమున నన
లుడు దరమందిన గెలుపు నిన్నమరు § దుడుకున మత్సరమున బూజించిన
బెడుపు నీక యగు నీ బుద్ధికైన § వడుపున బొమ్మన యుగ్రము మానక
జడియక మూఢత దారి యనలునిగ § దడ దడ మ్రొక్కుచు దక్షిణశిఖలను
వ్రేలిచి సంతన తామ్రశ్మశ్రువుల § గ్రాలుచు నుజ్జ్వలముల జేవురించు
డాలందు ముఖం బళనిప్రభ యనగ § బోలు దంష్ట్రలను శూలమ్మున నా
భీలము నింపుచు నొక కృత్య వెడలి § కాలమృత్యు కరవాలము నా యన
నాలుక జాపుచు కోలాహలంబు § వాలాయ మంద నార్చుచు బదహతి
నోలి ధూళి మ్రింగుచందమున § కాలాంతజ్వాల లను నుమియుచును
నీలదేహమున ప్రార్థన వినుచును § నీలవర్ణు నగరమున కుద్వేల
వేగమునను రా పురజను లది గని § డాగ తెరు వేది దిశ లన్నింటను
భూ గగనంబుల నేకముగ మంట § లాగని వడి మనపురము జుట్టంగ
రాగంటి మంచు గోవిందుని గన § వేగము గొంచును జేరి నగధరా!
ఆ గడిదిమంటలను గంటివిగా § భోగిశయన! మము గవయకుండంగ
యోగమును గనుము మా బాగు గూర్చు § ఈ గండము దప్పింపు మనంగ న
యా గజేంద్ర వరదాత యచ్యుతుడు § తా గమనించెను దానిమూలంబు
రోడకు డభయము మీకుం గూర్తును § నేడె నిమిషమున నద్దాని దాడి
బీడు వుత్తు నది సుదర్శనుండను § వాడు వైరమున వ్రేల్చిన కృత్యము
నా నిజము తెల్పి తాను శీఘ్రమున § ధ్యానమున గూరి నిర్మత్సరమున
మానిత శుచిగ్రాపై మాననీయముగ § తా నయము నెఱిగి తన సుదర్శనము
చే నంది విసరె నా కృత్యపైన § దా నా హరిచే పంపును గొనుచును
భీమమున మీరె దాని కన్నరిపు § స్తోమము జెండెడు నా చక్రము వడి
భూమి దుష్ట సంహారత తనపని § గా మహిమ నందు మేటి శస్త్రమది
చండమున విజితమార్తాండము నా § దండి తేజమున బ్రహ్మాండంబును
నిండ వెలుగు గను గండున రివ్వున § దండధరు దండమున బొల్పుమిగుల
దేవగణ వినుతి నుజనశరణ్యము § పావనపాలిత రంజిత శక్తికి

శావలంబగుచు తా కళ నిగుడుచు । కేవల సాత్త్విక భూషణత గాంచి
నిగమ వినుతిగను యోగ్యతను మించి । జగదవనార్థము శ్రీశుడు ధరింప
జిగి నందమించు దనుజధ్వంసము । తగవున గుణంబు దనయం దొప్పగ
కీలిమించు నీదాని కీల లన । జ్వాల లడుపు నాభీలత నిది యన
జాలు లోకతాపముల తపింపగ । కీలుమూర్తి హరి మేలు బారినది
నా దాని డాసి విలయమేఘంబు । బాదరించు గతిఘుర్జ లాదిగా
యాదవేంద్రు డుత్సాహము నందగ । చోదకమున నాకృత్యను హరించె
నది ప్రత్యర్థుల శాంతమును బొంది । గదిసి వెనువెంట చక్రి మరుదేర
పదిలతను జెడగ మొదటినెలవు గని । సుదక్షిణుడు మది భీతి గుదురుకొన
వతనిని మరి యా ఋత్విగ్జనముల । నదయత వధించి తా శాంతినందె
సుదర్శనం బాపురమును గాలిచి । ముదము తోప శ్రీకృష్ణుని జేరెను
అది రా శ్రీహరి మనల దయ జూచి । బ్రిదికించె ననుచు నుతించి రచ్యుతు
విదితయశము తను జేర మాధవుడు । నద నం దించెను ద్వారకను సుఖము
ముచికుందువరదు విజయ రుచినందు । సుచరితం బిదియు నచలితభక్తిని
రుచిగొన్న సుధను బోలి పఠించిన । వచియించి వ్రాసినను నిహపరముల
నిచయంబులైన ముక్తికళలచే । నచిరంబుగాని సుఖతరములందు
నరుడు సిద్ధమని నమ్మి నుతింపుము । హరియె జగతీశుడు శక్తియుతుడు
నిరవధిక మోక్షనిలయు డానంద । పరముడు రమాధిపతి భజనీయుడు
నరవర ! మనము శుద్ధమునుగూర్చి । శరణ మతని నన జయము తా నిచ్చు
నన విని జననాథుడు బలరాముని । ఘనవిజయ మింక విన బలుకు మయ్య
యన మౌని యిట్లు బలికె కుతుకమున । అనఘ ! విను మటుల హలధరుడుముదము
ననువంది యుండె రైవతప్రాంతము । నను ద్వివిదుండను వానరుని దునిమె

—: బలరాముండు ద్వివిదుడను వానరుని సంహరించుట :—

నరనాథా ! సుగ్రీవుని సచివుడు । నరకాసురు సఖ్యతను గాంచియును
ధర విహరించును హరి వాని దునుమ । కరము ద్వేషించి కృష్ణునిపురంబు
నను ప్రవేశించి యాతని పాలిత । మున దిరియుచు కోటలను గూల్చి
గన ప్రాకారాదుల నాకి పరిఘ । లను మాయించియు వగడతల బూన్చి
వరుస వన సరస్సులను గలంచుచు । తరము జెరిచి గోపురముల నట్టుల
నరసి సుందరము నొప్పు భవనముల । పరువడిని పడగ ద్రొబ్బుచు మందల
కొండలము నింపె నదిగాక జనుల । నెందరినో కొండగుహాలను దాపుచు

తొందరలను గూర్చె మాధవుపై నా ఽ మందుడు మైందుని తమ్ముడు తనకగు
ముందుపాటు నెఱుగండు మదంబునె ఽ డెందమందు నిలయంబు గనినటుల
పల్లెల కొల్లల గొని ఫలంబులను ఽ దుల్లించు తరుల సాధుల నదల్చి
వల్లగని నీటముంచు పడుచులను ఽ తల్లడము పెల్లురకను బాధ లిడెను
ఇటు లా వానరవరుడు చాల్దప్పి ఽ కుటిలుండై తా నటమటించుచును
కటికవృత్తి దిరుగాడుచు రైవత ఽ తటమున నొక గిరికందరంబునను
చతుర మృదు గీత రవములను దా విని ఽ మతి వెగటు దోప గదియగ వచ్చియు
సతులను నెత్తములాడు వానిబల ఽ మతిశయమున ధావళ్యమగు తనువు
నుతి నొప్పువాని నీలాంబరునిఁ ఽ యతి వినుతుడైన కృష్ణాగ్రజునిఁ
అతుల మణి కాంచనపు సొమ్ముల భూ ఽ షితుడైనవాని వారుణీమత్తున
గతి గొన్న దృష్టి ప్రసరించువాని ఽ క్షితిపుల నరాతులను దుష్టమతుల
బ్రతుకుల మలపెడు వాని బలరాము ఽ సతతాభిరాము సౌందర్యధాము
గని తత్సమీప భూరుహశాఖ ఽ మునుకొన్న మదము పెంపున నొక్కియు
వనచరుడు పట్టి యూపుచు పత్రము ఽ లను రాల్చుచునుఁ వెక్కిరించుచును
గికిరించుచు పండ్లిగిల్చి చూపుచు ఽ వికటమతి గుఱ్ఱు గఱ్ఱని యా కొ
మ్మకు నీకొమ్మకు బారుచు నెగురుచు ఽ తితమకల గూడు ధీరతను నిలుచు
తోకను గదల్చి మేను నలివెట్టు ఽ పీక నాలుకను జూపును బరులను
గోకుచు గాయుల పండుల గొఱుకుచు ఽ తా కడిమిని గొని యట నుమియుచు
వెను దిరిగి చూపు గన నసహ్యముగా ఽ గనుల నిక్కించు మీద బడునట్లు
తన గోళ్ళ గరచి ధూయని తొలంగు ఽ కొనల విడిచి నెదజల్లు నెయ్యెడల
కని దాని చేష్ట నొక చిన్నరాత ఽ వనచరముపైన విసరె బారునని
కినుక రేగి తను విసరుట నవ్వును ఽ గని రాముని యాసవ కలశంబును
గొని చెట్టునెక్కి భూమి జారవిడి ఽ చిన వ్రయ్యలయ్యె నాఘటం బతడు
కోప మగ్గలము గా నొక్కరాత ఽ నా పగిది నైవ రాముని పై బడి
యేపున చీరను జింపి బరికినను ఽ ఆపలేని క్రోధమున ముసలమును
చేపట్టి కాలు భంగిని నిల్చిన ఽ నా పట్టుగాంచి వానరు డదరక
చూపరుల భయము నింపుచును నా స ఽ మీపమున నున్న నొకచెట్టు శాఖిక
తన భుజముపైన నిడి మత్సరమున ఽ ఘనుని బలభద్రు శిరమున బాదిన
పదతాడితమగు కాలభుజంగము ఽ వదనమున సదయను దూరం బెంచుచు
ఇదివరలో ద్వద్దాని దుండగము ఽ లదురుగొన్న వార్తలను వినియుండె
గాన తా గవలి ముసలమును ద్రిప్పి ఽ వానికంఠమున నూటిని మొత్తిన

వాడు జేగురను గలకొండవడుపు ƒ పోడిమి నుండియు కో యని యార్చియు
బీడందె ప్రజ్ఞ నంతలో దేరి ƒ వాడి మిగులు రోషమున నట గుప్పు
కొనిన తరువులను వడి వడి చెరుకుచు ƒ తన బలము జూపి రాముని మోదుచు
ఘనమైన క్రేక నిడిన నబ్బురత ƒ గని ప్లవగాధమ ! చావుమని వాని
తరుల జెండి హాలమున గొట్టి నంత ƒ ధరణీధరశిఖరమువంటి తరువుఁ
ద్వర పెంపున బలభద్రుని వైచియు ƒ కరము సరి దోప బోరున డీకొను
టయు మెచ్చి వాని విసరుట దప్పియు ƒ రయమున వానిని బారు తొలంగని
భయమున గూర్పగ వాడు చలింపక ƒ చయ్యన తాలాంకు పైనం దూకిన
అరరే ! ప్లవగాధమ ! యని హుమ్మని ƒ వర ముసలమ్మును హాలమును గొని వడి
కరికరి హరిహరి గిరిగిరిని దాకి ƒ గురువడి బెబ్బులులను చాలు దోప
గవిసి పిడుగులను పిడికెటి పోటుల ƒ చెవులవదనముల శిరముల భుజముల
నవయ బాడువంగ రాముడు భీమము ƒ దవులు నిక్కగని వాని మెదడు చి
ల్లుగ పొడిచినంత రక్తము నుమియుచు ƒ పేగులును ధరణి బడి వాడు మ్రగ్గ
నగభేది యలరి సుర సముదయమును ƒ దగు గూడి కుసుమవృష్టి గురియించి
జగతి జయము నిండంగ భేర్యాది ƒ జిగినందు ధ్వనుల మెచ్చ బరగించె
ఇటు బలభద్రుం డచ్యుతాగ్రజుడు ƒ కుటిల వానరుని ద్వివిదు ధరణికిని
బటు వొప్పగ బలియిచ్చి ద్వారకను ƒ తటుకున వచ్చెను గృష్ణుని పిలువున
తటమందిరి యాదవు లాతని ము ƒ చ్చటలెల్ల సెప్ప హర్షము పొ మింగుల
పటుతర హాసము లనువొందంగా ƒ నటు సుఖ మందిరి యాదవు లధిపా !

-: బలరాముండు హస్తినాపురమును గంగలోఁ ద్రోయఁ బూనుట :-

విను మిక సుయోధనుని కూతురైన ƒ వినయనయ సుగుణలక్షణ లక్షణ
యనుదాని వివాహమున శ్రీకృష్ణ ƒ తనయుడైన సాంబుం డా కన్యను
దన సాహసమున నెత్తుకపోగా ƒ ఘనులు కౌరవులు నాతని మెచ్చక
పినవాడొకండు మనబాలిక గొని ƒ చినతనము గూర్చి మదమున నేగెడు
వెనుకొని వానిని బట్టి చెర బెట్టి ƒ నను యాదవు లెటు చెలగెద రంచును
సమరాటోపత కర్ణ శల్యులును ƒ క్రమమున భూరిశ్రవ యజ్ఞకేతు
లమితో త్సాహములను మించం గన ƒ సమబలుండు దుర్యోధనుండును
వడిని బలంబుల కూడ ముట్టియును ƒ బుడుతడ నీ దుడు కడతుము నిలునిలు
జడుపుగొనక మా బిడ్డ నెత్తుకొని ƒ పెడమతిని బోవ పోనిత్తుమ యని
దడదడలు బాణతతులు పై బఱపి ƒ చెడిమూడి గూర్చిన సాంబు డిట్లనిరొ

మిము పెద్దవారి నవమానంబున ఽ శ్రిమపెట్టనోప మరలిబొమ్మన్న
అమితరోషమున నందరేకముగ ఽ గుములుగ శస్త్రాస్త్రముల మరి బరప
ధనువు సజ్యమున గూర్చి సాంబుండు ఽ ఘనబాణతతుల వాని నన్నిటిని
తునక లొనరించి వాని శరవృష్టి ఽ ననువొంద ముంచి రథ రథ్యసూతు
లను పతాక ధ్వజమాలను ఛత్రముల ఽ దునిమి తనువులను తూట్లు వడ గొట్టి
తనక్రూరమైన శస్త్రాస్త్రములను ఽ మునుకొన్న రక్తధారల దడిపియు
రొనరు గన కుసుమితపు కింశుకములు ఽ కన నంగంబులు దోప నిలిచినను
వనజ నయను దనయుండు శంఖమును ఽ ఘనత పూరించె దివిజు లుప్పొంగ
మనముల గుందుచు కని రా శూరుని ఽ కినుక మరి రేగ యంద రొక్క మొగి
పురికొలుపు కొనుచు బీరముల వలికి ఽ శరపరంపరల నద్రిపై గురియు
వర వారిధార లను వడుపు బెంచి ఽ కరము నలుక శౌర్యములు దీపింప
కరిని వనమక్షికములు జుట్టినట్టు ఽ తరమంది జుట్టి వన లతలనె దా
నిని బంధించిన వారిపై తెగువ ఽ గొనక తా జిక్కె నేమా ననుచును
ఘనత చా ల్నిగుడ నతని బంధించి ఽ వనితతో గూడ పురమున జేర్చిరి
మునినారదుండు వనజనయనునికి ఽ ననిని సాంబువిక్రమము తలంపుచు
విన జెప్పినంత వేగం బరసియు ఽ జనపతియగు నుగ్రసేను ననుమతి
యదుబలంబు లా యదనున ననికిని ఽ ముదమునను యత్నమును సాగించగ
నది నీతిగాదు మనబంధువులను ఽ గదియ జనునె క్రోధమున రణమునకు
ఇది నే నేగద సాంబువధుయుతము ఽ ముదమున దెత్తును మీరు మానుడని
అపుడె కనకంపు రథమునెక్కియును ఽ విపుల సుగుణ సంపన్నుల విప్రుల
కృప ధర్మాభిజ్ఞాని యుద్ధవుని ఽ సుపరిపాటియగు కొందరు పెద్దలు
తన తో డందుచు వెస ప్రయాణమున ఽ దనెను కరిపురము దానిసమీపము
నను నొకదివ్యంబయిన యుద్యాన ఽ మున విశ్రమంబుగొని సురభి, కుసుమ,
ఫల, భరిత తరు చ్ఛాయారచితము ఽ నలరు నించు శశికాంత వేదికను
నలత దీర తా నుండి యుద్ధవుని ఽ యల కౌరవులకు నారాక సెప్పి
ఘనత సెరిగి రా వలయునన్న యని ఽ మనమున శంకిలి గొనని మతి నేగి
కనె వారి సభామందిరమునను ఽ ధనురాచార్యుని భీష్ము సుయోధను
లకు [ మొక్కి యర్ఘ్య పూజ తా నంది ఽ వినయపరత విలసిల్ల నిట్లనియె
యనఘులార ! యదు తిలకుడు రాముడు ఽ ఘనుడు కరుణాబ్ధి బలధనుడు మిమ్ము
అతని గాంచుటకు కాన్కలు గొనుచును ఽ యతివేగంబున గొని జేరి యర్చ
లతి శ్రద్ధనొసగి గోవు నర్పించి ఽ మతి నలర నందనాది సమయముల

సలిపిన తదుపరి నందరిని గలయ ॥ దిలకించి ప్రలంభగ్ను డిట్లనియె
నెలమి దోప కురురాజునః బిలిచియు ॥ కిలకిలలు దోపు మొగమున వినుమా!
రాజరాజ! దుర్యోధన! నయగుణ! ॥ తేజితశౌర్యా! శౌర్యధురంధర!
మోజ నీవిచ్చు సత్కృతులన్నియు ॥ రాఁగొంటి సమ్మతిని యుండ ని
మ్మనఘా! విను నా వచ్చినకార్యము ॥ జననాథు డుగ్రసేనుని పం పిది
వనజ నయనుండు నొప్పె నారాక ॥ నిను దెలుప దగిన విషయ మొక్కండు
జనపతివి పెక్కుమంది శూరులును ॥ పినవాని సాంబువలను పనిగొనుచు
యని జుట్టి నొకని తో గొంటి రైన ॥ విను మంత తప్పు మావాడు గనెన
తను న్యాయముండ తనుమధ్యను గొన ॥ కనవలదె బాంధవము మాయెడలను
ఐన దాని చింతించ పనియేమి? ॥ మాననీయుడవు మాకుమారునిక్
మాననీయుతము మన్నించిపంపు ॥ మా నయంబెఱిగి గౌరవము గనుము
దీని ప్రతిఘటింపకు మని పెద్దగా ॥ నూనిన మతి దీవించె ని న్నన్న
యనిన నాత్మకోపమున పాదుకలు ॥ ఘనతగాంచ శిరమున నిక్కగోరె
నని యతని గనక తనవారిగాంచి ॥ వినుడు కాలగతి యదువులు మదంబు
గొనిరి తనుపంపునను మన లందఱ ॥ ననుచితమున మెలగు నాన తిది
కనరు సిగ్గు తా జనవరుం డంట ॥ మనము వారి బంధువులమట ఛీ! ఛీ!
విన రోత రోత ఏటి మాట లివి ॥ మనమందె మేలమునవె నింతకును
గనిరి ఛత్ర చామర శంఖ మకుట ॥ ఘన ధార్యమ్ముల కాదందు రెవరు?
చాలు వారి సంబంధము సఖ్యము ॥ మేలేది పాములకు పాల్వోయుట
యాలమున జుట్టి బాలు బంధింప ॥ జాలితి మట మన మెల్ల గుం పంట
లీల లగునె కరుణాదుల వశమున ॥ నోలి నున్నట్టి వాని విడిపింప
నేల యీమత్తునితో మాటలనుచు ॥ పాలంది తరలె మందిరంబునకు
హలధరుం డదరె నాపలుకులు విని ॥ నలు దిక్కులు గ్రమ్మగ బరికించుచు
విలయభాను కైవడి ప్రజ్వరిలుచు ॥ ఎల కినుక దోప వికటమున నవ్వి
చండరోషమున నరుణిత నేత్రుడు ॥ గండున దండాయుధు ననుకరించు
ఖండనమున భీముండు దానగుచు ॥ అండనున్న యాదవ వృద్ధుల గని
మండు ననలు నాజ్యంపుధారలుగ ॥ దుండగీడు నగు దుర్యోధను బ
ల్కులను వింటిరా తెలివిని గన డా ॥ పలుగాకిని మన్నింప నీవల్ల
బలికి వచ్చితిని గృష్ణుడు వినగా ॥ ఖలుడు మేలుగొను వాడె కుచ్చితుడు
వీడు మదాంధుడు గాడు సజ్జనుడు ॥ తోడు ఖలులనే పొడిమి నం దెడు
వాడి గనును నాతోడి హాల మొకడెట ॥ వీడు వీనితోడుల బ్రతుగుదురె?

బోయెడు మృగముల వేటాడువిధిని । నా యలవు బలిమి కీ ముసలముగుటే
ఈ యెడ త్రుళ్లిన నాడిపఫలంబు । ఏ యెడము లేక సుదువగల డింక
వీని నడ తెరిగి యాదవబలంబు । పూనిక ననికిని సన్నద్ధులగుట
నానేర్పుననే మానిరి గాకను । ఏ నిమిత్తమున నైన నుడుగుదురె ?
విను దేదేవుని సురలు మ్రొక్కెదురో ? । గన దేదేవుని మందిరము మోక్ష
మును గూర్చుపదమ యని మును లెంతురో ? । ఇనశశిప్రభలు యెవని కిరణములో
వనజాలయ యెవ్వనికి సతియగునో ? । వనజభవు డెవ్వనికి తనయుండో ?
నేను రుద్రుండు ప్రజాపతు లెల్ల । ఈ నిఖిల భువనముల మూల మెవండో ?
ఏ నిత్యకళల వెలసినారమో ? । నా నలిన నయను దౌ పంపుగొనుచు
ననుకూలమ్మను బొందు తపస్వియు । మన కెల్ల తాత జనపతియునైన
ఘనుని నుగ్రసేనునకు పీ డిచ్చె । ననె గదా మకుట మాది మర్యాద
లను త్రిదశవరులు తమకిరీటముల । ననువొందదాల్తు రెవని పదధూళి
గన లోకపావనియగు తీర్థంబు । ఘనత నెవని చరణమున బుట్టినదో ?
యట్టి నా నాథుడైనవిష్ణుండు । పొట్టిపొడవులకు నాధారుడయ్యె
పట్టు ముక్తి కగు శ్రీరమానాథు । కట్టడిని నుగ్రసేనుని దెగడెను
ఎట్టు దప్పెనా ? కోపమును వీడు । పట్టున గంగలో నీ పట్టణంబు
నట్టె ద్రోల్లింతు ననుచు భీకరము । దొట్టిన రూపున హలము చే బూని
వీని పరమందు ముందు చాలందు । మానముగను సంతానము నాపుదు
పూనిక గను డని నగరంపు తుదను । దాను జొనిపె తన హలము కోపమున
మొనచేతనె పురమును పా దగల్చె । గనెను వడ వూర్తి వూర్తి జెకలింప
జనులు పురంబున నడుగులు తడబడ । కనులదిరుగుడుల భవనములు నొరగె
ఘనమైన కోట గోపురము లాది । గను తూల సిద్ధముగ వనధిలోని
కలము వోలె కడు ఘోర ముప్పతిల । తలకి రందఱును నాబాలవృద్ధు
లల మొరలిడగా బలుని కృతమనుచు । దలచి భీష్మాది కౌరవసంతతి
లలి నతని వలను బొంద సాంబునిక । నలంకరించియు సతీయుక్తముగ
కురుపతి సుయోధనుండు ముందుగా । త్వర గని వచ్చిరి తాలాంకుని గన
చరణములను బడి సుతను నర్పించె । సరసత నల్లుని బలము వినుతించె
కరుణ పాలించె సంకర్షణుండు । పరమహర్షమున రాజరా జొప్పె
నన జనపాలుం డనె శుకుని గనుచు । కినుక నంత త్రుటిలోన విడిచె నటు
లన బరీక్షిత్తు జనవరా ! ఘనులు । మనమున కినుకను మ్రొక్కిన ద్రోతురు
యనఘు డచ్యుతుడు తా నగుట వారి । వినుతుల నతులను విడెచె కోపంబు

విను మా చందము పఠనీయము మన ఽ కనుచు వచించెను శుకముని యిట్టుల
ఘనుడ వసంతుడ వయ్యా ! రామా ! ఽ నిను నిజం బెరుగ జాలుదుమె మేము
నీవె భువన భరణుండవు స్వామివి ఽ కేవలమూర్తివి సంకర్షణాఖ్య
తావలం బంది వేయిఫణంబుల ఽ భావి భూతముల కాశ్రయుండ వయి
పావనమూర్తివి నిరాశ్రయుండవు ఽ దేవవినుతుడవు నీవే గావా !
రామ ! యశోధన ! భీమ ! రిపుహరణ ! ఽ కామభక్తజన బృందమోక్షపద!
మేము నీపాల క్షేమ మందవలె ఽ శ్యామాంబరాభిరామ ! శాంతమణీ !
హరి వీవ దుష్టదమనంబునకై ఽ ధరణి యవతారమందిన మూర్తివి
పరమసౌఖ్య సంతానము గూర్తువో ! ఽ వరద ! నిను శ్రద్ధ గూర్చి యర్చింప
నీకు తామసులమగు మే మచ్యుత ఽ భీకరం బంద కొంచె మెంచితిమి
యో కమనీయాంగా ! ధవళవర్ణ ! ఽ నీకు మ్రొక్కెదము శాంతింపు మింక
కొడుకు కోడ లిదె గొనుము మాకాన్క ఽ కడు గారవంబు మాయం దొప్పగ
పుడమీశుడైన యుగ్రసేనునకు ఽ నడుగుల కెరగితి మనుచు నొప్పింపు
మనుచు నల్లునకు వేయిదాసీల ఽ ఘనమైన తురగముల లక్షకరుల
నినుమడిగ నారువేల రథంబుల ఽ కనకమణిభూషణములు పెక్కులుగ
నరణము నొసంగి మఱి నతి నొసగియు ఽ కరము ప్రీతి నిండగ సాగనంపె
హరికి తనవిజయ మెల్ల వచింపగ ఽ త్వర నందె ద్వారవతిజేర బలుడు
పురము శుభముహూర్తమున దంపతుల ఽ కరము బంధుజనకృష్ణవల్లభలు
పరమప్రీతి మంగళముల ధ్వనులను ఽ ధరణీసురవర ! వనితలాదిగా
నెదురంది వారి తోడ్కొని జేర్చిరి ఽ ముదమున భవనములోన జను లలర
యదనున కృష్ణుం డాదిగ నెల్లర ఽ మది తోషమంద జెప్పె సంగతుల
భిదురపాణి వైభవపూర్ణత నా ఽ యదువుల వంశపువారు గాంచిరా
సదయు సర్వేశు కృష్ణు నుతింతురు ఽ యెదనెరిగి వచ్చె నారదమహర్షి

-: షోడశసహస్ర స్త్రీసంగతుడైన శ్రీకృష్ణుని మహిమ నారదుం డరయుట :-

కరుణజూడరా కమలదళనయన ! ఽ సరసిజసంభవ ! వరద ! మునివరద !
ధరణి దాసరక్షణబిరు దందియు ఽ చరణంబుల శరణన్న బ్రోచెదవు
నిరపాయము నీ స్మరణ భవతరణ ఽ మరయ ముక్తియదె ధారణనిలయా !
నిరయదూర ! నిశ్రేయసస్వరూపా ! ఽ నిరవగ్రహా ! నిరవధిక ! విశ్వమయ !
సురుచి సుధసమము నీ నామ మనని ఽ నరుల నిరసింప నగు నారాయణ
కేశవ ! నారాయణ ! మాధవ ! యని ఽ ఈశ ! యాచమనమంత్ర పవిత్రులు

రాశిజెరుచునది యేదన దేవా ! ౹ పాశిదండించు దురిత సంతదియు
కరిచర్మవసన వినుత ! కంసారి ! ౹ యరిహార ! పరేశ ! వసుదేవసుతా !
నరసఖ ! దశావతార ! కరివరద ! ౹ బిరబిర దర్శన మొసగు విను తిదియు
యని నారదు డీవిధిని బొగడుచును ౹ వనితల పదారు వేల పెండ్లాడె
యనిలో నరకుని దునిమి వానిపుర ౹ మున బంధితలై యున్నవారి నని
విని యది యేలాగుననో కనిమెద ౹ నని జేరవచ్చె నా ద్వారకదరి
నల యుద్యానము లన్ని కుసుమఫల ౹ ముల శుకపిక శారిక శిఖిధ్వనుల
నలరునించు వరతరుల సరస్సుల ౹ కలహంస చక్రవాక బకక్రౌంచ
ముల కమలకైరవముల కల్హార ౹ ముల శోభితములు భృంగఝుంకృతుల
కలసస్యములను నిక్షువులాదిగ ౹ విలసనము నింపునదుల తీరభూ
ములు గిరిసానువులను నిర్ఝరముల ౹ తలములు సతతము చలువల ఋతువును
బోలగనుచు విధికాంచన కారకు ౹ డిల శోభిల్లగ లక్ష్మిప్రతిమను
జోలిచి నీపురి నిర్మించె ననగ ౹ డాలునిగుడు రత్నంపు కటకమున
కనకమయపు కోటను జూచియు నా ౹ ముని దిలకించెను నాపురము నొగను
కనసున్నతంపు మణిభవనమ్ముల ౹ ననుపొందు గవాక్షములను చందన
మున నగరున ఘనసారాదికముల ౹ ననుకూల సువాసనల ధూపముల
పొగలదట్టముల మేఘములనుచును ౹ జిగిగాంచి కామినులు సొక్కనైన
తగవున నాడెడు నెమళుల నొప్పుచు ౹ నిగనిగల నొప్పు చంద్రకాంతమణు
లను స్ఫటికరాల స్తంభముల నొప్పు ౹ గనియునవరత్నకాంచన నిర్మిత
మున వెలసిన ప్రాసాద శిఖరముల ౹ కనకకుంభముల నలంకృతంబును
విను సర్వవస్తు పరిపూర్ణమైన ౹ యొనరందు నంగడుల మనోహరము
గననగు వైశ్యుల వీధులసొబగును ౹ వనితాజనములు పన్నీరుల కల
యంపులను జల్లి చాతుర్యంబున ౹ సొంపుగా నలికి రంగవల్లులను
నింపు దీపింప చిత్రవర్ణముల ౹ ముంపిరి గొన లిఖియించిన కుడ్యము
లెంతో వేడుకల గూర్చ స్ఫటికముల ౹ సంతసము దోప కట్టినవేదిక
సంతుల ముంగిళ్లను కుట్టిమములు ౹ వింతరంగులవి సోపానవితా
నముల రథతురగ కరుల శాలలును ౹ విమలతర నెలవులును పందిళ్ళను
క్రముక కదళి నారికేళముల తరు ౹ లమితానందము గూర్చ పూదీవ
లను ముందర వనవాటి సుందరము ౹ లను తీరందగ చిత్రతరమైన
కనకదండముల ధ్వజములఛాయల ౹ కననగు నీడల నినుని తపంబట
గనరాని విధము నొనరందగాంచు ౹ చును మంగళంపు ధ్వనులు విలసిల్ల

సమరపురంబును బోలె నొప్పుగను ǂ క్రమమువసుదేవ నందాదులుంట
విమలత ననలుని పురి బోలె కృష్ణు ǂ సమలసంచారమునను నొప్పుచును
వరుస సంయముని పురమును బోలును ǂ కరము హారితనూ,భ వాభిరామత
వర నైరుతిపురమును బోలు నందు ǂ సరసు పుణ్యజన సంకీర్ణమగుట
వరుణ నగరమును బోలిక నందును ǂ ధర బ్రశస్తతను గోత్రరక్షణత
సరయు ననిలుపట్టణ మొందునట్లు ǂ పరుల మించు బలయుతు లందుండుట
ధనదుపురిబోలు నవనిధులనొప్పి ǂ కన రజకాద్రిని మించునది యగును
జనపతియు నుగ్రసేనుపాలనను ǂ కన నిగమమువలె వర్ణక్రమవిధి
ఇట్టి పట్టణము జొచ్చె మునివరుడు ǂ పట్టుగొన్న నానందమున మనము
నిట్టటు బారగనీక లక్ష్యమునె ǂ పట్టుగా నిలిపి గ్రహమండలంబు
శుభమందమింప మైత్రి గన్నట్టు ǂ సభల గురులు బుధ కవులు రాజులును
నభయమునుగోరు మిత్రమండలియు ǂ సుభటశ్రేణులు నొప్పు నద్దాని
చేరి నందసుతు నెందు గందునో ǂ వారిజనేత్రలు పదారువేలగు
నేరి కడన నెట్లుండగ జూతునో! ǂ కోరికసిద్ధిని బొందు టెట్లులో!
యనుచు విశ్వకర్మయు తా మెప్పున ǂ తన తపశ్శక్తి గట్టిన యిండ్లను
ముని గాంచె వరుసలన్ని యబ్బురము ǂ గనె హరిని భజనమానని మనమున
పటికకంబాల పవడపుపట్టెల ǂ నట మరకతముల రచితము లవిగా
తటమందినట్టి వైడూర్యవలభు ǂ లటుపద్మరాగ మొగడుల కాంతుల
పటువున పచ్చల విటంకములునుగా ǂ దిటవొందునట్టి శశికాంతవేదు
లును ముత్యాల తోరణ కవాట ǂ కనకమయ సాలభంజికల నలరి
యనువున కలవరముల లీలమెలగు ǂ విను కపోతపా, లికల జెన్నొందు
నొకభవనంబును నందు చేటికా ǂ నికర నూపుర ధ్వనుల రుచిమించ
నికట మాణిక్య దీపముల కళల ǂ సకలంక వైభవమున మించు నొక
వనజనేత్ర గృహమందు మోదమున ǂ కనకపు ప్రతిమలు నా నందమించు
వనితలు చామర లిడగ చలింపును ǂ గనెడి చికురముల శృంగారమందు
వనజ దళ నయను కనకకంచుకము ǂ లను ధరియించియు శిరోవేష్టనము
లను కుండల హారముల భూషలును ǂ ఘనత కాపుండు మందిర మదిగా
కనకాసనమున వెలుగొందుచున్న ǂ ముని కామధునిని గాంచి కనరాగ
మనమున వడిగని లేచి కృష్ణుండు ǂ మునిచరణంబుల తనకిరీటమును
సోక మొక్కి మణిపీఠంబునందు ǂ వే కడుప్రియమున కూర్చుండ జేసి
పీక నెడమీక కనకపాత్రమున ǂ మోకరిలుచు చరణమ్ములను గడిగి

జలమును శిరమున ధరించి భవనము ఽ కలయ జల్లుకొని వినయమున వలయు
ఫలములందించి తోషంబుగూర్చి ఽ పలికె మధురమున నందనందనుడు
ఏపని యొనరుతునో? మానివరా! ఽ మీ పంపున మెలగుటయె నా నటన
పాపమతులనే పరిసరమెల్లను ఽ యో పుణ్యపురుష! పని బలుకవలదె?
నను ధన్యజేయ నను నిలుపు న్యాయ ఽ మును గనవచ్చితి వేమొ మహనీయ!
నిను మెప్పుగూర్తు నానతి యొసగుము ఽ గొనుము విందు వేమేని వలతువో?
యన చిరునవ్వున యనఘనిధీ! హరి! ఽ నిను గనుట బొగడుటల నీ కృపచే
తను జగతిమనుట ముదమును గొనుటయె ఽ నను కావలసిన వవియెల్లనుండె
వినుతి నొసగితివి పెక్కుమూర్తులను ఽ గనినాడ నెన్నొ విందుల కొఱతలు
గనను నీ చరణ వినుతి మాత్రమున ఽ గననగు నన్నిటి నదియె దృఢముగా
మనమున నితరము మాను విందిమ్ము ఽ ఘనుడవాచ్యుడవు కల్యాణగుణా!
నిను గన వచ్చితి నింతె జనార్దన! ఽ పనివినియెద నిక నిన్ను గంటి నని
వినుతి నతి నంది యట వెడలి మరియు ఽ నొసరైన యొక్కభవనము కేగిన
వనజనయను డానందమున నొక్క ఽ వనిత యానందమున ప్రక్కనిలిచి
కనుసన్న నవ్వగనుచుండ గాంచి ఽ కన నతడులేచి వినుతి నతి గూర్ప
నను వేరొక యింటను నాతితోడ ఽ తనపదము లొత్తుచుండ కిలకిలల
వనిత నవ్వించి నా నవ్వుచుండ ఽ గని యటనల్లే గౌరవమందుచు
జలరుహనాభుడు చపలాక్షితోడు ఽ చలమున నెత్తము నాడంగ గాంచి
యలరి మరియొక్క నెలవున జేరిన ఽ వెలది యాకు మడుపుల నీయ గాంచి
తలపునను మెచ్చి యొకయింటి కరుగ ఽ నలివేణి యొకతె నాట్యము నడ్పగ
బలిమి కేలి గీలించి లాగికొని ఽ తిలకమును దిద్ద గని యందు దొలగి
లలన జలమొసగ స్నానము నొనర్చు ఽ జలజాక్షు నొకట గని యవల కరిగి
పొలతితోడ నొక యింట భుజింపగ ఽ నలరిన వానిని సలువ వినుతిసిక
గని వనమాలీ! కనకనేత్రహర! ఽ వనకిటిరూపా! చోద్యమిది యనుచు
జని యొకటిగనె జపమునలిపెడు గృష్ణుని ప్రకటిత మహిమాన్వితు జిష్ణుని
యొకచోట సుతుల నాడెడు వానిని ఽ నొకట బిడ్డలకు పాల్వోయు వాని
నొక్కట పాపల నూరార్చు వాని ఽ నొక్కట చంకల శిశువులొప్పార
దాన మొకయింట గాన మొకయింట ఽ మానసము వింత లాటల పాటల
ధ్యానము లొక్కట పండుగ లొక్కట ఽ మానిత మందుట కసరుటలు నొకట
నొకట బలరాము నాలోచించుట ఽ నొకట యుద్ధవుని నేస్తము నందుట
సకుటుంబ కలహమ్ముల దీర్చుటొకట ఽ యొకట బిడ్డలకు నల్లుర నడుగుట

యొకట పెండ్లిండ్లు ఒకట గోడండ్రు § సకల సపర్యాల పుత్రుల గొల్చుట
యొకట దేవకిని చరణము లొత్తుట § యొకట వసుదేవు నుద్బోధించుట
మునినారదుండు కని యద్భుతమున § తనువు మనము సర్వమును మఱచియును
వనజనాభ ! హరి ! నీమహిమార్ణవ § మును గన నెంచియు వచ్చి ముదంబును
గనినాడ నింక నిను శోధించుట § కును భీతిపొడమె చాలు నిక నిలుపు
వెను దిరిగిపోవ యొనరే తెలియదు § నను మోసగింప కిటనే దారెద
నిను మ్రొక్కువాడ బుద్ధివచ్చె నిక § ననుచుండునంత నొక్క భవనమున
జేరినంతనే తా నెదురువచ్చి § మేరసెల్ల పూజించి మునివరా !
మీరెటనుండియు వేంచేసితి రిట § సారతపఃఫల మందితి స్వామీ !
చాలదినములయె లోకములన్నియు § గాలింప దిరిగెదవు నిలువ వొకట
మేలందెద ! మీసేవ నాయింట § నోలి నిలువ దలతుర ? తెలుపు డనగ
రోమహాత్మ ! పురుషోత్తమ ! కృష్ణా ! § నీమహామహిము నే దెలియజాల
నీమంజుల నుతి నిను బరికించుట § నేమముదప్పితి నన వెఱపుగంటి
కాలకర్మములు నీవె రమాధిప ! § ఓలి సుఖదుఃఖములు నీయోగము
జాలి నందవలె మీసంస్మృతిలో § మేలేదిలేదు నీపదసన్నుతి
నోలి నదిమాప గని సర్వంబున § వాలాయంబున నిన్నె గాంచుచు
నున్న మోక్షంబు లిన్నికలలోన § గన్న భోగముల భ్రాంతివంతములు
వెన్నుడవు నిన్ను నమ్మిన భ్రాంతులు § సన్నముగ గనును నా కానతిమ్ము
విన్నవాడనో యన్న యా నాడు § కన్నపాప నీవాడు నాతండ్రి !
నిన్ను దెలియ గోవులను బాలురను § కన్నుమరగించి గాంచిన పెద్దత
నంబు గాంచియును నే వచ్చుట వృథ § యంబుజోదరా ! కరుణింపవలయు
అంబుజాసనుని కింతయు జెప్పదు § అంబికాధవుని వింత నవ్వింతు
నన మ్రొక్కియోగి జనాగ్రగణ్యా § విను నేను కామనిరసనుడ నయ్యు
రొనరున ధర్మము నిలుపు నీ లీల § గన బొందవలసె దనుజుల దుష్టుల
మనుగడ బాపగ నవతరించితివి § ఘనత నీవలనె నతుల ధన్యుడను
తనువున గురించి మునుపటి పదంబు § గనెద లీలయిది మనమున నెంచుము
అని పూజించెను ననుమతి యిచ్చెను § ముని నారదుండు బ్రహ్మను జేరెను
జనవరా ! విష్ణుచరిత పావనము § ఘను లెవ్వరేని యీలీల వినిన
వనజనయనుండు వారి నిహపరము § లను సుఖము మోక్షమును జేకూర్చును
జనులు ధన్యులై ఆయురారోగ్య § ఘనతనందుదురు వ్రాసి పఠించిన
అని చెప్పి శుకుడు పరీక్షిత్తుకను § మనుజేశ ! కృష్ణు దినచర్యలిట్లు

వినదగు వచింతు మనము దెలివి నిగు ఽ డును ప్రీతినందు మని శ్రీనాథుడు
గను నరుణోదయమునకు మున్నుగా ఽ దననిద్రనుండి మేల్కొని భానుని
ఘనమైన రాక గనుపించునట్టి ఽ వనజములసొంపు వికసింపులనుఁ
గలహంసలాది జలవిహంగముల ఽ కలరవముల పులుగుల ధ్వనులట్లనె
నలరంద వందిమాగధుల నుతుల ఽ నలగూర్చుండియు పరమాత్మునిత్యు
హరిని పురుషోత్తముని తన్నుశివుని ఽ ఘనుని నజుని దేవాత్మను విష్ణుని
పరముని ననంతు నచ్యుతు నవ్యయు ఽ వరుసగాదాను సంస్మరించియును
తనవైభవమును గననిపగవారు ఽ కనులు మూసుకొన భక్తులువిప్పగ
తనను గాంచ కనులను కరుణను ఽ జనులవారిగా గాంచంగ విప్పి
సకలుర దోషాంధతబాయ జేర ఽ సకలకుశలముల నరసి పాన్పుడిగి
అకలంకమతిని కృత్యములజరిపి ఽ సుకమలములనుఁ మజ్జనములాడి
సురభిద్రవ్యముల జేర్చిన నిర్మల ఽ తరమున బంగరుగిండుల జలకము
వరుస నాడి వస్త్రములను ధరించి ఽ వరభూషణముల నవరణ లందును
హరిచందన కర్పూర ఘనసార ఽ వరలేపనముల మేనొప్ప నలది
పరమ నియతి పాటించి కార్యముల ఽ వరుస దేవార్చనముల నెల్లించి
ధరణీసురల బూజించి దానమిడి ఽ కరము శృంగార కరుణారసంబు
మూర్తిత్వమంది యా శ్రీకృష్ణుడు ఽ ఆర్తిగొనుజనుల బాపుటకుంగా
నార్తశరణ్యుడు హరి యవతరించె ఽ పూర్తిగన్న పరమాత్ముడిత డనగ
తాను సర్వభూషణ రాజితోగ ఽ వేన దర్పణములో తన్నుజూచు
కొని మానితముగ దారకుడు త్వరను ఽ పూనిచి తెచ్చిన కనకరథ మెక్కి
తనతోడ సాత్యకియు నుద్ధవుండు ఽ వినయమున మ్రొక్కువారి జేర్చుకొని
తనవారికెల్ల సరసిజమిత్రుడు ఽ జనతతికెల్ల చకోరచంద్రుడు
తనపగవారికి కాలానలుండు ఽ మునులకరుణ గురియింప సురేంద్రుడు
ధరణిభార మడపగ దా శ్రీహరి ఽ సరణి సర్వజ్ఞతను పరమేశుడు
కరము హర్షమున తనరాకగోరు ఽ వరమతుల సభామందిరము ముంద
రను రథము డిగియు కరము నూత గొన ఽ పరమపావనుడు ఘనుడు భక్తుండు
తనకు మిత్రుండు నైన యుద్ధవుని ఽ కనికరించి తోడంది సభజేరి
ఘనతర రత్నప్రదీప్తినందు ఽ మునుల దీవనల పాలితంబైన
తనకు గా నర్హమైన సుధర్మ ఽ సనమున వసించి లోకంబు నరసి
పాలించు నీతి నెఱిగి భువనముల ఽ చాలు పాలించు పరమాత్ము డిట్లు
లీలనొంది విహరించుట లెల్లను ఽ నీలవర్ణుడగు హరి స్వేచ్ఛ లిట్లు

ఈవిధి ననుదిన వర్తనము సెల్ల ǂ దేవదేవుండు దుర్మదాంతకుడు
నా వివిధభూములను ఖ్యాతి నిండ ǂ కేవల మొకదినమున ద్విజు డొక్కడు
వారిజాక్షునకు తనరాక జెప్పి ǂ దారిగని కృష్ణు సన్నిధిని జేరి

-: జరాసంధభీతులయిన రాజుల పంపున విప్రుండు కృష్ణసన్నిధి కేతెంచుట :-

మీరిన సన్మానంబున కార్యము ǂ నారయ వచింపుటకు ధీరత నిడ
తా నందరినిఁ మంతనముండుట ǂ చే నిజబుద్ధిని రోూదించి కృష్ణ !
దానవభంజన ! దయానిధీ ! హరి ! ǂ మానవలీలావిహార ! సుందర
తరరూపరాజితా ! కమలనేత్ర ǂ వరదా ! భయదా ! విధానమిదె విను
జరాసంధునిఁ యెఱుగుదు వింతకు ǂ నరాధిపతులను చెఱనుంచి నాడు
త్వరాన కాళికి బలివెట్ట నుండె ǂ నిరాదరంబున తనకు మ్రొక్కరని
వా రిరువది వేలగుదు రో దేవ ! ǂ గాఱియ నందుచు మీరిన భీతిని
గూరినను మ్రొక్కి చారుడను నీకు ǂ గా రా బనిచిరి వారిదా మనివి
పేరలన్ని వినిపించెద వింముదె ǂ వీరందరు విన దగియుంచు రనుచు
సెలవంది వచించెను ధైర్యమునను ǂ కలతను విడిచిన మనమున విప్రుడు
తిలకించె వారి నందర ముదమున ǂ తలమంది లక్ష్య మవ్వారిదిగా
అయ్య ! యో వారిజేక్షణ ! శ్రీధర ! ǂ నెయ్యముంచి విను మేమిదె మ్రొక్కులు
వెయ్యి నిన్ను జేర్చియును నుతింతుము ǂ చయ్యన బ్రోవగ సమయమందు మా
యయ్య యీశ ! సర్వేశ ! రమేశా ! ǂ ఇయ్యలను నిన్ను దప్ప పరదైవ
మెయ్యెందున గనబోలదు మహాత్మ ǂ డయ్యుటల నందితిమి మామనంబు
వ్రయ్యలయ్యె పెక్కుపదలజిక్కి ǂ గ్రియ్యం బడితిమి యా జరాసంధు
డయ్యెడ మమ్ముల బంధించి నాడు ǂ నెయ్యర నెఱుగము విడిపించువారి
కయ్యమున రుద్రుజెండెద ననుచును ǂ డియ్య కొన నెవడు నాకెదు రంచును
నియ్యెడున బలివెట్ట కాళికిఁ ǂ వెయ్యదండముల ముదువుగొనెనంట
బలియురదుష్టుల దండింపనీవు ǂ బల విహీనులను సాధులను బ్రోవ
కలిమిబలిమి వెలయంగ బుట్టితివి ǂ యల వామదేవుడవు నీ వభవా !
నిను సన్నుతింప నోపము దేవా ! ǂ వనజభవాదులె వంచింపబడిరి
వనధినిలయ ! భువనాంతరాత్మ ! హరి ! ǂ మును దుష్టదనుజకోటుల దునిమితివి
నిను పదునెనిమిది తోయము లనిలో ǂ కినుక దాకి వెను బారినవాడే
కనకచేల ! నీసరిగాడు వీడు ǂ దన మదబలమున గ్రాలెడు నింతే
జననాథుల మము వంచించి పట్టె ǂ కననీడు తోడు మము వేరుపరచె

డాయుము వీనిని బోర బొలియింపు § మాయ మొనర్పుము వీని పొగరెల్ల
మాయిల్లాండ్రను సుతుల మముగలుపు § నీయందు మతిని గూర్చి భజింతుము
రావే యనంతబలసంపన్నా ! § రావే ! దనుజవిరామ ! కేశవా !
రావే ! కృష్ణా ! బలరోచిష్ణా ! § రావే ! ముక్తినిధానపావనా
రావే ! యజితా ! యవ్యయ ! అచ్యుత ! § రావే నుతవనజాసన ! శంకర !
రావే దయాబ్ధి ! యోయబ్ధిశయన ! రావే నీవే యేడుగడ మాకు
ననుచు సందేశమును నన్నుగూర్చి § జనపతులు నిన్ను పదివేలుదండ
మనుచు బంపుటిది నీచిత్తమేమొ § విన జెప్పుము వారల దడదీర్తును
నాదీవన నీకగు జయము రమ్మి § భూదేవపూజితుడవు యధోక్షజ !
యాదరంబె యా జనపతులకిమ్మి § మా దేవమునుల నల్లి గూర్తుగద
ధ్యానమంత నీమీద వారికగు § నో నలిన నయన ! యన నాలోచన
మానమంది చిరునగవున భూసురు § మానసంబు తోషింప బల్కెనెడ

## —: నారదుండు శ్రీకృష్ణునితో ధర్మజురాజసూయము నెరవేర్పుమని చెప్పుట :—

వినబడె మిన్నున జయశ్రీకృష్ణా § యినకోటితేజ ! ఈశ్వర ! మాధవ !
ఘనదయాపరా ! జననాథవినుత ! § మనుజేంద్రభువన మాన్య ! దనుజహార !
యనుచు నారదుడు శుభ్రశరీరుడు § మునివరుడు జడలకెంపుగనువాడు
శరదంబుదమున మెరుపుతీగవలె § వర కాంచన కటి నూత్రింపువాడు
కరము పూర్ణశశి జెందు గురుతువలె § హరిణాజినంబు భుజమునం దొప్ప
గనువాడు నక్షమాల కంఠమున § దనరుమహాత్ముడు వీణాగానము
నను తన్ను గేయములను నుతించుచు § వినగన మనోహరము తనువువాక్కు
లను సుహృదహృదయ కమలభాస్కరుడు § తనుగా తనలో వాడునట్టుగా
రాగని హరియును సంప్రీతిలేచి § వేగ మరసి పరివారముతో నా
జగత్పూజ్యునిం నారదమునినిం § దగనెదురుకొనియు దోడ్కొని ఘనతను
కనకపీఠమున గూర్చుండజేసి § కన విధానముల బూజించి శాంతి
గని యిట్టుల నాకంజనయనుండు § మునివరుని మొక్కుచును నడిగె నధిప !
యోగివరా ! నీవెందుండిరాగ § యోగమందితివో ! సర్వమెరుగుదువు
వేగమందె నాచిత్తంబున విను § బాగున్నవారె పాండునందనులు
మాయత్తకొడుకు లందునసుజనులు § మీయడుగుల సేవింతురు నిజంబు
నాయనువు దెలుపు మంతట దిరుగుట § నీయెరుంగనిది యుండదు మునీశ !
యన నవ్వుగొనుచు గేలిసేయుదువా § నను నీలాంగా ! గుణమిదే నీకు

గనెద వ జాండములోగల వన్నియు ॥ నను నడుగుట కృపచేతనె గాదా ?
సంచితాఘహార ! సర్వజ్ఞా! నీ ! ॥ యంచితశాసన ముల్లంఘింపక
మంచిగ నెగడుదురా సురజాలము ॥ అంచితపుణ్య, స్వరూప యదువర !
నీమాయలన్ని యెరిగితిని దొల్లి ॥ వే మారులు నా కద్భుతంబుగా
సామాదివిధుల శతృలజయింపు ॥ నీ మాసితగుణ మెన్న శక్యమనె
జగము లుద్భవములగు నీస్వేచ్ఛను ॥ తగుదు వవ్వాని పోషింతు వీవె
భగవంతుండవు లోగొనువరకవి ॥ నిగనిగలాడుచు వెలి నీ వరయుగ
తగవంది ధర్మమును నిలుప నెంచి ॥ ఖగవాహన యిటు దోతువు గాదా
నీ మనోంబకమునకు నిన్నియునుక ॥ సామమంద గనిపించు దేవుడవు
శ్యామసుందరా ! నీకంటె నన్య ॥ మే మహిని గాంచ గనరాదు గాన
నేమానము నీయనంతశక్తియు ॥ సామాన్యమతుల దెలియ తరంబే
ఏది ? పరిమాణప్రమాణశూన్యమొ ॥ ఏది? వాగాదులకు నగోచరము ?
ఏది ? యన్నిటికి నాధారంబో ? ॥ ఏది ? రూపనిర్ణయములకందదొ ?
అది నీవ సొమ్ము పరతత్వంబిదె ॥ మదికిమాత్రంబ నమ్మిన ద్రోతువు
అదియు ముక్తి యద్దాని దలంపక ॥ మదవశత దనుపు ధన వనితాదుల
పసుబుద్ధి దవిలి నాశల బొల్వడి ॥ దశహీనముగా నరులు నిరయముల
వశగతి జెడుదు రవశగతి నైనను ॥ పశుపతి వినుతుని పాటించి విన్న
సుగతి గలుగు చింతలు డాయ వెపుడు ॥ నిగమ సన్నుతా దరినిత్తు వట్టి
సుగుణ మండనుడవైన నీ వధుగ ॥ తగవున వచింతు నందుకె వచ్చితి
వినుమా ! యుధిష్ఠిరుడు బ్రహ్మార్పణ ॥ మనుబుద్ధి నిన్ను మెప్పున గూర్పగ
ఘనయశంబు తా నంద పితరులను ॥ జనలోకవాసమును శాశ్వతమున
వసింపుగనగా సుసంగతిని నీ ॥ ప్రశంస మహిమను బసిండి గాగని
దిశల్ జయింపగ ననూయ మందుచు ॥ ననూయ జూపిన వెసన్నుమమగా
రాజసూయమును సలుపంగఁబూనె ॥ తేజమందు నద్దాన నతడు దగు
నో జగద్వల్లభా ! వాసుదేవ ! ॥ రాజిగొను మచట జేర శుభమందు
వేగ మరయుమా ! యందున దుష్టుల ॥ బాగు మలపంగ పూజ నొందుమని
హో గజేంద్రసంరక్ష జగత్పతి ! ॥ యాగము యాగఫలంబు నీవెకా !
యాగరక్షణము నీపరము నిమ్ము ॥ త్యాగమున గూర్పు ధర్మజుని మనము
నిను దలపుంచిన బాగడిన విన్నను ॥ గను శుభంబు నరు డేవిధి నైనను
యనయము నిన్నే నుతింతు పాండవు ॥ లనఘులు బంధులు ప్రియము గూర్పుమని
నీ పాదభజన ముల్లోకములను ॥ నేపార పవిత్రతను స్థిరపఱచు

నీ పాదజనిత గంగానదివలె ॥ యో పాపహరా! సంగతి వింటివ!
నీ కిష్టసిద్ధి యా మఖంబునను ॥ సోకువరమందు నా పాటి యిదియె
నీ కారుణ్యమె మా కట్టిసిద్ధి ॥ యో కంజనేత్ర! యుత్సహింపు మనె
విని శ్రీకృష్ణుడు నారదువచనము ॥ గని నుద్ధవునిఁ మంత్రివి రమ్మని

—: శ్రీకృష్ణుం డుద్ధవుని యాలోచన చొప్పున ధర్మరాజుపాలికిఁ బోవుట :—

వినుపింపు మింక మంత్రాంగంబును ॥ గనుము ప్రయాణము నాదరి నుండెడు
ఉద్ధవా! మహిత వివేకగుణముల ॥ వృద్ధుడవు నాకు హితుడవు ప్రసిద్ధి
ఇద్ధమనంబు నీ నిజమెఱుందును ॥ బోద్ధవ్యము నొనరింపు నిను మెత్తు
మాకు నీవు కన్నుల యుగ్మమగుదు ॥ నీకంటె ప్రజ్ఞగల దెవ్వరికని
నాక గురుశిష్యుడవు సిద్ధమతివి ॥ నీకు కార్యముల భద్రగతి దెలియు
నన దేవ! నీకు నే వచింపగల ॥ ననుట బాగడకుమ నయమూర్తివీవు
గనని ప్రజ్ఞనను జెందునె దయాబ్ధి! ॥ యనఘ వరద! పరమేశ్వర! కృష్ణా!
దేవముని చెప్పి యున్న యంతయును ॥ పావన చిత్తుడు భావిసంతుల
కేవలం బెంచనదె నా యిష్టము ॥ త్రోవ దిగ్విజయ దాటి ధర్మజుడు
కూరిమిని గూర్చి నినునమ్మినాడు ॥ వీరు లతని సోదరులు నల్వురును
వారిచేత బొలియింపు దుష్టులను ॥ తేరిచూడ నా జరాతనయుడే
దారిని జెడు తప్పదు భీముచేత ॥ ధారుణీపతుల చెరనున్నవారి
నారసి బంధనముల బాపనగును ॥ నీరజేక్షణా! యుత్తమ మార్గము
సారమతిని బరికింప నిదియగా ॥ ధీరలక్షణము తెగువ నిశ్చయము
నారదుండు వరమనుచు దీవించె ॥ మేరగొంద మిది రిపువంచనంబె
మాగధుని బలంబు మనమెఱింగి నదె ॥ నాగాయుతసత్త్వుండు భీకరుడు
నాగభూషణుని వరమందినాడు ॥ భోగమున నింద్రు చీరికి గొనండు
వాని జెందినవి వాహినులచాలు ॥ గాన నూరైన నక్షౌహిణులుగ
జనపతులందరు వాని వశమంద ॥ మనకు జయింపగ సాధ్యంబెట్లగు
మనచే వంచన గాతండందెడు ॥ వినుము ద్విజవేషముల ననిగోరియు
దునిపింపవలయు నట్టిసమర్థుడు ॥ అనిలపుత్రుండె నమ్మి మనంతా!
భీమబలుండా భీమునిబోలును ॥ భీమరణంబున నా భీలముగను
నీ మహాబలవిభూతి నతడందు ॥ స్వామి! నీ చిత్త మానని దృఢమును
నామిని వసుదేవుని బలరాముని ॥ పావనచిత్తుని నుగ్రసేనునిఁ
కేవల హితబంధువులను సుతులను ॥ వారిని నందరి గూర్చి సమ్మతిని

ఏకముఖంబున గొని జయముకొఱకు § ఏకమతిని దేవతలఁబూజించి
వీరసాఫల్యతను వరమందుచు § ప్రాకటయశంబు పాండవులకెత్తు
నేనని పెద్దల నతి శుభముహూర్త § మును దానములను భూసురుల నెఱిగి
దారకుడు తేగ సిద్ధరథంబును § మీరు కాంతి గరుడధ్వజము వెలయ
వర మేఘపుష్ప వలాహకంబుల § సురుచిగను సైన్యసుగ్రీవంబుల
వారువములు నాల్గింటిని బూన్చిన § చారుతరంబుగ మేలికవచముల
మీరగ ఘంటలహేమమయంబుల § మేరుగిరి చాలు నొప్పుగన్నయా
తేరు నెక్కి వడి యందరను నిల్పి § మీరు నా పిలుపులోన వత్తురని
మీరు కరుణ వారల ముచ్చటించి § సారసనయనుడు బాలసూర్యువలె
వెలుగు మంగళధ్వనుల మాగధుల § నలసూతవంది జనుల నుతింపుల
నలరుచు పురమును వెడలి యొకవనము § కెనల ఘనసార సాల రసాలపు
తరులాది నొప్పు గలదాన నిలిచి § తరుణులు రుక్మిణి మొదలగువారలు
కరము ప్రీతి తమ సుతులును గొందరు § వరుస వత్తుమని యాడ వారికై
వరమతు లింద్రప్రస్థము జూడగ § వరము వాంఛించి యుండుట నెంచియు
వారల రాకను గాంచియుండె నట § వారందరు భూషితలయ్యి సుమము
లను గంధాదుల వరవస్త్రములను § కనకాంగదముల తారహారముల
కనరత్న కంకణాదికముల పెక్కులను § ఘనత శోభిల్ల గైకొని తనయుల
గొని వెంట వారకాంతలు దాసీ § జనము గొల్వగా శిబికల నెక్కియు
మును ముందున ప్రతిహారులు మార్గము - నను వొనర్పగా పరివార జనము
తురగముల కరుల వేసడంబులను § వరుసనెక్కి రా వారిని తోడ్కొని
కరముల జోడ్పున నారదుని మ్రొక్కి § సరసిజనయనుని హృదయమున మెచ్చి
కరమునుతించియు మనము నానంద § పరమంద జేసి యిచ్చ దా నేగ
ధరణిదివిజునకు నభయమటుగూర్చి § వరమంద బంపి బంధుల తోడను
గదలె నచ్చోటు వరుసభటచయము § గదియ వైభవము రాణ చెన్నొంద
ముదమున నదులను వనదుర్గములను § విదితకొలంకుల జనపదంబులను
వివిధదేశముల విశాలభూముల § వివిధనగరముల వింతల నెన్నియొ
తవులు తలంబుల నన్నిటిని గడచి § సౌవీరానర్తక మరుభూముల
దాటి యిందుమతి దర్శించి యవల § మేలైన వృషద్వతి నుత్తరించి
మేటి నాసరస్వతి నదిని యట్టె § పాటించి మత్స్యపాంచాలంబుల
తోవలను మీరి పాండవు లుండెడు § భూవినుతి గన్న నింద్రప్రస్థమును
కేవలంపు పరమాత్ముడు కృష్ణుడు § దేవవినుతుండు గని పురోపవన
మున నిలిచెను కరితురగరథ భటుల § తన పరిచారులు వనితసుతమిత్ర

## -: పాండవులు శ్రీకృష్ణునెదుర్కొని తోడ్కొని పోవుట :-

జనులతో గూడ తూర్యధ్వనులను | జనుల మోదముల నింపుచుండగా
వనజాక్షురాక వినెను ధర్మజుడు | అనుజుల బంధుల గురువుల సచివుల
పరివార వర్గములను మరి ధరణీ | సురల పౌరోహితుల వందిజనుల
సందడుల పెక్కుగూర్చుకొని యుడుగా | చిందములు మ్రోయ నెలమిని గాయక
బృందములు పాడ నృత్యముల తోడ | డెందముల శుభమునించు వాద్యముల
నందమింప హరి గాంచగ పరమా | నందమున నెదురు కొనగా దరలెను
వారిజ నయనుని గనె ధర్మరాజు | నా రమాపతియు నరుదారు గతిని
మేర వినయమున దార దనివార | మీరుముదంబున గాఢాలింగన
మున గూర్చి తనువునను హర్షంబున | పెనగొను పులకల కంచుకితము నొప్ప
విను నిర్భర హృదయంబున బాహ్యము | నను దృష్టిమఱచి హరిని లోగొనుచు
నుండె నొక పెద్దతడవున శౌరిని | మెండుకొన ప్రీతి భీమార్జును లటు
దండి కౌగిళుల సమ్మదము వెలయ | నండ జేరి మాద్రేయులు మ్రొక్కిన
పుండరీకవరదుడు వారినట్ల | దండగొని విప్రవృద్ధులకు మ్రొక్కి
జనులు నతులతను గూర్ప కరుణ గని | జనపతుల క్రేకయుల సృంజయులను
కనికరించి తా వందిజనులకును | యొనరున వలసిన బహుమానమిచ్చి
తనవారు వారు గలిసి శృంగార | మున విచిత్రతర మణితోరణముల
ననుకూల మంద సుందరమునింపు | ఘనత మిన్నయగు పురమున జొచ్చెను
రాజవీధి తా వల్లనల్ల రా | రాజీవాక్షుని నారంజిత పురి
రాజీవగంధు లాదరమున గన | నోజల దమ కృత్యముల వదలుచును
పెనగొని సంభ్రమ మున నడతలు గని | యసమాన సుందరా కారుండగు
గుసుమబాణు జనకుని జూడగోరి | పసిడితీగలను మించుశరీరము
లసి యాడు నడుములవి తూగాడగ | పసదనము నిక్కు బంగారుకలశ
ములమించు నున్నతపు కుచయుగ్మము | ఎలమి బర్వ నొం డొకటి రాచుకొన
నలరుబోడు లని కరపదంబులను | గల కనకమణుల నిర్మితములు నగు
వరకంకణ నూపురముల రాపిడు | లరయ ధ్వని వెడల పరువులు గొనుచును
కరము కొఱనెలను నిరులుచుట్టినటు | వరమైన నొసలునను ముంగురుల
తెరమున గప్పగ చెక్కిళ్లుచెవుల | పరమగు తాటంకముల కళగూర
దరహాసచంద్రికల ముఖములొప్ప | స్ఫురిత విద్రుమచ్ఛాయల ధర బిం
బముల నొప్పుగన కొప్పులు భుజముల | క్రమముల నటింప కొంగుటుకా దూల
తమవారు వారిమలపిన నాగక | సరగున మేడల శిఖరముల నెక్కి

హరిని గాంచి మనముల నిటు తలచిరి ఽ నరపతి వినుమా! నారుల నుడులివి
పరముడట నందయశోద సుతుడట ఽ సురలకు ధాతకు బాగడున వశుడట
భువనపాలుడట గోపాలుండట ఽ ప్రవిమలుడు రోల గట్టువడె నంట
దేవులు నుతుల వేదములు నోపవట ఽ దిలిజుల కమృతము ద్రావించె నంట
తలచినను భక్తసులభు డగునంట ఽ వలచిన కోర్కెల నందించు నంట
కలిమిపడతి మగడీతడే నంట ఽ యల పిన్ననాట వెన్నదొంగ యట
వెలదుల గొల్లల యుల్లము గొనె నట ఽ వలపు కాడంట యా పురినారుల
ననుచు మరి యిట్లు గుసగుసలు గొనగ ఽ వనిత లాడుటలు వింటె జనపాల!
సుందరీమణీ సుందరకృష్ణుడు ఽ సందు గాంచి యాసుందరపు గోపి
మందిరముల తా పొందుల నందిన ఽ మందలోని యా నందబాలుడగు
పాలు పెరుగు మీగడల వెన్నలను ఽ చాలులను మెసవి యలరుగ బెరుగుచు
నోలి గోపికల పాలిండ్ల బుడికి ఽ బాలచేష్ట లనె వలపుల జూపగ
నా లలనలు రతికేళిని క్రమముల ఽ నోలలాడించి రీతనిమెప్పున
చల్లలమ్మరా వల్లవకాంతల ఽ నల్లిబిల్లి మాటలను చెక్కిళ్ల
గిల్లిగిల్లి తమి రేపి యేపుగొని ఽ మెల్లమెల్ల తావల్ల బాల్పెగద
చివురుబోణు లీ తని సౌరుగాంచి ఽ ప్రవిమలత చివుకు నను ముద్దుగొనగ
కౌగిలిలోననె వడివడి కుచముల ఽ తడవితడవి తమకము దీర్చువారి
వనితలను రాగవశమున బిలిచిన ఽ గని వారి దాసి యధరసుధారస
మును నానియాని కోర్కె కొనసాగ ఽ యొనరందినదీ పురుష వరుడగును
ఘనమైన తపస్సమాధి వశులగు ఽ మును ందలేని యానందామృత
మును యావల్లవ పల్లవాధరుల ఽ ఘనత నందించె నీ మహానీయుడు
యదువంశతిలకు మదనుని జనకుని ఽ ముదము వెలయు మన సదనమునందున
మదికింపుగ గన నద నందితిమో ఽ మదవతులారా! గదియు నిక ముక్తి
యనుచు నా జగద్భరితానందుని ఽ మునిజనకల్పగు నిన్ శ్రీకృష్ణుని
మనమున భక్తిని సుమముల లాజల ఽ నెనయు కుతుకముల జల్లిరింపునను
వినుమటు కృష్ణుని ద్విజాదులందరు ఽ ఘనమైనకానుక లిచ్చి పూజింప
ఘనసార హారతుల వారొ సంగ ఽ వనజ నయనుండు పాండవులతోడ
నంతిపురమునన్ జేరి కుంతినిన్ చెంతదరిసి దా వందనం బొసగి
సంతసమున ద్రౌపదియు తనభక్తి ఽ వంతుగొని మ్రొక్క దాగరుణ జూచె
క్షేమము లరయగ నయ్యో ధర్మజుడు ఽ నా మహిమాన్వితునకు విడిది నిచ్చె
నేమమున గుంతి యాజ్ఞయు నిడగా ఽ నా మహిళామణులను వైదర్భిని

యాదిగా నందరిని యా ద్రౌపది ఽ గాదిలి పెంపున గంధపుష్పముల
మోద మిగురొత్త పూజించి తగిన ఽ మాధుర్యంబుల మర్యాద గూర్చె
హరి యిటు లష్టమ భార్యలు పుత్రులు ఽ వరుసల ద్వారకనే యామోదము
తరుణ మందుదురో లోపములు గనక ఽ కర మింద్రప్రస్థమున నవి మెలంగ
మేర ధర్మజుడు గూర్చ తోషణ ఽ గూరియుండ తా నరుడు సఖ్యతను
చారువిహారము లెటనేని సలుప ఽ దారి వత్తురా సంతోషంబున
యమతనయుండును హరితోడ గోష్ఠి ఽ క్రమమున నొప్పుచు సర్వమాతండా
విమల పూర్ణతను సమకూర్చునిష్ట ఽ క్రమము లనుచు నెల లొక కొన్నిజరుగ

-: ధర్మరాజు శ్రీకృష్ణు ననుమతంబున భీమాదుల దిగ్విజయంబునకుఁ బంపుట :-

నొకనాడు పాండ వాగ్రజుండు తన ఽ సకల బంధుపరివారము గొల్వగ
ప్రకటితఖ్యాతి తా బొందినట్టి ఽ యకలంకాత్ముల కానంద భూతి
దనరు మయసభను ధౌమ్యుండాదిగ ఽ ఘనతర నిష్ఠాపరులు భూసురులు
జనవరులు మంత్రులును దనతమ్ములు ఽ గన బంధుజనులు హితులు వందిగణ
ముల గొల్వనిండుశ్రీమాడ్కి విభవమున ఽ జలజలోచనుడు తన మానసాబ్జ
మలరగ సహస్రకిరణు డనముందు ఽ విలసనమున నాభాను తేజమున
నలరారు చిత్తమున విధేయుడుగ ఽ తిలకించుచు మురభేది! జనార్దన!
భువనరక్ష! నయనిపుణ! శ్రీహరీ ఽ దివిజపోషణా! యద్భుతచరితా!
యవిరళప్రతాప! యానందధామ! ఽ సువిశాల యశోమణిదీప్త! వరద!
దవిలి నిన్ను భజియింతు సర్వేశ! ఽ సవన మొనర్పగ దలచితి నీకృప
నది రాజసూయ మన నారదుండు ఽ గదిసి చేయుమనె నిశ్చయ మొనర్చె
మది నెఱుంగుదువు నీవు మహనీయ ఽ విదితమెల్ల భువనములు నీపాల
నము లోనివె సకలజ్ఞ సచ్చరిత్ర! ఽ విమల దయ బరపి నీవ నెరవేర్చ
క్రమ నందించితి శమము నిను జెంద ఽ క్రమము గొనుము నీచరణములయాన
యన వలదు బావ! నే నీ యానతి ఽ గని మెలగువాడ తగుదువా నీవు
ఘనుడవు, బాంధవ ప్రియుడవు ధర్మము ఽ ననుకూలమందు నీమనమందే
జనవినుత నిత్యకీర్తి జయంబును ఽ గొనుము నీపితృజనులు శాశ్వతము
గనెద రక్షయవు, గతుల దివమునను ఽ మనుజలోకమున గొనియాడదగిన
జనపతివి నీవు, నీయనుజులల్లొ ఽ ఘనుడు భీము డా భీముని బోలును
నరుడు విజయ నామమున సార్థకుడు ఽ కరము నకులసహదేవు లట్టిడులె
కరమున గెలుపును గొను మరాతులను ఽ పరువడిని నిన్ను అరుల నర్పించి

చిరము సఖ్యమును గూర్చెదరుగాక ఽ కరము నీదు శాసనము నేబూన
ధరణి నిను వ్రేలజూప నేరికగు ఽ వరుస దిగ్విజయ కాంక్షను బంపుము
యనుజుల నల్వుర సైన్యసమేతము ఽ మునుకొన వలయును పదార్థజాలము
లను దెప్పింపుము ధనమక్షయంబు ఽ గనియెదవు బంధుజనులకిది హితము
అనిన ముదంబున పవమాన సుతుని ఽ గని మత్స్య కేకయులును భద్రులును
దనతోడ గూర్చి యనిపె దూర్పునకు ఽ ఘనుని నకుటిలుని నకులుని పశ్చిమ
జనపదంబులకు సైన్యములతోడ ఽ ననిచె సహదేవు నట దక్షిణదిశ
కును సృంజయ భూపాలకుల తోడు ఽ గనజేసి పంపె వీరు నర్జునుని
రొనర నుత్తరము జయంబుగొని రా ఽ బనిచెను వారలు ధీరతల నేగి
జనపతుల గెలిచి స్నేహ మొనరించి ఽ గొనిరి కానుకల ధనకనకాదులు
కరి తురగ రథ శ్రేణి సైన్యముల ఽ వరరత్న భూషణము లంబరముల
పరివారయుతము వలయునవి యెల్ల ఽ ధరణి యశము సార్థముగ సర్వులకు
కరము ప్రీతి జెన్నొంద యందుకొని ఽ వర శౌర్యధైర్యముల మోదంబున
గదియ వచ్చి రా యన్నకు మ్రొక్కుచు ఽ జదివి రెల్ల పాతముల విజయమును
ముదము జూప డిందుకు నేవగించె ఽ మదయుతుడు జరా తనయుండు మాకు
నలివెట్టుడు శ్రీహరిని ధిక్కార ఽ మరసినాడు వాసిని మట్టగింప
త్వరగనము మేము నీ యాజ్ఞ చొప్ప ఽ పరమకృపామయు డీ శ్రీవల్లభు
డైన విష్ణుండు నీవు నేకముగ ఽ దేని నిరూపణ పథమందురో యు
ద్దాని గొనిమేము యత్నమందెదము ఽ మీనిశ్చయమునె మెలగ నేర్తు మన
మానము వహించె ధర్మతనూజుడు ఽ మానసమున దా చింతిలు నటుండ
వీరోచితంబు దీపింపగృష్ణు ఽ డారసి యిట్లనె ధర్మజుని గాంచి
ధీరోదాత్తచరిత్ర! యమపుత్ర! ఽ సారపవిత్రా! శుభగుణపాత్రా!
శూరవరులు నీ యనుజులు సుమ్మా! ఽ మేరజూడ నా ప్రాణంబులెగా
తేరుకొనుము మము వీరుల ననుమతి ఽ గూడువు మిపుడే యా దుర్మదాంధు
నాజి గెడపెదము భీముని చేతను ఽ నా జగద్ద్రోహి రాజఘ్నుడు బడు
వే జయంబు నిను జెందుమువ్వురను ఽ నోడ దీవింపు మిపుడె దరలెదము
తేజంబు వెలయ నా మాగధునిశ ఽ రాజసూయ దీక్షకు తొలిబలిగ
రాజితంబంద వత్తుము మేమన ఽ నో జగదీశ్వర! శౌరి! దనుజహర!
శ్రీరదమన! నీశక్తి నెరుగుదును ఽ వారిజాక్ష! నీ వారయ మనంబు
గాఢంబుగల యనుజులు నల్వురు ఽ సారమైన ప్రాణేంద్రియములెగా
వీరు తమ్ములును నీ యందు భక్తి ఽ జేర్చిన భద్రగతి నమరువార

వా డభేద్యుండు పురము యట్టిదియె ఽ తోడుసైన్యములు అక్షౌహిణీశత
మేడ ? ఈడందరాడు మనసేన ఽ పోడిమి నీకగు నేడెటు దాకగ
జోడందెదనో యాలోచింతును ఽ వాడు ఘోరసంగ్రామముఖుడైన
ధారుణిని శూరులెవరు మిగులుదురు ఽ గారియ గూర్పగ మనమున రోయుదు
క్రూరుడను నొక్కనికి పెక్కండ్రను ఽ దారుణమును గూర్ప జంకనున్నాడ
నీవు భీమార్జునులు జా లనుటయు ఽ కేవలము నాకు యోచనీయంబె
పావనమూర్తీ ! యుపధి నరయుదము ఽ త్రోవ నెరుగవలదే ! నరకాంతక !
ఈ విధి గమనించుట లోపమేమి ? ఽ నావుడు నగవున ననె నగధరుండు
యదుసింహుడు కురుసింహులు వీరలు ఽ గద గాండీవము లంచిన ధీరులు
పదిల పరాక్రమ దండిదండులను ఽ ముదితమనస్కుల భీమార్జునులను
గదియ జేర్చుకొని త్రేతాగ్నులవలె ఽ నెదుర నిలిచి ధర్మజు తోడ ననియె
విజయుడు జయంబు బలము భీముండు ఽ గజిబిజిని విడువు నే నీతి నిధిగ
రజని చరహృదయుడగు వాని దునిమి ఽ రజతశైలవాసుని దయ వత్తుము
జనము పనిలేదు సేనలును వలదు ఽ ఘను డుద్ధవుండు బుద్ధిబృహస్పతి
నను వెరిగిచెప్ప నాచాలు మాకు ఽ ననుకూలం బది వివరింతు దెలియు
విను జరాతనయు డర్చించు ద్విజుల ఽ ననుకూలమిచ్చు కోరినను వారి
యని వేడెద మటు వేసముల మేము ఽ జనము వదల రొక్కరునితో బోర
ననిలసుతు డద్దురాత్ముని దునుమును ఽ మునుముందు దీవెనలు గూర్పు మమ్ము

## —: శ్రీకృష్ణ భీమార్జునులు జరాసంధుని వధింప బోవుట :—

సెలవొసంగుమన నలరున వారిని ఽ గలయ జూచి దీవించె ననుమతిని
వలయు భూషణము లన్ని యొప్పించె ఽ వెలసిరి ముప్వురు మూర్తిత్రయమువలె
యల పెద్దల మొక్కియును నట వెడలి ఽ తలకు బో జిమ్మి ద్విజవేషములను
గిరివ్రజము జొచ్చి యం దతిథిపూజ ఽ లరయ జరాసంధుని గాంచి నంత
నరనాథుం డవ్వారి పూజింప ఽ త్వర గన్నప్పుడు అరమర సేయక
ధరణీనాథ ! మము నీకీర్తి వినియు ఽ నరుదెంచితి మని దలతువ యేని
వరుస మాకోరికను విని సేయుము ఽ కర మది యశంబు మాకు విదిత మది
నరపతి యతిథుల నర్చించు నతడు ఽ సురలోకగతుల సుస్థిరత నందు
వరుస దొలగు దురితంబులు పెక్కులు ఽ కరము నిహంబున యశము చిరంబగు
పురుషుని కాయము స్థిరము గాదయ్యా ఽ ఉరుతరపుకీర్తి చెడ దెవుడయ్యా !
ధరను వ్రతపటిష్ఠుడవు నీవయ్యా ! ఽ సరణి పరలోకసుఖ మెంచు మయ్యా !

వరము గొంటివా ? హరుచేతనయ్య ! ఽ ధరణీశులలో ఘనుడ వీవయ్య !
కరము మము గారవింప దగునయ్య ఽ నిరవుకొను లోకహితము సుమ్మయ్య !
అడిగిన వృథ సేయడు శిబి నా డా ఽ యొడలు గోసి యిడె యతిథి సమర్చన
నుడి దిడుగ లేదె యింద్రాగ్నుల యెడ ఽ కడుకీర్తి నేడు మనియుంట నిజము.
వడి నడుగ నిచ్చె దధీచి తనువును ఽ వెడసేయక యా ముని బొగడ్త గనె
రంతిదేవు డావంతయు గొంకక ఽ సంతసమున బూజించె నతిథులను
ఎంతు మతని నిప్పటికే మనమెల్ల ఽ కంతుజనకు మందిరము తా నందె
త్రిశంకునూనుడు నిరంకుశంబున ఽ యశంబు గాంచెను నతిథి నర్చించు
వశంబె మోక్షం బతనికి సిద్ధము ఽ దిశల్ వెలయు నాతని నామ మిపుడు
విను ముంఛవృత్తి ద్విజుడు తనసంతు ఽ యునయ మతిథి పూజను గాదె ముక్తి
గనుట నరేంద్రా ! భూసురవ్యాజము ఽ నను దాన మిడుట కరతలము ముక్తి
యన జరాతనయు డెల్లయును వినుచు ఽ ఘనులు వీరు బోధింపగన్న యా
ధననాథ సఖుని రూపంబులోకో ! ఽ యనలు లేనో ! వనజాక్షమూర్తులో !
అనఘుల వీరల జిన్నపుచ్చ నని ఽ మనమున దలంచె భీకరము జూడ
మనుజపతులు గాదోచు వాక్యముల ఽ గనిన హితంబో ! గరిష్ఠభూసురు
లన దోపు వీరు కృత్రిములేనో ! ఽ నను సంకుచితం బొక పరీక్షం బొడమె ;
మనమున విచార మందిన ఘనంబు ఽ ననువొందు వీరి నాదరించు టే
హితము గద నాకు క్షితియశము నిండు ఽ మతిని బరికింప మాయ మును గనును
సతతైశ్వర్యము గనుపించు తనువు ఽ వితథంబే గద శాశ్వతము నేడు
గతి మలపు టొప్ప నాకు నిదె యదను ఽ అతుల పదము నాకబ్బు నిశ్చయము
వితత వ్రతుండు బలి యను దనుజేశుడు ఽ అతిథి వామనుడు గోరినది యిచ్చె
యతి వినుతుండు హరి వంచించు టెరిగి ఽ యతడు తలపు మరలించడుగా డా
ముందే దీక్షను బొందియుంటి గద ఽ ఇందున జేరిన యతిథు లడుగునది
తొందర గూర్పక నందింతు ననుచు ఽ సందియం బిప్డు వడయంగ నేల ?
వినికిడిని క్షత్రబంధుడను రాజు ఽ తనప్రాణము లర్పించె భూసురుల
ననయార్చనమున తా భవ్యపదము ఽ గనగ నేనెంత నాబల మదెంత
గన నే నొసగెడి దానం బదెంత ఽ విన పిన్నగాదె వారల ప్రభలకు
మును వృత్రహిరణ్యాక్ష రావణులు ఽ మనుజపతులలో కార్తవీర్యుండు
వేనుడువాలుషులు నేమిగా లేదా ! ఽ నేను జింతించబోలదు మ్రొక్కుచు
నిత్తు నాప్రాణమైన నీశ్వరుని ఽ చిత్తమును బొత్తు గూర్తు సత్తమని
తత్తరం బడగ మొత్తని పల్కుల ఽ హత్తిన దృఢమున నా వారిగాంచి

భూరిగుణులార ! సారమతులార ! కోరు డేమైన కాదన కిత్తును
మీార నేనాడు మేత మహాత్ములు § చారభేదంబు గూర్పరు నామతి
ఇది తనువు మనము ధనము సకలంబు § కోరుడు గననేల శిరమైనసిత్తు
మదిని వెలిబుచ్చు డింక మరుగేల § ముదము మిము జేర హితము పెల్లుబ్బ
నాకు చీకాకుఁ దొలగు మీా కరుణ § వీక మాన నిశ్చయము వ్రత మిదియు
ఆ కమలాక్షుడు సవ్యచు నాతని § ప్రాకమున్న యుశమందు పదంబును
నిచ్చ మెచ్చి యికవిను మనుజేశ్వర ! § ఇచ్చితివి జిహ్వ రుచిమించు వాక్కు
బాచ్చెము లేదని ముమ్మారు దెలిసె § సచ్చరితవుగా జెరుపవు సుమ్మని
రణభిక్ష నిమ్మ ఘనుడ వొక్కడవె § పణముగా దాకవలె మాలో నొక్కని
తృణముగా నిన్ను గెలువ వచ్చితిమి § రణమున నుదగ్రుడితడు భీముడగు
నను నెరుగుదువా నాప్రాణ మితడు § వినుమ విజయుండు నేను కృష్ణుడను
ఘనత గలదేని మంచిదిగాదా ! యనుము మాటయే పొల్లొక్కటి యగు
మించినది లేదు సామ్మ్రమి బోదు § కొంచెము పనిగా నెంచి యేగెదము
అంచితము సందుటను జారెదింతె § సంచిత కర్మము చాలు మాటాడు
మనిన వికటితవు హాసము నొనర్చి § నిన్ను దెలిసినాడ ముందె కపటుడవు
వసుసటు నెంతువా ! మాగధభూవరు § జెనకవచ్చితివె ! గోపబాలకుడ !
నీవు నావాడి నెరుగుదువు గాదె § తోవ దప్పంగ బారలితిని ద్వార్లి
నీ వడిగంటిని పాండునందనుల § నేవిధినో మోసగింప దాసితివి
నీ విశదమెల్ల వారెరుగబోరు § కావున నమ్మరి యుండు పెక్కుల
కేవలము మధుర విడిచి యబ్ధిలో § దీవి గనినట్టి నాడ వొక కొంప
ఛీ తొలగు నిన్ను వీరుడనను నే § ఈత డర్జునుడు చిన్న నా కగుటఁ
బ్రీతిఁ గనను బోరుటకు సరిగాదు § చేతు సమరమును పవమానసుతుడు
నాకు సముండీ బకవైరియ యగు § మా కడిమిజూచుచుండుడు మీారలు
ఓ కుత్సితహృదయా ! పొరుబోత ! § రాకు మాబోటివారిని ఢీకొన
నని యతనికి గదగైకొన నిచ్చియు § నని భిక్షనెల్ల జెప్పె జనపతియు
తనయు సహదేవు నారాజ్యమునకు § జననాధునిగాఁ బట్టము గట్టియు
ఘనులు నల్వురును వనితలంబునకు § దనరు వీరతను డాసియు నిలిచిరి
పవనసూనుండు మాగధేశుండు § దవిలి రుగ్రతను దృష్టివేగమును
చెవులు చిల్లుమన్న పెడకేక లిడుచు § తవిలి రప్పళించుటకు నూరువుల
కొండలు రెండును మదధుల యుగంబు § దండి మదంబుల కరుల యుగ్మంబు
గండున రేగిన యుగ్రసింహములు § నిండుగ బలిసిన వృషభముల తోడు

డుచున్న దవదహన ద్వితయంబు | చండతీక్ష్ణతను భాను లిరువురో
వ గదిసి గదల నగ్నికణంబులు | వినువీధి కెగయ బరిఢవిల్లుచును
వునను దాకుడులను గుడియెడమ | లను ద్రిప్పి మోదుకొనుటలో దారు
ు పెద్దదిగా సింహచంక్రమణ | మమరగను బాయుచును డాయుచు మరి
పము పొరవడక వ్రేటు దప్పకొని | యమితరోషమున నప్పుడే గవిసి
ల తాకుడుల పటపట ధ్వనులు | గదియు భయము దెసలను మింటగవయ
ుటు ధరణికి గూర్చి మరి గదిసి | చదియ మేనులను సూటిగ మొత్తుచు
విట్టులగా బృహద్రథాత్మజు | డటు కేకవైచి ప్రభంజనుని సుతు
తలము పొంచి గదద్రిప్పి వైవ | చటులతను గనక నతడట్టె ఘూర్జ
ిత నిడి తనదు గద వానిశిరము | నను లక్ష్యముంచి విసరినంతనే
నరున దప్పుచు బెబ్బులి బెబ్బులి | కినుకరేగి యొక టాకటి గ్రమ్మనటు
లు మూపులు ప్రకోష్ఠములునుగా | అపగిది వక్షముల ప్రక్కలునుగా
నేపుగన గండుగ మొత్తుచు | ప్రాపు దాపు గాననీక పీకచే
ుగిది గదల తాకున మేనుల వాపు | గదియ వ్రణముల శోణితమ్ము
ధారగా నిర్ఝరమ్ములను | పోకడ కడు భీకరము చూపటకు
ిక దడిసి సొమ్మసిలుట మరియును | ఢీకొనుటలచే మరిమరియు మూర్ఛ
బొందుటయును వడి దెలివినంది | మును ముందడుగుల వేయ జంకకను
ంగదలు తునిసిపడ చూర్ణములై | మనముల క్రోధజ్వాలలు రోషము
వెడలి పైని బడగ దూకినటు | ఘనపౌరుషముల పురుషసింహు లిట్టు
ల్లయుద్ధమును జోడును గాంచిరి | యాహవంబు రోషావహంబుగా
ిటింపను వద్దెందునను గనక | ఊహూ ఆహా యను హుంకృతులను
ారులు ధనము నాసించు నట్లు | లాహిరులను దోగుచు రణవిజయము
ాభూషణముగా మది నెన్నుచు | నాహారంబు దీపింప ప్రాణముల
ున మెట్టుల దప్పింతు మనుచు | బిట్టున పిడికిళులను దిట్టముంచు
ంపు ముష్టి ఘట్టనంపులను | అట్టె గజతుండముల బోలెడు భుజ
మీది కెత్తి శిరముల మూపుల | నలభ్రూమధ్యంబుల పెడతల కత
మెడల మరములను బాదినంత | కలవర మందుచు గాలు నేతులను
ను కొద్ది తన్నుచు నవి గూర్చుచు | తలమిగిలి నుక్కు దక్కకను మరియును
క్కులు నక్కిళ్లను చెవులు చెంప | లొక్కట డొక్కలు పక్కలు ప్రక్కలు
క్కగ నవియగ నెత్తురు లొలుకగ | గ్రక్కున నోరుల గ్రక్కుచు దాక్కొన
నక తూకుచు వడకరు యనికి | అడలు నొడలంద నె న నడలకను

దడదడ గూడియు దడబడ రుగ్రత § వడుపులను వజ్రసన్నిభపు పోటు
లను బడలి జేవురును దాల్చి కొండకలను నార క్తము దోగిన ఛాయల
మునిగి యుండగా చండకౌశికుని § ఘనమైన వరము కలిమి నానాట
దన దుష్టమదము పెంపున దరగగ § వనజనేత్రుండు తనదు దివ్యమగు
తేజమున భీము నావేశించగ § రాజిగాంచె పవమానతనయుండు
ఆ జరాతనయు డాజినింగూలు § నోజ పుడమియును దిర్దిర దిరిగెను
పిడుగులు వడియెను ఉడుగణమువ్రాలె § జడధులు గలగెను జడిసె జీవాళి
వడువు గాంచి భీముని చూడ్కి నిల్పి § వడి నొక్క శాఖ దనచేతబట్టి
ఘనమైన సన్నగా గృష్ణుండటు § యొనరుగాఁ జీల్చి పడజేసి విసరు
టను నది గాంచెను గాండీవియన్న § అనలాక్షునివలె నట్టి మరి పెరిగి
మగధభూపతిని పడవేసి కాల § బిగువుగా నదిమి వాని కా లొకటి
జగదవను నందనందను జూచుచు § దగనతని జేర్చి దంతావళంబు
చెలరేగి తాళతరువు జీల్చువటు § తలగె నుత్పాతములు వానిశిరము
వలకడ గాగా ఫెళఫెళ మనంగ § నిలువుగనక జీవముల వాడు విడె
అలరున దేవతలందరు గూడిరి § జలజాక్షుడు భీముని కౌగలించె
విరులవృష్టి వారిమీద గురిపి రా § సురమానియు సంతోషము జెందెను
అతనిసుతుండు సహదేవుడు శరణని § నుతిసేయగ మన్నించి చెరనున్న
క్షితిపతులనెల్ల విడుపున గూర్చిన § నతులమోదంబునను వారందురు
శిరములను కేశములు జడలు ముడులు § వరుసగొని మాసి తనువులు గృశించి
యురయ మురికివస్త్రముల జండెముల § కరము రుచిమాయ ధూళిదూసరిత
మైనట్టి గాత్రముల సోలునంద § కనకాంబరుగన ప్రజ్ఞను గనుచును
శరణు శరణు శరణయ్య! మాధవా! పర విరతిశయము శ్రీనిలయ! నీకు
నిరవంద్యుండవు నైర్మల్యత నీ § పరమందును గురుకరుణాసాగర!
యనుచు నతి వెలయ నా గోవిందుని § గవవచ్చి గాంచి రా జనార్దనుని
తామరసనయను శ్యామాకారుని § తామరసగర్భ జనకు రమాధిపు
కామకోటి సుందరుని గృపాళుని § భూమిని లీలామానుషుండైన
స్వామిని విష్ణుని దరహాసితవదను § హేమాంబరధారుని జగదీశ్వరు
కనక మకుటు మణిమంజీరహార § ఘనరత్న కంకణాంగదభూషితు
దినకోటి తేజు నిత్యు నచ్యుతుని § వనజాసనేశ వందితచరణుని
కవనింద్రవినుతుడైన మహనీయు § ఘను మురనరకాసురాది దుర్మద
హారణుడు విముక్తకారణుడు గృష్ణు § నరసి పదములను సాగిలి మొక్కుచు.

కరముల మోడిచి శిరములను జేర్చి § ధరణి మోకరిలి దానవభంజన !
పరమపురుష ! దురితాపహా ! భవహర § నిరుపమాన ! వరదాయక ! కృష్ణ !
వరద ! కరివరద ! వసుదేవసుతా ! హరి ! పద్మాపతి ! యాదవకులమణి !
పావనమూర్తి ! భద్రచరిత్రా ! § దేవ ! దేవకీపుత్ర ! జగన్నుత !
నీవ మాకిపుడు జీవదాతవై § మావిరోధి మాగధుని పవమాన
తనయునిచే జంపించి మనిచితివి § విను మీ పుణ్యులు మా నతులకర్హు
లును నినునమ్మిన యనఘులు నిజంబు § మనుజావతార ! మాకేదియాజ్ఞ
గన గంటిమి మా పురబాంధవులను § తనయుల వనితల తల్లిదండ్రులఁ
ఘనతర వైభవ కారుణ్యనిలయ ! యనిన జననాథులను రక్షణీయు
లను నసమచిత్త శాంతసంయుతుల § తనభక్తవరుల గరుణ దిలకించి
ఘనతర దక్షిణ హస్తమున నభయ § మును గూర్ప జూపె నంత విజ్ఞాన
మున గూరుమతిని మరి నుతించి రట § మునిహృదయగోచరుడవు రమా వేద
వినుత మార్గసంచారాంతరాత్మ ! § ఘను డవాచ్యుడవు భువనముల కుక్షి
నొనర నీమాయ లీలద్రిప్పంగ § మనమున సంకల్పము మాత్రదోచు
అమనస్కయోగమూర్తిగరిష్ఠా ! § విమలభావ ! విశ్వంభర ! యింతకు
సమదాభిరతుడు కుమతి మాగధుడు § మము బంధనమున గూర్చె నంచును
భ్రమనంది దూరుచుంటి మటు గాదు § క్రమమిది బోల్పగ బంధవిదూరుని
నిను మది మమురక్షింప చింతింపు § టను యోగమంద గూర్చుటను దోచె
ననుకూలబంధు డని యాపట్టున § గనగ పరబ్రహ్మము నీ వెన్నగ
మనుజపతుల మన సార్థకంబేది ? § ధనమదాంధతను వనితాదిమమత
లను నాస గొనుచు నిదె సుఖం బనుచు § కనులకునెగాక మనమున విచార
తను గూర్ప నస్థిరముల నెఱిగియును § వినికి మును వెనుకలను శాస్త్రములను
దనరు ధర్మముల పెడచెవుల జొనిపి § మునుగుట తేలుటలను నభిమానత
గని ఘనమేదో యిందుగాంతు మని § జనుడు పిపాసను నెండమావులకు
జనెడు మాడ్కి నీ సేవామృతమును § దనర గ్రోలకను బారు దుర్మతిని
విను పురుషోత్తమ మమ్ము నీకరుణ § గన భక్తిమనమునను నిలుప వరము
గనజేయు చాలు సంసృతి నొల్లము § నిను గీర్తింపగ నానందమబ్బు
ననవారి కనియె వారిజనయనుడు § మనుజపతులార మెచ్చితిని మిమ్ము
నను శరణమనుచు ధన్యత గంటిరి § మనము సాత్వికమునను వర్తిల్లిన
ఘనులకే నేను దోతు చిత్తమున § వినుడు ముదంబున మునుకాలంబున
నరపతులు నహుషుడును వేనుండును § పరయశంబునను నిలిచి రెన్నాళ్లో

సుర వైరుడైన రావణునిసాటి ఽ నరయుడు చిత్తములను నెమ్మదినీ
ధరణిపాలింప నేగుడు న్యాయము ఽ పరమును దలంచి నాకునూ బ్రీతి
కరమగు యాగము లెన్నిక బొనర్పు ఽ డరయుడు సజ్జనుల మనుపు డొప్పులను
నను ధ్యాసింపుడు పాపరహితమతి ఽ మును ముక్తియొలభియించు నని చెప్పి
వినువారికి మంగళవేష మొప్ప ఽ మనములు జెలంగ స్నానాంబరమణు
లను గూర్పుగన్న భూషణంబులను ఽ ఘనమైన రుచుల విందులనుగూర్చి
ఘనత నట్లందు కరితురగాదుల ఽ ధనసత్కారములను బొంపుపఱచి
యును సకలంతులుగా పంపించిన ఽ వనజనాభు ననుమతిని నెలవులకు
శౌరిరి బంధులతో నెల్ల జెప్పి ఽ వారిజాక్షు నేమరరు ధ్యానగతి
జనవరా ! కృష్ణుడును భీమార్జును ఽ లును నహదేవుని పూజల నంపుచు
నొనర రాజసూయమునకు రమ్మని ఽ వినగ నాజ్ఞనిడి ధర్మజుని గాంచ
జనవినుతకీర్తి రాజుల వచ్చిరి మనమున ముదమున నుద్యానంబున
పురసమీపమున నిలిచి శంఖముల ఽ కరలము ధరించి వరుస బూరింప
సరగున వినిరది ధర్మజుండాది ఽ నరవర్గంబులు జరాసంధునిఁ
దునిమి విజయమున వీరిరాక యని ఽ మనము లుప్పొంగ మంగళపరముల
ననుకూలమంద నెదురుగా నంప ఽ గను గదియవచ్చి వందన మొనర్చి
మనమానంద రసాబ్ధిముంపగా ఽ గన వశమందిరి ధర్మజు కౌగిట
జనవినుతముగా నామువ్వురట్లు ఽ వినిపించిరి తమవైన చర్యలను
వినుమా యభిమన్యునిపుత్ర ! యింక ఽ ఘనత రాజసూయాధ్వర యత్నము
వనజనాభు డాహ్లాద ముప్పొంగ ఽ ననియె ధర్మజుడు వదనాబ్జమువిల
సన మందగ యే మానతి యిప్పుడు వనమాలీ ! వనజాసనాది దిక్
పతుల నీయాజ్ఞ నెరపు దేవుడవు ఽ సతతదీప్తి జెన్నొందు పరముడవు
మతి కళేబరము గలజన్మ సుకృత ఽ రతులక యబ్బును యతిజనభోగ్యం
బతుల సుఖాస్పద మైన నీసేవ ఽ లతి నతి నుతి పరిపాటి మెలంగిన
వారు వారిసఖ్యులు ననువారును ఽ గూర రఘుంబుల నట్టి మహనీయు
లరుదుగా నిన్ను గను దేవుండవు ఽ వరమహనీయా ! నను కీర్తిసింప
సరణి నింతువా పలుకులచే నను ఽ కరము పవిత్రుని జేతువు మాధవ !
వనజాక్ష ! చిన్మయాద్వితీయహరి ఽ మునినుతచరణా ! ఓ రమారమణ !

**-:ధర్మరాజు చేసెడు రాజసూయంబునందు శ్రీకృష్ణుండు శిశుపాలుని వధించుట:-**

యని [illegible] నుమతి నందియు ఽ ఘనుల పరతత్త్వ విజ్ఞానధనుల
గని [illegible] తంత్రజ్ఞ నిపుణు ఽ లను భూమిసురుల [illegible]లగా

వరించి జగతిని మాన్యుల మానుల । నరేంద్రులను భవ్యుస్నానరు దేశ
పరిభూషితుల సత్కారమంద । త్వరగని రమ్మన నెల్లరు వచ్చిరి
వరమతి సాత్యవతేయ కశ్యపులు । భరద్వాజ గౌతమ సుమతికణ్వు
లును పైల మధుచ్ఛంద భార్గవులు । ఘనుడు వశిష్ఠుడు వామదేవుండు
వినుమటు జైమిని వైశంపాయను । లును క్రతువు పేరసేవ గర్గులును
జనవినుతు డత్రి భార్గవరాముడు । వినుమరియు జామదగ్ని ధౌమ్యుండు
ఘనులైన కృతవ్రణ సుమంతులును । ననలహోత్రు డుపహూతి మైత్రేయు
లును నధర్వ కవషుండు లసితుడును । వినుమింక కవియు త్రికవ్యులాదిగ
మునులు కృప గురులు గురుతనయుండును । జనవర ! గాంగేయుడు ధృతరాష్ట్రుడు
విదురుడు సుయోధనాదులు కర్ణుడు । యదువంశమండనులు బంధువులును
చదురంద సర్వ నృపవైశ్యశూద్రు । లెడల దోచు నబ్బురపు కానుకలను
పరిమితము కొలది నిక్క వేగొనుచు । సురుచిరాలంకృతులునై చేరిరి
కరము కనకంపు హాలముల సవనపు । ధరణి దున్ని పూజితవ స్రుచయుము
వగమతిని గూర్చి స్వర్ణమయములగు । సవనోపకరణములు వలయునన్ని
సవిధానపరత గూర్చియు దీక్షను । ప్రవిమలభావుం డజాతశత్రుడు
దివిజగణమలర దాల్చె పరిశుద్ధి । భూపతు లొసగెడు నుపాయనంబుల
నోపి చేనంద రాజరాజొప్పు । ఆ పగిదిన నర్థులకు గోరినటు
ఏపున దానం బొసగ గర్ణుండు । జూపట్టె సంతసమును మది గాంచి
బానసాధ్యతతో పదవిపాకముల । వేనవేల భోజ్యముల నందింప
తా నొప్పుగాంచె పవనతనయుండు । బూనె కృష్ణపరిచర్య నర్జునుడు
తానధికారము వహించె నకులుడు । ధాన వ్రతయు సర్వముల దెప్పింప
తా నలరందెను వచ్చువారలకు । మానితము గూర్ప సహదేవుడయ్యె
యొనరుప సరసాన్నమున తృప్తులుగ । జనులు మెలగాడ ద్రౌపదియు నొప్పె
వనితల ముత్తైదువుల సత్కార । మును గూర్ప భానుమతి మొదలు కౌర
వుల సతులు చాలి యుండ వికర్ణుం । డల విదురపుత్రద్రను లాదివారు
వలయునన్ని కార్యముల తోడంది । కెలసవము గూర్తు రందరు మెచ్చగ
హరి శిఖియును నైరుతి వరుణులు మరి । కరువలి ధన దీశానులు ధాతయు
సురసిద్ధసాధ్యచారణకిన్నర । గరుడోరగ ప్రముఖులు నేతెంచియు
వరుసవిధుల వర్ప్రీతులై మెచ్చుచు । ధరణిని నిటు వైభవయుక్తముగను
వరమతులింతకు సవనంబుల నిటు । కరము క్రొద్దగొని నేరు రని బొగడి
హరి యిందుపూర్ణ కరుణ నివసించె । వరము డింపు పూజింప నాచికొని

కరము మము జెందె కుతుకము గాంచుట ఽ యరుదు ధర్మజుని రాజసూయంబు
క్షితిని స్థిరయశము గాంచు గాకంచు ఽ నుతిసలిపి రంత విధివిధాన మం
త్రితతుల భూసుర జనములు ననలుని ఽ స్తుతిముఖంబుగా ధర్మజునిచేత
క్రమత వ్రేలిపింపగ క్రతురాజము ఽ విమలతరంబుగ కడకపూర్తి గనె
నమలభావులను సదస్యులందున ఽ శమదమయుత గుణమూర్తి నొక్కనిఁ
తొలుత బూజింప నుచితమగు ననుచు ఽ పలికిరి పెద్దలు భీష్ముని ముఖమున
నలరున మానుబ నృపవరులజూచి ఽ విలసితవర్తనుడౌ యుధిష్ఠిరుడు
కలయజూచి సభవారినమ్రతను ఽ దెలియవచింపుడు నను మన్నింపుడు
అందరు విజ్ఞులె అన్నివిషయముల ఽ యందు మీరు శాంతించి యొక్కరుని
అందమంద వినుపింపుడు మ్రొక్కెద ఽ నందింతు పూజ తీవ్రత గొనకుడు
నావిని పితామహుండు తమకైన ఽ పావనమతియని భీష్మ ననుమతిని
దేవ భూదేవ నృపమండలి విన ఽ నీవిధి నాడెను సహదేవుం డట
చేయిజూపి తన వ్రేల శ్రీకృష్ణు ఽ డీయన మానుల హృదయధ్యాననిధి
యీ యజునిగన్నతండ్రి పరమాత్మ ఽ వేయునేల యజ్ఞముల నీతనిని
కాగూర్చి సలిపి రాదినుండియును ఽ నీ గరిష్ఠగుణునే యింద్రాది
గాగ సురలు ఋషిగణములు రాజులు ఽ యాగమును యాగమంత్రములు యాగ
ఫలము యాగభోక్తముగా గాంతును ఽ ఫలవాంఛలేక నర్పింతురుగా
ఇలయు జలము తేజంబు పవనంబు ఽ నల నభంబు మహాదాది ప్రకృతియును
కలయిక సర్వ భువనములు నీతని ఽ వలన జనితములు జగముల జనకుడు
గురుడు గురులకును పరముల పరంబు ఽ వరుసగన కాల కర్మగుణంబుల
తరముగన్నట్టి యనంతు డాధ్యుడు ఽ పరమపుణ్యాత్మకుల కల్పముగును
జననస్థితిలయ కర్తయాతండు ఽ వనజభవరుద్ర విష్ణు లన నితడె
కనులపొంకమున జగములు వెలుంగు ఽ గన నితడె యాగజపతపంబులను
ఘనుల దురితముల నడిచి ముక్తి నిడు ఽ అనఘమూర్తి మరి మోక్షసంఘాత
ఇతడే యర్హ్వాం డగ్రపూజకును ఽ మతిమంతులెల్ల నొప్పుదు రిందున
మతివిహీనులది గనరేమొ గాక ఽ యతివినుతిని హరి మ్రొక్కి చెప్పితిని
సతతయశం బొడగూర్చు ధర్మజుని ఽ మతికెక్కువాడు పరమేశ్వరుండు
యని బల్క ధర్మజుండు నందజును ఽ వినుతించి గృష్ణుసన్నిధిఁ జేరి
ఘనుని నాగమోక్తపు విధి పూజల ఽ దనర జేసి గంధాదుల సుమంపు
హారంబుల మణిభూషణంబులను ఽ సారరుచి వెలయు దివ్యాంబరముల
నారికేళఖర్జూర దానిమ్మ ఽ చారుతరపు కర్పూరకదళీఫ

లములాది సర్వముల నుపహారము లమల మతి నిచ్చి హారతు లొసగుచు
సమమతి నందఱు శ్లాఘింపఁగృష్ణు క్రమత బూజింప జయశబ్దంబులు
రాజినది యా రాజసూయంబు తేజసంపూర్తి యాయె నని బొగడ
రాజవినుతుఁడగు యా ధర్మరాజు భ్రాజితుండగుచు నానందంబున
కరములు మొగిడిచి శ్రీదేవుని నిటు పరమగీతముల బ్రార్థన సలిపెను
నరనాథా! విను గాన మయ్యదియు పరమ భద్రదాయకము విను మదియు

—: దండకము - 'శ్రీరాగము - కురుజంపె' :—

శ్రీనాథనాథా జగన్నేత! ధాతామరేంద్రాది మౌనీంద్ర సంస్తూయమానా
ప్రతాపంబు నానీస్వరూపంబు ధ్యానావరిష్టంబు నానంచు నెవ్వండు నీదైన
రాజీవ సత్కాంతి నొప్పారు నిత్యముండెందు పాదాబ్జద్వంద్వంబు హృత్పద్మ
మందుంచ గాఁ బొంద నర్పించు భవ్యుండు వాడాత్మ విద్వేషులఁ జెందు చక్రంబు
నాభీల దైతేయ వ్రాతంబులఁ ఖండముల్సేయు నట్లేయ ఘూర్ణిఁబడఁ ద్రొబ్బ
నేదివ్య మూర్తిభ వచ్ఛక్తి రూపింప వర్ణింప శేషుండు జాలండు గా దేవయోగీంద్రు
లుద్దామనీమంబులఁ దాల్చి యేకాంత తఁ నిల్చి నిష్కల్పపరిపూర్ణంబులం దంపంబు
గిఁసల్పి యాదిత్య బింబంబు లోనున్న రంధ్రంబు మార్గంబు గా సత్య
లోకంబు యాబ్రహ్మ కల్పాంత వాసంబు గానిన్ను నైక్యంబు నాకర్ష తఁ జెందు
యోగ్యంబు నఁ గాంతు రోయీశ సర్వాఘ నాశా! పరేశా! యనంతా!
హృషీకేశ! నీదివ్య లీలావతారంబులఁ భక్తి ధ్యానింతు నోపాప విధ్వంస
మానాతి మానాప రబ్రహ్మ వన్నంబ రేసుండ వన్నంబ రంజ్యోతి వన్నంబ
రాశక్తి వన్నంమ హాత్మ్యల్ మరింబెక్కు నామంబు లఁమంత్ర పాఠంబు
గాఁగూర్చి స్తోత్రంబు గావింతు రోశాంత మూర్తీ! విహారంబు నఁదోప మూర్తిత్రి
యంబాత్మ త్రైగుణ్య తందాల్చి బ్రహ్మాండ భాండంబు లఁనిర్మితంబుఁ గావ
డింగూర్తు వాకుంభ కారుండు కుంభంబు లఁ బెక్కు గాఁగూర్చు తీరిఁన మస్తంబు
లుఁ నీదె సంకల్ప మీవేజ గత్సర్గ మీవేజ గద్రక్ష నీదేను కర్తృత్వ మిచ్ఛావి
నోదంబు గానీవు లోఁగొందు వౌశైట వెల్లింతు వేల్లప్పు డఁనిద్ర లేకుండ
యున్నట్టి నిఁయోగ నిద్రింద గఁగూర్చి యోగీంద్రు లెల్లెల్ల బల్కంగ నాదబ్బ
రల్గూర్ప నాగాన దేవాధిపా! నీవె యన్నింటి కిఁజాలి యుఁబుద్ధి నింపొందు
మా యా వి లా సా కృ తిఁ నిం డు మా యా వి మైనీవె మాయావి
దూరుండు మాయావి దారుండు నాచిత్ర రూపంబు లెన్నైన యేకత్వ మాయుద్భ

వస్థాన మాశ్చర్య మొప్పారు నేర్పందు టల్పాడి దప్పంగ నీకుంట శేగాజ
గద్వీప కాగృష్ణ రాధర్మ సురక్షణానిత్య కల్యాణ సంపూర్ణ శ్రీరామ కామాయ
చింత్యము నీనిశ్చ యంజేదొ గాంచంగ నెవ్వారి కింగాదు యావేల శీర్షండు
నొనాల్గు వేదంబు లొజాల వన్నొమ రేలాపె రల్సెప్ప వీలాసు సంఘాభి
లోలావి శేషించి వాదంబు లొబూన నేలాస దాన్యాయ పాలాహా రీవాసు
దేహాది వ్యూహంబు లొనీవు నుత్పత్తి కంబుల్ని గుడ్పంద దార్ఢ్యత్వ తొగన్న
మేటీజ టేండ్రుల్వి నముల్భ వత్పూజ గావించు కాలంబు లందొప్రి
పుణ్యాత్మ కుల్వారు నెవ్వేళ బోధింతు నీయుజ్వ లోద్భూత దివ్యావ తారంబు
లన్దేవ యాకల్ప మందాది యజ్ఞంపు పోత్రింబ వైధాత్రి వీరంబు నొమున్గ
నీకుండ నీకొమ్ము నొదాల్చి యందేవి రోధంబు గొన్నట్టి కూర్రొహి రణ్యాక్షు
బీరంబు జీవంబు మాయించి యాగంబు నొధారు జొబ్రోచి కామొక్క
కాలంబు నొమత్స్య రూపంబు నొదైత్యు వేదాప హర్తత్వ దామ్యొవ
దిగాంచి వేదాని పేచంబ డంచంగ యావేళ నావేద ముల్ధాత కీయంగ నీనొప్పు
టొరోచి గన్పట్టి నాబ్రహ్మ వేకొక్క చందాన కూర్మంబ వైమంద రాగంబు
వీపందు చిందాడ మోదంబు నొక్షీర వారాశి లోనండ యింపొంద లీలొప్రి
వర్తిల్ల కాలిందు లేనట్టి మందంచు మోదంబు నందేవ తల్దాత్రి వయ్యాన్న
యాసత్పు ధాబీజ మూలంబ వైయట్లు పోషించి తౌవారి నారాయ ణావిశ్వ
మూర్తీసు విజ్ఞాన మూర్తీవి కారాది శూన్యండ పంచ వింశమ్ము నాతత్వ
మూర్తి శివా! యబ్జనాథ! నృసింహా కృతిొ భీకరా కారతం దోప బాలొవె
సంబ్రోవ కాలంబు నొదైత్యు హేమాన్న నామ్ముం క దొజేరి కాపాట్టి వేషంబు
నొదాల్చి యాడాన వేంద్రొబ లిొజేరి దానంబు పాదంబు లేమూర గాసర్వ
మొలాగి యాంద్రొదు లొవీత్రి నందించి తౌభార్గ వుండన్న నామాఖ్య కాపట్టు
లైనట్టి భూనాథు లొకార్త వీర్యుండు పారంభ ముంగాయ నిొద్రోశ్య తేజంబు
నొమించి శ్రీరామ చంద్రుండ వైభీమ సంగ్రామ దేశంబు నొరావ ణుంవాని
తమ్ముండు నాకుంభ కర్ణొవ డిొగూల్చి యాదిత్య వర్గంబు మోదంబు నొదేల
పోలంది తౌనీవె యావట్టి దేవుండ వీవిప్పు దుొరాత్మ సానీక ముంభండ నోద
గ్రొదుంప సంకర్ష ణాభిఖ్య తొకృష్ణ రామాఖ్య లొజన్మ మందంగ మాలోంట్ల
బ్రోవంగ మానీంద్ర బృందంబు సామోద మందంగ నెల్లప్పు డేపారి నీభక్త
లంబోతు వానివు నీయాగ మందగ్ర పూజార్హ పీఠంబు నీకైయ టంచుొసు
వేదుల్ద గన్పట్ట బ్రహ్మర్ప ణంబంచు నీయజ్ఞ సర్వంబు నాయిచ్చ నీకిచ్చి
గాగామ్ము రమోశ వాయాశ రూసత్వ వేశాయహోపాహ నాశాయ హాసంస్తు

తేజోమయమహామూర్తి పాశాస్య రూపంబు తాధ్యాన ముల్ యర్చ్వ వంబుల్ యమహాచక్రిభూచక్రి భారావ మహోవృత్స వోత్సాహ మోదావ మహానిర్మలాత్మా!
నమస్తేనమస్తే నమః॥

ఈ విధమున శ్రీహరిని ధర్మజుండు । పావనంబు నుతి సలిపి యానంద
భావ ముప్పొంగ హర్షాశ్రువులను । కేవలంపు పులకలు తనువొప్పగ
మ్రొక్కిన నమరులు పుష్పవర్షంబు । గ్రక్కున హరిల మీద గురియించి
రొక్క మొగిని జయ జయ శబ్దంబుల । దిక్కుల తూర్యధ్వను లుప్పతిల్లె
వరుణహరిశ్చంద్రుల కంటె నితడు । కరము వెలుగందె నీ యాగపూర్తి
ధరణి చిరయశము నీతడందె నని । సురలాది భాగవతులు నిండె నందు
హరిని హస్తముల మస్తకము జేర్చి । వరద! ముచికుంద! వరద! కరివరద!
నరసఖ! నరకాసురవైరి! కృష్ణ! । హరి! విక్రమహరి! హరవినుతచరణ!
శ్రీరుక్మిణీశ! రుక్మగర్వహర! వీర! । జరాసంధాదివీర! హర!
ధారుణీశతిలకమ! పద్మనయన! । పరమపురుష! పురుషోత్తమ! నతులని
వినుతింప వినియె దమఘోషసుతుడు । కనులగని హరిని విభవసమన్వితు
మనము కసటుగొని రుక్మిణీశు డన । కినుక నసూయయు తోటుగ భ్రమగొని
చేతులెత్తి సభచూచి భయపడక । మోతలుడుగు డిక యాగ మిటు సెల్లె
కూతలిందు వినజాల నీచ మిది । రోత కొర్చితిరి సదస్యులందరు
స్నాతకుడు ఋత్విజుడు గురుడుగాడు । భూతలేశుడును, గాడు సన్నిష్ఠ
యూతగొనడు నియమంబుల హీనుడు । పాతకుడు! వీడుపాపిష్ఠియగును
నీతిరహితు డిట వీడేటి పెద్ద । పోతువలె నున్న వీని బూజించె
జ్ఞానులు పెద్దలు వృద్ధులు గరిష్ఠ । మానులు యోగులు ధర్మవేదులగు
మానవనాధులు ఎందరో యుండ । వీని గోపాల బాలుని పెద్దగ
మానహీనమతి పూజించె నితడు । కానడు కన్నుల న్యాయంపు చాలు
వీని బాగడు జిహ్వలు దునిసిపడవా । వీనిచర్యవిను చెవులు వ్రయ్యవా!
కానలేరొ దుష్కృముల గుణంబుల । వీని పుట్టుకను రోత నడవడిక
కామినిని జంపె గోవును జంపెను । భామినుల కొలిచి నట్టి దుష్టుండు
భూమి కేడిట్టి జారుడు చోరుడు । ఈమెయి హవిస్సు కుక్కల నక్కల
పా లందించిన చాలు పాండవుడు । నేలి రాజులకు ఖన్నత గూర్చెను
మేలు మేలంచు కూతురా మోసము । పోల నిండించె వాడు కుత్సితుడు
మటుమాయకాడు కపటి దుష్టుడగు । తటమెంచ పాపమొడిగట్టి నాడు
ఇటు వినుడు వీని కుటిల విస్తృతిని । దిటవున వీనిని జేల్పదగు నిందు

తలిదండ్రులెరో నిర్ణయము లేదు ఽ కులగోత్ర మెట్లో నిశ్చయింపదగు
తలపడు గురువుల దేవతల నల్లి ఽ నిలువున మతిహీనుడు మదము గొనెడు
ఆది యెట్లుండె యిపుడట్లనుండె ఽ భేదమే లేదు మధ్యముడు గాడు
పాడు నెరుగండు వావిని దెలియడు ఽ లేదు మానంబు మనము నంచనము
వేషములు పెక్కు దాలుచు జంకడు ఽ దోషముల పుట్టలగు పొట్టనిండ
రోషమున గూర డేపట్టునైన ఽ భూషణ కనర్హు డగు మరియు వినుడు
రాజుల పంచను గాచుకొనియుండ ఽ రోజులను గడపుకొను బూతులచే
గాజరతనంబు సాటిమన యొప్పు ఽ బూజ గప్పినకె మనల మోసమున.
దాసి మనమొసగు దాన బ్రతుకుగను ఽ వాని యోర్వకను వైరంబు రేపు
మీసము దీడును తన పొంకమెఱిగి ఽ కాసుకు జెల్లడు కటిక గుణ మనిన
వీనిదే గాదె మీ రొప్పితి రెటు ఽ దాన వాడుబ్బ గనుట నోర్త్తు మెటు
మానవపతులకు సాటి వీడెటుల ఽ వీని మద మడచు వాడ భీష్మండు
వీని హరి యనియె ముదిమి మదిదప్పె ఽ పూనిక నరయక నిట్టి పనికొర్చ
ఘనము గలదె యాగంబు వమ్మయ్యె ఽ నని పల్కు వాని దూషణముల విని
ఘనులు మహర్షులు ఋత్విగ్గణంబు ఽ జనపతులు మొదలు చెవులు మూసికొని
వినరా దిచ్చట హరిదూషణంబు ఽ గనును ఫలమింతలోన హరికినుక
రేకెత్త దాననే యుట్టిపాటు ఽ గాక దైవ మెటు వీని బోనిచ్చు
పోకిరి తనమున కూకలిడె వీని ఽ పోకడ గానడు సోకు కీడింక
ననుచు పోబోవ కేకయ సృంజయ ఽ జనపతి లోకము లాయుధ చయముల
ఘనతర భీకరముల తనువు లొప్ప ఽ యొనరున కరముల నిలిపి యదల్చిన
తాను శిశుపాల నాముడు పలుకను ఽ బూని ఖడ్గమును చేతగొని యుఱక
దాని మెఱయ ననికై పాలుగొన్న ఽ మానవోత్తముల శమింప నాడుచు
హరి క్రమత నంది పరాక్రమించియు ఽ ధరణి నిట్టి యుధముల బ్రతుకు గొందు
వరమతిని ధర్మమును దెగనాడిన ఽ పరమ దుష్టుండు మడియింప విసరె
తన చేతి చక్రమును దనుజమృత్యు ఽ వును సురకోటికి హర్షమానంబు
ననువందించును నాసుదర్శనము ఽ ఘనతీక్ష్ణ తేజమున నిను గొనుచు
శిరము వడిద్రుంచె నది గిరిశిఖరము ఽ కరణి నేలబడె తనువు దొరలె ధర
తరణిప్రభ నొక్క తేజం బాతని ఽ ధరణిని రహి గను గాత్రమున నుండి
కరము జ్యోతిరూపంబున మెరయుచు ఽ హరిమోమునందు జొచ్చె నది గాంచి
పరమ మునులు జనపాలురు వెఱగున ఽ సురవందితు డగు హరిని నుతించిరి
పరముడు విష్ణువు లీలాపురుషుడు ఽ వరతపఃఫల మదే మొ శిశుపాలు

డరయ ధన్యుండె శ్రీహరిని జొచ్చె । శరణుమనియె తన జీవకళతోడి
మనుజేశ ! విశదమును వింటివి గద । వనజనేత్రు నెటు దలచినను శుభమె
ఘనుడు చైద్యుండు వైరమున హరిని । దనమతిని దలచి ధన్యుం డయ్యెను
విను జయవిజయుల మూడు జన్మములవె । ఘనత జేసందె విష్ణుపద మతడు
అంత ధర్మజుడు ఋత్విక్కులను । చెంతజేరి మరి సదస్యులందఱ
వింత భూషణాంబర గంధాదుల । నెంతొ పూజించి దక్షిణలు పెక్కు
లిచ్చి యవభృథస్నాన మొనర్పగ । మెచ్చు గన్నట్టి పుష్పరథంబున
సచ్చరితాత్ముండైన ధర్మజుడు । ఇచ్చదిపింప నెక్కె పత్నితో
అల రంద మురజ మృదంగ కాహళ । ముల పటహడిండి మంబుల గోముఖ
ముల ధ్వనులు దిసల నిండగనుమాగ । ధులుసూతవంది జనులు వైతాళి
కులును నుతింపగ వేణువీణామ । ర్దలనాద గీతగతులనర్తన గ
తుల చిత్రితరములైన పతాకల । చెలిమిని కరితురగముల రథాదుల
సుతసోదర పౌరోహితవిప్రుల । కుతుకములు సెలగ భూషితు లగుచును
మతినిక్క నెక్కి రా సర్వంబుల । నతియలంకార శోభనము సెల్ల
చతురంగబలము సందడి నిండగ । నతుల దీప్తి గురు కేకయ కోసల
నరపతులు మరియు కాంభోజపతియు । వరుస యాదవులు సృంజయు లాదిగ
ధరణిఁ గంపింప ధంధణంబులను । కర మింద్రవైభవము సాటిదీప్తి
గని వెడలి రపుడు తేజిత వారాం । గనలును దమతమ వారల గూడియు
గన కనకగిరిని సానువుల సంగ । తిని విహరించెడు కేకినుల బోలి
గునిసియాడు క్రొమ్ముళ్ళు వీపులను । దనరఁ జెక్కుళ్ళ తాటంకరుచుల
మినుకులును గూర్చ తనువులు నిలుకడ । దనరిన తొలి మించులకు సాటిగా
మినువంటి మధ్యములు స్తనభారము । లను తూలాడగ మొలనూళ్ళు మెరయ
కొంగులు జీరాడగను మందగతి । నంగుదోప కరచరణంబులను
బంగరుకంకణ రత్ననూపురము । లం గన్న ధ్వనులు సందడించిందులు
దనరగ పెదవుల హాసంబు లొప్ప । వనజనయన లటు నొసళ్ళఘర్మపు
వనబిందువు లవి వనజములతోడ । పొనరుగ ముఖముల జార చికురములు
వనరుహముల గుప్పెడు భృంగములన । గన చిందఱ వందఱల దోపంగ
కనకశృంగముల పునుగుజవ్వాది । ఘనతరపు సురభితోయ పూరముల
జడిగాన జల్లులు గ్రోవుల జిమ్ముచు । వడిని కాముకుల వావులను దేల్చ
మొడము గని వారి దేనియ లాదిగ । వడి చిల్లించుచు తడివస్త్రంబుల
వా రందెల ఘలుఘల్లున గూరగ । పాఱుగొని నిమ్మగన చేరి ముంపి

కేరడ మాడుచు మరి పన్నీరుల § దారసిల ధారలను గురిపించుచు
కుసుమగంధులను పూగుత్తులచే § విసరుచు వలువలు చెదర నంగములు
వెస గన్పట్టగ విలాస మందుచు § దిసలు పిక్కటిల నవుల బఱగుచును
సిగ్గుల నొప్పిదముల తమకంబులు § నగ్గలంబుగా నతిముతి నందుచు
నిగ్గు జగ్గు దీపింపు చర్యలను § నుగ్గడింప నభిరామంబు దోప
నృపవధూమణులు దేవకామినుల § సపరిపాటిగను విమానముల వలె
అపురూపుకళల,నొప్పు శిబికలను § విపుల మోదమున నెక్కి చేటియల
బురికొల్ప తమకు వరుసల గూడిన § తరుణుల పురుషుల నటు జల్లించుచు
సరసోక్తు లాడు భావములను న § బ్బురము దీప్తిగన నిట్లు మోదమున
పరమవైభవముదోప ధర్మజుడు § పరమపవిత్రము గూర్చు గంగనుఁ
దరిసి డిగ్గి ఋత్విగ్జనయుతంబు § నిరవు గన్న శాస్త్రంపు విధులచే
పరిపూర్ణ కలన నవబృథస్నాన § పరిశుద్ధి నందె వధూయుక్తముగ
నరతతులు కుసుమవృష్టి బరపిరి § వరమతిని తూర్యధ్వానులతో గూర్చి
కరము దివి భువిని జయజయ నాదము § పరమమునులు పితృగణములు బల్కిరి
వారితో గూడి నరపాలు రెల్ల § నారీయుతంబుగా వారినాడి
పారతరపుణ్యముల వేడ్క గనిరి § మీర నఱులెట్టి దురితములదార
నైన నవబృథస్నాన మొనర్చిన § గానరు నిరయం బారయ ధన్యులె
మానం బపగతకల్మషపుసిద్ధి యగా § నో నరవర! యుధిష్ఠిరుండా !
యనంతరమునఁ దుకూలవస్త్రము లనుఁ § ధరించియు గంధాదుల లే
పనం బలర భూషలను దాల్చియుఁ § ఘనంబొప్పు బంధువు లాదిగనుఁ
ఘనుల కట్లొసగి మరియు జనతతుల § దను మెప్పు నందవలసిన యట్లుగ
కనకగిరివలెను కావలయు ననిన § వినయమున నిచ్చి కోరికల దీర్చి
మనము లలర హరి వినుతుల ప్రకాశ § తను సకలాభీష్టము లన్ని యొప్పు
నను జనులందరు స్త్రీలసమేతము § లను మోదాంబుధి నోలలాడంగ
మునులు దేవతలు నరపతులు బంధు § జను లెల్ల పురముఁజేరి సత్కార
ములను గొనుచు హర్షించి దీవించి § జలజనయను దర్శించి యనుమతిని
వలనంది నిజతలములకు నేగిరి § అల ధర్మరాజు రాజసూయంబు
జనపతుల పొందు దానములపెంపు § వనజనయనుకృప వర్ణనల గూర్చి
యమరులకు వస్త్రధనముల నట గనము § గనగ ధర్మజుని యనుమతి నడిగిన
సరసిజనేత్రుని యింక కొమ్ముండఁగ § కరము సార్థింప తనవారి బంచి
పరమానందము నరుతో నుండ § వరుస గమనించె నింద్రప్రస్థమున

జననాధ ! పాండుభూపతితనయులు § ఘనులు తమయిచ్చ నీ యబ్ధి నిటుల
వనజనయను బ్రార్థించిన భక్తిని § నొనరునను దాటి మోదసామ్రాజ్య
మున గూర జనపతులునెల్ల రందు § గనిరి హర్షమును ధృతరాష్ట్ర నగ్ర
తనయు డొకడు దుర్యోధనుడు తప్ప § మనమున జుగుప్స నందె నాత డన
విన జెప్ప గదే శుకమౌనివరా ! § తనకేల రోతగలిగె నందు నన
వినుము పరీక్షిత్ భూరమణా ! తా § గన నుండె మయుని నిర్మితపు సభను
జనవరుడు ధర్మజుడు మోదంబున § తనకు వలయునవి మెప్పున గూర్పగ
ననుజులందరును స్నేహంబును గన § నొనరుల నతనిని మెలఁగ నాన తిడె
అలరున యమతనయుం డిటు తమ్ములు § నలువురు జలరుహ నయనుని గృష్ణుని
తలపున దైవం బని బంధువనుచు § కలఁయిక సఖ్యత భక్తిపరిపాటి
విలసితవిజయము యశమైశ్వర్యము § చెలువున నింద్రుని మించుభోగంబు
నను దులదూగుట కోర్పుచు గానక § దనలోన మత్సరము కుత్సితంబు
దినదినవు వృద్ధి గాగ కలుషంబె § మనమున నింపుచు విచార మందెను
జనవరుల మిగిలి యధ్వర మొనరిచె § కన నెదురు లేని వీరులు తమ్ములు
తన కనుకూలుడు ఖలజనదమనుడు § ఘనుడు కృష్ణుండుగాగ తా నింద్రు
నధిగమించె నే నేటి భూధవుడ § ఏవిధముల సరసిన నే నన్నిట
విధిచా లందను మీరను వీరిని § బుధుల పొగడుటలు మదికింపు గావు
ఘనత నేనందవలె నన్న వీరి § యొనరున కీడున గూర్పు యత్నమును
గనవలయు ననుచు నుండి ద్రుపద సుత § యనఘ శీలవృత్తముల సుందరము
తనను వేయి చెలికత్తెలు సేవల § ననుకూలవృత్తి సలుప నింద్రాణి
వలె నొప్పుచుండ గనె నదియు వినుము § కలవరము మిక్కుటముగా దపించె
చెలువల సహస్రమును నమరపురం § ధ్రులవలె చుట్టును గొల్వ కాంతులను
జనవర ! వృష్టినిగను నష్టమిశశి § దనరు నిటల ఫలకముల నందమున
గన నింద్రనీలమణుల కాంతులను § నొనరున వక్రాలకములు నొప్పగ
మరుని చాపముల మీరు కనుబొమలు § సరస శ్రోత్రముల సోకు నటు నీటు
తరమంది కాటుకల దీర్పుగన్న § సరిసిజమ్ములను బోలెను కన్నులు
గరిమత మల్లెల వకుళముల చంద్ర § కిరణముల మించు ధవళదంతములు
ముకురోపమితము లైన చెక్కిళ్ళ § ప్రకటితముగ చిందించు వరమణుల
నకలంక దీప్తిగనెడు గుండలము § లకు నిమ్ములయిన శ్రీలు శ్రోత్రములు
వరరత్నహారముల మణిమౌక్తిక § సరుల సంగతిని నిక్కు కుచములను
భరమోపలేక నసియాడుచునుక § కరతల పరిమేయమును గన్నట్టి

హరిమధ్యంబుల బోలిన నడుములు § సురుచిర కాంచన మేఖలల నొప్పా
నంచిత కాంచీ కలాపములచే § బొంచుకొన్న కింకిణుల చాల్వోలయు
మించు జఘనముల తేజంబు లటుల § కాంచనకంకణ మంజీరమ్ముల
సల్లలితంబుగ భూషింప నయిన § హల్లకముల మరి పల్లవంబులను
వల్లమించు పదకర తలంబులను § యుల్లము రంజిల్లగ మృగమదఘన
సారతర పంకముల లేపనముల § మీరధరించుట సద్వాసన లవి
సారహరిచందన నాగరులాదిగ § చారుగంధముల పుష్పసంతతుల
మనమున కింపుగ నాసారంధ్రము § లను గూరు పందు సౌభాగ్యంబుల
గన నా నారులు జీవకళ లంది § నసువున మెలంగు మణుల బొమ్మలన
దనరి వినువీధి నుండియు నీధర § జేని సంచరింపు గను శశిరేఖలు
నా నొప్పు గాంతి మోహినుల వలెన § ఆ నలిన నయను కాంతామండలి
పూని తను గొలువ మెఱుపుతీగవలె § మేను రుచిమింపనై యలంకృతను
నందిన ద్రౌపది విభవంబు గాంచి § డెందమున కుందునిండుకొను వెగటు
నంది మఱియు నొకనాడు ధర్మజుడు § అందరును గొల్వ సింహాసనమున
నందమొప్పు మయసభలో నాయదు § నందనుండు శ్రీకృష్ణుడు తనకడు
రంది కనకపీఠమున గూర్చుండ § సుందరు లలరున చామరము లిడగను
అనుజులు పార్శ్వము నందు పూర్తిగన § కనవచ్చె రాజరాజగు దుర్యో
ధనుడు భూషణాంబరములు ధరించి § తనదుముందు పణిహారులు నడువగ
నిరుపార్శ్వములను తమ్ములు రాజులు § కరముసేవింప రాజసంబునను
నరుదేరుచు మయనిర్మితంపు సభ § నరుదున మెచ్చుచు లోన మదమోహ
పరవశతవృత్తి సలిలములు లేని § వరతలంబులనువి గలవనుచును
వలువ నెగయించి జలమున్న యొనరు § లలిగాంచి వలువ దిగవిడిచి దిగ్గ
వలను బడి తడిసి వివృత ద్వారముల § దెలివి గనక తగులున పోటును లంది
నిటల తలమ్మున బలము వడిగాంచి § చటులము గ్రమ్మగ కీలాలధార
లటుజార పావనియు తక్కువారు § కుటిలు డని నవ్వ తహతహ నందుచు
పరితాప వదనఛాయ నలముకొన § వరుస నుధిష్ఠిరు డది గనియు నవ్వ
టరసి వాదించి భీమునిగా బంపి § వరవస్త్రంబుల నిచ్చి యాదరం
బురవడిగ జూప నందుండి లజ్జ § కరము తన్నంద నిలువకను దిరిగి
తనదు పురమునకు నరిగె శీఘ్రగతి § వనజనాభుండు ముందెఱిగి యుంట
కని వారింపక వా రపహసించుటను § నది భూభారం బడగుమాత్ర
మనుచు నజాత రిపుడును విన్నగా § వనజేక్షణుండు వైవమితి నుగ్గ

డించిన మాటలు లండె కలత లట § మించినవి యుడిగె నిట్టుల శ్రీహరి
యుంచితుం డగుచు పాండవులను ను § బ్బించి విహరించి తాను శెలవంది
తరుణి, హిత, బంధుజనక, సమేతము § కరము తనవారి నందఱను గూడి
పరితోషంబున నేగె కుశస్థలి § పురమునందు తనవారిని నరయంగ
నరవర ! యీ రాజసూయ యధ్వర § చరితంబు విన్న దురితములు దొలగు
కరము శుభములవి జేరు నిహంబున § పరమున విష్ణువుపాల వసింతురు
నా విని పరీక్షితుడు మౌని జూచి § పావనం బిదియు వింటి మరి జెప్పు
దేవదేవు శ్రీకృష్ణచరిత్రలు § వేవేలు విన్న మోదంబులెన్న

: సాల్వుండుశివప్రసాదంబునసౌభకవిమానంబువడసిద్వారకాపురిపైదండెత్తుట :-

నావిని శుకుడనె నరపాలా ! విను § వనజనేత్రుడట పాండవులఁగూడి
పావకాశమున మోదమును నంద § తోవ నరసి ద్వారకను ముట్టడిని
జుట్టె రణము సాగించె నెవడనిన § కుట్టు లోగన్న సాల్వభూమిపుఁ
డిట్టుల పాల్గొనె ప్రాణముల మెట్టు § మట్టము జెడ నీపట్టున గుదిరెను
అతడు తొల్లి రుక్మిణి పెండ్లినాడు § యతివినుతుడైన శ్రీమాధవుచే
గతిసితుల మరచె పరువండె ననిలో § బ్రతుకుపై బీతి బారిన యట్టికు
జనపతుల మాగధుని శిశుపాలుని § గనుచు యాదవుల గృష్ణునితో సహా
దునుము వాడ నాకూరవిశిఖముల § దునుమకున్న నాపేరు సాల్వుడే
కనెదఁ దపంబున బలము వీర్యంబు § ఘనుడగు శివుచేఁ బడయుదు వరంబు
జోర బోను పురము నేననియు బెక్కు § వరుసమాటల బీరముల నించి
సరణి గనె వనము జేర నందొక్క § వరస్థలమునందు దాను వసించియు
పరమ నియమమున ధృతిని బార నీ § కరసి యశనంబు గొనక నిష్ఠచే
ధరణి రజము పిడికెడుగ దినదినము § వరుస భుజింపుచు నుగ్రతమంబున
హర ! గిరిజేశా ! అమృతాంశుధరా ! § కరుణింపుము నను కాలకంధరా !
కరిచర్మాంబర ! గంగాధర ! నా § శరణు నీపాల శంభో ! శివశం
కర ! మృత్యుంజయ ! కాలకాలేశ ! § నిరతానంద ! పరేశ ! సర్వేశ !
స్థిర ! శుద్ధమూర్తి ! సిద్ధ ! వరదాత ! § అరయుము నను నీ వరమున గూర్పుము
నిను విడువ నన్ను వరమున దార్పుము § అనిలో రిపుచయములను గెల్వవలయు
ననుచు నొకయేడు పట్టున భజింప § కనవచ్చె శంకరుడు సాల్వపతికి
వినయమున మ్రొక్కి నిలిచి వంతనే § నను నేమి గోరెదవు ఇత్తు మదుగు
మన నతడు గోరె నిటు వచింతు విను § ఘన దయాపరా ! కైలాసవాస !

నను వరమున భూషింతువ ! వినుమా ! § కనికరమున నది కాదనక నొసగు
గరుడగంధర్వ యక్షరాక్షసుల § సుర, నర, నాగ నభశ్చరు లాదిగ
నరుదుగాన వారలను జయింపంగ § తరమందనైన వాహనం బొసగు
మన నీశ్వరుండు మయుని రప్పించి § యనఘ ! నీవతనికొక్క విమానము
ఘనత నిర్మించి యొసగు మని చెప్పి § కనె నంతర్ధానము పరమశివుడు
మయు డీశునాజ్ఞ కామగమనంబు § నయవేగంబును నెటకేని బార
జయపటిమ గాంచదగినట్టి దాని § భయ మద్దులేని విస్తృతం బైన
కనకలోహమయము కడు భద్రమైన § యొనరులను గూర్చి యాతని కిచ్చుచు
గొనుము నయమార్గమున నడతువేని § యనిలోన శత్రువులను జయింతువు
కను మనుచు సౌభకంబని దానికి § ఘననామ మొసగి యప్పగించినను
పరమానందమునను దానినెక్కి § త్వరితమంది పూర్వంపు వైరముగా
పరుస దలపుంచి ద్వారకాపురము § సరణి సైన్యాయుతముగ ముట్టడించి
పరిదుపవన కమలాకరంబులను § తరము మాయించి కూపములు జెరిచి
పరిఖలు పూడిచి వప్రములు ద్రొబ్బి § కరము కోటపాదుల సహిత మగల
వర యంత్రములను నట్టడుల గూల్చి § పరమశోభ విలసిల్లు ధ్వజంబుల
వికటపఱచి గోపురముల నూకియు § సకల శాలాంగణములు భవనముల
నకుటిలత భస్మముల గూర్చి పెక్కు § లకలంకకాంతు లడరు బంగారు
గోడలను మణుల నిర్మితవేదుల § బోడుపుచ్చి మరి కొల్లబుచ్చి కొని
గోడున గూర్చెను ద్వారక జనులను § బాడి పోనాడి దొరల భంజించి
జాడలరసి పెక్కగు బాధ లిడియె § దారిని నడుగడు రాయబారముల
మదమున వడిగని విమానయుతముగ § గదిసె నంబరతలము మీదందియు
అదురు బుట్టునటు తరుశిలాదులను § వదలని పూనిక ననువంద గురిసి
పోడుగాలి ప్రసరింప రజంబును § జాడల బెడుపగ గ్రమ్మ చీకునిడె
పీడలడర సర్వముల సకలురను § కీడున దార్చెను త్రిపురదానవుల
జోడు వీ డనగ భీతిని గూర్చెను § వాడిమిగులు క్రోధముల యాదవుల
వీరులన నెగడు భటతండములను § జేర బిలుచుకొని జనుల భయము ముడిచి
ధీరుడగుచు నా ప్రద్యుమ్నుడు హరి § మేరవిక్రమమునను విలసిల్లుచు
సేనల తోడను వెడలె రణోర్వికి § దాను దరలగనె దానవ భంజను
మానులు తక్కారు లందరు శూరత § దూనియు ననికిని సంసిద్ధత గని
శానువింద శుక సాత్యకి సారణు § లా నయమున గద సాంబ యక్రూరు
లనిరుద్ధులాది కుమారవర్గము § లను సైన్యసంఘములు నేలయు ంగా

నిన విధంబునను రణభూమి నిండ ✽ ఘనుడు కృతవర్మ సేనాపతిగా
కరితురగరథవ్రాత వీరభటు ✽ లరవాయి కొనక సాల్వుని సేనల
తరుమ సురువడిని గని గవయ నైన ✽ కరము దారుణవు రణ మా నాటను
సురదానవ సంగ్రామము పోలిక ✽ తరము గొన రెండువాహిను లుద్ధతి
దలమిగిలి యేపుగొని వార్ధులవలె ✽ కలయికను గాంచి శరతతుల బఱపి
తలము కొని గదల ఖడ్గతోమరము ✽ లల పరశు ముద్గరముల ముసలముల
బరువడి బాదుచు కరితురగాదుల ✽ నరసి తుండముల మెడల నరుకుచును
వరరథంబులను తుత్తుమురు గూర్చి ✽ యరుల నదురు జొర యాదవవీరులు
శమనభటుల వడి చెలరేగి సాల్వు ✽ తుముల సైన్యముల నేల కొరగింప
క్రమముగొని సాల్వుడేపునఁ గవిసి ✽ యమర సేనలను జుట్టు జంభువలె
నరవరుడు రౌతుసావేశమంది ✽ వరబలము పేర్మి శరపరంపరల
పరగించి తాను రణమెల్ల నిండి ✽ తరమంటె కొరవి చందమున నెందు
హరిసుతుడు ప్రద్యుమ్ను డది గాంచి ✽ పరుని పౌరుషము మాయింతు ననుచు
తెరిమించి రథము వానిఁ డాసియు ✽ శరతతుల వాని దుండగం బడ్డి
తొలగ జొక నిలురా నరాధమా ! ✽ తలపొగరు డింతు కలన నిను ద్రుంతు
చెలగెడు భూతములకు బలి నిడెదను ✽ పలువ ! గను మనుచు చులుకు తూపులను
వాసి మాయాక్రియలను మాయించె ✽ భానుడు తిమిరములను మాపినట్లు
ఘ్రా నిక మలపక శితశతశరముల ✽ వాని రాజచిహ్నముల దుల్లించి
శకనిడె వాడు దూలు గనుచుండ ✽ నాకవరు లుబ్బ నాత డట్లొప్ప
భీకరత మరియు సేనల బారి గొనె ✽ సాకారమందు యము డితండన
జనవర సాంబుడు సాల్వు నెదురొడ్డి ? ఘనత దెసల మిఱుమిట్లు గొను వాడి
దనరు శరతతుల పదియేనింటను ✽ యొనరు చెడ వక్షమును తూట్లు నించె
ఘను డాసాత్యకి రోషమున మించి ✽ ఇను కిరణతుల్య ప్రభల బాణముల
నవలు డటవి దరికొని గాల్చువిధము ✽ నను దోచిన సేనలను నుఱిమి దునిమె
గదుడు వీరభట వర్గముల నల్లె ✽ గదిసి తునుకలుగ తనువుల శరముల
గదిపి నెత్తురులు వార రణభూమి ✽ విదిత జవమెరిగి యరుల మడియించె
భానువిందుడును వాడిఖగంబుల ✽ భానువలెన వేండ్రమున గ్రాలుచును
శోన మడియించి సేనల మొండెము ✽ లానిమిత్తమున గుట్టల కైవడి
శుకుడు చెలరేగి కరిఘటల దాకి ✽ నికరమందు శరతతుల కుంభముల
కకవిక లందగ జీల్చి తుండముల ✽ బ్రకటిత శక్తిని నఱికి దీప్తిగను
చారుదేష్ణుండు క్రూరాస్త్రములను ✽ మారగొన సేన తురగముల సమితి

పోరున రుద్రుని భంగి దిరుగాడె § దేరిచూడరా వరిసేన లతని
గన నక్రూరుడు తదనుజులును కిను § కను హుంకరించి కొలను విహరించు
ఘనమైన మద గజంబుల చందము § దనరి యరివాహినుల గలంచుచును
గన బంపిరి యమ నిలయమును గాంచ § దునుముటల రథికవరులను వారల
కనువైన సారథుల తురగంబుల § గన నెదు రొడ్డిన వీరభటులనుఁ
వినుమ కృతవర్మ విలయానలు వలె § దనరిన ప్రతాపజ్వాలల శత్రుల
కినుక కొలది మీరిన యనువు బోల § దునిమి సేనలను చతురంగములను
నిలువక సేనలు వికలాంగములను § తొలగ గరుణించి తలలను దునుముచు
విలసిత మతి రణధర్మ పరిపాటి § నలరున బొగడిరి సుర లీసేనల
దిలకించె సాల్వభూపతి యెల్లను § ఖలు డగుట వారి శరణం బనకను
చలము మతి బెంచి సౌభకము నెక్కి § పలువ తులువదన ముట్టిపడ నిక్కి
తన మాయవారి దక్కనీనంచు § వినువీధి నంది ఘన రభసంబున
జనుదెంచి సేనలను జెండు వడిని § వననిధి నడుమను దోచినట్లుండు
ఘనత మెరసి మరి మింట విహరించు § దను గానసీక దాను నొక్కొకపుడు
వేగమున బారు నొకట లక్ష్యమున § జాగు సేయకను దోపునప్పుడే
భోగమందు నొక్కండు పెక్కులగు § సాగనీడు ధనువును నారిబట్టి
యనల జ్వాలలను బోలు విశిఖముల § ఘనత నిగుడించు గొండలను బరపు
జనవరా! కూత లొకట గర్జన § ఘనతర ప్రభల గావించు నుఱిమి
యొక్కొక తలమున నంతటను దాన § దిక్కుల భూమిని దివమున చఱిచఱి
ప్రక్కలన్ని దా స్రుక్కిం దించును § నొక్క డిందరిని కక్కసంబులను
రక్కసుల కరణి గారియ గూర్చుచు § గ్రక్కున సేనల మఱిపురి గొల్పుచు
తందరల యాదవుల సేనలనుఁ § ముందుగా సాగ నీకుండ చెలగి
అందర విశిఖములను గుప్పి భీతి § పొందించి మిక్కుటంపు టార్భటము
లను నించుపట్టులను సాల్వమంత్రి § గనగ ద్యుముడనెడు వాడ గదగొనుచు
వనజనాభుసుతు ప్రద్యుమ్నును వడి § గని భుజాంతరమునఁ విసరినంత
కనుల మూసి మనుమూర్ఛ నందినను § ఘనుడగు దారుకసుతుడు సారథియు
వని భూమి వెలికి రథము పర్వించ § సనువొంద దెలిసి శాత్రవుడు నవ్వ
నను దెచ్చితేల! రథమున రణమున § కును వెలుచు టొప్పు నే యని యాడిన
సమరమున రథికు డబ్బురపాటున § క్రమమున దొలగ జేయ నుచితంటు
శ్రీమదీర్చు టొప్పు సారథి ధర్మము § భ్రమ యుడిగె నింక ననికి గడంగుడు
అని కొంచ్చి వడిని గని వాని మాయ § దినకువల [illegible] డెడగ నొక [illegible]

శరమున సాల్వుని యాటోప మడఁచి ǂ వరుసగని ద్యుమని గవిసి నుగ్రతను
వెలుగుచును వాని గుఱ్ఱముల రెండు ǂ నలుగులను ద్రుంచి మరి రెంట రథము
వలనున తునియలు జేసి యొక్కటను ǂ తలను సారథిని ఖండించి యార్చి
పదిలతను మొరసి భీకరాస్త్రమును ǂ గదియించి వాని శిరము ఖండించె
యదుసేన లలరి మకరకేతనుని ǂ విదిత జయశబ్దములను బొగడంగ
కదనమున ధీరతను దునుమ నరులు ǂ అమరుగాని వారు అటువా రేద్వంగ
చెలరేగి సాల్వసేనల నన్నిటి ǂ కెలకులకు బారనీక సాంబుండు
అల వీరులెల్ల శత్రువుల మొండె ǂ ముల తలలు ధారుణిని డొల్ల మధ్యములు
తునుకలై తూల కరచరణాదుల ǂ దునిసి పడ కరుల తుండము లట్లన
గనగ తురగముల నాచాలుననే ǂ విను మటు భటులను దాటి పండ్లనుఁ
రాలుచు వడి రణభూమి నిండించి ǂ యాలము నందున భూతభేతాళ
ములు పిశాచములు పెక్కులు జతలుగ ǂ దాళముల దట్టుచును వికటనృత్య
ముల దిరుగాడుచు రక్తముల గ్రోలి ǂ యలరున మాంసము భుజించి త్రేపగ
కలను భీకరపు విధమును గాంచగ ǂ నలుకు నిండె దిక్కులకు సర్వమును
వినుమా యుద్ధతలంబు జలధివలె ǂ గననయె నెట్లన కరుల గండములు
ఘనమైన నక్రములు తుండంబులు ǂ నొనరున భుజగములన పదతలములు
ఘనతరకచ్ఛపములు దంతపంక్తు ǂ లన శుక్తులుగా కుంభనిర్ముక్త
ములు మౌక్తికములు రత్నసమితిగా ǂ తలప వాలములు జలూకములుగా
తలలు మొడలు మండూకచయంబులు ǂ నల మెదడు రొంపి ప్రేవులు పవడము
లను దీగలు నరములు నాచు మజ్జ ǂ ననదగు ఫేనము లస్తినికరములు
గన సైకతములు రక్తము తోయము ǂ నన నొఱగు నెడల నొఱలు మొఱ తాను
ధ్వనులు తరగలవి మతంగ జాలో ǂ ధనస్థలము జలధిసిరి బొల్పెసగను
వినుమా! శ్రీకృష్ణుడు శౌరిపాండు ǂ తనయుల యనుమతి గని చేరవచ్చు
చును ద్వారకను సమీపంబున రా ǂ గనుచు తన సారథిని దారకు గని
విను దుర్నిమిత్తములు దోచె పెక్కు ǂ లను సరం జేమొ మింట మంటలవి
కనవగు భీకర మేమొ ద్వారకను ǂ మనశత్రులెవరో! దాడిని గూర్చిరో!
మునుకొని శిశుపాలుని హితు లిప్పుడు ǂ నను ఖాండవప్రస్థమున నుండుటను
విని సమయ మందిరేమొ పోవిమ్మ ǂ మన రథంబనుచు త్వరితగతి వచ్చు
కనితా ద్వారకను చుట్టిన పోరును ǂ దనవారు శత్రుసేన లానాటి
కని యిరువదేడు దినముల నుండియు ǂ వననిధులు పూర్వపశ్చిమంబులవి
కలయ గవిసినటు నిరువాగులునుఁ ǂ వెలయ రౌద్రముల బోరాడుచుండ

వలనెరిగి మింట ఘనమాయ లన్ని । చలముగొని తనదు పరసైన్యమ్ముల
కలతల నింపుచు సౌభకవిమాన । కలిత కాంతి జెన్నొందిన సాల్వుని
గని తనరథంబు వానికి దరియఁగ । మునుకొని భీకరమును వానిదోప
దనదు పాంచజన్యము రిపుసైన్యము । లను వనువు మాపు ఘనధ్వనియుతమ్మౌ
వగు శంఖము పూరించి యదల్చిన । నగవుల వగపులు డించి యదుసేన
లగడు గనని మతి యదె హరివచ్చెను । బిగువు గనుడనుచు జయజయధ్వనుల
నగధరుని గూర్చి యట్టహాసముల । దగవంది సాల్వుడట్టె బెదరియును
బెదరకను తనదు సేన లాధాటి । గదియ మృతప్రాయులుగాగ గనియు
మదిని కినుకగొని మింట మిణుగురులు । చెదరమంట లటు పర్వ ఘంటలను
ధ్వనుల ఘణఘణలు దిగంతరాళము । లను నిండ వడక నుగ్రింపు శక్తి
వనజనాభు రథసారధి దారకు । తనువు జెడవైవ దాని నడుమనే
దునిమె కృష్ణుండు తననామ యస్త్ర । మున దారకునికి రక్షణ నించెను
గురుభుజుం డంత దనియక దూపుల । తరణి కిరణప్రభలను మించువాని
వరశరంబులను బదునారింటిని । బఱపె మింట దిరుగాడు కొఱవి వలె
చరము చటులంబు తనవారి గూర్చు । కరము దారుణము దీప్తి మిగులందు
వరమున బిగువును గనిన సౌభకము । పరము డింప నది గని సాల్వుండుఁ
హరిపైన నలిగి వాడిపెంపెక్కు । శరముల నిగిడ్చి యెడమ భుజంబును
తూటు పడవైవ చేతిశార్ఙ్గంబు । వ్రేటు ఘటనమున జారవిడిచినను
పాటుగాంచి హాహారవమ్ములను । చాటె భూతములు సాల్వుడుత్సాహ
మునహరిని జూచి నగుచు నిట్లనియె । వినునందపుత్ర ! నీవు నాసఖుని
వనితగా నతడుగోరిన కామిని । గొనుచు నవినీతి గ్రుక్కిన నుక్కన
తగవు నెఱుంగని మానహీనుడవు । పగతుర నెదుర్ప బలమున్న నీకు
దగునెంత గాక ధర్మజుని సభను । జగతి నిను దూర నీసిగ్గు జార
ఘనత గలదంచు నతని జంపితివి । నిను జంపి హితుని ఋణమును దీర్తు
నిలునిలు గొల్లడ ! నాకు జిక్కితివి । యిలయిల దొరలగ తనువు నటు గూర్చి
అలరలరుల నా వారికి గూర్తును । వలవల లన్నియు నీహారి జేరు
నన హారి దరహాసమున ఋణ మేల । గొనరు వారు నీ సేవను గొనగా
జనిరి జముగాన నచ్చటికే జేరు । కొన బొమ్మ వారిమది ప్రీతినిండు
దనుచు నో మూఢ ! ప్రేలకు మింకను । దునిమెద శిరంబు నీహితుల గూర్తు
కెంపను బలముగల పోటరి వైతివె । గనదు నీబుద్ధి విడక మృత్యువును
తను శరణ మనుమ బ్రోతు గాదేని । గనుము ప్రయాణము శమనుని పురికి

యనుచు గద గొనుచు వినువీధి నెగయు - గను ద్రిప్పివైవ నా తావున వడి
గను మూర్ఛనంది నెత్తురులు ముక్కు - నను వాత ద్వారల గొంతలో దెలిసి
నిలువ కటువాసి యదృశ్యు డగుచును - నల వానిపోలుపు సౌభకముతోడ
జలజనయనుండు కనక నరయు నెడ - నలతయు నేడ్పును దనర నొక్కండు
గగనమందుండి గనవచ్చె కృష్ణు - నగధీరుని మది బొగడంద జేయ
వగరుపుచు నిటుల బలికెను శౌరి! - తగనన్నుబనిచె దేవకీదేవి
విన జెప్పుమనుచు వినుమో! దేవా! - జనకుడు నీకును నైన వసుదేవు
ఘనుని క్రూరుండు సాల్వుండు పట్టి - కొని పోయె నింటికిని విమానమున
నని వచించినను మాధవు డాలిం - చెను వానిపల్కులను శోకమ్మున
నిమగ్నుడయ్యెను చింతించెనిటుల - అమలు డతి బలియుడుగ్రుడు జనకుడు
క్రమము దప్ప వానికి పట్టువడుట - గమనింప దైవయోగ మదియే యీ
సముడుగాడు హీనుండు దుష్టుండు - సముడెట్టయి యాతని బారినిచ్చె
శమశముని బోలు రామరక్షణను - క్రమత నొందియును నిటులగా చిత్ర
మను చుండె నంత మాయాబలమున - తను కృత్రిమ వసుదేవు గల్పించి
కొని వనజనేత్రుముందటను నిల్పి - విను మోరి! మూఢ! యాదవ! కృష్ణా!
గనుమ నీజనకు శిరమును ద్రెంతును - గనవరో! నన్ను నీచత బల్కితె
జనకుని బ్రోవగ నీతరం బగునె - యనుచు ఖడ్గమును జళిపించి శిరము
దునిమి వడి వెలయ నార్భటించియును - మనమున దుఃఖము నింపె గృష్ణునకు
జనె నాదుష్టుడు సౌభకవిమాన - మున గగనవీధి నదృశ్యతనుగ నె
వనమాలి శోకమును బాయ జెప్పి - రనఘులు చారులు నా నిజము నెఱిగి
మనమున కలతను విడిచి నలరువను - వనజనాభు డట వెలిగె భానుక్రియ
జనవరా! విష్ణుడనఘుభూషితుడు - ఘను డాదిమూర్తి యనిమిషారాధ
నుడు శరణాగత జనరక్షకుండు - జడధికన్యకా కుచతటహస్తుడు
కడుపున భువనములను దాల్చుమేటి - పుడమిరమణుండు పుణ్యధాముండు
దడగనుట లీల వడ గనుట మాయ - జడియుట బద్ధము బెడుప నిత్యముక్త
కడగంటిచూపు నను తమ్మిచూలి - కడవర కాతని కరుణ గనువారె
యా నందనిలయు డగు నా శౌరికి - నానిజము దెలియ దనరాదు గాక
మానితధర్మము నిలుప జగంబున - మానవాకృతిని దోపుటవిధి నియ
మానుసరణతకా బూటకము నింప - దా నటు ధీరతగనినట్లు వెలసె
గానబడదు వసుదేవు కృత్రిమపు - బూనికనైనది తను వానరుండు
గానరాదు మోదమున హరిజెలగ - గాన నరుడెంచి రచటికి మానుల

దేవ! దేవ! కమలాక్ష లోకేశ! ఽ పావనావనా! వనజభవజనక!
నీవజగమ్ముల, కాదివి యనంత! ఽ పావకుని చెదలు ప్రజ్వాల మడచునె
ఖలుల బరిమార్ప నవతరించితివి ఽ తలపుము నిజతత్త్వము నీయధీన
మలమటము లేదు నీకు జనార్దన! ఽ తులువ వీడు నీమహిమ యెఱుంగునె
వల దాలస్యము చులకన దుంపుము ఽ కలతల దీర్పుము నిను గొల్చువారి
తలపులు ధన్యము ఫలించు గృష్ణా! ఽ జలరుహసంభవ! వినుతరమేశా!
ఇలనుభారంబు నుడిపెద వింకను ఽ విలసనము గూర్తు వెల్లభూములను
ననుచు దీవించి వా రేగినంత ఽ మునివినుతుడు హరి ముదమంది వాని
దునుమ కినుకగొని గగన గామియును ఽ దనమీద తీవ్రశరముల గుప్పెడు
తుంటరిని మింట విమానమందున ఽ మంటలు గ్రమ్ముచు జంటింపు గొనుచు
బంటుతన ముట్టిపడు చందంబున ఽ గొంటు గొన్నట్టివాని బాణముల
దునిమి తనబాణజాలముల వాని ఽ దనదు శక్తిక్షీణింప కనలు గొని
ఘనతమెఱయు చాపంబు కవచమును ఽ కనకకిరీటము ధర డుల్లనేసి
వితతక్రోధమున విసరెను గృష్ణుడు ఽ సతత విజయసాధనము తనగదను
వితథ పఱచె సౌభకమ్మున నయ్యది ఽ గతిదప్పి త్రిపురదానవ విమాన
ములు త్రెళ్లి యట్లె తుమురయ్యె నంత ఽ నల సాల్వుండవి గాంచి దంతముల
దులిచిన నాగముక్రియ గండడంగి ఽ బలము మాయగా వసుధాతలమున
నిలిచె పొలివోని బీరము పెంపున ఽ తలగక తనకక గద నొకటి గొనుచు
కదియరాగ నాకరము గదతోడి ఽ చిదుపలుగా ఖండించె శరమ్మున
యది యదనుగ మఱి రిపుజనభయదము ఽ విదిత జ్ఞానసాధువుల కభయదము
నగు చక్రమ్మున శిరమును జెండెను ఽ గిరిభేది కొండ శిఖరమ్ము బోల
పగతుని వృత్రుని శిరము దుంచినటు ఽ వగలు బాపె యాదవుల మనములను
నగవు గన్పడియె తనవారికెల్ల ఽ జగతి సర్వముల శుభమనిరి మునులు
ఇటుల మాయావియైన సాల్వునిఁ ఽ కుటిలు దునుమాడి యుత్సాహంబున
నటు గూర్చి వెలయు యుద్ధంపు మొదలు ఽ తటములను కనుచు నుండ నచ్చటికి

## —: శ్రీకృష్ణుండు దంతవక్త్రుని సంహరించుట :—

తన చెలికానిని సాల్వుని నట్లే ఽ గన పౌండ్రుని శిశుపాలుని గృష్ణుడు
దునుముట కోర్వక పరలోకక్రియ ఽ లను వారి గూర్చి కినుక లోనెన్ని
పటపటపండ్లను గీటుచు నుగ్రత ఽ పటువందిన గద చేగొని గన్నుల
చిటచిటమ విస్ఫులింగముల్ దనర ఽ నటు యిటు ధరణియు వడకు నడుగులిడు

చును జేరియు నావసుదేవతనయు § గని కడుపులోని మంట వెలిబుచ్చు
చును శౌరి నెదురు నంధకుని బోలి § వనజాక్షు గేరుచును హుంకృతి రా
గని హరి యలరున దాను గదచేత § గొని రథము డిగ్గి యెదురొడ్డి నిలువ
దిటవు నీటడగ దంతవక్త్రుండు § కుటిలవర్తనుడు వాడగుట కృష్ణు
బటు తరమహనీయత నెరుగలేక § నిటు దూలనాడె వాయిడెను రోత
అరెరె నందసుత! కుహకవర్తన! § ధరణీపతుల జెనకెదు మర్మతివి!
వరయ నాకిపుడు చిక్కితివా! నీచ § పరత నీమనము బంధుద్రోహివి
కరము మిత్రఘాతివి మాతు లేయుడని § కరుణ గనరాదు జాతివిహీనా!
విను గుణహీనుడ వటె వావియందు § నిను దుష్టమడగనను జంపి ధరను
జనపతులు మెచ్చ నను యశము జెంద § ఘనమైన రోగ మహౌషధంబులను
వడి బాపువిధమునను నిన్ను నిట్టె § పుడమిలో దనువు నుసిరైయె చేరగ
నుడివడ జీవములను గెడపువాడ § జడమతి చిక్కగ నిలువు బోరకను
ననుచు దంభోళిధరుని మార్కొనెడు § దనుజవీరుడగు బలుని మాడ్కిని
దన గద చిఱచిఱ ద్రిప్పి వనజాక్షు § జనవినుతు శిరము నూటిని విసరిన
దాని పెడగ దట్టుచు దన గదచే § వాని శిరము నూటిగ మొత్తి నంత
దానవారి! కంసారి! మురారీ! § వేన నీలోన జేర్చుకొను మనుచు
బలికెనో యనగ నిల గూలె రక్త § మున శిరము రంధ్రముల ధార గొనగ
జనవరా! యతని వదనమున నొక్క § ఘనమైన తేజ మది వెడలి శీఘ్ర
మున గృష్ణముఖమునను లోన జొచ్చె § ఘనుల సనకాదిమునుల వరంబది
విన బలికినాడ మూడవజన్మము § మును జయవిజయులె శిశుపాలు డితడు
విను మట్లు దంతవక్త్రుడు గూలుట § విని వాని తమ్ముడగు విదూరథుడు
ఘనుడు బలభీకరుడు కృష్ణు § దాకె ననికి జెలరేగి పలక కరవాల
మును లీలద్రిప్పుచును మత్తగజము § ఘనత మృగరాజమును నెదురునట్లు
హరి వరఘనసాధనమగు చక్రము § వరుసగొని వాని దునుమ పంపుగని
అరుణప్రభ మించి యాకసము నించి § త్వరిత గతి వానిశిరము ఖండించి
పరముని కృష్ణుని కేల మఱి నిలిచె § నరసఖుం డంత దురము శాంతింప
నరిభంజనుడయి యశము దీపింప § ధరణిభారంబు డిగ్గ విహరించి
కరము యుద్ధముల ఖలదమనుడయ్యె § వరుసలు దీరుచు యదుసైన్యంబులు
గొలువ బంధువులు జననీజనకులు § నలరును బొందగ సురలు కుసుమముల
జలధారల వలె జలజల గురియగ § నల గరుడ, సిద్ధ, చారణా, ప్సరస
వర గానన్నృత్య తూర్యధ్వనులను § పరమానందము జేరి వినుచును

పరమమునులు సిద్ధులాది జయముల ॥ నరసి నుతిగీతముల దీవన లిడ
వర ముహూర్తమున దిగ్విజయుడు తన ॥ పరము గాగ దనరారుచు నర్జును
గురుడు ప్రియుండును ధర్మజుని బహిః ॥ పరమందు ప్రాణరూపుడు నాత్ముడు
పురము జేరె వడి నూతనశోభిత ॥ పరమైన ద్వారకను జేరగానె
పురసతులు సౌధసీమాగ్రంబుల ॥ వరమతుల నిలిచి సేసలు సుమములు
కొల్లలుగ జల్ల మెల్లన నడచుచు ॥ నల్లములు పల్లవింప భక్తులను
చల్లని దయ సంరక్షణ గూడుచు ॥ పల్లవనాగుల హృదయాబ్జమిత్రు
డనఘుడు శ్రీహరి నల్లని వేలుపు ॥ ఘనుడు పరముండు నారాయణుండు
తన భవనంబున జొచ్చె భద్రముగ ॥ జనుల గూర్చి తను ముదము వలము కొన
పురుషోత్తము డిటు సుఖమున ద్వారక ॥ నిరవు గొని పాండవుల క్షేమ మరయ
పరిపూర్ణదయను బరగించు గొలుచు ॥ నరుల నందరిని నేలు నతు లొసగ
విను బలభద్రుడు సాల్వయుద్ధమున ॥ ఘనత పురరక్షణము జనరక్షణ
కును దాను నేమమును గొని యుండెను ॥ వనజాక్షు డతని మొక్క దీవించె

—: బలరాముండు తీర్థయాత్రకుఁ జనుట :—

జనవర ! పాండవులకును ధృతరాష్ట్ర ॥ తనయులు సుయోధనాదులకు జరుగు
ఘనభీకర రణమును గన జాలసి ॥ తరుణ మెంచి బలభద్రుడు ధరణిని
పావనుండు పుణ్యక్షేత్ర తీర్థముల ॥ గన దోగ నేగె గృష్ణాను మతిని
మునుల నచటచట సేవింతు నంచు ॥ మనమున శుభముల నందె గోర్కె నిడి
జననీజనకుల మొక్కి దేవతల ॥ ఘనతఁ బూజించి సురుల భూసురుల
తను ధన్యుండ దీవెనల గొనుచు ॥ ననుకూల ముహూర్తమున ద్వారకను
వెడలె మొదల తా ప్రభాసతీర్థము ॥ వడి జేర నడచి యం దవగాహము
దృఢభక్తి నొనర సలిపి యందునను ॥ కడక కొనసాగుటకు దానము లిడి
దేవఋషిపితృ దేవతల గూర్చి ॥ పావనత తర్పణములు సెల్లించి
తోవ గనుచు కొందరు భూసురులను ॥ ప్రోవందు సఖ్యమున వెంట గొనుచు
వరుస సరస్వతి బిందుసరోవర ॥ మరసియును వజ్రతీర్థము విశాల
సరయువు యమునయు జాహ్నవిని గడచి ॥ వరమని యటనట దేవాది తర్ప
ణముల సంతర్పణముల నొనరించి ॥ క్రమమున నైమిశవనభూమి జేరె
విమలుతు మహనీయులు నగు మును లట ॥ శమదమ నియమాదుల దీర్ఘసత్ర
మును సాగింపగ గన నేగి జేర ॥ మనము లలర మునిజనులు రామునకు
వినయ మొప్పగ బ్రత్యుత్థాన మొసగి ॥ గన జేసిరి పూజావిధానముల

ప్రముదిత హృదయుం డయి యట వసించి ∗ శ్రమ బాయ నుండెగ సూతమునిని
క్రమసత్కారము సెల్లింప డితడు ∗ విమలు డెల్లనుచు రోషము నందుచు
మునుల విప్రులను నట నున్నవారి ∗ గని యనె నిట్టుల వీడు గర్వమున
వను జూచి లేవకుండుట యుచితమె ∗ కనెను ముదము తగు కారణ మేమొ
వినుడు ప్రతిలోమ జాతుడగు ∗ ఘనుని బోలె మాకన్న గరిమత
కును జాలువాడె క్రూరుడు సుండీ ∗ మునిద్మైన శక్తి మనుమని యొద్దను
వినిన గాథలను గొన్నిటిని జెప్పు ∗ కొనుచును విజ్ఞుని వలె విఱ్ఱవీగు
టను నే నోర్తు నె నీచాత్ము డితడు ∗ వినయంబు లేని విద్య యేమిటికి
ఘనత లోపంబు పొగరున కీడును ∗ గన జేయు గాక సత్త్వమతి యున్న
మనుజుల దుష్టుల మదయుతుల మలప ∗ జననమందితిమి దాన నీతనిని
దునిమెద నంచని చేత కుశాగ్రము ∗ గొన మునులు వలదు వలదన దునిమెను
మును లా రాముని హా! హా! కారత ∗ మునిగి పలికి రిటు మే మీ మునికి
ఘనత గనియు బ్రహ్మాసన మొసగుట ∗ నిను గాంచి లేవడయ్యె విన వదియు
తీవరమును గొనినాడవు తెలియవె ∗ పావనము దూరపరచుట దగునే
దేవుడవు! నీవు బ్రహ్మహత్య యిది ∗ నీవ బ్రదికింప వలయు నీమునిని
గావింపవలయు ప్రాయశ్చిత్తము ∗ ఏవలను గీడు నిను బొందకుండు
నట్టి విధానము లోకహితంబగు ∗ పట్టున ధర్మము నిలుపు లేదేని
మట్టు మడగునది వెస ప్రతీకార ∗ మిట్టె యొనరింపు మో బలరామా!
నీకు గలదు గా సర్వశక్తియును ∗ జోక గను మితని నీ వనంతుడవు
నీకరుణ నితడు బ్రతుకవలయు నన ∗ నా కమలనయనుని యన్న యనియె
వీని కాయువును బలసత్త్వంబును ∗ నేన కూర్తు నాయోగబలంబున
మీ నుడి మీరను తామసంబునను ∗ కానిపని చేసి పాప మొనర్చితి
యన దేవ! నీ కుశాగ్రంబున ∗ కును మృత్యువునకు మాకు నేవిధిన
ననుకూలవు వైకల్యము గాదో ∗ కని గావింపుము ప్రాయశ్చిత్తము
నావిని యాత్మయె సుతుడై పుట్టును ∗ కేవలం బనుచు వేదముల గలదు
ఈవిధి నాదగు కుశాగ్రమున నిటు ∗ చావు గన్నట్టి సూతసూనుండు
నాయువున గూడు బలము తేజంబు ∗ న్యాయంబు వెలయ నితని జేదు నని
యాయమునువును ధ్యానించి బ్రతికించె ∗ నా యనంతమూర్తికి సంకర్షణు
నకు చే గానిది యున్నె జనవరా! ∗ సకలజీవకళలన్ని మఱి వన్నె
వికసిల్లగ సూతుడు యథావిధిని ∗ వికటమును బాసి పీఠమున జేరె
మేదిని సాగిలె రాముడా సభకు ∗ ఏది నాకు విధి మీ యిష్ట మేమి

కాదనక క్షేతు గూర్తు మా రడుగ ఽ మీా దయ నెఱపుచు వచింపు డనగా
మునులు శ్రీరామభద్ర ! బలభద్ర ! ఽ ఘనుడ వన్నింట దునుము మిల్వలుని
తనయుని పల్వల నాము దానవుని ఽ వినుమా యుధముడు ప్రతిపర్వంబున
తన యుదగ్రతను దాసి మా శాల ఽ లను పాంసుమూత్ర సురాస్రపూయము
లను మఱి విణ్మాంసముల శల్యముల ఽ గన వర్షించును నేమరించియును
గనరాని బాధలను గూర్చుచున్నాఁ ఽ కినుక గనని నియమముల మేముండు
టను దెలిసి వాడు సవనముల జెఱుచు ఽ మునుముందు వానిజంపి యీడాది
ఘనతీర్థమ్ముల భారతవర్షము ఽ ననువొంది తిరిగి యాగమొనర్పుము
ఈవిధి నిర్ణయ మేము గూర్చితిమి ఽ పావనము నిన్ను జెందిన మూర్తివి
నావిని హర్షము నంది యట్లుండ ఽ దావురించె నాపర్వసమయంబు
దానవుండు నాఖిలము నిండగ ఽ దాను కేల గదనూని కాటుకపు
మూన గిరివోలె మేనున తామ్రము ఽ నాను ఛాయ శ్మశ్రువులు కేశములు
తోలుకట్టు గని మిడిగ్రుడ్డుల నా ఽ చాలున పెద్దగ ముక్కు నిప్పు లన
బోలిన చూపులు వ్రేలెడు పెదవులు ఽ నాలుక దీర్ఘ కరాళంబుగాగ
మానవ రక్తమునఁ దడిసినట్టి ఽ కనగ భయంకర మైన వక్షమున
పూనిక సమరోన్మాదోత్సాహము ఽ నాను మదలోలుడయి యొక భుజమున
కాలదండమును బోలు శూలంబు ఽ గ్రాల నళిసంకాశపు దంష్ట్రలను
నోలి దెసల వెలిగించుచు మండుచు ఽ వ్రాలవచ్చె నచ్చటికి కేకలను
చాలందె వాని కృత్యముల వరుస ఽ తాలాంకుడు గనె వాని యాకృతిని
కేల గదద్రిప్పుటయు మెఱుగు వార ఽ నాలోకించుట లాదుండగము
ఇన్ని కలుషములె గారోషమంది ఽ వెన్నుని యన్నయు దాబెచ్చుపెరిగి
క్రన్నన నాగలి ముసలము గొంచును ఽ మిన్ను మన్ను గన రానివేగమున
దానవుని దాసి సురముని కంటకు ఽ తన కరమందలి నాగలిని కంఠ
మున దగిలించియు లాగి రోకలిని ఽ వాని నడినెత్తి నూటిగ జూచియు
తత్తరము వాని పొత్తందించియు ఽ నుత్తుంగ మానుల తత్తరం బడగ
మొత్తె నుద్ధతిని శిరము వ్రయ్యలుగ ఽ నత్తాపస వినుతుండు రాముండు
ధరణి వడియె దనుజుండు కొండవలె ఽ వరుస నెలయేరు నాగ రక్తంబు
దొరల గ్రక్కుచును జీవంబు వెడల ఽ సురలు సుమవృష్టి వారిపై బరపిరి
అమరేంద్ర సురలు వినుతించినట్లు ఽ విమల బలభద్రు మునులు నుతించిరి
క్రిమత వృత్రారి నెట్టులో యట్టుల ఽ సమమతి నాతని నభిషిక్తునిగా
సురభి మంజు లామ్లాన కంజాత ఽ వరమాలికనుఁ మేలుబొమ్ములను

సరస దివ్యాంబరముల నిచ్చి రవి  వరుస ధరించియు దా నింద్రుపగిది
మునుల దీవెనల చొని దారె నచటు  ఘనుల విప్రులను గొందఱిని వెంట
గొనుచు గాశికిని మరి సరయువునఁ  గొనరున బ్రయాగ తీర్థమును డాసి
ఘను డందున నవగాహన మొనర్చి  ముని, దేవ, పితృ తర్పణము గూర్చి
జనవినుతి గొంచి తరలె సవ్యాలను  గనెను పులస్త్యాశ్రమము గోమతిని
గనియె గండకిని విపాశశోణను  గనియె గయ నాడె గంగ సముద్రము
నను వలయు చోటు నవల ననుపొంగ  జని మహేంద్రమున భార్గవరాముని
గని దనుజాంశ నృపాలవిరామా !  ఘనసుగుణధామ ! కారుణ్యసీమ !
అనతి గొను మని యట్టుల నుతించి  మనమలర నవల జని సప్తకము
వరపుణ్యనదిని గోదావరినిఁ  నరసి దాటియుఁ వేణీపంపా
సరసులను నడక మీఱ భీమనది  దరిసి కుమారుని దర్శించి యంత
పరమశివు డున్న శ్రీశైల మరసి  హర ! భవహితా ! యంబికానాథా !
భవ ! యభవా ! సర్వేశ ! యఘనాశ !  ప్రవిమలశుద్ధాత్మా ! జగదీశా !
పవనవిదారా ! శాశ్వత ! రుద్రా !  భువనస్వరూపా ! పుణ్యనిధానా !
యని బాగడి యవల వేంకటేశు  గని దర్శించి యల కామకోటికిఁ
గని శక్తి మ్రొక్కి కాంచీపురమును  గని యటు బోరియు గావేరి దోఁగి
శ్రీరంగధాము శ్రీమహితకాము  నారయ శ్రితజన పయోధిసోముఁ
మేర కావేరి సముని దనుజుల  క్రూర మడగించు భీముని దురితా
రిని మ్రొక్కుసెల్ల వృషభాద్రిని గని  యను హరిక్షేత్రము జేరి యవ్వలను
జని మధురాపురి గడచి సేతువును  గని వార్థి దోఁగి పదివేలధేను
లను దాన మిచ్చి రామేశ్వరమును  గని మ్రొక్కుసెల్ల దామ్రపర్ణినిఁ
గని మలయాచల మెక్కి యగస్త్యుని  మునుకొన్న భక్తి నతు లొనరించియు
నొనరుగన నేగి దక్షిణాబ్ధినిఁ  గని కన్యాఖ్యను వెలయు దుర్గనుఁ
జననీ ! యంబా ! శ్రీమహేశ్వరీ !  ఘనమంగళాంగి ! గౌరి ! భవానీ !
వినుతి గొనుమ యని దేవి నుపాసన  దనిపి పంచాప్సరస మను తీర్థము
నను స్నానమాడి గోకర్ణక్షేత్ర  మున నిందుమౌళినిఁ బూజించియు
ధవళాంగ ! శంభో ! దాక్షాయణీశ !  భువనవిఖ్యాత కైలాసవాస !
సువిశాల ఫాలనేత్ర ! జగత్పతి !  దివిజస్తుత శ్రీకంఠ శివంకర !
యనుచు నతి జేసి యా ద్వీపవతిని  ఘనత వెలయగా కామదేవినిఁ
గని సాగిల్లుచు తా పింబరోష్ణి  గని నిర్వింధ్యంబును దాటి దండ
వనము చూచియును మహిష్మతీపుర  మునను వసించియు దా ముక్కలిడియు

పరమహర్షమున మరల ప్రభాసము ƒ నరసె పండ్రెండు నెలలు పూర్తియమె
ధరణీసురులు కొందరిచేత వినెను ƒ నరపతులు చాల భారతరణమున
పరలోకగతుల బ్రాకి రనుచు విని ƒ వరబలయుతులు న్నరిభయంకరులు
కురువలి సుతుండు దుర్యోధనుండు ƒ దుర మొనర్ప గమకించుట నెరిగియు
వరున వారింప జూతును నేనని ƒ త్వరిత గతి వచ్చి ధర్మనందనుని
గని మ్రొక్కి కృష్ణు నరు మాద్రిసుతుల ƒ గని యేమియనక భీముని దుర్యో
ధనుని పోరాటమును గాంచి వారి ƒ దన గురుత్వమున డాసి యిట్లనియె
పరమగుణ బలిష్ఠులు మీరు నాకు ƒ పరమబంధువులు మీ క్షేమంబును
నరసి వచింతును నా నుడికరణము ƒ నిరత మభ్యాసమున బెద్ద యొకరు
తరమందు ముష్టి నధికులు నొక్కరు ƒ వరుస బోరాడుటను జయము గనరు
సరణి దప్పెదరు విడు డిక వైరము ƒ సరిగా దనంగ వా రెదురు బల్క
మివి వారి పూర్వవరుసలను గూర్మి ƒ గనమి తొదలచి ముష్టికాంతకుడు
తనకేల వారి శుభాశుభంబుల ƒ గనబోరెద రిట కృష్ణు డరయగను
దనరి యుండె నని యుగ్రసేనాని ƒ తన బంధుజనులు పరితోషంబుగ
తను నెదురుకొనగ ద్వారకను జేరి ƒ ఘనత గని యుండి ధనపదార్థముల
గొనుచు నైమిశము జేరె మరియున్ ƒ మునుల జేర్చుకొని యనుమతిని గాంచి
జనవినుతి గన్న నొక్క యాగంబు ƒ దనయశము దిక్కులను నిండభక్తి
నొనరిచి విశేష దక్షిణ లొసంగి ƒ దినములు రాత్రిల నన్నదాన మిడి
మునులకును జ్ఞానపరిపూర్ణత గన ƒ గను వరమొసగియు రేవతిని గూడి
తనబంధు జ్ఞాతి లలర వారితో ƒ ఘనకౌతుకమున నవభృతస్నాన
మును నొనర్చి వివిధంపు గంధముల ƒ ననువొందు పుష్పమాలికల వస్త్ర
ములను కనకయుత రత్నభూషలను ƒ విలసితాలంకృతుడునై నెల్లర
నలరున నట్టుల గూర్చి కీర్తిగని ƒ చలువ రేనికళ బంధురాజిలో
నిండు ముదంబున గండు తా నండె ƒ కుండలీంద్ర డాద్యుండు ననంతుడు
కొండధరుడు లో నుండెడు దేవుడు ƒ చండకిరణుప్రభ నండగొన్నయా
దండి బలిష్ఠుడు సంకర్షణుండు ƒ భండన భీముడు రాముం గంతట
మాయామనుజాకృతి నంది యుంట ƒ నా యమాదులను గూదిరిన మానుల
వేయిదండముల వినుతుల బూజల ƒ న్యాయ మందించి యనుమతిని గొనుచు
జాయాబంధుయుతంబుగ ద్వారక ƒ నా యనంతుండు జేరి సుఖమ్మున
మేలునై భవము పాలించు నంది ƒ పాలిత ధర్ముండగుచు విష్ణుని
లీలాయుత గాత్రుని కృష్ణునితో ƒ జాలసఖ్యమున జ్ఞానమూర్తియయె

## -: కుచేలోపాఖ్యానము :-

శ్రీకృష్ణా! జగదీశ! పరాత్పర! § శ్రీనిలయా! హే దేవ! భయాపహా!
ప్రాకృతులైనను భవాబ్ధి మునుగరు § భక్తిచేత నిన్ మ్రొక్కి భజించిన
శ్రీశుని సత్కథ లెన్ని విననైన § ఆశదీర దా పేశల మోక్ష సు
ధాశరధి పయస్సున క్షుత్తృష్ణలు § వేశమందు సంపూర్ణ తృప్తిగను
నో శుకమహాసీంద్ర! నే నీ దయచే § నాశక్తి వెలయ నలరితి సెప్పెద
మారుని శరముల మలప కేళితమి § గూరు వారలును బ్రేమ గొందు రీ
హరిచర్య గానమున వీనులు జొర § నరయు విశేషం బది భవహరంబు
హరి నర్చించిన కరములె కరములు § శిరము లన నతని శరణ మందినవె
శిరములు చిత్తమతని వర్ణనమ్ము § కరము హత్తినదె చిత్తమ్ము చూపు
సురవంద్యు జూచినవె చూపు లగును § వరమతి వాక్కని హరి బలుక వాక్కె
వరమగు విద్యయు వరదుని పరంబు § సరణిని గనుటయే విద్య యన దగును
చెవు లతని విన్ననే చెవులు నగును § దవులు నిటు తనువులగు భగవంతుని
గవయు భాగవతరతి గలుగ తనువు § లవి పునీతములు నవి గావ యేని
జీవమున నుండు శవము సాటియగు § పావనము గనక నతని కథోగతి
తావల మందెదు భువిని ధన్యుండు § గావలె నన్నను హరిని వినవలయు
నను రాజు జూచి ముని కుచేలుడను § నసఘుడు మునియును హరికిఁ జెలికాడు
ఘనుడు తపోనిధి దారిద్ర్య వశుడు § జనవర! నిర్జిత విషయేంద్రియుండు
తన మన మీశ్వరు పరముగా తుచ్ఛ § మను నిహసౌఖ్యములను చర్య గలడు
ఒనరు గనడు యాచనమును పరులను § దనకేది ప్రాప్తమగు దాన శాంతి
గనువాడు బ్రహ్మవేత్త ధర్మిష్ఠి § తనకు హరిదయయె వేల యను నతడు
వనమున తనువడసిన కాసులనే § ధనము పదివేలు అని మోద మందు
వనిత వామాక్షి శీల పతివ్రత § ఘనమైన సుగుణమణి యన నొప్పును
తనయవతి పెక్కులగు తాపములును § దన్ను నలమగా దనయులను బోష
ణమునకు జాలక యనఘు శరణ్యుని § గ్రమమున దలంచు బతి కెదు రాడదు
సుమతి తన తనయు లాకలి గొనుచును § ప్రమదము నీరుగ తమ కరమ్ములను
ఆకుల బట్టుక వ్యాకులము గనుచు § నా కలికి నింత పట్టెడన్నమును
మా కిడుము జనని! వేడెము నడుగ § ప్రాకవే జనని! నీకు దండమని
వీనులు నాటగ గొని యాడుట గని § మానిని మానని కన్నీటిధార
లాన మనము వ్రయ్యలుగా వాపోత § నూని మెల్లనను నాథుని డాసియు
తాను కరములను ముకుళ మందించి § నా నిజేశ! పరదైవము! మునీశ!

నే నీ తనయుల దెస గాంచలేను § మానమింత యనరాని యాకలిని
దాన సుత్రిక్కులను దోగి వేధింతు § మానసీయ ! నీ వారముల గొనవు
దీన శిలోంఛములను జీవనంబు § గాన రీ శిశువు లేజాడ వీరి
బ్రతికింపవలయు నుపమే దోపదు § బ్రతిమాలెద నిను జీవితేశ్వరా !
యతిజనవిహారియగు శ్రీకృష్ణుడు § బ్రతికించు వీరి నీ వా దేవుని
గన బోయిరమ్ము దీనవత్సలుడు నిను గాంచి నంత మన కోర్కెపంట
గను శా దనకును కడుఘోరమయ్యె § మనుట గాంచుమీ వనితవాక్యముల
వరదు డాభక్తవత్సలుడు కృష్ణు § డరయ ధర్మమును నార్తరక్షణము
కరకంకణమును దా నందియుండె § సరసిజనేత్రుడు సిరి జేకూర్చును
పరితాప మడగు బ్రారన వింటే § పరమేశ్వరుండు మఱం దెన్నడైన
కలలో దను చింతించ బోనట్టి § యల మూఢజనుల నైన యాపదల
తిలకించి ప్రోచునట్టి దణి యతడు § అలవోని నిష్ఠలను మనము మ్రొక్కు
లొసగుచు నుంటిమి కాంచ డెట్టు గతి § వసతిగని మీరు నాలక్ష్మీధవు
పసదనంబు గని భాషించి రండు § పసివారి వీరి పోషించవలయు
కసిబిసి నించితి ననకుడు సతి యన § బిసరుహపాణియునైన యుత్తన్వి
పలుకు లుచితంబు లౌనని తరుణీ ! § నలువవినుతు నే గని వత్తు నేను
తిలపు బొడమె దర్శింప పిననాట § మెలగితి మొక్కట పలుకరించు నను
యా చక్రధరుని కీడైన కానుక § నోచిన కొలదిని నర్పింప వలదె
దాచి యున్న దేమైనను గలదే § యో చకోరాక్షి ! యనిమెల్ల ననగ
తనచిత్తము కనినట్టి యా వనిత § తను భద్రపరచినట్టి పృథుకముల
ఘనభక్తి నిగుడ విభుడు పై గప్పు § చినుగు వస్త్రమున నొక కొన్ని గట్టి
ముని గోవిందుని జూడ నుత్సాహ § మున మునిపల్లెను దాను గదలియును
జయ యిందిరేశ సఖ ! శ్రీకృష్ణా ! § జయ భువనపాల ! మోక్షసంధాన !
నయనిపుణచర్య ! ధరమూర్తి వరయ § నియమాదుల నిను ఘనులు గూర్తురా
ఘనకృపాకరానంద మందిరా ! § వనధివాస వైకుంఠసురావన !
నిను మందమతులు దలప రెందు కన § మనము పూర్వకిల్బిష కర్మకలన
పెనుపందియుంట మదమును గొనుటల § ఘనులు మహనీయమును లట్లుగామి
నిను పరబ్రహ్మవని గని తెలివిని § వినుడు తమమ్మును విరియించునట్లు
మును శేషించిన దురితమును విరియ § నినకోటితేజ హృదయమధ్యమున
పొనరొందు భక్తి నిలుపుకొని వారు § గనెదరు తుది మొదలు నిను గానని
నిరవశేషు నిశ్చలుని నిగర్వుని § సురవిశేష దీపకుని శ్రీహరిని

వరుస జ్ఞానాంబకులు దృష్టి యుదియ ఽ కరివరదా ! యరిసూదన! మాధవ !
యనుచు జనుచు మార్గమున నిటు దలచె ఽ వనమాలిని దర్శించ నా కబ్బు
నొకొ నరు గలడె ప్రభుడతడు ద్వారకకు ఽ నను నా భవనపు ద్వారపాలురును
గని నీ వెచ్చటి విప్రుడవని నిలుప ఽ మునుకొని వారిని ప్రసన్నమతులుగ
పరిదానమిత్తు? హరి సరయు టెట్లు? ఽ సిరుల దులదూగు నరపతు లాతని
వర దర్శనంబు వేచి యుందు రని ఽ సరళమతులు కొరిదజన వినియుంటి
నైన నాభాగ్యగరిమ జెల్లు టెటో ! ఽ దాని జింతింప నేల నని యతడె
ధ్యానపరుల గన రానై యుండగ ఽ మానసమ్మునను యోచన తగ దని
మానితంపు నుతి సలుపుచు ద్వారక ఽ లోన ప్రవేశించియును రాజవీ
థిని బోయి పోయి కక్ష్యలను దాటి ఽ కనకమణిమయము లైన గోపురము
లనువందినట్టి ప్రసాద సౌధ ఽ ఘనదివ్యశోభ గను భవనరాశి
నమిత సుతుకమున గనుచు నరుగుచును ఽ సమయము నెచ్చట సమకూరు గృష్ణు
శ్రీమవాయు దర్శనంబు గాంతునొకో ! ఽ శ్రీమ మెట్లో ! యని పదారు వేలగు
మందిరమ్ములలో నందుని సుతుండు ఽ మందయానలను సందిట సొక్కుచు
నందుచుండునో ! ఎందు జూతు నని ఽ ముందు గనె నొక్క సుందరభవనము
నందు నొక వధూమణిగృహమందున ఽ నంద మింపొందు సుదతులు గొందఱు
తామర లిడగను మృదుల హంసత ఽ ల్పమున దా నొక్క ప్రియయు సేవింప
ధామ మందియున్నట్టి మాధవుని ఽ శ్యామలాకారు సనందవందితు
నామ, జప, కామ సిద్ధవినోదుని ఽ ఆ మహేంద్రవైభవ సమగ్రునిఁ
వనమాలధరుని కౌస్తుభశోభితు ఽ గనకధౌత చేలము గప్పువాని
గన సురుచిరాంగు సురశరణ్యునిఁ ఽ కనకమణిభూష వరభూషితునిఁ
గరుడకేతనుని గారుణ్యమయుని ఽ బరమయోగి బృందావనవిహారి
పరమైశ్వర్య విలాసగుణమయుని ఽ నురగపతిశయను వసుదేవసుతుని
నిరుపమాన సంతతుని ననంతుని ఽ పరమసంతసము గదియ కనుగొనియు
బిరబిర దరిసిని రా గని కృష్ణుడు ఽ భరితానందుడు సరగున శయ్యను
డిగి యా విప్రుని జీర్ణచేలునిఁ ఽ విగతకృశుని కృశతనువు గలవాని
తగవున బీదతనంబు చొప్పడిన ఽ జిగిలోన వెలిని నమ్రచర్యయును
గలవాని చినుగుగనువల్లెవాని ఽ నల తపోధనుని బాల్యమిత్రునిఁ
కెలను వడిజేర నెదురయి కరమును ఽ నలరునను నూత నిడి కౌగిలించి
వరుస పరమంద తన తల్పంబున ఽ దరమున సమాదరమున నుపవిష్టు
పరత నందించి చరణములు గడుగ ఽ తరుణి రుక్మిణిని కనకకలశమున

జలములు గొని రా ధావించే శుద్ధ । కలశ గూర్చి తజ్జలము శిరంబున
వలరున ధరించి సేమం బడుగుచు । లలితమ్మృగమదము ఘనసారమిళిత
మలయజము మేన జొబ్బిల్ల నలది । అల తాళవృంతముల దాను విసరి
ప్రమోద బంధురమంద ధూపమును । సమారాధనపు మతి నొసంగియును
సమాన మందని మణిదీపమ్ముల । నమానుషంబన నీవాళి నిచ్చి
పారిజాతమ్ము లాదిగ సుమముల । సారమంద నిర్మించిన మాలల
మీరిన ముదమున సిగనిండ ముడిచి । చారు తరపు కర్పూరమిళితంపు
తాంబూల మొసగి ధేనుకర్పించి । అంబుజోదరుడు స్వాగతం బడిగి
డంబరము దూరమంద దరినిలువ । సంబరము నంది భ్రమ దగులని మతి
జృంభితానంద బాష్పపులకలను । సంభరితుడగుచు మానమున నతని
ధ్యానించుచుండె చెంతను రుక్మిణి । తా నట్టుల పతిహితము లోనెంచి
మానితమతి వింజామరము నంది । మానిని సేవించెను కరకంకణ
మానరవంబులు మనోహరంబుగ । దాన కుచేలుని, ఘర్మసలిలంబు
వారితంబంద నారీజనంబు । వారి యర్చనము భూసురు ఘనంబు
తేరి చూచి నయవినయంబుల నా । దూరదురితు ధరణీసురు తపంబు
మేర లేవిరొ శ్రీరమాధీశు । డారసి సపర్యతరుణీయుతుడై
తనను బూజించు కలిమి నార్జించె । ఘను డీతడు మహనీయమూర్తియగు
విన గన చోద్యము తాను శయనించు । ఘనమృదుతల్పమునందె వసింపును
మునిని గూర్చె నింతటి భక్తి చొప్ప । మునవారమందు మునుగంటి మొక్క-
యనుచు మోదమబ్బురము దోపంగ । గనిరి సమయ మపు డా శ్రీవరుండు
ముని హస్తంబును దన కరమున గొని । విను మాననీయ ధరణీసురేంద్ర!
మన చిన్ననాట గురుమందిరమున । గనినారమంతె సఖ్యంబునీడు
మనము గలిసితిమి సుదినంబు నేడు । తనయుల గంటివె? తరుణిసుశీలయె?
వనిత ప్రియానతిని వర్తిలునే? । నిను శిష్యసంతతులు గొల్తురొక్కొ?
మనమున నను దలపుంతువా? నినుగన । వినయుశీల నిర్ద్వంద్వ మతిసు వనుచు
మునుకొన్ననిష్ఠ పాటించి సంసృ । తిని లోకువగొని తత్త్వజ్ఞుడైన
కరణి గాన వగు ధనాదివైభవ । సరణియు మమతాసక్తి సతిసుతుల
వరక్షేత్రభవనముల సంగతుల । గనని చర్యతే యలవడునం చని
నమ్మితి మహాత్మ! యే నట్టులయ్యు । సమ్మతి నందితి లోకసంగ్రహము
నెమ్మతిగ ధర్మపరిరక్ష వొంది । యిమ్మహి వెలయగ నిది గోరుట యగు
సుమ్ము సర్వాత్మ వ్యాప్తి నాపరము । నిమ్ము గొందు ఖలభంజనంబున

సుజనపోషణము లీలాకృతియును § నిజభక్తవరుల దరి నే నందేద
భజనల ననువున పరము నొసగెదను § త్యజితసర్వులయి మఱికొందరు ని
ర్వికారతను గని సౌఖ్యము నందియు § లోకపు నడవళ్లను గూడిబుద్ధి
సకారణమ్మున యుక్తకర్మ గని § శోకమును మలపు లోకమందెదరు
మనము గురుమందిరమున వసియించి § యనఘుం డాతనివలన విజ్ఞాన
మును నెఱింగి ధర్మములను వింటిమి § ఘనుఁడు బుధనుతుండు సుకర్మనిరతుండు
తెలివి బ్రహ్మస్వరూప దర్శనుడు § వలనను నజ్ఞానము మాపినట్టి
యనఘుడైన సాందీపుని దలంప § వలయుగాద సద్గురుడు దైవ మని
నేను సకలధర్మముల మూలమయి § నేన విజ్ఞానరూపమున వెలసి
దానను జ్ఞానజ్యోతిస్సు నంది § మానితగతి నిడు గురుసేవ యనెడు
పరమధర్మమును బుధుల జేర్పంగ § గురుసేవ నలరు గంటి నెఱుగుదువు
ధరణిదేవులగు వారల ముఖ్యుడ § నరయ సకలవర్ణాశ్రమములనుఁ
సరణి నిగుడు సుజనాళి మెలంగుచు § పరముడను దేశికుడనునై యుందు
ధీరు లా పగిది యన్నివర్ణముల § వారు మరి యాశ్రమంబులను నెల్ల
వారు నే బల్కినట్టి న్యాయమున § గూరి దురితాబ్ధి నింకింతురు గద
వినుము నేను జపతాపాదులను మఱి § ఘనదానవ్రతములకు నలరకుండు
జనులు గురుసేవలను చొప్పందియు § నను భక్తి గదియ మెత్తు నవ్వారి
గురుమందిరమున మన మొక్కనాడు § గురుపత్ని నియుక్తుల మగుచు వనికి
కర మింధనముల సంగ్రహించు నెడ § భరమును గంటిమి వర్షమును తిమిర
మును జుట్టుకొనియె నంద నిలిచితిమి § మన గురుని దయను బ్రతుక గలిగితిమి
గురుని యాశీస్సు బలము పెంపునను § కరమందినట్టి వారి భయంబులు
జొరవు నిజమనుచు దెలివి నందితిమి § ధరణీసుర ! మరి యా నాటిరాత్రి
గగనమున భయము గూర్చు మేఘములు § ధగధగలు మెఱుపు లవి దిగులు బెంప
బిగువందె వృష్టి చెగడ మనకుగా § జగమెల్ల తిమిరసంతు దిట్టముగ
పెళపెళ నుఱుముల దడదడలు గుండె § తళతళ మెఱుపుల నొడల మైమఱువు
గళకళము నించు వారి ధారలను § వళులు నొడలు తడిగాలిన వడంకు
లను రాత్రిప్రళయమును దోపింపగ § నినుఁ డస్తమించి నప్పటినుండియు
కనము ఘనము చీకటిని కనుదృష్టి § గనజోము సందు బయలు లో తెత్తు
నినుడు మరి బొడము దాక పెనుభీతి § మునిగితిమి మునియు మనకొఱకు భయము
గొని పక్షిరవములను విను ముందునె § చను దెంచె వడిని తిమిర ముచ్చునెడ
గనెను మనల నొకతలమున వడకును § గొని యున్నవారి తన శిష్యులనుఁ

గనినమాత్రమున నకుటిల కృపచే ఽ దనయులను బోల్చి కౌగిలించి తన
కనుల నీ రిడుచు గటకట బడితిరె! ఽ ఘనులు ! మాఋణము నీగతి రిట్టుల
మును నాపుణ్యమునను మీాజపము ఽ తనువులను గాంచ నయె భయము తొలగె
నిందు నాయన్నలార ! జయ మమరు ఽ ముందుకాలమున నని దీవించియు
మందిరమునకు దోడ్కొని లాలన ఽ మందమింప నరయుట మది బాయదు
మనము వేదముల జదివెడి సమయము ఽ లను నన్యోన్యము లెంచనివారము
వినయధురీణా ! నిను నే మఱవను ఽ గనుకనే నీకు దర్శన మిచ్చితి
నన కుచేలు డాపద్మనాభు విను ఽ తిని గొన్నవాక్యముల సంతసించి
వనజనాభ ! యదువంశభూషణా ! ఽ నిను గుర్తెరుగుదు నారాయణుడవు
మునివిశ్రుతుడవు గురుని గృహంబున ఽ నినుగూడి కనని కృత్యము లున్నే !
మునిపుత్రు మృతిని బ్రతికించి తెచ్చి ఽ ఘనమైనభక్తి గురుని మెప్పించి
తనయుని దక్షిణగా నూర్చితయ్య ! ఽ జననమాది నిను వినికి గల నేను
త్రిజగద్గురుడవు నీవు నిగమనుత ! ఽ నిజము గురుసేవ లోకవిడంబన
మజసన్నుత ! నీకగుగా బ్రకృతిని ఽ ద్యజియించిన వారికె నీవు గతియు
సర్వంబు నిన్ను నాశ్రయించినవె ఽ యుర్వి నీలీల దైవపర మగును
సర్వశరణ్యుని నిను గన వచ్చితి ఽ సర్వశుభములను గంటి నిందునను
ననిగొనియాడిన దా మందస్మిత ఽ మున వదనాంబుజ విలసత నొప్పగ
అనఘ ! నీవు నను గన వచ్చునపుడు ఽ గొని తెచ్చి తేమి యుపాయనంబు
ననువందింపు మదెంతటివేళము ఽ నను పదివేలని మనమున నూర్చుదు
తులసిదళమైన పుష్పంబైనను ఽ ఫలమునైన సలిలంబును నైనను
యల చిత్తశుద్ధి గొలిచి యర్పించ ఽ నలరి యా జనుల నెలమి నిక్కంతు
ననిన-తా దెచ్చినట్టి యటుకులను ఽ వనజనాభునకు నిడలేకయున్న
గనె నతని మోమువంచి యుండుటను ఽ మనము వేరు గని పలుకకుండుటయు
దాను దివ్యచిత్తమున నెఱింగియు ఽ ఘను డితడు పూర్వభవమున నైనను
దానైశ్వర్యముగామించి నన్ను ఽ బూని సేవింప డైన తనయింట
నా నిజంబు చింతించి పతివ్రత ఽ యీనిమిత్తమున బతిని బంపె నని
యా నలిననేత్రి ముడిగట్టినట్టి ఽ దాని బట్టి యిది యేమని యడుగుచు
మూడి తనకరముల విప్పి యవి గొంచు ఽ గడపెద దరిద్రమును నే వీనిని
పిడికిళ్ళమాత్రమున నారగించి ఽ పడయు జేతు సిరి యింద్రుని మించగ
నని పిడికె డటుకులను వాయి గొనియు ఽ వనజనయనుండు రెండవ పిడికిలి
గొన నుత్సహింప రుక్మిణి వలదని ఽ విను నాథ ! యింతమాత్రమ సకలము

నను బొందు విభవ మైశ్వర్యమబ్బ ɉ గ న మితము తెలుప వలెనె మరి దినిన
నన నవ్వుచు విని నామెవిన్నపము ɉ మునిని సల్లాపముల బ్రీతి సించి
మందిరంబునను విందుసిద్ధమును ɉ పొందించి శయన మందించి రాత్రి
సందంది సేవనందంబు గూర్ప ɉ నందనందనుని నందించె నతడు
ఆరాత్రి యింద్రవైభవంబు తను ɉ సారాతిశయమ్ముగా నిద్రించియు
మేర నరుణోదయంబున మేల్కాని ɉ పారమంది కాలోచితములను
దీరిచి తన పల్లియదారి గన్న ɉ నారాయణుండు పాదచారియై
సాదరంబునను సాగనంపంగ ɉ నాదిదేవు నట నిల్పి ముదంబున
మేదినీసురుడు నడక సాగించె ɉ ఆదరించునెడ నా శ్రీవల్లభు
డారసి తను బూజించిన ముచ్చట ɉ నారాయణు డాడిన వాకు లన్ని
ధీరపరంబులు మునినుతంబు లని ɉ సారమతిని దాదలంచె నిట్టుల
నాపూర్వపుణ్య మరయ నెట్టిదో ɉ ఈ పుణ్యనిధిని నచ్యుతు సీశ్వరు
శ్రీపురుషోత్తము నిర్మలుప్రశాంతు ɉ బ్రాపు జేరి సుఖయించితి రాతిరి
గంటిని జగదీశుని జన్మవార్ధి ɉ గెంటుకొనకుండ దరిగాంచ గంటి
కొంటిని ముక్తిపదమ్ము శ్రీహరియె ɉ వెంటగొనును నాధ్యానం బతనికె
ఏడ బీదవిప్రుండు ? తానేడ ? ɉ నేడు ననుజేరి యడుగులను దుడిచి
పాడినెరిగి పూజించె తనశయ్య ɉ జాడల రుక్మిణి తోడుగా నన్ను
లోకవిభుడు శ్రీనివాసు డిటు నను ɉ పాకారి నెనయు భోగమును గూర్చె
ఈకగణితృప్తి నాకర్షించితి ɉ నాకు చాలు నిక ధనము లేపాటి
పోకడ గను నీ యిహంపు భోగము ? ɉ ఆకరుణామయు మన్నన శాశ్వత
లోకము గూర్చుచు ధన్యుడ నాకును ɉ పీకగాని యిడడు కాసు లేవైన
నాకలిమిని తను మఱతునేమొ యని ɉ సోకనీడు మలినంబు మదంబును
ధనమదాంధుండు తనులెక్కగొనడు ɉ తన ధర్మమార్గమును వ్యతిరేకత
గని సాదుబీదలను మత్సరించు ɉ నని దలచె మేలు నా కబ్బె ననుచు
కనెను వడిసి తేన మార్గముతప్పితి ɉ నని దోచునట్లు తప్పం దైనను
కనె ముందు చంద్రసూర్యప్రభలను ɉ కనక చంద్రకాంతోపలసౌధము
లను నీలకంఠ శుకకలకంఠము ɉ లను కూజితంబు లెనయు నుద్యాన
వనముల వికసిత కమలాదికముల ɉ ననువొందు విమల జల కాసారము
లను మణిమయ కనకపు కంకణాదు ɉ లను దాల్చినట్టి దాసదాసీల
జనసంకులంబు సుందరభవనము ɉ గని కుచేలుండు తన నిలయమనక
వెను దిరుగు చింత నిందేపుణ్యుడో ɉ తన నివాసంబు గూర్చియున్న వా

డనుచు దలపోయు నంతలోపలనె § తనను దయచేయు డనుచు నా దివ్య
వనితల బోలిన దాసీజనములు § మనము నద్భుతము దోప సంగీత
మును నృత్యవాద్యములు సెలగించుచు § ఘనుని జేర్చి రా భవనద్వారమున
లోపలనుండియె పతిరాక నెఱిగి § యా పుణ్యవనిత హర్షించి యంత
ప్రాపందినట్టి విభవము పెంపున § రూపు గాంచు శ్రీదేవి చందమున
నానంద బాష్పలోచన యగుచును § దానందె వడిని విభుని చరణముల
నానించె శిరము నాతికరములను § బూనిక మొగిడ్చి జీవితేశ్వరా!
వనజలోచనుడు నినుగూర్చి నిట్టి § ఘనతర వైభవమందు శుభంబును
మును పుణ్యకలిమి ఫలితమందితిమి § యనుభవింపు డిక శుభపరంపరల
నా విని స్వప్నము గాదు వనమాలి § పావనంపుదయ లీ విభవరాశి
భావశుద్ధి గని భామ మ్రొక్కులను § దేవు డీపగిది వరమున దవిలిచె
గన పద్మరాగ స్తంభములచాళ్ళ § నలవొందు స్ఫటికశిలల కుడ్యములు
కనకరత్నమయ ద్వారసంతతులు § గనగ నింద్రనీలముల గవాక్షులు
ఘనతరంబైన వేదులును చల్ల § దనమున గుదురగు తరులు ముంగిటను
గలిగియును హంసతూలికాతల్ప § ములను విలసిల్లు లోమందిరములు
కల పదార్థచయమెల్ల పూర్ణముగ § నిలవరం బంద నిలయమును జొచ్చి
కలతనందు తన మనమున గలిమిని § గలిగె నాకనుచు వికారమందడు
తలచె నెదలోన హరికృపాకలిమి § లలన ముడిగట్టియున్న యడుకులను
వలరున భుజించె నహాయ నందక § జలజాక్షుడు తృణమైన భక్తులను
గొనెనేని గూర్చు నతులిత ఫలమిటు § రొనరందు గాన జపతపోవ్రతము
లను నిల్పిగూర్చు సత్వము నందెద § తను జపించుఫల మింతియే గాదు
అపవర్గభోగమును గూర్చు ననుచు § నృపవరా! మరియు నిటుల దలపోసె
నాకేమి సెప్పకనె సాగనంపి § లోకేశు డిట్టి కలిమి నాయిల్లు
నేకూర కరుణమాడ్కి వెలువరించె § నాకు చోద్యముగ మహిమ్మగన బరచె
నేనిందు మిగుల సౌఖ్యము నందను § తానె ననుభక్తి గూర్చు జన్మముల
దాన నపవర్గమును దాప కిచ్చు § నూనెద జపంబు యోగము ననుచును
భాసురమతి యా భూసురవర్యుడు § వాసుదేవు డిటు గాసిల దా గొని
పీసమైన యాచింప గనకున్న § వాసినిక్క సర్వంబు దానమిడె
హరి జపించు ఫలమింట నెన్నబడియె § నిరతము నీవది స్మరింపు నృపవర!
దళమందె మోక్షమును కుచేలుండు § పరమపదము నీవందెద వట్టుల
నిందు సంపదయును బొందుము ముందున § బొందె దానంద మీచరితంబును

సం దంది వినగ నిహాపరసౌఖ్యము ॥ లందు మందమతి వదలుఁ బఠించిన
ననుచు వచించిన యజ్ఞను బౌతుృకు ॥ మునిపరాశరుని పౌతుృం డడిగెను
వినెద హరిచరిత లింక జెప్పు మన ॥ ఘనమున నలరుచు శుకముని యిటులనె

—: శ్రీకృష్ణుండు సకుటుంబముగా గ్రిహణస్నానమునకుఁ బోవుట :—

విను శ్రీకృష్ణుడు బలరాముండును ॥ ఘను లన్యోన్యత ధరణి బాలింప
నినపరాగంబు నొక వత్సరమున ॥ గన కల్పాంతము నందలి విధమును
వోప దా వినియు భూజనులందరు ॥ ఆ పుణ్యసమయమున తీర్థమంద
పా్రి పేది యనుచు బరికించి తెలిసి ॥ యేపున శమంత పంచకము జేర
దరలుటను గాంచి రా ఘను లిరువురు ॥ నరనాథ! వినుము ఆ తల మెట్టిదొ
ఇరువదియొకపరి రాజులను వెదకి ॥ పరశుధార ఖండించి రాము డా
నరపతుల రక్తమును దొరలనైన ॥ వరదల నైనుగ పితృతర్పణంబు
జేసినతల మది యతడు విష్ణుడగు ॥ నా సుచరితుృఁడు భృగుకులరాముడు
ఆ సమీచీన తరుణమున కట్టి ॥ వాసి గను పుణ్యనెల వాసితును
వారిజ నయనుం డట బోవ నున్న ॥ నారమణీయము నే గాంతు ననుచు
జేరి బలుడు నా యాలోచన గొని ॥ ద్వారకకు రక్షణమునకు నిలిపెను
ధీరుల ప్రద్యుమ్ముని గద సాంబుల ॥ సారణను చందృ శుకులను నని రు
ద్ధాదుల తానును సంకర్షణుండు ॥ మోదితమతు లగు సుగ్రసేనాది
యాదవవృద్ధులు నకూ్రరుడు మరి ॥ యాదవులపెద్ద వసుదేవుండును
వారలకాంతలు తో డంది రాగ ॥ చారుతరములగు వస్త్రాభరణము
లారసి గైకొని మరియు మనోహర ॥ పారమందు సృక్చందనాదులను
కూరిమి గైకొని సుందరతరమున ॥ మీరు విమానము లనూన రథముల
ఘనములగు కరుల వడి తురంగముల ॥ జనుల సుర సముల సందడుల తోడు
గొనుచు నటు జేరి కని రొక్క విడిది ॥ మనము నచ్చు శీతలము ఛాయగను
వినురక్మి సారని తరుల పొంతలను ॥ దన పరివారము జుప్పి నిలిచియును
గనిరి పుణ్యతీర్థముల స్నానముల ॥ ఘనత నుపవసించిరి యా నాటను
మునుకొని ధేనువు లాదిగాగల్గు ॥ కనకరత్న భూదానము లొనర్చి
ధరణిసురుల బూజించి దక్షిణల ॥ కరము తోషింప తా మల్లి గుదిరి
పరము పర్వముగ మరి యవగాహము ॥ వరుసగొని బంధు హితులతో గూడి
సురుచినందు భోజనములు దీరిచి ॥ కరము పీ్రితినించిన పల్లవముల
నరుదార దెచ్చి యాసీనరుచిని ॥ సగణి వేడుకల పరిమోదించిరి

నందనందనులు పరమానందము ఽ నంది యచటి సంగతుల నరయునై
మందహాస వదనారవిందుడై ఽ సుందరం బొప్పుగాని చూచుచుండె
విను రాజమండె నచ్చట జేరిన ఽ ఘనులు నృపులు మాత్స్యోశీనర భూ
జన పాలురు కోసల విదర్భ కురు ఽ జనపదనేతలు కేకయ కేరళ
మనుజ నాథులును మద్ర కాంభోజ ఽ జనపతులు సృంజయాధిపు లందరు
విను మఱి రాజన్యులు హితబాంధవ ఽ వరులుం గూడిరి మరియుం జెప్పెద
వనజ నయను బాల్యమున బోషింప ఽ గనిన నందగోపాది గోపకులు
వనితలాదిగా మంద గలవారు ఽ తన బంధులైన కుంతీపుత్రులు
మునుకొన భీష్మ ద్రోణ ధృతరాష్ట్రులును ఽ గాంధారీ కుంతి పాండవులు
వనిత ద్రుపదసుత మొదలైనవారు ఽ విను మఱి సంజయ విదుర కృప కుంతి
భోజుడు విరాట భీష్మకులును మరి ఽ రాజవీరులగు లగ్నజి ద్రుపద
రాజు లట్టి శైబ్యుడు ధృష్టకేతు ఽ లా జవంబుననె కాశీరాజును
దమఘోష విశాలాక్ష మైథిలులు ఽ క్రమతను ధామన్యుడు సుశర్మయును
సుమమతి బాహ్లికు డతని సంతతియు ఽ నమిత మోదమున యాదవుం దరిసి
రంజితంపుమతి మానము నందగ ఽ బూజించి రట్టి వారలం జెలగి
రాజీవనయను నంద రానృపులు ఽ తేజ మలర గన జేరిరి సద్విధి
కూరిమిని మనము గూర్చి గాంచిరా ఽ ధీరుని దానవకుల సంహారుని
క్రూరభయంకరు గోపీహృదయ వి ఽ హారు సుందరాకారును దారుని
గని చేర గాగ రామకృష్ణులకు ఽ జననాథవరులు తగు పూజ లిచ్చి
చనువు పెంపొంద వినతు లవి సెల్ల ఽ మనముల మోదము గూర్చిన వారలు
ఘనత మిన్నంద నుగ్రసేనాది ఽ మనుజపతు లెల్ల విన నేకమతిని
వనజదళ నయను నిటుల నుతించిరి ఽ మునులు మెచ్చ దగు వాక్ప్రపంచమున
వనజాసను జనకుండగు విష్ణుడు ఽ మునిజనావనుడు లోకేశ్వరుండు
మనము మనశ్శాస్త్రంపు వాక్కులును ఽ మనసు భేదములు తనువులు మనువులు
ఘనత నించు శోభనము గాంచు నీ ఽ ధనభోగాదుల పావనం బెన్న
నీ మహనీయుని చరణ కమలముల ఽ నేమంబు గొన్న ధ్యానపరంబులె
ఈ మహాత్మపద స్పర్శ గన్నట్టి ఽ యా మహీతలము తీర్థరాజంబు
సనకాది మునీశ్వర దుర్లభముల ఽ ఘనతరంబు లగు నిగమజాలముల
గన నసాధ్యములు యోగాదికముల ఽ కును నవేదితము వీని వర్ణనలు
పాపహారి యగు నీతని లీలా ఽ రూపంబు లట్లె నచింత్యమ్ములగు
ఈ పగిది నిచట మాంసపు కన్నుల ఽ రూ పంది చూపు నందించె మనల

రూపింప పరబ్రహ్మ మీతడగు § ప్రాపు నంది దరి నిలిచి రక్షింప
నేపాటి తపములను మును నోచిరో! § ఈ పరమేశ్వరు జననీజనకులు
అరయ పుణ్యాలోకమ్ముల సుఖమ్ముల § తరమందు మోద మీ హరిదర్శన
పరమునవె సిద్ధముగ గాంచ నగును § హరిపరంబైన మనమందు సాక్షి
పరమాత్ము డితడు కరుణామయుండు § దురితాపహారి నిరతానందుడు
హరిరూపు గనుచు హరిని బలుకుచును § హరిని స్పర్శించుచును హరి బాడుచు
హరితో నడచుచు హరిహితుడు నగుచు § హరి గలసి నగుచు హరిసేవ సలుపు
చును సర్వంబున హరిస్మరణ మాన § కను నచ్చు గన్నవారి భాగ్యంబు
లేమని వచింప నగు నీపట్టున § నా మహనీయుని గాన నయ్యె నని
యా మహీపాలు రటు పరిణమింప § కామిని కుంతియు పాండవుల జనని
అన్నయైన వసుదేవుని డగ్గరి § కన్నపుత్రులను గాంధారి సుతులు
కన్నకష్టముల గూర్చుట లెన్నగ § కన్నుల నీరును నించి యిట్లనియె
వీరెల్లు రడవిలోన దిరుగాడు § పాయు గాంచుటలు మనమున దలపవ ?
మీ యనుగుజాడ మాపై రాదా ? § అ యబ్జాక్షుడు తోడ్పడు గాదా ?
బలవంతము విధి గాగా బంధులు § తలతురె దరికిని జేర బిలిచికొన
నిలలో నుత్తముల సరణిని తెలియవె ? § కలత లడగ నుపమును గూర్చుమన్న !
యని బాష్పధార లొలుక ధృతి గలుగ § వనిత బలుకులను శాంతి నలవరుప
ఘనుడు వసుదేవు డాచెల్లెలి గని § వినుము తల్లి ! సంతాపము గొనకుమ
వనిత విధిచాలునను సొలయనేల ? § విను మఖిల నియామకు డీశ్వరుండు
దనమాయ నిట్లు లోకముల మెలపు § మనము కర్తలము గామని దెలియుము
కీలుబొమ్మ లీజీవు లందరును § డాలంద జేయు నా సూత్రధారి
మేలుకీడు లవి కర్మవశంబులు § జాలి వడ నేల ? దైవతంత్రముల
మము బాము లిడడె ? క్రూరత గంసుడు § మము కొండలపా లందుట వినవో!
కష్టలనష్టముండు గలుగుట మేమును § శమము గంటి మటు కాలము గనవలె !
శ్రీమ దొలగించును నా పరమాత్ముడు § విమలమతిని ధ్యానింపు మమ్మ ! యను
నంతలోన నందాదులు యశోద § సంతసంబు నొప్పంగ నచ్చటికి
మంతనములు హరిదశ నందించిన § వింత లొప్పగను గోప గోపికలు
నందనందనుని మందరగిరిధరు § వందితాఘురు సునంద పరిసరుని
ముందు బ్రహ్మ పుట్టించినవానిని § క్రిందుమీదు లోకములు బొజ్జలో
నందమింప దాల్చిన యట్టివాని § కంద మంచు వడిరాగ యాదవులు
వారు భోజాది వంశములవారు § కూరిమి నింపుచు నెదురుగా నేగి

మీరు కుతుకముల నాలింగనాది § సారతరము నడవళ్ళను గూరిరి
నందుని సందిలి నంది వదల డా § నంద నిమగ్నుడు వసుదేవుండును
నందసుందరిని దేవకి రోహిణు § లందిరలై మోదాశ్రుపూరములు
కన్నులు మనములు నిండి వెలివారు § చున్నయట్లు గాంచగ నై వారి
వన్ని హృదయముల వన్నెలల్లి యగు § మిన్నప్రేమ లా మిన్ను నిడివి గన
నుండి నప్పుడే పుండరీక నయ § నుండు రాముండు దండ రా వడిని
నిండుప్రేమ తోలుకాడ దిగ్గు గని § దండము లివె మా తల్లిదండ్రులకు
గండుకొనెడి దయ మము బోషించిన § దండిబుద్ధి మీయందు చిరమనుచు
నంద యశోదల చరణముల వ్రాల § కుందు వందురుల మాపు మనమ్ముల
నందమించి యాఱలేని స్నేహముల § పొందుగొని మాన మంది రొక్కింత
నందనుల రామకృష్ణుల యశోద § యందుకొని యంకములచేర్చి ముద్దు
గొనియె చెక్కులను శిరములు మూర్కొన § కనికరమున చుబుకముల దడివ గన
మనము తమికొలది యాలింగనముల § గనెను మఱి మఱిని యా నందురాణి
స్థిరమతిని గనుచు రోహిణి దేవకి § పరిసరము గొనుచు ముదము మొలకెత్తి
వరుస వృద్ధిగొన తఱి గని కౌగిలి § సరగునను జేర్చి మా యమ్మ నీవు
పరిరక్ష గూర్చితివి వీరి మమ్ము § కరుణామయాత్మవగు నిన్ను మరవ
తరము గొన మెపుడు ఓ తరుణీమణి ! § పరమ సుగుణరతుడైన నీ వరుడు
మా తలంపునను నుండు నెల్లపుడు § మీ తలన మేము ప్రత్యుపకారము
యే తెఱంగునను గూర్పము నతులనె § మీ తత్త్వమ్ముల గూర్తుమని మరియు
కనుట మాపాల పెనుపు మీపాల § జననీజనకులు మీరనియె మరులు
విను వీరికి నీనాటికి నైనను § మునుకొని మిమ్ముల ప్రేమం దలతురు
మమును మిము బోలె గనెద రైననుఁ § మమత పెంపు మీపైన మిక్కుటము
అంటిన ప్రేమను కంటిరెప్పవలె § కంట మీరెప్ప లడ్డ మెంచకను
మింటిప్రవాహమువలె దయ దోపుచు § కంటు కుంటు గన బోవు పోషణల
గెంటి రాపదల జంటుల నెన్నో § దంట లిపుడైరి గొంటుల నడంచి
ఇంటిలో వెన్నలు దిన్న బలము నీ § చంటిపాలు ద్రావుటకంటె బలము
నీభాగ్యమె భాగ్యమ్ము సుమ్మనఘ ! § యా భాగ్య మంద చను బాల్గుడుపను
యే భాగవతుల కబ్బు మీపదము § మీభాగ మదియె పొందుడు మిథునము
లను నంతలోన గోపసుందరులు § వనజనయను దమ హృదయేశ్వరునిఁ
ఘను నిత్యానందుని గోవిందుని § మునివందితు నానంద ధామునిఁ
ఆనందవనము వెలివిరియ దోవు § చానందవా+ తోళుకుల చిందుల

తో నందమింప తలపు లెల్లగొన § కాననముల చిరునవ్వు చిందాడ
వనజదళ నయను గని కనులు మూయు § ననువు మరచి నటు మనము లందునను
వనజభవు వినుతు మూర్తినె నిలుపుచు § ఘనమతి తలపుల కౌగిళ్ళ నంది
పులకలు మేనుల చాదినటు బోడమ § వలపున బాలతులు దరిని నిలువంగ
తలపు నెఱిగె పరమాత్ముడు కృష్ణుడు § అల యోగిజనుల చాలున రమింప
వల గన్న యట్టి వనితల జాడల § నలరు నింప దా యత్నము నందియు
నలినలోచనుడు వారి నేకతను § కలయు రం డనుచు నట్టుల గూర్చియు
తలపు సిద్ధింప పరిరంభణముల § నలరు నించి దరహాసచంద్రికా
కలిత కపోలుడునై తా బలికెను § నలినముఖులార ! బలవద్రిపులను
నలజడుల మాపి జయము గొను నెడల § మెలగుటల కాలమొక్కింత జరిగె.
నలుకుడు మీర లది దైవవశము § నిలువగ మొక్కపు డేని సతతంబు
గలుగబోదు జీవులకు జగములకు § తెలియుదురె మీరు నా సంగతినిక
నలవడితి రిట్లు నేనట్లు మీకు § లలనలు వినుండు గాలి ధూళి దూ
దిని తృణములును నాదిగాగ జేర్చియు § గన దరలించును వాని నింకొకట
వనితలార ! భక్తి చేతనుల § దనర జేతు మోక్షానందపదము
జప తపోదాన వ్రతనేమంబుల § నపవర్గదాయి నగు నను బడయుట
విపుల దుర్ఘటము భక్తసులభుడను § చపల మడపియును విధి శివ సనకా
దులు విమలచిత్తమున భక్తి నిగుడ § తలచి సిద్ధి నందెదరు నాయందు
వలపు నిలిపితిరి మీభాగ్యమెంతో § కొలది మీరునది తులగా వితరము
రమణులు మీరిక నందరు భవముల § నమల బుద్ధులకు మీకు నిరయగతి
క్రిమవసతి దప్పి పాపము నశించు § భ్రమలు వదలు మిము నాదీవన లివి
అటమటము గాదు నాపలుకు నిక్క § పటమగును దెలియుడో యువిదలార !
ఇటమీద నెపుడు మీచెంత విడను § కుటిలకుంతలులు మమతల నెఱపుడు
ఘట పటాది భూతముల కార్యముల § తటమందు కారణముల చెన్నొందు
గగనానిల ననలంబు జలభూము § లగు భూతపంచకము లైక్యత గన
నగు పంచీకరణ వ్యవస్థలను § దగ బుట్టినట్టి భూతజాలంబు
లవి భూతకార్య కారణములచే § దవిలియుండ నన్నిటికి నాధార
మవుదు నేను నా కన్య మొక్కటియు § దవులదు విమలురు మీరు మరువకుడు
మాట లేల ? పోరాటము మీతో § నాటగాదు నూటిని నాడితి నిదె
నీ టం దెద రిదె ముమ్మాటి కనుచు § బోటుల తమి వాటముగ దా దీర్చి
తటము గన జేసె బ్రహ్మానందము § జటిలసన్నుతుడు జగదీశుడు హరి

చటులము లడంగి కుటిలాలక లా ఽ నటుని వర్తనము పటు వందినట్టి
కటువు లవమేని వట గనని శాంతి ఽ ఘటితు నచ్యుతుని నిటుల దండములు
ఘటిల్ల బోటులు తటిల్లతల వలె ఽ దిటవు కాంతిచే భూషిత తనువుల
శిరములను వంచి సిగ్గు లోగొనుచు ఽ కరములను మోడ్చి కౌస్తుభమణిధర !
అంబుజనాభా ! వికచాబ్జనయన ! ఽ కంబుకంధరా ! కరుణామయ ! శ్రే
యంబు నీ కగును బాయ కెపుడు మతి ఽ న్యాయము దప్పక పాలింపు మమ్మ
సన్యాసులు నీయాదరంబు గన ఽ నన్యముల మఱచి నిను శరణందుదురు
ధన్యు లౌదురో కాదో యున్నది ఽ కన్యలకు మాకు కరుణించితి విట
ధన్యులము మేము వారును ధన్యులె ఽ మాన్యంపు విధియు మాకు వారికిని
మా నియమము నీ పాదకమలముల ఽ ధ్యానించువరము పాలింపవలయు
మా నతు లవి గొని యానతి నిమ్మా ఽ చానల హృదయములోన దీపింప
వలయు నన నల్లె యొనర గరుణించి ఽ జలద శ్యాముడు తా సంతసించె
నల ధర్మతనూభవుడు గనగాగ ఽ నిలను సాగిల్లి సేమం బడిగియు
ననఘా ! నీతమ్ములు బంధుజనులు ఽ ననుచరు లందరు కుశలంబ ! యనిన
విను వనజనాభ ! నీ వెం దున్నను ఽ నిను గొల్చువారి శుభములు వాయునె !
గనినార మన్నిటను సౌఖ్యంబున ఽ నిను జూడగంటి నే నిట కృష్ణా !
మునిజనావనా ! జాగరంబాది ఽ గను నవస్థలను బాసి తేజమున
వెలి లోన వెలయు విశ్వంబ నీవ ఽ అల విశ్వమంత నీయందె వెలుగు
తొలగింతు వొకట విశ్వంబులన్ని ఽ నిలుపుదు విచ్చను నీయందు రతిని
నీ వఖండ విజ్ఞానమూర్తి వని ఽ భావింతురు ఋషిగణము లో దేవ !
పావనమూర్తీ ! మాయావినోద ! ఽ కేవల మాయావిదూర ! శౌరీ !
నీవు దురితదూరులకు ముక్తులకు ఽ తావిత్తు వనెదరా దీప్తిపదము
రోగా వికారహర ! మునుల వాక్యముల ఽ సావకాశ మందిన నిన్ను గొల్తు
మనమ్మున నెుక్కడ దినమును కృష్ణా ! ఽ నినునమ్మి నార తుయ్యా ! తమ్ములకు
కనవలయు మమ్ము కరుణ నికముందు ఽ వినవలయు పార్థనం బంత వట్టు
అన చిరునవ్వున మంచిదని నెరు ఽ గవిపింప నాడ వారివాక్సరణి
గని మనుజపతులు బంధురాజియును ఽ జను లితరులైన వారలు మెచ్చిరి
యెుక లది విన్నను గుండె ఝల్లనగ ఽ పరమ శాంతుండు పరమేశ్వరుండు
ఇరువు రైక్యముగ ధరణి కంటకుల ఽ చిరతరభాగ్యము నిలుచునా యనిరి
అట్టి తరుణమున నొక్క మట్టంబు ఽ దట్టితలంబున ద్రుపదు భూపుత్రి
చుట్ట సంబంధులగు కృష్ణసతులు ఽ చుట్టు వేష్టింప సంతోషకలిత

వీ వనజనయను కృష్ణు ప్రశంసల ॥ నే వివరమరయు చుండి యావారి
వా వివాహచరితముల బల్కఁ డన ॥ నా వామనయన లంగీకరించి
దేవి వినుమనుచు రుక్మిణీదేవి ॥ తా వనమాలిని బెండ్లియాడుటయు
పావకాశముగ మును నీవు వినిన ॥ పావనచరిత్రి! గీటు తప్పకను
ఆపదిని వినగ జెప్ప నవ్వుచును ॥ భావముల మఱుగు పరుపక నట్టులె
వినుము జాంబవతి సత్యభామయును ॥ నిను సుత కాళిందియు మిత్రవింద

**లక్షణయను శ్రీకృష్ణునిభార్య ద్రౌపదీదేవికిఁ దన వివాహవృత్తాంతంబు దెలుపుట**

యును నాగ్నజితియు భద్రయు నట్టుల ॥ వనిత లక్షణయు వరుసగ జెప్పిరి
వినినాడ వన్ని చరితల నీవును ॥ వినిపింతు నిపుడు విశదముగ వినుడు
ఘనుడు మద్రభూపాలు వరతనయ ॥ వినయశీల లక్షణ వివాహంపుం
జరిత వినుము నటు ద్రౌపదిని జూచి ॥ సరసమతి దనదు పరిణయంపుకథ
పరమప్రీతి విన బలికె నందరును ॥ దరహాసితవదనములను వినుచుండ
వినుము రాజపత్ని పాండుభూవరుని ॥ తనయులరాణివి నగుట నట్లంటి
నని నవ్వు గొనుచు నా తాతయైన ॥ ఘనుడు మద్రపతి నను వరుని గూర్చ
నరయుచుండి ముని వరుల నడుగు తరి ॥ సురముని నారదు డటు మాతండ్రికి
నరనాథ తనయులను చాటుచుండి ॥ సరసిజోదరుని మాయక్క యీయమ్మ
సురుచిరాంగి సుందరము వినియుండి ॥ హరికృష్ణునకై బ్రాహ్మణుని బంపి
వరించె నని విని నే నట్లె యనుచు ॥ సరసుడైన మా పితకుఁ జెప్పితిని
బరుల గోర నని పట్టు బట్టితిని ॥ సరణిఁ దప్పనని యొట్టును గూర్చితి
గట్టిదానవని చెలులు నాతట్టు ॥ పట్టు బిగువంద దిట్టత గూర్చిరి
ఇట్టి ఘటన యే తీరు గందు నని ॥ గట్టె మీనయంత్రమ్ము మిన్నునను
ఎత్తెంతో నుంట నందు గనరాదు ॥ ముత్తెపుజప్పలో జలంబు బోసియు
గుత్తిగొనుచూపు నందున నిలిపిన ॥ మొత్తము గన పడు మింట నాచేప
వినుడు యంత్ర మది దానిబాణమున ॥ వనువు లక్ష్యమున పడవేయునట్టి
ఘనున కిత్తు నాతనయ నని చాటె ॥ జనులు భూముల నిండించె వార్త
యన రుక్మిణి యా లక్షణను జూచి ॥ వనజనాభునకు నన నడ్డు దగిలి
అనకు నక్క నే జెప్పునది వినుడు! ॥ మన వదినె యడుగ జెప్పుట తగునని
తలచి బలికెదను మీరు జెప్పితిరి ॥ కిలకిల నవితిని నేను మీవలెనె
వలరు గొలది వచియించెదని వినుడ ॥ తల లూచి నవ్వుల తక్కురు వినగా
నని మరల నట్లు మాతండ్రి యత్న ॥ మును విని వచ్చిరి రాజనందనులు

వినుడు మీానవ్వులను కొంతజెప్పి | టను మరచినాను దానిం జెప్పెదు
మెవ్వ రెత్తలేనట్టి ధనుస్సును | చివ్వలను గెలుపు గొనునట్టి శరము
దవ్వుల నిలువగ నుంచు దాననే | రివ్వు గన దాని గొట్టం గనవలె
పక్కన పూజకు గాను యేర్పాటు | చిక్కని గంధము మంచి సువాసన
నిక్కపుష్పముల నుంచియు నుందురు | నెక్కగను నతడు పూజించవలెను
ఇది తెలుగు గాగ రాజసుతులు విని | గదియ రా నయిరి మాపురంబునకు
మది మోదమంది మాయప్ప వారి | గదిపై మర్యాదలను లోప మిడక
అందరికి చెప్పె తా నెదుర నిలిచి | యుందు రుత్సాహ మందుచు దానిని
సంధాన మంద జేతు మనుచు నా | యందమును గాంచి మెదల మరల్పరు
తండరలు వారు జట్టు కొనంగా | కొంద రది గాంచి వెనుకకు దారిరి
కొందరు పూజను గొనక వెను గనిరి | కొందరు ధనుస్సు నెత్తలే రయిరి
కొందరు మోపిడ లేక నట్లయిరి | కొంద రొక్కింత యెక్కిడి మానిరి
విను డందు భీముడును రాధేయుడు | ఘనత నిలువంగ నే పరమేశ్వరు
మనమున మ్రొక్కితి కోర్కె గూర్ప గను | వినుడు నా ధ్యాన మెట్టు గూర్చితినా!
మీారు దెలియుదుర యన నవి నంత | వారిగని నవ్వు కించిత్తు కినుక
గూర దాప్రదియు శాంతి దెలిపియును | మీారు సంతోషమతులె యో యబల!
మేర లేదిందు నపహసింప రని | మీారు ముదంబున ధ్యానము వినుడని
పురుషోత్తమ! జగదీశ! రమాపతి! | సరసిజోదరా! నను శ్రీకృష్ణుని
వరించి వర మిడు పదుల నే నొల్ల | చిరంటి తనమున నతని రాణినై
తరంబు గొందును ప్రమోద విభవము | నిరంతరంబును నిను బూజింతును
వరుస గొందు నీనాడె నీపూజ | వరద! నా మతిని పరము నీకూర్చు
త్రికరణశుద్ధిగ రుక్మిణీపతియె | సుకరముగ నాకు జిక్కంగ వలయు
అల జాంబవతికి ధవుడె నా భర్త | తిలకింప సత్యవరుడె నా మగడు
పాలించు నన్ను కాళిందిప్రియుడు | లాలించు నాగ్నజితి పెనిమిటియే
తా లిడదు మిత్రవింద మిత్రుండు | వల పెరిగి బ్రోచు భద్రదయితుండే
గట్టి పట్టు గని వర మట్టి దొసగు | చుట్టను లెవ్వరు ప్రాపుగా రిట్టి
పట్టున నీవే యని నమ్మిన నీ | చిట్టి కోరికను సిద్ధిగ మ్రొక్కితి
వీని వర మొసగను హరియని దలచితి | చిట్టి కోరికను సిద్ధిగ మ్రొక్కితి
విని వర మొసగెను హరియని దలచితి | మనమున మరిమరి సన్నుతించితిని
దాన భీముడును రాధేయుండును | దాన పని గనక తిన్నగ దొలగిరి
దాన నర్జునుడు విన్నదే యయ్యె | మీానవేత్రి! యో వదినె వింటివా!

నే నది గాంచియు నవ్వును గొంటిని ఽ దాన వారి యట దా ధీరు డగుచు
అందరును జూడ ముందరికి వచ్చి ఽ ముందు పూజ సెల్లంగ నవలీల
విందు నాకుగా ధనువు నెక్కిడియె ఽ చిందునే గొనగ బాణము నందెను
పొందిక లక్ష్యము గూర్చె నా డెంద ఽ మందము గొనగా దాన గెలు పందె
భ్రమలు దొలగ నందరికి నా మీద ఽ క్రమమున గురిసిరి పుష్పవర్షమును
అమరు లాకాశమందు నిలిచియును ఽ విమల జయశబ్దముల దెసలు నిండ
చారణ గంధర్వాప్సర సంతతి ఽ మేరల నాటల పాటల మ్రోసిరి
సారసనేత్రిలు నన్ను జుట్టుకొన ఽ మీరిన కుతుకము నే నంద గొనగ
విధివిధానమున నను వెంట గొనుచు ఽ నధికారవర్గములు ముందు నడువ
సదనంబు వెడలి చదురున జేరితి ఽ ముదితలు ముదమున గూర్చిన మెఱుంగు
గల పుష్పహారమును జేతికొసగ ఽ నలరున నడుగులు తడబడ జేరితి
యుల చెమట గ్రమ్మ నడుము వడుకు గనకపులకలు బొడమెను తనువు వడి గవగ
యుల పద్మాక్షుని దరిసి హారమ్ము ఽ కిలకిలలు చెలులు నవ్వ నా వరుని
మెడను గూర్చితిని జడు పవుడు దీరె ఽ జడిగొన మంగళవాద్యములు నిండె
వడిగని జేకొను వారిజాక్షుండు ఽ కడక నను నెత్తికొనియె సిగ్గు గన
గరుడు డమృతంబు గైకొన్నభాతి ఽ నరనాధసుతల గణన సేయకను
తరమంది నన్ను తన రథముజేర్చి ఽ కరము భాస్కరునివలె తేజరిల్లి
దరమునుండె మఱి రథము తా నెక్కి ఽ సరణి గనె తనదుపురము నను జేర్ప
ధనువు చే బూని శరముల నటులనె ఽ వినుము దారకుడు రథము రొప్పంగ
గనె వేగమ్మును నాల్గుతురగముల ఽ వనజనాభు మహాసీయుత నెఱుగక
కినుక గొని వెంట జుట్టి రచ్చోటి ఽ జననాధతనయు లంద రొక్క మొగి
కనెను సింహవిక్రముడు కృష్ణుండు ఽ కినుక తా బూని శరపరంపరలు
దను జేరి జూడజాలని యనువున ఽ ఘనత తా నంది ప్రయోగ మొనరిచి
కసిబిసి వారిని నించి జయముగొని ఽ వెస దునిమి వారిచతురంగంబుల
ముసరుకొన్నట్టి సేనల దుంచెను ఽ ముసిముసి నగవుల నాభయము దార్చె
హతశేషసైన్య మొటులనో బారె ఽ హితములను గనక నటుల భూపతులు
బ్రతుకగంటి మీ సింహకిశోరుని ఽ నితర జనపతుల బోల డీత డని

## —: నారదాదిమహర్షులు శ్రీకృష్ణదర్శనంబు చేసికొని వసుదేవునిచే గ్రతువు చేయించుట :—

వారు పారగని పాంచజన్యంబు ఽ పూరించె పురిని తనవారు చెలగ
నారదు వినుతుండు నగధరుడు నన్ను ఽ జేరిచెను ద్వారవతిని భవనమున

మాతండ్రి యంత కౌతుకంబు గొని § కూతు నను జూడ దెచ్చె మావారి
చేతము మోదము గూర్ప నరణంబు § బ్రీతి వెలయ దా నిచ్చె నల్లునకు
నవియు జెప్ప దన నన విని వారలు § యువిద వినిపింపు కొఱత వల దనిన
నవ్వు మోము దోప వారిని గనుగొని § చెవుల కింపుగాఁ బాటగ వచించె
చెవులకు బోగులు చేతుల కడియాల్ § భువి జనులు మెచ్చు పాదనూపురాల్
మువలు గూర్చినది కాంచన కాంచియు § సువిశాలకాంతి గనెడు మకుటంబు
వన్నె నిక్కు రత్నాల యుంగరము § లన్ని వ్రేళ్ళకును సరిగొల్పుచుండు
చెన్ను మించు భుజకీర్తులు దండల § వెన్నొ బంగారు వజ్రముల మాని
కముల దాపినవి పెక్కులు నిగ్గుగ § క్రమమంద నట్టె కరితురగంబులు
విమల రథంబులు కొందర భటతం § డములను మంచివి పీతాంబరములు
కమనీయ తల్పములు దాసీలును § సమమతిని నిచ్చి నను నప్పగించి
నాకు బుద్ధి సెప్పియును మోదమున § మీకు అక్కలకు నను నేలు మనుచు
వీక గొని విన్నపమున నను జేర్చె § మీ కరుణ నాకుఁ గొఱత లే దనుచు
అక్కలకుఁ జెప్పి ప్రక్కకు దిరిగియు § మ్రొక్కె ద్రౌపదికి నిక్క మిదె నాదు
చక్కనిపెండిలి కథ వినజేసితి § దక్కించుకొనుడు ముద మిందువలన
నని యా లక్షణ చరిత్ర వినిపిం § చిన వెంటననియె మాతండ్రి పేరు
విన నడుగరు గద యన నవ్వి యడుగ § వినుడు నను బృహత్సేను తనయగా
నని ముదము నించె నచట నెల్లరకు § జననాథ కుంతి గాంధారి మొదలు
కొని యశోద గోపికలు మనములను § వనజ దళాక్షుని నుతినేయ గనిరి
కరుణాసముద్రులును శుభకరులును § నరయ సురసేవ్య చరణ కమలురును
పరమపురుషులును రిపుభయంకరులు § వరదులు విజ్ఞానముల నిధు లనగ
లోకవిడంబను లగు పరేశ్వరులు § శోకజేయ ధర్మమును నిలుపంగ
నీకరణి భూమిభారము వహింప § నా కమలాపతి రెండంశములను
ధవళనీల వర్ణముల దీప్తిగను § దివిజ వినుతు లా రామకేశవుల
సవన ఫలార్పిత విమలమూర్తులను § తివిరి దర్శనము చేయుద మంచని
పరమ తపోధనులైన మహర్షులు § సర సరవారల గొందఱు వచింతు
నరసుడైన వ్యాసుండు దేవలుడు § వరుస నారదుడు గౌతము డగస్త్య
డును చ్యవన కణ్వ గాల వసిష్ఠ § లును మార్కండేయుడు కుంభజుండు
ముని యంగీరసు డా యాజ్ఞవల్క్య § మునియు ఋష్యశృంగుండు వింకను
విను విశ్వామిత్రుడు శతానందు § డును భరద్వాజుడును రాముడును
ఘనులగు పులహ పులస్త్యులు నత్రియు § జననాథ ! వీరలాది మునులెల్లఁ

దము జూడరాగ గృష్ణబలరాము § లమలమతి లేచి వారల నమ్రత
గ్రమవిధానతను నమస్కరించియు § సముశాంతుల క్షేమంబు లారసియు
మహనీయులార ! మీదర్శనంబు § మహిని గల తీర్థములు మను బొరలుట
అహహా ! మోదంబ యబ్బె ధన్యులము § యిహలోక పవిత్రిత మీ సేవయు
భువిని మూఢులయి యింద్రియలోలత § దవిలి మందభాగ్యులునై దురితము
గవిసి కువిచారభ్రమల విహారత § నవివేక దూషితులు నైన యట్టి
వారలకు దుర్లభంబు మిము గనుట § లారయ వశంబు దైవయోగమున
గూరెనేవి మఱి యఘదూరులె గద ! § ధారుణితీర్థము లన్ని యొక తలము
నను గాంచలేరు మీ చరణసేవ § లను నన్ని యొకట బడయగ వచ్చును
వినుడు కరుణించి నా వాక్యయంబు § ఘనులు మీసమ్మతమున భ్రాజి గొన
నొనరందు నన్ని తీరసేవలును § వనములను నియమముల నను గన్న
ఘన తపోదాన జపసంఘములును § దనరు విగ్రహాదుల దేవరూప
ముల నర్చించుట లాది యసమాన § విలసిత పదముల గూర్చునవి యైన
దులదూగ లేవు మీబోటి మునుల § నల సాధుమతుల భాగవతజనుల
గనిన సేవింప గను నట్టిదాన § మునిచంద్రులార ! చిరకాల మెంతో
జనగ నవి జేర్చుఫల మంత మిమ్ము § గని మొక్కినంతలోఁ దక్క గడగి
రొయొక ముహూర్తంబు మీసంగతి గన § సకలార్థ గోచరంబగు జ్ఞానము
సకల దురిత సంహారఖడ్గముగ § దన కరమున వెలయగ ఘనత నందు
భానుచంద్రాగ్ని మేదినీతార § లా నయమున మరు దాకాశవాక్కు
మానసంబులను నుపాసించినను § జ్ఞానవిశేషము నందు వెలయుటను
మాననీయమని మానమెంచనగు § గాని సరిగావు మీపూజ కన్ని
మానమేది నీతనువు దుఃఖముల § కే నిమిత్తములు మూడుధాతువుల
భేదమంది రోగముం నశించును § గాననగు నెట్లు ? సుగతి శీఘ్రముగ
సాధులను మునుల జేరుట భవముల § గా దనెడు తలము నన సుఖాపనగు
నని ప్రీతిబలుక వినిరి ఋషిగణము § మునిశరణ్యమ్ము కల్పతరుఛాయ
నెనయు నవి యతని వాగ్ధాటిని గని § మును లిట్టు లనిరి దేవదేవేశ !
సకలజ్ఞ మూర్తివైన నీకె తగు § వికటమేదు నీవాక్కులు ముదంబె
గన నయె మనుజావతార మూర్తివి § వనజ నయనుడవు వరిష్ఠుండవు
మునిహృదయలోలుడవు పరాత్పరా ! § నిను దర్శించుట మము దెలివి గనెడి
వినయబోధ యిది యో జగద్గురో ! § నిను నిజము దెలియ మా వశ మగునే !
మేమును బ్రహ్మయు రుద్రుడు నింద్రుడు § నీ మాయ గవగ నేరము వింటే !

హో మహాత్మా ! కారణరూపా ! ఽ స్వామి ! పురుషోత్తమాఖ్యా ! జగత్పతి !
దీనశరణ్యా ! దేవదేవ ! ముని ఽ ధ్యానవరిష్ఠా ! జననస్థితిలయ
మానపరిమాణ ! కాలస్వరూప ! ఽ మానజ్యోతిస్వరూప ! ధర్మహే
తువు నీవ కర్మమూలంబ వీవ ! ఽ సవిత సావిత్రి వరయుంగ నీవ !
నీవె యేకంబు పెక్కులును నీవ ! ఽ కేవల మాత్మస్వరూపము నీవే
సవనరూప సంగతు లన్ని నీవ ! ఽ భువి గల సత్క్రియములును నీవె
మంత్రములు నీవె మహిమలు నీవే ఽ తంత్రములు నీవె తత్వములు నీవె
యంత్రములు మావి జీవమయంబులు ఽ యంత్రకారుడవు నీ వెలసినట్లు
భూమి యొకటి పలురుచుల గనినట్లు ఽ నీమహామాయ సర్వప్రపంచము
లీ మెయి పలుతెఱగులు దోపు సిద్ధ ఽ హో మధుసూదన ! మా నమస్కృతుల
లోన విహరింపవలె నిక్క మీవు ఽ మా నయం బంత నీ వెఱుంగుదువు
మానమింత యని నీపరము గనము ఽ ధ్యానమున గనిన వారము మే మని
హో నలినేక్షణ ! మురిపె మందుదుము ఽ గాని నీ నగవు లోన లజ్జయగు
మానితాకార ! మనసిజసుందర ! ఽ గానలోల ! కరుణాలవాల ! హరి !
నీ మానసంబు శుద్ధసత్వంబు ఽ నీమంజులనుతి పరిశుద్ధి గూర్చు
నీ మహానటన వేదమార్గంబు ఽ శ్రీ మానినీశ ! నీ యవతారము
శిష్టపోషణము దుష్టశిక్షణము ఽ లష్టదాయకము తుష్టిని దాసుల
కష్టములు మలప సృష్టి ప్రార్థింప ఽ భ్రష్టధర్మలను నష్ట మొనరింప
అష్టమగర్భము నందు దేవకి క ఽ నిష్టదశ బాప బుట్టుట గంటివి
భాసురమూర్తివి భూసురకులంబు ఽ వాసిగ నీధ్యానముననె రాజించె
హో సురేంద్రనుత ! నీ దర్శనమున ఽ మా సుకృతతరువు శోభిల్ల గలదు
ఆస దీర భుజియింతు మాఫలము ఽ లా సమంజసము మము గూర్చు కరుణ
మేలు వేల గనె మా విద్యలెల్ల ఽ నీలవర్ణ ! నీయోగ మందుటను
నోలి నెఱిగి నిను దలప మా తరమ ఽ పాలజలధివాసా ! పరమేశ్వర !
చిత్రతరములగు నీచర్యలన్ని ఽ స్తోత్రపాత్రములు నీరూపులన్ని
గాత్రపవిత్రము నీ సేవలన్ని ఽ మిత్రతుల్యములు నీ భజనలన్ని
శరణ మొసగు మము శ్రీనికేతనా ! ఽ అరుణోదయము మది మా దురితతమము
పరిహీనమందు మము తేజస్సును ఽ తరమందు నమ్మితిమి నమస్కృతులు
అనుచు గృష్ణు నభినందించి యాన ఽ తిని వడసి నెలవులను జేర నిద్ధ
మున నున్న మునుల వసుదేవుడు గని ఽ వినయమున మ్రొక్కి యిట్లని గోరెను
తాపసులు ధర్మతత్త్వజ్ఞు లరయు ఽ ప్రావు జేర్చి నా ప్రార్థనల వినుడు

యొసగిది సంచితపుకర్మ నన్ను § రూ పంది మలపు నిడక తలగాచును
నేను దాన నెటు విముక్తి వడయుదు § యే నియమంబున గెలుతు షడ్రిపుల
నా నిజంపు మార్గమును గనిపించు § దాని వచింపుడు జపమొ ? తపంబో ?
దానధర్మములా ! క్రతురాజంబులా ? § దేవ ? హరి జెంద దగునది దెలుపుడు !
దీనులై శరణ మనెడు భక్తులను § మానసీయులౌ మీరు పరిశుద్ధి
గూరుతురని పెద్దగ మ్రొక్కితి నిదె § సారపుణ్యమతు లరయుడు నన్నన
కమలలోచనుని గూరిచి యజ్ఞము § విమలమతివి నయి యొనరుపు దుష్టము
శమమందు కర్మలన్ని నిను విడుచు § క్రమమున ముక్తిని నీకొసగును హరి
పావన మఖవేదపాఠసంతున § కేవల దేవర్షి పితృఋణమ్ముల
వావిరి నీగని పురుషు డధోగతి § త్రోవబట్టు భయ మందున బోరలును
వర తనయాధ్యయనముల తరించితి § వరయ ఋషిపితృఋణముల రెంటిని
వరుస మూడవది దేవతలఋణము § పరమగునది సవనముల నచ్చువలె
నన వసుదేవుడు నీ సెప్పినట్లు § నొనరుతె మీరలె నిర్వహింప వలె
నవ వారినె యాజకులుగ వరించి § మనుజనాథ ! యాతాశీర్థప్రాంతమున
ఘనతను దా నింద్రుని వైభవంబు § న నతుల గనుచును పదునెనిమిదైన
వనితల పట్టపు రాణుల గూడియు § మునుల సమ్మతిని దీక్షను వహించి
యమ్మహాధ్వరము వేదవిధు లంది § సమ్మతంబు నెల్లరకు దోపంగ
నెమ్మనముల నా రామకృష్ణులును § నమ్మునీశ్వరుల సంగతి చరింపు
చుండ భద్రమట నిండ ఋత్విక్కు § లండగా సర్వమయు జీవేశ్వరు
దండముల గూర్చి యాగసంపూర్తి § మెండుదక్షిణాల పూజాళి సెల్లు
చుండ నృత్యగీతాది రవంబులు § మండలంబుగా తా దేవి సహి
తుండు నగుచు నవభృథము నొనర్చియు § దండి కుతుకమున భూమండలమున
యశము నిండుకొన కనకరత్నచయ § రాశి నిక్కించి మరి దివ్యాంబర
వశ మందినట్లు భూసురాదులను § దశ మించు నటుల దానముల జేసి
మునుల భూపతుల బంధుజనంబుల § ఘన సమర్చనల కాలంబు బుచ్చ
జనపతు లాదిగ బ్రీతిబొంది యా § వనజ నేత్రునానతిని గమనించ
గను నానతి గొని తమ పురంబులను § గనిరి కృష్ణు సన్నుతుల మోదమున
నందు డా రామకృష్ణవసుదేవ § బంధువులు నతడు నుగ్రసేనుండు
మందస్మితమున నిలువ వేడుకొన § నంద సమ్మతిని యుందఱను దెలియ
నందుని రాణియు నొప్పును బొందగ § నందె యుండె గోపకుల బృందమున
హరి నయప్రీతి మధురభాషణలు § హరి చరిత్రలును హరివర్ణన నుతి

హరి సేవ సేయు లీలల నెలమిని § హరిచెంత గనియు మూడునెల లట్లు
జలరుహలోచను డటుల రేపు మా § పుల జరుప నందు డందుండి దరల
యలరున వసుదేవాగ్రసేనాదు § లెలమి చిగురొంద వస్త్రభూషణా
లలవి మించ నర్పించి యనిచినను § మెల మెల్లన యా తలమును వదలియు
నెలవును గాంచిరి యానందరాజి § వెలయు నట మాధవుని వినుతింపని
నిమిషములు లేవు నిరతంబు వారు § కమలానాథా ! కరుణామయ ! యో
విమలమానసా ! విశ్వపతీ ! శివ ! § సమయదాత ! భవ ! వినుతగోవింద !
శమయితాసురా ! శశ్వత్ప్రకాశ ! నమ నమ యందురు కాంతబాలాదు
లట బంధుయుతముగా వసుదేవుడు § తటము గనె వర్ష కాల మాదటను
తటుకున సకుటుంబము పురము జేరు § నట దరలి యట్లె జేరిరి నెమ్మది
ద్వారక సకలురకా యాత్రచర్య § పారమంద వినజెప్పిరి ముదమున
తోరమైన సౌఖ్యముల దోగి రా § వారిజనాభుని ప్రాపును నమ్మచు
ఆనకదుందుభి తా నొక్కనాడు § గానవచ్చు బలరామ కృష్ణులను
తాను వారిచే బూజలంది ముద § మూన నిటు బలికె వారల మహిమల
ప్రాకృతమానవ ప్రణామ మోహితుడ్కై కృపాతిశయమున మిన్నందిన
యాకృతి నందిన పరము లీశ్వరులు § నేకృతపుణ్యుడ నై గంటి మిమ్ము
రామ యనంతాభిధానమూర్తివి § నీ మహిమ నిత్య మరయ మునియోగ
మా మహి నితరుల కగమ్య మెందున § స్వామీ ! ఇందిరహిత ! శ్రీకృష్ణా !
మీరలిరువురును నారాయణాంశ § ధారిత తేజులు మేర గన నొకటె
ధీరులార ! నే నటుల దలచెదను § సారసాక్ష ! సద్భక్తపోషణా !
సురసమూహ సంస్తూయచరణ ! వర § మురహంతక ! యదువంశపావనా !
యుక్తమందెదవు జ్ఞానక్రియలను § శక్తిరూపమున బ్రకృతిభేదముల
నక్తంచరహర ! పరతంత్ర మెట్లు § సక్తమగు సర్వవిశ్వము సృజింప
మనుప లోగొనుట నీ పరంబ యగు § వనజనాభ ! నీ యాత్మశక్తియే
గన నదె భూతము లాదిమధ్యాంత § మును గనిన దేవ ముని సన్నుత హరి
ఇన తారాధిప పావకోడుగణ § మానప్రభలు మరి మెఱుగు గలవన్ని
గనుగొన నీకళ లనుచు బుధు లనగ § వినియున్న నైన తనయులని మిమ్ము
మనమున నుతింతు వెలిని ముదంబున § ఘనులు నుతింపగ నలరును గొందును
నారదాది మహాసీయు లీ నిజము § నారయ కృపచే నించి రీమతిని
నిను లో త్త పృథివి గంధమానముగ § గన జలము రసమునను మాన మటులె
ననలుని రూపము నగు నా విధంబె § ననిల బల మోజసంసితినటులే

గగన శబ్దముల నాతీరె గందు § నగధరభూతము లధిపతులు నీవె
భూతగుణధర్మములు నీమయంబె § భూతకర్మములు నీ లీలలె యగు
భూతవర్ణములు నీ యాకృతియే § భూతేంద్రియ ప్రక్రియ లన్ని నీవ !
గుణములు పెక్కులుగను గుణివయ్యా ! § ప్రణవస్వరూపా ! నాదానుమోద !
అణువుల ఘనముల వెలయుదువు నిజము § క్షణ కల్పగణన లన్ని నీ మయము
కాలరూపమున నేల లన్నింటి § పాలింప జాలుప్రభుడ ! వచ్యుతా !
శ్రీ లలనేశా ! భూభార మడపు § చాలున గోలోకమున విహరించు
హరికి ప్రీతిగ బలదేవకృష్ణు § లై రాణింపగ జనించితిరి నా
భూరితపఃఫలసారములు మీరు § ధారుణి క్రూరుల మాప క్షితిసురుల
నారసి ధర్మము నిలుపఁ బుట్టితిరి § మీ రురుగాయులు ధీరు లా పరమ
పురుషులు సంసృతి నన్ను తరింపగ § నిరయగతి నెన్నటికి దారకుండ
వరమును గరుణింపుడు మేర యింతే § వరద ! కరివరద ! నిరుపమాన శ్రీ
కర ! నిత్యానంద ! మహాత్మ ! కృష్ణ ! § వరసంకర్షణ నామ ! బలరామ !
యని నుతించు తమ జనకుని ననఘుని § మునిజనబోధితు నానకదుందుభి
ననురాగభక్తి సహితధర్మతరు § వన వెలసిన పరమేష్ఠిజనకుండు
నైన విష్ణుమూర్తియగు కృష్ణు డిటు § మానితంబుగా బలికె నల్లనను
దా నవ్వు గనుచు నాయనా ! నీవు § మానరహితుడగు పరబ్రహ్మమున
బోల్చి బలికితివి కా దన నేలను § పొల్చు గన్నట్టి సర్వజీవులును
నిల్చునట్టి యా సర్వభువనముల § పొల్చు టన్నియును బ్రహ్మమయంబులె
నేను రాముండు నీవు నామాత § లావయంబు దీపింప మానవులు
ధ్యాన మటు నిల్ప సురానీకములు § జ్ఞానదృష్టి పదునాల్గు భువనముల
చరాచరంబుల సమూహ మంతయు § నిరాకారుడగు నీశ్వరు మయంబె
నిరాడంబరపు మతి గను తండ్రీ ! § త్వరాన పరమపదంబు నీదరిని
చేరు నీ వందు గోరినసిద్ధిని § చారుతరంబున విహరింప నబ్బు
నని బల్కె నతడు కడుసంతసిల్లె § దనజనని వారి మరి వినుతిజేసి
యనఘుల మాహాత్మ్యము విన్నదగుట § దన ప్రార్థనంబు ననుకూలంబును
గన జేతురంచు గన్నులధారను § గన దోప వారి గని యిట్టు బలికె

## —: శ్రీకృష్ణ బలభద్రులు మృతులైన తమ సహోదరులఁ దెచ్చి దేవకీదేవికిఁ గనబఱచుట :—

అన్నలార ! నాయన్నలార ! నే § గన్నపుత్రులరు ఎన్నికకు దివ్య
లెన్న స్వాములరు నన్ను దయ నెఱపి § తెన్ను దెలిసి మీకన్న ముందుగా

గన్నట్టి తనయులను దెచ్చి యుందు § మున్ను మీగురు సాందీపు పుత్రు
సన్నిధి జేర్చగ కాలునిపురమున § కున్నతంబైన పథమునం జేరి
మన్ననలను యము సన్నుతుల నంది § క్రిన్నన నాతని కర్పించితి కను
మిన్నయశము దివి భువి నిండగ మునుకలన్న విన్న నే నట్లు ప్రమదమును
వన్నెగా నంద తలచి మిము గాంచు § చున్న నన్ను మీ జనకుని చిత్తము
ఖిన్నతను బాయ నెంచు నా మదిని § చిన్నతనము దూరంబుగ జేతురు
మీ కద్దు గలదె సాహసు లన్నిట § లోకనాయకులు జననస్థితిగతి
నాకర్షించిన జగజ్జాలముల § మీ కవియు లేక కుక్షి ధరింతురు
వీక సర్వతేజస్సుల మీలో § సోకు నందినవి సూక్ష్మరూపమున
తలచినట్లు గలుగును సకలం బిటు § మలయు నింకొక్క మతి దశ గూర్చిన
నిలయ మానందధామమే మీక § చలనమే లేదు ధ్యాననటకులరు
కలత లేలేక ఖలుల జెండుదురు § వలపు మీయందు నొప్ప నేలుదురు
నావిని జననికి సతినిడి యమ్మా ! § పావనివి మమ్మగన్న మాయమ్మ !
నీవు సంశయ మొపడవలదమ్మా ! § భావశిద్ధి నీబోటివారలని
త్రోవదప్పకను నిలుచునదియమ్మ ! § సువివేక మమ్మ ! నీసుతుల నిప్పుడె
గొని తెత్తు మనుచు యోగము నందుచు § ఘనులా యిరువురు జేరిరి సుతలము
గని వారి నచట నింద్రసేనుండు § ఘనత గల ప్రభుడు నాపృథివికి
ఘనసారాంబుద వర్ణులు కన్నులు § వనజాతమ్ముల చాలు నిరసించు
హాలము ధవళాంగమును గలవానికి § జలదచ్ఛాయగను వానికి చక్రము
కలను సాధనము లనుచుంట దోపు § విలసితకరుణాలోకపూర్ణ మగు
చూపు లొప్పు సుందరులు నీలమును § ఆ పగిదిని పీతమున విలసిల్లు
తాపితంపు చీరలు గట్టినట్టి § పాపరహితులను బరమేశ్వరులను
దనుజాధిపుండు రా జూచి దిగ్గు § నను గద్దె దిగియు నెదురు తా రాగ
వనధిపూర్ణశశి రాక గన్నట్లు § మనము నటు పాలనీరమును గూర్చ
జనవరా ! మణిని గోరు కనకంబు § నన వారి డాసి ధరణి సాష్టాంగ
మున నతిని సమర్పించి దోడిచ్చి § పెనుగద్దె జేర్చి పాదములు గడిగి
గన వాజలంబు శిరమునం జల్లు § కొని శివంకరమున నన్ను బొందె నని
కనక మణి యుతపు గద్దియల గూర్చి § యనువున వేడుచు నానంద మంది
సకల పూజార్హతముల జేర్చుకొని § యకుటిలుండు దా నగుట ప్రసిద్ధత
సకలలోకముల జాటగను నతడు § సకలలోకేశులను పదియారగు
విధానముల పూజించె మది నిలిపి § బుధాళి లను సంధానము నందిన

యథోచితార్చన లిష్టమును గూర్చి ఽ మాధవసంకర్షణుల ముదమంద
సురభికాలాగరు హరి చందనము ఽ వరుస నైలార్చి ధూపముల నొసగి
కరము హేమ పళ్లెముల మణులనుఁ ఽ వరకర్పూరపు దీపంబు లిచ్చి
పాయసాపూప పక్వఫలాన్నము ఽ లా యనంతులకు నైవేద్య మొసగి
నేయ మింపొంద నవరత్నంబుల ఽ బాయక నిమిడ్చు మణికిరీటాది
భూషణంబు లా పురుషోత్తములకు ఽ తోషణంబుగా నలంకరించియు
దోషమడగ నావిధిని వస్త్రముల ఽ వేషము లందముగా దీర్ప నిచ్చి
సలలిత కుసుమములను దీర్చి నట్టి ఽ విలసిత సువాసనలు గూర్చు హార
ముల దాల్ప జేసి తాంబూల మొసగి ఽ యులరున చరణము లొత్తి యానంద
రసపూరిత నయనముల నీరంబు ఽ వెస తోరంబుగ ధారలను దడియ
నసి యెత్తి నట్లు తనువున పొలకలు ఽ పస మించు ముదము చెలువంబు దోప
కరములు మొగిడ్చి ఫాలమున జేర్చ ఽ జగదీశుల నిటు వినుతించును ఓం
నమో భగవతే వాసుదేవాయ ఽ నమో పద్మదళనయన! వామనా!
నమో నవనకిటి! నాగేంద్రవరద! ఽ నమో మత్స్యకూర్మాదియవతారా!
రామ! శ్రీరామ! రామా! కృష్ణా! ఽ నా మానస పరినేతా నమస్సు
సురమునీంద్ర వరదాయక! యచ్యుత! ఽ ఉరుదుర్గుణశమనా! సురహరణా!
సురాగ్రజాధిప! బ్రహ్మర్షి వినుత! ఽ పరమపదవాస! కారుణ్యసుధా
పారావారా! లక్ష్మీనాథా! ఽ నీరేజాక్షా! రమ్యాంగా! శ్రీ
కారా! సాకారా! శ్రీమందా ఽ రా! రత్నాకరవాస! ముకుందా!
రాజస తామస గుణలోలురైన ఽ యా జన తతికిని నబ్బున నీదగు
తేజ మతిశయము నందు దర్శనము ఽ నాజన్మధన్యమే జెందె నిందు
దేవ! నీచరణముల మూటినొకటి ఽ భావింతు నాదుశిరము సోకుటల
పావనం బదియు శివుడు విరించియు ఽ దేవనాథుడును నర్చించి రదియె
భజించ గంటిని నిన్నావిధమున ఽ నిజంబు నెరిగితి మదంబడంచితి
యజింపు ముందే ఫలంబు నిచ్చెను ఽ వ్రజంబు గొన్నవి దొలగె దురితములు
నిను చేదిరాజు మొదలైన యట్టి ఽ జనపాలురు లో మహాత్వ మెరిగియు
గనరు సఖ్యమును విరోధమున నిను ఽ గని జయింతు మనియే నీ జపమ్ము
దినదినము బలము దీపితమ్ముగా ఽ గనిరి నీపదము గోపిక లటులే
గనరు విరోధము కామంబున నిను ఽ గని లో గొందుము యని నిన్ను వలచి
యనవరత జపము తేజం బందగ ఽ ఘనత గాంచిరా నీసన్నిధినిఁ
మునులు యోగముల నిను వశము గనిరి ఽ దనరిన భక్తిని గొంద రట్లరి

యనఘు లుత్తములు నయిరి యనేకులు । మనమును సర్వము నీకర్పించియు
దానధర్మములు వేదచయంబులు । మానితంబైన జపతపక్రతుచయ
మాను పూనిక లవన్ని నీమయము । గాన నీదర్శనమున యవన్నియు
నను జెందె దేవ బహునాళ్ళ నుండి । నిను గనగ నుంటి నా యీప్సితంబు
కనికరంబునఁ గంటి వేమొ నా । కనుల గూర్చితివి నీ యవతారము
కంటి మునులు జీవించు ప్రాణంబు । గంటిని సిరియంకములోని రూపు
గంటి దాసహరిచందన వృక్షము । గంటిని ఋషిగణ జపితమంత్రమును
గంటిని భవాబ్ధి దరింపు నావికు । గంటి నామనములోని యాత్మనిఁ
గంటి మాయ నను దారని యనువుగు । గెంటితి దుఃఖము లన్నిశూన్యముగ
తొంటిపూజ ఫలియించెగా నాదు । యింటనే నిన్ను ముక్కంటివినుతు
గంటకదహనుని నమృతస్వరూపు । దంట నానంద సంపన్నత గని
నాడ నిపుడు దేవ మీరాకకును । వేచుచున్నాడ హేతువు దెలుపుడు
అడుగుట దగునని శరణము జేరితి । నుడువ దగునేని కార్యము గొనుడనె
విని నతని నుతిని గొనె పూజలన్ని । కనె మనము సమ్మతిని బెంచి కృష్ణు
డనె నాతని కిటులో బలాతిశయ । ఘనుడ వింద్రసేనాఖ్యబలిదనుజ !
యనఘ మరీచికి సతి వర్ష యనగ । గనెను సుతులార్వురుని క్రమంబునను
వారు జితేంద్రియ మానధీరులయి । గూరి రాపూర్వకర్మఫలమ్మును
సారాభిమానదశ మదంబుగొని । వారిజాసనుడు రమణి వాగ్దేవి
నారాధించెను కాముకుం డగుచు । ధీరత నాదంపతులు రమింపగ
నారసి నవ్విరి యాత డది గాంచి । యోరి తరమెంచకను మదముపేర్మి
మోర నపహాసమున దూలితిరా । మీ రసురయోని బుట్టు డనంగను
వ్రాలిరి చరణంబుల పద్మభవుని । జాలి దొలపు మని ప్రార్థించుటయును
మేలుమీకు శ్రీకృష్ణదర్శనము । వేగా గనుడు శాపమోచనము
నావిని వారలు మొక్కి భువిలోన । మీవంశమునను హిరణ్యకశిపుని
దేవకి బుట్టిరి యోగమాయచే । దేవకీగర్భమునందు జేర్ప గని
యట కంసుచేత హింసింపబడుచు । నిటుల జీవులయి యీలోకమందు
కుటిలదశ వాయ వేచియున్నారు । ఇట వీరుండుట నే నెఱుంగుదును
దేవకియును వసుదేవుడు వీరిని । తేవలయుననుచు నను నేమింపగ
నావలనిరాక నీ నిలయమునకు । నీవలనియాజ్ఞ వారిని గొని మా
జనని దుఃఖమును దీర్పవలయు నని । వినుము వీరింక సుగతి జెందెదరు
గనరు జన్మముల ననుగనిరి గాన । దనుజనాథ వారల దెమ్మ నాగ

ఘనభక్తినొసగి బలిచక్రవర్తి § వనమాలి యతని దీవించి వెంట
గొని వారు బలుడు తాను పురమ్మునకు § నొసరు నను జేరి తల్లిదండ్రులకు
తనయులడె మీరు తొలి గన్నవారు § గనుడు మోదమ్ము పేర్మి సంగతిని
నన వారి నందరిని యంకమ్మున § పెనుపంద నిలిపి చనుబాల్గుడిపియు
కనుల నానంద బాష్పముల్ గురియ § వనజనయను మాహాత్మ్యమును బొగడి
వసుదేవుండును దేవకీదేవి § పసిబాలుర తమ తనివిదీర గని
హసితవదనముల వాసుదేవుని § కసిమసి నడంచు ఘనుడు విష్ణువని
నిరతసంస్మరణ సేయుచుండ్రి జన § వరా! పరీక్షితుండ! విను మవ్వల
వారు లార్వు రా దేవికి చనుబాల్ § ధీరతను ద్రావి శాపవిముక్తిని
గూరిచిన హరి స్తవచింతనమున § మేర మూర్తిత్వమంది తొలిరూపు
గని వారికందరికి నతి గూర్చియు § ఘనత నిజపదమునందున జేరిరి
హరిమాయ యిదియు గాక యన్యులకు § తరమ యిటు మరల బ్రతికింప గలరె
వరుస మృతిబాసి యమృతకళ నొప్పు § ఘనుల పుణ్యములు వర్ణింపనెట్లు
అరయ నందనుడె మనకు గృష్ణుండు § నిరతరానందసిద్ధుడు పరముడు
సరసిజోదరుం డంచని నుతించి § పరితృప్తి ముదము దంపతులు గనిరి
దేవకీపుత్రుల నామముల ముందె § నే వివరించితి గద వారెవైన
పావనంబులైనట్టి తొలి యభిద § లీ విధిని బలుకనగు వినిపించెద
వినుము స్మరోద్గీధః పరిష్వంగులును పతంగుండు క్షుద్రభృత్తులును
జనవరా! కీర్తిమంతు డగ్రజుడు § ఘనత తొలుత గలిగిన వాడందున
వనజాసనుశాపము దీరె వారి § వనమాలిద్రావినట్టి చనుగుడుచు
టను నాదేవుని యంగస్పర్శనము § గనుట మోక్షమును వారికి గూడెను
మనుజ లీకథను నే విధమునైన § వినికి గలిగినను మృత్యుభయము నహి
వినదలచితేమి యడుగుమ యన్నా! § యన శుకుని పరీక్షితు డడిగె నిట్లు

## -: సు భ ద్రా ప రి ణ య ము :-

దేవకీతనయ సుభద్రముత్తవ § యేవిధి నర్జును డామెను వరించె
నా వివాహకథ వినెద వచింపుము § నా వినుమని శుకమౌని పలికె నిటు
క్షితిప! అర్జునుడు తీర్థయాత్ర గని § యతివృత్తంబున ప్రభాసతీర్థము
మతిమెచ్చ దాని వసించి యచటి క § నతి దూరమునగ ద్వారక నుండగ
విని వారిక్షేమమును బంధులగుట § మనము ముదమంద దెలిసి యందునను
దన మఱద లయిన సుభద్రరూపము § వినియుండెగాన నామెను బరిణయ

మందగోరి తానుండ రాముండు ॥ సుందరాంగినిఁ దుర్యోధనునకు
విందుగఁ గూర్ప నెంచె నని దెలిసి ॥ వలజాక్షు ననుమతిని గొని నేమో
ద్వారకకు జేరి సన్న్యాసిరూప ॥ ధారి తా నగుచు సమయము గొఱకై
కూరిమిని వారి గూడియు నుండగ ॥ తేర గనడు కపటంబు రాముండు
యతని భిక్షకై యింటికి గొనిపో ॥ నతడు సుభద్రను గని మనంబునను
సతి వీరమోహినేయగు వీరుడ ॥ నతి చాతుర్యమునను నపహరింతు
నని బూంచియుండె లలన సుభద్రయు ॥ వినియుండె నర్జునుని వీర్యయశము
మనమున నతనినె వరించి యుండియు ॥ కనె నాతని సందేహము నందుచు
వనజదళనేత్రు తత్వ మిత్తెఱగు ॥ ననుసంధించును గానని విచార
మును బొందదయ్యె పార్థుం డట్టుల ॥ మునివృత్తి కపటమును వారి దెలియు
టను వేచియుండి యొకనాడు సమయ ॥ మును గాంచె దేవమందిరంబునకు
పురము వెలుపలికి రా నా సుభద్ర ॥ తరుణమంది గొనిపోవ నాజ్ఞగొని
సరసిజనాభుడు దేవకిసమ్మతి ॥ కరుణింప వెంట దాను నేగియును
దనకు రథము సిద్ధముగ కృష్ణుడే ॥ యొనరుగా గూర్ప వీరమధ్యమున
వనిత పూర్ణిమారజని చంద్రికల ॥ దనరిన ముఖదీప్తిని నిలను దిరుగాడు
ఘనత నా చంద్రమండలంబునను ॥ దనరు హరిణడింభమున బోలుదాని
ఘనమధ్యస్థిత వరవిద్యుల్లత ॥ యనగ కనుల దోపించు తనుకాంతి
వరమణిభూషణ రాజినలంకృత ॥ పరిణతిపుత్తడి బొమ్మ యనంగను
వరుస గనుదాని వనిత సుభద్రను ॥ ఘను డర్జునుండు మృగేంద్ర విక్రమ
మరయ దనునొప్ప వడిగాంచి చెలిని ॥ దన మనంబలర గ్రహించి రథమున
పొనరందించుక నేగుచున్న యెడ ॥ గని క్రోధంబున యదుసైన్యంబులు
ఘనపరాక్రమము వెలయ నస్త్రముల ॥ విను భయదమైన శరతతిని బొదువ
గని క్రీడి క్రీడగను దాని నెంచి ॥ మనమున కినుకయు వదనమున నగవు
గని వారి బాణతతుల గప్పుచును ॥ జనుచుండ ముదమునను వనజాక్షుడు
వినయమున వారి వారించె హితము ॥ గనుడన నది విని బలభద్రు డదరి
కినుక విలయానలుని బోలి వెలుగ ॥ వినయమున నార్చె నా వనమాలియె
ఘనుడు ఫల్గుణుడు పురమును జేరెను ॥ మనమున కోపము మాని బలుండును
తన మఱది యర్జునునకు నరణంబు ॥ కనకాదిభూషణముల బంపించె

-: శ్రీకృష్ణుండు ఋషిసమేతుండై మిథిలానగరమునకు బోవుట :-

జననాథ ! కృష్ణు డొకనాట వినను ॥ అనఘుని శాంతుని మిథిలాపతినిఁ
దన నామము బహుళాశ్వ జనకుడన ॥ ఘనయశమందిన జనవరుడనుచును

నతని గను నిచ్చ మరియు శ్రుతదేవు । డతులభక్తి దనయందు నొప్పారు
క్షితిసురుండు ధర్మిష్ఠి పవిత్రుడు । మతిగన్న యతం డా పురముననే
గనవగు వారల నొకట గాంతునని । మనమున ముదంబు నను వొందించియు
దనరథమును సిద్ధముగ దెప్పించి । మునివరోత్తముల నత్రిమైత్రేయు
లును నాంగీరస నారదచ్యవను । లును వ్యాసరామ కణ్వారుణులును
ఘన తపోనిధులు మరికొండఱుఁ । దన వెంటరాగ దారుకుడు రథము
ముదమున దోలఁగ కురుజాంగలంబు । నదనున గడచియు మధు కేకయాది
చదురందు రాజ్యముల దాటి యవల । గదియనైన పాంచాల కోసలము
లను వంగమత్స్య కుంతివిదర్భల । జనపదములన్ని దాటి యందందు
జనులు జనపతులు తనను బూజించి । కనకాది కానుకలను నందీయఁగ
గొనుచు విదేహము జొచ్చి మిథుల గనె । జనబృంద మతని బహువిధుల నర్చ
లిడిన గైకొనుచు గ్రహమధ్యభాను । వనువున నొప్పను గనుచును విదేహ
పుడమీశు రాజ్యమును జేరగానె । వడి నాదేశపు జనులు భక్తితో
నెదురుకొని మ్రొక్కులను సెల్ల సేవ । గుదురొప్ప దాను వారి నందించె
మిథిలానాథుడు బహుళాశ్వుండా । యదనున శ్రుతదేవుని గూడి యిద్ద
రతి భక్తిరాక కృష్ణుండు గనుట । మతిలోన దమ్ము పూర్వపుణ్యంబు
స్తుతిమిన్న నిటుల గనవచ్చె మమ్ము । యతిజనహృదయుని గనగంటి మనుచు
వివిధకానుకల పూజార్హమైన । వివిధపదార్థములన్నియు గొంచును
నవపుష్పపల్లవంబుల తోడను । తవిలిన నతులిత భక్తిపరవశత
వనజనాభునిఁ దురితనగవజ్రి । ననుపమాన సుందరుని నీశ్వరుని
మునిచకోరచంద్రుని నింద్రనుతుని । నినకోటితేజు కనకమణిభూషు
కామితదాయిని కరుణాసముద్రు । కామజనకు గౌరీశు సన్నుతుని
నామపవిత్రుని రాజీవనయను । నామహీపాలుడును మహీసురుడు
భూమిని సాగిలి మ్రొక్కి కరములను । నా మాధవునకు జోడంద గూర్చి
నేడు సుదినమ్ము మా జపఫలమ్ము । వేడుక వెలయగ నీడ గన నయ్యె
తోడు నీరూపములను దావుగొను । టాడెదు చూపును దనరాగ ఘనులు
మునులు మాయింటికే తేరవలయు । వనజనయన యని యిరువురును బిలువ
తనుదాన వీరి నిలయముల నొకట । ఘనతను వారిని గన జొత్తు ననుచు
లీలదాల్చె నొకొ మును విధిపట్టున । బాలు రాలమందల లీల దాను
నోలి గన్నటుల మునివరుల గూడి । జాలిదోలప శ్రీకృష్ణు డొక్కపరి
గనె వారియిండ్లఁ దా బ్రవేశముఁ ♦ వినవద్భుతంబు నగు నుత్తరసుత

జనకుడు తనగృహమందు విష్ణుండు § ఒనరంది జేరె నని కనకాసన
ముల జేర్చి చరణముల గడిగి జలము § నలరున శిరముల బంధులాదిగా
కలియ జల్లుకొని యర్ఘ్యపాద్యాది § విలసితార్చనల మణిభూషణముల
కర మొన్న దగిన యంబరతతులను § వరుస నర్పించి ఋషులకును మ్రొక్కి
వరుస షడ్రసోపేత చతుర్విధ § పరమైన భోజనాదు లవిసెల్ల
సరసిజనాభుని చరణముల నొత్తి § పరమోత్కృష్టంబగు నుతి సల్పియు
పరమానందస్వరూప ! పరేశ ! § నిరుపమాన ! వరభక్తమోదకా!
కరివరద ! కర్మసాక్షివి నీవే ! § దురితదూర ! నీరజదళనేత్రా !
సాటిమిగిలెదరు వాటమదిగాగ § పూటలగీటక గోటుపాటవపు
ధాటి మొదనాటి చాలుదెసలు విన § నోటబలికెదరు సమ్యగ్భక్తిని
తోటినాటలను తనులుదీపింప § పాటవచిత్తము బిత్తరమగు నా
తాటముల బాప బోధింతురెలమి § నీటందు నిన్ను మతిమాన రెపుడు
పూటల గొన్నిటి మాత్ర నిను దలపు § పాటున నియమములే నిల్పబోను
డీటందితి నాయింట నిను గనుట § మేటి గూర్చు నీచోటుదార నల
వాటు ననుగూర్చ దర్శన మిచ్చితి § కాటకము దప్పె సంసృతి పరమది
కూటమి భాగవతాచారపరుల § మాటల నీస్మరణానుస్మరణాల
పోటి నీదాసవరుల చర్యలను § తేటపరుప వరమిమ్ము మొక్కగొని
నీవు దాపందకను భక్తవశత § సావకాశమున బొందెదవు దేవ !
నీవలని కరుణవడయ దుర్లభము § నేవిశదముగా గొంటి ధన్యుడను
నిర్ణయాతీత ! నిత్యసంతోష ! § దుర్ణయవిదార ! దోషపరిహార !
వర్ణితబృందారక ! నీచరిత్ర § కర్ణభూషణము భక్తకోటికిన్
నీవు శ్రీకృష్ణ ! కృష్ణపతాఖ్య § స్థావరము గనియు శుక్లపూర్ణశశి
ప్రోవందుకళల చాలు కృపనింపు § నావరము గూర్తువా భక్తజనుల
బ్రహ్మజనక ! పరమేశ్వర ! దయాబ్ధి ! § బ్రహ్మజ్ఞానానందమయాత్మక !
బ్రహ్మేశ్వరేంద్రవినుత ! శ్రీపర§బ్రహ్మ ! బ్రహ్మార్పణంబు సర్వమ్ము
నని యర్పించిన నతని కౌగిలిని § నొనరంగ జేర్చి మన్నించి మఱియు
మునుల యుతంబుగ దీవనల గూర్చి § ఘనత నిల్పె దా ఘనుడు విష్ణుండు
మనుజపతి కొన్ని దినములందు మన § వనజనయనుండు నివసించె నట్లు
మును లా నిమిపుల జనకభూపతిని § మనమున హర్షము గూరుప నుండిరి
జనవిభుడు విష్ణుదైవకృష్ణునికి § దివదినము సేవలను భూసురవర్యు
వినుము శ్రుతదేవు డటుల శ్రీకృష్ణుని § దన మందిరమున జేర్చి హర్షించి

మునుల యుతముగా దర్భాసనముల § నునికి గనజేసి తన సతిని గూడి
చరణములను శుద్ధ జలము శిరసై § తరుణిసుతబంధుహితుల నిలయమున
వరుస బ్రోక్షించుకొని తులసిదళము § లరసి పసిమించు గరికపత్రములు
వర కుశ ప్రసూన తతుల గొన్నింటి § సరసిజనాభుని పూజ నందించె
ఫల మూలంబుల నివేదనం బిడి § యలరు నందించి ఋషుల కటు గూర్చి
చలనరహితభక్తిని మీదివల్లె § యలమింటనాడ బై కెగురవైచి
నిలువున తలకును గనక మోదమునె § వలచి చిందులను గూర్చి నుతించెను
నలువజనకుండు నాయింట దినియె § విలసితముఖముల మునివార మటులె
సతిసుతబంధులు వెతలమలుపు నీ § యతివరదుని దయ గన తెరుపిదె యని
బ్రతిమాలుకొనుం డని వారి జేర్చి § యతి ముదము దోప హరిచరణంబుల
యొడిని జేర్చి యో పరమకల్యాణ § జడుపు నిరయమున దప్ప నీయడుగు
నడల జాడ నాయెడగల కరుణను § తొడుకు గననీక తడ వందించితె
జడల విజ్ఞాన మడరించును గద § పుడమిభరణ! యెదలోన కౌస్తుభము
గదలక వెలుగును ఎల్లభువనముల § యడుగు నీయడుగు లడియాసల నిను
కడుభక్తి తోడు గని చంద్రధరుడు § కడక గొని యజుడు సురల తోడయుండు
దుడుకుల నడంచి నుడువులను నిన్నె § కడు ముదంబునను వినుతించువారు
జడధివాస శ్రీవత్సంబు నెడద § చిడిముడిని బాయ గుదురంది నట్టి
యొడలు గల దేవుడవు విశ్వస్వరూప § పుడవు నీ వండపిండ బ్రహ్మాండ
జడచైతన్యము లడర విహరించు § గుడివీవు గుణివి నిర్గుణుండవును
అడరింతువు నీ తేజ మన్నింట § నిడుదవాత్సల్యమున నను జూడుము
యదువంశక్షీర జలధిపూర్ణశశి! § సదయ! పరమేశ! సకలభువనేశ!
గదియింపు ముక్తి కమలేశ! నన్ను § విదితమొనరింపు నీ ధ్యానపదము
లిదె యాటపాటలుగ స్వీకరింపు § మిదె నాకు ముదము బ్రహ్మపదంబగు
నని నుతించి తపతనువును మైమఱ § పునుగొన కృష్ణుడు నతని నదుముకొని
విను మో భూసురవర్య భక్తులను § మనమున వెలయుదు బాయ నెన్నడును
మునుల బూజింపు ముదము శాశ్వతము § ఘనుడు నీయింటనుండు తమిదీర
గనెదు ముక్తిపరమందు నమ్ముమెద § నని తానందము నించె నాతనిని
వనజనయను నాసతిని భూసురులు § మునుల సేవించి ననుదిన మిట్టుల
గనె నర్చనమ్ము మురహంతకుండు § జనవరా మిథిలలోన యంతటను
తన నెలవు గనగ వారిసమ్మతిని § మనముల నుదారగతి నీయగొనుచు
తన కుశస్థలిని జేరె విష్ణుండు § తనవారలెల్ల దను నెదుర్కొనగ

వినుపించె మిథిల దా గన్నృపరాజ ✽ లనుదాను వెలసినట్టి లీలలను
మునులు తమ నిలయములకు నరుగంగ ✽ వినుతించి యానతిని వారందరి
జనవరా! కృష్ణుచర్య లివి యనగ ✽ వినెద నింక నని యడిగె శుకమునిని
ఘనుడుపరీక్షితు డానందమ్మున ✽ వనమాలి సంస్తుతిని గాంచి యనియె

–: శ్రుతిగీతలను పరమతత్త్వార్థ ప్రతిపాదకమైన పురాతనేతిహాసము :–

శ్రీ పరబ్రహ్మ, మండెట్లు శ్రుతులు ✽ ప్రాపకంబందె గుణవృత్తములను
ఏపగిదిన భాసిల నటించు? నవి ✽ యాపగిది విస్తరింపవే! దయను
ఓమునీంద్ర! సత్ బ్రహ్మవిద్వర్య! ✽ నామనంబు తమి గొనియె నది వినగ
నా మహీపాలుడగు పరీక్షిత్తు ✽ కామహాని శేఖరుడు శుకు డిట్లనె
విను మీశ్వరుండు జీవగణములకు ✽ ఘనత విషయభోగముల మరి కర్మ
లను ననుష్ఠానమున దాన గనెడి ✽ ననువైన లోకభోగానుభవము
కనగ కైవల్యమును జెందు విధము ✽ ననువున బురుషార్థముల నాల్గింటి
ధన ధర్మ కామమోక్షములను నవి ✽ జనవరా! సిద్ధి గాంచెడు విధంబు
లను దెలియజ్ఞానమును గూడ మనము ✽ వినుమటు బుద్ధీంద్రియములు ప్రాణము
లను నొప్పుతనువులను బ్రసాదించె ✽ తనసృష్టిదీప్తి గతి మిన్నందగ
జ్ఞానప్రదుండు సర్వేశ్వరుండు ✽ గన శబ్దవాచ్యు డద్వితీయుండు
తా నిర్గుణుండు నయ్యు దచ్ఛబ్ద ✽ మాననీయములు నగు వేదంబులు
ఘనతమంపు గుణయుతపు మూర్తిత్వ ✽ మునుదాల్చి స్తోత్రముల పరమాత్ముని
వినుతించె నెట్టులన దెలియపరతు ✽ విను ముపనిషత్తు వాక్యములు వేద
సమము లనేకులు పూర్వంపు ఋషులు ✽ తమ విమర్శనల స్థిరీకరించిరి
విమలమతీ! మోక్షంబు సులభంబు ✽ క్రమముగ బఠింప సిద్ధి శీఘ్రమగు
ఇదియు నారాయణాఖ్యాతంబగు ✽ విదిత చరితయగు దాని నే చెపుదు
బదరి కొకనాడు నారదుండేగి ✽ సదయు నారాయణుడు నామహర్షి
వరసన్నిధి గని మహాత్మ! సెప్పుమ! ✽ పరతత్త్వరూపి గుణశూన్యుడు గద
పరములను వేదములు నతని నుతుల ✽ పరమున గుణాగోచరుడు గను బలుకు
టేవిధి నా నీ వడిగిన చందమె ✽ పావను నాతని బ్రశ్నించగ నా
దేవమునిని దయ పెంపున నిటులనె ✽ నీవడిగినట్లు సనందనాదులు
భావముల గదిసి యందు సనందుని ✽ యా వివరంబుల దెలుప వినయమున
గోరిన వచించె పరమ హర్షమున ✽ భూరితర తేజులార! మునులార!
నృపుడు శయనింప నతని పరాక్రమ ✽ విపులతను బొగడు వందిజనులవిధి

నపవర్గప్రదుని నాసర్వేశ్వరు § నపురూపరూపు యోగనిద్రావశు
నుతిసేయ దొడగె నిట్టుల వినుండు § మతిమెచ్చ వినెను నారదుం డతడు
యతిభక్తి నిగమచయ మచ్యుతుని § నతని యతని చరణముల మతినింపి
జయ జయ విష్ణో ! సకలజీవేశ ! § జయజయ జ్ఞానప్రద ! వాసుదేవ !
భయనివారణా ! పరమేశ్వర ! హరి ! § నియమ విరాజిత ! నిర్మల ! యనంత !
జ్ఞానము నీపర మందు జీవులను § లోనుగొందు వహ్యారి దోషముల
జ్ఞానమున కీశుడవు నీవెగాన § యో నిఖిలమయా షడ్గుణైశ్వర్య
ముల నీపొందిక గలుగ రాజిలుచు § వలనున మాయాత్మ విశిష్టుండవు
అల కార్యకారణాత్మకుండవును § దిలకింప చర్యలన్నిట గుదిరియు
నున్న నీయందు నామ్నాయంబులు § వన్నెగను ధర్మవర్తనమును గని
వెన్నుడా నీవు త్రిగుణాత్మకంబు § గన్నట్టి ప్రకృతిబద్ధ మడంపుము
యోగిహృత్కమలముల వ్రాలు § తేనె టీగ యో పరబ్రహ్మ! యనామయ !
భోగిశయన నిను నా యోగులెల్ల § బాగొప్ప జ్ఞానదృష్టి గనువారు
క్షితి క్షితిధరసరిత్సముద్రముల § నతివిశాల గతి మెలగ భువనముల
నతి దీప్తి గనెడు భానుచంద్రముల § మతి వెలయు సురల చరాచరంబుల
నిన్నెకాదలచి సన్నుతు లిడుదురు § చిన్నెల మూటిని గన్న దేవుడవు
క్రిన్నన విలయం బన్నివేళలను § ఎన్నిక నీలో నన్ని లీనములు
గా వెలు గండెడు ఘటశరావాదు § లేవిధిన మృత్తు పెక్కువిధంబుల
భావింపదగిన యాకృతిం గూర్చిన § నేవలని గనిన మృదాత్మ సమమగు
ఆ విధిన నీవు నొకడవు భాసిల § నావిధి ప్రపంచమెల్ల నొప్పగను
కారణరూపము దాల్చిన నీతో § సారమందగా బుద్ధివాక్కు మతి
నారయ కర్మములను గూడుచుండు § ధీరత పచింప నివి నీమయంబె
పదవిన్యాసం బెట్టుల నైనను § గదియు నిలయందె నీవు మొదలుగా
నుదితముగవ వివి సర్వము నీవే § విదితమని రిట్లు విజ్ఞాన మతులు
లలితధాత ! పరమేశ ! సంపూర్ణ ! § తలపగ ప్రాకృత పూరుషకాలా
దుల విశ్రలమ్ముగ నీ కథాసుధను § వలచి గ్రోల మాలిన్య మెక్కుడిది
గన నిదాఘ తప్తుడు బాటసారి § యనువున శీతలవారి గ్రోలునన
తనువున తాపంబడగి శాంతినిం § మనమున ముదంబు గనెడు చందమున
వినుభీతి గూర్చు సంసృతి సంగతి § నిను భజించినను నిధాన మందరు
చను జరామరణ మానసదుఃఖము § లును గుంపుగొనుచు బారును యీశ్వర !
మందు డెర్ఘంగడు నీధ్యానమహిమ § ముందు సుకృతమున నిను దలపును గొను

అందునను దేహి నిత్యానిత్యము । లందు విశదమున బుద్ధిని నిలిపియు
విలక్షణంబగు నాత్రము నెఱింగి । యల పంచకోశముల నిజమారసి
మొలమినే గాంచి లోనున్నయట్టి । తొలుత ప్రాణాన్న బుద్ధివిజ్ఞాన
ములకు నవ్వలను నానందమయము । వలను మీరు నీదీప్తి చూపించి
నిను స్వప్రకాశు పరిగ్రహమందుట । కనుటయగు నీస్వరూప మో దేవ !
కనగ మహదహంకార తన్మాత్ర । లను భూతపంచకం బానాదిసకల
మునగు తత్త్వముల బ్రహ్మాండసృష్టి । కిని కార్యకరణ సమ మందెదు
నిను ననుసరంబు గొనిన శరీరులు । గనెద రిహపరము లందు సౌఖ్యముల
గనరు రెంట నవి దురిత గతులంట । జనులు మూఢులుగ నిను ననుసరంబు
గొనరు దివిజారిహరణ ! జనార్దన ! । తను లవ్వారివి గాలి తో త్రిత్తు
లగు సాటిగావు నిరుపయోగతను । బిగువు బలము జిగి యేల నసింపగ
తగియుండుట కగు నో మధుసూదన ! । జగత్ప్రభో ! నిను గొందరు సూక్ష్మపు
ననువు గుదురందు దృష్టి నుదరమున । ఘనత నొప్పారు వహ్నిగా మదిని
గని తలపు నిమ్మగ్నకొని యోగము । నను నిను గొల్తురు శార్కరాక్షులన
ఘను లారుణులను వార లందులో । వినుతిగను ఋషులు హృత్ప్రదేశమున
నతి సుషుమ్నయను నాడిపద్మమున । గతినందు నిన్ను దహరాకాశ వ
సతునిగా దలతు రట్టి హృత్పద్మ । మతివిశాలముగఁ బరిణతిని గాంచి
సతత ప్రకాశము నగు సహస్రార । మతుల శ్రద్ధనగు ధ్యానసంబంధ
మున బ్రహ్మరంధ్రమున పెంపునింపు । ఘన విచిత్రముల నరసి యానంద
మయపరంజ్యోతివగు నిను బొందుము । రం యమలమతులు జన్మలకు రారు
నయవినోదరత ! భవతాపకహారి ! । లయరహిత పదవిశిష్టమాధవా !
పలువిధమ్ములై దారువులందున । నెలకొనుచు నగ్ని తద్గతదోషము
లలవడక శుద్ధి తరతమ భావత । వెలుగుచును హేయ మందున బొరయడు
ఘనత బోల్పంగ బ్రహ్మంబ వయిన । నిను సర్వసముని నద్వైత తేజ
ననఘు నిరామయు నామరూపక్రియ । లను గుణమందని విశ్వాంతరాత్మ
నిరసనకాములు నయి సంగ ముడిగి । పరమవైరాగ్య భరిత హృదయులయి
వరుప గనరు ఫలముల నేవరముల । నిరతానందమె వారి నిలయముగ
స్థిరచిత్తంబుల చలన మెరుంగరు । ధరను బూజితము వారి చరితంబు
నిరయ ధ్వంసకులగు మఱికొందరు । వరద ! నీచరణ సరసిజంబులను
శరము నియమంబు గని సేవించుచు । దురితముల జెందుదురు మరికొందరు
సురపూజిత ! నీ యవతారలీల । లరసి ఝషకూర్మ కిరినరహరివటు

పరశురామ రఘురామ బలకృష్ణ ॥ పరములాది యవతార చిత్రమ్ము
లను విని భజనల నుతించి మ్రొక్కుచు ॥ గనరు సంసృతిని సర్వము నీవను
టను మంజులంపు గతి గాంతు రట్లు ॥ వనధివాస వైకుంఠ ! పరాత్పర !
వర సుధార్ణవము నీకథారతియె ॥ పరమభక్తు లవగాహన మందుల
వరుసగాంచి విశ్రాంత చిత్తులయి ॥ సరణిని నజరామరణ పదంబును
గనెద రదె మోక్షమగు పెర లేదని ॥ ఘనులు మఱికొంద రా విధము తోడు
గొని సముచిత్తత నేమిట నైనను ॥ నొనరఁదఁ జోరు రాగమున మిగుల
గనవారు భాగవతులు ముక్తియే ॥ యనుసరించుగా నదియును మది కలి
వినుము దేవ ! నిను భక్తి నెవ్విధిని ॥ మనము పవిత్రముఁ గూరుప నైనను
గనరు బంధనము ముదము బంధురము ॥ గన నఘము దూర మదెముక్తి సరస
యదె విరటించిన మతి నొప్పు వారి ॥ బ్రిముకది యేటికి జలబుద్బుదంబె
సదయహృదయ ! శ్రీనివాస ! విమలపు ॥ సదనా ! పాపదవానలసువృష్టి !
నీకని యోగులు యమనియమాదుల ॥ తోవను గొందరు జ్ఞానవైరాగ్య
భావనల కొందరాముసు లల్లే ॥ సేవార్చనముల నాథులు కొందరు
ప్రేమను కొందరు కామమున గోప ॥ కామినులు వైరమున శిశుపాలా
దులు నయభయాదులను మఱికొందరు ॥ నలువజనక ! యేమరయ నొక్కటియొ
తలపున నిను నిలిపిన జాలునయ్య ! ॥ జలధరవర్ణా ! వినుతచతుర్ముఖ !
నీమహనీయ పదమున వసింతురు ॥ ఓ మహాదేవా ! యంతియే గాక
అరవిందనయన ! నీ నిజరూపము ॥ నరయఁ బ్రత్యక్షమున గనరాకని
తరతమము లెంచు శాస్త్రములు పెక్కు ॥ పరములను గోచరంబు నీవంద
వరుసను సృష్టికిఁ బూర్వము నందున ॥ కరము సద్రూపుఁడవు నీవుగాగ
సురలు ధాత మొదలుగను జనియించి ॥ దరయ నంతకును మును నెరుఁగ రెవరు
నిను సంశయములఁ బ్రమాణమ్ముచే ॥ తను బెక్కువాదముల వారువారె
మునులు కణ్వ గౌతములాది బుధులు ॥ విన పరమాణువు కారణంబుగా
నిను బల్కుచుండ్రు కొంద రట్లనక ॥ ననువున బ్రకృతియె కారణం బనుచుఁ
గనఁగ విదర్శన ములవే యనుచును ॥ అనయము సాంఖ్యము ననువందింతురు
వినఁగ దేహాత్మ వాదులు బౌద్ధులు ॥ జను లితర మతము లను దోచినట్లు
నిను నిరూపింపఁ దర్క వాదములఁ ॥ బొనరు వొసఁగించి చాతుర్యములను
బరమాత్ముఁ గనెఁడు దారు లిదియనియుఁ ॥ బరిపరివిధముల బల్కుచుండ్రుగా
పరమేశ్వర ! నిను నిష్కాములగుచుఁ ॥ బరమభాగవత యోగసంగతిని
ధరణి నిను గనెడి భాగ్యవంతులకు ॥ వరదాయక ! నీ సత్యమెఱుఁగ నగు

వార లాభాగ్య మంది సర్వముల ఽ ధీరత నసత్యములని నిశ్చయము
మారులేని విధివార్త వెలిసింతువు ఽ హరీ! సచరాచర, రముల నీవొప్పి
జగదంతర్యా మివిగా వెలుంగఁ ఽ దగవు నెఱుంగక నిత్య మనిత్యము
అగు గాదు లేదు, కలదని వితండ ఽ ముగ నాడఁ దెలియుదురు గాని సత్య
మునఁగాంచలేరు సర్వభూతమయుఁ ఽ గనకముఁ గటకము మకుటాదిభూష
లను నొకటి యనుచు భేదరహితముగ ఽ మనమునఁ గనినటు నిను నాత్మవిదులు
గనెదరు భువన వికారము లన్నియుఁ ఽ గన నొకట లేని వాఁడవును గాక
స్థిరతను దోపును విజ్ఞులు మాత్రము ఽ వరమతులఁ దెలిసి మోద మందుదురు
అట్టివారు నీ చరణసేవఁ గని ఽ పట్టున మృత్యువుఁ దట్టి సంసృతిని
బట్టి విరాగముఁ బట్టున నెట్టుచు ఽ మెట్టు పవిత్రతఁ జుట్ట మెలఁగెదరు
నిను భజించ నలఁతను గను నీచపు ఽ జనులఁ బశువులుఁగ వారి పెక్కులగు
తను సంసృతి నాశించు వనల ఽ ఘనత మెఱయ బంధించి. నిరయమున
మునఁగఁ ద్రొబ్బెదవు దుష్టగర్వాంధ ఽ తను మింతురిష్టమున నీ విముఖత
పెనుపుమందంబు నగుపాశములను ఽ వినఁగ నామరూపముల భేదంబు
భువనపతివీవు జననకర్మములఁ ఽ దవుల వటుఁ గాన గర్మశరీరము
గవయుఁ దగు నిన్ను గర్మరహితాంగ! ఽ అవలంబనంబు నొంది యుందువో
యవియే వివేక కరణగమనముల ఽ సవిధి గూర్తువో బ్రహ్మ మొదలుగా
వినఁ జోద్యంబగు నీ పరతంత్రులు ఽ మునిలోకవినుత! స్థిరచరములైన
కనరూపమందుఁ జేతనకోటికి ఽ ఘనతఁగల నియంతవు నీవె యీశ!
నిను దయను జూడ మ్రొక్కిన జనులను ఽ మునుకొన ముక్తిని గూర్తువటు గాని
జనులు దుర్గతిని వారే జొత్తురు ఽ తనరునట దుఃఖతాప సంగతిమె
వనరు దమునంద విలపింతు రచట ఽ కనదిక్కెవ్వరు లేక మాధవా!
దేవాసుర నర తిర్యక్కులునుఁ ఽ స్థావరాదులుఁ అణురూపులుగా
నీ వంతరాత్మవై వెలయుదు వం ఽ దావరించునది నీ మాయమహిమ
సకలమైన దేహముల చాల్గనిన ఽ బ్రికటితముగ జలబుద్బుదముల వలె
సకలేశ! ప్రళయమందున నీలో ఽ వికలమున లీనముగ ధరియింతువు
ఇంతకుఁ గారణమీవె గాకెవరు? ఽ చింతింపఁ బోల్కెఁ గనరా దచ్యుత!
సంతతము భక్తజనపోషణమున ఽ సంతానతరువులైన మూర్తియవు
భవఘోర తిమిరభాస్కరుండ వన ఽ భువి దుష్టదైత్యదమనుండవు నా
దివులుఁ దొలపు నభయంపు రూపమనేకవులు మునులు పేర్కొనెద రతయ్య! నిను
మనమతి చంచల తురగమును బోలి ఽ ఘనుల జితేంద్రియ జనులైన దద్య

గను ద్రోవనీద్చుఁ గాన వివేకము ʃ నను తేజమందు నూలి తాటిచే
గుదియించి నీదు పదసరసిజముల ʃ హృదయమును గదియ గురుత్వ మందిన
నదియె ముక్తిఁ గుదిరించు నుపాయము ʃ ఇదిగాక మోద మది శూన్యముగను
వదలవు వగవులు ఇతర యత్నముల ʃ నుదిత విజ్ఞానరూప! సద్రూప!
విదిత మిది తెలియనేరక సంసృతి ʃ చదురున నటించు టలునాక లోన
బయనించు వణిజులోలు నందునను ʃ భయమధికంబుగ నావికుఁడు దిక్కు-
దయఁజూపరాదు వానిగతి యెట్లు ʃ రయమందునట్లు నిను మరచుపట్లు
నరుఁ డనిత్య సుఖమందించునట్టి ʃ తరుణీ సుత ధన బాంధవ సమితిని
కరమునమ్మి కూడుటల మఱిఁగొనిన ʃ బరముఁ గనఁడు భవవారిధిఁ గడవఁడు
విరించిజనకా! నతులను భర్త ʃ మరానోకహం బయ్యెఁడు విశ్వే
శ్వరా! శుభప్రద! సుస్థిరవైభవ! ʃ నిరంతరము బహు తీర్థసదనముల
నీయందు మఱియుఁ గూర్చు శాంతమున ʃ నేయం బందిన వారిఁ దయఁ జూచి
పాయక బంధనములఁ బాయఁ జేసి ʃ సాయమగుచు భవనీరధిఁ బాపెద
వట్టివారు సమమతులు సంతుష్టి ʃ పట్టున శాస్త్రములగు స్వల్పములనె
మట్టమున మేరుగిరివలె నెంచుచుఁ ʃ జట్టుఁగొన రితర ధనపదార్థముల
వారు భాగవతజనులు గురి గనిన ʃ వారిసేవించు జను లానందముఁ
జేరి సుఖంతురు పుణ్యలోకములు ʃ సారతరమందు నెలవు లీశ! హరి!
నీవు సత్తైన నీయంకమందుఁ ʃ దావుఁగొన్నట్టి ప్రకృతి సత్తయగు
భావింపఁ బకృతి సేతలైనట్టి ʃ యీవిధి ప్రపంచమును సత్తునగును
ఈనయ మెట్లనఁ గన కోపమాన ʃ మానితమంచును సాంఖ్యుల మతంబు
దాని వినియు నద్వైతులిట్లందు ʃ రానయము దీన ననువంద దనుచు
విను జేది పుట్ట నిదియె సత్తదియె ʃ కనదానిని గాదనుట వ్యతిరేక
మను వ్యాప్తిగనుటయగు నిత్యసత్య ʃ మునను బ్రహ్మంబె దవరనై యుండు
కనిన ప్రపంచము మిథ్యయౌఁయగుట ʃ వినుఁ డిదియు సత్తు ప్రకృతియు నసత్తు
అని నిరూపింప సాంఖ్యు లద్దాని ʃ మనమునను గొనక మరి బల్కుదు రిటు
విమలత బ్రహ్మమునన కార్యకార ʃ ణముల నవస్థలుఁ గసి యున్నంతన
గ్రమమున మిథ్యలుగావు వీన జన ʃ నము రెంట నవి యెల్లపుడు గుదురు
కాన ననియునుగ సత్తన బరఁగును ʃ దీని మీరు గాదనుట నొప్పదన
దాని ప్రత్యుత్తరముగ నద్వైతు ʃ లీ నియమవాక్యముల వచించెదరు
వినుఁడు వేదశాస్త్రములు సర్వమున ʃ ఘనతఁ జెన్నొందు బ్రహ్మము సత్యము
కన మిగిలవన్ని యసత్య మగునవి ʃ మునుకొనునవి వృద్ధియును క్షీణమును

గను మఱియు వృద్ధినిఁ గర్మవలన ? జనుల విద్యాంధతమమున దోఁగుచు
బలుకుదు రంతయె నిజము జూడఁగను ॥ నిలువ దీవాదనము రెంటివలన
నిలుచు మాప్రస్తుతపు ప్రసంగంబు ॥ తెలివి విలసిల్లు వినుఁడు విద్యవల
నవ ననువుఁ గొన్న జ్ఞాననేత్రమున ॥ ననఘమతులు మీ రరయుటయు లెస్స
గనుఁడు బ్రహ్మమున గారణావస్థ ॥ ననుసరించియును జగమును బ్రకృతియు
స_త్తనివచింప నదిబాధ నందు ॥ సత్తున బాధారహిత మొప్పుటచె
సత్తు బ్రహ్మంబు తక్కిన వసత్తు ॥ ఇ_త్తెఱఁగు ను_త్తములు గనెడి విధము
దేవవినుత ! జీవములకుఁ గర్మఫల ॥ మావరించి తా భో_క్తృత్వ మంది
నీవు సాక్షివయి గాంచెద వింతియు ॥ భావవేద్య మిది మునిజనంబులకు
నిజకంఠలగ్న కంఠికామణిని ॥ భజించ వెలుఁగుచు నున్నను గానరు
నిజచర్యలన్ని యవిద్య పరమున ॥ గజిబిజిని సంసృతిని దోఁగి నరులు
నిజహృదయమందు భాసిలెఁడు నిన్ను ॥ నజవినుతు నలఘుతర విభ్రాజితు
ననంత మూ_ర్తిని గనలేరు మేము ॥ ఘనత నెఱఁగి నుతిసలుప వెనుకొనుట
మునుకొనుటగఁ గరుణించి మేలుకొను ॥ మనుచు శ్రుతులు జోడించు వినతులను
మునులువింటి రాశ్రుత్యధి దేవుల ॥ ఘనమైన గీతముల యోగము లవి
యనుచు సనందుఁడు సనకాది మునులు ॥ వినఁబల్కె మున్ను బ్రహ్మసత్రమున
నందునను విన్న వాఁడవే నీవు ॥ ఇందునను వింటి వదియె వచించితి
ముందు చింతింపు మయ్య శుభంబగు ॥ నందెద శ్రీనివాసు దర్శనము
అని నారాయణ ముని నారదునికి ॥ ఘనమతిఁ దెలిపెను నీకు నేఁ జెప్పి
తిని జనపాలా ! నిలుపు మెద ననుచు ॥ ముని శుకుండు పరీక్షిత్తునకు బోధ
నొనరించె నతఁడు విని ముదమందఁగ ॥ నని మఱియును నా నారదుండు నా
జనకునకుఁ జెప్పె దాని నావలన ॥ వినినాఁడ విదియు వేదవినుతంబు
సకల పురాణేతిహాస సారము ॥ అకలంకమతీ ! యుపనిషత్తుల్య
మిక దీని విన్న వ్రాసిన పఠింప ॥ సకలజ్ఞునిగను పదమును గననగు
ననిన పరీక్షితుఁ డతనికి మ్రొక్కుచు ॥ మనమున హర్షము వెల్లిగొన నడిగె
వినఁజెప్పు దయను శుకమునిచంద్రా ! ॥ జనులు శంభుపూజలను నైశ్వర్య
ముల సుఖానంద భోగంబు లందరే నల రందననుభవింతురా హరిని
వలఁగొన్న నతఁడు శ్రీలక్ష్మియుతుండు ॥ డల భ_క్తజనులఁ బేదలుగఁ జూచు
నల శంకరుండు మలనివాసియై ॥ తిలకించు మేలు భ_క్తగణములను

—: పరీక్షిత్తునకు శుకయోగి విష్ణుసేవా ప్రాశ_స్త్యంబు చెప్పుట :—

అలవిధానముల భేదంబు గలదె ॥ తెలియఁ జేయవే యన శుకుం డనియె
యనఘు లీశ్వరుని గాళీనాథుని ॥ మునులు గుణత్రయుఁ డని బల్కుదు రా

తని గొల్చువారు రాగాదియుక్తు § లనయము సంపద లందుచు నుందురు
విను మచ్యుతుండు గుణాతీతుఁడయి § యనయముఁ బరముఁడు పురుషోత్తముండు
నన బరముఁడనుచు నతని సేవించు § ఘనులు రాగాది రహితులై యొప్పఁ
గని దీపింతురు కామ్యముల గొనక § వనజాక్షుఁ డట్టివారిఁ గరుణఁగను
విను ధర్మనందనుఁడు నశ్వమేధ § మును జేసి పిదప నారదమౌనిని
గని నతిని నతని వలన స్వాతికుల ఘనతగను § చరితలను వినుచుండియు
వనజాతనేత్రు గని యడిగె నిట్లు § ఘనుఁ డితఁడు నీకుఁ బెద్దతాతయగు
ముని చిరునగవున గాంచి కృష్ణుఁడనె నీవిధమునఁ దన తేజం బెసగఁగ
మనుజనాథ నే నెవనియనుగ్రహ § మునఁబ్రోవఁ దలఁతు నాతని ధనంబుఁ
గ్రమమున నపహారమున గూర్తు నతని § సమవిహీనమతి బంధులుఁ జేరరు
భ్రమలుడుఁగు నతఁడు ధనహీనుఁడుగా § విముఖుఁడగు నితర వృత్తములందున
నిఖిల కార్యభారముల త్రాఁ గొనక § నఖిలసంవేది నగు నాభక్తుల
నఖండప్రీతిని సఖ్యార్చనములు § విఖండితపుమతిఁ గామభోగముల
ననయము రాజిల ననుగనెడు తపము § మునుకొనెడు చరమ కాలమందునను
నానందంబే వారి నిలయముగ § ధ్యానసమర్చనయే ధనంబుగా
మానితమతి నాచరితల వినుటయె § పానమును భుక్తికిని సుధ నమరికఁ
గనినను దూలకబల్కక నదియే § ఘనము నిగుడ శోభనమని తృప్తిని
గొని మొక్కుదు రాతని మునులు మెత్తు § రనఘ ! నాసేవ దుష్కరం బగునో
గనెదరా మీరు నా సేవఫలముఁ § గనరు మదాంధులు నా కరుణగన్న
ధనాదికమ్ముల మదంబుపేర్మిని § ననార్యచర్యలఁ గృతఘ్ను లౌదురు
అనుచు నను మఱవ వలదనుచు నవ్వు § చును ముదము నించె నా యుధిష్ఠిరుని
వినుమిందు నొక్కయితిహాస మమరు § నను నీవడిగిన ప్రశ్న కుత్తరము
శకుఁడు నానొక్క దైత్యునిపుత్రుఁడు § వృకుఁడు నాబరఁగు దుర్వివేకుఁడగు
ప్రకరమందు సుజనుల నలతఁ గూర్చ § సకుటిలత దెరువు నరయుచు నొక్కటి
మునివరు నేకాంతమున గని మ్రొక్కి § వినఁదగు సురముని ! నారద ! మహాత్మ

-: శివద్రోహంబు సేయంబూనిన వృకాసురుండు విష్ణు మాయచే మడియుట :-

ఘనులుత్రిమూర్తులు నను హరవిరించి § వనజలోచనుల లోన నెవరుతప
మున వేగ నిష్టములను గూర్తురో ? § మునుకొనెద యత్నమును నీవు దెలుపు
మనతికాలమున బలము దీప్తిగన § ననువు నపేక్షను గొనినాడ ననిన
విని ధీవిశారదుఁడు నారదుఁ డనె § దనుజవరా ! దుర్గుణము సుగుణంబు

లెటఁ దాఁ గాంచునో కోపప్రసాద ॥ తటమందు శివుఁడు వెనువెంట ఫలము
కుటిలము నెంచక శీఘ్రమున నిచ్చుఁ ॥ బటువంద నతనిఁ గొల్చెము సిద్ధిని
వడసెద నిట్టుల మావారాతని ॥ వడి నెఱిఁగి నిష్ఠగామ్యంబులనుఁ
దడ చాయ గనిరి బాణుఁడును రావ ॥ ణుఁడు మరికొందరు పశుపతిపూజల
సడలని వైభవములఁ దులఁ దూఁగుచు ॥ సుకుల నెఱుంగరు ఖ్యాతిని నెగడును
గనిరి నీవటుల జేయుమని పంప ॥ దనుజవీరుండు కేదారతీర్థ
మునకు నేగి శుద్ధిఁ గాంచి యంత ॥ ఘనుని నీలకంధరుని శంకరుని
వనజోద్భవ నుతు నంబికాధవుని ॥ మునిసేవ్యు వామదేవుఁ ద్ర్యంబకుని
మనమున నిలుపుచుఁ దన మేనికండ ॥ లను గోసి హోమగుండమున వేల్చి
జనలోకము వెఱఁగందఁ బూనికను ॥ గొనియు లవము లోపమును గూర్పకను
వినుతింపనైన కామహంతకుఁడు ॥ తన కెదుట నిలిచి తీవరము నెంచి
పరివేగ మంది శుద్ధ మతి గనఁగ ॥ శరణి కేదార తీర్థమున మునిఁగి
తడవున జడియక నియమతలమంది ॥ దుడుకు సుడివడఁగ వేఁడినిట్టూర్పు
వెడల మృత్యుకోరను బోలినట్టి ॥ బెడిదమగు గండ్రగొడ్డఁట శిరమును
నడల కుండమునఁ బడఁజేతు ననుచుఁ ॥ దనకరమున నది బూని విసరుకొనఁ
గని శంభుం డాహోమకుండమునఁ ॥ గన వెల్లువడుచును దనుజవర! నిలువు
నను మెచ్చ నర్చనము సాగించిన ॥ ఘనుఁడ వుడుగు సాహసము తలదనుచు
ననుగోరు మిష్టమును వరదుడనై ॥ నినునిపుడె తుష్టిఁ బొందింతు ననిన
హరుని మనుజాశనుఁడు సన్నిధిఁగని ॥ కరమున దను నిమురంగ శిరమ్మును
జరణములపైఁ ద్రొక్కియును నిలిచె ॥ కరములు మోడ్చి యడిగె నిట్టువరము
విను మిందు మకుట ఫాలలోచనా! ॥ మనములోని నాఘనమైన కోర్కి
ఘనుఁడవు మూర్తుల నీకిది సులభము ॥ ఒనరందింపుము వ్యర్థ సేయఁ జనదు
నాకరతలంబు నెవని శిరమ్మున ॥ సోకును గన్నమ శిరము శతమ్మగు
ప్రాకటంపు ఖండముల మడియు వలె ॥ నీకరుణవలను నను గూర్తువేని
వరమిదె గూరుప వలెగా దనకువె! ॥ పరమార్థైవ ఖీ వనుచు వేడ్కఁ గొని
స్థిరతర యోగమునను గోరితి నిటు ॥ లరయు మనిన హరుఁ డాతనిఁ గాంచియు
[illegible]హాసితముఖుఁ డడయక యిచ్చెనఁ ॥ పరమాద్భుతమును బరిపాటి నెంచి
శరణమని శంకరుని హెచ్చరించి ॥ పరమేశ్వర! నీ వరము పరీక్షను
వరసెదను మనమిఁ గొని దరికి రమ్ము ॥ శిరమున నిన్నే చేర్పవలె ననుచు
గదియ వడిగన్న దనుజవరునిఁ గని ॥ కడవులు ద్రొక్కుచు నా మహేశ్వరుఁడు
అదిరా! దనుజుఁడ నా వరమున నెసె ॥ కుధింత వ్వారా! హేమవతీ! [illegible]

హరి గల్గఁడంచును లో నెన్ని యచట § బరువు వారె వడి వృకదనుజుఁడు గన
సురలు భీతిలిరి మును లల్లి యయిరి § కరుణ నెదు రెవరు రారు ప్రతియొనరు
దెలియఁ దరుణమున కనువునఁ గానక § కలఁచుకల గనెను లోకమ్ము లన్ని
అల దనుజుఁడు వెను వెంట రా నభవుఁ § డలఁత వాయఁ గని నిరుపమానంద
నిలయము నిఖిలజగమ్ముల కవ్వల § వెలుగొందు చుండి యమృతపద మనఁగ
మునీంద్రగమ్యము సత్వగరిష్ఠము § కన మనోహరము శ్రీ నిధానంబు
కనకమణిరత్న భేదసందీప్తిఁ § దనరు దివ్యసౌధముల మంటపము
లను దోరణ స్తంభముల శిఖరములఁ § గన నుద్యాన వనముల ముంగిళ్ళ
ఘనము పలువిధములను మెచ్చనొప్పఁ § గనుదాని శ్రీశు ధ్యానపరాయణ
దరమందు దాని విష్ణుపురంబును § సరసతనుఁ గాంచి లోన త్వరఁ గాంచి
హరిహరీ! యనుచు నతని స్థానంబుఁ § జొర నరుఁగునప్పుఁ డా శ్రీకరుండు
భోగీంద్రభోగ తల్పంబునందు § బా గొప్ప శయన మూనిన దరహాస
మే గురుతరంపు శశికిరణసంతు § నాగ శ్రీదేవి దృక్చకోరముల
నంద మందించ వినోదమందుచు § ముం జార్తభక్త జనరక్షణంపు
చందంబు లరయఁ జిత్తవృత్తిని § నంద సునందాదులు సేవింపఁగ
నలరు హరి ఫాలలోచనుని రాకఁ § దలపునను నెఱింగి దనుజపాలునకుఁ
గలఁత్రంఁ ద్రనుఁజేర నిచ్చిన వరంబు § తలమీఁదరాగఁ దనుఁ దలఁతుఁ గదియఁ
దనుఁగనుట ముదము తనుగాంచు ననెడి § ఘనుని సంకల్పమును మదిని గాంచి
వనితతోడి దగు వినోదమును నిలి § పినవిధమ్మునను దిగ్గన లేచియు
వినమ్రీఁడగు హరుభయము నుఃుఁగు మని § యొనరున ధరించె నొక వటువేషము
పసపు గోచియున్న బట్టు గొడుగునుఁ § బసిడి ముంజియును గమండలంబును
పస మించు పింఛమును బోలు తనువు § దిసల వెలిగించు ధవళజన్నిదము
సన్నని దండము కృష్ణాజినంబుఁ § జిన్ని పట్టెవర్ధనము జారు సిగ
తిన్నని నడకలు మఱి వ్రేలు గోచి § పిన్న నగవు గల శృంగారముఖము
వేలిమిబొట్టును వ్రేళ్ళదర్భలును § బోల గనుగన్న ననలుఁడు కాంతినిఁ
జాలున నన్నియు నొప్పగా భువన § పాలకుఁడు విష్ణు డిటు కపటమ్మున
డాలందె దనుజు కొఱకు మాయఁగొని § యాలసింపక్తను నా స్సుగుణహీను
నకు నెదురు నిలిచి కపటమతి మ్రొక్కి § వికచవదనుడై వృకాసురున కన్నెఁ
ఏల? దనుజవర! యాయాసమందు § ఏల? వగ రింతఁ గనుటఁ దెలిసితిని
నీఁవర్ణ గన నేగుచుంటివా? § యా లలితాంగుడు మాయదారి సుమ!
మేలు గల్గు మాటాడు నాతోడఁ § జాల వడి నడకఁ దెల్పు నీయూర్పు

యకట సుఖములకుఁ గారణము తనువు ǂ నికటమును బాసి తెందుకో సెప్పు !
సకలకార్యముల శాంతము వలయును ǂ వికలచిత్తులకు శాంతము దూరము
కపట హృదయుఁడవుఁ గాక వచింపుము ǂ విపరీత మిపుడు కాలంబు నీకు
విపులధైర్యమును నీకు బోధింతు ǂ నిపుడేని యిష్టసిద్ధి గాఁగలదు
నావిని సుధాసమములగు వాక్కుల ǂ నా వటు డుత్తమపురుషుఁడా ! యనఁగ
నీ వెరుగుదె ? శివు కుత్సిత వరమునిఁ ǂ దోవ నరుగుటలు గాంచలేదేమొ !
నావలని హోమఫలము దాఁ గొనుచు ǂ నేవలను బాకె ? నీచుఁడు వర మిడి
కినుకఁ గొనినాడ వానిపై నేను ǂ జనుదెంచి యుండి జారె నాయెదుర
నని యెల్ల విశదముగ వినిపించిన ǂ విని యల్ల నగుచు విను దనుజేంద్రా !
మును శివుఁడు దక్షశాపమును గాంచి ǂ ఘనతఁ జెడ గనియె పిశాచిరాజ్యము
విను పిశాచగుణ మావేశించిన ǂ గనడు సత్యమును దయ నెటుఁగ డతఁడు
వరము పంచనము బట్టి సమయమునఁ ǂ బరిచయ మందితి వేమొ త ప్పయ్యె
పరిశుద్ధి నతని యమ్మాటలోనె ǂ నరయ నీ యెదుర నిలుపుకొనవచ్చు
కరము శిరముపై మోపంగ వచ్చు ǂ హరుని వరముననె ప్రియులు గదుపఁదగు
నిన్ను కా దెవరినైన నట్లగద ! ǂ చిన్న లిట్టి నా దిగంబరునివా
అన్న ! స్నాన మొనరించిరమ్మ ! నీ ǂ కన్నుల మఱఁగినవానిఁ గాంచెదవు
ఖిన్నత విడువుము మంత్రిమ్మ సెపుదుఁ ǂ నున్నసంగ తిది నీయిష్ట మవల
అన్న దనుజుండుఁ నట్లొనర్తునని ǂ మిన్నందిన గర్వంబు చాలునను
గ్రిన్నన స్నానం బొనర్చువడినిఁ ǂ దన్నుమఱచి తన శిరముపైననే
తనకరముఁ జేర్చి తానె యట్లయ్యె ǂ వినువీధి సురలు జయజయధ్వనుల
ఘనుడైన నీలవర్ణుఁడగు విష్ణుఁవును బుష్పవృష్టి మునుంగఁజేసిరి
వరమతి దుందుభిమోత లాదిగాఁ ǂ బరమంద వరుస గంధర్వాప్సరు
లరసి మురిపెమున నాడగఁ బాడఁగ ǂ ధరణి మొదలు భువనముల భయ ముడిగె
హరుఁడు ప్రక్క నివసించి కరమ్ముల ǂ శిరమునను జేరిచి మ్రొక్కి నుతించిన
దరహసిత వదనుడై యిట్టులనెను ǂ నరభోజనుండు మడిసె విడు భీతి
శివుడవగు నీకుఁ గీడుఁ దా నెంచి ǂ శివమొత్తినట్టి ముదమునఁ గూలె
భువిని మహాత్ములఁ జెనక నెంచినను ǂ దవులుగాఁ గీడు వారలకె మరల
కేవలం బట్టి కూరుల వరముల ǂ భావిఁ దలంపక నీ రా దంచును
పావకాళమున నుతిగొని సెలవిడె ǂ దోవఁగని నెలవుఁ జేరె శంకరుఁడు
తాను శంకరునిఁ బంపి పరివార ǂ మానందంబున గీర్తింప రమా
మానితసంస్తుతి నంది నిజపీఠ ǂ మానుకొనియు నుపవిష్టుడయె పురిని

మానవనాథా ! యీ యాఖ్యానముఁ । బూనికచే విన్నను జదువంగా
శ్రీనివాసుదయ సుఖము లిహమ్మున । నానందనిలయ మబ్బుఁ బగమునను
వినుము వచింతును నింకొక వృత్తము । మును కాలమ్మున మునులు పెక్కండ్రు
ఘనత సరస్వతీ తీరమునఁ జేరి । మనముఁ బరికింపవలెను త్రిమూర్తుల
యందునను మిగుల సత్వగరిష్ఠత । నందమింపఁగా నధికుం డెవరో ?

-: భృగుమహర్షి త్రిమూర్తుల ప్రాశస్త్యంబు శోధించుటకుం బోవుట :-

సందు నెఱుఁగవలె ? భవపద్మోద్భవు । లందు మఱి భవుని జనకునియందున
గుణము శోధింపవలయు నందులకు । గుణ మందింతయు సర్వశక్తులను
నణుమాత్రమేని జంకుఁ గనరాదు । వ్రణమొందకుండ తపము మనవంతు
గనెదమంచుఁ దలఁబోసి భృగువును । ఘనతకు నీతఁడు దగునని పంచినఁ
దనమది నుత్సాహము మీఱ నపుడె । వనజభవునిఁ గన సత్యలోకమును
నొనరుననుఁ జేరి మందిరముఁ జొచ్చి । వినయవిధేయత లేమియుఁ జూపకఁ
దనను ధిక్కారమునుఁ జూచునట్టి । మునిపైఁ దనరోషానలపుఁ బేర్మిఁ
దనరుదృష్టి నిగుడించి మనములోఁ । దన తనూజాతుఁ డతఁ డగుటఁ దలఁచి
కన శాంతోదక దృష్టి నదిమలఁపె । మునియుఁ గనె నతనిఁ దలఁపు వెసఁ గొనియు
భవునిఁ జూడఁ గనఁ గైలాసమునకు । జవ మతిశయిల్లఁ జేరి యందునను
భవనమున దుర్గతో విశ్రమించు । నిభచర్మధరుని గనినమాత్రమునఁ
దను భ్రాతృస్నేహమున నంకముఁ గొను । నని యెదురునిల్వ నిర్లక్ష్యంబును
నిరాకరంబును నిరాదరంబును । దరంబు గని నిర్భీతిఁ జలింపని
విరించి తనుసంభవునిపై నలిఁగి । కరంబునను శూలమును ధరించియుఁ
బరమందింతును నను సరకుఁ గొనఁడ । అరయుఁగాక నాశక్తి నని రోష
భరమునఁ గ్రోధముఁ గొన్న దుర్గయును । బరువిడి యురవడి నాప నడ్డమై
తరుణమును మలపె తా నం దుంశక । గిరిజప్రియుని వందనమునఁ బ్రియంపుఁ
బరమైన ఫణితిఁ దాను దప్పించి । సరణిని మెచ్చన నటనుండి విష్ణు
పురముఁ జూడఁ గని చేరి త్వర గాంచి । సరస లక్ష్మి వసియింప శయనించి
యున్నట్టి వాని ధాతజనకునిఁ । వెన్నుని కౌస్తుభ మణిభూషణంబు
గన్నట్టి వక్షమును గుఱిఁ గాంచియుఁ । దన్నెఁ దనపాదమున మునివరుండు
వనమాలి యంతటను బాన్పుడిగ్గి । మునినిఁ గని చరణముల మీఁద వ్రాలి
వినుతిఁ జేయంగ గడఁగి మునివరా ! । యనఘుఁడ వీ విట వచ్చుట నెఱుఁగకఁ
దప్పు నొనర్చితి మన్నింపవలయు । నెప్పు డింతకును నేమరను సువ్వె !

ఎప్పుని నడవడి దీనఁ దెలిసితిని ఽ ఇప్పటి మీశిక్షను నొప్పఁ గొంటి
ఘనుండ వీవీ సింహాసనమున ఽ గినుక విడిచి యుపవిష్టతఁ గననగు
నను ననుగ్రహమునను బూర్ణవలయు ఽ మునులు మీపాదజలము శిరమునను
ననువెలిఁగి ప్రోక్షణం బందగానె ఽ నను నాయుదరము నందున్న సర్వ
భువనములను ధన్యమును బొందించు ఽ సవిధి నికముందు నాకు నాబోటి
భువనపాలకుల కీబుద్ధి దగదు ఽ తవిలె ముద మిందు నాభుజాంతరము
నందు మీచరణ కమలంబు సోకు ఽ సందు నే చిహ్నముగ పొందుఁ గొందు
మందమతి నొంద మహాత్మ! ముందున ఽ నిందుశేఖరుం డాది దేవతల
మందలింతు నిటు బుద్ధిఁగొనుం డని ఽ తొందర లడంగె నిను మ్రొక్కఁ గనుట
వందనంబు లివె వేయిగాఁ గొనుఁడు ఽ ముందు మీ హర్షమును గాంతు నేను
అని మృదుమధురాలాపములను మునిఁ ఽ దన సాత్వికమ్మునను ననునయించి
మునికి మెప్పుందఁ దన సేవ నించె ఽ వనజాలయయును మునినిఁ గని పొగడెఁ
బురుషోత్తము నిటు లరసి మునివరుఁడు ఽ పరమహర్షమున నభినందించుచు
వనజనాభ! నిను పరీక్షింపగను ఽ నొనరు ఘటన గననయ్యె నో దేవ!
మునుల కింక దోఁచెదవు గరిష్ఠత ఽ ఘనులఁ ద్రిమూర్తుల మేటివి నీవే
హరి! మహాపురుష! ఆదిత్యతేజ! ఽ సురమానివినుత! మునిబృందభూష!
దురిత తాపహర! కరుణాబ్ధివరద! ఽ పరమపదసుఖము తవపదశరణము
ననఁ బ్రోవు మనుచు నిను మనమునందు ఽ ఘనమైన వినుతిఁ గని నతి నొనర్తు
మునుల తెలివి నింపునఁ గనఁ గృపచే ఽ ననుసరముఁ బూర్ణ నే నయమ్ము గనెద
నని యనుజ్ఞఁగొని యానందవేగ ఽ మును దన నడకయు నేకము గాఁగనె
మును సరస్వతీ తీరము వసింప ఽ ననుపొందియున్న తలమునకుఁ జేరి
వినిపించె వారి తనచర్యలన్ని ఽ ఘను లతని మెచ్చి వనజాక్షు నతుల
నతులిత మహిమోజ్జ్వలమగు వినయము ఽ స్తుతిపరాయణము నగు నతనిచర్య
లతి భక్తి నిగుడఁ గీర్తనల నంది ఽ మతుల నిర్మలతఁ గన నెలవుఁ గనిరి
యతిజనవినుతుఁడె సత్యస్వరూపి ఽ యతఁ డాదిమూలుడగు పరమాత్ముఁడు
అతనిఁ బూజింపవలయు మనమనుచు ఽ స్థితినిఁ గొనిరి తమతరమైనఁ జనుల
సతతము నీవును స్మరింపు మిటు హరి ఽ ఇతరదైవముల వరిష్ఠమును గనె
విని శ్రీకృష్ణుని మహిమ యరకొకటి ఽ మనమున నద్భుత మందమించునది

—: శ్రీకృష్ణుండు మృతులయిన విప్రసుతులఁ దెచ్చుట :—

మానుఁ జేసినట్టి దుష్కృతముఁ జార ఽ జనవరా! సౌఖ్యమంద నగు దీన
వనజాయతాక్షుఁ డైన వసుదేవు ఽ తనయుఁడు మురాంతకుఁడుఁ గృష్ణుఁ డొక్క-

దినమునఁ గుశస్థలీపురమునందుఁ § దనమందిరమున సుఖముగా నుండఁ
దన మందిరద్వారమున నేడ్చుచును § దనభార్య యపుడె కన్నట్టిపుత్రు
తనువున మనువును బాసియున్నట్టి § పినవానిఁ బెట్టి గోడుఁ గొని విధిని
పరిపరి విధముల నను నీచింతను § బరపితే యనుచు దూఱుచుఁ గర్మను
నిరసనంబుగా దూషించు కొనుచుఁ § గరముఁ దనుదానఁ దిట్టుకొనుచును
గనులనీరు ప్రవహింప శోకమున § జనులుఁ గనఁగ వాపోవుచు నిటులనె
వినుఁడు నాదుఃఖ గతిఁ గొంత నరయుఁ § గనుఁడు కాలధర్మము లిందులోనఁ
గనవగు బుడుతఁడు పుట్టినప్పుడే § గనె మృత్యుదుఃఖము హారిదయ గనెదను
అని జేరితి నిట వినిపింతు మీకు § జనపతు లన్యాయమున వర్తిల్ల
జనుల కిట్టి దుఃఖములు ప్రాప్తిల్లు § ఘనులు ధర్మముల వర్తనలను గన
జనుల కిట్టి దుఃఖములు దూరంబు § కనుఁ డయ్యలార ! కృష్ణుపాలనము
ఘనులు గొనియాడుచుండ నిట్టి దశ § కును గురిఁ గంటిని ధర్మజురాజ్యము
నను నధర్మలగు బ్రాహ్మణద్వేషులుఁ § గన శాస్త్రవిముఖపాపవర్తనులు
గలరే మీ నన్నుఁ గనరాఁడు కృష్ణుఁ § డలరుఁ జెందునొకో ! నాదుఃఖమునకు
నిల నతఁ డుపేక్షఁ గనఁ దిలకింపఁగ § నలరు నించు ధీరుండు పెఱ గలఁడె
విషయప్రమత్తులు నగు నృపులదాపు § విషమని దొలఁగక నిలిచిన సాధుల
విషమించునట్టి దుఃఖపరంపర § విషయమును దెలిపినాడ నే ననుచుఁ
దన యింటికేగి మఱిమఱియుఁ గనిన § తనసుతులఁ దెచ్చి ప్రతివత్సరంబుఁ
గను రోదనంబుఁ గాథలను కొన్ని § వినిపించు జనులు వాపోవ నలఁతఁ
దను గదియు వఱకు విన రాతని మొర § విని వినని యట్లు కృష్ణుం డుండెను
కనె నర్జునుండు తొమ్మిదవసుతుని § మునుఁ దెచ్చినట్టి శ్రీహరివాకిటఁ
బెట్టి యేడువఁగ విధినిఁ దిట్టంగ § రట్టు గన కర్మమును దూషించఁగ
పట్టున రాజుల పాలనంబులను § బిట్టు నిండంగఁ దల యూచి యౌర !
ఇట్టు భూసురుఁడు మా యేలుఁబడినఁ § బెట్టు దుఃఖమునఁ గూరుటినాడు
కంటి ననుచు నాబ్రాహ్మణు చెంతకు § నంటి నడచి యో భూసురవర్యా !
కంట నీరిడకు మయ్య ! నావంటి § దంటయైన విలుకాఁ డొక్కండే
పురమున నుండిన మృత్యువు నడుగిడునె ? § పరువుఁ గొనదెట్టు నాపరువు వినుమ
ధరణిపతులు నీవన్నటు ధర్మము § లరయుడేని యా నరపతి నటుఁడగు
నరపాలబిరుదు వానికిఁ జెల్లదు § వరుసఁ గంటి నే నృపవంశవరుఁడ
నరుఁడ నాపేరు ధర్మజతమ్ముఁడ § కరినగరవాసి నగుదు కృష్ణుండు
పరమ బంధుండు నాకును గురుండు § వర సచివుండును బరమసారథియు

నగుట గనవచ్చి యుంటి నినుఁ గంటి ॥ జగతీసుర నీవగ మాను మింక
తగవొప్ప నీదు తనయుఁ బ్రదికింతు ॥ దిగులు విడు మనఁగ ద్విజుఁడు నగవుఁ గని
యేటి మాట లవి పోటుమానిసివి ॥ నీటు నీకుఁ దగు వాట మిదె పొగడు
పాటిజంటలగు నేటి కాఁడవవు ॥ గీటుఁ దప్ప నటు దీటుఁగొన విచట
రాముఁడు మేటిబలుండు హరి శౌర్య ॥ ధాముఁడు వీరులు ప్రద్యుమ్నాదులు
భీమపరాక్రము లతని నందనులు ॥ సామాన్యులుగా నెంచి తూలెదవు
వారు విన సిగ్గు నొరున్న దనుచు ॥ జార నాడంగ నూఱటఁ గల్గను
కూరి మింతె చాలన్న ! దారిఁగను ॥ పేరుపెట్టి నిను బిలువను గాదా
వారిజాక్షునకె కరుణ వొడమవలె ॥ తీరు దొలఁగు నాదుఃఖ మంతటను
మీఱ నెఱుంగవు వారిమహత్త్వము ॥ క్రూరమగు సుమ్ము వారి నిరసనము
వాపోవవయ్యా ! నావలెనె నీవు ॥ నీపటు విందునఁ గొల్లయగు నయ్యా !
నీపని నటింపుఁ ద్రోవఁగ వయ్యా ! ॥ నీపుణ్యబుద్ధికిని మ్రొక్కులయ్యా !
కోపమందకుమ ! నే నంటి ననుచుఁ ॥ బ్రాపు దుఃఖమున మాటలాడితిని
చూపున దయఁ గని పల్కరించితివి ॥ యే పదియె చాలుఁ జూపకు బీరముఁ
నన విని పార్థుం డొకింత కినుకను ॥ గని ధర్మరతుఁడుఁ దా నగుట మలఁచి
వినుమటు భూసుర ! నేఁ జాలనేని ॥ యనలము శరణ్య మిదె ప్రతిజ్ఞ యనిన
ఘనుఁడు భూసురుఁడు తా నులుకఁ గనుచు ॥ వినుమలుకు నించు నృప ! నీపలుకులు
ఘనతఁ గలవైనఁ బ్రాపు హరితోడు ॥ గనుము ననుచింతఁ దొలగింపఁ జాలి
యుందు రన నలుక మరికొంత నిగ్గు ॥ చందమునఁ బలికె ధరణి దివిజునితో
బలుఁడ నే గాను హరియు నట్ల యగు ॥ నల ప్రద్యుమ్నాదుల దలఁపుమట్ల
చిలకింప వొక్క ! పాండునందనుఁడ ॥ విలసిత ధర్మని ధర్మజు తమ్ముఁడ
బలిమిని హరునిఁ బాహుస్ఫురణము ॥ కలిమి నలరించి పాశుపతమ్మను
గొనినాడ నింద్రు గెలిచినాడ సుమ ॥ విను మృత్యువునుఁ గెంటి నీ సుతుని
ఘనత వెలయ నీకిత్తుఁ దప్పనన ॥ విని బ్రాహ్మణుండు మరి బుట్టనున్న
తనయు నటు బ్రతుక జూతువు లెమ్మని ॥ మనమున మోదము నంది దీవించి
తనగృహము జేరి సమయంబురాకఁ ॥ గన నుండె నతని ఫల్గునుండునుఁ
తనపూన్కి దప్పకను గూర్చుండె ॥ వనజాక్షుఁ డెఱిఁగి యతని నగ్గించెఁ
గన సమయమయ్యె భూసురభామిని ॥ వినఁ జేయవచ్చె బ్రాహ్మణుండు నా
వనజాక్షుఁడు వినఁ జెప్పెఁ బార్థునకు ॥ వనజనాభుండు లోలోన ముదము
తనుఁజేర నర్జునిని నేమరడో ॥ ఘనవీరుం డటు భూసురు నింటికిఁ
బోవ నూహించి పావనంపుమతి ॥ దావలంచి జలముల నాచమించి

దేవుని మాధవు మ్రొక్కి సెల్లించి । యా విధమున తన యస్త్రశస్త్రముల
సంఘము తనకుఁగా మంత్రాధిదివ్య । లభయుంబుప్రాపు నందింప వినుతిఁ
బ్రాభవముఁ బెంపుఁ గనరాజి గనుచు । నభమున వెలుంగు తరణి తేజంబు
తనయం దొప్పగ గాండీవంబును । దనకేల నంది తూణీరయుగము
ననువొంద భుజములను గదియించియు । మునుకొని భూసురు వెంట పురుటింటి
దరిని నిలిచి తన నేరిమి పెంపున । సురగణ మబ్బురమును జెంద తనదు
శరకౌశలంబు సూతికాగృహము । పరివేషమంద నందు మంత్రికి
జొరరానియట్లు బాణపంజరము । ధరణీసురుండు హర్షమున మెలఁగు
వరుస తా ధీరతను వాటించియు । నిరవంది యుండె పెచ్చరికఁ బూని
జనతతు లబ్బుర మంద భూ గగన । మును నీరంధ్రముగా గాచియున్న
వినవయ్యె క్షితీసురు వనిత గనియె । దనయుని నచ్చటి జనము గొనియాడ
వినుటతోడనే పోయెఁ బోయెనని । జనతతి తత్క్షణమునసె బల్కినఁ
జనవర ! కిరీటియును సిగ్గు నంద । ఘనుఁ డా భూసురుఁ డట్టె గొణఁగగా
మును రీతిగాక తనువు తోడనే । మినున కెగసె నన మఱి వగచి కృష్ణు
గన నుఱికి హరినిఁ గాంచి యిటు లనియె । వినుము వనజనయన ! మాధవ ! నృహరీ !
సురపోషణ ! మునిలోకవందితా ! । కరముఁ జెడు పందె నీ తడవున వడి
నరుఁడట వీరుండట పొగరుబోతు । కరము విముదూరి నను మోసగించె
వరుసగాంచి నే నందు నమ్మఁగాఁ । బురముజేరె నా పుత్త్రుఁడు దేహము
తోడనె మాయము పౌరుషహీనుం । డాడినట్టి వచనములు వమ్మయ్యె
వాఁ డేటిశూరుఁ ? డేటి వీర్యంబు ? । బీడుగనె వాని పోడిమి ప్రజ్ఞయు
నేడైన నీదు కృప వడయుదు నను । 'పాడిగోరు నాయాసయు బెడిసెను
దేవ ! జగద్రక్షకుఁడవు నీవే । యీవిధిఁబోవగ నేలా యోచన
తా వంద నపేక్షించుట గాంచియు । పావనాత్మ ! వినుతుఁడవు పరమేశ్వ
రుడవు నగుట సర్వమును దెలియుటను । బుడమిభరణ ! నిను గని యేగుచుందు
వడిఁ గన్నశూరు లందరు నీవా । రడుగిడ రిందున నీయాజ్ఞఁ గొనక
గన నిన్ను విడిచి మానవమాత్రుని । నను దుఃఖము తొలగించు నని నమ్మ
జనుల హీనమతి నైతి జనార్దన ! । విను మేటివిల్లు ఏటిబాణములు !
అని తన్ను నిందఁ జేయు భూసురునిఁ । గని తను జిడిముడిఁ గదియ నోర్పుఁ గని
తన యోగవిద్యా మహిమాన్వితుఁడై । గనె శోభనంబు దిక్పాలపురము
లగు నింద్రాగ్నుల యమ నైఋతు లవి । జగిమించు వరుణ పవన ధనదీశు
లగుదురు వానికి నధిపులు వారలఁ । దగవొంద నడిగి కానక మరియును

నర సుర యక్ష నిశాచర కిన్నర ఽ వరుల సిద్ధ సాధ్యుల ఖేచర కిం
పురుష నాగ గుహ్యకుల పిశాచుల ఽ గరుడ గంధర్వ విద్యాధరాది
లోకములెల్లను ధీరతను గాంచి ఽ యేకరణిని గనలేక మరలి తన
నీక ఫలింపమి భూసురుని దెలిపి ఽ నీకు నిరాశనుఁ గూర్ప బ్రాహ్మణా !
నాకుఁ దప్పఁబో ననలముఖంబున ఽ దోఁకొని వచ్చెద నీసుతుల నమ్మ
సోకుఁ గాంచి పరబ్రహ్మమున ఽ వెదకి నీకు ముదమిత్తుఁ దడవు నిమ్మనుచు
వినయమున నచ్చుఁజెప్పి రిచ్చగని ఽ తను భూసురుండు గనఁ దక్కువారు
వనజనేత్రునకు శరణుల వచింపఁ ఽ దనవడిని పార్థునిఁ దాయవచ్చి
మనము. ధృతిఁనూన బలికె నీతోడు ఽ గొని వత్తురమ్మ భూసురతనయుల
మునికిఁ దెలిసితిని యిపుడె యర్జునా ! ఽ యనుచు నతని యత్నమ్మును మరలించి
తనరథము రాక గని తానర్జును ఽ మునుకొనుచు నెక్కి గదలి రచ్చోటు
నర నారాయణమ్మును లిట్టుఁ బొడమి ఽ ధరణిఁ జరింతురు వీరి కసాధ్యము
నరయఁ గలుగ దని ధరణిసురునకును ఽ బరమశుభమ్మును గూరునని ధీర
తనముఁ జేకూర్చి వారి విజయంబు ఽ గననుండి రచటఁ బురవాసు లంత
వనజనయనుండు వర నగరగ్రామ ఽ వననాటి గోష్ఠ నదీనదంబుల
సరణి సరోవర గిరుల వారిధుల ఽ తరమందు ద్వీపముల నేటివరుస
నరయుచును దాటి కులగిరుల మీరి ఽ వరుసను లోకాలోక పర్వతా
గ్రమునుం గడచియుఁ దరణికిరణముల ఽ గ్రమదీప్తి మాయు తలమును దాయఁగ
సమమందె నచట చీకటి రథపుగుఱ్ఱములాగె ముందు నడుగిడ నోపక
సుదర్శనంబను శస్త్రరాజమున ఽ నిదర్శనంబుగఁ దమంబుఁ బాపిన
ముదంబుగా రథవాజులు వేగముఁ ఽ గదించి పోవఁగ ముందుఁ గనరాని
దివిజ తేజంబు చక్రిముదీప్తిని ఽ గవిసె నేకముగ నరుఁడు భయమునను
గవఁగన్న కన్నులను మూయు శౌరి ఽ దివు లందకు మని నవ్వుఁ బల్కంగ
నవ్వుఁ బోవంగ క్షీరవారాశి ఽ భవము ధన్యముగఁ బవనోత్కటమున
నలలభీమణము భువుల వినువారి ఽ కెలఁకుఁ దోఁపింప నందున దూరుచు
నలరు తమ్మంద దానిమధ్యమున ఽ వెలయు కోట్యర్క తేజమున మించు
మనోహరంబగు మణిఖచితంబులఁ ఽ గనంగ వేయగు స్తంభముల రేఖ
లనూన ఘంటెండు రత్నమాలికల ఽ వినంగ నభము భానుశశిదీప్తి
యతిశయమందని యతిశయం బచట ఽ నతి విరాజితం బనంత వీర్యము
గతిఁగనఁ బునరావృత్తి రహితంబు ఽ సతతమైశ్వర్య విభవసమగ్రము
నతి యున్నతంబు నవ్యయంబును ఽ గతిభక్తాళికి నయి పరమభాగ

వతుల నివాసంబయి యున్నయట్టి § స్తుతికి మించనగు దివ్యధామమున
శరచ్చంద్రచంద్రికల కర్పూర § వర నీహారమరాళ ముక్త్యముల
సరణి మీఱు ధావళ్యత నుపమరఁ § గరము నిందిందిరేందీవరేంద్ర!
నీలకాంతిఁ జెలువొందు కంఠముల § వేలఁ గన నరుణ బింబపు ఛాయనుఁ
బోలు పద్మరాగమణిరాజిభ్రా § జిల్లు చూపు లలరారు వేయునగు
చాలు శిరము లొప్పంగ వివృతముగుఁ § జాల భయద విషధూమరేఖలను
లీల జాల పొడవైన నాలుకలు § వెలయు వేడిచూపు లవి సాయం స
మయ జలజ్వాలన కుండంబులునై § భయదము లయ్యెను తేటిచూడఁగఁ
నయమున మఱియును శ్వేతగిరి యన నై § నయు వానిభోగతల్పంబునందు
సుఖముండుఁ గూరుచున్నట్టివాని § నిఖిల లోకేశు దరహాసితంబే
ముఖమునం దొప్పు నొప్పుఁ గనువాని § నఖిలభూతమయు నజుని తొలిమూర్తి
నీలాంబుదంబు వర్ణంబు తనువు § చాలఁగ మనంబు నాశ్రితాలయముఁ
బోలు గమనంబు సనకాదిమునుల § పాలి హృదయాబ్జముల భృంగ కలిమి
తన వదనపద్మకాంతి పూర్ణశశిఁ § గనన్నైన కళను మించునట్టి దగు
ఘనత భువనహిత చరిత గుదురొప్పు § కనులు సంఫుల్ల సరసిజము లగును
ననువుగ లక్ష్మీహృదయాంబుజమున § కినునిఁగా దోఁపునట్టి దేవునిఁ
కనక కౌశేయవాసుని నచ్యుతు § మునివినుతు మకుట కేయూరహార
ముల కరకంకణ నూపురకాంచన § మలమణివిరాజితపు మొలనూలును
కలిగి మతి కుండలముల నూపురము § లలరు నింప ధరియించి భక్తగణ
ములఁ బోషించఁగ వృత్తిఁగలవానిఁ § దలఁపున మహదైశ్వర మొసఁగువాని
సునందాది పరిజనసేవితునిఁ § మునీంద్రవర్ణితు ముఖ్యమూలగుని
గనంగ నికరానంద విలసితుని § వినంగ ముక్తినిఁ జేకూర్చు వాని
నారద గీతాగానమోదితునిఁ § దారాధిపు తోఁబుట్టువు రమణుని
క్షీరార్ణవ మధ్యంపు మందిరుని § నారాయణ చతురక్షరమూర్తిని
భవ విలయాతీతుని శుభంకరుని § భువనోద్ధారకునిఁ బురుషోత్తము
దివిజనేతనేత్రుని శ్రీవిష్ణుని § రవిశశినేత్రుని లావణ్యాంగుని
నవికారు నజితు నవ్యయు నక్షరు § నవిచారు నిత్యుఁ బ్రవిమలచిత్తుని
నిరాకారునిఁ జగద్వినుతునిఁ § నిరాలంబునిఁ జిద చి దీశ్వరుని
కరంబు లెనిమిది గల దివ్యమూర్తి § వర శంఖ చక్ర చాపపద్మముల
శరగదాఖడ్గ పాశధారియును § స్థిరతర కౌస్తుభ మణిధాము శ్రీను
శ్రీవత్సవక్షు శ్రీసంధాయకుఁ § గేవలు నిగమారాధ్యు యజ్ఞభుజు

భావిభూత వర్తమానవిలసితు ఽ దేవదేవు కేశవుని భక్తిన్
భావమునందున సకలంకభక్తి ఽ తవులుకొన వారు తమ కరకమలము
లను జోడుఁగూర్చి పావనా! సర్వ ఽ మునిశర్వవినుత! భూరిదయాళో!
కొను సతులనగన్ వారిదరిబిలిచి ఽ కొని కౌగలించి దరహాసపూర
తోరముగా సాదరమున నిటులనె ఽ మీరలు నరనారాయణు లనఁగా
ధారుణి ధర్మము నిలుపఁ దపంబును ఽ గూడి ధీరులై భూమిభారగుల
బోరిబోరి వధింపఁ బుట్టితిరి వసుధఁ ఽ నరయ నాయంశ మీ యందొప్పెను
పరమహంసులిట మిముఁ జూడఁగోరి ఽ కర మాతురమున నను మనివిఁ జేయ
మీరిందు రాకఁ గను కారణమున ఽ ధారుణీసురుని సుతులఁ దేవలసె
మీరింకఁ గొంతఁ జరింపవలె నట ఽ వారిదే గొనుడు భూసురున కిండు
అని సెల వొసఁగిన వారు బ్రాహ్మణుని ఽ తనయులఁ గొనుచును వందలి సర్వాల
కనులవిందు నొనరించి యర్యాద ఽ ఘనునకు మ్రొక్కుచు మరలి కుశస్థలి
కినిఁ ద్రోవఁ గనుచు బహువేగంబున ఽ గనిరి తమ నెలవు భూసురుని బిలిచి
తనయు లదే యనుచు నప్పగించి రా ఽ జనులు కృష్ణార్జునులు యోగపురుషు
లని వినుతించిరి క్షితిదేవుఁ డల్లి ఽ కని పొగడి వారి నర్జునుండున్
దన గురుని కృష్ణు చర్యల నుతించె ఽ విను మర్జునుండు మ్రొక్కిన గీతము
వారిజాక్ష! మునిభక్తమందార! ఽ సారధర్మగుణ! శౌర్యఘనవీర్య!
నారదవందిత! నారాయణ! సువి ఽ చారపరాయణ! కుత్సితవిదార!
నేరమి గొనకుము నేర్వమ ఽ కూరిమి పెంపున గూర్తు నీస్మరణ
మీర మేరఁ గననిమ్ము భవాబ్ధిని ఽ దారనీకు నే నిదె శరణంటిని
యని వినుతిఁజేసె నాయచ్యుతుండు ఽ మనమున మెచ్చెను మరియాద నింపె
వినుమా! కృష్ణుండిటు ద్వారకలో ఽ వనధిమధ్యమున నాపురి విలసిల
మునుల ధర్మములఁ బోషించె నందుఁ ఽ గనఁగ నరిభయదుఁ డాఢ్యుఁడు వరదుఁడు
తనదానఁ గూర్చి పె క్కధ్వరముల ఽ ఘనత నొనరించి ఫలము సురల కిడి
జనులఁ బాలించెఁ గలిమి పెంపునను ఽ బలిమిని దనరె శ్రీ రమావరుఁడు
విను మిక కృష్ణుని వంశవిస్తరము ఽ మనమున కద్భుత మగు మానమందు
ఘనుఁడు వసుదేవ నందనుఁ డిట్టుల ఽ మునుల దీవెనల జనులఁ బాలించి
తనకాంతల నెనమండ్రు పదునారు ఽ వను వేల రాజకన్యలను గూడి
దినదినము ముదము నిక్క దేవేంద్రు ఽ ననువున ధరణినిఁ దా విభవ మంది
కనకమణిమయ విమానమండపము ఽ లను గోపురములఁ బ్రాసాద సౌధ
ములను జంద్రశాలాంగణము లాది ఽ విలసితభవనము లందునను మఱియు

కల మదేభముల మదమున దడిసియు ✽ నల చతురంగ బలాదిసంచరిత
సంకులితమైన ద్వారకాపురినిఁ ✽ బొంకమందు పూఁదోట లందునఁ
బింకమంది తేనియలఁ గ్రోలుటల ✽ వంకఁ గనెడు తుమ్మెదలు కోయిలలు
మున్నగు పక్షుల ధ్వనుల నలరఁ గని ✽ వన్నెమించు లావణ్యము వయసును
మిన్నగా నొప్పు భవనములమీఁద ✽ నున్నత విశాలమును గని కందుక
ముల నాటలాఁడు సుందరులతోడ ✽ నలరుచు వారల పదారువేలకుఁ
దిలకింప నొకఁడె తా భర్త యగుచుఁ ✽ గలఁతఁ బడకుండ నన్నిరూపములఁ
దనపైన వలపు వారలకుఁ బెంచి ✽ నను బాయఁ డెపుడు అని సంతసింపఁ
గన మనోహరపుఁ గొలకులయందున ✽ మనము మెచ్చఁ దగు నదీనదంబుల
లలిత తనుకాంతి కులుకు లలనలను ✽ వలచి వలపించి జలకేళిసలుపు
దలఁపునను మించి గాయకబృందము ✽ చెలఁగున నుతింపఁ గనుచుఁ జేరియును
య చ్చపలాక్షులు నచ్చిన మనములఁ ✽ గ్రుచ్చి కౌగిళ్ల తమ వక్షంబుల
నచ్చందినట్టి కుంకుమాదులను ✽ పచ్చిగను పంకిలముల నంటించఁగ
మెచ్చిన నవ్వుచు వారల తనువుల ✽ మచ్చికఁ బెంపున నిర్మలజలమ్ము
ముంపుఁగొనఁ జల్ల వా రట్లుసేయ ✽ నింపునఁ గొంచును నాట లిట్లాడ
చంపకగంధులు వలువలు నంగము ✽ సొంపు వెలి గనఁగఁ దొలఁగఁ గొప్పులును
బెదరి పుష్పములు రాల నుడివడగ ✽ మదనుని బాణముల మలపఁ గృష్ణు
నెదలుపోక నొకపేరున గాగిలి ✽ నుదుము కొనుచు మురిపెంబును గొనుచును
కరేణుగమియును గరీంద్రువిధమున ✽ సరోవరములను మొదలుకొని వారి
పరంబుగల తలముల నిట్లు చెలగు ✽ తరంబు గని పసదనంబు లిచ్చుచు
వారిజాక్షు లానంద నందనుని ✽ శేరి మూరు నిశితంపు శరములను
ధీరతఁ గానని విధమున భ్రమలను ✽ బేరుకొందు రీ హరిగూర్చి చిత్త
మారసి తాపముఁ బాయ భ్రమ వాయఁ ✽ నా రమణుని కైదండఁ గోరుచును
కీరమ! కృష్ణుఁడు మామనంబులను ✽ వరుసను దొంగిలె మే మందువలన
రాతిరి నిద్దుర మాని విలపింప ✽ నాతీరు నీకుఁ గూరె గాఁబోలు
పాయగంటి నను నొక కోమలాంగి ✽ నాతి యొకతి యొకచక్రవాకి నెప
మూని ప్రియుని రే గాన కట్లయితె ✽ యానతినియను చరణమాలికను
మానితంబనుచు మఱి కొప్పులందుఁ ✽ బూని ధరింపఁగ మేమటు లగుదుమొ
రో మున్నీరా! నీయుద్భవకమ ✽ లము మంజులంపు మూర్తి గొనె ననుచు
నీమెయి రోదసి నింపుదే ధ్వనుల ✽ మామెయినిన నీవు బోలితి విందు
రో చందమామ! నీవు క్షయంబును ✽ నోచి బహుళమున హీనతఁ గుదిరిన

నాచాతుర్యము చీకటినిఁ బూర్తి ఽ దాచుకొనుశక్తి బూనిక నెఱుఁగవు
గాన మీహృదయ తమమునఁ ఽ బాపని నే నటింపు మను చింతఁ జేకూర్చె
దాని దానవాంతకుఁడె తనకృపను ఽ మాన మందించి నను దప్పను గద
మలయ పవనుఁడవు మరుబారి మన్మ్ర ఽ లలనలఁ దోపుట కృష్ణు నపాంగము
వలనొంది నలుకుఁ గూర్తువ్ర తగునా ? ఽ తలఁగు ముపకారమును మే మెరుగము
నీలవేణులము మావలెనె నీవు ఽ నా లలితాకారుని శ్రీవత్సము
చాలుఁ గన్నట్టి హరిని సేవించఁ ఽ జాలిగొని బాష్పవారి వెలసితివో
చాలు నీవతని మూర్తితోఁ గలిసి ఽ మేలుఁ దలఁచి తా దేవుఁడు గనఁడా
పికమ ! మాకృష్ణు గానమొనర్తువో ఽ వికటంబే కద నీ చింతలన్ని
అకట మాగీతముల నటుఁ గూర్పుము ఽ అకలంకుఁ డతఁడు విని మను నేలుము
ఓ గిరిరాజమ ! నీవు నిశ్చలత ఽ బా గొంది యేమి విశేష మరయుఁదు
ఆ గుణవరిష్ఠుతను గోరుచుండు ఽ మా గురుకుచములు శ్రీశుపాదముల
కొనలు శిఖరములఁ జాలున నొప్పుచుఁ ఽ దనరు ముదము మా కటు లబ్బిన
ఘనమైనమహిమ నొప్పారు నేరు ఽ లను వనితలార ! మీప్రియునిఁ గదియ
ననుట కా ఘనుని గృపావృష్టియును ఽ గనక మీలోచనములు కళలోప
మును గన్నయట్లు మదువులను గముల ఽ మినుకులట్లుగా మేమట్లు కనుల
దనరి యానీలవర్ణు దయావృ ఽ ష్టిని గూరియున్న వారము నిజంబు
ఓ మంజుహంస ! మముఁ బాలుఁ గొనుచు ఽ నీమంజుల వచనములు మమ్మతనిఁ
గామించఁ జెప్ప దూతవయ్యెదవో ! ఽ స్వామికే చెప్ప మేము సిద్ధమని
శ్రీమహిళాసతి యొక్కటియె స్థిరము ఽ మే మటుగాకను చపలు లనుకొనెను
మామన సెప్పడు మన్ననల మీరు ఽ ఆ మహిమాన్వితు మరువ మెప్పటికి
నని వలుఁదెఱఁగులఁ గామిను లీశునిఁ ఽ గనికర మందఁగ వినుతి చిత్తమును
గొన్ని రాయింతుల నలరించు హరియు ఽ వనజనయన లవ్వారు మున్నేమి
ఘనతపము సల్పి యున్నవారలో ఽ ఘనుని జగదీశు భర్తగాఁ గనుచు
తమకేఁ గాదు భువనముల భర్తయని ఽ నమస్కృతుల గృష్ణునికేఁ గూర్తురా
వెలఁదులనుఁ గూడ యట్టె భవన మల ఽ నలరు వనములను నదుల తీరముల
విలసిలు శీతలతరుల ఛాయలను ఽ నెలమిని శశికాంతపు వేదులందు
కొలఁకుల తీరములను గిరితటముల ఽ లలితరుణవాలు కానేక పులిన
తలములనుఁ మఱి గప్పురంపు ది ఽ ప్పలను గురుచప్పరముల నెమ్మదిని
కలిగించునట్టి యితర తలంబుల ఽ నలరుజోడులను నన్నిరూపముల
లలిత సౌదామినీలతల చాలందు ఽ నలినీల మేఘమును విడంబించు

చును కేళిభేదములఁ బెక్కుగూర్చి ✽ వనితల మోదము నించి భవనముల
ననుకూల మంది వేణువీణాదు ✽ లను సొంపు మించు గానముల గూరి
కవి గాయక మాగధ సూత వంది ✽ కవులస్తుతితోఁ గుతుకంబుఁ గనుచు
నటనటీజనుల నాట్యంబులనుఁ ✽ అటుల విదూషక పరిహాసోక్తుల
జటిలవినుతుఁ డా జలజాతనయనుఁ ✽ డట వారిసరస సల్లాపములను
మనసు రంజిల్లఁ బొద్దుం బుచ్చుచు ✽ ఘనుఁ డానందమునను నెపుడు వెలయు
వనిత లా దేవు దయారసాబ్ధిని ✽ మునిఁగి దరి గండ్రు కోర్కు లనువులను
శ్రీదేవుని నొకగీతమాత్రమునె ✽ యాదరంబుఁ గొనియున్న మాత్రమున
మోదంబు గుదురు కొన వారు దమ్ము ✽ వేదనల గనకఁ బ్రీతి నెగడెదరు
కనుల దర్శించి తనువు లేకముగ ✽ మనము లట్టులునుఁ గౌగిలుల గనుచు
నొనరున ముద్దులఁ గొనుచు నంటుచును ✽ బెనుపంది దయలఁ బ్రణయఁపు గినుకల
నగవులచర్యల సేవ లందించు ✽ తగవుల విమర్శనముల సిగ్గులను
జగదవనుఁ బవలు రేలును విడువకఁ ✽ దగుల మందియుండుటలు దలఁపులునుఁ
బలుకులునుఁ జెయువు లన్ని నిలుకడల ✽ నలినసంభవా ద్యఖిల హేతువులు
గొలుచు టానంద వనధిఁ దేలుటఁ ✽ దలఁప నగుగాద యాతని చెలియలి
తనయు తనయు జనపాల వనమాలి ✽ ఘనలీలాసరణం బటు రాగా
తనకాంత లందరకు వరుసఁ దప్ప ✽ కను విదర్భసుత యాదిగా పదారు
వేల కామినుల నొకరి కొక్కరికిఁ ✽ జాలున పదుండ్రు బలశౌర్యములను
ప్రోలందు వారు వారల సంతతి ✽ ఓలి దప్పకను బలుకు నమితంబు
విను మందు ముఖ్యులను బదునెనిమిది ✽ ఘనుల నామములఁ దెలిపెదను వినుము
మును బెద్దకొడుకు రుక్మిణితనయుఁడు ✽ మునుపటి మదనుఁడె శంబకాంతకుఁడు
వినుతింప సుందరుఁడు మహాత్మ్యమున ✽ దనుఁ దలంచినను ముక్తి నిడు నతఁడు
జనవర ! ప్రద్యుమ్నుఁడు వరుస నటుల ✽ అనిరుద్ధుండును దీప్తిమంతుండు
భాను సాంబమిత్రులు బృహద్భాను ✽ లును మిత్రవిందుఁడును వృక లరుణులు
ఘనులు పుష్కరుడు దేవబాహుండు ✽ వినుమటె శ్రుతదేవుండును నందుఁడు
కనఁగఁ జిత్రభానుఁడు వరూథుండు ✽ జనవినుతి నెగడు కవి న్యగ్రోధులు
వీరు ప్రసిద్ధులు నాదురు మఱియును ✽ వారిజాక్షునకుఁ ద్రివక్ర యందున
చారుగుణుఁ డుపశ్లోకుఁ డనువాఁడు ✽ నారదశిష్యుఁడు హరిపాదసేవ
మేర గనినట్టి ధీర వినుతుండు ✽ నారులు శూద్రులు హరిఁ గనెడు తెరువు
లారసి వైష్ణవస్మృతినిఁ గల్పించె ✽ సారసనాభుఁడు ప్రీతి వెలయంగ
విను వీరందరు కృష్ణుని తనయులు ✽ కన నధికబలము నాయువు జ్ఞానము

గనువారి లోపములు నెందుఁ గనరు ఽ ఘనతలు వచింప నేండ్లును నోపవు
వారలకు విద్య నేర్పించు గురులు ఽ చేరుదురు మూఁడుకోటుల నెనుబది
జేరు వేలు నెనిమిది మరి నూరగు ఽ వారిసంఖ్య గణియింప శక్యమెటు
నరనాథ! వారు మరియు నీధరణి ఽ పరమబలశాలురగు ఖలనృపతులు
మును సురాసురుల సంగ్రామమందు ఽ ఘనమైన వీరతను మృతి గాంచిన
దనుజామరాంశముల క్షితిఁ బుట్టక ఽ గనిన వారె యని దలఁపు ద్వాపరము
నను జనుల బాధలను మాన్పఁ దాను ఽ జననమందె యదుకులమున మునులను
మనుప ధర్మమును నిలుప మూర్తిత్వ ఽ మును గాంచె నట్లు పురుషోత్తముండు
వినుము ప్రద్యుమ్నుఁడా రుక్మితనయ ఽ తన వనితగాఁగ ననిరుద్ధుని గనె
నతఁడు మాసలావశిష్టుఁడగు వ ఽ జ్రుని గాంచెఁ బుత్రి వరశోభన గుణు
నతనిఁ గ్రమంబున ఘనులు వరుసఁగను ఽ జనవర! పుట్టిరి ప్రతిబాహుండును
నతనికి సుబాహు డటు నుగ్రసేను ఽ డతఁడు శ్రుతసేను గని యిట్లు శ్రీను
మనుమలాది వంశంబు నేటికిని ఽ దనరు నదియె నేఁ జెప్పితిని రాజ!
యదువంశంబు నూట నొకటియగు ఽ చదురుగన్న యా వంశపు వారలు
బెదురులేని బలవీర్యసమగ్రత ఽ గదిసి సవనములఁ జెక్కు లొనరించి
వసుధ నుతిఁ గనిరి యదువృష్టు లనఁగ ఽ పసఁదుగను భోజు లంధకు లనఁగా
బిసరుహ నయనుని సంతతి యిటు లగు ఽ నసమానపదం బబ్బు నిది వినుట
హరి మురళీగానమును మనోహర ఽ పరమమృదువాక్యముల నర్మసరణి
తరుణ మెఱఁగి తరుణులు సేవించిరి ఽ పరమమోదమున ఋషిజాలము వలె
వనమున యమునాతీరమునందున ఽ మును గోపకామినులు హరి దరిని
గనిన వరుసలను మనమునఁ దలంచు ఽ వెనుకొన వెట్టుల దురితసంతతులు
జననాథ! మునులు నగు వార లతని ఽ ఘనము నెఱఁగి ధ్యానముల మునుకొన ద
రల ముక్తి నెలవు స్థిరము వాసమగు ఽ ఖలజనాపహారుఁ డల బ్రహ్మదుల
విలసితారూఢ నుతుల నలరుఁగను ఽ నలినోదరుని నారాయణుని
క్షితిభారహరణు శ్రీశు చక్రధరుఁ ఽ బతిత పావనుని బుధహృదయవాసు
నతవదను లగుచు మ్రొక్కుట శ్రేయముకలతుకు నిహమునను బ్రతుకులు ధన్యము
తులతూఁగ నిక్క హరిచరితసుధను ఽ వలఁచి శ్రుతులఁ గ్రోలఁగ నైనవారి
తలన దృష్టి గన లేవు భవంబులు ఽ కెలన సారూప్య మందు విష్ణుండు
ననుచు శుకమౌని తెలిపెఁ బరీక్షితుఁ ఽ డును దెలివిఁ గాంచి యవల విను కలిమిఁ
గొన ముదము నంది శుకుని మ్రొక్కియును ఽ వనజనాభుకథ జెప్పుమింక యనె
అని సూతుఁ డా శౌనకాదులకు ఽ వినిపించ వారు నటులనె నొప్పిరి.

పరమేశ్వర! వృత్రారినుతచరణ! ఽ దరహాసితవదన! కరిపరిపాలన!
నిరతనిరంజన! నిత్యశుభదాత! ఽ వరద! శ్రీకృష్ణ! భవజలధితరణ!
హరి! హరి! విష్ణో! యనంతశయనా! ఽ కరుణాకర! పరతత్వ! బ్రహ్మాంబ
శరణు శరణు సర్వేశ! శుభప్రద ఽ ధరణి నీస్మరణచే కలి పారునుగా
సురుచిరానంద! షడ్గుణైశ్వర్య! ఽ పరిభూత భక్తమందారుఁడ వగు
పురుషోత్తముఁడవు కరము మామతిని ఽ నరసి రక్షింపు మరమరను గొనక
సిరి యురమునఁగల దేవుఁడవు నీవు ఽ వరుసఁగూర్పు జయమున మ్రొక్కు లంది
శరధి గభీరమునగు నీస్మరణము ఽ నిరవుగ నిలుపుము మాహృదయ మందు
గోవిందా! జై గోపాలా శ్రీ ఽ గోపాలా జై గోవిందా

శ్రీ కృష్ణార్పణ మస్తు.



శ్రీ గురు పరబ్రహ్మణే నమః

# శ్రీమ దాంధ్ర గేయ మహాభాగవతము.

## ఏ కా ద శ స్కం ధ ము




రామా! మునికామా! గుణాంచిత ॥ శ్రీనాయక! కనకాంగదభూషణ!
ధీరా! యరిగంభీరా! దనుజవి ॥ దారా! భూరిదయా పర! సారా!
దేవా! దేవాధ్యక్షనుతచరణ! ॥ నీవాదివి క్షితిదేవకవచస్థిత
పావనమా నీ నామస్మరణము ॥ లేవిధినైనను జేయ నఘహరము
భవహరమ్మనై భద్రదాయకము ॥ నై వెలుఁగు శ్రీల నెల్ల విడివడక
భువనదీపకా! ధవళాంగసఖా ॥ సవనఫలదాత! సర్వాత్మనిలయ
నిను మనంబునను ఘనులు జూతించి ॥ దినకరుఁడు తమము దోలునట్లుగా
తను వాక్కనముల నొందిన దురితము ॥ ననువుజెరిచి నీయనువును గందురు
నిను బాగడఁ గాని తనువు వలగొన్న ॥ జననాది తాపలతలు త్రెంపులగు
కనుమ కనికరము సనకాదిజనక! ॥ వినుత! రమాపతి! విశ్వపాలనా!
వినయసౌశీల్య! విష్ణునామ హరి! జననమరణరహితాచ్యుత! పరేశ!
దురితాత్ములు నిను పరిహసించినను ॥ వరుగుణాఢ్య! నిను దలపోతలె యని
పరమదురితముల నంటని తలమే ॥ స్థిరముగనే నీవుగా బొందింతువు
రామా! కామ్యములను గోరక నీ ॥ నామచింతనము గన్న ఋషీంద్రుల
కేమి రొయసఁగుదువో! నీమదియెయెఱుగు ॥ నో మహనీయా! విరించియెఱుగడు
బూమెలగు నీన్న యవతారకథలు ॥ భూమిజనులు దలఁపులను పునీతులు
నగుదు రనియు నిట లక్ష్మీనృసింహాఖ్యుఁడు ॥ జగదవనా! కంసారి! కృష్ణ! యని
వగవు దోల యెల్లరును ధన్యులుగ ॥ జిగి గన వచించె భాగవతమునగా
నేకయుత దశస్కంధవిశదమును ॥ శ్రీకమలాక్షుని తత్వమెఱుఁగు విధి
నే కలంకమును నొందనీని నిధి ॥ భీకర సంసారాబ్ధికి దరియది
యనుచు నెంచి వచించు నిందఱము ॥ మనమున శ్రీహరి నుతించి విందము
వినయముగను శ్రీగణేశు మ్రొక్కియు ॥ వనజాసను సతినినుతిసేసి
కడక విడక పరమాత్మ మది నిల్పి ॥ జెడువులేని భక్తిని మువ్మూర్తుల
జడమతి దొలగగ సరళత నుతించి ॥ జడువు విడచి సురమునుల వాల్మీకి

వ్యాసు శుకమునుల వైశంపాయను । లా శరణిఁ దప్పకను దోయి లిడి
రాశిగొను పుణ్యు తా నన్నయాది । వాసి గన్న కవు లందరికి వంద
నము నే జేసియు మరియు సకల భూ । తములఁ శ్రీదేవుని యంశము లని
మనములోన నిల్పియు నమ్రతనుఁ । గొని కుతుకమునఁ వినంగ నిట్లనె
అనఘుఁడు సూతమునీంద్రుఁడు శ్రద్ధను । దనరు శౌనకాద్యఖిల మునీంద్రులు
జనవందితులను పాపదూరులను । కనికరించి శ్రీకృష్ణచరిత్రను
ననఘుఁడు పరీక్షిత్తు డనెడు క్షితిపతి । సునయుని కోవిదు శుకమునీంద్రు గని
యడిగిన జెప్పెను భూవర! భయముఁ । నడపు దీని నాలింపు సుస్థిరత
సుడివడు కలతలు శూన్యములందున । చెడుగు లేని శ్రీనాథు పదమందు
ముదము నంద నీ వుందువు భవహర । మిదియు సర్వచింతామయౌషధము
సదయులైన మునిమతము లిన్నియును । గుదియజేయు దుష్టంపు కర్మలను
శ్రీకృష్ణుఁడు బలవీరుల యదువుల । తా కృపారతిఁ గని పెంపలర ని
రాకృతిగా దునుమాడ దునిపించె । నా కృతాపరాధులను దనుజాంశ
జనితులనఁ కంసాదికౌరవుల । తనివి నొందిరా సకలమునీంద్రులు
తనర ధర్మంపు నడల భూతలము । నను దన యశముఁ నిండించియు నా
వనజభవుని కిచ్చిన కార్యసరణి । యొనరు దప్పకను క్షితిభారమునఁ
దన నైపుణ్యత దప్పించి నంత । టన యాదవులఁ దర్పమున గ్రాలి
పర భయంకరులు నగుచు నది మించఁ । దరము గొనిరి మదమతి కాలవశము
సురల యంశముల తారు బుట్టినది । వరమతీ! నీవు వినియుంటివి గద!
యరులు నశించిన వారు సురలోక । వరనివాసముల కేగు కడంకను
బీజం బది యగు హరితలంపు నదె । రాజమునుల శాపంబు మూలముగ
భ్రాజితులై సురలోకమంది రా । యజితులైన యాదవు లన విభుఁడనె
మునిచంద్రమ శ్రీకృష్ణు ననుచరులు । వినయదూరు లెటులైరి మునులకును
ఘను లాముని లెవరనఁగ శుకుఁ డనెను । విను మక్కథ యెఱిగింతు భూవరా!
పరముడు నగు వనమాలి శ్రీధరుఁడు । కరుణ నింపె ధర్మమును క్షితిపైన
సురపోషకుఁడగు నిరతు సుశ్లోకు । విరాగసమ్మతు విష్ణు జగదీశు
పుండరీకవరదాయకు ననంతు । నిండుభక్తి మన మలరగను కనుల
పండువుగా గని వత్తమని మునులు । పిండు గట్టి రా మునివశిష్ఠుఁడును
జనవినుతుఁడు విశ్వామిత్రుఁ డసితు । డును దుర్వాసుఁడు కశ్యపుండునుఁ
వామదేవుఁడును వాలఖిల్యులును । దా మాంగీరసులు భృగుఁడు నారదుఁడు
ఆ మహనీయులు మరి కొందరునుఁ । కామాద్యరివర్గ భంజనులునుఁ

శమదమాన్విత స్వాంతపవిత్రులు । మమత లన్ని విడనాడి సంతతము
తమ మానస మందిరముల సమ్మది । రమానాధ ! ఓమ్ నమో విష్ణవే !
యని నుతి మతి సలిపెడు వారలునై । చినిగిన కౌపీనములుఁ జడలుఁ
ఘన కమండలులు దండధరులు నయి । ధనదుని వలె తమ తపోనిధులకు

—: విశ్వామిత్రవశిష్ఠ నారదాది మహర్షులు శ్రీకృష్ణదర్శనంబునకు వచ్చుట :—

నధిపతులకు వారెందరో శిష్యుల । నధిశాసనముల హరి నిలువుభక్తి
విధుల జెప్పుచును ద్వారకాపురికి । నధినాధుఁడైన కృష్ణుని సన్నిధి
జేరఁ జేరి రా ద్వారక నగరము । ద్వారపాలు రది గనియు వచించిన
సారసనేత్రుఁడు వసుదేవుసుతుఁడు । దారమానసుఁడు సకలజ్ఞుడు హరి
జేరి వారి నెదురేక్కు నడవడిని । వారి మందిరము చేర్చియును తన్ను
సురబృందము పూజించు చందమున । మీరఁ జేయ కనకాసనములనుఁ
వా రుండియు నీ భువనపాలకుని । నీరదశ్యాము నిగమసారమును
సొంపు నింపు తమ యమేయవాక్కుల । నింపునను నింపుచును నిట్టు లనిరి
సంపదాంగనాధవ ! పుణ్యరూప ! । లంపటదూర ! నిలింపవైరిహర !
పెం పడగింపఁగ గంటి మఘంబుల । జంపులయ్యె మాయశము లవన్ని యు
దంబు నిమ్మనయె నిను జూచినంత । యంబుజాక్ష ! సర్వేశా ! యీశా !
డంబరంబు సెడు కామాదివర్గ । జంబులైన యీ ప్రపంచ కలతలు
తాపత్రయ రూపంబు దొలఁగు ని । న్నోపనట్టి విజ్ఞానదృష్టి గన
రమా పవిత్ర ! పరమాత్మ ! వాసనలు । మాపనగును సకలంబు నీ వనిన
స్థూ లసూక్ష్మముల గుదిరి యుండునొకో । కాలమునందున నపియు నొందె నన
జాలువాడ నీ మాయ కలంగని । మేలు గూర్తువా నీలాంగవిభవ !
నీ పదంబులే ముక్తిపదమ్ములు । మా పదంబులం దుండ దయ దలఁపు
సాపరాధులను నిరపరాధులుగ । నో పరేశ ! జేయంగ శక్తి గల
యయ్యవు నీవే నెయ్యము నిల్పుము । వ్రియ్యులయ్యె హృచ్ఛిద్రము లధవా !
దయ్యనియ్యకో తియ్యవిలుకాని । యయ్య ! నిన్ను గన గలుగు నీ దినము
సుదినము మదిలో దడ ధ్వంసముగనె । జడియ మింక మృతి మొదలు పరంపర
గదియ దింక నీమతిని స్థిరపరుపు । యదువంశవరా ! యతిజనాదరా !
యను మునుల గనియు ననఘు డిట్లనియె । జన వినుతులు సుశ్లోకులు పుణ్యులు
వినయనిధులు విజ్ఞానపూర్ణులును । మనోనియంతలు మహాత్ములరు మీ
రేల వచ్చితిరి ? నిజ మెఱిగింపుడు । మేలు జాతు నది మీ నుడులు గాదె

చాలితి నంతకు శశ్వద్వినుతుల § నాలకింపుడీ నాసేవ లన్ని
మీబోంట్లకొరకె గాద దయాపరు § లీబోటివాని పెద్దగ నుతింప
నాబోంట్లపదము మీకబ్బు నిజము § నాబోతు గోవు వెనుకొనెడు ప్రేమ
నే బీడు చేయు నాభక్తవరుల § నాబంధులార ! నాదర్శనంబు
గోరు ప్రయోజన మేమన్నను మును § లారసి కరముల మోడ్చి శ్రీహరీ !
విశ్వమంగళాకార ! శ్రీకృష్ణ ! § శాశ్వత సత్యనిరూప ! పరతత్వ !
నశ్వరమ్ము లగు నెల్ల వాంఛ లని § విశ్వసించితిమి కోర్కు లేవియును
లేవు నిను గనుట నుతించుటకుగా § భావమందు తిరపరచి వచ్చితిమి
దేవదేవ ! నిను గంటి మేగదము § మావలంపు నీపై దగ నుంచుము
అనుచు భక్తి మున్మారు నతి జేయ § మునులకు విందుగ గోవిందుండను
వినయ నతుల నర్పించి పంపగను § మునులు వెసక పిండారక తీర్థము
గని నిలిచిరి యదుపుంగవు నెన్నుచు § గనిరి విష్ణుమాయను యదువంశపు
జాతులందరును కుత్సితాత్మ్మలయి § మునుల వాసింతము శాంతచిత్తు లట
కోపరహితు లట పాపులుగా రట § తాపదూరు లట తథ్యము గందము
ఏపగిది నో కోపము రేపియు § నీపురుషోత్తమునకు నది దెలిపియు
నవుదము మనమని వా రట చేరియు § దివులు దోలి దీపము ముద్దుగొను వ
దువున మతిని కిలకిలలు లో నణచి § యవినయపరులై మునులకు హాకపు
నతుల జేసియును సాంబుని యువతిసీ § నతికినచూపున నలంకరించియు
వెతలు ముందు తమ్మొందు లక్షణము § గతిగా నడిగిరి మునివరులారా !
సతి కడుపున నుండెను ఇదె గాంచుడు § సుతుఁడో ! సుతయో ! జన్మించుట జెప్పుడు
నుతి జేతుము మీ యద్భుతచర్యల § అతివిజ్ఞానులు మీరన వింటిమి
యనుచు ముసిముసుల నమరు వదనముల § వినయవంచన నడిగిన నెఱింగి
జను డీక వేగము నను జాగులేదు § మనువు జెరుచు మీ వంశమంతయును
తనుమధ్య కడుపులో నుండు ముసల § మును గాంతురు ఈ యింతి ప్రసవించు
నిట నుంటిరేని జెడుదు రిపుడె యన § మటుమాయ మయ్యె చిరునగవు లన్ని
దిటవు మతిగ నటు బాపి చీరముడి § తటుకున విప్పగ బొడమె రోకలియు
చటులత నుండిరి కుటిలత విడిచిరి § కిటుకు జెల్లదని దానిఁ గొనియుఁ
పటుతరవేగము నంది శ్రీకృష్ణు § కుటిలాంతకునిఁ గని చెప్పి రంత
మదిలోనంతయు నెఱిఁగియు తెలియని § యదును గలవానివలె వారి జూచి
యదువంశము జెడు నింక దప్పదో § యదువీరులార ! బ్రాహ్మణశాపము
వదల్పరా దది నుతంబు గొంటిరి ! § కద యన్నలార ! నాకు నశక్యము ! పు

రందరాదులే భూసురుల గన్న § వందనాదు లర్పించి తొలఁగుదురు
ఎందు వారి నడ్డంగ వెఱచెదరు § ముందుకర్మ ప్రేరేప మీ రిట్లు
నందితి రీ దుష్టకృత్యమును వా § రెందులకో మిమ్మిపుడే యుగ్రత
బెట్టిరి కార్య మ్మె దగు నొక్కో! § మట్టుబెట్టి రా మునులు విజృంభణ
మిట్టి చెట్టకార్యములు సెల్లునే! § ఇట్టు జేయుడీ! మట్టుస నింకను
జుట్టుకొనదు ఆ దుర్దశ విధియును § దట్టు గావలయు నీ ముసలము గొని
ఇట్టె జనుడు యీ వనధితీరమున § గట్టున నుండెడి మహిత చట్రాయి
బెట్టి నూరి నుసి జేసి యద్దాని § నట్టె యా తరగలందున గలపుడు
దిట్టత పీడగా జన దిప్పట్టున § పట్టు జూపఁదగు పెద్ద పట్టునను
రట్టు బడితి రా శూరుల నెట్టెడు § మీ కిక్కట్టు చలము గొని
పట్టె మిమ్ము శోకింపవల దింక § నిట్టివంకలగా బోకు డని తెలుప
నట్టె జేసి రా ముసలము నుసిగా § బెట్టియు తరంగలందు గలపియును
నూర నూర శేషించిన ముక్కను § పారవేసిరా వనధిలోపలను
నీరమునగాగల మీనం బొక్కటి § పార మ్రింగె నాచేపచెంతనే
చేరి తిరుగాడు నొక లుబ్ధకుండు § దారిచి పట్టెను దానియుదరమున
నుండెడి ములికిని గనెను వరుసలో § మెండుకొన్న మొన వాడి గలదాని
నండ జేసెదను బాణమున మొనగ § దండిమృగంబుల జంపదగు ననుచు
నయ్యదియగా దైత్యాంతకుఁ డెరుగును § ఇయ్యను వంతయు నెఱిగి రీవిధిని
నీయ కాలపుదశల ద్రోయఁగా § నెయ్యుపాయములు నెక్కవు భూవర!
అనిన వినియు నొక్కింత చింత గొని § వినికిఫలంబున నది త్రోసి శుకుని
వినయమునను నను ముదంబునొందెను § ఘనమగు విధినిగా దెలుపు దయాళో!
ఘనుఁ డా వసుదేవుండు చిత్తమును § ఘనత నిలిపె నెటు తననూనునిగా
మనమున దలపోయకను కృష్ణునిగా § మునిజనమందారుడు మన్మథునకు
జనకుఁ డనుచు దలపుంచి సేవఁగనె § నన వినికిగాగలవాడ నది యెట్లు
చిత్తమున చలనగతి మలఁపు టెట్లు! § పిత్రాదులపై దరలియు వెతలగా
హత్తుకొనును ఆ నడకల దేనిని § పొత్తుగ ఘటింప నడుచువారలో

—: వసుదేవునకు నారదుండు పురాతనంబగు విదేహార్షభసంవాదంబుఁ దెలుపుట :—

దెలుపఁగదవె! యన మునితిలకుఁడు శుకు § డెలమిని వినుమా! యది నిత్యముగను
నలవరచునుగా కనియు నారదుం § డిల జరింపుచును శ్రీకృష్ణుని గని
కలత లేని మతి నుతించి యంతటి § నిలయములోనం జేరి వసుదేవు

చేత నర్చితుం డయ్యెను కనకము § చేత నిర్మింపఁబడిన పీఠమును
ప్రీతి నిడిన నుపవిష్టుఁడు గాఁగా § నా తపసిని గని శిరము చరణములు
సోక మ్రొక్కి మహానీయా! సెప్పుమా! § పోకనిల్వ దీ తనువు పైకొన
పోకల జించియు పాలించనైన § వికలత్వము సార్థకముగ జీవుఁడు
వెడ లగదా యిక నేమి సర్వమును § చెడుపులోనివై తఱలుట గంటిమి
సుదులునగుఁగా నడియాస లివమ్మన § కడ గన పరమున గతుల గన ననుచు
నుడువ విందు మీబోటి పెద్దలచె § చెడుగు దొలఁగు మార్గమ్ము వచింపుమ!
అదియుగాక గోవిందుని పదముల § మదిలొ బదిలముగ నిలిపిన బరమున
గదియు ముక్తి యన విందు నది యెట్లు? § సదయహృదయము బెదరును గదిరెను
మరణమంద యాతనలు దప్పవట! § అరుణసూనుఁ డట దండించు నంట!
దురితనిలయ మట నప్పురంట! గద! § హరిసేవల నది కనుల గన రంట!
నదియెటులో సెలవిమ్ము మునినాధ? § ఇదిగాక నొక్కవెత నిరవుగొంటి
విదితపగతు విను దొల్లింటనేను § ముదము నిచ్చు శ్రీశుని పదమున బొడ
గనియు ముక్తినిఁ గోరక సుతుఁడుగ § వనజనయనుడే బుట్టగోరితో!
కనికరించి యట్లయ్యెదునని వర § మనుగ్రహించెను దాని నందితిని
దైవమాయ నే దప్పనేర నటు § నే వలంచితిని సంసారమింత
చేరనీని దని యెఱుగక బుచ్చితి § కేవల మతి నిడ నస్థిర మగుటను
మీర దెలుపవలె తరింపు మార్గము § భావమంత నీ కర్పింతు గురుం
డవు లోకగురుని నుతింతు వెప్పుడు § దవులనీవు సంసృతిపాశమ్ముల
సరసమతిని శ్రీహరిని సేవించు § సరణి నెఱిగించి సంకటము బాపు
సురమునీంద్ర! నీ దాసదాసుడను § తరింపు గతి వివరింపు వందనము
అనిన నతని కా యతివరుఁ డిట్లను § జనసన్నుత! యది వినుమ వినుపింతు
అనఘులై ఇట్లడుగంగ జూతుగా! § వనజనయను వర్తనలు చిత్రములు
ఇనుని దరిని చీకటి లేని యటుల § కనకచేలు నతి నలరు భాగవత
జనుల దురితములు చెందవు సుమతివి § నిను నవి యందవు హరిని గనుటచే
వేదశాస్త్రసమ్మతము శ్రీశు నుతి § వాదు లేని మతి వీనుల విందుగ
నాదరించ సంసృతి నవయును § ఖేదరహితులను భేదపరుప డా
దేవుఁడు వికార శూన్యుఁడు శుద్ధుఁడు § పావనులుంగా జేయు తను దలఁచు
భావముగల యోగముల వారినిఁ § బోవ సన్నిధిన తాను గుదురుకొను
నీవు శ్రద్ధగొనుమా! వసుదేవా! § జీవుఁ డెన్నఁడుఁ జెడ డను తత్త్వము
జీవుఁడె దేవుం డనెడి శ్రుతుల నుడి § జీవేశుల సంబంధ భేదముల

ద్రోవ గనెడి నాత్మంపు తెలివియును § నీవు గందు వొక కథ యెఱిగింతును
రయా వరగుణమణి! పూర్వకాలమున § భావశుద్ధి గల స్వాయంభువునకు
సుతుఁడు ప్రియవ్రతుం డతనికి పుత్రుఁడు § సతతయశుఁడు యాగ్నీధ్రుండు నాగ
నతనికి నాభియు ననెడు సూనునకు § సుతుఁడయె విష్ణుఁడు వృషభాఖ్యుఁడా మె
నతనికి నూర్వురు సుతు లుదయించిరి § మతిమంతులు సద్గుణశోభితులుగ
వెలసి రందులో నగ్రజుఁడు భరతుఁ § డిల సమస్తమునకు ప్రభుఁడు తండ్రిచే
నలరు నొంద పట్టాభిషిక్తు డయి § విలసిలె ననుజులు నవఖండములకు
నరపతులుగ నేర్పడిరి వారికే § పేరుల నంకితములుగ జెన్నొందు
నవి కుశావర్త ఇలావర్తనును § నని బ్రహ్మావర్త సూర్యావర్త
మవి యా నాలుగును మలయకేతు § నవల భద్రసేనేంద్ర స్పృక్కులను
నవి విదర్భకీటకములు నానగు § నవసంఖ్య పుత్రులయి ప్రభువులే
తక్కిన వారితో దొమ్మండ్రుగురును § మిక్కుటమగు భక్తిని భాగవతులు
జిక్కరుగా విషయాదుల రతులను § మక్కువ జేయకు సంసృతి సుఖముల
కవియు రవియు నంతరిక్షు బ్రబుద్ధు § లవల పిప్పలాయన విర్హోత్రులు
అవల ద్రమిళ చమసకరభాజు § లవిరళ విజ్ఞానాంచితులు గుణులు
నయ్యు స్వేచ్ఛలను తిరుగుదు రెల్లెడ § నీయవనిని సరి బోలరు వారలు
డయ్యు లెందునను హరివలని తెంపు § నెయ్యము సుమతుల తోడ నొకప్పుడ
మిగిలిన యెనుబది యొకరును విప్రులు § వగ దూరముగా ప్రభుత గైకొనక
తగ వని కర్మల నిష్ఠ వాటించి § భగవంతుని సేవింప నట్లయిరి
జనపతి! వినుమా! వరపుణ్యమూర్తు § లనయు మోదసమ్మానస వృత్తుల
దనిసి యూర్ధ్వరేతస్కులు నయ్యును § జనవర! హితసంధాన విద్యచే
పరిపూర్ణులునయి పరమాత్మ దెలిసి § చిరకాలమునను జెడనివారు నయి
పురుషోత్తమునిని సర్వమున గనుచు § సరసుండైన విదేహభూములును
సవనాంతమునను దరియరాగ భూ § ధవుఁడును ముదమున పరివారముతో
జవమున నెదురుగ నేగి దోడ్కొనుచు § సవిధిగ నర్చన లిచ్చి కనక పీ
ఠముల కుతుకములె నిలయములను § వృత్తముల నొప్పు చూపుల వెలిగా
నమిత మోదములు నంద విభునితో § సమముగ నాశీర్వదించి యున్నయెడ
భూమినాయకుఁడు నెలమి నిట్లనియె § నో మహాత్ములారా! మీరు ముక్తి
ధాముని శ్రీహరిని కరుణాసముద్రు § నామరూపగుణ క్రియాదిరహితుని
వేదవేద్యు పరమేశ్వరు నవ్యయు § నాదిమధ్యాంతరహితు నచ్యుతుని
మోదదాయకుని మాయాదూరుని § పాదు నిల్పు మది బాయక బొగడుచు

బాదు పుచ్చ రికాలమునైనను ఽ మీదర్శనంబు నోచిన కలిమిది
సోదరులు మీర లందరు నాగురు ఽ లగుదు రింక భవనీరధి నీదగ
లేక నాయాస మందెడు నన్నును ఽ మీకరుణ దరిగ జేర్ప వచ్చితిరి
మోకరించి మిము భజింతు చెప్పుడు ఽ ఆకమలాధవు నమ్మెనెటు మనము
సారమేయు సంసారభ్రమణులకు ఽ నీరజనాభుని భక్తి నిల్చునెటు
ధీరులార ! యీ మానుషజన్మము ఽ మేర శ్రేష్ఠమని రేల విజ్ఞులిల
చింతలపరిమితి ఇందు నమితమగు ఽ సంతసంబు లే దెంతటివారికి
నంత సౌఖ్యముల నందగోరు చు ఽ న్నంతలోన దా మంత మొందుదు ర
నంతు నచ్యుతుని దలంప ధన్యమని ఽ యెంతురు పెఱుకు వచింతురు పెద్దలు
సంతరింప నను వెద్ది గాంచవలె ? ఽ నింత దెలిపి నను శిష్యునిగ గనుడు
క్షేమ మడిగితిని జెనుటకు వెఱతుగా ఽ నేను మేమి బూనంగను క్షేమమే
ఈ మహీ జనులకు ప్రాపునయ్యె మరి ఽ గోము నడంతురు కుత్సితకోర్కుల
నాగగా వారును భూపతి నలరున ఽ దోగ జేయంగ నెంచిరి ప్రీతిగా
వేగక శ్రీకృష్ణ మది మూర్తి పఱచి ఽ రాగం బొంటక లేక నుతి బూని
పతితపావనా ! భవభయహరణా ! ఽ గతివి నీవె గా ! కల్మషాపహా !
నతులు పూజలును స్థిరపు ప్రొక్కులివె ఽ పతితులైన యతిజనుల హృత్తలము
సతము నీకు నివసింపఁ బవిత్రం ఽ బతికియుండు నేమముల నెపుడు విడ
రన్ని నిను గన్న మరల్తు రెలమిని ఽ ఎన్న రవల నేమములు శూన్యముగ
తెన్ను గాంతు రో జగత్పతీ ! హరి ఽ మున్నది సుకృతమె గనజేయు నిన్ను
ననుచును నుతించిరి యందు కవి యనెడు ఽ యనఘుఁడు భూపతి గాంచి యిట్లనియె
వినుము జనపతీ ! వచింతు విష్ణుని ఽ ఘనత నది మతిని నేమఱకను విను
వినయపరులకే నుడులు మోక్షములు ఽ వినయదూరులకు బంధనము లగును
ఎనయ మాటిచే పుణ్యపాపములు ఽ దనరున లేవన ? కరుణములు నాగ
బలుకుదు రార్యులు మనసువాక్కాయ ఽ ములు నగు నవియే కర్మలు మూలము
ప్రాలువానికై నయ మెఱుఁగవలయు ఽ మేలు గల్గు శాంతంబు చొప్పదియు
నోలి వానిమూలంబు సత్వమగు ఽ దూలపుచ్చ రా దది ముక్తిదమ్మ
సత్వము సత్యాచార సుతప మి ఽ ప్రత్యమువగా దీపించు మతియు
తత్వ మన్నృతాధర్మముల పవి ఽ త్రితకై కూర్పుము ! ధనవ్యయమ్ముగా
త్రికరణశుద్ధిగ సుకర్మ లమరిక ఽ సుకర మగుటకుగ జెప్పెదు వినుమా !
సకలము నందున సర్వేశుకళను ఽ నొకటిగ గని పరులను పీడింపక
వికటపడక పరతత్వ చింతనచె ఽ నకుటిలత గన్న మానసికమగును

వేదశాస్త్రధర్మము వచించుట § వేదవినుతు తననోర బొగడుటయు
వాద మొనర్పక మూర్ఖముల మాని § సదుపాయములన్ పరహితము బల్కి
వాచిక సుకర్మ యగు సుకాయమున § నాచరింపఁ దగు పెద్దలపట్టిల
జూచిన సమ్రిత ప్రీతి మన్ననల § నోచినంత పరిచర్యల గనగు
ధనహీనులైన నిటుల గలిగినను § గనిన ధర్మముల నటు శ్రద్ధ గూర్చి
వనజనాభునకు నర్పణ మనవలె § వనజనాభుఁడన తత్వ పూర్ణుండు
తనువుల నమరెడు సకలేంద్రియముల § మనము మొదలు నాల్గింటిని నొకటిన్
అవల రెంటినిన్ భూతము లై దిటి § పవనభేదముల నై దింటిలోన
దవిలి వెలిగించి తా గూడబోక § నవల వేరుగను గనరాక వలసి
కూడిక గను ధర్మమున రూపుఁడయి § వేడికోలునన్ దర్శనీయుఁడయి
తోడుగాగ నధిపతుల వే గూర్చి § జోడుచేసి కలవిధుల నిల్పియును
వేఱు కలయికల నొకటి గనుపఱచి § తేఱిచూడ సర్వాంతరవాసియు
తీఱుట తాఱుట తన యిచ్ఛగాగ ! నూఱడిల్లు పరమాత్మ యతఁడౌ యగు
ఇటుల నెరిగి యర్చింప సుజ్ఞాన § పటిమ యది గలుగ జ్ఞానచక్షు వదె
దిటవు గొన్న సద్దాన గన నగును § చిటుకలోన జననాథ! నిలువు మొద
సువిచార మదియు సుజ్ఞానపరత § ప్రవిమల మగు చిత్తమునందు హరియ
దివియ బోలె దీపించు చలింపడు § భవరహితము నగు గాన హరిభక్తి
వలయు విశ్వ దాతని విశ్వసింప § దలఁగు నన్ని కలతలు యవి నశింప
మలయబోడు కామాదుల నంటడు § విలయ మొందు హరిపదమున వెలుఁగును
చేయి రేల బల్కంగ రమేశుని § బాయని వృత్తుల వినుట కనుటయున్
నేయ మొప్పు భాగవత ధర్మముల § మాయ సడపు పరమాత్ము బొగడ నగు
దారాదులపై ప్రీతి వహింపక § నారాట మడఁగి నారాయణ యను
ధీరాత్ముల కా దివ్యవందితుని § పారాయణమును బంధన చ్యుతము
నగు నని జనపతి భాగవతధర్మ § మగు నట్టి నడక వలయు నవి దెలియ
దగు నట్టివారు గన భాగవతులు § తగ జెప్పు డనఁగ నందు హరి యనియె
ఎవఁడుకన్నులన్ చూపు నిచ్చెనో § చెవులకు వినుటకు శక్తి నిచ్చెనో
పవనాదుల సోకుట తనువు దెలియ § నవకంపు రుచుల దెలియు శక్తియును
నాలుకకును బడయ జేసెను మరియున్ § వీలు నాసికకు జేసెనో వాసన
మేలు సేయంగగ నింక కర్మేంద్రి § యములకు నటులనె యాయాయి శక్తి
పాలించును యిన్నింటిని నెఱుంగు § మేలు మనమునకు దాను నిల్పునో
అట్టివాడు భువనేశుఁడు విష్ణుఁడు § పుట్టువు నొందని పద మిచ్చు నను

పట్టున మదినిఁ బాయని భక్తిని ఽ దిట్టత బూనిన వాఁడు భాగవతుఁ
డన దగు నిక విను విరాగయుక్తత ఽ గనినవాఁడు నచలాంతర వర్తిని
మనమునందు స్థిరపరచి యిహమ్మున ఽ గనిన నెల్ల సంస్కరణ కల్పవలె
మాయవెలుంగున నవియు తన గనియు ఽ నాయువుగల యంతకాలమున భ్రమ
బాయక యున్నను పరముని గానఁడు ఽ గా యినుండు తన కిరణప్రసారము
లను లోకత్రయము పావనము జేయు ఽ ననువు కలిమి భాగవతుఁడు నిక్కము
గను గని పరమాత్ముని సర్వమయుని ఽ ఘనమగు పూజల వలను నుతులచే
లోకపవిత్రిత గూర్పు హరి బాగడు ఽ పీక హృదయ తాపముల బోదోలు
నాకవాసులు నృతిజేతు రతని ఽ పోకలన్నియును లోకముదమ్ములు
అనిన విని నృపుఁడు ఇంకను విశదము ఽ గను వచింపుమా విజితేంద్రియ! యన
ముని యంతరిక్షుఁ డను మహాత్ముఁ డట్లనె ఽ పరతత్త్వమయుని నిజతత్త్వము
రాజమాయ యన నేమొ దెలియ విను ఽ పూజితమ్మనగు నిర్గుణబ్రహ్మము
తేజరిలఁగ నది విపర్యయముగా ఽ తేజమంది జన్మించె గుణములను
విను విషయబంధనముల నదలించు ఽ ననువును విచార శూన్యతను గనిన
జనులు పాపులగువారు మూఁడవస్థలనె ఽ దనరుటయె గాక యింకొకటి గలదు
శ్రీరమణుని బొందని యవస్థయును ఽ నారయ నదియె యధోగతిని గనఁగ
గూరునట్టి దగు నో నరనాథా! ఽ ధీరమతి వగుచు విను మందు జొరవు
విను గ్రాహ్యగ్రాహకము గ్రాహిత్వము ఽ గను స్వప్నమ్మున భేదముల వలెనె
గను మాయాంధత పొందుమా త్రోవ ఽ లను మనము లీనమగుచుండు నల్లె
జనవరా! మాయ లీనముగ నాత్మ ఽ గనఁగ హరిమొదల భూతపంచకము
చేతపదు నొకటి యింద్రియంబునను ఽ యాతరపు భేదముల గుణములచే
వాతండ గొనుము భూతమయసృష్టి ఽ చేతనం బుండ నాతఁడు వెలుఁగును
విను దేహి కర్మ కలన సుళ్ళుగొని ఽ జనన మరణాదులను సుఖదుఃఖము
లను నిరయ స్వర్గగతుల సుడిలోనె ఽ మునుఁగు చుండు గానగ లేదు ముక్తి
అంత కాలమా సన్నము గాగను ఽ నంతనే గుణద్రవ్య సరూపం
బంతయు ప్రకృతిని బొందించు నపుడు ఽ వంతుగొన నూరు వత్సరాల్ వాన
లేమి నత్యుగ్రమగు పరముదృష్టి ఽ భూములన్ని దహియింప బడంగనె
స్వామి యనంతుని ముఖజనితానల ఽ భీమానలంపు జ్వాల నిలసహితమయి
సకల దిశ నాక్రమించ సంవర్త ఽ క వలాహకము లన్ని నూరేండ్లు
సకలంబు మునుగు వర్షంబు గురియు ఽ ప్రకటితంబునగు విరాట్టు లీనము
గాగ పరమాత్మ యింధనాగ్నివలె ఽ యోగమంది యవ్యక్తమున జొచ్చు

నాగుఱి గన్న జలంబు తేజమగు ఽ ఆగత తేజము వాయు వంద దగు
గగనమున నదియు నిముడుగతి యుడిగి ఽ విగత శబ్దగుణ మగుచు నది యొప్పి
తగవున యాత్మను యదిజేయు రాజ ! ఽ మిగుల గల వింద్రియములు మనంబును
వానివృత్తులును నడఁగు నహంకా ఽ రాన నది జేరు సీశ్వరుని యందె
గాన యా మాయ యిట్టిదగు నన్న ఽ నా నరపాలుం డడిగె నిట్లనుచు
జ్ఞానవిహీను లెఱుంగ జాలుదు రె ఽ యీ నరప్రపంచ దుర్లభం బదియు
దాని నడంచుట ముక్తి తోడుగొను ఽ ఏ నియమంబున బల్కుఁడు పుణ్యులు
ననిన ప్రబుద్ధుఁడు జనవరుని గాంచి ఽ విను మో భూవర ! దినదిన మాయువు
నినుని యుదయాస్తమయముల నెన్నిన ఽ గన దరుగుచుండ తనువుపై కూర్మి
యును వనితాసక్తియు ధనాది ఽ చింతను సుతబంధులపై యనురక్తియు
తను మరులుకొనఁగ మఱచు తత్వమును ఽ గనఁడు సుఖము లేశంబుగ దుఃఖము
విపులంబుగ జన్మావధిని నంది ఽ యెపుడు గడనకై ద్రోహమున గూడి
కపటుల డాసియు మదము గొని తిరుగు ఽ చపలుర కెటు సిద్ధించు నావిధము
యెపుడు సుజన సంగతుల సమమతిని ఽ రిపు లార్వురు దను గనినట్టి దీప్తి
గని సత్యమంద మనము నిల్పియును ఽ వినయము శాంతము శమము సహితమును
యనఘులను వినికి గని సేవ గుదిరి ఽ ఘనుల సద్గురుల హితబోధల గని
హరిచరితామృతపానము నందుచు ఽ వరుసల తృప్తిని మనము గదియించి
వరము జితేంద్రియ వశత తా నంది ఽ ధరణి గల స్వభూతములందున
సరసీరుహానయనుండు వెలుఁగునని ఽ దిర మతి మానము వహించి
తను నలము ద్వంద్వముల నూఱటగని ఽ తనసర్వము శ్రీహరి కర్పణ మని
దన నడక ధర్మసరణి నొనరంద ఽ ఘనమైన శాస్త్రసంగతుల వలపు
గనుట లవి భాగవతుల చర్యలగు ఽ విను మనఘ ! యిట్టివారు మనలను
వనరుహానాభుని గనుచు నీమాయ ఽ ఒనరున జిక్కక జితమును గందురు
నన రా జడిగెను హరిప్రభావము ఽ ముని సుతుఁడు పిప్పలాయను డిట్లనె
నరవర ! జీవాంతర్యామిజ్యోతి ఽ కరము మానసేంద్రియములలో కళ
పరతత్వరూపి జననాది కతఁడె ఽ వర దైవమునగు త్రిగుణ మహదహం
కరణము లగుదురు లింగశరీరుఁడు ఽ ధర నుతింపుగొను చైతన్యరూపి
అతఁడె జీవుండు శక్తియుతుండును ఽ అతఁడే దేవుఁ డన ఘనత దిరము
పతితుఁడు నిరతానందస్వరూపి ఽ యతిజనగోచరుఁ డద్వితీయుండు
ధాత మొదలుగా సురకీర్తనీయుఁ ఽ డాతతప్రకాశి స్వాయంభువుండగు
ఆతరమున సర్వంబుదానయై ఽ యేతరంబునం దందనివాఁడగు

జ్ఞాని సుభక్తుని నాని మనంబును | దాను నిరభిమానము గూడ యోగ
మూని గన గోర గోచరుండగును | దాన నొప్పు నిర్గుణ శక్తియుతుఁడు
జననాదు లతని బొంద వాతండె | గనుము యీలాగు శక్తి ప్రభ గొన్న
ననఘుఁడు ముక్తికి నిలయుఁ డో నృపా | విను మిదె యాతని మహిమపరిమితము
తరణి కిరణ రూపము సర్వమున | కర మొప్పునట్లు వాపి గుఱి గాంచి
శరణి యామూర్తి సన్నిధి గనినటు | వరమతులు సుకర్మముల సేవింతు
జనవరా ! యనిన యా కర్మలెట్టి | యొనరుస దెలియఁగ వలె యాచరించు
ఘనుల నియమంబు లే వట్టు నొందు | నన హావిర్హోత్రు డనఘుఁ డిట్లనియె
విను వేదంబులు దనరు విధింపుల | ననుకూలను లా కర్మాకర్మల
వికర్మ ప్రతివాదము లవన్నియును | సకలలోక వర్ణితములు విజ్ఞులె
యకలంకమతిని నిజము గనలేరు | సుకరంబు లివియె కర్మాచారము
లనఘమతీ ! యా కర్మల మెలఁగక | నలఘుపదంబున జొరదగు యత్నము
సులువు గాదు బహుజన్మాంతరముల | వలను నగునేమొ యట్టుల దలఁపక
వలచి విధిచోదితముల శాస్త్రముల | కలన నెఱుంగుచు హరిని సేవించి
భజించవలయును యా దేవు మరియు | పూజించవలయు లోపల వెలిని
రాజి గొన్న మతి పూతచిత్తుఁడయి | తేజ మంది షోడశోపచారము
లను శ్రీవల్లభు సుందరమూర్తిని | ఘనత నర్చించి గంధపుష్పాదు
లను ధూపదీప నైవేద్యములను | వినుతి గూర్చి యర్చించి సాష్టాంగ
మైన ప్రణామమును సల్లించియు | మైనకోలఁది మరి నుతింపవలయు
నా నరనాథుఁడు యీశుఁడే కర్మ | నాని యేమేమి జేయు నేవేళ
లా నిర్ణయంబు దెలుపుఁ డని యడిగె | నా నయ నిపుణుఁడు ద్రమిళుం డిట్లనె
నో నరాధిపా ! హరిగుణకర్మల | నైన విలసనము లెన్నికల నగునె
ధారుణీరేణు కణముల నైనను | తారల సమూహ మైనను గణింప
నేరుపు గందురు ధీరత వశమున | పారము గనరుగ నారాయణు నెడ
గాన తన యాత్మసృష్టిచే మనము | చే నందంబును పంచభూతముల
చే నికరంబగు పురము నిర్మించి | దాని కళ నంది తాన జేరియును
ఘన సగుణ నిర్గుణుఁడై నట్టి పరము | డనఘుఁడె నారాయణాభిధానత
గని మునీంద్రుఁడై వెలయు దశేంద్రియ | మనముల నేకత గను పాలితంబు
లైన యన్నిదేహముల బుట్టించి | దానె సంహార మందించి బ్రోచు
హరి హర విరించి రూపముల నంది | నరవర ! యా నారాయణ మహర్షి
చరితము వచింతు విను మఘహరమ్ము | పరమ మంగళము ధన్యము వరంబు

విను ధర్మునికిని దక్షపుత్రిక యగు । ఘన సుగుణ యువతి మూర్తి నా సతికి
మును పుణ్యాధనము పొందగ బుట్టి । మునిజన నివహము మోదమున నుండు
ననవు గన్నట్టి బదరీవనమ్మున । నను నిలిచె నిష్ఠ లోకశుభంబుగ
పావనతపంబు గావింప జూచి । యేమనో తనకు భీతిగా నతని
చే వర మందెడి తపమును భిన్నము । చేసి నతికింతు ననుచు బలారియు
దివిజకామినుల కాముని దోడుగ । దవులగ నాతని తప్పు మలుపు డని
దివులు గొనకుండని ధీరతను బెంచి । గవయ బంపె ముని చెంతకు నానతి
వనజనాభు మహిమంబు దెలియకను । వనిత లటు మరుడు తమకు బాసటగ
మునుకొన జేరిరి యాశ్రమ తలంబు । మునివరానందకలిత మవ్వనము
వెలసె సుందరము ఆ రాక కలన । తలపున మన్మథజాలమం దొప్ప
విలసిల్లె తరులు లతలు కొలంకులు । కలిమి సౌభాగ్య మెల్ల యం దొప్పు
చందము గూర్చును రసాలబిల్వము । లందమించు ఖర్జూర జంబీర
సుందర కదళీసాల రసాలము । లందం బటులే మందారంబుల
ఘనతరువుల ఫలపుష్ప భరితముల । విను మాలతి మల్లెలు మొల్లలును
పస మించు నట్టి కుసుమ జాలముల । పసిమించు మంజరుల మంజిమలును
రసమాన దిరుగు భృంగసముదాయ । లసితము లగు కనకాబ్జ కల్హార
విలసత్సరోషిహారికల నందు । నల హంసచక్రవాకముల క్రౌంచ
ముల మిధునసందడుల మండితంపు । కలన నొప్పుచును జలముల పూర్ణత
లలి నిర్మలంబు లగునటు గుదురగ । తిలకింప నబ్బురము దోపు మంద
గమనముల సుందరాంగు లటు జేరి । క్రమమున సుకుమారకుల తనువులు
శ్రీమలు వెలువడిన చాలున ఘన ఘ । ర్మములు దిగజార నగవు వలపార
సురుచియొయ్యారముల నా ఋషిని । దరియ నోసరిలు చందము మెప్పుగ
మరుడు విరి శరములను ముందు బరపు । వరుసల చూపుల నాతని నింపుచు
నరవింద ముఖులు అరవిందాక్షులు । నరవిందవాసి కళల మీరుచును
రాగ నది గాంచి నారాయణుండు । యోగమును విడక చూపుల లోగక
రాగహీనుడయి భోగీంద్రశయుని । జగన్నివాసుని భగవంతు విష్ణు
సుగుణ వరిష్ణు లోక రోచిష్ణు । నిగమాంతవేద్యు నిర్మలు నీశుని
తనయందె తానె గనుచు కపలంద । గనక నిదానము తనయం దొప్పగ
మనము సదానందమున లలితను । దనరి వారి గని నవ్వి యిట్లనియె
వనజాక్షులార! జంభారిపనుపు । నను నను జేరెడు ఛాయ వచ్చితిరె!
కుంభద్విహార! వాంఛారంభులు । గంభీరధృతి గల వారలైన

జృంభణం బేల ? ఇట నాకు జూప ఽ దంభరహితులై దోలఁగు టుత్తమం
బన నావనితలు సిగ్గునను గూడి ఽ వినమితశిరులై కరములను మోడ్చి
మునివంద్యుండవె దేవదేవుఁడవు ఽ ఘనత నెఱుంగుట మాబోటి కగునె
వనితలము చపల మతులము కాముక ఽ జనులవలెనె మిము గూడవచ్చుటయు
మనమున గంటివి మా తలంపులను ఽ విన చోద్యము నీ జితేంద్రియత్వము
కలయ బడవు ధృతి చాలు పెద్ద గని ఽ వలపులేని మహనీయ తపంబున
తలఁపు మార్చితివి సంసృతి నందెడి ఽ లలన లాది ధనతతుల భోగముల
నిరసించి కేవలమ్ము నిర్మలత ఽ నరసి విశ్వేశు గొలుచు ధన్యులను
సరసిజ నయనల వాల్యాపులంత ఽ వరతపోధనా ! కామరహితుఁడవె
కాక క్రోధమును గూడ జయించితి ఽ వో కరుణామయ ! నిన్ను నుతిజేయ
నేకరణి మాకు దోపదు మహాత్మ ! ఽ నీకుసరి నీవె తపోవిరాజిత !
కామనిరసింపు గనిన యువ్వారి ఽ తామసతపంబు పల్వలోదకము
వే మన్నించియు వందనము గొనుము ఽ మే మపరాధుల మైతి మది గొనకు
మని మరల మ్రొక్క వారికి తనదా ఽ మనము వికసింపుగా శక్తిమాపు
టను వా రబ్బుర మంద నూరులను ఽ వనితల త్రికోటిగణన బుట్టించె
కని రా యప్సర కాంతలు వారిని ఽ మనమున మెచ్చిరి తనువిలాసముల
కనుల కనుబొమల కర్ణ గండముల ఽ ఘనత పాలిండ్ల కటిమధ్యంబుల
చరణ జంఘోరు జఘనముల రేఖ ఽ కరపద్మములను కంఠ శౌంకంబు
లసితవదన సౌందర్యరాశియును ఽ వరముగా వారు తము మించియున్న
అరుదుగొని యందు నూర్వసిని గొనుచు ఽ సరగున నింద్రుని గని వచించిరా
యనఘుని చర్యను అతఁడూరక విని ఽ మనమున విష్ణుండని వినుతించెను
వినిర యెవరేని ఈ శుభ చరితము ఽ ఘనశుభంబు లాజనులను జెందును
వినుము మా ఋషభునకు నాత్మయోగంబు ఽ ఘనతనె పుట్టను గూరె నచ్యుతుడు
ఖలజనముల బరిమార్ప ధారుణిక ఽ జనన మందు పెక్కుల రూపము గొను
గన మీన కమఠ కిటి నరహరి వా ఽ మన పరశురామ రఘురామ రాము
డనగ బుద్ధ కల్క్యాద్యవతారము ఽ లను దాల్పగలఁడు శ్రీహరి వింశే
వాని నుతింపగ నొక్కఁడు శేషుఁడు ఽ ధ్యానమును బొంద గరిమ గన ఖజుడు
గాన నా దేవుకరుణ గొనియాడు ఽ మాన మెవరికగు నైన భజింతము
సరసిరుహానయన ! నీ చరణయుగము ఽ సురనది జనితంబగు నిగమవినుత !
వరద ! జలధిసుత వర ! సుగుణ కలిత ! ఽ సురుచిని నెగడెడు కనకవసనధర !
సురనికర వినుత ! కుచకలశ లలిత ఽ వరమృగమద రుచి పరిమిళిత హృదయ !

గరుడగమన ! హరి ! రజతగిరినిలయు ఽ వరసతి జపంబ తపోవిలసనా !
కరివరద ! తిమి కమఠ కిటి నరహరి ! ఽ సరసబల నిహిత పదకమల ప్రచుర !
పరశుధర ! దశరథునిసుత ! ఽ శరమున శిరములు పదిగల దనుజుని ద్రుంచిన
వరబలయుతుఁడవు యదుజని జనకుఁడవు ఽ మురదమన కలికలుష సముదయమ్ము
నపహారణమున నతుల నిక్కుడువో ఽ యపవర్గదాత ! యచ్యుతా ! శౌరీ !
కృపనింపగదే! తనువులను మాపు ఽ తపమున మమ్మును జేర్పు మాధవా !
యని సన్నుతి గన బరపి మరి యనియె ఽ వినుము జననాధ ! హరి యవతరింపు
లను లెక్కింప రాదని యంటిని ఽ మనమున సర్వము నతనిగ జూడుము
వినుతి నతి నొసఁగి కృపను చూరగొను ఽ మనఘ తక్కినను దక్కదు వర మన
ఘనుఁడు వసుధీశ డడిగె వారలను ఽ కనెద రెట్టు జడమతులు ధన్యమును
వనరుహనాభుని గుఱుతు వారి కెటు ఽ యొనరు గలదేని దేటపరుపు డన
దనరె వచింపగ నమసుడనుఘనుఁడు ఽ విను మనుజనాధ హరిముఖమునందు
ధరణీసురులును బాహువులందున ఽ నరపతు లూరువులను వైశ్యులును
చరణముల శూద్రులును గుణకర్మల ఽ సరణి గనిబుట్టి యుగములధర్మము
లనుసరంబుగా తరాల నందుచు ఽ గనెద రజ్ఞానగతి చొరవులను
గనెదరు హరినిభక్తిసేవింపు ఽ లను నారులుశూద్రులు గరిష్ఠతను
గాంతురు ముక్తిని నా కలియుగమున ఽ నంతకు నడ్డము నడ్డ దట్టిడుల
వింత గల దిందు కలనారిశూద్ర ఽ లెంతో పవిత్రులు నాల్గవయుగమున
మంతనమున హరి సంతసించు నొ ఽ క్కింత కాలమునె చెంతరానొసఁగు
పతిభక్తిని యా జగత్పతిని మన ఽ మతి నిర్మలతను దలప ముక్తిగను
గతిచాలులిట్టు లాయుగమందున ఽ వ్రతదూరులగుచు విప్రులు మదమున
నిగమముల శాస్త్రపురాణ విధులను ఽ తగవు దలంపక నిందింపును గని
భగవద్భక్తుల పరిహసించుచును ఽ నరయరు దుర్గతి ఽ దరి చుట్టుకొనుట
విను మృదులాన్నము పక్వభేదముల ఽ దనర ఫలరసము లెన్నో యుండగ
దినునవి రొల్లక జంతుమాంసముల ఽ దిన నపేక్షించి క్రూరకర్మముల
కొడి గట్టి దూష్యమగు ఽ జీవహింస కడుపు పూర్తికై పెడమతు లగుచును
వడిగని స్త్రీలను లోలురు నగుచును ఽ చెడిన పుణ్యులయి తా జెడుటె గాక
కడమవారిని జెడుచు సఖ్యతల ఽ జడియుడు పెద్దల నుడుల గర్హించు
టలవాడు మూర్ఖుడిలను మోహితుఁడు ఽ అలమటలు వాని నలముచునె యుండు
తలఁగుదు రెట్టుల నాపాటిజనులు ఽ వలవున హరిభక్తుల నాదరమున
పలువిధార్చనల ధర్మముల నెఱిఁగి ఽ తలఁపు మధురిపుని నిలిపిన ముక్తులు

నన జనవిభుండు వినతి జోడించి ౹ వనమాలియు నెయ్యే వ ర్తనముల
నేయే యుగముల నేరూపములను ౹ న్యాయ మందునో యవియును దెలుపఁగ
మీా యమలచరణములను గతిగొంటి ౹ బాయక ననుగ్రహమును బరపుఁ డన
కరభాజనుండు నా గుణధుర్యుఁడు ౹ వరమతీ ! నరాధిపా ! విను ధన్యము
హరి క్రూరదనుజ దుర్మదవిదార ౹ పరిణతిఁ బహుతర రూపనామ
పరత గుణకర్మ సహితమతి యగుచు ౹ పరిపాటి గాంచు కృతయుగమునందు
ధవళవర్ణుండు చతుర్బాహుఁడును ౹ పవిత్రవంతయు నిర్మలంపు నడ
భువులు దీపింప హంసపటిష్ఠత ౹ దవిలి జటావల్కల కృష్ణాజిన
ముల ను త్తరీయ జపమాల కమం ౹ డలము దండమును ధరించి తపముల
వెలసిన గరిష్ఠమతు లగ్గింపఁగ ౹ నలరునందు నీకాలముల నతని
జనులు యశోమునం దింప బలికెదరు ౹ వినుము హంసుండు సుపర్ణుఁడునుగా
దనరు నిటులలె వైకుంఠుఁడు ధర్ముఁడు ౹ ననఁగ యోగీశ్వరుఁడు యీశ్వరుండు
ఘనమటుల పురుషుఁ డవ్యక్తుండన ౹ వినుమిక పరమాత్ముఁడు దివ్యము
లగు నామంబుల నుతి గూర్తురు రెండగు ౹ త్రేతాయుగమందు ర క్త వ
ర్ణమున తానొప్పి చతుర్భుజములనె ౹ క్షమముగాంచి వేదముల మాటిచే
సమమతి రూపున హిరణ్యకేశుఁడు ౹ నమలతను స్రుక్స్రువా ద్యుపలక్షణ
విలసితుండునయి విష్ణుఁడు యజ్ఞుఁడు ౹ అలకృపీటభవ పృశ్నిగర్భులన
వెలయు మరియు సర్వదేవుఁడనగా ౹ తలఁతు రవ్యయుని నురుక్రముండని
విను వృషాకపియు నురుగాయుఁడు మఱి ౹ బయుతుఁ డన బ్రహ్మవాదులను
ఘనత దను గూర్చి పిలువ నలరు గను ౹ జనవరా ! ద్వాపరమున శ్యామవర్ణ
మున నొప్పి కనకవసనధరుఁడునయి ౹ గన రెండునైన బాహువుల దనరి
పరముఁడు దివ్యాయుధముల ధరించి ౹ యురమున కౌస్తుభమణిహార మొప్ప
వరుస వనమాల కడు రాజిల్లగ ౹ ననయ శ్రీవత్సమును చిహ్నముగని
రాజిల్లు మహాప్రభు లక్షణముల ౹ యా జగద్వల్లభుఁడు విష్ణుమూ ర్తి
యో జనపాలా ! యాఖ్య లవియు యగు ౹ పూజితమందగ దెలియు మవ్వియును
విను వాసుదేవ సంకర్షణు లన ౹ విను మటు ప్రద్యుమ్నాని రుద్ధులన
గన నారాయణ విశ్వరూపులన ౹ ఘనత సర్వభూతాత్ముఁడన బలికె
దరు నరపతు లాదిగ సర్వమునులు ౹ వరుసను కలియుగమున కృష్ణవర్ణ
మెరుదంద గాంచి కృష్ణనామమున ౹ నరసఖుం డగుచు దుష్టహననుఁడయి
కరుణ భక్తజన రక్షకుఁడగుచును సరసిజనేత్రుఁడు యజన కీర్తనల
హరి రామ కృష్ణ నారాయణు లన ౹ లన నరహరి కంసారియు కమలనాభుఁ

డరయ శ్రీధరుఁడు నిటు నెన్నిక గను | ధరణిభేదముల మూడిట యశో మటు
విను మీ యుగమున ద్రవిడదేశమున | దనరు తామ్రపర్ణియను తీర్థమున
కనఁగ నహ్యజా కృతమాలాదిక | ఘనతమిన్నందు నదుల దోఁగి యట
తన పితరుల నర్చింప పుణ్యములు | తనుడాయు నఘములవి బారగలవు
మనుజేశ మఱియు కావేరి మొదలు | మునుల గుర్రికులను తపములు సలిపెడు
నొనరు గలయట్టి తీర్థక్షేత్రముల | కును జేరి భక్తి దానశీలురయి
వనజనాభు భక్తులను దర్శించి | మునుగొని భాగవతుల చెంత గనుచు
నొనరున హరినుతి సలుప పాపచయ | మును మాపవచ్చు జెడని పద మబ్బు
వినుమిక మా నియమము చాలు లంద | ననుసరించెదము గనుము మోదంబు
నా జనవరుండు నతులనర్పింప | రాజితు లగుచును స్వేచ్ఛను గాంచిరి
రో జనవరా ! పరీక్షిత ! వారక | యజితు నచ్యుతిని భజనల మెలగుము
రాజ ! యాఋషభసుతులు పవిత్రుల | నోజబూని తలపంగ మంగళము
పూజించెను యావిదేహభూపతి | భ్రాజిత పదంబు తా నందమించె
ధన్యుడయె నతఁడు జనులెవ్వరేని | మాన్యమతిని నీచరితంబు వినిన
శూన్యములు దురిత సంతతులు నిజము | అన్యమెంచకను హరిజేర్చురక్ష
ననుచునారదుఁడు వసుదేవునకును | వినిపించె జనక ఋషభపుత్రులకు
వనజనయనుగను యోగ్యప్రసంగము | లను గుదురు బోధ యధ్యాత్మవిద్య
యనఘుఁడు మరి యనె వేదండవరదు | డెనయ నీకు జనియించె నీతపము
ఫలించె నిజముగ వగపేల ? నీకు | చలించ వలదిక హరిలీల లన్ని
నిలింప సన్నుతములు వింటివింక | దొలంగె దుఃఖము ముక్తి నీ నెలవు
భవము ధన్యముగ భవాబ్ధి గడిచితి | వవలసంసృతిని గూడ చెప్పెదను
భువన ముల భవుల మూలము కృష్ణుఁడు | మువురగుశక్తుల కాశ్రయుం డతఁడు
అవతారమందెఖలుల హరింపఁగ | దవిలి వారి దునుమాడె శిశుపాల
ముర నరక పౌండ్ర కంస యవనులను | వరుస పూతనాదుల పెక్కండ్రను
దురమున హరించె మరి ధరణీశుల | నరుఁడె యనకు నీ తనయుఁ డనంతుఁడు
అరులటు హరిపద మంది రవ్వారె | కరము తపోనిధి వగు నీకు నట్టి
దేవుఁడు సుతుఁడట వెఱపేల ? నీకు | భావము హరిదెస గూర్చు మిదె యొనరు
నావిని వసుదేవుఁడు దేవకియును | దోవ దెలిసి రాయబ్జనేత్రునిది
పావనచిత్తులు బంధ విముక్తులు | శ్రీవరుని శక్తి యుక్తులు సత్యము
అనిమిషుడు జెప్ప విని పరీక్షిత్తు | వినయమున నడిగె నవ్వలి చర్యను
విన జెప్పుమింక యాదవసంతతి | కనిన యవస్థలు | బ్రహ్మాదిసురలు

వనజనాభునిఁ నిజపదము జేర్చు § వనువులను దేవుఁడు గన్న ముదము
హరిచరిత లెట్టుసాగె నుద్ధవుని § పరమభాగవతు నేమి బోధించె ?
పరముని సార్థక బోధవిస్తరపు § సరణి నెఱిగింపు సంతసము జెందు
ననిన శుకుఁడనియె నాతని గనుచును § వినుః విరిఞ్చి సురమునిసిద్ధగరుడు

## —: బ్రహ్మాదిదేవతలు శ్రీకృష్ణుని వైకుంఠమునకుఁ బిలువ వచ్చుట :—

లను, చారణ విద్యాధర హారాదు § లనుసరింపఁగా హరిని స్తుతించుచు
సరసత డాసిరి ద్వారవతి నున్న § పరముని కృష్ణుని బంధవిదారుని
దురితమోచనుని నీశుసర్వేశు § నరుణకోటి సంకాశతేజు గని
చరణముల ముట్టి నిలిచి వినుతించి § కరముల జోడును గూర్చి యిట్లనిరి
యభవ! సర్వేశ ! యఖిలలోకేశ ! § యభయదాత ! వరయంగ పురుషవర !
శుభదుడవుదలఁప సుకృతస్వరూప § నభమునవెలుఁగే రాజీవచరణ !
పరమానందా ? వరద! ముకుందా ! § నిరతశోభనము నీదివ్యస్మరణ
సరసగుణా ! యాదవకులమణి ! హరి ! § వరభక్తపారిజాత నరసఖా !
యను యశము ధరణీ వెలయించితి విక § దురితతండములు సమసె పని దీరె
తలఁపు పంచవింశోత్తరశతాబ్ద § ములు జనియె నీవు జనియించునాది
కలియుగము దారు తరుణ మిదియనుచు § దెలుపవచ్చితిమి సెలవేమొ ? దెలుపు
నిలువ దలఁతువే ? యటు లొనర్పదగు § లీలామూర్తివి నీచిత్తమేమొ ?
విన వేంచేసినవార మింతయే § వనజనయన ! నీ యాజ్ఞ మా వరము
వినిపింపు మనఁగ చిరునగవు గనుచు § వనజాసనశంకరు లలర సురల
గని వత్తు నింక వైకుంఠనగర § మునకు నావిజయమందున జాటుడు
పని దీరు నింక యాదవు లమరులు § తనువుల నన్యోన్యము విరోధముల
కనలున మీరుచు ధరణిని వదలియు § నొనరున తమనిజపదవుల గనెదరు
ఇదెయొకటి ధరణిభారము దీర్చుట § ఇదియలోపంబు దెలుప సమయ మిదే
ఇదె నా యానతి నా రాక మదిని § సుదినము నందుట అట ముదము నింతు
నని హరి బలికిన విని బ్రహ్మాదులు § మనము లలర జేజేలు మరలి తమ
యునికి గలతలము లలంకరించిరి § వనజనయను డాడిన భంగి జరిపె

## -: శ్రీకృష్ణుండు దుర్నిమిత్తంబులం గని యాదవుల నెల్ల ద్వారకనుండి ప్రభాసతీర్థమునకుఁ బంపుట :-

ఇట ద్వారకలో నుత్పాతంబుల § తట మొల్లెడలను నల్లుకొనె నిటుల
చటుల మందె యాదవుల మనంబులు § కుటిలముల వృద్ధిలోపల నొప్పిరి

కనకసౌధముల కాకఘూకములు ఽ కనఁగ జేరి పవళులనె వాపోయె
కన నగ్నె నశ్వవాలములబుట్టె ఽ ననల మన్నంబు మొలచె చిత్రముఁగ
వినుము జనపతీ! యటుల మరికొన్ని ఽ ఘన భయదము లయి కాన్పించె నిట్లు
గనఁగ శుక శారికలు రాత్రి నెగసి ఽ విన నెగటు గల్గు స్వరములను బలికె
గనెను మృగంబులు వేరొక జాతిని ఽ యొనరు జెడ బుట్టె నుత్పలము లిండ్ల
ఇనుని బింబ మది ఛాయ వేరయ్యె ఽ నని యాదవసంతును హరి పిలిచి
కనినారే యీ యుత్పాతంబుల ఽ చనుడింక మీరు ఇటనుండి కీడు
మన కగు ప్రభాసతీర్థము జేరుఁడు ఽ వినుడు విధిలిఖితమును దాటగలమె
యనిన మంచి దని తరలి రవ్వారు ఽ గనిరి వేగముల గరితురగాదుల
తోడ సర్వముల గొనుచు నచ్చోటు ఽ వీడ కళ దప్పె నుద్ధవుఁ డదిగని
తోడుగొన్న విజ్ఞానవృద్ధు డతఁ ఽ డాడంబర శూన్యుండు శ్రీకృష్ణు
జేరి పురము రుచి దప్పెను శౌరీ! ఽ యో రమాధిపా! హరి, దీనకల్ప
పరేశ! యదువంశాగ్రణి దేవా! ఽ సారయోగి సందర్శితచరణా!
నాకు నీవె దిక్కగుదువు గాదే! ఽ నీకు శరణంబు వేడుచుంటి నిదె

### -: కృష్ణుం డుద్ధవునకుఁ బరమార్థోపదేశము సేయుట :-

యో కమలనేత్ర! యాదవక్షయము ఽ గా కడఁక గూర్చి తరల నెంచితివె
యేవిధిన నునికి నన్ను జాతు వొక్క ఽ భావమున నిన్ను వదలియుందునే?
నిను నే మఱవను నను కరుణ గనుము ఽ వినఁగదే నిన్ను మఱవబోము మ
జ్జనభోజనశయనాసనముల ఽ పినతనమునుండి యెడబా టందము
గనవ నీసేవ పరుల మమ్మిందు ఽ వనమాలధరా! నను ముదము నింపు
మన విష్ణుఁ డనియె చిరునగవు దోప ఽ వినయధురీణా నాయన్న! వినుము
మును వనజాసను వినుతి నే ధరను ఽ జనియించితి నా లీల వెలయింప
మునుకొని ధరణీభారము మాపితి ఽ గనెద నింక నా నిజధామంబును
నేటికి నేడవనాటి ద్వారకయు ఽ వాటపు గీటున నంబుధి ముంపును
మేటి శూరులగు యాదవు లందరు ఽ నాటికి క్షయమును బొందుదు రయ్యా!
కలియుగంబు రానగు తరుణ మదియె ఽ నిలను జనులు ధర్మమును వొల్లఁగుదురు
కులముల దగు నాచారము శూన్యము ఽ తిలకింపరు సుజ్ఞానపరంబుల
అతిక్రూరు లగుచు మందబుద్ధులయి ఽ మతి కపటంబుల రోషముల గ్రాలి
అతిరోగంబుల నల్పతరాయులు ఽ గతిని నిష్ఫలారంభులు నోచును
గన నాస్తికులై యొండొరు మెచ్చక ఽ జననీజనకుల బంధుస్నేహముల

ననుకూలత విడనాడి ద్రోహులై ఽ ధనాదిసంగ్రహమున తనువు మఱచి
మనెదరు నాకాజోలి యే లనుచు ఽ గనుము నిర్మమతసర్వుల సత్త్వము
నను ననురాగము బంధమోక్షముల ఽ కును కారణంబు నిత్యమున గనవు
ఇందలి జీవపదార్థము లెక్కయ్యు ఽ ముందుగను తెఱువు నందవలెనంటె
నంద మింపు గాను విరక్తి యన్నిట ఽ గందు పన్న మోదంబు కుం దడఁగ
పలువిధకామములను గుణదోషత ఽ చలనమంది మోహంబు నడంపక
కలజీవగణము కాఱియను బొందు ఽ విలసిత జ్ఞానుఁడవై నీ వట్టుల
దిరుగుడు పడకను హస్తిపకుం డెటు ఽ తరము గాసి మత్తగజమును గట్టునో
వరుస నింద్రియోపేత మనమ్మను ఽ స్థిరత వెలుఁగొంద నరికట్టి యువల
పరము గన్నట్టి యీషణత్రయమును ఽ కరము విసర్జనమున సుఖదుఃఖము
లను నిర్లక్ష్యమునఁ గూర్చి సమత ఽ గనిన జగంబుల పరమాత్మ లీల
లనుచు ప్రకృతి పరిచరము లన్నింటి ఽ ఘనుఁ డా యాత్మని విలసితములె యని
దెలిసి యాత్మానుభవ తుష్టి గనుము ఽ వెలి బోకు మోయి నాహితుఁడవు గద
విలపింపవలదు వలయు నీకేది ఽ దెలుపుమా యనిన మాధవున కనియె
జలరుహాలోచన భవశరధితరణి ! ఽ యల సన్న్యస్తమునంద తర మగునె
యందరికి దేవ ! నీ మాయచేత ఽ పొందిక గను నీ పామరుల కట్టి
చందము దుర్లభమను తలఁపందెను ఽ ఎందు మనము జేర్పంగ మోక్షమను
సుందరభవనమునం దొప్పగలదు ఽ మందమతి దోగు సందు నెఱిగింపు
ధాతాది దేవతాసముదయంబు ఽ లే త్రోవ దప్పి భ్రాంతి గందు రను
నీతత్వమ్మును దెలియు సుమతులకు ఽ పాతకముల బడలుట దూరమగును
పరమభాగవతు లామ్నాయవిధుల ఽ నిరసనంబు ననుసరణ మట్లు మరి
హరి ! నీదునామ స్మరణ విశిష్టత ఽ పరిచయంబు సర్వాశ్రమ పరులకు
దురితము లడంచు దయ నిగిడింపుచు ఽ సరణి గురుండవు నీవె నాకరయ
నన కంసమర్దనుం డిట్టు లనియె ఽ తనసేవ నలరు నా యుద్ధవునకు
విను పురుషరూపుడగు నీయాత్మని ఽ కిని గురుండు నా యాత్మఁడే యగును
కుపథ వృత్తి చరియింపక నమ్మిక ఽ విపులార్థ మిదియెగా సుగతి గనుము
నిపుణులై మునులు సాంఖ్యము నెఱిఁగియు ఽ రిపుల మలపి యా ధ్యానమున నన్ను
సకలమూలగునిగా సన్నుతించి ఽ వికటులుగాకను దురిత నికటంబు
సుకరముగ ద్రోచి కూర్చి మోక్షమును ఽ ప్రకటితమ్ముగను వాసము గందురు
విను మనేక పరములు నెనిమి దాఱు ఽ గను నాల్గు నొకటి గలవాని కన్న
జనులు రెండుపాదముల తిరుగుటల ఽ దనరి విజ్ఞానకలిత సూత్రములె

యొనరుగా గలిగి ధరణి యుత్తమం § బన ప్రాణిజన్మ గాంచ నొప్పెదరు
వారల నిరంతరము యోగంబుల § గూర్చి ధ్యానించు యోగు లుత్తములు
వారల మిక్కిలివారు నగ్రిమ్యు § సారస్వరూపుని నచింత్యు పరముని
ననంతు వన్నే సత్వగుణరూపు § గనంగ నిశ్చలు నిర్వికారునిఁ
మనోంబుజమునఁ నా చరణాబ్జము § కనంగ నేకముగా నిలిపి మఱియు
పరమాత్మజీవ సమ్మేళనంపు § వరుససిద్ధిగా విశుద్ధ భక్తిని
పర శంఖ చక్ర గదా ఖడ్గముల § బరువడియు శార్ఙ్గమును కౌస్తుభమణి
ధరించు వానిగ భువనరూపునిగ § కరంబు నెమ్మది గను భావంబున
స్మరించుటుడుగక తరం బిటుల గన § నిరంతరం బవ్వారల వరములు
పరమవిజ్ఞాను లనువారు కారె § సరసమతిని వినుమొక యితిహాసము

—: అవధూత యదు సంవాదము :—

పరమధర్మ మెరిగించునది శుభము § నరయు నిను గూర్చు నిర్మల చిత్తము
నాక పదునాలుగవతరము ముందు § పాకరిపు తుల్య వైభవ కలితుఁడు
ఏక గొని వివేకమును గూర్చు గని § యేకరణి ముక్తి గన నగునో యంచు
దలఁచుచున్నంత వచ్చె నవధూత § యతి శంకరువలె మునివేషధారి
యలరుచు యదువను పేర జెన్నొందు § చలనరహితుండు నాతాత యతని
గని నతి యొనర్చి మతివికసిల్లఁగ § యనఘ ! యెటనుండి వచ్చితని యడుగ
విననాడె యతఁడు అబ్బుర మందగ § విను నేను నిర్మలుల విజ్ఞానుల
ఘనుల నిపుణులను గురువులను గనుచు § వినువా రిరువది నలువు రయ్యెదరు
మనుజవరా ! విజ్ఞాని నైనైతి § నన యదుప్రవరు డాతని గాంచియు
వినిపింపుము మహనీయ కామాదు § లను వర్జించియు జనార్దనుని గను
తెరు వేది సెపుమ దయామతీ ? యన § సురు వార్ష్ణమున న్నాతఁ డిటు పలికె
పర ధనదారల పరదూషణములు § పరవస్తుచింత పరిహరించియును
వరుసగను పుడమి రోగము లట్లనె § కరము తెన్నొందుటకు ముందుగనే
తనువు మానసేంద్రియము చంచలల § తను గూరక మునె బుద్ధి పటుగాక
మును పే గళమున శ్లేష్మము గదియని ? మునుమునను శక్తి యుక్తులు బలంబు
లును సన్నగిలుటకును ముందుగానె § వనజాక్షు దైత్య భంజను శ్రీశుని
ననుసంధింపఁగ భక్తి మనమ్మున § గనవలె స్థిరమ్ము దురితధూమకే
తువ్వులు నగు నట్టి హరిచరణమ్ముల § దవిలిన నుతింపు పవిత్రవంతము
సవిధి సమయమునా గను యత్నమంద § గవయునగు ముక్తి సత్వ మియ్యదియు

కాంతలాది సంతతులన్ని తనకు § ఎంతకాలమున చెంత నమరునో
వింతగాదు గద ధనతతు లట్లనె § అంత చింతించు వాని వియోగత
నంతలో ఘోరదశ జేరు తన్ను § సంతరింప నయ్యాన్ని వ్యర్థములె
నీతివివేకత తా గాంచఁడేని § యాతనను బొందు తాప మెక్కుడుగ
నేతరమున మృతి దప్ప బోడొక క § పోతమువలె దా కీడును బొలఁగడు
వనమునను నొక్క కపోతరాజము § దన సంతానములును నివసింపగ
ననువైన నికేతనము నిర్మించు § కొని దాన వసింపుచు నుండి కాలంబు
జనఁగ భోగానుభవమున తీవ్రత § ననురాగాతిశయము తర మెక్కువ
గను జుట్టుకొనుచు నాహారముగొన § దన సంతాన సతీయుతంబుగా
నొక లుబ్ధకుండు ఉరు లొడ్డియుండ § వికటకాల మాసన్నము రాగను
నికర సుత మోహ పాలిత కపోత § మకట దగులందు తన సంతు గాంచి
ధీరతయు జెడఁగ వారికై యేడ్చి § కోరి తా నందు జేరి గృశించెను
గాన మోహంబు పెద్ద గూడినను § దాన దుఃఖమయ మానం బందెడు
ధ్యాన మా హరిని గూరిచి ముక్తిని § గానవలె విరాగము చొప్పు వినుము
విను భూ గగనానిలజలాగ్నులను § విను మల్లె శశిభానుకపోతము
లను తిలిప్స వనధి శలభ భృంగము § లును మత్తగజము ద్విరేఫ హరిణము
లను పాఠీనము పింగళ కురరము § విను మిక డింభక కుమారి శరత్
తుల సర్ప లూత సుపేశకృత్తుల § వెలయు వీని సముదాయ వృత్తులను
వలపు గొని వాని గుణముల నెఱింగి § వలపును విడచితి నని యతఁడు దెలిపె
విను మీ వివరం బనుచు మఱి బల్కె § ఘనత భూమిచే సైరణయు గంటి
ననిలున పరహితమును నాకాశము § నను కాలసృష్టి గుణసాంగత్యము
వనమున శుచినిర్ అన్ని నిర్మలత § గన శశి భానుల అధి కాల్ప సత్య
మున జీవ గ్రహణ మోక్షంబులునర్ § వనితాది సఖ్యమును గపోతమున
అజగరమున స్వేచ్ఛావిహారముల § భుజ మంద గంటి మరి ప్రాప్తభుక్తి
భజింపు గంటిని జలనిధి వలనను § నిజంబు వెలయగ నిందు ముదమ్మును
త్యజించితిని నద్దాన శోషణము § అజస్రమును నట్లుండు మలయకను
విను శలభమునర్ శక్తి కర్మ విధి § గనఁగ భృంగమున నన్నిట సారము
వనితావిముక్తి గజమున నెఱిఁగితి § ధనసేకరంబు తేనెటీగచే
హరిణమువలనను చింతాభరంబు § వరుస మీనమున నాలుక చపలత
సరణి యుధాలాభపు సంతుష్టిని § వరమతిని గన్న పింగళ వలనను
కురరము వలనను మోహత్యాగము § పరము గంటి నిర్వ్యాపార మర్భకు

వలన కుమారికచే సంగరహిత ఽ మల శరకారునిచే నేకదృష్టి
దెలిసితి వసింప పామును గనుచును ఽ కెలసన మందితి నూర్ణనాభిచే
తను నిర్మాణము గని మానసమున ఽ వినుము కణుందుకువలన లక్ష్యగతి
ననుసర మందెను జ్ఞానలక్షణము ఽ ఘనుల మనము లిట్లొప్పు నని వాని
నిలిపితి నా నడలందు జరింతును ఽ కెలకు గవనీను కామాది రిపుల
కల జీవితంబు పుట్టువాదిగా ఽ నలము జరామరణంపు వర్తనలు
ననిలు వశమనుచు దలఁపున నిశ్చల ఽ మును గూరినాడ కర్మల పరంబు
వనమాలి కర్పణం బంచు నెంచి ఽ మనమును నరికట్టితిని వశంబున
మితభోజనంబు నాత్మసంతృప్తి ఽ గతి నందువాడ సర్వసముఁడగుచు
వెత లందక త్యాగమున రాజిల్ల ఽ సతత మనక తనువులను స్వేచ్ఛలను
నతికించును వినుమింత హరిమయం బతని భజించినదే యాత్మనిష్ఠ
జనవరా ! మోహవాహిని గడచుట ఽ కును నావ విష్ణుపదచింతనంబు
కనకాదులందు పేరాస గొన్న ఽ ఘనపదము సున్న అది వదలరన్న
వెలయు నా వెన్నునిఁ గాంచు మున్ను ఽ గల కర్మము మంటనుగలియు గన్న
లలర నా సన్నుతాంగుండు దన్న ఽ చెలువంబు మిన్ననఁ మూర్తి గూర్చ
ఇందున కొక చరితం బుపమానము ఽ అందక త్రైయొకటందె నివసింపు
మందిరము మిథిల నా నొప్పు గన్న ఽ నది వేశ్య సుందరంబు పుర మదియు
ఇందువదన మఱి కుందరదనయును ఽ బంధుర కుచయును తుందిలము పెద్ద
చంద మట్టులే మందపు కొప్పును ఽ మందహాసంబు మందగమనంబు
చిందు సోయగము కళ లా సుందరి ఽ యందు ధనాఢ్యులు నగు విటకాండ్రను
సందు నందించుకొను కులుకులాడి ఽ యందెల మ్రోతల ముంగిటను నిలిచి
పొందు నిచ్చు దన ముందర దిరిఁగెడు ఽ సుందరపురుషుల మనము లాగికొని
ధనము గ్రహించును మిక్కుటంబుగా ఽ వనిత తన కబ్బువాని కంటెనుఁ
ధనసమృద్ధిగను మతమున మోసపు ఽ దనము కొడిగట్టి వీధులఁ దిరుగుచు
నను వచ్చె నేని వంచించు మున్ను ఽ దనను వరించిన వాని కను మఱపు
కన నాయువతియు నొక్క నా డట్టె ఽ తన యింటివాకిటను గాచి యుండె
దను డాయవచ్చువా డెవడు రాని ఽ యనువున విచారమునుబొంద వనిత
అనయము ధనమును గూర్చ నెంచియును ఽ గనను నిద్రయును సుఖలేశంబును
వినుమరియు కామవిషయేచ్ఛకలత ఽ గని బేల నైతి దృష్టిని గావనె !
యకటా ! పాపము ! నా చాలు వంటె ఽ నీ కలత బాయు టెటుల దైవమ్ము
నేశరణి బ్రోవు మని వేడుధాన ఽ నా కమలాపతి రక్షించుటెట్టు

కపటవృత్తి మిది గరిమ గనరాదు ఽ విపులదుఃఖ మాకరము కామంబె
విపరీతముగా ధనాశాపీడి ఽ తాపహాసమును బొందితి నయయో !
యపవర్గదాత నతిగూర్తు నింక ఽ యిపుడే మానితి నావృత్తి మంత
మిథిలాపురమున నేను హీన నయి ఽ పథ మిదిగా జీవించుట రోసెద
పృథివీభరణుని సేవింతు బ్రతుకు ఽ వృథ కాలమున్న వైరాగ్యమ్మనె
వసతి గొందు నీ తనువు సొంపేల ఽ నుసిపుర్వులతో విణ్మూత్రమ్ముల
కసిమసిగా గొన్న కుక్షిచర్మమ్ము ఽ పసి నిలుచు నెముల రక్తమాంసాది
కముల కంపుగొని పైపూతలచే ఽ భ్రమ లందించును చాలు చాలింక
అమలు నచ్యుతుని రమానాయకుని ఽ సముని సచ్చిదానందు సర్వేశు
జగములన్ని తనయందె రమింపఁగ ఽ భగవంతుఁడైన వానిచిత్తమున
బిగువందు భక్తి దక్కించు కొందు ఽ జిగిగాంతు నతని మనమున రమింతు
నింతకు నద్దేవుని బుద్ధి నిలుపు ఽ వంతున మంటిని యానందంబే
సంతు గని యందు నైన నేమాయె ఽ యింతట నుండియె యది యనుభవింతు
నిట్టి బుద్ధి నే డందుట పూర్వము ఽ పట్టునఁ గన్న సతికర్మఫలము
దట్టమై యుండుటను గంటి నేమొ ! ఽ చుట్టమయ్యెనది నన్నుద్ధరించె
నని లోని కటిగి శయనాదు లన్ని ఽ గని విసర్జించి మనమును నిలుపుచు
తనువు విద్యుత్తునుఁ బోలు ననుచు ఽ వనజనయను నైక్యంబె నిత్యమని
ఘనత నించు ధ్యానంబు నచ్యుతుని ఽ గన యోగమంది ముక్తి నింబొందె
అనంతవైభవ మందె నాయువతి ఽ యనంతకాలము మేరతనువునఁ
గని యందు జొచ్చి ముదిత ముదమ్మున ఽ వినుము నీ వట్లు హరిని భజింపుము
మోహ మెటు దొలగునన్న విరక్తియె ఽ దేహ మనిత్యం బని తెలియుటె యది
యూహానిలుపు ధ్యానంబెముక్తియు సుఖోత్సాహము నందుటె యానందగృహము
నందువసింపఁగ గోరి గేహముల ఽ నిందున వడలియు మోహమును గోసి
సందుగొందు రానంద మిప్పుడే ఽ యెందు నెందు మెలగిన యోగీంద్రులు
నరనాథ ! యొక్క సుద్ది వచియింతు ఽ పరమశుభం బొడగూర్చు నా నడక
మురు పొందించును ముఖ్యనిలయంబు ఽ సరణి వినెదు సిద్ధమున మనముంప
కనకావతీపురము నా నొక్కటి ఽ ఘనత గని యుండె పురాతనంబున
దనరు నందొక్క ధరణీసురుండు ఽ తనకు తండ్రిగా జననమందె నొక
కన్యారత్నము సద్గుణకాంతి ను ఽ పన్యసింపగా సిద్ధి నెఱుఁగనిది
ధన్య లామెనడ లెన్నడివారలు ఽ మాన్యమ్ములె యా యమ్మ పనులెల్ల
యామెను గాంచ వరించు మనమ్ముల ఽ నోమిన ప్రియమున బంధులు కొందరు

నా మహీసురుని గృహమును జేరిన § నామె వారి కానందము గూర్పఁగ
పరమంది యుంట భుజించనన్నము § తరుణమున సిద్ధముగ నందులకై
సరగునను తండులముల దంపంగ § సురుచిరోత్సాహ భరితయై వాని
వేసను గైకొంచు రోటిలో బోసి § ముసలమును కరములను బూని యట్లు
పస నందించఁగ దంచు చున్నంత § పసి మించు తనువు గల యా కొమ్మయు
తనకరములందు మెఱయుచున్నట్టి § ఘనతరరత్నపు కంకణముల ధ్వని
తనమదికి లజ్జదోప నది యుడుపు § యొన లేది యనుచు గనె నొక యుపంబు
పర మవి తీయుటె యని యన్నిదీసి § తరమొక్కటియుగ కరముల నిలుపుచు
తరుణి సంతోషమందె నందునను § తరుణోపాయం బది యగు గాదా !
నరవర ! పరమాత్ముని నట్లే కని § పెర తలఁపు లణచి యేక మతి యగుచు
స్థిరచిత్తమ్మున సంగమును గనుచు § ధర యోగము గొన ముక్తి సులభంబు
అనుచు బోధ గుదురంగ వినిపించి § కనికరమ్మునను మాయాపరం బీ
క్షనన్నైన వస్తు పరివారములను § జనులు విరక్తిని మోక్షమును గనెద
రని వచించి యదుప్రవరుని మ్రొక్కుల § గొనుచు సంయమియు నిశ్చైనందెను
విని నీచరిత్ర యదువవధూతచె § మునుమున విన్నది విన భవదోషము
లను నొంద రట్టి పుణ్యులు హరిపద § మొవరుగా నంద నుంచును ముదమున
వినుమో ! యుద్ధవ ! హరిని సమత్వము § గనుమా ! మనమున హరిని నేన యన
మనమ్మున ప్రమోదం బుట్టివడ నడిగె § వనమాలిని శ్రీకృష్ణుని నిత్యునిక్
వనజనాభ ! నీరూపము గాంచఁగ నను వే § ది ? నాగ భగవంతుఁ డనియె
విను దయారతిని భూతముల గనుచు § మనమున నతిశయ నిద్ర భోజనము
విను ఘటె సంభాషణము నత్యాశ § యును నతిశయమును నతికోపంబును
గనక సత్యమున నిలిచి సుకర్మల § వనజాక్షునకును తృప్తి నందించి
త్రికరణశుద్ధిని గనినట్టివాడు § ప్రకటిత నుతి భాగవతులగు వారలు
అనువు జెప్ప నవతార చరితలను § వినుచు భాగవత జనుల సేవించి
కనగన్నుపూజల వారి మెప్పించి § తన కలిమికొలఁది భోజనాదు లిడు
నట్టి వార లెప్పటికి దురితముల § నెట్టెను మహితను గన కొప్పుచు నా
పట్టు సాధింతు రవ్వారి పక్షుఁడ § చుట్టములకన్న ప్రీతి వారిపై
నాకు నుద్ధవా ! వినుము నామతము § ఫీకను గొని యర్పించి నుతించిన
నాకరము వారి శిరమున నుంతును § జోక నొసఁగుదును నాచక్రింబును
ఘనులు సనకాది యోగులు మరియును § జనవరుఁడు నంబరీషుఁడును మఱియు
దనుజవరుఁడైన విభీషణుండును § యనఘుఁడైన ధ్రువాంగదుండును

మునులు జనపతులు దనుజులు మఱియుఁ § జనుల ధరణీసురు లాదిగ నెల్లరు
మునుకొన్న భక్తి సగుణరూపంబు § నన వెలిని పూజ మనమున ధ్యానము
నిరవు కొనువారి నేమరసు బ్రోతు § నరయుమా విధిని నీవు శ్రద్ధ గొని
యనిన నుద్ధవుఁడు స్వామీ ! కేశవ ! § నిను భక్తిని ధ్యానించి గోపికలు
ఘనభక్తి నిల్పి యోగమున తుష్టి § గని రట వింటిని నీచే నొకపరి
ధ్యానమెటు నిలుచు కలత యుడుగు నెటు § ధ్యాన మేరీతి గూర్పఁగ వలయును
ధ్యానాంగరూప మేపగిది దలఁపు § ధ్యానసిద్ధి నెకూరు వచింపవే !
దీనశరణ్యా ! న్యాసరహితముగ § మానము నందెద నీ స్మరణ గనుట
యె నగు నాదిక్కు గనుము మహాత్మ ! § నీ నయరూపము నాయెడ నింపుము
నా విని నరకాంతకు డైన శివుఁడు § పావనహృదయ నివాసిత దీప్తుఁడు
దేవవినుత శౌర్యోద్భాసుఁడు § నైన పరమేశ్వరుండు నతని కనె
నో వినయసుందరా ! యుద్ధవ ! సుమతీ ! § జీవుఁడు సర్వశరీరము లందున
తావ నంది యుండు సూక్ష్మరూపమున § పావకుఁడు దారు నందిన సూటిని
కేవలుండు నచ్ఛేద్యుఁడు మఱియును § భావిభూతముల పీన నశింపడు
దేవదేవుకళ నాతం డంచుట § కేవలం బటుల నదాహ్యు డౌచును
చేవ గను భావమున నశోష్యుఁడగు § జీవేశ్వరులకు భేదము లేదను
పాదున ధ్యానము నిలుపు నుడువుటల § నీదు హృదయమున నేను నిలుతు నన
యో దయానిధే ! సనకాది మునుల § కాదికాలమున నీ చెప్పినట్టి
యోగమార్గవిధి యేది యది విందు § నోగు దూరముగ సెలవి మ్మదియే
భోగీంద్రశయన ! శ్రీకృష్ణ ! దేవ ! § నాగురుమంత్రము నీపద చింతనె
నా విని యీశ్వరుఁ డనె నాతని కిటు § ఆవిధిని వార లడిగి రే విధిని
నావలన గాదు దాని వచింపగ § నా వింటి నేను నచ్చుటనె హంస
రూపమున వారి కందరికి మనము § ప్రాపు తోషముగ గూర్ప దెలిపితిని
యాపగిదిని వివరింతు పుణ్యుడవు § నాపదము నీకు నందును ముందున
వినుము పంచేంద్రియముల దర్శించు § ననువు గలవన్ని నిత్యములు గావు
మనమున నిత్యము వసించు నాతఁడె § మనమున కతీతుఁ డగు బ్రహ్మం బగు
తనువను గేహము నందున్నవాని § గన దేహి యనఁగ బల్కుదు రార్యులు
దేహి కర్మానుసరణ జనియించి § దేహము నందున భ్రమ నణగించియు
సాహసుఁడై సంసృతిని నిరసించి § యూహించి జ్ఞానమును గని పదిలము
నందిన బుద్ధిని వెలి బారసీక § పొందికల స్వప్నలబ్ధ వస్తువుల
చందమున దలఁచి తను వుండువరకు § నందమంది విహరించు నీ యిలను

కొందలమందడు కూర్పడు దుఃఖము § సందు నిడ డతఁడు భయముల దారడు
ముందున వెలుంగు నిత్యలోకమున § సిందుని పూర్ణపు కళసరణి మనము
కలుషరహితముగ సంతోషవార్ధి § కెలఁకున వసించునని సాంఖ్యయోగ
కలన పూర్తి నెఱిగించితి వారలు § దెలిసిరి బ్రహ్మము సురలాది వినిరి
సురలాదిగ పారంపర్యమ్మున § ధరణి వెలసె నది దాని నెఱింగియు
పరమపుణ్యాశ్రయంబులను దిరుఁగు § పరమభాగవత జనులను మ్రొక్కుము
వారల చరణ రజఃపుంజములను § వార బోసిక శిరముల జేర్చుక
తరమున శరీరమందున నలమిన § వారి కన్నాదికముల నిచ్చినను
హరిముద్రధారణ మందినట్టి § హరి దివ్యనామముల బల్కునట్టి
యనఘు లెల్లరును భాగవతజనులు § వినుము సంగతిని సంసృతి విముఖత
నను సర్వకాలమును దలఁచువారి § మనముల వసించి భుక్తి ముక్తులను
నరయుదును దరిని విడ బో నెప్పుడు § వరదుడను వారి కిష్టార్థములను
పర మందింతును నావిని యుద్ధవు § డరవిందాక్షా! మాధవ! వినెదను
జ్ఞానమార్గ మేవిధము దెలుపుమా! § నా నిమిత్తమున వందనము గొనుచు
నీ నిశ్చలంబు నగు దివ్యరూపు § గాన మొనర్పఁగ కరుణింపు మనిన
నా నగధరుండు దరహాసిత మొప్ప § నా నర్మిలి సచివోత్తముని జ్ఞానము
విరాగమునులము నగుదాని నెటుల § ధరాతలంబున గనంగ దగు నని
పరామర్శచే సుఖదుఃఖాధి § క పరాదికములగు కలిమి లేము లవి
బారులుగా రా రోగసమూహము § దూరిపై నురుము వృక్షసంతతి వలె
తారుమారు దశ లందింప తాను § ధీరతను విడక సర్వ మశాశ్వత

—: భిక్షు గీత :—

మారయ నంచని వెత మానుటయే § సారతరమైన జ్ఞానంబగు విను
సురగురు శిష్యుఁడ వైన యో సుజన § వరా! దుర్జనుల ప్రల్లదంబులను
తర మంది నట్టికలతల శాంతిని § పరమందించుట నేరికిని గాదు
పరుషపు వాక్కుల నగు నింద ఘాత § లరయ వాడిశరముల మించి నొవ్వ
గన జేయు గాన యవి పాటింపకు § విను మిక దుర్జన పరిభూతుండైన
ఘనుఁ డొక భిక్షుఁడు తా బల్కినట్టి § యనువైన గీత మిట ముదం బొలయ
మును కాలమ్మున యవంతిదేశము § ఘనత దనరారు మంజులంపు పుర
మున ధనాఢ్యుఁడగు నొక్క భూసురుఁడు § తనకు కృషియు వాణిజ్యము స్వేచ్ఛను
దవర దనరొక్క వారాపుత్రులు § గన దేవతాతిథులను పీడించి

ధనము గడించుచు దుర్వినియోగము ఽ గను జోడు గూర్చి లోభి తా నగుచు
నతి పాపము లని మాటలనైనను ఽ యతిథి బంధువుల నాదరింపకను
సతతమును ధర్మశూన్యుండై నన్ను ఽ మనమున నొకప్పుడేని స్మరింపడు
కపటియును దురాచార సంగతుం ఽ డెవు డన్నృతంబును పాటి గొనియాడు
చపలచిత్తుండు పిసినిగొట్టనుచు ఽ గన రా రాతని బంధుహితులాది
ప్రియముల గూర్పడు తా సేవగించి ఽ నయ మెందు గనక ధనమును గూరిచె
రయము గనె యక్షులను బోల దాను ఽ వ్రియము పూర్వ సుకృతమ్ము నద్దాన
కనలున గని రాతని పంచవిధము ఽ లను తీరు గనెడి యజ్ఞ దేవతలు
ధనము హరియింప సమయము నందిరి ఽ వినుండు వారు తద్ధనము ధర్మమున
గాని కామములు గాని బోనివిధి ఽ నానిన కారణ మే నియమంబుగ
దానధర్మముల భోగమునందున ఽ వానిధనము సర్వమున నాశనము
వాని పూర్వసుకృతమ్ము తో డందు ఽ దానసే హీను డగుటయు దారును
కొంత దాయాదు లపహరించి రటు ఽ కొంత చోరవశ మయ్యె మఱికొంత
యంతరించె దుర్వ్యయ సంగతినిట్టి ఽ యింతింత జనులు మోసమున గొనిరి
కొంత యనలంబు మిగత ప్రభుపరము ఽ అంతయు నిటుగా వంతయే దిక్కు
గని కాలంబును దాను దూషించి ఽ దనవా రెల్లరు రోయ దిగులు జొర
కనుల జలధార లొలుక తా నేడ్చి ఽ తను దోడెవ్వరు లేని దీనగతి
గనె నిర్వేదంబును దైవచింత ఽ మనమున జొనిపెను దీనశరణ్యుని
దనకు దోడింక వనజనయనుండే ఽ యని పదిలమంది తా నిటు గీతము
గొనె నది విజ్ఞానమె విలువ గాంచునది ఽ మునులు మెచ్చునది నీవు శ్రుతి వినుము
నే నకటకటా! యారడి గాంచితి ఽ నే నాత్మతాపమునను సుడి నిడితి
గా నా ధనంబు దరలుట యిందుక ఽ దాన నే నేమి సుఖము గాంచితిని
అనుభవింప నొక కాని యందునను ఽ మనము పుణ్యమున బోనీయ గాక
అనుభవింప కామమునకు గవ్వయు ఽ తనువును గృశింప జేసితి నందున
గనిన దేది యన నపకీర్తి దుఃఖ ఽ మనునవి రెండును పై దురితగతియు
మేలు దూరమయ్యెను లోభమతిని ఽ దూలితిని చింత యను సంద్రమ్మున
జాలిగొని సాంద్రమైన యనలమున ఽ చాల సెగలు సోకుటల తపించితి
నీలవర్ణుదయ వాని ఛేదింప ఽ జాలిన కళచే నొప్పితి నిప్పుడు
యేల దాని దలంపంగ నైననుఽ ఈ లాగున ధన జాలముల గలుగు
కాలదశలు నీ లోక మపుడపుడు ఽ మే లందగ దలపంగ వలె ననుచు
గీతము రచించితిని దానివలని ఽ నేతలను గలుగు నవస్థలన్నియు

పాతకపు బొంత లవి క్రొంత లగును | క్షేత్రతలమునందు హరిని ధ్యానింప
ధనము గూర్చునెడ నాయాసంబుగ | గనుఁ గల్గు దాని బెంపుట రక్షణ
లను వ్యయంబునెడ భీతియు నశింపు | గను నేర్పు గొనుట తా నొందు కొంత
దినుట లాదిగా విభ్రమంబులగ | కనుట దప్పు పెను గతియు మతి గఱచు
వినుడు దీన పదియేను విధములగ | గన గల్గును పాతకము సత్యంబు
మునుక గనకుండ విది బలుకువాడ | గనగ స్తేయంబు హింస యనృతంబు
వినుఁడు కామక్రోధములు స్మయంబును | గన సెబ్బు మదంబు ఖేదము వైరము
నవిశ్వాసమును స్పర్ధ దంభములు | నివి పండ్రెండును స్త్రీద్యూత మద్య
వ్యసనములు మూఁడు గలసి పదునైదు | కసిబిసిని నింపు జనుల వేధించు
పెను పుణ్యరాశి నశియింప గలదు | పసి గాంచ వలదు వీని పస లివియె
తన సహోదరులు జననీజనకులు | వనితాజనంబు సుతులు హితులాది
తన పరివారములును ధనము నెడల | గొనెదరు వైరము చంప జచ్చుటయు
మానముగ నుండు ధన మెంతటిదో! | తా నొక్క పూస తనువున నతకఁడు
మానుషజాలము తెలివి పెద్ద గని | కానలేరు తమముందు గతు లన్ని
దాన భూసురులు ధర్మహీనమును | పూనికను నడచి జనుల దెలుపవలె
గాని నాఁడు వారలకు నధోగతి | తాను దనుదాన డాయు దప్పదది
గన పుణ్యమోక్షములకు సూత్రంబు | ననదగు మానవ జన్మ యిం దర్థ
మునకుగా నిత్యమును క్రూరమతము | గొని దా నర్థమును బొందరాదు
దేవ, ఋషి, పితృ, భూత, జ్ఞాతులను | నావిధిని బాంధవులకు బంచి రని
కేవల నీచత గన్న మనుజుఁ డెటు | త్రోవ గను ముక్తి నరపశు వతఁ డగు
వినుఁడు ముక్తిసోపానము ధనమగు | తనుధర్మ మమర నద్దాని గనిన
గన నధోకూపమున దూక నదియె | తనుధర్మ మమర లేని యొనరునను
నే నిపుడు నిర్ధనుఁడ ముదిమి గంటి | నా నమ్మిన ధన మది పరులపాలు
గాన శక్తుఁడను మరల గూర్చుటకు | దీన చింతయే ధనముగ దలంప
దగవు నందితిని నాపూర్వపుణ్య | మగు గాబోలును నిజము గనుగొంటి
సగటున విచార మీవిచారమున | జగ దవనుఁడయిన శ్రీశుఁడె దోచెను
మనుజులకు ధనము కామము కొరకే | యని గాదు ధర్మమునకు నుపయోగ
మును వేదువారి కిని తాను దాత | నని పించుకొనఁగ వలె గర్వపడక
వనజనయనుండు వారి ప్రీతి గను | మనము పరిశుద్ధి వడసి ముక్తిగను
జను లిద్దానిని దలపదగు ననుచు | ఘనుఁ డగుచు భిక్షు డనియె విను డదియు
మును ఖట్వాంగుడు నిమిషమాత్రమున | గనెను విరక్తిని ధనవనితాదుల

గనెద నే నతుల తీవ్రవిరక్తిని § మనెదు ముందునను హరియె దయ బ్రోచు
గన నింక దుఃఖ మనుచు నభిమాన § ముసు విడిచి భిక్షుఁడయ్యె నన్నిటను
ఘనత త న్నొందిద యజ్ఞానకలిమి § ఘనమతి బహిష్కరించి ధరణి సం
చరంబుగనె నాతండు విజ్ఞాన § పరంబు ధృతినిక్క గడింపు నండగ
తరించె నింద్రియజాల వికారము § వరించె యోగము శ్రీశుని జపంబు
శాంతి గైకొనియె నవధూతచర్య § సంతు గాంచె సంతోష పరంపర
మంతనము శుభ్రగతి వలపు గూర్చి § చింతలన్ని విముఖంబున దరిమియు
కుదురు గాంచె హరిచరణ ధ్యానముసు § బెదర డెందునను శ్రీవల్లభుండె
చదురు గని బ్రోవ సంసిద్ధత గను § సదయుఁడు సర్వము సను పోషణ గను
ముదము నించు తను తలఁచిన వారిని § అది నే నమ్మితి నన్ను దయ గాంచు
పెద్దలు మెత్తురు ధర్మము ననుసర § పద్ధతిని వృద్ధి గాంచిన నక్లైన
బుద్ధి వికసిల్ల దివ్యులు శుభముల § నొద్దికచే నను జేర్తురు సత్యము
తనువు బలమునను గూర్ప నాసింప § ఘన నియమమ్ముల జిక్కుటనె నోర్తు
ననుచు నిస్సంగుఁడై పట్టణంబు § నను గ్రామంబుల విధిచాలు నిలిచి
తనక్షుత్తు మాత్రమున భిక్ష గొనుచు § గనఁ డహంకార మమకారములను
జను లితని ముసలిదనము భిక్షుజీవనము § గని కనికరించు రొక కొన్ని యెడల
గన రతని దయను వారు దుర్జనులు § గనిన కసరించి పరిభవము నించి
సరసరరా నేవగించి దూషించి పరుషత § నింపుచు నాతని దండము
కర మూత గొనెడు దాని హరించియు § పరుస కమండలమును లాగికొంచు
చంక నుంచుకొని తన యాసనంబు § బింకమున జించి కింకిరిని గూసి
జంకుగొన కతని కంథను దొంగిలి § సంకటము నింపుటకు జాలినన్ని
నెపములను బూల్చి జపమాల డ్రెంచి § కృప దొలఁగి నిలువ నీక నదలించి
యుపహాసించి మరి యిచ్చి పుచ్చుకొని § కుపితు లతని జూడగనె తా మనుచు
విపరీతబుద్ధి గెంటించుచు మఱి § కపట కుటిల మతు లనుచు తినుటకై
యే నదీతీరముననో నున్న యెడ § మానక వెంటనె తలమీఁద నుమిసి
మానము మరలుప మాత్రము జల్లుచు § వీని గన చోరు డటు గాని వాని
కీ నియమ మేల ? అని తర్జనముల § మాన హీనగతి గనజేతు రతని
మానసము శుద్ధి గనుట యెఱుంగరు § హీనమున కొర్చినాడు నిజ మనుచు
తిట్టుచును మఱియు కొట్టు డనుచు § గట్టివేయుఁ డని పట్టుల గ దపుచు
కుట్టులోగొన్నవా డీతఁడు ధన § మ్మట్టి పరులు గొన బ్రతుకుకై వృత్తి
నిట్టు గొన్నాడు కుటిల నడత యిది § పెట్టకుడు భిక్ష నెట్టుడు గిట్టని

వీ డిపుడు ధర్మకేతను డయ్యెను | పోడిమి జెడ నీ శరీరధారిని
దాడి బెంచుకొనె కూడు గతిలేక | కూడబో రితని దాడి తమ కేల ?
నని చుట్టలు పెక్కండి నీచుఁడని | గనరు వీనివేసంబు జపంబును
గనిన ముదిమి గైకొన్న కొంగ యగు | ననుచును నతనిని పానము తనువున
మనము రోత గొన విడుచుచు పులుగును | విను మరి చిలుకను పట్టి చుట్టు నటె
కట్టున నిలుపుచు నీడ బో వదలి | పెట్టి తఱుముదురు దూరంబున తమ
తట్టునకు రాడు వీ డనుచు నట్టె | కొట్టుదు రాతం డాప్రదేశముల
దిరుగు నెడల నాతండు ధీరతను | పరమ శాంతమున సరకు గొనకుండ
నరిగె తనస్వేచ్ఛ జరాచరంబుల | దరముగొని యందు ప్రవృత్తి బూనక
తనకైన పరాభవముల నన్నిటి | మనము ఖేదమును గూర్పకను ముదము
నను వాంఛ లిచ్ఛలను నేది గొనక | ఘనత లో నెంచి సాత్వికము నిక్క
గన బోడు సుఖము దుఃఖ మెందునను | గన దైవికమున నందినట్టి వగు
దాన కాల శీతోష్ణాదికముల | మానితంబె యని ప్రాప్తించునట్టి
వాని దెగడకను తనలో నిట్లను | మానసంబె సంసారకారణము
మానసమె కాల గుణ కర్మక్రియలు | మానసమె పుట్టు గూర్చు వృత్తిగల
దనుటను దానిని మాపుటయె మోక్ష | మానుట యగు ననిమతి నిటు దలఁచెను
మనమున నేకీభావత జీవుఁడు | గను సంసృతింతె గాని జీవునికి
వనజనయను పరతత్వ మని నమ్మ | కన నైక్య మంద జనన మెక్కడిది ?
తనుదాన యంతరించును సంసృతి | గన నిక మమతను జన్మకారణము
జీవసఖుఁడు పరమాత్ముఁడు సకలము | స్థావరంబుగా సాక్షి తా నగును
కేవలము విద్యకును శక్తికిని | తావలము తానయ్యె బంధచ్యుత
మున వెలుగు జీవుఁ డభిమాన మంది | తను నవిద్య జుట్టంగ సంసార
మును గాంచి పరమునందున మనంబు | జొనుపుటను మరచి బందితు డందున
మానసము నిగ్రహమున శాంతి గన | దానాదు లన్నక్రియలు గొన నేఁ
మానసము బంధనమున చటులమున | దాన మందినను యవి ఫలము నీవు
యోగులు భయంబునను దాని గనరు | భోగులు మనంబునకు లోబడుదురు
త్యాగ మన్నింట గన్న మనంబే | దాగు భయము గని దాని తెలిఁ గదియ
మనమును గెలిచిన వాడె దేవుండు | మనమున లోగిన వాడె జీవుండు
మన మనేక మర్మముల భేదించు | గను సంకల్పితంపు నార్గురు దోడుగ
గొని యనేక వాంఛలను సేనలను | తను జుట్టి గెలుచు నెంతటివానికి
గాన మనుష్యుం డీవిశద మెంచి | దానిదాని నైపుణ్యమును నార్గురిని

సేనాధిపులను మాన మెడలించి § తాను జయమంద వలె గాని యిందు
ధనవనితాదుల సామ్రాజ్యమంద § గని జనవిరోధమున రొప్పు గనుచు
మనములోని రిపుచయముల నటుంచి § గనెద రీ పృథివి శాశ్వతదుఃఖము
నను మునుక గనుచు నది నే గెలిచితి § జను లటుల గూడ మూఢమతులె గద !
విను డింక తనువు నిలువున జెడు ? నది § మనమందు మరులు గొన నేల యురల
గన నేల ? శత్రులని దలఁచు టేల ? § కన నధర్మముల దారు టది యేల ?
కలిమికి లేమికి దా వగవ నేల ? § చనెడుకాలంబు దారిని దలంచి
వల పుడిగి చలనమతి గూల ద్రోసి § నలిననేత్రు పదభక్తి గన మేలు
నరుఁడు తనజిహ్వ తానే గఱచియు § పెదలపై నలుగ నేమి లాభంబు ?
కరము తలఁ పుడిగి పరమానందుని § పరతత్వమయుని పరదైవంబును
వరుస గనుచు చింతింప కధోగతి § పర మందనేల ? అలత బడనేల ?
జగతి కామ్యముల గోరు టదేలా ? § సగటున దేహికి దేహసంఘటన
తగవు చింతించి యాత్మ నెఱుఁగవలె § బిగువు నందవలె సన్యాసమందు
సకలమును గెలుచునట్టి యోగమున § యకలంకుఁ డగుచు నత డాత్మ గలయు
సకలమయుఁడు హరి జన్మరహితుండు § సకలము దా నయి దాను వేఱగుచు
వికటమతి విడచి యా తలఁపు గనిన § నికర మానవు నికేతనము ముక్తి
కాలము నిలుకడ గాన దవి తనువు § నేలను గలపును గాన కాలరూ
పాలవాలముగ గుదిరిన నాత్మని § నాలోకించిన కాలము వశమగు
కర్మ మన గలల్ గనిన సేతలగు § కర్మలత దాని నిరసింప నడగు
మర్మము లెట్టఁగ నేల ! గ్రహము లవి § ధర్మమున నరుల నావేశమునను
నతికించు సుఖములను దుఃఖములను § సతత మవియె యన గన రాదు కర్మ
గతిని వారు తోడుగను వేధింత్రు § సతత మీశునుతి వారలు సుముఖులు
అట్టి గ్రహంబులె పాదార్థాదుల § దట్టి దృష్టిభేదములను పీడిల
పట్టు దప్ప బో రనఁగ నరు లెంత § గుట్టు గని యాత్మఁ జింతింప వలయు
అల జడత్వాదు లన్ని జీవునకె § అల మవు నాత్మని నతఁడు విశుద్ధుఁడు
వలనొందు దాను చైతన్యరూపి § ఖిలపుతను వాది జడ మని యెఱుఁగుడు
జడిమ నెరుగ డా పరమాత్ముఁడు హరి § వడి గనఁడు జన్మకర్మాదులనగు
వడ గనఁడు పీన తనయుదే యవి § ముడతలు వడుచును మాయ వెలుగొందు
మాయ లావరణ మంది యట్లగుట § మాయయే లీన మాతనియందున
మాయావిలసనమున తా మీరుట § న్యాయమందు తా నిందు తపింపడు
అనలుజ్వాలలను పీడింపబడిన § యనువున హిమంబు వడకుఁ గవనట్లు

ఘనుఁడీశ్వరునకు నివి యేవి లేవు ఽ జనులు భజింపుం డా యీశుశరణ
మనజాలు ద్వంద్వముబు సన్నగిలును ఽ గను డభయంబును మునులు దెలసి రది
నే నట్టి తెఱువు నాదరింతు నిక ఽ బోను ధనాదులనాస లికముందు
నా నయంబు నుతి నతి దా నందును ఽ ధ్యానము పెంపును తానే గూర్చును
మాన మభిమాన పరత నే గనను ఽ దీనశరణ్యా! జగద్వినుత ! యని
నే నమ్మనమున హరిని సేవింతు ఽ మాన నిజపము మేలనుచు బలికె
గనుమా! యుద్ధవ ! యీ గీతనిష్ఠ ఽ ఘనమైన పరబ్రహ్మము దృష్టిని
గనెడు దారి దెలుపంగనైన యది ఽ మనమున నిలుపుము భిక్షుం డా విధిని
గనె ముక్తి దీని జనులు పఠించిన ఽ వినిన దుర్మమత దొలఁగి సుఖింతురు
నీవు నిఃఖేద మందుమ ! యిందున ఽ తోవ ముందు శ్రేష్ఠతను జేకూర్చు
పావనపువస్తు వేదియును లేదు ఽ సావకాశ మట్టుల నీకునుతియె
నని వినిపించిన వసుదేవనంద ఽ ముని మ్రొక్కి యడిగె మఱి వినెడిబుద్ధి
హరి! రమాపతీ యాద్యంతరహిత ఽ కరుణామయ ! యదువంశశేఖరా !
నిరుపమాన ! గోవింద ! ముచికుందవరద ! ఽ వేణునాద ముసమోహద !
పరమేశ ! నీవు నరనారాయణ ఽ వరమునిరూపములను గుదిరి యుంట
గురుల చెంత విని యుంట నిజంబును ఽ గురుగుణాకరా ! గురు గురుఁడ వీవు !
సురవినుత ! నీదు చరణకమలముల ఽ శరణ నెద బ్రోవు పరమకృప దెలుపు

భిక్షుగీత సమాప్తము.

## :- పు రూ ర వ గీ త :-

న్యాయవేదివా యో యుద్ధవ ! విను ఽ న్యాయము లన్నిట పరదారగమన
మే యధికదోష మగు నది గాకను ఽ నేయము విడదగు నారుల కూటమి
దాయ యగునదియె పుణ్యలోకముల ఽ డాయ నీదు దుర్గతిని తాప మిడు
ఓ యనఘాత్మ ! విను మిందున నొక ఽ పాయ స్త్రీల విరహంబు గొన్నటు
భూమిని తా చక్రవర్తినాగను ఽ నామవరిష్ఠత దిగీశ నుతుండై
కామినీ విరహతాపమున జిక్కి ఽ యీ మహాగీతమును బాడి దాన
విరమించె బుద్ధి నైర్మల్యత గనె ఽ వరుసన దీనిని వినుపింతు వినుము
అతఁడు పురూరవు డను భూపవరుఁడు ఽ అతఁడె మీవంశమునకు కర్త యగు
సుతుఁడగు బుధునికి సుమహిత గుణుండు ఽ అతఁడూర్వశినే సతిగ దొరకొనియె
సురలోక గామి యగు నూర్వశినిక ఽ నరవరుఁడు దన్ను విడిచిపోవు నెడ
త్వర గని యున్మత్తుని వలె లజ్జను ఽ సరకు గొనక నా క్షుద్రకాముల

కును లోగి దనియ బోక వగపంది § కల సంవత్సరముల కొలదిని వే
నను వందుచు రాకలను పోకలను § తను దా నెఱుఁగక పరితాపము గొని
ఘనత గనె వినుము వనిత రాకున్న § ఘనుఁడు విసివి దా విరక్తి జెందెను
అకట! కామమున నే దగులుకొనియు § వికటమతి దనర వెంగలి నైతిని!
సకల శీలముల నికర సుకృతములు § సకుటిలము గాగ దలఁచితిని దాని
వలని మతిచేత నూర్వశీ! యనుచు § లలన వెనువెంట దిసమొలతో బారి
చెలియ! నను విడువ వల దని యేడ్చితి § కలత మతి గంటి నున్మత్తత నే
గదియ నుఱికితిని గాసిలి సోలితి § చదురు గొంటి నంతటను మానకను
వదరి వదరి బడలిక దప్పఁబోను § ముద మనునది నాయెదలోన లేద!
దాని మెడ వట్టుకొని రాత్రిపవలు § మానము లెన్నో జనమానంబును
హీనమును పరచి దాని మోసమును § గాననైతిగా నుదయాస్తమయం
బులను నెఱుఁగ క్రీడలను పెన్కాల § మును రొప్పితి నే క్రీడామృగంబు
నను వంది వనితచే పరాభవము § గనుటకు జాలితి నా పద మ్మేడ!
నా నీతి యేడ? దారి గన రాదె! § యా నిగ్గులాడి పై మోహ మింత
పిచ్చి గూర్చనే నెటు దప్పువాడ § అచ్చ బోను గద! నానాటిలోన
నుచ్చతను పెద్దలను గనెడి నాకు § నిచ్చపల మెచట దార్కొనియె నన్ను
అచ్చిగురుబోడి బొందుటయే తోడు § సచ్చరిత లన్ని క్రమము దప్పితిని
మచ్చిత్తగతిని దా మెలఁగినట్లు § నిచ్చను మచ్చిక జూపుచును దార
నొచ్చితిని నేను మచ్చర్య లిటుల § కుచ్చితము గాంచె వంచితుఁడ నందు
ఆడుదాని వెంటాడెడు వానిని § నీడ గనవు శిష్టాచారంబులు
బీడుగను సత్యమును శమము దారు § పోడి మడగు ధర్మంబుల జాడలు
తోడు మదము లోభంబు మత్సరపు § దాడు లజ్ఞానము మూఢతను గాంచు
జపము శూన్యంబు తపము దూరంబు § కృప లపురూపము గుణము దూష్యంబు
జనవరుడ నయ్యు వనితకై యేడ్చె § గన సొంపు దప్పి జనులు నను కంపు
గొని చేర వెఱవ ననుకూల మీక § ఘనుల తలపోత మనముననను లేక
కునుకు పాలింద్ల గునుకు రతిక్రీడ § మనువాడ దానికరమున పానము
వనితాధర మానుట యే భుజింపు § గొనుట యింతి కౌగిటిన మెలఁగుటయె
తను వదియు నేలుబడికి జిక్కించి § వనిత పుంశ్చలియు నైన యాసగొని
ఘనపుణ్యము క్షీణింప వ్రతములను § మును నోచియున్న నవి యింధనములు
కామాగ్నిని నే గూర్చితి గద నా! § కాముమును నిరసనమును గూర్పఁగా
శ్రీమాధవ ప్రియుఁడే తో డంటెను § నా మానబలము గూర్చ ధ్యానింతు

నా వెలఁది రంకుటాలని యెఱిఁగియు § నీవిధిని మోసపోవుటను గాంచ
నావిధిని గన్న దుష్కర్మఫలము § నీ విధి మఱలినగాని పరము గన
దీని విడతు నిపు డాలసింప నిక § బూనిక విరాగమును జేర్తు నింక
గన సర్వభ్రాంతి త్రాడునందు వలె § మనమున నిజంబు నరసి భీతినిఁ
దనరని పగిదిని నిర్మలుఁడ నగుదు § ఘనులు వైరాగ్యమున మనుచుండెడు
విధిని గనెద గద! దాని నే గొనెదఁ § మనెద జితేంద్రియమున ముంద నేన
తనువుపై మమత వనితపై మరులు § పెనుపునను రెండు ముప్పు నిచ్చునవె
తనువు తనకైన ననువగు జననీ § జనకులకు నైన బంధులకు నైన
తనప్రభునకైన శునకాది ఖగము § లను వానికైన ననలునికి నైన
దాప నుపయోగ మందునవి గాదు § ఆ పణతిపల్ల నిట్టిదియగును
రూపింప వనిత నగవులకు లోగి § యా పగిది కులుకులకు నుబ్బి గనుచు
లోపలి యసహ్యములను నెడ గనఁక § ప్రాపు గొన్నట్టి రుధిర మజ్జాస్థి
మానము లమరిన విణ్మూత్రములను § గానగు కూటములకు నాసగొని
తా నొక నీచపు పురుగుగతి నునికి § మానవజన్మపు గరిమ గనమియే
యని మనము నలిననయనునిఁ జేర్చి § తన సర్వము హరి కర్పితం బంచు
మునుల సాధువుల భాగవతజనుల § గని సతుల జీపము నందుట మేలన
గ నవివేకి యీ సంగతి గొనకను § ఘనతనియమముల నిరసనము గుఱిగ
మనువాడె నిర్మలుడును మోదమును § తనకు నిలయముగ నొందు నిజమ్ముల
విని తా పిశాచ మునులనే గలంచు § గనగ నాదైన నింద్రియవర్గము
లను నింతవరకు గెలుపు గనసీని § మును మనమున కనుగొంటి వెలిసితిని
గన నింక మోహమును యమము గొంటి § దుసిమెదను దాని ననుచు హరిభక్తి
దను జేర మనము తాపమున ద్రిప్పె § జనవరుఁడు ముదము గనె నిది వింటివ ?
కాన మానినుల పొత్తు సుందరము § మానిత పదవికి గొడ్డలిపెట్టగు
యో నీతినిపుణ! దాని మరల్చిన § దానై వలంచు మోక్షపద మద్ది
యింక విను మిటుల శంకలను మరల § పొంకం బందును యధ్యాత్మ దృష్టి
కింకిరితనంబు సంకుచితం బగు § నంకం బందును ముదము శ్రుతమునను
విషము సర్వమును నీకు వచించితి § నను నమ్ముకొన్న నిను ప్రజ్ఞ గూర్తు
గనవు శోకంబు మనెదు దపంబున § గనెదు నాభక్తి గొనెదు నాపదము
వనజనాభుఁ డనె యతనిఁ గనుగొని § విను మేకాంతమునందు మనమ్మును
తిరమంద జేర్చి కరముల నూరుల § వరుస నందించి నాసాగ్రంబున
సురుచిరం బంద దృష్టిని నిలుపుచు § పర మనుచును ప్రాణాయామమ్మును

వరుసఁగొని హృదయమున నన్ను నిలిపి ✽ కరము న్యాయంబు నగు పదునెనిమిది
యోగసిద్ధులను నెఱిఁగి యందునను ✽ బా గొప్పఁగ నణిమాది యెనిమిదియు
యోగప్రధానము లన మది నిలుపఁగ ✽ గుణప్రతిష్ఠతను నింద్రియముల
మనమునందు బంధించి మనంబును ✽ నొనరంద నాత్మనందు గీలించి
కను బ్రహ్మపదము నందు నే నుందు ✽ నను సర్వేశుని గందు రందునని
అట్టి భాగవత శ్రేష్ఠు లితరముల ✽ పట్టులను నెగడు ధర్మకర్మముల
దట్టముగ సన్యసించి నన్నింటి ✽ గట్టిగను నన్ను గనెద రెల్లెడల
విను పాండునందనుం డర్జునుండు ✽ దన వైరిజనుల కయ్యము నొనర్చు
మొనయందు ప్రథమ రంగము సందున ✽ గనె విషాదంబు యుద్ధ మొల్ల నని
నను భక్తశరణు జొచ్చి ప్రార్థింప ✽ వినిపించినట్టి విధము నే నీకు
వినిపింతు వినుము నీవు యుద్ధవా! ✽ కన వసింతు నే నన్నిభూతముల
చరాచరంబుల నే నుండునట్టి ✽ పరం బందు మత్స్వరూపంబునుఁ గా
నిరాడంబరము నిర్వికారంబు ✽ నిరాలంబమును విరాట్టు నాబడు
జగతి పూర్ణంబు పూజ్యంబు నైన ✽ జగద్విభుఁడ నని నిగమ నుతి గాంచు
జగత్ప్రకాశము నందు నారూపు ✽ జగద్వినుతి గన నతనికి జూపితి
విను భూతములకు నాధారభూత ✽ మును నేన! సూక్ష్మమున జీవుండును
మనము నేను బ్రహ్మాండమందునను ✽ వనజాసనుఁడను సుర సమూహముల
ననలుఁడ నౌదును వసువు లందునను ✽ గన నాదిత్యుల విష్ణువును నేను
రుద్రులను నీలలోహితుఁడ నేను ✽ భద్రమతి గన్న బ్రహ్మల భృగువును
ఛిద్రరహితులగు ఋషుల నారదుఁడ ✽ తద్రూపు గన్న యమరధేనువును
నేన గోవులను సిద్ధుల కపిలుఁడ ✽ నేను దైత్యులను ప్రహ్లాదుండను
నేన గ్రహంబుల చంద్రుండ నగుదు ✽ నేనుఁగులందున నైరావతమును
వినుము హయములను నుచ్చైశ్రవమును ✽ ఘనత వెలయు వాసుకిని నాగముల
వనమృగంబులను సింహమును నేను ✽ గన గృహస్థునయ్యెద నాశ్రమముల
విను మక్షరముల నకార మగుదును ✽ ఘనమైన నదుల గంగానదియును
నే కార్ముక మౌదును నాయుధముల ✽ నేన గిరుల మేరువును తరులందు
నే నశ్వత్థము నోషధుల యవలు ✽ నేన యజ్ఞముల బ్రహ్మయజ్ఞమును
దనరు వ్రతమ్ముల నహింస నగుదును ✽ ఘనతర యోగములం దాత్మయోగ
మును నేన నారులందు శతరూప ✽ యను నామె నేను పలుకులందునను
నేను సత్యంబు ఋతుల వసంతము ✽ గన మాసంబుల మార్గశీర్షమును
తారల నభిజిత్తార నౌదు నా నేను ✽ సారమైనట్టి కృతయుగము నేను

ధీరమతి భగవ దాకారంబుల ॥ చారుతరంబుగ వాసుదేవుఁడను
వినుమ యక్షులను ధనదుఁడను నేన ॥ గన వానరముల హనుమానుండను
ఘనతర రత్నములను పద్మరాగ ॥ మును నేన దానముల నన్నదాన
మును నా రూపము తిథుల శ్రేష్ఠమగు ॥ నొనరగు నేకాదశి నేను నగుదు
జనతతిని భాగవతుఁడ నయ్యెదను ॥ వినుమ నాభక్తవర్యుఁడవు నీవ
కన నివియు మనమునందు నిలుపు గని ॥ విన గన నగు సర్వములు నే ననుచు
నివియు మద్విభూతులు నా నెఱుఁగుము ॥ తవులవలదు సంశయము లనిత్యము
భవము సారముగ నన్ను దలంపుము ॥ సపురు నందెదవు నాసన్నిధినే
యనుచు కృష్ణుండు బోధింప వినియు ॥ విన జెప్పుమయ్య ! వర్ణాశ్రమముల
మునిజనవందిత మురళీధర ! హరి ! ॥ వనజనాభ ! దేవకిదేవిపుత్ర !
అనిన జగదీశుఁడైన నరసఖుఁడు ॥ విన జెప్పి నాల్గువర్ణాశ్రమములు
ననువైన నాల్గువేదధర్మముల ॥ ఘనత వెలయు శాస్త్రముల పురాణము
లను మఱి యితిహాసముల విధిగన్న ॥ వినిన ధన్యమును జెందు చరితముల
అనఘా ! సమస్తధర్మములు నేను ॥ మునుల రూపముల నిరూపించినవి
యనయము సద్ధర్మరతి పావనమతి ॥ గని విని యన్నిట నుత్తీర్ణుఁడగుచు
సకలతత్వ సన్మయుఁడ నగు నన్ను ॥ సకలమందు సన్నుతిని నెద గనఁగ
సుకరంబగు నిశ్చింత గొని మనము ॥ వికట మొందు గననీక భక్తినిఁ
ప్రకటితముగ సర్వమునగు ధర్మము ॥ లకలుషమతిచే విడచి నను శరణ
మనఁగ నాధర్మపరుల పాపముల ॥ మునఁగ బడనీక నుద్ధరించి నా
చనువు నెల్లగొన మోక్షము గూర్తును ॥ గనుక నే తలఁపు నామీఁద నిలుపు
ముద మావహిల్లు నో ! యదుపుంగవ ! ॥ వదలుమా ! భ్రమలు నిను మేలందెదు
సదయుండవు నగు నేను నీయందు నిలుతు నేడు ॥ మొదటినుండి నాసఖ్యమును గనిన
కతమునను కొఱత నందవు మహిమను ॥ గతి గొనుము అనిన యుద్ధవు డనియెఁ
యతిజనపోషా ! యచ్యుత ! యింకను ॥ మతి వెలయ వినఁగ నేమి వలయునో !
వల నెఱుఁగు మీవె సర్వమున గలవు ॥ దెలియుదువు మనములోని వివరమును
నలినాసనజనకా ! పరేశ ! యదువర ! ॥ జలరుహనాభా ! చతురాగమ నుత
యల సురేశాది దిక్పాల వినుత ! ॥ ఖలభంజన కరుణాలవాల ! హరి !
వరద ! మురవైరి నరకవిదారా ! ॥ సిరివల్లభ ! కరి రక్షక ! ముకుంద !
నిరవశేష ! విశ్వేశ ! పరతత్వ ॥ నిరయదూర ! పరిధాత ! విభ్రమా
నందసంధాత ! నందసుతా ! యర ॥ విందలోచనా ! యమలా ! శమోభ !
మందమతి నందనీకు నతి ఋడే ॥ బంధనము నొంద నింక సంసృతిని

నందనింక నీచరణాబ్జార్చన ౹ ముందు గొనెద నీదివ్యమందిరము
తందర లడంగె సం దందెద నీ ౹ విందు నా కిడిన యానతి జరుపుదు
నన వాసుదేవు డనె నతని గనుచు ౹ వినుము నీమనము గంటి ప్రశ్నముల
ననుకూలమ్మను నను వందింతును ౹ ఘనుల మతము లే దుర్లభము లనుచు
తలఁతురైన విను నియమ శమ దమా ౹ దులు మరి తపంబు సుఖదుఃఖకలిమి
అల స్వర్గ నరకములు దరిద్రంబు ౹ కలవారి విభవములు నెటు లనుటలు
మొదలుగా దెలియ నెంచితివి నీవు ౹ ఇదె వాని యుత్తరముల వివరింతు
ముదితుఁడవు గమ్ము మౌనవ్రతంపు ౹ పదిలతయు బ్రహ్మచర్యము క్షమయును
జపతపంబులును నతిథిపూజలును ౹ రిపుత దలంపని పరహితంబు ని
ష్కపటవృత్తి చౌర్యముల విసర్జన ౹ మెపు డీసుమతిని నిడుట లాదిగా
నియమములు నాగ దెలియు మోయన్న! ౹ నియమమతి నింద్రియ నిగ్రహంబు రిపు
చయముల మిత్రుల సమము గనుటయే ౹ భయరహితా! శమనంబుగా నెఱుగు
విను మూఢమతులకును జ్ఞానబోధ ౹ లను గూర్చుటయును కామ్యనిరసనము
సమదర్శనంబు వైష్ణవజనముల ౹ నమితభక్తి స్నేహముల దనరుటయు
సమచిత్తమ్మున ప్రాణాయామము ౹ క్రమత నంమటయు కలిమి విద్యయగు
శమదమాది గుణరహితమున నీశ్వఁ ౹ నమలుఁడనగు నను తలపమి యవిద్య
క్షమను నిత్యతృప్తిని గాంచి మఱియు ౹ దమమున నియమ గరిష్ఠత నెగడుట
విమలత నను చిత్తమున వలంచుట ౹ ఉమకు పతియైనవానికి హితుండు
గనెడి కలిమి పరభోగ సుఖంబును ౹ గన మించు ముఖమె యగునది ముఖంబు
నను నెఱుఁగని యా తమోగుణంబే ౹ గన దుఃఖమునగు దరిద్రుఁ డెవడన
కనకలిమి బంధుగురు పరివారము ౹ లను భూసురులను సాధుజనంబులు
మనుభోగ్యంబును గూర్పని యతండు ౹ విను శక్తి కోఁది నవి యున్నవాడె
కలిమి గలవాడు బలవంతుఁ డతఁడె ౹ దెలియు మయ్య యింద్రియ నిరసనుండు
విలసితసుగుణుడు దుర్గుణదూరుఁడు ౹ నలినాంబకునిఁ దలంచు నరుఁడే
నారాయణుండు నమ్ముమయ్య! యిది ౹ పరాయణమ్ముగ నాదరము గొనుమూ
నాయందు దలఁపు నిలిపియు నిశ్చల ౹ మే యనువుగాక కర్మము జ్ఞానము
లే యునికి గన్న యోగముల రెంటి ౹ బాయని నిర్మల చరితులుం గలరు
వారు జనకాదు లరయ మహాత్ములు ౹ వారిబోలె కేవలము భక్తినే
నూరిన మనంబు ననువున గాంచిరి ౹ వారలు శబరి బలి ప్రహ్లాదుం
డును ముచికుందాదులు భక్తియుతులు ౹ విను మీదేహము చిల్లులది కుండ

గన దానిలోని గంగధారవలె ఽ దినదిన మాయువు తరుగును గాదా
జనరా దెవరికి దొ్రబ్బ మృత్యువును ఽ గనుమా ! జ్ఞానము మృత్యుభయ మడగు
ననుభగవంతుని శరణుజొచ్చినఁ ఽ కినుక నామృత్యువును ఛేదింతువు
నిరతమును సౌఖ్యగతి నాయందున ఽ పరమును గనంగ తెరు విదియు వినుము
వరమతీ ! జనని గర్భమున జీవుఁ ఽ డిరవు గొనును విజ్ఞానం బెల్లను
ధరణిని బుట్టుక తోడనే దొలఁగు ఽ నరయు దా బోధ జ్ఞానంపుసరణి
నరుఁ డెవ్వడైనను జీవితమ్మలో ఽ గురుల గురుసముల గుఱిదెల్పువారి
పరహితబోధల గురుతరంబులను ఽ ధరను వెలయు శాస్త్రముల లోకముల
పరిపూతమైన చరితార్థములను ఽ నరసి జీవేశు నీశుని స్మరణము
దిరముగా గొనిన కృతకృత్యుఁ డతఁడు ఽ వరుస నీసరణి తరుణ మెపుడనిన
వినుమ బాల్య కైశోర కౌమార ఽ మునను నా వెనుక నైన వయసుననె
నను గనఁగ దగును నిదియు దెలిసితివి ఽ అనఘుఁడ వింకను విను మోపికగాని
ధనమదాంధుడయి సుజనపీడితుఁడు ఽ కన నికృష్టచరితుఁడు కపటుడునుఁ
మైనవానినిఁ సముఁడ నే నగుట ఽ గని వానిపూర్వఫలము బండెనన
కనలుగాదదియు కనికరమేయగు ఽ విను మట్టివాని ధనహీనునిగా
నొనరింతు నతఁడు గనునపుడు సమము ఽ మనమున దయ సలుపును భూతసమితి
కీడుదలంపం డెవరికి నైనను ఽ గూడరు దుష్టులు నిర్ధనికుఁ డగుట
తోడు నాభక్తి పాడిగా మెలఁగు ఽ వాడు నాచరణ దాసుఁడై ముక్తి
నొందు నేనట్టి నభిమానరహితు ఽ కుందును గూర్పక వెనువెంటనుండు
నందమించు విను సనందనాదులు ఽ సుందరం బిదయు నానందమింతు్ర
నారదు మనమిదె యగు నది కుందును ఽ సారవిముక్తిని బాడిన గీతము
ఆ రమణీయము నీవు దెలియుదువు ఽ నేరుపున గనుము వారు నారూప
మన నుద్భవుండు వనజాక్షు మొ్రక్కి ఽ వనజనాథ ! నీసృష్టిక్రమంబును
వినుపింపు వినెద సందియము వదలు ఽ ననిన నవ్వుచును జగద్విభుండను
ఘనత నాప్రేరితమున మహదాదు ఽ లను గుణ మందగ నందంబు గాగ
నేనందు మాయతోడ బుట్టితిని ఽ దాన నా నాభిరంధ్రమున ధాత
నే నందె జననమంత వరమందె ఽ నేన యతని సృష్టింప నిలిపితిని
యానతివరిష్ఠ మత డందె నిన్ని ఽ యా నలినోద్భవు నిర్మితములగును
అతని నూరేండ్ల యర్ధంబుగడప ఽ నాతని పూర్ణాయువున ప్రళయంబ
గతిగన నదియే ధాతప్రళయంబు ఽ వితత మొనరింతు విను మా విధమును
లీనము ధాత్రియు గంధంబునందు ఽ దా నుదకంబున రూపరు నిజముగ

లీన మా జలము రసమునందనను § దాను తేజమున నశింపునందును
లీనమగు తేజ మా రూపంబున § దాను వాయువున మాయు నట్టులనె
లీనము వాయువు స్పర్శంబునందు § దాను గగనమున లయంబు నందును
లీన మా గగన మా శబ్దంబున § దాను పరమునం దట్టులే యగును
విను మింద్రియములు మనమున నటుగా § గను వైకార్మిక గుణముల నల్లే
గను శబ్దయుతముగా నిటుల యశంబు § ఘనుఁడైన యాకసనందు నొప్పు విను
నేన యా యాకసు రూపమును దాల్తు § దాననే గుణములను గూడి యిట్లు
గా నగుచునుండు గుణయుతుండనయి § యా నయముచాలునను ముమ్మూర్త్తుల
రూపు నేను నూ! సర్గాదులందు § నా పద్మజుండ నయి బుట్టింతునుగా
నా పగిది రుద్రుడను నయి హరింతు § చూపంది విష్ణువన పోషింతును
జెడ నెప్పటికేని సతతుండ నౌదు § జడమతివిగావు నీగురుఁడు గురుఁడు
జడు పుడిపె ముందె కొఱఁతదీర నిట § విడువు సంశయము గను మానందము
నావిని యుద్ధవు డో దేవమయా! § పావనులగు యోగులు కన్న నిల్పి
సేవల నర్చనచేయు రూపింప § నీవు వారికామ్యముల గూర్తు వెటు
లదియు సెలవిమ్ము సంతత మమరెను § యదునాయక! నాస్వామి! వనజాక్ష!
బుధజనవినుతా! పురాణపురుషా! § యుదిత నిగమహృదయాంతరాళ! హరి!
యన నారాయణుఁ డా యనంతుండు § విను మా విధమును సర్వవర్ణముల
జనులు నన్ను పూజించు క్రియంబును § ఘనతనందు నా వరరూపంబును
కనకలోహాదికములనో శిలలనో § గననటు దారువు మృత్తికాదులనో
రొనరు తమశక్తికొలఁది నిర్మించి § వనజనయను నను భావమున శుద్ధి
గని సేవింప బ్రసన్నుఁడ నగుదును § జనుల కీ లోకమున ధ్యానము నిలు
వంగ రాదనుచు దెలియు మిందునను § సంగతి విశేషమును గల దొక్కటి
రంగుగను మనం బాపనులందున § చెంగలింపు కుతుకంబు సిద్ధమతి
చెంగ చెడు నా యనుచరణంబునను § ముంగల నానందంబు లేమగా
ప్రతిమావిశేషముల సుందరంబు § లతిప్రీతి నాకుగా త్యాగరహిత
మతి దానాదుల భోజనాదులను § సతతము దలంపునను నాస్మరణము
గతిగ నెంతు రవ్వారును పుణ్యులు § వెతల బాపు ధర్మమున ప్రసన్నుఁడ
వ్రతములును దపములును జపవిధులును § నతులు నుతులు నాపరము లట్లయగు
నను దుగ్ధార్ణవశాయిగ దలఁపుచు § మనము విశుద్ధిని ధ్యానము గొంచును
వనజనాభుఁడని శాంతరూపినని § భుజగశయునునిగ దేవేశుఁ డనగ
నగు విశ్వరూపునిగ కమలనయను § నిగ యోగి హృదయవాసుని నగమ్యు

నిగ భవహరునిగ లోకనాథునిగ ॥ నటు ధ్యానమ్మును గూర్చి వెంటనే
శిరము మొదలు సాగిలి మ్రొక్కిన ॥ కరము నెమ్మదిని నాపదము జెందు
సరసమతీ! ఇక బదరికాశ్రమం ॥ బరసి పొమ్ము తపమందు నొనర్పుము
కలియుగాంత్యమున ముక్తి నీకగును ॥ వలపు వనరునను నందుదు సుమ్మన
అలరున జలజాక్షుని మ్రొక్కి యతఁడు ॥ చెలిమిని తనువిడనాడక తత్వము
తెలిసి నిలిచె నా హృదయమున నుంచు ॥ నలినభవవినుత యో! పరమేశా!
సెలవు గొనెదనని యలమి నవుచున్న ॥ జలజాక్షు గనుచు బదరికావనికి
దాతుట కేగెను శ్రీరమాధిపుని ॥ మీరుభక్తి నేమరక నుతింపుచు
కూరిమి విరాగ మొకటె తా గొనుచు ॥ ధీరుఁడగుచు సర్వమున హరి గనె
వన పరీక్షితుఁడు వరమౌనీ! శుక! ॥ వనజనేత్రుఁడా గృష్ణుఁ డేమయ్యె!
ఘను లా యాదవు లే గతిని గనిరి ॥ మునివినుతుఁడు రాముం డెటు జేరెను!
ఆమునివర్యుఁడు యో రాజవరా! ॥ నీమనంబు హరిచరితల వినంగ
నోమిన ధన్యుఁడ వవలను వినుమా ॥ కామజనకుఁడిటు భూభారమడఁగ

## —: శ్రీకృష్ణ బలరాములు వైకుంఠమున కరుగుట :—

దుష్టులను జెరుప విక్రమమునంది ॥ శిష్టులకును నిజ యోగమును దెలిపి
తుష్టి సురలుగన దా నిష్టమందె ॥ సృష్టవాక్యముల నిజపర మందగ
బలరామునితో తాను పురము వెలి ॥ అలరున వశిగని ప్రభాసమందున
కలన యాదవులు మదోన్మత్తులయి ॥ బలిమిని యన్యోన్య శౌర్యంబులను
నల మునులశాప కారణమున దా ॥ నిలువరమందుచు నదుల బారి గన
తుంగ తుంగలనె గొని యొకరి నొకరు ॥ భంగమున గూర్చ నవె యాయుధముల
రంగు వహింపఁగ వజ్రతుల్యముగ ॥ చెంగు గనగ నొకరొకరు నణకుటల
సమసిరి హరిరథ కరవీరభటుల ॥ క్రమమున సర్వులు దెగుట గని వారు
శమథయుక్తిగని నవ్వుచుచు దరల ॥ నమితవిజ్ఞాననిధి రాముఁడు హరి
యనుమతిని నొక్కతోవఁ దా నడచి ॥ ఘనతరపు యోగమున తనరూపును
మనమున హర్షముగని తా యనంతు ॥ డను నేన యనుచు తానైక్యమందె
సురలతని పుష్పవృష్టి నెదురుగొన ॥ నరిగె తన దివ్యధామము ముదమున
కరసి సుఖమునను తా నుండి హరిని ॥ వరుస దర్శింపుటను గూర్మి నందె
హరియు మోదమున వేరొక తెరువున ॥ వరుస నడచి యొక నికుంజపుంజము
నరసి యందు విహరించుట నుడుగుచు ॥ చరణ మింకొక్క చరణంబు మీద
సరసతను జేర్చి చాటు కొంతగా ॥ వరుస విశ్రమించిన నొక్క బోయ

వేటకై వచ్చి కదలుచున్నట్టి § దీటుగాంచి హరిచరణమ్మును దా
నూటి హరిణంబు చెవియౌనంచును § నేటున వ్రేసెను నూటిశరంబున
అదియు ముసలంపు ముక్కయై యగు నూ § కదిసె వాడు హరిఁగాంచి మ్రొక్కుచును
వరద! కరివరద! కృష్ణా! యనంత! § పరమపురుష! నే నపరాధినైతి
చరణముకదలిక హరిణ శ్రోత్రమని § శరము సంధించివేసితి మహాత్మ!
శరణు నీచరణములకు నను దురిత § పరము దప్పింప నీకరుణవలయు
నరులపూజ్యుఁడవు నారాయణుఁడవు § కరము భువనసంరక్షణ కర్తవు
వర సాధుమతుల గతి బో నైతిని § సరణి నీతనువు జూడ దుష్టమయె
నన వాని గాంచి హరి యిట్టు బలికె § వరగుణలుబ్ధక! పరితపింపకుము
తనువుల ధరించుటలు గూడు నెట్టి § ఘనులకు దప్పవు కర్మపరంబుల
చదురులు నిమిత్తమాత్రుఁడవు నీవు § ముద మిదియు నాకు నిజపద మందెద
నిది మునులశాపమున ఘటిల్లెగా § యదువంశమందు నే జన్మించుట
నీకు వగవు పనిలేదు నాదయము § నీకు నీసుకృతమున నాదుభక్తి
నీకడఁక గనుము వైకుంఠపదవి § నేకురు నన్నా! యన లుబ్ధకుండు
ఆకమలాక్షుని ప్రసన్నవదనం § బాకరణి వాగమృతధార తన్ను
ప్రాకట సంసృతిపరము దప్పింప § వీక గొసియె ప్రాయోపవేశమున
శ్రీకంఠుసఖుని శ్రీకామినీశు § శ్రీకాళివినుతు శ్రీకైవల్యుని
నాకమలాసనుఁ డేకాంతభక్తి § నే కరుణామయు దలఁచునో యాదే
వుని శ్రీకృష్ణపరమాత్ము నచ్యుతు § ననుఘుఁడు తా గా నిలిపి ముక్తిగనె
మనముల సురవరు లరుదుగ సుమవృ § ష్టిని బరగింపఁగ నట్టితరుణమున
దారకుఁడు జేరవచ్చె సన్నిధికి § సారసాక్షుగని భక్తిబ్రణుతుల్లి
యో రమేశ! నిను గనినవె కనులగు § సారమైన నీనుతిబల్కు జిహ్వ
కూరిమి భవ్యమునందు మనంబటు § జేరు నీధ్యానపటిమ నొనరంద
కనులువిప్పి మాటాడుము దేవా! § వినుతినొనర్తును నేపని యొనర్తు?
నిను జూడకున్న దినములు నింద్యము § లనెద నాకేమి బలికెదవయ్యా!
వరదా! మునినుత! ముకుంద! మాధవ! § ఉరుతరప్రకాశ! పరతత్వరూప!
నరసఖ! నారాయణ! వాసుదేవ § పరమపదము నధిరోహింతువు హరి
యన నతనిజూచి హరి యలరునింపి § వినిపింపు సర్వమును నక్రూరుని
కిని విదురునకును సవ్యసాచికిని § వనితలబాలుర వృద్ధుల నెల్లర
ననుకూలమంద కరినగరంబును § ఘనత జేర్పు మని చెప్పి మర్జునుని
నను ధ్యానమునను పదిలత గనుమను § వినయధురీణా! యను నంతలోన

హరి యస్త్రశస్త్రరాజి రథంబును § తురఁగయుతము నంతర్ధానమందె
పరముని బోధను దారకుఁడు మరలె § హరి నిజపదంబు తనహృదిని నిలిపి
సురవరుల జెలఁగ నారదుఁడుమోద § పరమున గానము సలుపఁగ మంగళ
ధ్వనులు బ్రహ్మాండమును నిండ విష్ణు § డును కృష్ణుండును తనరూపునందె
దినకోటి తేజమున తనదీప్తిని § వనజభవభవ సురవర ముఖ్యులు
తను గొలిచి రాగ నిజపదమందెను § జనవరా! కృష్ణ దివ్యచరిత్రము
వినిన వ్రాయ బఠియింప శ్రీయుశము § లవయంబు గనుచు విభవసమగ్రత
జనపూజ్యత గని మునివినుతపదము § నను వసింతు రంతమున నిజముగను
జలధిప్రాంతమున జగన్నాథుఁడన § నలరందు రూపమున తా నిలలో
నిలిచె నారాయణుఁడు జనుల బ్రోచు § తలఁపున విగ్రహాత్మస్వభావతను
శ్రీనివాసుండు దీనరక్షకుఁడు § దాన మనమునను నిలిచి ముద మొసఁగు
నానెమ్మి వినుతి నా దేవుపదము § లాను విమలతను ధన్యుఁడ నౌదును
కనుల నెల్లపుడు వనజనయనుండు § తన నిజరూపము గనునటు దయ గని
తనదరహాసమె సుధ జిలుకుటగా § నను జూచు ననుచు నమ్మితి సత్యము
రాజీవనయన! రమాపతీ! హరి! § భూజనవంద్యా! నృపశిరోమణీ!
నీజపమంత్రాభ్యర్చనసమస్త § మీ జగములందు వ్యాప్తి హర్షమదె

శ్రీకృష్ణార్పణమస్తు



శ్రీ గురు పరబ్రహ్మణే నమః

# శ్రీమ దాంధ్ర గేయ మహాభాగవతము.

## ద్వాదశ స్కంధము



శ్రీ రామా ! సురరాజనుతచరణ ! నీరేజాలయవల్లభ ! నృహరీ !
పారావారశయాన ! బుధకల్ప ! ధారాధరసమావర్ణ ! పరమాత్మ !
రాజదశరథాత్మజ ! ఖరభంజన యోజగద్వీర ! యోగీశ్వరనుత !
రాజితసుగుణపయోధి ! భువనపతి ! తామ్మజనితదుఃఖ తిమిరభాస్కరా !
భానువంశమణి ! బంధనరహితా ! దీనపరిపాల ! దిక్ప్రభుసన్నుత !
మానిపోషణా ! మఖసంరక్షక ! మానితసుందర ! మహనీయ ! హరీ !
హారసంస్తూయపదాబ్జవిలసనా ! శరణు విభీషణపక్ష ! శరనిపుణ !
కరివరదా ! యచ్యుత ! పరమేశ్వర ! ధరణిరమణ ! సుగ్రీవసఖా ! విను
నిన్నుగొల్చినను ధ్యానమొనర్చిన మున్నుకర్మలవి కారాకుతాను
ఖిన్నతనము జొరరా దెప్పటికిని మిన్నయశము నీవన్న సర్వాత్మ !
కన్నులకగుపించియు పూజగొనుము కన్నతండ్రివలె కరుణను నింపుము
సన్నుతినిజేయు భక్తుల గనుమా ! ఎన్నికకు మిక్కుటవు భద్రమొసఁగు
క్రిన్నన మోదము పొందు గననిమ్ము తిన్నని నుతి యిది మన్నింపుపెద్ద
నిన్నిటు దలంచి భాగవతజనుల నెన్నుచు ద్వాదశస్కంధము గేయము
గా రచింపు బూనికను గణపతిని నీరేజగర్భు రాణిని ధాతను
వారిజనయనుని శంకరు శుభకరు గూరిమి నాతని రమణిని సిరిని
పరబ్రహ్మమును సురుచిర తేజుల సురనాథసహిత దిక్పాలకులను
సురల మానులను ఋషివరుల భూమిసురయ పుణ్యులను మఱియుసర్వమును
కరము కణములను దైవరూపులని తిరమందినట్టి జ్ఞానము పెంపున
కరములుమోడిచి కవుల నతిజేసి దురితములు దొలఁగ దారి యదే యని
వరుసగంటి నీ సరణి శుభమనుచు సరసులు వీనుల నమృతస్వరూప
మనదగు నీచరితమును వినదగును ఘనుఁడ పరీక్షితు శుకమునిచే విని
మునులు శౌనకాదులకు సూతుఁడనె ఘనకథకుండయి దానినె దలంపు
ననుసరంబునగు నాజనవరుండు వినుపింపుము శుకమునిసార్వభౌమ

భావికాలమున కార్యమ్మ లెట్లు ? ƒ భూవలయమ్మును పాలింతు రెవరు ?
చేవ లెట్లు ? ధర్మముల నడ లెటుల ? ƒ దేవదేవు డా రమాపతియు నే
తరమున కుదిరిక నందు నంమనను ƒ పరముని సమ్మతి భయమును దటిమితి
నిరయమును పొందనిక నుత్తమగతి ƒ వరుస ప్రాపింప నుంటి నతియనుచు
సురవినుతగుణుఁడు శుకుఁడు నృపతికనె ƒ నరపతీ ! దాని జెప్పెద వినుమా
కరివరదాయకు కరుణ దోఁచినది ƒ సరళమతి వైన నీ కెఱిగించెద
వినుమని యనె నిటు భావి నృపులవిధి ƒ జనులమర్యాద లన్ని సొంపునను
ఘనుఁడు బృహద్రథునకు పురంజయుఁడు ƒ తనయుఁడుగాగను నాతనికి మంత్రి
శునకుఁ డతని బరిమార్చి నృపతియై ƒ జనుల పాలింప కొంతకాలంబు
జనిన నాతనికి జనియించినట్టి ƒ తనయుని బ్రద్యోతనుఁడని పేరిడి
జననాథు జేసె నాతనికి బుట్టె ƒ మనుజనాథుండు విశాఖరూపుఁడు
అతనికి బుట్టును నందివర్ధనుఁడు ƒ మతినిడు వీరలు నూరు ముప్పదియు
నతులపై నెనిమిదేండ్లు పాలింత్రు ƒ క్షితి జనించు శిశునాగుఁ డనురాజు
తనయుఁడగు గాకవర్ణుఁ డాతనికి ƒ తనయుఁడగు క్షేమవర్ణుఁ డాతనికి
తనయుఁడు క్షేత్రజ్ఞుఁ డనువాడు నతని ƒ తనయుఁడు విధి సారుండు నాతండు
గను నజాతశత్రుని నాతండును ƒ గను దర్భకునిఁ నతనికి జయుండు
ననఘుఁ డతఁడు గను నందివర్ధనుని ƒ గను నతఁడు మహానందియు ననగల
ఘనులు వీరు శైశునాగులనఁగా ƒ గన పదిమందియు మున్నూటరువది
జను వత్సరములు భూమి నేలుదురు ƒ విను మహానంది యొక శూద్రసతిని
దాను వరించియు నతి బలశాలియు ƒ విన మహాపద్మపతియను సుతుతో
గానబడరంత క్షత్రియవంశము ƒ యీా నయంబునను రాజులు శూద్రుల
ననుసరము నంది ధర్మహీనులయి ƒ మనెదరా మహీపద్మునకు కొడుకు
లెనిమిది సుమాల్యుఁ డాదిగా బుట్టి ƒ జనపతులగుచును నూరేండ్లు క్షితిని
ఘనత పాలింత్రు అవల కార్మకుడు ƒ మునుముగా రాజనవకము జనించి
వినుము నందాఖలను నేలుబడిని ƒ గనఁగ నొక భూసురోత్తముఁడు వారి
మనువు గూలబడ సేయునప్పు డట ƒ జనులుపాలింప మార్యు లేలంగ
వినుమా ! భూసురుడును చంద్రగుప్తు ƒ డనువాని రాజ్యమున గూర్చె నతని
తనయుఁడగు వారిసారుఁడు వానికి ƒ తనయుఁడు నశోకవర్ధనుఁ డనఁగా
నతనికి సుయశస్సను నతఁడు సుతుఁడు ƒ నతనికి సంయుతు డతని పుత్రుండు
అతి సుగుణుఁడు శాలిశూకుఁ డనఁగా ƒ నతనికే సోమశర్మఁడు వానికి
సుతుఁడు శతధన్వు డతఁడు బృహద్రథు ƒ నతులసాహసుని గనువీరు మౌర్యు

లను గూడి నూటముప్పదియు నేడు § నను వత్సరములు ధరణి నేలుదురు
వినుమా! బృహద్రథుని సేనాపతి § యును ఘనుండు శుంగుండతని నొంచి
గను రాజ్యంబును గను నగ్నిమిత్రు § దనయునిగా నా తనికిసుజ్యేష్ఠుం
డను నతఁడు బుట్టు నాతఁడు గాంచును § తనయుని వసుమిత్రుని నతఁడు గనును
అతఁడు భద్రకుని నతఁడు పుళిందుని § నతఁడు ఘోషు నాతఁడు వజ్రమిత్రు
డతఁడు భాగవతు నతఁడు గను సుతిని § మతిమంతు దేవభూతుఁ డనువాని
ఈసుంగులన పదిమంది వినుము! § ధారుణీపతులు నూటపండ్రెండు
జేరునబ్దములు దేవభూతునిఁ § తీరు చెరుచు గణ్యామాత్యుఁడు నగు
ఘనుఁడు వసుదేవుఁ డనువాడు నతఁడె § జనపతి! యతనికి భూమిత్రుండన
దనయుఁడు గల్గెను నాతనికి సుతుఁడు § విను నారాయణుఁ డనువాడు రాజ!
ఘను లాగణ్యుల మూడునూరులను § గనపై నలుపది యేండ్లు భూమినిఁ
జనుల నేలుదురు యీ వరుస గుదురు § మనుజవర! నాలుగగు నబ్ధుల దరి
గనెడు భూమి పాలించియు మోహము § నను విడుపు గవరు మానవనాథులు
గనరు శాంతమును కాలము చలనము § నను గూరుటయును నన్ని దరలుటయు
నరపతుల మహిమ లతిసాహసమున § నురగపతి నుడువనేరడు వినుమా!
ధర చిరకాలము వసింతు రెవ్వరు? § సగణు లిడి భ్రమలు వీని వదలుమా
కరి, తురఁగ, రథము శిలపై భవము § పరిమాణపాటి శాశ్వత మెట్టుల
తరమందదు నిజ మరయు హరిసేవ § పరతమతి గూడు భవము ధన్యమగు
గజిబిజి నడింప నిదె పరికరంబు § సుజనతతు లిటుల భజనల శ్రీవరు
నిజము నెఱుంగుచు గాన రుచి వెలసి § నిజతత్వ మరసి ముక్తి జెందెదరు
నరనాథ! వినుము కణ్వవంశమున § నరుడుగ సుశర్ముఁడను రా జొకండు
ధరణి బాలింప బుట్టి యట్లుగా § సరసన మెలంగు భృత్యుడొక్కండు
విను మాంధ్రజాతియును దగువాడుఁ § గన వృషలుండను నాఖ్యగలవాడు
జనపతిసుశర్మ హింస నందించి § తను నధర్మంబు జేర రాజయ్యె
గనఁగ నతని యనుజుండు కృష్ణుఁడను § నొనరైన పేరుగల డతఁడు బుద్ధి
గని రాజ్యమేలు విను శాతకర్ణుం § డనువాడు సుతుఁడు వానికి తనయుఁడు
ఘనుఁడు పౌర్ణమాసుఁడు నగు వానికి § దనయుఁడు లంబోదరుఁ డతని సుతుఁడు
ఘనుఁడౌ వలకు డాతఁడు గాంచెను § తనయుని మేఘస్వాతి యనువాని
గను నతఁడు దండమాను దనయునిగ § విను మాతఁడు హాలేయు నతండును
గను నరిష్ఠకర్మయు నను వానిని § తనయునిగ నతఁడు తిలకుని నటుగను
నతనికి బురీషసేతుఁడు సుతుఁడగు § నతడు సునందుని నతఁడు వృకునిగను

నతఁడు జటావుని నతఁడు శివస్వాతి ॥ నత డరిందముని నతఁడు గోమతిని
సుతులుగా గనెదరా గోమతియును ॥ సుతుఁడు గనుఁబురీ మంతుని గాంచును
నతఁడు దేవశీర్షుడను వానిగను ॥ నతఁడు శివస్కంధుఁ డనువాని గాంచు
తనయునిగా నాతఁడు యజ్ఞశీలుగను ॥ నాతఁడు గను మృతస్కంధునిని
విను మతఁడు యజ్ఞశత్రుని గాంచును ॥ తనయునిగ నతడు గాంచు విజయుని
జనవర యతండు చంద్రబీజ గను ॥ గను నతఁడు సులోమధి యను వానిని
ఇటుల పెక్కండ్రు బుట్టి నన్నూరు ॥ తటమందు నట్టి యేబది యారగు
చటుల గతి దరలు వర్షముల పృథివి ॥ పటుతరపు శౌర్యముల పాలింతురు
అంత నాభీరు లేడ్వురు గర్దభుకలింత పదుండ్రను గంకవంశజులు
వంతునపదారు గురు పాలింతురు ॥ అంతమీద నెన మండ్రు యవనులును
పరిపాలకులుగ నా బర్బరులును ॥ ధరణి ప్రజలుగ పదునాల్గురు మునుగ
దరమంది యేలుదురు మఱియు వినుము ॥ కురుండులును పదుమువ్వురు నట్లుగా
పదునొకండ్రు మౌనులు పాలింతురు ॥ పదియు తొమ్మిదగు నూరుఁలు తొమ్మిది
గడియు హాయనంబులు భూమినేల ॥ గుదురం దెద రందున మౌనివంశ
ముల వారందరు మున్నూరేడుల ॥ నిల బాలింతురు యా సమయంబున
కిలికిలానగర భూపతు లందున ॥ తిలకింప భూతనందుడు వంగిరు
లును శిశునందుం డాతని భ్రాతయు ॥ ఘనుఁడైన యశోనందుఁడు ప్రవీరు
డను వారలు వీరత నూరుయారు ॥ గను నబ్దంబుల నేల నేలెదరు
వినుమా నృపులకు పదమూఁడుమంది ॥ తనయు లుదయించి యందున నాల్గురు
జనపతులు బాహ్లికమును బాలింప ॥ గనెదరు మిగిలినవార లేడుగురు
జనపతు లట్టుల గోసలావనికి ॥ విను మందుపుష్య మిత్రునికి సుతుఁడు
తనయుఁడు దుర్మిత్రుడగు నాతనికి ॥ జనవరా ! యాంధ్రు లేడ్గురు కోసలు
రును నేడ్గురల్లె వైదూర్యులునన ॥ గన నైషధు లన ఖ్యాతి నందెదరు
ఘనుఁడు పురంజయు డనువాడు మగధ ॥ కును రాజుగ జన్మించి శూరుఁడయి
దనపరాక్రమము నను రాజులనుఁ ॥ కనలున వంశము లడిచి ధర్మరతి
దనర పుళిందుల యదుమద్రజనుల ॥ గని వారు ధర్మహీనులు గా గని
వనరుహానయనుని పూజించ సెప్పి ॥ వినయవిజ్ఞాన కలితులుగ జేసి
జననాథ ! అతఁడు పద్మావతి నా ॥ గను పేరందిన పురిరాజధాని
దనకు నిలయముగ ధరణి బాలించు ॥ వినుమా ! గంగాప్రయాగ తలమున
జనవరులు శూద్రప్రాయులునుంగా ॥ గనగ నుపనయన హీనులు పాషం
డులునగు విప్రులు నొప్పుచుండగా ॥ నల సౌరాష్ట్రవంత్యాభీరుల

నలమాళవార్బుదముల దేశముల వెలయుదురు ప్రభుత తమ్మ దక్కఁగా
విను చంద్రభాగ ప్రాంతంబులలో గన నటు గాశ్మీర మండలమునను
మనము దుర్నీతి గనగ బుద్ధి చెడు తనము వాటించి మ్లేచ్ఛప్రాయులయి
క్షితినేలుదు రాశూద్రమతు లటులె గతినందు సింధు తీరము జనవర!
అతుల సత్యధర్మముల దయారతి నతుక బడదు వారలకు కర్మగతి
బ్రతుకు దురితగతి బొంద క్రోధులయి సతతము నారీశిశుగోద్విజులను
గనిన హింసింప రోయక పరధన వనితాపహారులై సాత్వికంబు
నన నెట్టిదోగా రజస్తమంబుల దనరు గుణకృత్యముల ప్రీతి గాంచి
బల మాయువు తరుగంగ గర్వించి జలజలోచనుని శుభదుని వరదుని
వలనిభక్తి నిక్క దలఁపు ఘటింపక కలిమి గోరి యన్యోన్యవైరులయి
చతురు కలహములను పాపమతిని అత్తరుణంబున జనులు తచ్ఛీల
మత్తుకొన వేషభాషల నేరిచి మత్తుగాని పొత్తు కపట మందెదరు
దినదినము ధర్మములు క్షీణమంద గన నసత్యంబు భూమి మొలకెత్తె
నన వృద్ధిగాంచ నాల్గువర్ణముల ధనవంతుఁడె రాజనగ బరఁగెడును
కలిమి గలవాఁడె బలవంతుఁడౌను కులహీనుఁడయ్యు కులపెద్ద యగును
పలుగాకితనము నోడి గట్టియున్న తలవడి న్యాయము దీర్ప రా జరయ
ఏమనఁగవచ్చు నాకాలమంద నేమ శూన్యులయి జారచోరరతి
కామక్రోధముల దాస్యమొనర్చుచు తా మార్జించిన ధనము వ్యయముగా
వ్యసనముల దవిలి పస చెడి లేమిని కసిబిసి నందుచు కొండల గుట్టల
పసినందు కాయకూరలకు దాసి రసహీను లగుచు జిక్క దుర్భిక్ష
శీతకాలాదికముల తాపముల చేత నలమబడి యల్పమతులగుచు
పాతకాశ్రయులు హీనాయువులును నాతరమ్మనని క్షీణబలులు నయి
యుందురు రాజుల పాటు లట్టివిగ చందము చెడుదురు ధర్మమున దెఱచి
కులాశ్రమంబుల న్యాయములు వమ్మ సులక్షణమ్ములు భూమిని కఱవులు
రోగము నణపవు ఓషధీలతలు యోగు లపహాస్యములకు లోగుదురు
భోగిసేవ్యులను దిట్టుదు రంతట త్యాగము లడంగు లోభములు వృద్ధి
యపుడ ధర్మసంక్లేశ ధరణిగా రిపుభీషణుఁడగు భువనపోషణుఁడు
కపటుల చపలుల నసత్యవాదులు సపరివారముల జంప బటువు గని
శంబరగ్రామము విష్ణుయశుఁడు నా డంబరహీనుడు ద్విజుఁడు విశిష్టుడు
అంబరవర్ణుని దలంచు నతనికి నంబుజనేత్రుఁడు కల్కియై బుట్టు
దేవతాబృందములు నతులు సల్ప పావన మునీంద్ర సన్నుతుల జయము

దావలంచి దేవదత్త మనియెడు § కేవలాశ్వమున నారూఢత గని
తన మండలాగ్రమున ఖండించియు § గనును పృథివి నంతయును నెమ్మదిని
వినుమ జనపతీ ! విగతక్రూరమును § ఘనమైనమోద పూర్ణముగ జనము
తను వినుతింపంగ నిజపదమందును § వనజనయనుఁ డా యవతారమ్మును
గనుట మనము విన బలుక నోచితిమి § మనమున నమ్రత నిలిపి మ్రొక్కుదము
విను మంత ధరణి హరిభక్తి వెలయు § జనుల కల్మషులు హరిజపార్చనల
దనరు ధర్మంబు నాల్గుచరణముల § నసఘ ! కృతయుగము జననమ్మందును
జనపతీ ! చంద్ర భాస్కరభార్గవు § లను గురుండునుఁ రాశి నొక్కటిని
గని ప్రవేశమును గన్నయప్పుడే § వినుము కృతయుగము అపుడే నటించు
మనుజనాథ ! నీ జననంబు మొదలు § కొని భావికాలమును గూర్చినట్టి
ఘనత కృతయుగము రా వగు తరుణము § జనవినుతము గని జెప్పితి వింటివి
యనఘ ! నీ వాది నందాభిషేక § మును గూర్చువరకు నగు కాలసంఖ్య
వేయినూరు పదియైదబ్దంబులు § ఓ యమలమతీ ! నారాయణుండు
ఈ యనువున దుష్టులను బరిమార్చు § న్యాయమున్నరపి తన పదమును గను
ననిన శుకమౌని గని జననాథుఁడు § మునివర ! చంద్ర సూర్యగ్రహమ్ముల
యనువైన నడన కాలవర్తనము § లను వినిపింపుమ యనపరీక్షిత్తుఁ
గని యిట్లులనియె వినుమ జననాథ ! § మును లేడురున్న మండలంబునఁ
నంతర్గతంపు పూర్వాబుక్షముల § చెంతల సమముగ నొకనక్షత్రము
పంతరింపుగను నశ్విని మొదలుగ § నంతయు గననగు నిశికాలమందు
విను మట్టికాలమగు మనుజమాన § మున నూరేండ్లగు నా సమయమ్మున
ఘనుఁడు జనార్దనుఁడైన కృష్ణుండు § తన నిజ ధామమునను ప్రవేశించె
ఆదినముననే కలి రాకగనియె § యదువంశంబు కృష్ణుఁడెన్నాళ్ళు
ముదమున వర్తిలె నంత కాలంబు § గదియక నొదిగియు కలి వేచియుండె
జనవర ! మఖయం దే దినంబునను § ఘనులు సప్తర్షులును చేర నగు నగున్నా
గన నా దినంబు గణన కలియుగము § విను కలియుగాబ్దములు ద్వాదశమునైన
శతములవియు దివ్యుల మానమగును § క్షితిజనాధిపా ! యా మండలంబు
గతి గని యిప్పుడు మఖయం దున్నది § వితత మొనర్తును ఆ మహర్షిగణ
మెప్పుడు పూర్వాషాఢ జేరుదురో § యపుడ కలి వృద్ధిఁ గాంచు నిధి విశద
మవ్వుడు శ్రీవరుని లీల లీలాగు § నపురూపమ్ముల మలప్పు దుష్టులను
వనజనాభుండు వైకుంఠమ్మును § గనిన దినమాది వేయివర్షములు
జనఘ నాలుగవ పాదము నందున § నొకరందును కృతయుగ ధర్మచర్య

జనపతు లెందరో మును కాలమున ఽ మనము నచ్యుతుని పరమున చేరిచి
గనిరి యశంబును తపముల యాగముఁలను దాన, జప, వ్రత పరాయణత
చారు విరాగమునను భోగాదుల ఽ దారసీని మతి వెలయ దేహముల
సార మెఱింగి వదలియు హరి జొచ్చిరి ఽ వారి యశము లీ నాటను వెలుఁగెడు
శంతను తమ్ముఁడు దేవాపి యనఁగ ఽ యంతరంగ నిర్మలు డొకండును
సంతతఖ్యాతి నెగడు మరుత్తుం ఽ డనంతు మది నిడు మనుకులు డొకఁడు
వీర లిరువురును యోగనియుక్తులు ఽ సారవిజ్ఞాన ధర్మధీకులను
మీర వసింతురు కలాపమనియెడు ఽ చారుతరము నగు నొక్క గ్రామమున
వారిజాక్షు నానతిని కలియుగము ఽ బార కృతయుగము జేరిన యప్పుడు
సారధర్మముల జనుల బాలింప ఽ మేరగని యవల నారాయణునిఁ
పారాయణంబు గని ముక్తి గండ్రు ఽ రో రాజవరా! ద్విజులు యుగంబుల
చారముల కొలఁది నడకల గందురు ఽ నీరజనాభుని సేవించి రేని
జేరెదరు మోక్షమును మది నెఱుఁగుము ఽ దార రధోగతి జాడ సత్యమిది
ధీరగుణా! నే నెఱిగినదంతయు ఽ మేరదప్పకను బూర్వుల చరిత్రి
సారతరపు నడవళ్ళు వచించితి ఽ నేరరు సతతము నిలువ ధారుణిని
కాలంపు జాడ లెఱుగంగరాదు ఽ కాలకారణము పరమాత్మయనుచు
చాలున పూర్వపు ఋషులవాక్యములె ఽ మేలంద నిలుపవలయు మనంబున
నీలవర్ణు భజనంబు సత్యమును ఽ పాలింపు దయయు నిష్కపటంబును
మాలిన్యరహిత! చిత్త మంహింసయు ఽ నోలి యవన్నియు ముక్తికి పదంబు
లను మహీపతీ వీని వలంచిన ఽ తగవున విష్ణుఁడు దరిని జేకూర్చు
పగటున సమయును కలుషంబు లెల్ల ఽ నిగనిగల గములు పుణ్యసంఘములు
భూదేవియు నగు భూపతుల గాంచి ఽ యా విధంబు నీ వెరుగనిది గాదు
సూ విష్ణురాత! వినయాంగభూష ఽ సావకాశమున నిక్కమ్ము నిల్వ
నీకు సెప్పంగ బూనితిని వినుము ఽ పాకటధర్మ మటుండని జనవర!
వీకగొని నృపులు యొకరొకరు మించ ఽ గైకొనిరి పౌరుషముల ధరణికై
యాలముల పగలు చెలరేగ గదిసి ఽ నేల రొంపిగొన రక్తధారలను
తూలనంది మరి సోలుచు రాజ్యము ఽ నేలుదుము మేమ యని కాలమహిమ
గనబోక నాది నాది నా దనుచు ఽ గన వివేకంబు మఱచి హింసించి
తనను వది గూర పరితపించుచును ఽ ఘనులు సహితంబు సమమతిని వదలి
విను మరియును ధన వనితా సక్తత ఽ మనమున లోభము గూడ మత్సరము
గొనువారెగాని విరక్తిగానరు ఽ వినదగును వారి కొందరి వచింతు

విను భరత సగర కార్తవీర్యులును । గనభగీరథుండు నిషధ శంతను
లును గాధి యహుష కువలయాశ్వులును । వినన౯ రఘువును తృణబిందుండును
గన యయాతి పృథురామ ఖట్వాంగు । లును మాంధాతయు ధుంధుమారుండు
యనఘా ! పురూరవుఁడు కకుత్స్థుండు । దనుజవీరులను వినుమటు జనవర !
కనకకశిపుండు వృత్రుఁడు రావణు । డును నముచి శంబరుఁడు కనకాక్షుఁడు
గన నికపెక్కురు నృపులు దైత్యులును । వననిధులలోను గలధరణికైన
మమతల పలువిధ వికారముల నగు । శమ మెఱుఁగనట్టి నడకల దిరుఁగుడు
క్రమములను బోయి రా నిలువ రిపుడు । విమలమతి గాంచి విష్ణువును గొల్చి
కేశవ ! వైకుంఠా! వాసుదేవ !। ఈశ ! జనార్దన! ప్రద్యుమ్న హృషీకేశ ! సమస్తా
ధీశ ! నృసింహా ! పద్మనాభ ! స్వ । ర్గేశా ! । యనంత ! యని స్మరణమంది
జననజరా మరణముల రహితంపు । ఘనత ననఘమతులకును నిలయంబు
వనజనయను నతి యొక్కటియే యని । మనము సంసారమున మలప నబ్బ
రెటు ముక్తిగాన హరిని నెద విడకు । తటము ముక్తి నీ యరచేతిఫలము
పటుతర మందుము నీవన జనపతి । ఇటు లడిగెమరియు మునివరునిగాంచి
కలియుగము పాపమిళితంబు గదే । తిలకింప జనులు ముక్తి నెటు గంద్రు ?
విలసనంబెట్లు ? కాలం బే క్రియ ? । జలజనేత్రుఁ డే మహిమ గనంబడు ?
లోకములు నిల్చు టే విధి ? క్షయంబు । నే తరణినైన నెఱుఁగనియాత్మని
నేకమతిని దలఁపుంచి యడిగితిని । నీకు నతి సెపుము సోకకు మసూయ

## —: యుగధర్మ ప్రాకృతాది ప్రళయచతుష్టయ వివేచనము :—

నావిని ముని హర్షమున నిటు లనియె । పావన నాల్గుయుగముల చొప్పును
నీవు వినియున్నవాడ వయ్యెనను । కేవలంపు పరిమాణ విశదముల
విను ధర్మమూర్తి చతుష్పాదముల । గను నడక సత్యమును తపంబుదయ
యును దాన మనఁగ నాలుగు నవియగు । యొనరు చనువందు కృతకు పూర్ణనడ
శాంతియు దాంతియు నాత్మజ్ఞానము । నంత నిక్క వర్ణాశ్రమంబు లివి
యెంతో నిష్ఠ పాటింపుల సంగతి । మంతనమ్ము లానంద మయంబును
వంతు గానెదరా తొలియుగమందున । నంత త్రేతలో లోపమొక్కింత
శాంతిదాంతి కర్మాచరణమ్ముల । సంతతానంద మటు గనెద రయ్యా !
పాదములమూడె ధర్మమూర్తికగు । పాదుగాను ద్వాపరమున రెండుగా
సాధనవు నడకగను నా మూర్తియు । భేద మతి గనరు విప్రార్చనంబు
యాదరమున హింసను నడగ గనుచు । వాదనల ఘనుల నిందింప రందు

నా యుగము ఘోర కలి దారునందు § న్యాయము శూన్యము జను లధర్మలును
సేయుము క్రూరము కామములు మెండు § బాయరు క్రోధము లోభచర్య లట
మదము మదింపున మితమును గానరు § గదియుదురు మత్సరముల మనుసులైన
ఛాయవిడరు మోహంబు సర్వమున § నో యుర్వీశా! మఱియును వినుమా!
వదలుదురు కులములను దెగడి శీల § మది యుడుగ వలనుగన రాశ్రమముల
దురన్నభక్షకులై నిర్దయులై § దురుద్దేశ్యముల గురుత్వ మందుచు
నిరంతరము పరపీడనల రోత § పరంబులగు కార్యముల వేగ గని
భయముల సాధుల నకారణంబుగ § నయము విడిచి వైరమున నందించి
దయ, సత్య, దాన జప, తప, వ్రతముల § చయన తొలుత నీనయము నందించి
త్రికరణమ్మ లట్లుగ నొప్పి మరియు § నలమైన వంచనల జాడల గని
యకలంకమతుల ధనవనితాదుల § వికటమును గూర్చ నపహరించియును
దురితైకమతులు దోషైకగుణులు § పరమైకతత్వ శూన్యమనస్కులు
పరనారిరతులు స్వకాంత విముఖులు § ధరణీసుర నిందకులు వైద్యాజీ
వనులు ధనహీనులై మఱి జననీ § జనక, సుత, దార, సోదర, బాంధవు
లను విసర్జించి సురతాపేక్షుల § వనితల హీనుల దవిలి మతి చెడియు
గనరు కులగౌరవముల దుశ్శీలతను మలయుదు రందునను జనంబులు
గనెదరు భయముల తామడాంబరముకలను బ్రాహ్మణజనములు పరార్థముల
గొనఁగ సవనాది కర్మలను గూరి § యనయమును శూద్రసేవలంద గని
కుమతు లగుచు శమదమాదు లడఁగక § క్రమము దప్పి యన్యాయము వలంచి
సముని సర్వేశు జాడనేబోరు § క్షమాపతీ! కలియుగంబు నందున
నొక ముహూర్తమున ధర్మంబు వెలయు § నకుటిలత ద్రోసి పరితాపము గొని
యకలంకుఁడగుచు హరిని స్మరియింప § సుకరమగు ముక్తివలను గన నగును
దాన నీ యుగము శ్రేష్ఠతరమందు § దీని గమనింపవేని నీచమను
దాన తరమటులె గాగ మనంబున § శ్రీనివాస! నరసింహా! మాధవా!
దానవాంతకా! కలుషవిదారా! § ధ్యానారూఢా! నారాయణ! శ్రీ
మానినీధవా! యజ్ఞాక్ష! శౌరి! § మానాతీతా! మానితస్వరూప!
యని నుతింపుగన క్రతుశతఫలమును § గనవచ్చు జనులు నోరు నొవ్వంగ
వనమాలధరుని బొగడుటయె శుభము § జనవరా! నీవు హరి నటు బొగడుము
మూడవయుగమున హరికీర్తనంబు § గూడు మనంబున వెలసి శ్రీకృష్ణు
బాడుచు ముందున కలిదలఁచి ప్రేమ § వీడరు శ్రీశుని సేవలందునను
బీడుగాదు హరిభక్తిచే ముక్తి § తోడంద ముదము భవరహితం బది

యాడితి నిక్కము బెడుపు జడుపుర్కా § గూడనీకు మనమందు హరిగనుచు
నీడగను మతని రాడు యముఁడు నీ § జాడ గదాధరుండండుండ గనియు
వేడు మనంతుని నేడు సుదినమని § పాడుమా మమతచేయు భక్తినుతి
విను ప్రళయవిశదములను వనజాక్షు § డనుసరంబందు లీలల వచింతు
వనజాసనునకు యుగసహస్రంబు § ఘనతమానంబు నన నొక్కపగలు
దనరు రాత్రి యటె దానినే మునులు § గనిరి నైమిత్తిక ప్రళయ మనుచు
ఘనుఁ డా విధాత లోకంబు లాత్మ § లోన నిలిపికొని శయనించి ప్రకృతి
వినష్టమందిన నదియె ప్రాకృతం § బనెడి ప్రళయముగ బల్కెద రట్టుల
పగలు నైమిత్తికము రాత్రి యటుల § తగవున ప్రాకృత ప్రళయము చొప్పగు
జగము సృజయించు నాధాతకు నవి § సగటున రెండును నొక్కదినంబగు
ఇట్టి దినంబులు మున్నూటరువది § పట్టున గూడిన బ్రహ్మవర్ష మది
అట్టి నూరు వత్సరంబు లా § పుట్టుక కమలంబును వానిపట్టు
గనెడి యాయువది యంత వేరొక్క § ఘనుఁ డాపదంబునకు బుట్టనుండు
యనువదియ యగును దాని వివరింతు § విను ముదము శోభనము గూడు మనక
ఆ విరించి యవసాన మందునను § దావురించు నూరేండ్లు వర్షంబు
తోవ గనరాదు పిపాస జిక్కియు § యే విధమున దరిపోని నాకలిని
తీవరమందుచు నన్యోన్యబలిమి § నావిరి నిలువఁగ తము నొకరి నొకరు
దినుచు కాలవశమున నాశమంద § నినుఁడు తన కిరణముల నత్యుగ్రత
గని సర్వదేహముల సముద్రముల § విను భూములందు రసమంత గొనుచు
యొనరు మాయింప సంకర్షణాఖ్య § నవల మదియు గాలాగ్ని నా జగము
దన విజృంభణమునన కాల్చి వెలుఁగ § జనును నూరేండ్లు నంతమీదటను
ననిలము లన్నియు నేకముఖంబును § గని వీచు సర్వమును ధూళిమయము
అవుడు నూరేండ్లు ధారాధరములు § విపరీతవృష్టి నిండ్రి నానతిని
విపర్యయము భువనములకుగాగా § విపుల భీషణత వర్షించ గానె
వినుము బ్రహ్మాండ మెల్ల జలమయమై § గన వే రొక్కటి గానరా దందు
విను మరియు భూమి గంధయుతంబుగ § గన రా జలమున లీనంబునందు
అనలమున రసముతోడ జలమింకు § గన రూపముతో నది యడఁగు వాయు
వున స్పర్శముతో నా పవనంబును § మనువుమారు గగనమున శబ్దంబు
నను నరంబుగా గగనము మహత్తు § నను దావు గనును విదితంబుగాను
విను తైజసంబునగు నా మహత్తు § గన నహంకార మందున జేరును
అదియు వైకారిక గుణయుతమయ్యు § కుదించు నింద్రియ చయము దనలోన

అదియు సత్త్వాది గుణముల గ్రసించు | నదియై ప్రకృతిని లీనంబు గాంచు
వినుమా! ప్రకృతియు ననాది నిత్యము | నన నవ్యయంబు వాఙ్మనంబులకు
గన నగోచరము గుణరహితంబును | విను మను మహదాదుల సన్నివేశ
మును లేని దగుచు స్వప్నాద్యవస్థ | లను రహితమగుచు భూతహీనమయి
గనగ ప్రతర్క్యమగు దాని ఘనులు | విన బల్కుదురిటు మూలభూతమను
పద మదే ననుచు నీ వది దెలియుము | ఇదియె కాలవిపర్యయంబయిన
యదనున పురుషావ్యక్తులు లీనము | గదియుట ప్రాకృత ప్రళయ మనదగును
వినుమొక విశేష మిందునను గలదు | గనఁగ బుద్ధీంద్రియార్థ రూపములు
జనవరా! భేదములు చాల నిగుడు | తాను దెలియు జ్ఞాన మాశ్రయం బదియే
నదె వెలుఁగు నృపా! దృశ్యాదృశ్యము | లాదియు నంతము గలదై స్థితిగను
నిది తేజమునకు దీపచక్షువులు | నుదాహరణముగ గొనదగు నరవర!
యవి వేరుగావు వాని విధమనని | భువి గను నవన్ని పదార్థమూర్తిక
గవయ జోడు భేదంబు నిశ్చయము | పవిత్రమది యది వింటి వావిధిని
విను బుద్ధిపుటుక తొలుత కారణము | గన నవస్థలను భేదాత్మమయత
జననాథ! యోగమందు నాత్మయును | గన బుద్ధియుక్తమును గాంచినట్లు
జీవుఁ డీశ్వరున లయోదయములను | తావల మందును అన్యోన్యత గని
జీవమయుఁడు పరమాత్మ యొక్కండె | జీవులు పెక్కులు గా దోచుచుండు
గన తేజమొకటె పెక్కు రంధ్రముల | గనుపించు కరణి దెలియవలె నతని
కనకపు భూషలవన్ని యేకంబుగను | దోపు కరణి ఆత్ముండ ట్లే
భానుఁడు మేఘావరణముల దృష్టి | నానబడు కరణి మాయానుసరణి
తాను నే ననెడు నభిమాన ముడుగ | నానందమూర్తి యపుడె దర్శనము
తానుగా దాత్ముఁడే తా ననవలె | తా ననవలె తొలి యదియు మానవలె
సకలాంతర్గతు డగును పరమాత్మ | సకలమందువలె తనయం దొప్పును
ప్రకటితముగ నా పరతత్త్వమయుఁడు | వికటమతులకే పరుఁడుగ కనపడు
నిరంతరము యోగీంద్రులా నిత్యు | పరంధామునిఁ భక్తలోలునిఁ
తరంబెంచి కని నిరసింతు రన్ని | భరం బందువారల రక్షణకై
కనుచు నే యుండులో వెలిని యుండి | విను సర్వకాల దేశములందున
విను మతఁడు లేక భువనములు లేవు | గన నతఁడు శాశ్వతుఁడు నీ వంతియు
తనువుపై మమత గూరకు మయ్యా! | వనమాలిని శరణనిన మేలయ్యా!
నిను తనను నైక్యమును గూర్చునయ్యా! | కనవు భవభయము సుడి సోకవయ్యా
ఘనుఁడైన దేవు డొకఁడె హరి యయ్యా! | జనవర విష్ణుని సేవింపుమయ్యా!

జననియుదరమున నిను బ్రోచెనయ్యా! | విను మింతవాని నిను జేసె నయ్యా!
ఘనుల మీ తాతలను నేలె నయ్యా! | నిను వారివలెనె పాలించునయ్యా!
అతని మయముశే కల్పమ్ములన్ని | యతని యోగములె ప్రళయంబులన్ని
అతఁడె సర్గంబు లాదిగా గూర్చు | నతని లోఁజేర ధ్యాన మొనర్చుము
హరికీర్తనంబు భవజలధి తరణి | హరి వందనంబె నిరతానందము
హరి యర్చనంబె సర్వశోభనము | హరి భక్తి మోక్షనిధి గనుట యగును
వినినాడవు నాల్గైనప్రళయముల | ననఘమతీ! హరి వెలయు లీలలను
మును ముందుగానె దెలిసితివి ముదము | ననుసంధించును హరి కృపామయుడు
గనెడు విజయమును జనవర! వినుమా! | కనకు మొక్కింతయైన సంశయము
శ్రీనివాసుండు ముక్తిధామమున | జ్ఞానసంపూర్ణ తను రాజిల్లుచు
ధ్యానసమర్చన గుదురు హంసులను | దాను మోదమును గనుచు విహరించు
తా నట్టి గన్న యానందంబును | మానిత మతి తను భజించుపూజ్యుల
గాన జేయు తమ ప్రారబ్ధమునకు | గా నయినకాలమును దా నెఱిఁగియు
పూనిక మఱవక మృతిని దూతగా | దాని పంపించు మఱియు దనరూప
మూనిన సేవకులను ముందుగానె | జ్ఞానవిజృంభణ మాను సంగతిని
దానిమూలమగు వైరాగ్యకలన | చే నిర్మలంబు గని తనువాదిగ
గను మమత లణపంగ హెచ్చరిక | బూన ధృతిబెంప పంప దారుమును
దానవారి హరియనుజ్ఞ యిదియని | మానసమున ముద మంది సిద్ధతను
తాను గుదిరి ముందుగనె నియతిగొను | దాన నీతనువు బ్రహ్మార్పణమని
చేనందియున్న ధనవనితాదుల | గానైన సర్వంబును నటులనె
మాని విష్ణురూపమును తా బొంది | మాన మపరిమితమైన యానంద
మే నందమింప యుద్యమంబు గొని | వే నందు ముక్తినెలవును హరి గను
దాన నీ విటుల హరిని గలయుదువు | ఆ నయము దరియు నిన్ను నికముందు
నేను మృతిగాంతునను భీతిగొనకు | దాని ముక్తినందించు దూతయని
మానసమున దలపోయు మనుమాన | మానవలదు సత్యంబు మఱవకుము
మానవుల ఖలుల కది భీతిదంబు | మానవుల సుజనతతికి భయహరము
మానుటకుగాదు ధాతామరులును | దాని దప్పించుకోలేరు యెట్టి
జ్ఞానులైన మునిగణంబులైనను | వేనవేలు కల్పముల బ్రతికినను
దాని వివర మింతటిదే ననుచును | ధ్యానించుము శ్రీమాధవు నచ్యుతు
మానసమందవిక జన్మభయంబులు | శ్రీనికేతనుడు నీయం ద్రోప్పను

## పరీక్షిత్తు తక్షకునిచే దష్టుండై మృతి నొంద నతనిపుత్రుండు సర్పయాగము సేయుట :—

నరవర ! మరణపు కారణంబిందు ¶ స్థిరమిందె యనదు జీవుండాతని
వరుస నెఱుంగు మాకాశరూపునిగ ¶ ధరణిగల సర్వఘటములను దనరి
తరమందె కర్మ ఘటనాశనముగ ¶ సరణిన తొలి యాకాశమున జేరు
శరీరనిర్మలతను నీశ్వరునికి ¶ పరంబెంచి యాపట్టున గలియును
నిరంతరము జపశుద్ధిని గంటివి ¶ వరంబు నీకగు హరిదయగలందు
తైల మున్నంత వర్తియును వెలుఁగు ¶ పోలింపుమిటుల జీవులమెలఁగుట
యేల జాలి బలమాయువైశ్వర్య ¶ జాలము లన్నియు కర్మవశంబులు
నీలోని యాత్మకును పరమాత్మకు ¶ నేలాగున భేదంబు గూర్పకుము
నీలవర్ణు పరమన్ని వెలుంగుట ¶ యా లక్ష్మీపతి సర్వసమర్థుఁడు
కాలమతఁడె కలవన్నియు నతఁడే ¶ ఎలిక నాతని యనుమతిని గొనక
చీమచిటుక్కని రాదు భూరమణ ¶ సామజవరదుని సన్నుతియె నీకు
నోము జపతపము యోగమ్ము లదియె ¶ శ్యామవర్ణుఁడటు చుట్టి రక్షించు
నన జనవరుండు హర్షమును బొంది ¶ ముని తనుకుతుకమునను వీక్షింపఁగ
వనజనేత్ర ! బుధవినుత ! ముకుందా ! ¶ నినుగంటి తలపునను ధ్యానమందు
యొనరంది లోన వెలుపల సర్వమును ¶ నీవు లేనిచోటే లేదని
మనమున దెలిసితి యది నీ కొసఁగితి ¶ గొనుము సర్వమును నాకు నీపరమె
మును ఘనులెందరో ! నీశరణ్యమున ¶ మునగు గనరు సంసృతినితరించిరి
దిననాథుఁడు తమమును గాననట్లు ¶ నను నీ సన్నుతి తేజమందించె
గననిక సంసారాంధకూపమును ¶ మును నిన్ను గొలిచినట్టి నోముంట
నిను నిట దలఁచితి నీయందె జేర్చు ¶ కొనుము సంసిద్ధముననుందు దేవ !
మేలు మేలు శ్రీకృష్ణ ! కేశవా ! ¶ శ్రీలలనవినుత ! శ్రీనారాయణ !
జాలిబాపి ననునేలుమాధవా ! తూలనెంతు దురితమును గోవింద !
పోలికనుగొంటి నన్నిట విష్ణో ! ¶ బాలువలెను గను వో మధుసూదన !
లీల నిను దెలిసినాడ త్రివిక్రమ ! ఏలుము వామన ! శ్రీల శ్రీధరా !
నను హృషీకేశ ! దరిని నిలుపుకొను ¶ మనఘ ! ముదము నాకది పద్మనాభ !
దామోదర ! సంకర్షణ రూపా ! ¶ నామసహస్రముగను వాసుదేవ !
స్వామీ ! ప్రద్యుమ్నా ! యనిరుద్ధా ! ¶ కామదూర ! పురుషోత్తమ ! యధోక్ష
జా ! నారసింహా ! యచ్యుత ! దేవా ! ¶ యో నిర్మలాత్మ శ్రీజనార్దనా !

నా నతిని గొనఁగ దగును మహేంద్రా । నీ నిజచరణములకు శరణు హారే !
శ్రీకృష్ణనామ ! సూరిజనస్తుత ! । నీకృప నాపై నిండుకొనియె నిట
ప్రాకృతబుద్ధిని మలపి శ్రీశుకులు । సాకృతి నాతఁడు నీవె నాస్వామి !
శ్యామవర్ణ ! సర్వాంగసుందరా ! । నాడుకీర్తనము ముక్తిగనుపదము
ఈ మహిని నీదు మహిమగణన గన । మహితపదము మోదమున నబ్బు నా
గనెను శుకుఁడు నపుడు ధ్యానగరిష్టత । విను రాజ ! నీవు ధన్యుఁడవు నగుదు
వన పరీక్షిత్తు మీకరుణను నే । ననఘుఁడ నైతిని నిను మ్రొక్కుచుందు
నను నిలాపతిని యాదరమున గని । వనిజభవపౌత్ర పౌత్రిసుతుఁ డనియె
శ్రీనాథుఁడు నీ పక్షముండు నిక । భూనాథ ! నీవు చిత్తమున గొంకు
మానంగ నగును ముక్తి కరతలము । మానసము మలినరహితంబు నయ్యె
గద కార్యంబులు పొందు స్థితి దనరె । భిదురధరపోషకుని యిచ్ఛ గాంచి
ఎదురెందును గననీక యతనికృప । వదలక నీ సన్నిధి మూర్తిగనియె
రమకవలెనె యని నిశ్చల మందుము । గదియ బా యమునిపంపు నీయందు
గదియ నయ్యెదవు ఉత్తమలోకము । బెదరురూపణఁగె ముమ్మాటికీ నీ
మొదలోన హారిని నిల్పు మెల్లపుడు । అదరుగొనకుమా ! నిరాశపరుపును
బొందనయ్యె నని నతని నతులగొని । మందరాద్రిధరు మది బదిలమంద
ఇందిరాంగ ! జగదవన ! యదునాథ ! । సుందరకపోల ! సూర్యకోటికళ
నందిన సనకసనందనాద్యమర । వందిత ! ఓం శ్రీకృష్ణాయనమః
గోపీమనోహారా ! దుష్టదమన ! । నీపాలి ధ్యానపారీణత నను
గాపాడి యఘము రాపిడిని గూర్చె । వాపోవ నింక యమశిక్షణమున
నోపరాత్పరా ! నా పుణ్యరాశి । ఈ పుట్టున భవరోగ మడగంగ
నీపరంబైన బోధ వినజేసె । చూపు నీరూపు ప్రాపు ఫలింపఁగ
పంచభూతమయ పరతత్వనామ ! । యంచిత సిద్ధాచార ! విశ్వాత్మ !
కించిద్జ్ఞ దుర్లభా ! యనంతా ! య । కించనుండవౌ స్థూలాణుస్వరూ
పకుఁడవు గంటెని పాపాబ్ధిదాట । సుకర మీనాటి నీ సేవగంటి
నకుటిల హృదంతరాళసంచార ! । సకలసంపూర్ణ ! సరళా ! శ్రీవర !
యనుచు వేంచేసె మునిరాజేంద్రుఁడు । ఘను నాకౌరవ రాజేంద్రు కరుణ
గనుచు శ్రీపాలు పాలందు ముదము । నను దారుకొనఁగ నాస్థలమునుండి
విను డా భూపతి దర్భాసనమున । నొనరున వసించె వరుస విముక్తి
గనుటకు నిర్వృతి యవధూతవోలి । వనజనాభు దర్శనమె యన్నింట

కనుల గనుచు మన మందు హర్షించె ఽ వినెడు ధ్వనులన్ని ప్రణవోద్భవములె
గా నిశ్చలంబు జాగ్రత్సమాధి ఽ తా నంది కాయమందు తలంపును
పూనిక చొప్పున తారసిల నీక ఽ ధ్యానగరిష్ఠత విశిష్టుఁడునుగా
నా తరుణమునకు శాపవిజృంభణ ఽ నా తక్షకుండు బ్రహ్మత్వ కళను
ఆతరంబంది మార్గమధ్యమున ఽ చూతకు నద్భుతచర్య గన్పడని
భూతలేశు బ్రతికింపఁగావచ్చు ఽ నాతురంబుగను కాశ్యప నాముని
భుజగ విషహరణ సమర్థుడగు నొక ఽ ద్విజుని విలక్షణచరితు బొడగాంచి
సుజనవరా! నీవెందుజొర? నింత ఽ నిజశక్తి మీర నేగెదని తెలిసి
విజయంబు తనకు సిద్ధి ఘటిల్లఁగ ఽ గజపురవల్లభు కాలంబు దెలిపి
దెలియంగ జెప్ప బ్రహ్మలిఖితంబు ఽ గలదు క్షితీశుఁడు ముక్తి నందునని
యల భూనాథునియందు పరమందు ఽ వెలయును గాకిల నేల నిలిపెదని
వెలనిక్క రత్నముల దాన మిచ్చి ఽ ఎలమి జొనిపించి మరలిచె నాతని
తలఁపుకొలఁది తన తలఁపు ఫలింపఁగ ఽ నిలవేల్పు మగుడ దా తీవరమున
నవనినాథు సన్నిధికిఁ జేరఁగా ఽ నవసరమందుచుఁ దా నట్లుజేరి
యవిచారశీలపరతగల నృపుని ఽ గవయఁజేరు బ్రాహ్మణులఁ దా జేరి
యొక ఫలంబు చిత్రింపు వర్ణరుచి ఽ సకలార్థసాధనీయ ఫలశక్తి
సుకరంబు దాన గలదని ప్రభునకు ఽ వికటార్తి దొలఁగ నిండని యొసగియు
తా నందు సూక్ష్మరూపున క్రిమియై ఽ యా నరేంద్రుని హింసింపఁ దానుండె
వార లాపండు క్షితీశునకు నిడ ఽ సారంబు నెన్నుచును వారిజాక్షుఁ
డీ రూపున సర్వంబు సృజించుగ ఽ శారదాధవుని నిల్పుటబ్బురమె
యని దానిని దా నాస్వాదించిన ఽ జను లచటివార లెల్లరు భీతిని
గని చకితవేగమున జూచుచుండ ఽ మనుజపతిని పీడింప ఘోరంపు
కాకోదరమై రాజును ముట్టిన ఽ శ్రీకాంతా! నీకరుణ నాజన్మ
పాకంబు నందె నని సంతసమున ఽ నాకరివేల్పును ముమ్మారు వాసు
దేవా! యనుచును హరితేజమందు ఽ నావైకుంఠము నందు జేర్పంగ
జీవుని దేహము బాపి దీప్తిగని ఽ యా విధి నందెను క్షితిసురవచనము
సెల్ల హరిగలసె నభిమన్యుసుతుఁడు ఽ ఎల్లజీవాళు లార్తిని గాంచిరి
కొల్లగ నమరులు ముదంబు పేర్మిని ఽ జెల్లు గురిపించి రా నృపతియెడల
విరుల వరుసలవి యుత్కంఠముగా ఽ నరవరుం డట్లుగా నతని సుతుఁడు
వరగుణయుతుండు జనమేజయుండు ఽ కరము శోకమున గూరి విధులన్ని
నరస జెల్లించి రంజిల్ల యంత ఽ నురగములతోడ తక్షకుని నుర్వి

మననను ప్రజ్ఞ సెల్లింతు ననుచు § జనులుబ్బ తాను మునుల గూర్చుకొని
యనలుడుబ్బగా యాగంబుజేయు § వననిధిపరీత భూములన్నింట
గలసర్పంబులు మంత్రబలంబున § నల భూనాథుని హోమగుండమున
విలవిలలకుంది పలువిధములగు § కులమ్ములన్ని నశియించ తక్షకుఁడు
భయముననువారి ఇంద్రుని శరణము § నయముగాంచి యా జంభారిదైన
నయపూజితంపు వాసముననుండ § స్మయముదోప నా యాగమురచించు
ఘనులగు ఋత్విక్కుల కింద్రుచేష్ట § లను రాజుదెల్ప మహనీయమంత్ర
బలమున నింద్రుని గూడి తక్షకుడు § అల హోమగుండ మందు జేరంగ
వలనున రానగు నట్లు శ్రేష్ఠవాక్కుల § సహేంద్రతక్షకాయానుబ్రూ
హి యని పిలువగా నింద్రుఁ డాస్థాన § మయుత విడనాడి భ్రంశమునను రా
చయున బృహస్పతి తత్తరంబునను § నయము విషయంబు గూర నృపు గాంచి
అయరో! యజ్ఞము మానుట హితంబు § నయమును దప్పగద విధినియమం బిది
భయము నింపకుమ! జీవరాసులకు § జయము నిన్నందె చాలింపు మింక
విలయము గలుగును విధివ్యతిరేకత § కలకాలకీర్తి నీకు నిలువరము
గలుగవలెనన్న! మానుట తగవగు! § నలువయే యున్ని జీవగణంబుల
కర్మబలంబున వాని సృజియించె § ధర్మమిట్లొప్ప యా యానడవడు
లర్మిలిగా తమ జాతులమెలఁగు నశధర్మమావహిల దాన నశించునె
నీవేల? యింత క్రూరకర్మంబు § భావమున నింపవలయు నెల్లరును
తా వలంపు కర్మమున బుట్టుదురు § వే వర్ధిల్లుట పోవ్రటాదిగా
నవకాశమందు ఆ ఫలమ్ము నీ § భువి సంచరించి పాపపుణ్యముల
దవులు ఫలంబున దారే యందుకు § సవివేకమందు మయ్యా! జనకువలె
సంధి నెఱిఁగి యాతఁడు మానినట్టి § ప్రవిమలంబె నీ యందు వెలయునన
నతఁడు విధి మానె పితరులు చెలంగ § బ్రతికె రా తక్షకుడు నింద్రుఁడును
అతులమోదమున సురలు కుసుమంపు § తతుల క్షితీశుని నందలి సభ్యుల
గురిసిరి నృపుండు యజ్ఞేశు శాంతి § పరిణత నొనర్చి పురమును జేరెను
ధరణి ప్రజల బాలించె సుఖతరము § లిరవుగ నెల్లర హర్షముల గూర్చి
వినుఁడో! మునీంద్రులారా! హరియే § యనయమున బాధ్య బాధలక్షణత
గనఁగ దనమాయ దోపించు భూము § లను సర్వములను మోహమందించు
యవి నెఱిఁగి భక్తి వివశతను గూడి § ప్రవిమలాచార భావశీలముల
సువిచార భావమందు నాతండు § దవులడు సంసృతి నతఁడు ముక్తిగను

## —: శ్రీ వేదవ్యాసుండు వేదములను బురాణములనుఁ లోకమందుఁ బ్రవర్తింపఁజేయుట :—

సూతుని గాంచియు శౌనకాదు లోకపాతకదూరా! వినుపింపు మింక
యే తరుణమ్మున వేదవిభాగము ఽ లా తరంబునకు కారణమున్నె!
ఆ నయంబు మా కెరిగింపుము నా ఽ మానసీయుండు పలికె నీ పగిది
శ్రీనివాసుఁడే వేదవ్యాసుడు ఽ తాను నా మునిని సన్నిహితుఁడగును
దాన యా మూర్తి వేదముల నన్ని ఽ పూనిక గొని విభజించె శుభమ్ముగ
ఆ మునికి శిష్యులగుదురు నల్వురు ఽ ధీమహితులు పైలుండు జైమినియు
సుమంతుఁడును వైశంపాయనుండు ఽ నేమమంది వ్యాసోపదిష్టులయి
క్రమమొప్ప నాలుగైన వేదముల ఽ సమమతిని యొక్కరొకటి గైకొనుచు
లోకములవ్యాప్తి గొన జేసిరల్లె ఽ వీకగొన శిష్యపారంపరతను
నా కలంకులగువారు ధన్యులుగ ఽ మీకు దెలిపెదను వినఁదలచితేని
యనినను సూతుని శౌనకుండు కని ఽ మునినాథా విను తమిని గొంటి మన
ఘను డా సూతుఁడు వారి కనియె నిటు ఽ వనజోద్భవు హృదయమున మొదలిటను
జనియించె నాదమొకటి యది నివృత్త నిరోధమంది మూర్తీభవించి
కనుపట్టెను నా నాదోపాసన ఽ ఘనులైన యోగులందున ముక్తులు
గనఁగ నోంకారమందు జనించెను ఽ వినుతినందె దా సర్వమంత్రముల
నిగముల నుపనిషత్తులకు మొదలు ఽ నగు శక్తి వేదమాతయు ననదగు
జగద్యోతమది త్రిగుణాత్మకమై ఽ జగిని నకారోకార, మకారము
లనఁగ త్రివర్ణములై వెలుగొందగ ఽ వనజభవుడంత నా ప్రణవంబును
పొనరు పరచె స్వరస్పర్శాంతసముకలను మఱియు సూక్ష్మములు లక్షితము ల
క్షణముల నొప్పగ సకల కర్ణార్థ ఽ రణన విశేషత నక్షర సమితిని
గుణమంది సమామ్నాయముగ జేసి ఽ యణువున ఘనమును గూర్చునట్టి యా
వనజాసనుండు వానితోడనుగ ఽ గొని తనదు చతుర్వేదముల బలికె
ఘనత గన చతుర్వేదంబుల నటు ఽ తనయులగు బ్రహ్మఋషు లవినేర్చిరి
వినిపించిరి తమ శిష్యపరంపర ఽ దనరు వేదంబు లిటు ప్రతియుగమున
యట్టి వేదముల పూర్తిగ పఠింపు ఽ మెట్టున శక్తిని గనలే రనుచును
పట్టుగొన్న భగవంతు డెఱింగియు ఽ పుట్టె పరాశరునికి సత్యవతికి
యా వేదరాశి విభజించె నాల్గు ఽ పావనపు భేదముల నామములను
నే వినుపింతును వినుఁడు ఋగ్వేద ఽ మావిధిన యజు స్సామాథర్వణ

లన పైలుఁడుగొని ఋగ్వేదంబును § వినుఁడది ఋక్కులసంఖ్య మితమునను
ఘనతను బహ్వృచ శాఖ యనబఱగు § వినుఁడా పైలుఁడు నింద్రప్రమితికి
ననుమతిని బాష్కలునకును జెప్పెను § ఘనుఁడు బాష్కలుం డాసంహితను
నొనరున నాల్గగు భాగముల గూర్చి § తన శిష్యులయిన బోధ్యునకు మరియు
వినమితుండైన యాజ్ఞవల్క్యునకు § గన పరాశరున కగ్నిమిత్రునకు
నుపదేశించెను వారును నేర్చిరి § గనుఁ డింద్రప్రమితి తనదుసంహితను
నిపుణత మాండూకేయునకు జెప్పె § విపులతను దేవమిత్రున కతఁ డటు
అతఁడు సౌభరియు మొదలగువారికి § మతిమంతులకును నుపదేశించిరి
సుతుఁడగు శాకల్యున కా సౌభరి § యతిశ్రద్ధబూన నుపదేశించిన
మతివిశారదుఁడు దనశాఖ నైదు § గతుల భాగించి వాత్స్యమౌద్గల్యు
లకును శాలీయ గోముఖుఁడు శిశిరులకు శిష్యులుగా నుపదేశమిచ్చె
వినుఁడు శాకల్య శిష్యుల నొక్కట § ఘనుఁడు జాతుకర్ణుఁడు నానతండు
తనకు శిష్యులగు బలాంకపైంగులకును వైతాళుఁడు విరజుఁడునాగను
ఘనులకును జెప్పె సార్థవంతముగ § మును విన్న బాష్కలునకు పుత్రుండు
ఘనుఁడు బాష్కలియు వాలఖిల్యాఖ్య § దనరు సంహితను దన మతి వెలయఁగ
జనవినుతిని బాలాయన గార్గ్యులకును కాసారునకును నొనర జెప్పె
గను డిత్తెరఁగున బహ్వృచసంహిత § మునులచే పెక్కు నాకృతుల గూడె
దండిబుద్ధి యా వైశంపాయను § డండగొన్న యా యజుర్వేదమును
మండనంబుగా గొని రతని శిష్య § మండలి క్రతువుల నాధ్వర్యులయి ప్ర
చండులయిరి సంస్తుతుల నందునను § నిండుమతిని విను డా వైశంపా
యను శిష్యుడైన యాజ్ఞవల్క్యముని § తన గురునిపట్ల నపరాధంబును
నొనరిచినంతన కుపితుఁడు గురువయి § తనవిద్య తనకు నర్పింపు మనిన
నతఁ డటుశేయఁగ నంత వెలి గ్రక్కె § మతి నది గాంచిరి యజుర్గణమునకు
పతులైన దేవతలునా గరిష్ట § మతిచే ననుజ్ఞ గొని తిత్తిరులై
మునుల పొగడికల దాని భుజించిరి § యనఘమతులు వారలు వానిశుద్ధి
గను తలఁతు రవ్వి వేదములగుటను § వనజనయనుమతి గొనిన తెలివిసిర
వినుఁడు తైత్తిరీయులు నాశాఖల § గన నదియె కృష్ణయజుర్వేదమన
ఆమునివరుండు యాజ్ఞవల్క్యుండు § భూమి నవతరించిన విష్ణుఁడగుట
[illegible]మెయిని మరల వేదమ్ములను వెస § గా మనము నచ్చ చెవుగురుఁ డెవఁడో
ఆ మహాత్ముఁ డిక భానుఁడే యనియు § ఆమిహిరు తపమునను మెప్పించియు
హాయరూపంబున కనికరించియును § చయున యజుర్వేదమును బోధించి

నయము వెలయించె నాశాఖవారు ౹ నియమవిధానులు వాజసనేయులు
వెలసిరి భువిలో ఘనత గరిష్ఠులు ౹ అల యజుర్వేద మదిరెండునయ్యె
తెలియుడింక సామమును జైమినియు ౹ విలసితవర్తన చే జదువనయ్యె
తనకు సుతుండైన సుమతికి జెప్పగ ౹ తనకు సుతుండైన సుకర్మునికి నది
వినజెప్ప నతఁడు దానివేయైన ౹ ఘనప్రభావ శాఖలు గాగ జేసి
కోసలుసుతుండు హిరణ్యనాభునకు ౹ వాసిగ తనసుతుడు పౌష్యంజికినిగా
వే సమీచీనగతి నుపదేశము ౹ నాసింప నిచ్చె కరుణామయతను
వారలిరువురును నావంత్యులనెడు ౹ వారికి నుదీచ్యులను వారలకును
సారమొప్పఁగ బోధించిరి వారలు ౹ ధీరులును బ్రహ్మవేత్తలై గొనిరి
వా రేనునూర్వు రౌదురు వినుండు ౹ సార తపస్సంపన్నత నట్టుల
సామవేదమిటు వితతము ధరణిని ౹ ఆమహితా థర్వణ వేదమునుగా
సుమంతుఁడును గొని తనశిష్యుఁడైన ౹ సుమతియగు వేదదర్శున కీయఁగ
సమమతి నతండు శౌల్కాయనికిని ౹ క్రమత బ్రహ్మబలి నిర్దోషులకును
విమలుఁడగు పిప్పలాయనునకుగా ౹ యమ మందనిచ్చె వారు చేకొనిరి
వినుఁ డిక బభ్రుఁడు కుముదుఁడు శునకుఁడు ౹ ఘనులు జాబాలి బభ్రువంగిరసు
లను వారలునుగా సైంధవాయనుఁడు ౹ అనఘమతి గొనిరి నాల్గువేదములు
వానికశేలు చర్యలు ననంతుని ౹ స్థానమందినవె పవిత్రగతులను
మానులార ! యిక పురాణక్రమముల ౹ వాని నామములు మీరు వినఁగదగు
వినుడీ త్రైయ్యారుణియును కశ్యపుం ౹ డును సావర్ణియు యకృతవ్రణుండు
హారీతుఁడును వైశంపాయనుండు ౹ పరేశభక్తులు వీరలార్వురును
నిరంతరము హరిస్మరణ నేమరని ౹ వరంపు మతిగల నాజనకుఁడైన
పారాశర్యుని శిష్యవరుండగు ౹ సారచరిత్రుఁడగు రోమహర్షణుని
వలనను దెలిసిరి యాపురాణముల ౹ వెలయునవియు సర్గాదులనెడు పది
విలసితలక్షణముల చెన్నొందును ౹ ఇల నవి కొందరు నైదే నందురు
తెలియుఁడవి పదియునెనిమిది పురాణ ౹ ముల నొప్పుచుండు పదివిధమ్ములును
ఘనులార ! బ్రహ్మమును పాద్మంబును ౹ వినుఁడు వైష్ణవము శైవమ్మునాగ
గన భాగవతము భవిష్యోత్తరము ౹ వినుఁ డట్లె నారదీయము మార్కం
డేయము నాగ్నేయమ్ము మరియునుగా ౹ ఆ యనువె బ్రహ్మకైవర్తంబును
నేయమటుల లింగము గారుడంబు ౹ లో యనఘులార మత్స్యము కూర్మము
వినుఁడు బ్రహ్మాండమును వరాహంబు ౹ గన వామనంబు స్కాందంబు ననఁగ
ఘనత నెగడు నివి పదునెనిమిదియును ౹ వినుఁ డటు మరియును నుపపురాణములు

గలవు వీని విన జదువ లిఖించిన ఽ గలుఁగుశుభము లట యవల ముక్తియే
నెఁవు వానికని సూతుఁడు దెలిపెను ఽ అల శుకుఁడు పరీక్షితునకు జెప్పిన
ననువనుచు శౌనకాది మునులకును ఽ విని రందు శౌనకుఁడు సూతమునివి

## —: మార్కండేయోపాఖ్యానము :—

ఘనతవినజెప్పు! మయ్య మృకండుని ఽ తనయుఁడు మార్కండేయుని చరితము
పాపులు పునీతు లే క్రియ ? మూఢుల ఽ కే పగిది ముక్తిని ? యన నీపథమాలె
యా పరమేశ్వరులగు హరకేశవు ఽ లేపరనంబుల వశము గనవచ్చు
నని నిట్టుల యని నీవచనమ్ముల ఽ వినినారమగుట వివరింపు మదియు
నన వారిగాంచి హరకేశవులను ఽ ఘనమోదము దను వెలయ నతుల గని
వినుఁడా ముని మార్కండేయుఁడు హరి ఽ మనమున వసింప ధ్యానమును గూర్చి
బ్రతికె ముదమునను కల్పములె న్నో ఽ సతతం బాయువు తనపరమునంది
యతులు మునివరులు నుతింతు రాతని ఽ వితథ చరితమగు నాతని చరిత్రి
మతిమంతులార ! శుభమది వచింతు ఽ కుతుకమున వినుఁడు శివలక్ష్మీధవ
నుతుం లిందొప్పను ధన్యముచేసురు ఽ గతిసమంజసముగా భక్తి నిగుడు
మును కల్పాంతమునను లోకమ్ములు ఽ వననిధి మునుంగ జలపూర్ణంబున
ఘనభీతినించు నంధకారమున ఽ మునివరుఁ డొక్కఁడునయి చరియించెను
గనె నొకట సూర్యకోటితేజునిఁ ఽ గనగ బాలుండు ముదితాస్యుండును
గా గన్నమాత్రమున నిర్భయమున ఽ వేగమంది యాతని హృదయమందు
యోగమెలుగంగ జేరి వేలేండ్లు ఽ బాగొప్ప దిరిగి వటపత్రశయన
మందియున్నట్టి బాలుని మరల ఽ కుందు జిమ్మంగ గనెనన సూతుని
యంద రేకముగ నా దివ్యచరిత ఽ విందొనర్పవే ! వినిపింపుము మము
అనిన సూతముని భృగువంశమందు ఽ మునిమృకండుండు తనయునిఁ గూర్చి
ఘనమైనతపము బ్రహ్మచర్యమున నొనరందించియు హరిగూర్చి నిష్ఠ
గని కోవిద నుతిగొనుచుండ నంత ఽ వనజలోచనుఁడు కనధవళాంగుఁడు
కవికరమున దర్శనము నొసంగిన ఽ మునియు నా దేవులను హరిహరులను
వినుతించి మ్రొక్క వరమడుగుమనిన ఽ తనయుని గుణాఢ్యు నిమ్మన గమంచి
దని కోర్కెదీర్చి తిరోహితులుగా ఽ జననమ్మందె మార్కండేయుఁడునా
చిరకాలజీవి పరసద్గుణుం ఽ దురుతరతపస్వి నిష్ఠాగరిమను
పరమందినట్టి మృత్యువును దార్చె ఽ పరిభవము నందె నంతయుం దతని
పరతేజమ్మున బారె నిజ పురికి ఽ సురనాథుం డా ముని తపము జెరుప

సురుచిరాంగనల యప్సరసలనుఁ § కరము విలాసం బొప్ప బంచినను
వా రా మునివరు తపోవనంబును § సారకుసుమ లతలను సొంపునంద
వరతరుల పుష్పఫలభరితములుగ § సరసిజకువలయ కల్హారాదుల
సరసిజాకరము లవి మఱియు నటుల § సారసక్రౌంచ బక కారండవ
రాజహంస కోయష్టిక సంతతి § భ్రాజితంబంద మధుకర శుకపిక
రాజ శకుంతారావ మిళితముల § నేజ మింపొంద క్రూరములు విడచి
వనమున గలట్టిమృగచయము లెల్ల § నొనరు నిర్వైరముగ తిరుఁగుచుండ
కన నబ్బురంబు నింపి గానముల § కనకాంగు లతని వలపు గొనజేయు
నతఁడు చలింపక వేణువీణాది § సంతత రవములను చకితుఁడు గాకను
రతనాది భూషితులు నైనవనత § లతిసుకుమారుల సోయగము గనక
ఘనుఁడు జటావల్కల ధారియైన § ననలుని పోలిక దపమున విలసిల
వినఁ డా వనితలు మగిడిరి డాయక § మునుల సోకుటలు ఫణుల ద్రొక్కుటలె
యని నెలవుజేరి యఘవునకుదెల్ప § మునిమహిమ కతఁడు నబ్బుర మందెను
హరి యతనకి ప్రత్యక్షమై నిలువ § కరములు మోడిచి శక్తిమై వినుతి
పరమానందము గూర నర్చింప § వరదుఁడు వరంబు గోరు మనంగనె
చిరమాయుష్యం బనంత యుగముల § నూరతర ఖ్యాతిని నంద నా కిమ్ము
దేవ ! యనఁగనటు లగుగాక యనిన § నా విశ్వేశ్వరు యీశు జగన్నుతు
భావజ జనకుని భవభయ విముఖుని § భవపద్మభవుల భవ్యతను గూర్చు
తన దివ్యచరణసేవలను హాని § దిననాథకోటి తేజు స్వయంప్రభు
కనకాంగద మణిభూషు వనమాలి § కనకచేలవిలసితుని నళినాక్షు
గని యఘరహితా ! యఖిలజగన్మయ ! § వనజనాభ ! నీమాయ దెలియంగ
ఘన మెవరికుండు నిగమసన్నుతా ! § నిను నిర్వికారు నిర్గుణుఁ డనఁగా
ఘనులు వచింతురు నీ వీ జగముల § గను సృష్టియెట్లు ? విలయంబదెట్లు ?
వినఁగ మఱి యవియు జనన మెట్లందు § మును నీకు మొదలు తుది లేనిదెట్లు ?
స్థితి బ్రోతు వెట్లు ? సగుణుండ వెటుల ? § మతిగనెద నిన్ను నీ మాయావిధి
నతి గొంచు దెలియ నిమ్ము కలత సిను § మతి జొరనీకుము ! యిది నా యభీష్ట
మనిన చిరునగవు దోప కనికరము § నను నటుల యనుచు నై నిమిరి తాను
మునివినుతమ్ముల తన నిలయము గనె § మునియు హరివదలి శివుని బూజించె
నంత నూరేండ్లు ధారాధరములు § వింతధారలను జగముల నుంచిన
మెంతో గాఢాంధ మునుగ్రమ్మ భీతి § వంతుగొని తాను తెర వరయుచుండ
నా జలమధ్యము నందు తలతొకట § తేజమున గాంచె వటపత్రంబున

యోజగొని తాను నచ్చటఁజేరి ఽ రాజిల్లు నొక్క బాట గన నందు
విమల చరణములు పద్మములబోల ఽ కమనీయ పద్మరాగము ఛాయన
నలరారు నతని గని మ్రొక్కగానె ఽ నలరున లోపల నరయఁగ మనమున
తలఁపు బాడమంగ దా నిటుజేరెను ఽ విలసిత ముఖమున నది విచిత్రముగ
యుం దనేక కాలమ్ము విహరించె ఽ ముందు తా గన్న భువన జాలముల
చంద మొప్ప సకలంపు భూతములు ఽ అందునను తనదు నాశ్రమంబునుఁ
గనుచు నాశ్చర్యమును బొంది యుండు ఽ నను తొల్లి గనిన చందమున బాలు
గనె మరి యిట్టుల పలు తేప లందిఽయును వేసరిక గని హరిని దలంచెను
విను మబ్బాలుని జేరి గౌగిటను ఽ దను జేర్చుకొనెడు ముదమున జూచిన
వనజనయనుండు తిరోహితమ్మను ఽ గనె నెప్పటివలె గనె ముని తనదగు
నెలవును కలగని మేలుకొనినట్లు ఽ జలజలోచనుని మాయను గాంచెను
నలరు గొనె మునియు తపమొప్పటివలె ఽ సలుపుచుండె నిశ్చలమున దరలదు
శ్రీకంఠరాణి జగదీశ్వరిశు భఽమాకరంబంద జేయు నుమాపతి
నాకరణి తపము సలిపెడు మునిసుతు ఽ నాకార విభూతిని గాంచి చిత్ర
తరముగా తనకు దోప శంకరుని ఽ పరమహర్షమున గని కరము మోడ్చి
హర ! విశ్వనాథ ! యజ్ఞానధ్వంస ! ఽ సురవరిష్ఠ ! యుపధారు గిరిరమణ !
పరమేశ్వర ! హో భక్తజనపోష ! ఽ యురగహార ! ధవళాంగ ! శంకరా !
ధరణి తపము నొనరించు మృకండుని ఽ వరపుత్రుఁడైన మార్కండేయుని
వరమున నీవును గూర్చుము హరివలె ఽ యిరువురొక మూర్తు లౌదురె దేవా !
హరిహర భేదం బెరుగరామనియు ఽ పరమతపమ్మున ప్రకృతిని జయించె
నితరము జితేంద్రియత్వమున గుదిరె ఽ కరమతని నీవు కరుణింపవలయు
శరణిని ప్రియంబు నా కదిగూర్చుము ఽ సరస నేతెంతు నీయనుసరణిని
నన శంకరుండు తా సంతసించి ఽ విను వానితోడ నే నొక్కమాట
విన వచింపఁగన నుంటిని సుమ్మా ఽ కనుగొంటివా ! నామనము త్ర్యంబకుని
వనితవు శక్తివి పరమశుభదాయి ఽ వన నీవుమాయ యాదిశక్తియున
ఘనతగలవు నీ యిష్ట మట్లెయని ఽ ముని వనంబునకు వృషభయానమున
శంకరుఁడు శాంకరీ యుతుండునయి ఽ పంకజభవాది సురలు వినుతింప
కింకరులు కొంద రేతేర వెంట ఽ సొంకమటు జెంద గగన మార్గమున
ధరణి కేతెంచి యతనిఁ గాంచిన ఽ వరతపోనిధియు నగు నా భూసుర
వరుఁడు కేవలము నిర్గుణాత్మనే ఽ చిరమంది యుండి యితర మెఱుంగఁడు
హరుఁ డేతెంచుట నైన దలంపడు ఽ పరమేశ్వరినిఁ గనఁడు చిత్తమున

వారలాశ్చర్యమున గూరిరందు । సారమహిమగల డగుటను శంభుఁడు
ధీరతను పాటవమునంది యతని । సారతరవృత్తి నెగడు హృదయమున
జేరి యోగమున మాయాప్రభావ । సారమెరింగిన ధీరుల కెల్లను
మేరలెన్ని జేరికల మెలఁగెదరు । మీరలు వినుండు హరుఁడటు హృదయము
జేరిన వెంబడి నే మునివరుండు । యో రజతాద్రినివాస ! జయహరా !
వృషభారూఢా ! యుమాపతీ ! విష । విషయనిర్జితా ! శంభో ! యీశ్వర !
విషకంధర ! సురభయాపహరణా ! । విషమశరదమన ! విషధరభూషా !
హర ! విభూతి రుద్రాక్ష మాలికా । ధర ! త్రిశూల ! డమరుక విరాజితా !
అష్టమూర్తి ! యాధార ! జగన్మయ । ఇష్టమందించ దర్శన మిచ్చితే
కష్టసంహారి ! కరుణామయ ! యీ । దుష్టభంజనియు ప్రీతినిజాపఁగ
వచ్చితిరి శుభము లన్ని నను జెందె । యిచ్చితిని మ్రొక్కులివె గణింపమా !
ముచ్చిలిక బడదు నాతప మింకను । బొచ్చె మింతయును లేని మీ కరుణ
నచ్చు నందితిని నే ధన్యుఁడ గద ! । సచ్చిదానంద ! సర్వేశ ! భవా !
నీవె భూమి మొదలైన భూతములు । నీవె మహదహంకారము ప్రకృతియు
నీవె జీవాత్మ పరమాత్మ నీవె । కేవలంబు నా బ్రహ్మంబునీవె
కాలగళుండవు కాలస్వరూపి । కాలకాలుడవు కాలధర్మడవు
నీలలోహితుఁ డవును నిత్యమూర్తి । జాలి దొలఁగ హృది లోన ముద మమరె
అని సన్నుతింప మదిని మెచ్చి యాతని తపశ్చర్యగని చిత్ర మెంచి
మునిశిరోమణిని పరమశైవుఁడవు । ననుగంటివయ్యా ! నర్మిలిని వరము
ననువొందగాను మహనీయుండవు । వననిధివాసుని మాయను గంటివి
నేను నీవు సకలంబు హరి మయమె । మానుము భేదము మాయావశములు
నేను హరిమాయ నెఱిఁగి సేవించి । మానమందితిని నిట్టిపదమునకు
గాన నిరభిమానము నినుబొందును । దాన సర్వమున భయరహితుండవు
నా మార్కండేయుడు మోదమంది । యో మహాదేవ ! వర మీదలఁతువె !
ఆ మాధవు చరణాంబుజధ్యానము । నీ మూర్తివంతమును నర్చించుట
దాన మృత్యుజయమును నే గాంచెద । నానందమయుఁడు నీకు శరణమ్ము
అనిసంతస నా మహాదేవుఁ డటు । గన వరమునిచ్చి గౌరీదేవియు
మునిని ప్రీతి నొనరించి నతి గొనుచు । గనిరి యానమున కైలాస శిఖరి
ఈ చరిత వినిన వ్రాసిన జదివిన । నా చతురుల దరి జేరదు మృత్యువు
నోచి యుండు రికముండు ముక్తినిఁ । వాచంయమి సంఘముల జతజేర

నందమింతు రవ్వారు సందియము । బొంద డిందునను భాగవతపదము
సుందరమందెద రందు మీరలును । నందమగు నాకు మీయందరకృప
నావిని శౌనకుడడుగ మరిబూని । యా విష్ణునందు మనమును నిలుపుచు
యో విజ్ఞాననిధీ ! సుకృతనిధీ ! । యా విబుధవందితుఁడు జనార్దనుఁడు
నీ మనమునందు నిలువరమందెను । మేము నిను జేరి యట్లొప్పగంటి
మా మనము శాంతినందె హరిచరిత । లే మమ్ము ముక్తపదవి జెందించు
ఈ మహిని మోదచర్య మము బొందు । మేము నిన్ను నతిజేతు మిం దొక్క
విషయంబు వినఁగ వాంఛ నొందితిమి । విషధిజామాతయైన విష్ణుండు
విషధరహితుండు విషశయనుండును । విషధిభవనుండు విశ్వేశ్వరుండు
ధరణి వినుతిగను తరణిరూపుండు । హరియే యటంచు నీవును బల్కితి

—: చైత్రాదిమాసంబుల సంచరించెడు ద్వాదశాదిత్యులక్రమంబును దెలుపుట : —

సరణిగన ద్వాదశముల రూపుగని । హరి సంచరించు వత్సరమందున
కనఁగ చైత్రాది మాసము లందున । వినజెప్పు మతని క్రమరూపు లెట్లు
మనమున నిలుపుచు ధ్యానింపవలెను । కనికరము పెంపునను విస్తరించి
దెలుపు మనిన సూతుఁడు వారి కనియె । నలరున హరిదలపున గూర్చి వినుడు
తొలుత చైత్రమాస పుటాదియందు । వలను గని సౌరగణ సప్తకంబు
వనజలోచనుని నియుక్తమందుచు । జనుల కనుకూల గతులను విలసిలు
టను పెక్కువిధుల చరియించు నందు । ఘనుఁడు పరీక్షిజ్జనపతికి శుకుఁడు
వినిపించె నిదియు దానివరుసలనె । విన సెపుదుమీకు వినుఁ డయ్యలార !
శ్రీహరి స్వరూపుడే మార్తాండుఁడు । ఆ హరికి నతనికిని నభేదంబు
బాహాటం బటుగాగ నాతండు । అహసంబంధపు కాలదేశక్రియ
లనెడి భేదముల ఋషుల సన్నుతిని । గనును నా విధులు బల్కెదను వరుస
లనఘులార ! చైత్రమున సూర్యుండు । ఘనతదాల్చు నామంబు ధాత యన
రొనరున కృతస్థలియును హేతియును । గన నాసుకి రథకృత్తుపులస్త్యులు
ననువారు మరియు తుంబురుండునా । దనరిన పరిజనులు లను గూరి తిరుఁగు
వినుడు వైశాఖమందున నర్యముడనుపేర । పులహుం డోజుండు ప్రహేతు
లును పుంజికస్థలియు నారదుండు । గన కంజనీరుఁ డనువారు తోడు
నను జరించు జ్యేష్ఠమున మిత్రుఁడనగ । తను నత్రిపౌరుషేయ తక్షకులు
మేనక హాహా రథస్వనులును నావెను । వెంట నందు వర్తిలుట గాంచు

ఘనత నాషాఢ మాసమునందున * వినుఁడు వరుణ నామము ఖ్యాతిగనియు
మునివసిష్ఠుండు రంభ సహజన్యు * లును హూహూవు శుక్రుండు నింకసుఁ
గన చిత్రస్వనఃలను వారిఁగూడి * దినవడకగనును శ్రావణమాసము
నను నింద్రుఁడనఁగ నాఖ్యనుంగాంచి * వినుఁడు విశ్వావసువు శ్రోతలునుఁ
ఘనులగు యేలాపుత్రాంగిరసులు * వినుతి నెగడు ప్రమ్లోచచర్యలును
తోడుగా నందు నడకను గుదురను * జాడగన భద్రపదమునను వినుఁడు
పాడి వెలయగను వివస్వంతుఁడన * నాడె మింపందు నామమును గనుచు
వినయమున నుగ్రసేనుఁడు వ్యాఘ్రుఁడు * ఘనుఁడా సారణభృగు వనుమ్లోచను
లును శంఖపాలుఁడును పరిచారులు * గను చరించు శుభములు చేకూరఁగ
వినుఁడాశ్వయుజము నందున త్వష్ట * అన పేరుగాంచి ఋచీకతనయుఁడు
కన కంబళాశ్వుండును తిలోత్తము * లును బ్రహ్మోపేతుఁడు శతజిత్తుఁడు
యనఘులైన ధృతరాష్ట్రుఁడను వీర * లనువారి గూడి చరింపును గను
ఇనుఁడు కార్తీక మందున విష్ణువు * ననపేర నటన గని పరిచరులుగ
సునయుఁ డశ్వతరుడును రంభయునుఁ * ఘనులు సూర్యవర్చసు సత్యజిత్తు
లనువారెగాక విశ్వామిత్రుఁడు * గన మఖాపేతు లనువారుజోడు
గని విహరించును మార్గశీర్షమున * తననామ మంశువును గాగ నొప్పి
మునివరుఁడు కశ్యపుడు తార్క్ష్యుండును * వినుతిగన్న ఋతసేను డూర్వశియు
ఘనుఁడగు విద్యుచ్ఛత్రువు మఱియును * వినుఁడు మహాశంఖుఁడునను వారల
గొను సహచరులుగ తాను తిరుగునెడ * మునులార! పుష్యమాసమున భగుఁడు
నన బిలువ నగును పరిసరుల వినుఁడు * కనగస్ఫూర్జ్యుడు నరిష్టనేమియు
గనుఁడు పూర్ణాయువులు కర్కోటకు * లును పూర్వచిత్తి యనువారలునుఁ
తనుగమనమందు నను వేళలందు * ఘనులార! యింక మాఘమాసమున
భానుఁడు పూషాహ్వయము వహించియు * ధనంజయుండును వాతుడు సుషేణు
డానందయుతులు సురుచి ఘృతాచియు * నా నయమునసే గౌతమ మహర్షి
వీరలు పొందుగ తా సంచరించు * చారుతరంబుగ ఫాల్గునమాసము
చేర క్రతునామమును రూఢిగనియు * భరద్వాజుఁడును వర్చస్వియునుఁ
గూరిన మతి పర్జన్యుఁడును నట్లుగా * మీర సేనజిత్తును విశ్వుండును
విను నైరావతుఁ డనువారితోడ * గను నడక లిట్లు వరుసగను నెలల
నినుని నుదయాస్తమయముల నీవిధి * మనమును నుపాసనము గూర్చునట్టి
జనుల దురితసంఘముల హరించును * గన నుభయలోక సుఖములను గూర్చు

మునులు నుతింపఁగ నప్సర లాడఁగ ఽ విన గంధర్వులు పాల నలరింప
ఘనులునై బ్రహ్మవేత్త లైనట్టి ఽ మునిశిరోమణులు నరువదివేవురు
వాలఖిల్యు లనువారు నుతింపఁగ ఽ నాలుగు వేదములును హయంబులుగ
నాలవాలంబు నందు భానుండు ఽ బలము బాహువుల నలరెడు ప్రతిష్ఠ
గనెడు నేర్పునఁ శ్రేష్ఠులు రథంబు ఽ నను వెనుకమ్రోఁచి ద్రోయు భరంబును
గొనియుందు రట్టి యనాది నిధనుఁడు ఽ ఇనుఁ డాదిత్యుఁడు ప్రతికల్పమందు
గనునట్లు కళల కాలయాపనము ఽ వనజాక్ష మయము లన్నియును నగును
మునులార! తెలియ జెప్పితి విశదము ఽ జననాథుఁడైన యభిమన్యు సుతుఁడు
మునిజనాగ్రణియు వ్యాసుతనయుండు ఽ ననఘుఁడైనట్టి శుకముని ప్రీతిని
వినిపించె మరియు భాగవతమ్మును ఽ మన మకల్మషముగా పరీక్షిత్తు
విన మాహాత్మ్యము నది నే వచింతు ఽ ననఘాత్ములార! వినుఁ డవ్విధంబు
ననుచు హరిని ధ్యానించె నీవిధిని ఽ వనజాక్షా మరనేత! వ్రతపోష!
కనకచేల! కారుణ్యపయోదధి! ఽ వనమాలి! విశ్వాత్మ! శ్రీకృష్ణ!
యజవందిత! సకలేశ! యచింత్యా! ఽ నిజదైవము! వసుదేవనందనా!
గజరాజరక్ష! కాంక్షితఫలదా! ఽ భజననివాసా! నందనిలయ! శ్రీ
రమణా! మృత్యుహరణ! మునిపోషా! ఽ యమలవైరాగ్యహృదయనిలయ! హరి!
నమో యనంతా! దివ్యసంస్తుత్యా! ఽ సమాహితా! యసమానశాశ్వతా!
క్రమానుషంగుఁడ వగుదువు జపమున ఽ భ్రమాపహరణుఁడవై ముద మిత్తువు
శమించు భవరోగము నీ స్మరణము ఽ క్షమాధరణ దివ్యౌషధసుధలవి
సమంజసముగా నా ధ్యానమందు ఽ నిమిత్తమంతయు నీవే శ్రీశా!
సముఁడ వార్యజనహితుఁడవు శరణము ఽ కమనీయమగును స్వామీ! నీపద
కమలార్చనంబు సర్వగరిష్ఠము ఽ విమలభావబద్ధుఁడవు నీ వనుచు
శ్రమలనిడవు నిను శరణన్న ననుచు ఽ సమమతిని దలఁచితిని విను వరదుఁడ!
వని వినుతించియు వారలను గాంచి ఽ మునితిలకులార! భాగవతరూప
మున విష్ణుఁడొప్పు విగతశోకంబు ఽ గన సంపూర్ణ ప్రమోదం బిదియగు
పురుషోత్తమునిఁ బుష్కరంబునను ఽ వరమగు ద్వారక యందున మధురన
సరసిజసఖు వాసరమున నెవ్వరు ఽ పరమభక్తి నీ భాగవతంబును
స్మరణమునందునో యట్టినరుఁడగును ఽ సురవరుల మించి పరమహంసులకు
స్థిరమందు నెలవు నజరామరంబు ఽ పరమమోదంబు వను నెలవబ్బును
తరించు సంసృతి వారిధి నతఁడే ఽ ధరింపుమనె వ్యాస పరమపు భజనము

చరించు మోక్షనివాస విహారణము § కరీంద్రవరదుని వినుతి ఫలమిదియు
వినుఁడు పురాణము లవి సంఖ్యసెప్పెదు § మనమున నిలుపఁగ నగును పరిమితిని
ఘనతపదివేలు బ్రహ్మపురాణము § మును లెన్నిరి పాద్మమును నట్టులే
వేలునగు యేబదియునైదు నటుల § వే లిరువది మూఁడగును వినుండిక
విలసిత విష్ణుపురాణసంఖ్యయును § వే లిరువదినాల్గగును శైవంబు
పదునెనిమిది భాగవత సంఖ్యయగు § పదులు రెండైదు వేలు నారదము
విదితముగ నవము మార్కండేయము § పదిహేనువేలు నన్నూరునగును
ననలుపురాణము భవిష్యోత్తరము § గనఁగ పదునాల్గు వేలయేనూరు
ఘనమైన బ్రహ్మకైవర్తమగును § వినుతి పదునెనిమిదియు వేలునగును
లింగపురాణము పదకొండువేలు § సంగతివరాహ మిరువదినాలుగు
రంగైనస్కాంద మెనుబది వేలును § నందు దోచు మది యొక్కనూరుగను
ఎనయు వామనము దశసహస్రంబు § వినగ కౌర్మంబు నంతియే యూను
కన నగును మాత్స్యపురాణమునకున్ § ననువునను చతుర్దశ సహస్రములు
పదియును తొమ్మిది వేలు గారుడము § పదియురెండు బ్రహ్మాండ పురాణము
మునులారా! యీ పురాణరాజము § లను మధ్యవెలయు నదులను గంగను
వినుఁడు దేవతల బ్రహ్మదేవువలె § గనఁగ నక్షత్రముల నిందుఁబోలు
గరిమ గను వార్ధులను క్షీరార్ణవ § మరయఁగ గిరులను మేరునగంబగు
తరణియగును గ్రహములను బోల్పంగ § సురవైరుల ప్రహ్లాదుం డన బడు
వరమణుల పద్మరాగంబనఁగా § తరుల హరిచందనము బోలు పెక్కు
పురుషులనారదు డన ధేనువులను § సురధేనువు సూక్ష్మముల జీవుడన
ఘనతను దుర్జయముల మానసంబు § వనలుఁడు వసువుల భానుల విష్ణువు
వినుఁ డటు రుద్రుల నీలలోహితుఁడు § ఘనుఁడు భృగువుగా బ్రహ్మలయందున
గపిలుఁడు సిద్ధుల తురఁగములయందు § విపులతేజతవు నుచ్చైశ్శ్రవంబు
అపురూపమ్ముగ వాసుకి తా నగు § నెపుడు శాంతిగను సర్పరాజముల
కరము హరి బోలు వనమృగంబులను § సరణి నాశ్రమములను గృహస్థమగు
సరసత వర్ణములందు ప్రణవంబు § నిరవున నాయుధముల కార్ముకంబు
పరమప్రతములను యహింసనాగను § వరుసయోగముల నాత్మయోగమగు
క్రమత ఔషధుల యవలు నా బోలు § విమలసత్యమగు పలికెడి వాక్కుల
రమనందు వసంతము నా ఋతువుల § యమలులార! నెలలందు మార్గశీ
ర్షము నావెలుగు యుగములను కృతయు § గము బోల్కినొప్పు శ్రీమద్భాగవత

తము సర్వవేదముల నిక్కనట్టి । దమరులు నిత్యము విమల మతి యనుచు
నమస్కారగ మొనరించి పఠింతురు । క్షమాభరణుఁడట దర్శనం బొసఁగు
దురితములు దొలఁగు శుభములును దరియు । పరమభక్తి నీ పురాణమును విన
పరమానందపదంబు తా జేర్చు । కరవందుఁడు శ్రీకమలాధీశుఁడు
నిరతవైభవము లందుదురు వినిన । నిరయముల తారె దప్పుదురు వారి
పరలోకసుఖములను గూర్చు నిదియె । కరము సూటార్లు పఠింపు డింపున
శుకయోగికి నే వందనమొనర్తు । సకలసంశయము లన్నిదొలఁగు నీ
ప్రకటితభాగవతము బల్కెగాన । యకలంకుఁ డతని వర్ణింతు మఱియు
నకుటిలధ్యానమున గూర్తు హరిని । సకలేశుఁడు నను సౌఖ్యముగూర్చును
యనుచు సూతుండు మునులకు వచించె । మునులును శౌనకు డాదిగ నుతించి
వనజాక్షుని బొగడుచును సందరచటు । ఘనముదమున వీడియు నెలవు గనిరి॥

శ్రీ కృష్ణార్పణమస్తు.

